క్తి మరియు ఐహికసువైరాగ్యభావముతో మనప్రాచీను శాశ్వతములగు కార్యము లొనరించుటయందు నిమగ్నులై యుండిరి. వారియభిప్రాయము లనుచితములని నే ననఁజాలను. ఆమహాత్ముల విపులజీవితము నాలకించుటకు మనకుఁ గోర్కెలు క్రేళ్లువాఱుచుండుననుటకు సందియము లేదు. వారిజీవిత చారిత్రము నాధారముగాఁగొని, మనము వారొనరించినఘన కార్యములను బాగుగా నర్థమొనరించుకొనవచ్చును. అప్పుడు వారివిలక్షణజీవితము వారిఘనకార్యములకంటె మిన్నయై వన్నె కెక్కఁగలదు. ఆమహాత్ము లీరీతి నభిలషించి యుండలేదు. మీఁదుమిక్కిలి వారిజీవితచారిత్రముల నాధారముగాఁగొని చూచినచో వారిఘనకార్యములయందలి యర్థగాంభీర్యమున కొక్కొక్కప్పుడు లోపముకలుగుచుండును. ఇందుచే మనప్రాచీనులకు స్వీయచరిత్రలు లేకపోయెఁగదా యని నే నంతగాఁ జింతింపను. కాని భారతీయులదౌర్భాగ్యమునఁ జేసియే, హైందవజాతీయనాయకుల జీవితచారిత్రములు లేవని నాయభిప్రాయము. లేకున్న, నిత్యులై నిలువఁదగిన యామహాపురుషులు విస్మృతిసాగరమునఁ బడి విలీనులై పోవుట కేమనుకొనవలయును?

ప్రాచీనహిందూదేశచరిత్రకు జీవకళలైయుండిన యీ జాతీయనాయకులను హైందవు లేల మఱచిపోయిరి? దీనికి నాలుగు కారణము లున్నవి. ముఖ్యముగా, మనపూర్వులు రాజకీయవిషయముల నంతగాఁ బరిశీలించి చూచెడివారు కారు. బుద్బుదప్రాయమగు నైహికజీవితమునకు సంబంధించియుండు యుద్ధములు, దండయాత్రలు, నిస్సారములనియు, తుచ్ఛములనియు వారు భావించుచుండిరి. ఐహికాముష్మికఫలదాయక

మును, పూర్వోత్తరజన్మకారణము నగుపరమార్థవిచార
ముంగల, యుద్ధయాత్రలు నివాళియెత్తుటకైనఁ బోలవస
రభిప్రాయపడియుండిరి. నూతనవిజయోత్సవమునకంటె,వినూ
మతసిద్ధాంతము ప్రాచీనుల కామోదము నిచ్చుచుండెను. అస
మానబలశాలి గ్రీకుచక్రవర్తి అలెగ్జాండరునకంటెఁ జాణక్యునిఁ
బోలిన సామాన్యతత్త్వజ్ఞానియే వారి కెన్నియోవిధముల
సంస్తూయమానుఁడై యుండియుండును. ఇట్లు దేశదేశము
లను దీవ్రముగా నూడ్చుకొనిపోవుటేల? ఈతఁడు జీవిత
ఫలమునుగాని ప్రకృతితత్త్వమునుగాని యించుకైన గ్రహిం
చెనా? ఇట్టిసంప్రశ్నముల వారడిగియుందురు. ఇట్లయ్యును
బ్రాచీనహిందూదేశచారిత్రమునందు యుద్ధములును దండ
యాత్రలును వెనుకఁబడి యుండుటలేదు. అవి లెక్కకు
మిక్కిలియైయున్నవి; వెగటునుగూడఁ బుట్టించుచున్నవి. జన
సామాన్యము విజ్ఞానమయమై యుండిన కారణమున, నీభౌతిక
విషయములను గమనించుచుండెడిది కాదు. విజయసంకీర్తన
ములు స్తుతిపాఠకులపనియని, యాకార్యమును వారికి
వదలుచుండిరి. ఇట్లు వందిజనము రచియించినవిజయకీర్తనలు
వారిస్వామి యనంతర మంతరించుచు, మఖలోఁ బుట్టి పుబ్బలో
నస్తమించుచుండెను. తత్త్వార్థవిహీనములును సామాన్యమానవ
స్తోత్రబంధురములునగు సమరచారిత్రరచనమునకు, మహా
కవీశ్వరులగు వాల్మీకి, వ్యాస, కాళిదాసాదులు పూనినవారు
కారు. రాజాస్థానవర్తులై యుండియుఁ గాళిదాసువంటికవీంద్రు
లిట్లు తలంచిరి. వారి నాదరించుచుండిన సార్వభౌములే, యా
కవిచంద్రులయభిప్రాయము సమంచితమని యంగీకరించిరి! కాళి
దాసమహాకవి 'చంద్రగుప్తవిజయమో' 'సముద్రగుప్తదిగ్వి

జయమో' రచియింపక కుమారసంభవమును వ్రాయుట వెనుక ముందు లాలోచింపక కాదు.

రెండవకారణము: ప్రాచీనరాజులు తమకు సమానులగు వీరులతోడనే పోరాడుచుండిరి. మతాచార్యులు, కవులు, తత్త్వజ్ఞానులు, నక్షత్రశాస్త్రజ్ఞులు, భిషగ్వరులు, వైయాకరణులు, రైతులు మున్నగుజనులు వారివలన నుపద్రవ మొందకుండిరి. కాన దండయాత్రలచే దేశప్రజల స్వాభావికజీవితము కలఁకబాఱకుండెడిది. రాజులు పోయి రాజులు వచ్చుచున్నను, స్వకార్యవ్యగ్రులై శాంతజీవన మొనరించు ప్రజలను వారు తట్టిలేపువఱకు, వారాతని గమనింపకుండిరి. నిరాటంకములగు నిట్టిజీవితములు, జాతీయనాయకులవిస్మృతికి ముఖ్యకారణములై యున్నవి. అనంతరము మహమ్మదుఘోరీ మున్నగు మహమ్మదీయరాజుల దండయాత్రలవలనఁ బ్రజల సౌఖ్యజీవితము చెదరెను. కాన వారి కప్పుడాత్మసంరక్షణార్థము జాతీయనాయకులఁ దలఁచుకొనక విధిలేకపోయెను. వారప్పుడు కన్నులఁ దెఱచుకొనిరి. అప్పుడు 'చందవరదాయ్' అనుకవీశ్వరుఁడు 'పృథ్వీరాజ్ రాసో' అనుగ్రంథమును రచించెను. ఆగ్రంథము జనరంజకమయ్యెను. హైందవులు నాఁటి నుండి పృథ్వీరాజును బూజింపసాగిరి. అలెగ్జాండరు హిందూ దేశదండయాత్రను సాగించి, హైందవులజీవితక్రమమును మార్పుచేయుండిన మౌర్యచంద్రగుప్తుఁడుకూడ భారతీయుల యనురాగము నింకను జూఱఁగొనియుండెడివాఁడు.

మూఁడవకారణము: తత్త్వజ్ఞానులు, వైయాకరణులు, వైద్యులు, నక్షత్రశాస్త్రజ్ఞులు మొదలగువారివలె, జాతీయ నాయకులు చిరస్మరణీయములగు ఘనకార్యము లాచరించి

యుండ లేదు. వైయాకరణాదులకృత్యము లాచంద్రార్కముగ నిలిచియుండును. కాని రాజకీయకృత్యములన్నియు నట్టివి కావు. అవి నిత్యములై యుండ నేరవు. మౌర్యచంద్రగుప్తుఁడును, సముద్రగుప్తుఁడును కని, పెంచి, పెద్ద చేసిన సామ్రాజ్యము లేయిరువది ముప్పదివత్సరములో మాత్రము మనియుండఁగలిగెను. ఇఁక హైందవకాలమానములగు కల్పములు, యుగము లెక్కడ? ఆయిరువది ముప్పదివత్సరము లెక్కడ?

నాలుగవకారణము: హిందూదేశమునకుఁ జారిత్రమారంభమైననాఁటినుండి, అయ్యది యున్నతాదర్శముల ననుసరించుచుండెను. హైందవజాతీయనాయకులయందాయున్నతాశయములు చాలవఱకు లోపించియుండెను. కాని ప్రాచీనభారతమనీషు లాయాదర్శముల నేమాత్రము జాఱవిడువక, సామాన్యవీరులగు తమసంతతివారొనరించిన కార్యములను నిరసనభావమునఁ జూడసాగిరి. వారు తలఁచుటకైనఁ దగరని ప్రాచీనులు భావించుచుండిరి. త్రిలోకవిజయము, ఒక్కొక్కప్పుడు చతుర్దశభువనాక్రమణముకూడ సనాతనులదివ్యాదర్శమైయుండినది. అతిమానుషములగు నీవిజయములతో సరిపోల్చి చూచిన, మౌర్యచంద్రగుప్తుని విజయములుగాని, సముద్రగుప్తుని విజయములుగాని యేపాటివి? చతుర్లోకములలోని యొకానొకప్రపంచమునందలి 'మట్టిపెళ్లను' మాత్రము వీరు స్వాధీనమొనరించుకొనిరి చతుర్దశభువనాధ్యక్షులతోఁ గూడఁ గూర్చుండుటకేని వీరు తగుదురా? ఎన్నటికిఁ దగరు. అదియుఁగాక, దుష్యంతకుమారుఁడు భరతుఁడాసేతుహిమాచలము పరిపాలించియున్నాఁడు. అతనివలన నీదేశమునకు భరతవర మని పేరు

వచ్చినది. ఆసేతుహిమనగమును బాలించుటకు సమర్థులై యుండిన చంద్రగుప్త, సముద్రగుప్తు లెంతటివారు? భరతవర్ష మిట్లు ఛిన్నాభిన్నములై పోవుటఁ గాంచి, జాతీయాశయము లు సన్నగిలిపోవుచున్నవని ప్రాచీనులు తలంచుచుండిరి. చంద్రగుప్త సముద్రగుప్తులు జైత్రయాత్ర లొనరించుచుఁ గీర్తికై ప్రాఁకులాడుచున్నారలేకాని, మరల నీభరతవర్షమునకు సనాతనకీర్తి ప్రతిష్ఠలఁ గలిగించుట కించుకయైనఁ బ్రయత్నించుటలేదని భావించుచుండిరి.

ఇటీవలి పాశ్చాత్యపండితులు కొందఱు మిగులనోర్పుతోఁ బరిశోధనలు సల్పి, విస్మృతిసాగరమునం దడుగంటియుండిన హైందవజాతీయనాయకమణులను బయటికిఁదీసి, నేఁటి హైందవులకుఁ బ్రసాదించిరి. అనర్ఘములగు నిట్టి కాన్కల బహూకరించినవారికి మనమెంతయుఁ గృతజ్ఞులమై యుండఁజనును. ప్రాచీనహైందవజాతీయనాయకులు ప్రతిహైందవునకుఁ బూజనీయులై యున్నారు. ఏలయనఁ, బ్రాచీను లాత్మదేశోద్ధరణార్థమెట్టిత్యాగమునకుఁగాని వెనుఁదీసినవారు కారు. దేశమాతకుఁ గాలు నొచ్చిన, వారు తమకుఁ గన్ను నొచ్చినట్లు భావించుచుండిరి. కానఁ బ్రాచీనుల యున్నతాశయములు భవిష్యత్సంతతికవశ్యాచరణీయములై యున్నవి. హైందవజాతీయనాయకులగు బాలాదిత్యయశోధర్మలపరిచయమును బ్రతిహైందవునకుఁ గలిగించుముఖ్యోద్దేశముతో నీగ్రంథము వ్రాయఁబడినది.

ఈనవలను వ్రాయుటలోఁ జరిత్రాంశములను 'తూచా' తప్పక వ్రాయుటకంటె, నాయుగధర్మములని నేను నమ్మినవానిఁ జిత్రించితిని. స్వల్పములగు చరిత్రాంశములనుగూడ ననుసరిం

చుట నవలాకారునకు విధికాదు. కాన నీనవలయందలి డెబ్బది పాత్రలలో, నాలుగైదు మాత్రము చారిత్రాత్మకములై యున్నవి. మిగిలినవన్నియు నేను గల్పించినవి.

హిందూదేశమునం దొకానొకసందిగ్ధసమయము నీనవల వర్ణించుచున్నది. అప్పుడు హిందూదేశమున కగ్నిపరీక్ష జరుగుచుండెను. శ్రేయస్సమృద్ధమును, విశ్వవిఖ్యాతమును నగుగుప్త సామ్రాజ్యము, నీతిమతనాగరకతావిహీనులగు క్రూరకిరాత బలములచే విధ్వంసమైపోయెను. హిందూదేశము నాక్రమించినజాతులలో, నద్దాని పరిజ్ఞానము నించుకేని వృద్ధిచేయని వారు, హూణులుమాత్రమని నాయభిప్రాయము. గుప్తరాజ స్థాపితములై, గుప్తసామ్రాజ్యమునకుఁ బెట్టనిభూషణములై యుండిన శిల్పచాతురీవిలసితములగు ప్రతిష్ఠాపనలను వెనుక ముందుఁ జూడక నేలమట్టముగావించుటకై హూణులు చాల పాటుపడిరి. కాని యానిషాదులంతలో హిందూమతాంతర్గతులైరి. తోరమానుఁడు హైందవసాంప్రదాయముల ననుసరించి 'మహారాజ' బిరుదము దాల్చి, యాపద్ధతికి దారిఁజూపెను. ఆతనికుమారుఁడు మిహిరగులుఁడు శివారాధకుఁడయ్యెను. హూణు లిట్లు రెండుపురుషాంతరములలోఁ, దమకు ముందు వచ్చినశాక్యులు, కుశానులు, యూచులవలె, హైందవజాతి యందు విలీనమైపోయిరి. హూణులపరాక్రమము, హైందవుల సాహసౌదార్యాదివీరోచితగుణములతో సమ్మేళనమొంది రాజపుత్రవీరప్రభవమునకుఁ గారణమయ్యెను. రాజపుత్రులు మానరక్షణార్థము ప్రాణములనైన సరకుచేయని శూరశిఖామణులని ప్రసిద్ధికెక్కిరి. ఇట్లు కీడులో మేలొనఁగూడెను. రుధిర

పిపాసువులగు హూణులవలన రాజపుత్రవీరు లుదయించిరి. గుప్తరాజులు నూటయేబదేండ్లపాటు ధర్మపరిపాలన మొనరిం చుటఁజేసి, యెల్లకడల శాంతి ప్రబలియుండెను. జనులు కడుపు లోనిచల్ల కదలకుండ జీవించుచుండిరి. దానంజేసి వారాత్మ రక్షణోపాయముల మఱచిపోయిరి. ఆమహాసామ్రాజ్యసూర్యుఁ డస్తమించి, గుప్తసైనికకిరణములు దోషాకరులగు నిషాదబల ములచేఁ దరుమఁగొట్టఁబడఁగా, జనసామాన్యము కింకర్తవ్యతా విమూఢత్వాంధకారమునఁ జిక్కుకొని పరితపింపసాగెను. వారి కెటుపోవుటకుఁ దోఁచినది కాదు. పశ్చిమప్రాంతములన్నియు నా కిరాతులకు లోఁబడిపోయెను. మిహిరగులుఁడు నిరంకుశుఁడై ప్రజలను జిత్రవధలఁ బెట్టుచుఁ గటికరక్కసుఁడే మేలనిపించు చుండెను. వీనిదారుణకృత్యములను కల్హణుఁడను కవిచంద్రుఁడు కన్నులకుఁ గట్టినట్లు వర్ణించియున్నాఁడు. మిహిరగులునివలని హింసలు దుర్భరములై పోయెను. కడకు హైందవోర్వీశులు యశోధర్మనాయకత్వమున నొకటిరై, కారూరుయుద్ధమున మిహిరగులు నోడించి, కాశ్మీరమునకుఁ దఱిమివైచిరి. గుప్త కాలమునాఁటిహైందవులువోలె, ఆధునికహైందవులుసైతము నిరాటంకశాంతజీవితమును జాలకాలముగా ననుభవించు చున్నారు.. దానంజేసి వారాత్మరక్షణోపాయముల మఱచి పోవుదురేమో యని భయమగుచున్నది. కాని మన కదృష్ట భానూదయ మగుచున్నది. విపన్మేఘములు విఱియఁబాఱుసూచ నలు పొడకట్టుచున్నవి. జిజ్ఞాసువులకు సైనికశిక్షణ మొసంగుట కవసరములగు ప్రయత్నములు జరుగుచున్నవి. దూరదృష్టివలన నాఘోరవిపత్తును మనము క్రమక్రమముగఁ దప్పించుకోఁ

గలుగుచున్నారము. హిందూదేశమునకుఁ బశ్చిమోత్తరసరిహద్దులుగాఁ బర్వతశ్రేణులున్నవి. కాని వానియందుఁ బ్రకృతిసిద్ధములగులోయలు పెక్కులు గలవు. మరల హిందూదేశముపై నేకిరాతబలములైన నాలోయలఁ బడి దండెత్తివచ్చులోపల, గుప్తరాజులనాఁటిప్రజలవలె యనదలై యుండక, ఆధునికహైందవులు స్వరక్షణోపాయములకు సంసిద్ధులై యుందురుగాక!

మూలగ్రంథకర్త.

నెల్లూరుజిల్లా, గూడూరువాస్తవ్యులు మ-రా-రా-శ్రీ, అబ్బిరాజు రామచంద్రయ్యగారు కథాసందర్భానుసరణిని రమణీయములగు చిత్రపటములను నిర్మించి మాకొసంగి యీగ్రంథమునకు మఱింత వన్నెగూర్చినందులకై వారియెడ మే మెంతయుఁ గృతజ్ఞులము.

ఇట్లు,
ప్రకాశకులు.

# విషయసూచిక

# నవలయందలి పాత్రములు

## పురుషులు.

1. బాలాదిత్యుఁడు — గుప్తవంశీయుఁడు; మగధరాజు
2. యశోధర్మ — మాళవమహాకోశలాధిపతి
3. తోరమానుఁడు — హూణరాజు; గుప్తులనోడించినవాఁడు
4. మిహిరగులుఁడు — తోరమానునికుమారుఁడు; యువరాజు
5. భూమకుఁడు — తోరమానునితమ్ముఁడు
6. భానుగుప్తుఁడు — పశ్చిమమాళవాధిపుఁడు; హూణసామంతుఁడు
7. నారాయణశర్మ — ఉజ్జయినీపురమందలి రాజోద్యోగి
8. గోవిందాచారి — నారాయణశర్మ స్నేహితుఁడు
9. భద్రబాహువు — ఉజ్జయినీపౌరుఁడు; జైనుఁడు
10. రఘుపతి — ఉజ్జయినీపౌరుఁడు
11. హరిరాముఁడు — దొంగలరాయుఁడు
12. అజ్ఞానాంధకారుఁడు — ఒకసన్న్యాసి
13. సుబంధువు — ఇంకొకసన్న్యాసి [ణుఁడు
14. వాతవ్యాధి — ఒకపండితుఁడు; తత్త్వవేత్త; వైయాకర
15. కుణపదంతుఁడు — మాయావి; మంత్రవేత్త
16. శుక్రాచార్యులు — వైదికుఁడు; జోస్యుఁడు
17. ఉదరానందుఁడు — చార్వాకమతస్థుఁడు
18. కమలాక్షుఁడు — ఒకధర్మశాలాధికారి
19. వాసుదేవుఁడు — యౌధేయవీరుఁడు

20. సాహసాంకుడు(పెద్దవాడు)హమాణగృహదుర్గాధికారి
21. కాళిదాసు హమాణగృహదుర్గమునందలి కారాగృహ రక్షకుడు
22. చేష్టనుడు లేక రణవీరసింహుడు సాహసాంకునికుమారుడు; హమాణుని దళవాయి
23. సాహసాంకుడు (చిన్నవాడు) లేక ధర్మసింహుడు } చేష్టనునికుమారుడు; ఇంకొక దళవాయి
24. మహాసేనుడు కేరళస్వామి
25. మహేంద్రవర్మ వేగిదేశాధిపతి
26. అవంతివర్మ కాంచీపురీశుడు
27. కాకవర్ణుడు సింహళరాజు
28. గుణసాగరుడు కళింగాధీశుడు
29. వ్యాఘ్రరాజు గంధ్యాన, మహాకాంతారస్వామి
30. వజ్రాయుధుడు కాశ్మీరవల్లభుడు
31. కుమారపాలుడు కామరూపనాయకుడు
32. సింహభూపతి నేపాళరాజు
33. అపరాజితుడు దేవరాష్ట్ర, మహారాష్ట్రస్వామి
34. ఇంద్రద్యుమ్నుడు కాశీరాజు
35. పులకేశి చాళుక్యరాజు
36. రుద్రసింహుడు సౌరాష్ట్రాధిపుడు
37. మురారి బాలాదిత్యునికుమారుడు
38. ధర్మగుప్తుడు బాలాదిత్యుని రెండవకుమారుడు
39. నరసింహుడు యశోధర్మ కుమారుడు
40. చంద్రభానుడు యశోధర్మ రెండవకుమారుడు
41. రామచంద్రుడు నాయకుడు

| | |
|---|---|
| 42. కాలాగ్ని | గూఢచారి |
| 43. సర్వసమ్మతుఁడు | గూఢచారి |
| 44. విద్యాసముద్రుఁడు | గుణసాగరుని రాజపురోహితుఁడు |
| 45. జ్ఞానప్రియుఁడు | అమలాపురియందలి యొకవిప్రుఁడు |
| 46. యుద్ధకేసరి | మహాకోసలమునందలి యొకవీరుఁడు |
| 47. విశ్వనాథుఁడు | భానుగుప్తునిభటుఁడు |
| 48. మేఘవర్ణుఁడు | కాకవర్ణునితమ్ముఁడు |
| 49. ధర్మదత్తుఁడు | పాటలీపుత్రమునందలి యొకవర్తకుఁడు |
| 50. పరమార్థి | పాటలీపుత్రమునందలి వేఱొకవర్తకుఁడు |
| 51. ధనభూషణుఁడు | బారుకచ్ఛమునందలి యొకవర్తకుఁడు |
| 52. ఆనందుఁడు | పాటలీపుత్రపౌరుఁడు |
| 53. వరాహమిహిరుఁడు | నక్షత్రశాస్త్రజ్ఞుఁడు |
| 54. దండి | కవీశ్వరుఁడు |

## స్త్రీలు.

| | |
|---|---|
| 1. సరస్వతి | రఘుపతికుమారి; బాలాదిత్యునిరాణి |
| 2. చారుమతి | గుణసాగరునితనయ; యశోధర్మరాణి |
| 3. దాక్షాయణి | కళింగరాణి |
| 4. మహామాయ | యశోధర్మతల్లి |
| 5. తుషష్ప | తోరమానునిరాణి; మిహిరగులునితల్లి |
| 6. హుజేష్ప<br>7. వజేష్ప | తోరమానునిరాణులు |
| 8. మాధవి | ఉజ్జయినియందలి చండాలాంగన; ఊద్ధ్వకర్త్రి |
| 9. లక్ష్మి | పరమార్థిభార్య |

| | |
|---|---|
| 10. పార్వతి | పరమార్థితనయ |
| 11. అరుంధతి | అమలాపురియందలి యొకబ్రాహ్మణవితంతువు |
| 12. వసంత లేక సుభాషిణి | ఒకగొల్లభామ; మహామాయ చెచ్చెలి |
| 13. లలిత | యశోధర్మకూఁతురు |
| 14. నారాయణి | బాలాదిత్యునికూఁతురు |
| 15. సుమతి లేక కరుణ | గూఢచారిణి |
| 16. చంద్రమతి | వరాహమిహిరునిభార్య |

---

శ్రీరామ

# బాలాదిత్య

## మొదటితరంగము

### నడురేయిపోరు.

ఆరాత్రి నక్షత్రకాంతి శోభితమై యుండెను. ఎల్లకడల మాటు మణఁగియుండెను. వీథియరుఁగులపై నిద్రించువారలగు ఱకలుతప్ప, ఆసమయమున నుజ్జయినీనగరమునం దెట్టియలుకుడుగాని వినఁబడుటలేదు. ఆనిశ్శబ్దతను మెండుకొలుప వారిగుఱకలు తోడ్పడుచుండెను. రెండురేఖలుగఁదీరి, నాలుగు వీథులుగఁజీలి, చదుకమునందలి విష్ణుదేవాలయముకడ నొండొంటిఁ గలియు రాజమార్గములయందు నిశ్శబ్దభావము ఘనీభవించి యుండెను. ఆయస్పష్టకాంతులయందు గంభీరాకారముతో నిలిచియుండు నున్నతప్రాసాదములు, అంబరచుంబితమగు నాలయగోపురములు గాపాడుచుండు మహాకాయులగు రక్షకవర్గమునా నొప్పారుచుండెను.

అట్టిప్రశాంతరంగమున నగరాభిముఖుఁడై యరుదెంచు పథికుఁ డొకఁడు కాననగుచుండెను. సంశయముగొలుపున ట్లాతఁ డేలొకో, రాజమార్గములవీడి మరుగుదారులఁబడి వచ్చుచుండెను. ఆతనియుడుపు లాతని కులీనతను, రాజఠీవినిఁ జాటుచుండెను. ఆకాలమున నున్నతవంశీయులును, రాజపుంగవులును, వైభవోపేతులును సామాన్యముగ నట్టియుడుపులను ధరించుచుండెడివారు. మేలిలాగులును, ప్రశస్తకంచుకమును, కనిష్కునికాలమునుండి వాడుకలోనికివచ్చినపాదరక్షలను నాతఁడు తొడిగియుండెను. కంచుకిరీట మాతనియుత్తమాంగమున నలరారుచుండెను. ఆతని నడుమునుండి

వ్రేలాడుక త్తిపిడిపైఁ జెక్కఁబడియుండు "తక్షశిల" యనునక్షరచతుష్టయ మాకరవాలము మేలిమియుక్కుతోఁ జేయఁబడినదనియు, నందుచే నయ్యది ప్రశస్తతమమగు నాయుధరాజమనియుఁ బ్రకటించుచుండెను. ఎగుభుజముల నుండి చీలమండలవఱకు జీరాడు నమూల్యమగు ముకమాలు, అతని యున్నతవంశాభిజాత్యమును జెప్పకయే చెప్పుచుండెను.

అతనికి రమారమి యిరువదియైదేడుల యీడుండును. కాని యాతని మోముఁదమ్మి కాంతిఁబాసి, యాతనిహృదయమునందలి చింతావైకల్యమును దెలియఁజేయుచుండెను. అతని నడవడి యాతనిచిత్తసంక్షోభమును వెల్లడించుచుండెను. కొంతసే పాతఁడు తడఁబడును; ఒక్కింతతడవు నివ్వెఱఁజెంది నిశ్చలుఁడగును; ఒక్కతేప కన్నార్పక మింటఁజూచును; ఒక్కసారి పరధ్యానమున మునుఁగును; అంతట నాయాసమున 'నుస్సు'రనును; ఉన్నట్టుండి గబగబ నడచి, నలువంకల వెఱ్ఱిచూపులఁ జూచుచు, తనదారిఁ బోవుచుండును. ఒకమా రాతఁడు శోకవ్యాకులమునఁ బరవశుఁడై, పైనుండుతారలవంక నిశితవీక్షణములఁ బఱపుచు, వాని జీవితరహస్యము నెఱుంగురీతిఁ గన్నార్పక చూచుచు మందస్వరమున "అకటా! ఈపాపిష్ఠుని జీవితాంధకారమున నక్షత్రభాగ్యోదయ మగుటెన్నఁడు?" అని ముందుకు సాగిపోవుచుండెను.

క్రమముగా నాతఁ డారాజమార్గమును గడచి, రాజవీథికిఁ దిరిగెను. ఆవీథియం దాతనినడక యతిశయిల్లెను. వర్ణనాతీతభావ మెయ్యదియో, యాతనిమానసమునఁ దోఁచి యాతని కించుక కళవళపాటుఁ గొల్పెను. వీథి కిరువైపుల బారులుతీరియుండు భవనములపై నాతనివిలోకనములు వ్రాలెను. చిరపరిచితములగునవి యింతలోఁ బొందినమార్పుల గమనింప నిచ్ఛగించు వానిపగిది, సంభ్రమనయనములతో నాతఁడు వానిఁ జూచుచుఁ బోవుచుండెను. అంతలో రాజగృహము సమీపించెను. ఆకొన్ననేత్రముల నాపాంథుఁ డా రాజప్రాసాదముఁ జూడసాగెను. విస్మృతభావ మెద్దియో యాతనిమానస వీథిని దళుక్కుని మెఱసెను. ఏలొకో, యాతనినయనవారిదము లశ్రుకణ

ములవర్షింపసాగెను. కాని యాతం డంతలోఁ బ్రజ్ఞ వడసి, యచట నిలుచుట తగదనుకొని, సందుగొందులఁబడి పట్టణబాహ్యప్రదేశముఁ జేరి యెంతయో దూరము చనెను. అచట వసారాతోనున్న నిల్లొకటి యుండెను. ఆ యింటిముంగల్ల బాటకడ్డముగా నొకచిన్నగోడ యుండెను. మన తెరువరి యాగృహముకడ కేగి, బడలికచే నుస్సురనుచుఁ జదికిలఁబడెను.

కాని పరిశ్రాంతుఁడగు నాతఁడు కన్నుమూయునంతలోఁ బరుషవచనములును, ఖడ్గసంఘట్టనధ్వానములును నాతనిచెవులఁబడెను. తోడనే యాతఁ డులికిపడి, లేచి, శబ్దము వినవచ్చినవైపుఁ బోయెను. మరల నాసడి వినరానందున, నాతఁడు తిరిగి రానెంచునంతలో నించుమించుగ ముప్పదిగజముల దూరమునుండి 'నారాయణ, నారాయణ' అనుదీనాలాప మాతనిమానసము నాకర్షించెను. వెంటనే యాతం డొఱనుండి యడిదము నూడఁబెఱికి, మనోవేగమున నాదిక్కునకొక్క గంతువైచెను. కాని యాతం డచ్చోటికిఁ జేరునంతలో స్థూలకాయుఁడగు వీరుఁ డొకఁడు కృపాణపాణియై యాతని నడ్డగించి నిల్చెను. ఆవీరునకు నలువదివత్సరము లుండును. మనపథికుఁ డాతని చెయిదమును సహింపక "అచటికిఁ బోనిమ్ము. పోనియ్యవా?" అని భీకరాట్టహాస మొనరించెను. దాని కావీరుఁడు నిర్లక్ష్యముగా "ఎవఁడవోయి నీవు? నాపై నిక్కుచున్నావు; ఎద్దుకాలిలో ముల్లంత లేవు. సత్వరము తొలఁగుము. లేకున్న నాతరవారి 'మోహిని' నిన్ను ముద్దాడఁగలదు" అని గద్దించెను.

స్థలమా? నిర్జనము; శత్రునగరమా? చెంతఁగలదు; కాలమా? నడురేయి; సహాయులా? లేరు; ప్రత్యర్థియా? బాహుబలసంపన్నుఁడుగను, యుద్ధముల నారితేరినవాఁడుగఁ గన్పట్టుచున్నాఁడు. ఇట్టితలంపు లాతెరువరి చిత్తము నించెను. అతనిమానసము వెనుకముందున కుఱ్ఱూఁత లూఁగసాగెను. ఇంతలో నాతనికి వెనుకటిమూలుఁగు విననయ్యెను. తోడనే యాతఁడు మనసును దిటవు చేసికొని భీకరముగా "ఎవరైన నీకెందులకు? నీచేఁ జిక్కుచావనుండు నిరాధగ్యు నెఱింగి, నాచే నైనంతసాయ మొనరింపవలయును. తొలఁగుము. లేకున్న

దగినశాస్తి యగును" అని ధట్టించి పలికెను. పథికుని ధీరవచనముల కాతఁడు వెఱఁగందెను. ఇంచుక చకితుఁడుకూడ నయ్యెను. అంతలో నాతఁడు తెప్పిరిల్లి, కాలాంతకుఁడై "నాయత్నముల కడ్డుతగుల నీవెవఁడవు? ఎవరు నీ కీ యధికారమిచ్చిరి?" అని తిరస్కారముగాఁ బ్రశ్నించెను.

"ఇది రాజశాసనము. తొలఁగుము" అని పథికుఁ డుత్తరమొసంగెను.

అందుల కావీరుఁడు వికటాట్టహాస మొనరించుచు "ఓహో! ఇది రాజశాసనమా? ఇది తోరమానునిశాసనమా? ఎవరియానతిమెయి నే నీహత్యాప్రయత్నమునకుఁ గడంగితినో, ఆతనియాజ్ఞయా యిది? ఓరీ బుద్ధిహీనుఁడా! తెలిసికొంటివికదా? ఇఁకఁబోయి, కడుపార గంజిఁ ద్రాగి పడియుండుము. నీచేతనుండుకత్తితో నాయట్టిపోటరులతోఁ బోరుటకంటె, లేతసొరకాయలఁ గోసికొనుట మంచిది. తెలివితక్కువపెద్దమ్మా! నన్నెవనిగా భావించితివి! వీరకేసరియు, మహారాజతోరమానునిసోదరుఁడు నగుభూమకుఁడని తెలిసికొనుము. వెఱ్ఱిమొగమా! నాకోఱలసందులఁబడియుఁ దప్పించుకొంటివి.పొమ్ము. నీభాగధేయమును బొగడుకొనుచుఁ బొమ్ము." అని గద్దించెను.

విభ్రమాశ్చర్యములు పెనఁగొన నిర్విణ్ణుఁడై పథికుఁ డాతనిఁ గాంచుచుండెను. వీరసింహుఁడు, తోరమానుని యనుంగుఁదమ్ముఁడు భూమకుఁ డితఁడేనా? అనుజు నానతిచే, హంతకుఁడైనభూమకుఁ డితఁడేనా? తోరమానుని దుండగములు మన తెరువరి కిదివఱకే విదితములు; కాని యాదురాగతములు కొనకెక్కినవని యాతఁడు కలనైన నెంచియుండలేదు. ఆతని నావరించియుండిన విభ్రమాశ్చర్యములు సడలిపోవ, నాస్థలమున నపారమగు నాగ్రహమావరించెను. కోపాతిరేకమున నాతనియొడ లుడుకుచుండెను. "ఆహా! మాతృభూమి కెంత గతిపట్టినది" అని యాతం డనుకొనుచుండ "ఓరీ! అంగుష్ఠుఁడా! ఏమి గొణఁగుచున్నావు? గంజిసీళ్లకుఁగూడఁ గఱవగునేమో యని తల్లడిల్లుచున్నావా? పాపము. నిన్నుఁజూడఁ జాలికలిగెడు." అని భూమకుఁ డాతని యెత్తిపొడుపుమాట లనెను.

భూమకుని యసంగతప్రసంగముల కాతఁ డోర్వలేకపోయెను. ఆతఁడు కోపసంరక్తలోచనుండయ్యెను. "అన్నదమ్ములు మీరిద్దఱు లోకకంటకులు. మీమానసములు శిలాకఠినములు. మీరు కటికరక్కసులు. దేశీయుల ప్రాణానిలములఁ గ్రోలుచు, దేశపాలన మొనరించుట మీపనిగా నున్నది. పాలు ద్రావి బొమ్మగుద్దుట మీయాచారమైనది. మీపాడురాజ్యమున హత్యలు పరిపాటియైనవి. స్త్రీలఁ జెఱచుట సామాన్యమైనది. దోఁపుడులు మితిమీఱిపోయినవి. ఇట్టిరాక్షసరాజ్య మనతికాలముననే నశింపనున్నది. నశించును. ఓరీ! భూమకా! హంతకాధమా! పౌరుషవంతుఁడవేని, యెదుటనిలిచి పోరునకుఁ గడంగుము. శూరసింహము శుష్కమేషము కానేఁడుఁగాక" అని పథికుఁ డాతనిఁ దనఖడ్గముతోఁ బ్రక్కవాటుగాఁ గొట్టెను.

ఖడ్గాఖడ్గిఁ బోరు ప్రారంభమయ్యెను. మున్ముం దది చెలగాటమని భూమకుఁ డశ్రద్ధఁ జేసెను; కాని ప్రత్యర్థివీరుని ప్రచండాఘాతపరంపరలఁ జూచి, నిర్లక్ష్యభావము వీడి, పట్టుదలఁ బూని, విజిగీషతోఁ బోర మొదలిడెను. సహజశూరుఁడగు నాపాంథునిఖడ్గప్రహారణములనుండి యాతఁడు తప్పించుకొనఁజాలకుండెను. ఆపోరాటమునందు భూమకుం డలసిపోయెను. బలహీనతచే నాతఁడు సొమ్మసిల్లెను. అదేతడవుగాఁ బాంథుని ప్రచండాయుధ మాతని మేనఁ జొరఁబడి క్రిందఁబడవైచెను. పథికుఁ డాతని డాసి "తులువా! ఇంకను నీకు జీవితాశయున్నదా?" అని ప్రశ్నించెను.

"లేదులేదు. అంతయు ముగిసినది. కాని, ఊరును బేరునులేని యొకానొకవీరమ్మన్యునిచే నిహతుఁడనైతి ననిమాత్రము, నాహృదయము గలంచెను. నిజమాడుము. కులీనుఁడవా? కులహీనుఁడవా? ఇంతమాత్రము కరుణింపుము."

ఆమాటలకుఁ దెరువరి యిచ్చువడి "ఓయీ! నాపేరు నెఱింగింపఁ జాలకుండుట కెంతయుఁ జింతిల్లుచున్నాను. కాని నేను మహాకులుండ నని మాత్రము నుడువఁగలను. ఇఁకఁ జింతఁబాయుము" అనెను. భూమకుని

మోమున సంతుష్టభావము పొడచూపెను. ఆతనిప్రాణవాయువు లంతలో నెగిరిపోయెను.

"ఆహా! నామాతృభూమిఁ గడకండ్లపాల్సేయుఁ, దుష్టదానవులు ముగ్వురియం దొకఁ డముగంటినాఁడు. ఇఁక నిరువురున్నారు. ఆనీచుని కంటె వారు నీచతములు. త్వరలో వారికిఁగూడఁ దగురీతి బుద్ధిసెప్పవలయును. స్వదేశమును వారిబాఱినుండి తప్పించి, రక్షించుటకు భగవానుఁ డనుగ్రహించుఁగాక" అని యాబాటసారి యనుకొనుచు, నెయ్యదియో దీర్ఘాలోచనాతత్పరుఁడై యుండెను. ఇంతలో నాతనికి ముందటివలె నాసంతాపనిస్వన మతిమందముగ వినవచ్చెను. తోడనే యాతనికిఁ గర్తవ్యాంశము బోధపడెను. "ఆహా! ఎంతమందమతిని! మఱచితిని." అని యాతఁ డాయెలుఁగువిననైన దిక్కునుగూర్చి పరుగిడెను.

ఆప్రదేశము నిర్మలమైయుండెను. అచట నొకయువకుఁడు వివశుఁడై పడియుండెను. రమారమి యాతని కిరువదినాలుగేడు లుండును. ఆతనికను దమ్ములు మూఁతలుపడియుండెను. వదనము భావశూన్యమై వన్నెవాసియుండెను. కాలుసేతులు త్రాళ్లఁగట్టఁబడియుండెను. కరవాలము రెండై యాతని ప్రక్కఁ బడియుండెను. సొమ్మసిల్లియుండు నాయువకుఁడు కన్నులు దెఱువక యాఱెలుఁగున "దైవమా—అయ్యో—దైవమా—దాహము—నీరు—అయ్యో—నీరు—దాహము"—అని వాపోవుచుండెను. పథికుఁ డచటికి దాపుననుండు మడువుకేగి, తనదుకూలమునందుఁ దడిపి, మెఱపుమెఱయు నంతలో నాతనికడకుఁ బరుఁగిడి, యాతనినోట నావస్త్రమును బిండెను. పాపము; పిపాసు వాయువకుఁడు నీరముఁ గ్రోలెను. ఆతనికన్నులను, ముఖమును బథికుఁడు తడిగుడ్డతో నద్దుచుండెను. యువకునివదనము నాతం డన్యమానసముగఁ జూచుచుండెను. అస్పష్టనక్షత్రకాంతులయం దాతనిముఖలక్షణములను గమనించుటకు వీలుగాకుండెను. కాని యాయువకుఁడు చిరపరిచితవ్యక్తియని యెయ్యదియో పథికునిహృదయఫలకమున మునివ్రేళ్లతోఁగొట్టి చెప్పు

చుండెను. మానసాబ్ధి కొంతతఱచినను, విస్మృతవిషయ మాతని కలవడదయ్యెను. ఱెప్పలార్పక, పాంథుఁ డాయువకునిఁ జూడసాగెను. ఇప్పటికిఁ జంద్రోదయ మగుటం జేసి యాస్థలము కౌముదీవిలసితమై యుండెను. ఉన్నట్లుండి పథికుఁ డాశ్చర్యోద్రేకితుఁడై వెనుకకు గంతువైచెను. అతనిముంగలఁ బడియుండువ డెవరు? యశోధర్మ; నెచ్చెలి యశోధర్మ. ఏమీ! యశోధర్మ యిచటి కెట్లు రాఁగలిగెను? ఇట్టి భయంకరప్రదేశమున—ఇట్టి యర్ధరాత్రమున—భూమ కుఁడు యశోధర్మ యెట్లు పసిపట్టెను? పథికుఁ డీప్రశ్నావళికి సదుత్తరములియ్య నశక్తుఁడై యుండెను. అట్లని యీవిషయములు సత్యదూరములని చెప్ప వీలున్నదా? యువకుఁడు యశోధర్మయే కాని; మఱొకఁడు కాదు. మృత్యుగుహాంతరాళమునుండి తనమిత్రుని బయటవేయఁగలిగినందుల కాపథికుఁడు ప్రముదితాంతరంగుఁడయ్యెను. అతఁడు దైవమున కనేకధన్యవాదము లర్పించి "సర్వేశ్వరా! దీనచింతామణీ! నిన్నుఁ బొగడ నేరికరము?" అని పలికెను.

పథికుని యుపచారములచే యశోధర్మ కన్నులు విడివడెను. అతని కిసుమంత తెలివివచ్చెను. యశోధర్మ కన్నార్పక తనప్రాణదాతను జూచుచుండెను. "కృతజ్ఞుఁడను. కృతజ్ఞుఁడను. ఓదీనదయాళూ! సకరుణకు నావందనములు. ఓయువకపుంగవా! ఆమరణాంతము నిన్ను మఱువఁజాల. ఏయక్షరములు నీ పేరట ధన్యతఁ జెందియున్నవి?" అని హీనస్వరమున నడిగెను. దానికిఁ బథికుఁ డుత్తరమిచ్చునంతలో "ఏమీ! ఇది నిజమా? కలకాదుకదా? నీవు నాస్వామి శ్రీనరసింహబాలాదిత్యసార్వభౌముఁడవా?" అని పట్టరానిసంతోషమున యశోధర్మ ప్రశ్నించెను.

"అవును. కాని మెల్లగా మాటలాడవలయుఁ దెఱుఁగుము. యశోధర్మా! శత్రుగుహాంతరాళము నెందులకుఁ జొచ్చితివి?" అని బాలాదిత్యుఁ డడిగెను.

"స్వామియే ప్రాణములు పణముగా నొడ్డుచుండ, సేవకునిజీవము లొక్క లెక్కయా! ఏలినవా రిత్రోవఁ జనుట నెఱింగి, నేనును వచ్చితిని. చెడుకాల వశమున భూమకుని కంటఁబడితిని. ఇద్దఱ మొండొరులఁ దలపడితిమి. కాని బలాధికుఁడగు నాతఁడు నన్నుఁ గ్రిందు సేసెను. మీనిలుకడను, మీప్రయత్న విశేషముల నెఱింగి కాని, నన్నుఁ దుదముట్టింపవలదని మిహిరగులతోరమాను లాతనికిఁ జెప్పియున్నారcట. అందుచే నాపలుగాకి నాజీవముఁ దీయక, నన్ను బంధించి, మీరహస్యములఁ దెలియఁజేయ నెన్నియోవిధముల బెదరించెను. కాని యారహస్యములఁ జెప్పుటకంటెఁ జావనైనఁ జచ్చెద నంటిని. ఆపాతకుఁ డందులకుఁ "చెప్పవలయును. చావవలయును." అని భయపెట్టెను. ఈ రీతి మాకు వాదప్రతివాదములు జరుగుచుండ, మానవాగమనము నడుగుల సడిచేఁబట్టి గ్రహించితిమి. ఆగంతుకుఁడు నాకుయ్యాలించిన దనకార్యమునకుఁ జేటుపుట్టిల్లునని, నన్నాతఁడు వివశుఁజేయ నెంచి, తనకత్తిపిడితో నాతలపై మోదెను. ఆదెబ్బకు నేఁదెలివితప్పి క్రిందఁబడితి. తరువాత నేమిజరిగినదియుం మూర్ఛితుఁడనగు నాకుఁ దెలియదు. ఆసమయమునకు మీరు రాకుండిన, నే నీపాటికి యమసదనమునం దుండెడివాఁడను. ఈపోరాటమున నేనించుక బడలితిని గాని బలహీనుఁడఁగాలేదు. అయిన నీభూమకాధముని పాలికాలుఁడవు నీవేనా?"

"ఆవును. ఆపలుగాకి చచ్చినాఁడు."

"ఇఁక నేమాత్రము మనమిచట నిలువరాదు. భూమకునిహత్యావిషయము త్వరలోఁ దోరమానునిచెవులఁ బడఁగలదు. హంతకుల వెదకుట కాతఁడు విశ్వప్రయత్నము లొనరింపకమానఁడు. వారికనఁబడవలయు నేకాని, వారిని చిత్రవధఁ గావింపఁగలఁడు. మన మెచ్చట దాగుదము? ఏలినవారి యోజన యేమి? హూణపాలనమున నిలువనీడలేక, మనశ్రీమౌఖరిరాష్ట్రప్రజలు నగరు వీడి చనిరి. రక్తపానాతురులగు హూణరాక్షసులచేఁ బట్టణము నిండియున్నది. తమకు మాఱెంకు లేరని భ్రాంతాత్ములై విఱ్ఱవీఁగుహూణులీభీకరోదంతము నాల

శించినంతనే, మనల నెట్టులైన బంధింపఁగలరు. దేవా! మన మెచటికిఁ బోవుదము?"

బాలాదిత్యుఁడు దాతనియుబలాటముఁ గాంచి "యశోధర్మా! దిగు లొందకుము. అంతటిభయమునకుఁ గారణ మేమున్నది? ఇట్టియాపదలు మా వంశమున కీనాఁడు క్రొత్తలుగావు. కూరశేఖరుఁడు, స్కాందగుప్తుఁ డెట్లు వీర స్వర్గము నందినదియు నీ వెఱుంగవా? ఐదేడులపాటు మాతండ్రి ప్రకాశా దిత్యుఁడు పోరాడిపోరాడి, అంత్యకాలమున నేకపుత్త్రుఁడనగు నాకనుగ్రహిం చిన సందేశము నెఱుంగవా? ఆసందేశము నక్రమముగ నీస్మృతిపథమున నిలిచి యున్నదా?" అనెను.

"ఉన్నది. 'నరసింహా! పావనమగుగుప్తాన్వయమున నుద్భవిల్లు టెఱుం గుము. స్వదేశమును హూణరాక్షసులబాఱినుండి కాపాడుట నీకర్తవ్యముగా భావింపుము. యశోధర్మా! ఈపవిత్రోద్యమమున నీ వీతనికి బాసటగా నుం డుము. నాయనలారా! ఈసదుద్యమమున దైవము మీకుఁ దోడుసేడరై యుండుఁగాక.' ఇదియే యావృద్ధరాజన్యుని సందేశరాజము. దానిని మఱచు టెట్లు?"

"ఉండుము. ఆసవ్వడి వినుము. తొలిజాముకోడి కూయుచున్నది. మన మిఁక నిలుచుట తగదు. ఈహూణాధమునిశవమును, ఆపాడుబావి యందుఁ బాఱవేయవలయును. యశోధర్మా! విశాలమగు నుజ్జయినీపట్టణమున, గుప్తవంశీయులకు బందుగురా లొక్కతెమాత్ర మున్నది. ఆమె పేరు మాధవి. చండాలాంగన. రాజనగరున నూడ్చుకత్తెయై పొట్టపోసికొనుచున్నది. ప్రస్తు తము మన కామె జీర్ణకుటీరమే శరణ్యము."

"మాధవియా! ఆమె చండాలిని యని నీవే యంటివి! అహా! రాజ రాజేశ్వరుఁడగు సముద్రగుప్తునింటఁ బుట్టి పతితురాలగు పంచమాంగనయింటఁ దలఁదాఁచుకొనవలసివచ్చెఁగా! అహో! పులిపిల్ల పిల్లికూన యైనది! ఏమి దైవమాయ!"

"యశోధర్మా! వగఁగుందకుము. ఉజ్జయినీపౌరులనందఱ నే నెఱుంగుదు. కాని కడజాతికిఁ జెందినదనితప్ప, మాధవినిఁబోలు పరిశుద్ధశీల మచ్చునకైన నీమహానగరమునఁ గానరాదు."

"ఏలినవారియభిప్రాయమునకు విరుద్ధముగ మాటలాడఁదగదు. ఆమె యెంతనిర్మలాత్మురాలైననేమి? అధమకులసంజాతకదా? ఆమె యపవిత్రురాలు కాదా?"

"దైవదృష్టి కెల్లరు సములు. ఆతనికిఁ గులభేదములు లేవు. చండాలుఁడైనను, బ్రాహ్మణుఁడైనను, సజ్జనుఁడగువాని దైవ మనుగ్రహించును."

"ఇది బుద్ధుని విపరీతవేదాంతముగదా!"

"అమహాశయునివాక్య మమోఘము. యశోధర్మా! రమ్ము! భూమకుని శవమును బావియందు వేయుదము."

"అహో! కాలమహిమ దురవగాహముగదా! క్షణములోఁ గ్రిందు మీఁదు లగుచుండును, ఘడియక్రింద నీహూణాధముఁడు నన్నుఁ జంపనుండెను. అట్టివానిశవమును, ఇపుడు నేను మోయుచున్నాఁడను."

యశోధర్మబాలాదిత్యు లాశవమును, కాలు సేతులఁబట్టుకొని, చెంగటనే బదిగజములదూరమునఁ గలపాడునూయికడకుఁ గొనిపోయి, దాని నందుఁ బాఱవైచిరి. ఆస్థూలకాయము గుభేలున నాబావియందుఁ బడెను. ఆశబ్దమునకు సమీపముననుండు తరుకోటరముల సుఖసుషుప్తిఁ జెందియుండు శకుంత సంతానములు భయభ్రాంతిచే నెగురసాగెను.

"ఒక్కక్షుద్రుని పనిసరియైనది. అరక్కసు లిద్దఱుగూడఁ ద్వరలో నీతనిగతిఁ బట్టుదురుగాక" అని యశోధర్మ యనెను.

"యశోధర్మా! ఏమాత్రము జాగు సేయరాదు. మాధవికుటీరమున కిపుడే పోవలయును." అని బాలాదిత్యుఁడు యశోధర్మభుజముపైఁ జేయివైచుకొని, రహస్యమార్గమున నడువసాగెను.

---

# రెండవ తరంగము

---

## మాలగుడిసె.

వా రామార్గమునఁ బెదవికదల్పక నడచుచుండిరి. వారిమానసము లాలోచనానిమగ్నములై యుండెను. పోనుపోను దారి సన్నగిల్లి యొక్కమారుగా వారిద్దఱుపోవుటకు వీలు నియ్యకుండెను. మార్గజ్ఞుఁడగుబాలాదిత్యుఁడు ముందు మిగిలినడువ, నాతనియడుగులఁబట్టి యశోధర్మ పోసాగెను. ఆబాటకు రెండువైపుల ముండ్లపొదలును, బొంతజెముడును బలిసియుండెను. గుట్టలఁ బోలినచీమలపుట్ట లంతటఁ గాననగుచుండెను. ఉత్తుంగకంటకద్రుమము లా సంకుచితమార్గము నావరించి, ఆజాగరూకులగు తెరువరులపాలి వాగురులునా నొప్పారుచుండెను. ఆదారి నలఁగియుండనందున, నయ్యది వారలకుఁ బరిచిత మార్గమానా యని సందియము కలుగకమానదు. ఆకుపథము కొంతదూరము వంకరటింకరలుగాఁ బోవుటం జేసియుఁ గొంతదూరము మైదానమునఁ జవుటి నేలఁ గలిసి యదృశ్యమగుటఁ జేసియు, మిగుల మెలకువతో వారద్దాని ననుసరించుచుండిరి. నిర్జనమగునా మైదానము నిశ్శబ్దమై బావురుమనుచు నర్ధరాత్రిమునఁ జూచుటకు భయము నినుమడింపఁ జేయుచుండెను. అట్లు వా రామార్గమున నొండొరులఁ బలుకరించుకొనకయే పోవుచుండిరి. ఇంతలో యశోధర్మ చూపుడువ్రేలు మింటఁజూపుచు "చూడుము. చూడుము" అని వికారముగ వచించెను.

భవిష్యత్కార్యాలోచనాభరమున నధోవదనుఁడై నడచుచుండు బాలాదిత్యుఁడు గగన మొందుమార్పుల గమనించలేదు. తారక లొక్కొక్కటి

మఱుఁగగుచుండెను. ఆకసమంతయుఁ గాఱుమబ్బులలముకొని రానున్న ప్రబల వర్షమును దెలియఁజేయుచుండెను. ప్రయాణసౌలభ్యమునకుఁ గడ కానక్షత్ర కాంతికూడఁ గఱవౌట కాతఁడు నొచ్చుకొనెను. కాని తనహృదయదౌర్బల్యమును యశోధర్మ గ్రహించిన, మిగుల దిగులొందుననుకొని "వర్షమా? మఱియు మేలాయె! అన్వేషణమున కాలస్యమగును. వాన వెలియునంతవఱ కెవ్వరును బయటరారు. మూఁడునాలుగుగంటలపాటైన వాన కురియును. కాని మన మంతకుముందే తలదాఁచుకొనవచ్చును. రమ్ము. పోవుదము. ఆమూలెతయింటిని డాసితిమి. ఒకపరుగులో నందుకొనఁగలము. నాకంచుకమునుబట్టుకొని వెంటఁ బరుఁగిడుము." అని బాలాదిత్యుఁడు పరుగెత్తసాగెను.

నెచ్చెలియుపదేశానుసారము, యశోధర్మ యాతని కంచుకముఁబట్టుకొని పరుగెత్తుచుండెను. బలాఢ్యుఁడును, శీఘ్రగామియునగు మిత్రు ననుగమించుటకు శక్తిచాలదని యశోధర్మునకుఁ దోఁచెను. కుండలతోఁ గుమ్మరించునట్లు బోరున వర్షించుచుండెను. జలదముల ఘుమఘుమారావములు చెవులను జిల్లులు సేయుచుండెను. ఎడనెడఁ గలుగు మెఱపులు ప్రదేశమును గాంతిమయము నొనరించుచుండెను. కొంతదూరము పరుగిడినంతనే, యశోధర్మకుఁ బటిమ సడలెను. ప్రబలవర్షము—కంటకాకీర్ణపథము—బలహీనాంగములు—సూచికాభేద్యధ్వాంతము—అతఁడు ముందు కొకయడుగైన నిడ జాలక, రోఁజుచుఁ గూలఁబడి "అబ్బా! బాలా! నన్ను వదలిపొమ్ము. నేనికఁ గదలనోప. కష్టకాలముల నీకుఁ దోడునీడయై నిలిచి యామరణాంతము నీకపుఁగుఁ జెలికాఁడనై యుండిననన్ను, నీవు నీకాలము కలిసివచ్చినపుడు జ్ఞాపకముంచుకొనుము. నాయట్టిసన్మిత్రుఁడు నీకు మఱియొకఁడు లభించుఁగాక! దైవము నిన్ను రక్షించుఁగాక! ఇఁక నాసంగతియా! ఇట్టి పాడుచావుఁ జచ్చుట నా కానందమే. కాని, పూర్వులభద్రాసనము నెక్కిననిన్నుఁ జూచిన, నా కీమరణము మహోత్సవముగా నుండెడిది. దైవ మట్టిదాని కనుగ్రహింపఁడయ్యె. అతనియాజ్ఞ యను

ల్లంఘ్యము. సర్వజ్ఞుఁడగు నామహాత్మునికంటె మనము తెలిసినవారమా!" అని యంతలో మూర్ఛమునిఁగెను.

బాలాదిత్యున కేమియుఁ దోఁచలేదు. అతఁడు యశోధర్మనాడినిఁ బరీక్షించి, కటములఁ బట్టుకొనెను. యశోధర్మ చేతనారహితుఁడై యున్నాఁడు; కాని ప్రాణభయ మేమియులేదు. బాలాదిత్యుఁ డాతని నెమ్మదిగాఁ గ్రింద బరుండఁబెట్టి, అతిత్వరగా నచటి కించుమించుగ నూరుగజములదూరమున నాచిమ్మచీఁకటియందు మినుకుమినుకు మనుదీపమునుగూర్చి నడువసాగెను.

నిముసములో బాలాదిత్యుఁ డావెలుఁగును డాసెను. ఆదీపము, మైదానమున కావలిభాగముననుండు నున్నతప్రదేశముమీఁది జీర్ణకుటీరములోనిది. ఆకుటీరమునం దొకమాలెత కాఁపురము సేయుచుండెను. ఆస్తికులగు తెరువరు లెవ్వరైనఁ దెలియక యామాలయింటిని జేరి, భ్రష్టులు గాకుండ వారిని మేలుకొలిపి యావల నిలుపుటకుఁగాను, ఆదీప మచట నుండెను. ముప్పదియేండ్లకు ముం దట్టిదీప మచట యుండినది కాదు. సంపన్నురాలొకతె, తా నీపుట్టువునఁ గావించిన పెక్కుపాపములకుఁ బరిహారముగా నిట్టిపుణ్యకార్యముఁ గావించితినని పరలోకమున యమధర్మరాజుతోఁ జెప్పి యాతనాపరంపరలఁ దప్పించుకొను నుపాయమున, ఆదీపారాధనకుఁ గొంతనిధి నేర్పాటుగావించెను. పగటికాలమున మాల లితరుల నపవిత్రులుగాఁ జేయ వీలులేదు. వారుపోవుచోట నంతయు, ఆస్తికులును, సదాచారులును, తొలఁగునుద్దేశమునఁ దప్పెటఁ గొట్టుచుండవలయును. పాఠకమహాశయా! ఎన్నియేని శతాబ్దులు గడచినవి. ఎన్ని సంవత్సరములో పోయినవి. కాని యీదిక్కుమాలినపశువులస్థితి యించుకేనియు బాగుపడలేదు. తప్పెటలఁ గొట్టవలయునుగదా; వారి కాతప్పెటల నిచ్చెడువా రెవరు? కొనుటకైన వారికి రాగిరువ్వ యెక్కడిది? వారిపాడుగృహముల దీపము లుంచుకొన వారికి బోధించువా రెవరున్నారు? వారికుటీరములు తేజోభాసురములై యుండుటఁ జూచి యోర్వఁగలవాఁ డెవఁడు? ధనము

విలువ తెలిసినది. పిచ్చిభ్రమలఁ బ్రజలువీడిరి. నాగరకత హెచ్చినది. కాల మిట్లు మాఱినది. చిల్లిగవ్వరాని వ్యయమొనరింపక ప్రజ లీకులబాహ్యులం దమ్ముఁ జేరకుండునుపాయమును గనిపెట్టిరి. పంచములయునికిని, రాకను దెలుపుట కిపుడు దీపములును, తమటము లక్కఱలేదు. కడకు, అన్య దేశములకుఁ గూడ వారిహీనస్థితి తెలిసిపోయినది. 'మాల' యనుపదార్థము వారికి వ్యక్తమైనది. విదేశీయులు, స్వమతభ్రష్టులఁ బంచములతోఁ బోల్చుచున్నారు. పదునైనుశతాబ్దులు గడచినను, నీదౌర్భాగ్యు లింకను బూర్వస్థితియందే పడి మ్రగ్గుచున్నారు!

ఇఁక మనకథాభాగమునకు వత్తము. ఆదీపము మసకగా వెలుఁగుచు, తానచట నుండుటకై చింతనొందుచున్నట్లుండెను. తప్పుదారిఁబట్టు నావికులకు సరియగుమార్గమునఁ బోవఁ దోడ్పడు రేవుదీపమువలె, తన్ను డాసి చను సదాచారుల 'నాకమునుండి నరకమునకు జాఱిపడకుఁడు' అని యాదీపము ప్రబోధించుక్రియ నుండెను. కాని రాజశేఖరుఁడు బాలాదిత్యుఁ డేమాత్రము వెనుకంజవేయక, నిశ్చింతతో నాగృహమును సమీపించుచుండెను. ఆతని చూపులు కరుణాస్పదములై చింతాముద్రితములై యుండెను. హతభాగిని యయ్యు, సుగుణఖనియగు నాపంచమాంగనసందర్శనౌత్సుక్య మాతనిఁగూనన మునఁ జిందులుద్రొక్కుచుండెను. ఆతఁడు శిథిలగవాక్షముకడ కేగి తలుపు తట్టెను, కాని జవాబులేదు. "మాధవీ! మాధవీ! తలుపుదీయుము" అని బాలాదిత్యుఁడు పిలిచెను.

నిద్రించుచుండిన మాధవికి పిలుపుచే మెలఁకువకలిగెను. ఆమె నివ్వెఱ పాటొందెను. ఆమెవీనుల నామె నమ్మఁజాలకుండెను. 'మాధవీ' అని పేరుపెట్టి తన్నెవ్వరు పిలిచిరి? ఆమెనుగూడ నెవ్వరో ప్రాణికోటిలో నొకతెగా గణించుచున్నారు.! పంచమేతరజాతీయులందఱామెను "ఓసీ! చండాలిసీ!" అని పిలుచుచుందురు. అగణ్యులగువారలయం దొకవ్యక్తిమాత్రము 'మాధవీ' అని సంబోధించుచుండును. కాని యపరూపముగ నావ్యక్తి తనవీనుల నట్లు సుధఁ

జిలుకుచుండును. 'మాధవి' అని పేరు పెట్టి పిలిచి తిట్టినఁగూడ, నామె యమం దానంద మొందఁగలదు. కడ కామెను బలుకరించువారుకూడ లేరు. అట్టి యెడ నిప్పు డెవరో యామెను బేరు పెట్టి పిలిచిరి.

'మాధవీ' అని పిలుచువాని నొక్కనిమాత్ర మామెయుఁ దెలియును. అతఁడు నరసింహరాజశేఖరుఁడు. ఆమె రాజసౌధము లూడ్చుతఱి నాతం డామెతో నిగర్వముగా మాటలాడుచుండెడివాఁడు. తండ్రి వెంట వేఁటకరుగు నపుడు ఇంటివాకిటనుండు తన్నుఁజూచి యభిమానపూర్వకముగా గుఱ్ఱము మీఁదినుండియే చేయివిసరుచుండెడివాఁడు. అవి సంతోషసమయములు. అరిగిన ములు మఱపురావు. అప్పుడు మాధవి సంసారముకూడ మూఁడుపువ్వు లాఱు కాయలై యుండెను. ఆమె కెనమండుగురుకొడుకులుండిరి. వారిని జూచుకొని యామె తనహీనకులమును మఱచి, మింట మేడలు గట్టుచుండెడిది. కాని దైవ మింతలోఁ జిన్నమాపుచూపెను. హూణులకు గుప్తరాజులకు యుద్ధము ప్రారంభమయ్యెను. ఆయుద్ధమున వారు శిబిరరక్షకులై యుండిరి. అందఱును మృత్యువువాతఁబడి, తల్లికడుపునఁ జిచ్చుపెట్టిపోయిరి. కడుపారఁగనిన కొడుకులఁగోల్పోయిన మందభాగ్యురాలుమాధవి, ఇప్పుడు శాఖాపల్లవపుష్ప విహీనంబగువృక్షమువలె, మ్రోడై నిలిచియుండెను. గతసౌఖ్యములఁ దడవి యామె కుమిలిపోవుచుండెను. ఆనిర్భాగ్యురాలిపంత లంతతో నందమొంద లేదు. గుప్తరాజన్యులయెడ నామెప్రేమ యగాధము. ఆరాజశేఖరుల కామెపై నభిమాన మనుపమానము. గుప్తరాజపరాజయముచేతను, గుప్త వంశాంకురము బాలాదిత్యుఁ డొందుకష్టపరంపరలఁగాంచుటచేతను, నామెయుఁ బుండుపై ముల్లుగ్రుచ్చినట్లుండెను. ఈచిత్తవైకల్యమున నామె నానాటఁ గ్రుంగిపోవుచుండెను. ఇది యటుండ నాపేదరాలి కిపుడు హూణరాజ్యమున బత్తెముకూడఁ దగ్గెను. ఆరావలసిననాలుగుకాసులుకూడ సరిగఁ జేతికివచ్చుట లేదు. ఇటు లామెకుఁ గూటికిఁగూడఁ గఱవయ్యెను. తగిలినకాలికే తగులు చుండుట కామె కంపలఁబడినకాకివలె వగచుచు "జీవితము నీటిబుగ్గవంటిది.

అపవిత్రనని యముఁడు నన్నుఁ జేరకుండునా! కాలవాహినియందుఁ గలియనిజీవి లేదు." అని యనుకొనుచు నూఱటఁ జెందుచుండును. పైపైఁబడు దుఃఖతరంగములచే నామె క్రుంగుతఱి, ఎచ్చటెచ్చటనో వినియుండుభారత రామాయణగాథలఁ దలంచుకొని శాంతించుచుండును.

పరధ్యానమున మునిఁగియుండుమాధవి, తలుపుతీయుటకు మఱచి పోయెను. బాలాదిత్యుఁ డత్యాతురతతో "జేనే. నేనే. నన్నెఱుంగవా!" అని యామెను బిలుచుచుండెను. మాటవడినిబట్టి యామె మనుష్యునిగుర్తించెను. ఆమె నట్లు 'మాధవీ' అని పిలుచుటకు బాలాదిత్యుఁడుగాక మఱెవ్వరున్నారు? ఆతలఁపుతోడ నామెకు బ్రహ్మానందముకలిగెను. తోడనే యామె తలుపుతీసి, యాతనిఁగాంచి యానందనిరుద్ధస్వరమున "నాతండ్రీ! నాతండ్రీ! నీవా? నీరాక నాకుఁ గన్నులపండువుగా నున్నది. నాజీవితాంధకారమున నదృష్టభానూదయమైనది. నాహృదయసారసము వికసించినది. నాశోకషట్పద మెగిరిపోయినది. కాని నాతండ్రీ! శత్రుసామ్రాజ్యమధ్యమున కెందులకు వచ్చితివి? అయ్యో! ఆరాక్షసులకంటఁ బడినయెడల, వారు నిన్నుఁ గత్తికొక కండగాఁజేసి చిత్రవధలఁ బెట్టకమానుదురా? బ్రహ్మాదులైన నడ్డపడనోపుదురా!" అని వాపోసాగెను.

"మాధవీ! దిగులొందకుము. అంతయుఁ దర్వాతఁ జెప్పెదను. ఇచటికిఁ గూఁతవేటుదూరమున నామిత్రుఁ డొకఁడు వానయందుఁ దప్పతడిసి పడియున్నాఁడు. ఆతని నిటకుఁ గొనివచ్చి, సేదఁదేర్చవలయును. అలాంతరు తీసికొని నావెంట వచ్చెదవా!" అని బాలాదిత్యుఁ డడిగెను.

"అయ్యో! వానలో వచ్చితివఁట మఱచితిని. నాతండ్రీ! నీవెంతగాఁ దడిసితివోకదా! నీవెంట నవశ్యము వచ్చెదను." అని లాంతరుదీసికొని మాధవి యాతని ననుసరించెను. దీపపువెలుఁగున మాధవిముఖము చక్కఁగాఁ దెలియుచుండెను. ఆమెకుఁ దాదాపుగ నరువదివత్సరములుండును. యౌవనమున

# విన్నపము.

ఈ 'బాలాదిత్య' వంటి నవలలు మనభాషయందుఁ బెక్కులు లేవనుట సాహసము కానేరదు. ఇందు మనోజ్ఞమగు కథావిధానము నూతగాఁ గొని మానవప్రకృతి విచిత్రముగా నభివర్ణితమైయున్నదని పాఠకులకు విదితము కాఁగలదు. ఈనవల యందు నవరసములు తొలఁకాడుచున్నవి. అటు చారిత్రాత్మకమై యిటు సాంఘికమైయుండు దీనియందలి నారాయణశర్మ, స్వామి యగుమిహిరగులునకుఁ దగినసేవకుఁడు. మానాభిమానము లెట్టివో యీతఁ డెఱుంగఁడు. దయాదాక్షిణ్యముల పొంతకైనఁ బోఁడు. దొంగలరాయఁడు హరిరామునిహృదయము వజ్రకఠోరమయ్యు కుసుమమృదులము. దేశసేవాపరతంత్రులును బాల్యమిత్రులు నగుబాలాదిత్యయశోధర్మల స్వభావములు పరస్పరవిరుద్ధములు; కాని వారియుదారాశయములనుపమానములు. బ్రాహ్మణవితంతువు అరుంధతి స్వార్థత్యాగిని. ఆసాధ్వి వినిర్మలజీవిత మసదృశము. యుద్ధకేసరి రాజభక్తిసమోపేతుఁడు. అట్టి ధీరాగ్రేసరుని మఱి కానము. గొల్లభామ వసంత, కులీన కాకుండియు, సమయస్ఫూర్తిని బ్రకటించుచు, యశోధర్మకుఁ గుడిభుజమై నిలిచియుండిన మేధావి. కథానాయిక సరస్వతి మానమునకై ప్రాణములొడ్డిన ధీరమతి. ఇట్లీ నవలయంతయు వివిధగుణములతో నుండుపాత్రలతో నొప్పారుచు, పాఠకుని నీతిపథమునకుఁ దెచ్చివిడుచుచుండును. ఇంతకును ముంజేతికంకణమునకు ముకురమేల?

ఇట్లు మనోహరభావభరితమును విచిత్ర కథాసంకలితమును పావనధర్మసంపన్నము నగు 'శాలాదిత్య' ను నేను చదువునెడ నిట్టి నవలారాజము ననువాద మొనరించి ఆంధ్ర భాషామతల్లి నలంకరింపవలయు ననుసంకల్పము నామదినంకురించినది. తోడనే నాయభిలాషను గ్రంథకర్తలగు శ్రీయుతులు ఎ.యస్. పంచాపకేశఅయ్యరు, ఎం. ఏ., ఐ. సి. యస్., గారికిఁ దెలుపుకొన, వారు దయతో నాకనుమతి నొసంగిరి. ఉదారులగు శ్రీఅయ్యరుగారికి నాకృతజ్ఞతాభివందనము లొనర్చుచున్నాఁడ.

ఇట్టి నవలారాజమును నేను తెలిఁగించితినని వినుటయే తడవుగా నద్దానిఁ బ్రకటించి నన్నుఁ దగురీతి నాదరించిన శ్రీయుతులు వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి వందనశతము లర్పించుచున్నాను. వారికి సర్వదా కృతజ్ఞుఁడను. అనర్ఘములగు గ్రంథరాజముల నాంధ్రులకు లభింపఁజేయఁ గంకణము దాల్చి కవులపాలి కల్పతరువై వెలయు శ్రీశాస్త్రులుగారికిఁ బరమేశ్వరుఁడాయురారోగ్యభాగ్యములఁ బ్రసాదించుఁగాక!

ఆంధ్రసోదరసోదరీమణు లీనవలారాజమును మన్నించిన చో ధన్యుఁడనయ్యెద.

అనువాదకుఁడు.



బాలాదిత్యుఁడు యశోధర్మను మోచికొని
మాధవీకుటీరమును జేరుట. పుట—17.

వామె సుందరాంగి యైనట్లుండెనుగాని, సంతాపపరంపర లామె సహజసౌందర్యమును జాఱఁగొనెను. ఏవనేమి? భౌతికసౌందర్యమును దలఁదన్ను నాత్మతేజ మాసాధ్వి మోమునఁ దొలఁకాడుచుండెను. ఆమెకట్టుకొనియుండుపుట్టము విలువగలదికాకున్న నేమి? అతిశుభ్రముగా నుండెను.

ఇట్లు వారిద్దఱు యశోధర్మ పడియుండుచోటికిఁ జేరిరి. యశోధర్మకు వర్షపాతమువలనఁ గొంత యుత్సాహము వచ్చెను. మేఘములనుండి విడువడు నంబరమువంకఁ జూచుచు నాతఁడు పడియుండెను. బాలాదిత్యుఁ డాతని నెత్తుకొనెను. చూచుటకుఁ దీగెవాలియున్నను, దనమిత్రు నక్రమముగా మోచుకొనివచ్చు బాలాదిత్యుని సత్త్వసంపన్నతకు మాధవి వెఱఁగందుచు, లాంతరుతో ముందు నడచుచుండెను. క్రమముగా వారు కుటీరము చేరిరి. చింపిరిచాపపై యశోధర్మను బవ్వళింపఁజేసిరి. ఇంతలో నాముదుసలిది గంజి పెట్టి, యశోధర్మగొంతుకలోఁబోసెను. కొంత సేపటి కాతఁడు సేదదేరి, తడిగుడ్డల నిచ్చి మాధవియిచ్చిన యాచింపిగుడ్డలఁగట్టుకొనెను.

నాఁటివిశేషముల బాలాదిత్యుఁ డామెకు వినిపించెను. మఱునాఁడు తప్పక యన్వేషణము జరుగుననియు, అట్టియెడ బాలాదిత్యుఁడు రాజవేషమున నుండు టాత్మక్షేమంకరము కాదనియుం మాధవి యనెను. కాన బాలాదిత్యుఁడుకూడ రాజవేషమును విడిచి, పేదవేషమున కనువగుచింపిగుడ్డలఁ గట్టుకొనెను. అంతట మాధవి యెలుఁగు రాలుపడ "నాయనా! నీవు భూమకునిఁ జంపితివికదా! హంతకుల వెదకి పగఁదీర్చుకొనునంతదనుకఁ, దోరమానునకుఁ గూర్కుపట్టదు. కాని పతితురాలనగు నాకుటీరమును వెదకరుకదా యని నాకు నూఱటగానున్నది. హీనకులమునఁ బుట్టించియు, నాస్వామికి శరణ్యమిచ్చు నవకాశమును బ్రసాదించిన పరాత్పరునివాత్సల్యముల నేమని ప్రస్తుతింతును! ఈశ్వరసంకల్పములు సంతతశుభసంధాయకములుగదా! ఇట్టిస్థితియందు నేనుండకపోతినేని, నాయింటినిగూడ హూణులు వెదకుదురు. నా స్వామిని గాపాడుభాగ్యము నాకొదవకుండును. హీనకులసంజాతత్వమునఁగలి

గిన నాదుస్థితిని నే నొకరితోఁ జెప్పుకొనక, లోలోనఁ గ్రుళ్లుచుండెడిదానను. కాని నాహీనకులమే నాకపారమగుసాయ మొనరించినది. అన్వేషణకాల మంతయుఁ నీవు నాయింటనే దాగియుండి, యావల సుఖముగాఁ బోవచ్చును. అకటా! ఈరెండుమూన్నాళ్లు నీవు మాలయింటనుండి, మాలబువ్వ నారగింప వలయునుగదా! కాని, తండ్రీ! జనులు గోరంతలు కొండంతలుఁ జేయుచుం దురు. అదిగో పులి యనిన, నిదిగో తోఁక యనుచుందురు. ప్రపంచమునంత నువోలె నాజీర్ణకుటీరమును గూడ సూర్యకాంతి శోభామయముగఁ జేయు చున్నది. మాలవంటకమునకు నితరవంటకమునకు భేద మావంతయేని లేదు. పరు లొసంగునవి పంచభక్ష్యపరమాన్నములైనను, ప్రీతిపూర్వకమగు పిడికెడు మెతు కులకు సరిపోవు సుమా! అన్నరసమునకన్న నాదరణరసము మేలుగదా!" అని యనెను.

"మాధవీ! నీవు పంచమాఁగన వనువిషయము, నేనిచటికి వచ్చుటకు ముందే నాకుఁ దెలియును. కాని తెలిసియు వచ్చితిని. నీయింట నుండుదీవ మందలు నీయపవిత్రస్థలమునకు రావలదని మందలించుచుండియు, నాకు మాత్ర మాత్మరక్షకస్థానమునకు మార్గము చూపినది. నీకుటీరమే లేకుండినఁ దలఁ దాఁచుకొనుటకు నాకు సెలవెక్కడిది? నీవు నాక్షేమాకాంక్షిణివి. కాన నే నిచటికి వచ్చితి. నేను బడలియున్నాను. నిద్రపోవలయును. తక్కినవిషయ ముల రేపు చూచుకొనవగును." అని బాలాదిత్యుఁ డనెను.

మాధవి కాఁచినగంజినీళ్లను ద్రాగి, బాలాదిత్యుఁడు మేనువ్రాల్చెను. మాధవికూడఁ బరుండెను. ఇప్పటికి వాన వెలిసెను. ఆకసము నిర్మేఘమయ్యెను. నక్షత్రములు ముందువోలెఁ దళతళ మెఱయుచుండెను. ఇఁక వానకురియుం బోలఁదువ లేదు. "కాలమానస్థితులవలె, మానవునియదృష్టములుగూడఁ జంచల ములుకదా! ఒకసారి వెన్నెల. ఒకసారి చీఁకటి. మఱియొకసారి వెన్నెల. మొదట సముద్రగుప్తుఁడు. తరువాత విక్రమాదిత్యుఁడు. ఆవెనుకఁ గుమార గుప్తుఁడు. పిమ్మట స్కాందగుప్త ప్రకాశాదిత్యులు. ఇప్పుడీబాలాదిత్యుని

నుదుటివ్రాలెట్లున్నదో! భావికాలగతిని దెలిసినవా రెవరున్నారు!'' అని బాలాదిత్యుఁ డనుకొనుచుండ, నాతని నిద్ర పైకొనెను. ప్రమోదపారవశ్యయై యుండుమాధవి తనయాశ్రితరక్షణభారమును గ్రుంగి మైమఱచెను. ఈవిధమున నామువ్వురను నిద్రాదేవి తనయంకపాళిఁ జోకొట్టెను. మాధవి యంతకు ముందే, కిటికీకడనుండుదీపమున మఱికొంత చమురుపోసి, దానియం దింకొక వత్తివేసి యుండెను. సామాన్యగృహమునందువలెఁ బ్రకాశమానమైయుండు నాదీపము, ఏకాకిగానుండిన తనస్వామిని మాధవి యిప్పు డమందానందతుందిలయైయుండుటకు నవ్వుచున్నదా యనునట్లుండెను.



# మూఁడవ తరంగము

---

## నారాయణశర్మ—గోవిందాచారి.

అరుణోదయమైనది. బాలభానుని హేమకాంతులు మున్ముందు విష్ణుదేవాలయ గోపురాగ్రమునకు బంగారుపూఁతలు పూసి, క్రమక్రమముగాఁ బట్టణమునంతటిని బ్రభాభాసురముగాఁ జేయుచుండెను. పెందలకడ నిదుర లేచినవారలు కొందఱు, ఆలయపరిసరమునంగల తటాకవిమలోదకములఁ గ్రుంకులిడి పోవుచుండిరి. తరుణార్కబింబము వినిర్మలోదకముల స్వచ్ఛముగఁ బ్రతిఫలించుచుండెను. కొలనిగట్టులును, మెట్లవరుసలును శిలావినిర్మితములై యుండెను. సార్వభౌమవిక్రమాదిత్యుఁడు సత్రపుల జయించి యుజ్జయిసీనగరమును దనరాజధానిగాఁ జేసికొనినతఱి, విజయచిహ్నముగా నీయాలయకాసారములఁ బ్రతిష్ఠించెను. ఇప్పుడు పాలకులై యుండు హూణులకుఁ బరమత మనినఁ గిట్టదు. కాని పరమపవిత్రముగాఁ బాలితులచే నెంచఁబడు నాదేవాలయమును నేలమట్టము గావించినచో, నవమానభరమున వారు చెలరేఁగి తిరుగుబాటొనరింతురని తలంచి, హూణులు కాలమునకుఁ గట్టువడి పరమతసహిష్ణుల వలె నటించుచుండిరి.

నాఁటియుదయ మాకొలనియం దిరువురు పురుషులు స్నానముచేయుచుండిరి. జను లీవిధమునఁ బ్రాతస్స్నానము లొనరించుచు నొకరితో నొకరు పుక్కిటిపురాణములఁ జెప్పుకొనుటను నేఁటికిఁగూడ మనము చూచుచున్నాము. వారిలోఁ బెద్దవానికి షుమా రేఁబదియేండ్లుండును. అతనిముఖము కపటరసమునకుఁగుదురై, అఱచేత వైకుంఠము నగపఱచుపండితమ్మన్యుఁడని తెలియఁజేయుచుండెను. అట్లుగాకున్న, ముప్పదేండ్లు నిరాఘాటముగ, నిరుపమాన

ముగ సచివపదవి నిర్వహించుచున్నవాతనికడ నేదియేని సామర్థ్యము లేక పోవునా? గుప్తరాజులు పోయిరి; హూణులు వచ్చిరి. రాజ్యపాలనావిధానము తలక్రిందులైనది: అయినను, నారాయణశర్మపదవికిమాత్రము లోటు రాలేదు. నారాయణశర్మ బ్రాహ్మణుఁడు. కన్నుండఁగనే కనుపాపను దీయుప్రజ్ఞాశాలి. తిమ్మిని బ్రహ్మిని, బ్రహ్మిని తిమ్మిని జేయఁగలచతురుఁడు. ఏగాలి కాచాఁప నెత్తి నక్కవినయములఁ జూపుచు స్వామియనుగ్రహమును సంపాదించు సమయజ్ఞుఁడు. అట్టిచిట్టవిప్లవసమయములఁగూడఁ దనయధికారమున కావంతయైన లోపము రాకుండఁ జేసికొనెననుటలో నాశ్చర్య మేమి కలదు!

కొండవవాఁడును బ్రాహ్మణుఁడే. ఆతనికి ముప్పదియైదువత్సరము లుండును. నారాయణశర్మచలచిత్తమున కాతఁ డేవగించుకొనుచుండును. ఆతని ప్రతిభకు వెఱఁగందుచుండెను. ఆతనియభ్యుదయమున కసూయఁజెందుచుండును. ఆతఁడు కూడఁ బ్రతిదిన మావేళకే వచ్చి నారాయణశర్మతోఁ గలిసి, స్నానము చేయుచు, మాటలసందున నాతనినుండి రాజ్యరహస్యముల ల్లాగి, యాతనికలిమికిఁ గలకిటుకును గ్రహింప నిప్పటికిఁ బదునైదువత్సరముల నుండి యెంతయో ప్రయత్నించుచుండెను. యథారీతి యువకుఁడు "శర్మగారూ! నగరిసంగతు లేమి? విశేషము లేమైనఁ గలవా?" అని ప్రశ్నించెను.

"ఓహో! మఱచితి. జ్ఞాపకమునకు వచ్చినది. నేఁడు నగరికిఁ దొందఱగాఁ బోవలసియున్నది. త్వరగ స్నానమొనరింపవలయును. గోవిందాచారీ! ముచ్చటల కిఁక వేళలేదు. కొండంతపని యున్నది. పోవలయును" అని నారాయణశర్మ యనెను.

గోవిం:—బాగుగనున్నది! నిన్నమొన్నవా రెవరున్నారు? మాకుఁ దెలియదా యేమి? పోనిమ్ము. అలస్యము గాఁ బోయిన, నిన్నమొన్నవా రెవరున్నారో చెప్పుము చూతము!

ముఖస్తుతిపరాయణుఁడునైత మొక్కొక్కవ్వఁడు, తన్నితరులు పొగడుటెఱుంగఁజాలక, వారిమాటల కుబ్బిపోవుచుండును. గోవిందాచారిమాటలకు

నారాయణశర్మ మోము వికసించెను. "అవును. అది నిజమే. నామాటకు మాఱెందు లేదని నలుగురికిఁ దెలియుటకై, యీరాజ్యమున నేను బెట్టినది భిక్షయని పదిమందికిఁ దెలియుటకై, నే నీదినము కావలయునని కొంచె మాలస్యముగా నగరికిఁ బోయెద. గోవిందాచారీ! నగరియందును, దేశమునందును రాజకీయములు క్రిందుమీఁదు లగుచున్నవి. పెదవిఁ దెఱచి యొకపలుకైనఁ బలుకక రహస్యమును గాతువని, యుజ్జయినీనగరమునందలి యిరువదిముగ్గురు దేవుళ్లపైఁ ద్రిశుద్ధిగ బాసయొనరించినయెడల, నారహస్యము నీకు వినుపింతును" అనినారాయణశర్మ యనెను.

వాడుకప్రకారము గోవిందాచారి యక్రమముగా నిముసములో నొట్టుపెట్టుకొనెను.

నారా:—(రహస్యముగా) బాలాదిత్యుఁడును, యశోధర్మయుఁ జుట్టుపట్టులఁ దారాడుచున్నారని నీకుఁ దెలియునుగదా! రాత్రి యొనిమిదిగంటలప్పుడు చారుఁ డొకఁడు మహారాజతోరమానునికడకు వచ్చి "బాలాదిత్యుఁడు నడురేయికంతయు నగరమునకు వచ్చును. యశోధర్మ పురోగామియై స్వామిరక్షణార్థ మరుదేర నున్నాఁడు" అని నివేదించినాఁడు. తోడనే తోరమానుఁడు తనతమ్ముని బిలిచి "ఊరికివెలుపల నుండుబీడులోఁ బొంచియుండి యామాళవమహాకోసలాధినాథుని యశోధర్మను బట్టుకొని, యమలోకమునకు గెంటివేయుము" అని చెప్పి పంపెను. భూమకుఁడు మనకుఁ గ్రొత్త కాదుకదా! వానికోఱలఁ జిక్కకుండుటకు యశోధర్మ తరమా?

"అయ్యో! పాపము" అని ఆచారి నొచ్చుకొనెను.

నారా:—అబ్బే! జాలిపడియెద వెందులకు? యశోధర్మ యక్రమమునఁ జంపఁబడియుండునని తలంచి, మేము నిద్రించితిమి. పోయినపని రైన వెంటనే తిరిగివత్తునని చెప్పినభూమకుఁ డిప్పటికి రాలేదు. తోరమానుఁడు వేకువనే లేచి యాతనికై విచారించినాఁడు. కాని యాతనిపోవడి తెలియలేదు. అంత నతఁడు తనకుమారుని మిహిరగులుని లేపెను. ఇప్పుడు తండ్రికుమారు

లిద్దఱు దిగులొందుచున్నారు. అబీటియందు శవమేమైనఁ బడియున్నదో చూచిరమ్మని ఒక సేవకుని బంపిరి. నేను స్నానమునకు వచ్చునప్పటికి వాఁడు తిరిగి రాలేదు. నాతో నీవిషయ మాలోచించుటకై తోరమానమిహిరగులులు నన్ను త్వరగా రమ్మనిరి. హాహా హాహా! కాని చూచితివా? నే నిట్లు త్వరగాఁ బోవుచునే యున్నాను.

"తోరమానుఁడు భూమకునితోఁ గొంతబలఁగము నంపియుండవలసి నది" అని గోవిందాచారి సూచించెను.

నారా:—ఓరి వెఱ్ఱివాఁడా! భూమకునిసంగతి నీకు బాగుగాఁ దెలిసి నట్లు లేదు. కొందఱుభటుల వెంటఁగొనిపోవ దోరమానుఁడు చెప్పినాఁడు. భూమకుం డందులకుఁ గుపితుఁడై "ఏమీ! పందయగు యశోధర్మఁబొడవడఁచు టకు నాకు సాయము కావలయునందువా? అన్నా! నీవు నన్నుఁ జేఁతకాని వానిగాఁ దలఁచుచున్నావు." అనెను. "కాదుకాదు. చేతిక్రింద సాయ ముండిన క్షేమముగదా!" అని తోరమానుఁడు చెప్పెను. భూమకుఁ డందుల కరిగీకరింపక "అటులైన నేను పోఁజాల. భటులు గిటులు నాతో రాఁగూ డదు." అని ఖండితముగా ననెను. శ్రుతి మించిపోవుచున్నదని తోరమానుఁడు గ్రహించి "సరియే. అంతయిష్టములేకున్నఁ బోనిమ్ము. నీయోచనకూడ యుక్తి యుక్తముగ నున్నది. జనస్తోమముండినయెడలఁ గార్యమున కంతరాయము కలి గినఁ గలుగవచ్చును. మాయావియశోధర్మ యాసందడియందుఁ జాఱిపోయినఁ బోవచ్చును." అని తోరమానుఁ డనెను. భూమకుఁ డప్పుడు సంతుష్టుఁడై "అవును. నాయభిప్రాయముకూడ నదియే" అని వెడలిపోయెను. పోయినవాఁ డింతవఱకు రాలేదు.

"ఆతఁ డేమైయుండు ననుకొందువు?"

నారా:—ఏమో! తడవులఁబట్టి తెలియును. భూమకుఁడు యశో ధర్మను జచ్చునట్లు కొట్టియుండును. యశోధర్మకూడ భూమకుని విడచి

యుండఁడు. ఇట్టు వారొండొరుల పాలియములై యుండురని నాయూహ. అహహా! ఇది నిజమని వీనులకు విందుగ చెప్పుదు విందునో కదా!

"భూమకునిపై నీకంత కసియేల!"

నారా:—'కసి' యని మెల్లఁగ నందువా! కావలసినంత యున్నది. తోరమానుని నేను పొగడునపుడంతయు భూమకుఁడు నాకడ్డుతగులుచు "నీవు బ్రాహ్మణుఁడవనియే కాని, నీతినియమములులేని బాడుగోలువు. చిల్లిగవ్వయిచ్చినవానినైనఁ 'జంద్రుఁడు, ఇంద్రుఁడు' అని పొగడు బికారివి. నీచమగు కుక్కయైనఁ దనకన్నమిడినవానినిఁ గఱువ వెఱచును. నీవు కుక్కకంటె నీచుఁడవు. ఇరువదియైదేండ్లు గుప్తరాజుల యుప్పుఁ దిని, తిన్నయింటి వాసము లెన్నినద్రోహుఁడవు; ధూర్తుఁడవు. నీకుఁ దెలివియున్నదనియే కాని, పెడకలఁబట్టిపోయినది. పెద్దలకడుపు చెఱుపఁబుట్టిన గాడిదవు నీవు. ఎవ్వఁడైనఁ బుణ్యాత్ముఁడు నిన్నురితీసినయెడల, మేము పాలన్నము తినెదము" అని యొగ్గులాడి, నానోరు మూయించుచుండును. ఇంకొకమాట. యువరాజు మిహిరగులుఁడున్నాఁడు కదా! ఆతని నేను శ్లాఘింపనిదినములేదు. అట్టివానిఁ గూడ భూమకుఁడు నానోటికిఁ దాళము వేయునపుడంతయు, కడుపుబ్బ నవ్వుచుండును. నవ్విన నవ్వుఁగాక! ముల్లుతీసి మేకుదూర్చినట్లు "చిన్నాయనా! అది కాదు. ఎట్టిఘాతుకుఁడైనను, నారాయణశర్మ నురితీయఁజాలఁడు. నారాయణశర్మ వానిని బొగడ్తలచే మింటికెక్కించి 'నీవు అవతారపురుషుఁడవు. యమధర్మరాజు నీరూపమున భువిపైఁ బుట్టినాఁడు' అని యెట్టులెట్టులో వానిని వలలో వైచికొనక మానఁడు. శర్మ నాతో 'నీవు సూర్యవంశాంబుధిసోముఁడవు. గుప్తరాజులకంటెఁ గులీనుఁడవు. నీపేరు 'మిహిరకులుఁడు' అని యుండవలయును గాని 'మిహిరగులుఁడు' అనుటలో నర్థములేదు.' అని బాదరాయణసంబంధము గల్పించియున్నాఁడు" అని యాతని కెక్కులు పెట్టుచు, గోరుచుట్టుపై రోఁకటిపోటులు వేయుచుండును. గోవిందాచారీ! ఆసమయమున నాకుఁగల్గు మనోవేదన నేమని వర్ణింతును! నిద్రాహారములు మాని రాత్రిం

బవళ్లు యోజించి యోజించి కడకు యువరాజున కట్టిడులైనతను గని పెట్టినందులకు, నాకుఁ గల్గినఫలమును గంటివికదా! ఆచారీ! రాజసేవనమునఁ గలుగు మర్యాద లిట్టివని యిప్పటికైన గ్రహించితివా!

“అపుడు తోరమానుఁ డేమి చేయుచుండును!”

నారా:—ఏమి చేయుచుండునా? ఆకృపణులతోఁ గలిసి కడుపుచెక్కలగునట్లు నవ్వుచుఁ బైఁగా “కాదుకాదు. నారాయణశర్మ రెండావులదూడ. కుతంత్రకుశలి. అట్టివెరవరి యొకఁడు మనచేతిలో నుండినఁ బ్రజానురాగసంపాదనము మిగుల సులభము. హూణసామ్రాజ్యపాదపమునకు నారాయణశర్మ దోహదకారుఁడు. వృక్షము వ్రేళ్లుపాఱువఱకు కిట్టి కప్పకూఁతపాములను మనము మేఁపుచుండుట మంచిది” అని వాగుచుండును. ఆచారీ! నాకోపానలమున కిట్టి కాఱుకూఁత లింధనప్రాయములయ్యె, వివేకజలముల నద్దాని శాంతపఱచుచుందును. మీఁదు మిక్కిలి లేనినవ్వు తెచ్చికొని “దేవరవారు నవ్వులాటకు నిగినారు” అనుచుందును. వారిని మనసున శపించుచుండియు, వాఖున దీవించుచుందును. అందఱికంటెఁ బలుమారు నాపైకి దుముకుచు నా మానము తీయుభూమకుఁ డనిన నాకు నఱకాలిమంట నెత్తికెక్కుచుండును. అకుటిలాత్ముఁడు భగవదనుగ్రహమునఁ జచ్చియుండిన మఱియు మేలగును. స్వామీ! తండ్రీ! చావ నేవలయు. రేపు విఘ్నేశ్వరునకు నూటయెనిమిదిటెంకాయలు కొట్టెదను. ఆచారీ! నేను పోవలయును. వేళయైనది. వారు నాకై వేచియుందురు.

“ఒక్కవిషయము. మిహిరగులుఁ డిచ్చట పెద్దశివాలయమును గట్టింప నున్నాఁడనియు, ఆమ్లేచ్ఛుఁ డార్యమతము నవలంబించినాఁడనియుఁ బ్రతీతిగా నున్నది. ఇది యెంతవఱకు నిజము?”

నారా:—అంతయు నిజము. కాని యాతనిమతాంతరమునకుఁ గారణ మెవకైనది, ఎవ్వనికైనఁ దెలియునా? పోనీ, నీకైనఁ దెలియునా? తెలియనే తెలియదు. మిహిరగులునిమతాంతరమునకు నుత్తరవాది యీనారాయణ

శర్మయే. నేనే! నిన్న మిహిరగులుని భోజనార్థ మొక మేఁకను జంపిరి. పోయియుఁ
బోని ప్రాణములతోఁ దనుకులాడు నాజీవి యార్తనారావము వానిచెవులకు
రమ్యముగా నుండెను. అట్టి శ్రావ్యనినాదముల నాతఁ డింకను వినుకుతూహల
మున నొకమంద మేఁకల కుత్తుకలంకోయ నాజ్ఞ సేసెను. అప్పుడు నే నాతని
ప్రక్క నిలువఁబడియుంటిని. అతనియుత్సాహమును గమనించి, యదియే
తగినయదనని గ్రహించి "సంహారరుద్రా! అహో! సంహారరుద్రా!" అని
నుతించితిని. దాని కాతఁడు "శర్మా! దానియర్థ మేమి?" అని యడిగెను.
"దేవరా! ఇది మహాదేవునిసార్థకనామము. దేవశిఖామణియు, దేవదానవ
పూజితుఁడును, గుప్తరాజుల కభీష్టదైవము నగువిష్ణువునకుఁ బ్రత్యర్థియు నగు
శ్రీమన్మహాదేవుఁడే సంహారరుద్రుఁడు" అని నేనంటిని. అందుల కాతఁ
డుబ్బొంగుచు "ఆదేవదేవునియుపాసనకుఁ గలనియమము లేమి?" అని ప్ర
శ్నించెను. "అనంతకోటిజీవములగొంతులను వేఱొకపనిమాని కోయునాతఁడే,
సంహారరుద్రుని భక్తుఁడు" అని యంటిని. ఆమాటల కాతని నేత్రము లానంద
విస్ఫారితములయ్యెను. "ఓ దేవదేవా! ఈభక్తునిబాగును మన్నింపుము. ప్రాణి
వధ, ప్రాణివధావలోకనమునందలి యానందము, ఉగ్గుపాలతో నాకలవడినవి.
కాని యింతకాలముగా నిట్టి మహాకార్యములు, స్వాభీష్టదములని మాత్రము
తలంచి, నిన్నేమరి యుంటిని. సంహారరుద్రుఁడవగు నీభక్తిప్రాపున నాకిట్టి
కోరిక కలిగినదని, నేను కలనైన నెంచియుండలేదు. కాన, మహాదేవా! నా
తప్పును మన్నించి, నాసేవను స్వీకరింపుము. శర్మా! భక్తవత్సలుఁడగుమహా
దేవున కీనగరమున నొక్కగుడియైన లేదు! కాని, పేడియు నప్రయోజ
కుఁడు నగువిష్ణువునకుఁ గొండంతగుడి యున్నది. శర్మా! దీనికిఁ గారణమేమి?"
అని యాతఁడు ప్రశ్నించెను. "దేవా! గుప్తరాజులుగూడ నప్రయోజకశిఖా
మణులు. హత్యాభిలాష వారికడ మచ్చునకైనఁ గానరాదు. అవ్యక్తశేఖరుఁ
డును, షండయు నగువిష్ణుదేవుని బట్టుకొని వారూఁగులాడుచుండిరి. ఇప్పుడు
కాలము తారుమారైనది. శూరవరులగుహూణులపాలనమునఁ బరిస్థితులు

పరశమార్గమునకుఁ దిరిగినవి. మూఁగనాఁగేళ్లవలె ముక్కుమూసికొని కూర్చుండుదినములు పోయినవి. మైకము విదల్చుకొని మగఁటిమి నెఱపఁదగినదినములు వచ్చినవి. పిచ్చిభావములు పరుగెత్తిపోయినవి. దేవా! జీవఘాతుకులు పశువులకంటె నీచులని నుడువుచు, నహింసాప్రబోధన మొనరించువారలను ముప్పదిమందిబౌద్ధపరివ్రాజకుల నొక్కమారుగాఁ గుత్తుకలుకోసి, వారిని దామ చిత్రవధలఁ బెట్టిన యీసుదినము తమకు జ్ఞప్తి యున్నదా? ఈమహాకార్యమెక్కటియే మీరు శివభక్తశిఖామణులని చాటుచున్నది. ఆహాహా! ఆదౌర్భాగ్య లోకరివెంటనొకరు చచ్చుచు నఱచినయఱపులందలి స్వరమాధుర్యముచే మీరొందిన బ్రహ్మానందమునకు మేఱయున్నదా? 'గొంతు లొక్కొక్కనికిఁ బెక్కులుండినయెడల వానిని గోయుచు మరణయాతనారావమును గర్ణానందముగ మనోహరముగఁ గలకాలము విననగునుగదా!' అను మీయపూర్వాభిలాషను మఱువఁగలనా? ఓదేవా! సంహారరుద్రుఁడవు నీవే. ఆమహాదేవున పట్టణమున నొకపెద్దకోవెలను గట్టింపవలయును." అని నేనంటిని. అందులకాతఁ డానందపరవశుఁడై "శర్మా! అట్లే యగుఁగాక! మనవిధికృత్యమున నింతకాల మశ్రద్ధచేసితిమి; కాన మనము రుద్రుని మెప్పు నిబ్బడిగా నందవలయును. ఆదేవదేవునకు బ్రహ్మాండమగునాలయముఁ గట్ట నిప్పుడే యాజ్ఞ చేసెదను. శివాలయమునకు విష్ణుదేవాలయమునకుఁ, బర్వతమునకుఁ బరమాణువునకుఁ గలవాసియుండవలయుఁ జూడుము! చేయవలసినపనిని సకాలమున కెఱుకపఱచితివి. చాల సంతసమయ్యె. ఇదిగో దీనిని గానుకగా గ్రహింపుము." అని చెవులనుండు రత్నకుండలములఁదీసి నాకొసంగెను. అవి పూర్వము స్కందగుప్తునికడ నుండెడివి. మిహిరగులుఁడు వానిని గ్రహించినాఁడు.

"ఏవి? ఏవి? నన్నుఁ జూడనిమ్ము!"

నారా:—ఓహో! వానిని బదిలపఱచి వచ్చినాఁడను. వానిని ధరించుకొని నేను కొలువునకుఁ బోయినయెడలఁ దోరమానునకు భూమకునకుఁ గన్నులు కుందును. వారు వాని నూడఁదీసికొనఁగలరు. ఒకవేళఁ జపలచిత్తుఁడగు మిహి

రగులుఁడే తనత్యాగమునకుఁ బరితపించి, వానిని లాఁగుకొనఁగలఁడు. ఇపుడు వానియునికి నాదున్నపోతు తెలియుంగుట యసంభవము. విశేషములన్నియు వినిపించితినిగదా! ఇఁకఁ బోయెద.

నారాయణశర్మ గట్టుకెక్కి మడిగుడ్డలఁ గట్టుకొనెను. అంతట గోవిందాచారి తిరుమణితిరుచూర్ణముల నాతని కియ్యఁబోయెను. నారాయణశర్మ యందులకుఁ జీదఱించుకొనుచు "ఆచారీ! ఏమి నీవెఱ్ఱితనము! ఎంత యవివేకము! ఇంతవఱకు నీవు రాజానుగ్రహమును బడయకుండుటలో నాశ్చర్యమేమున్నది! ఎంతమూఢుఁడవు నీవు! తిరుమణితిరుచూర్ణముల నాకియ్యవచ్చుచున్నావు! అవి నాకెందుల కనుకొంటివి?" అనెను.

"శర్మగారూ! చేయరానిపని యేమి చేసితిని? నీవు నిన్నటిదనుకఁ దిరుచూర్ణధారివై యుండుటను జూచియున్నాను. కావున నేఁడుకూడ నూర్ధ్వపుండ్రములఁ బెట్టుకొందు వనుకొంటిని."

నారా:—ఓ తెలివిహీనుఁడా! వైష్ణవులగుగుప్తరాజులకొలువున నుండు నంతకాలము, తిరుమణిశ్రీచూర్ణధారణము-సక్రమముగా ద్వాదశోర్ధ్వపుండ్రములఁ బెట్టుకొనుచుండుట-నిజము. మ్లేచ్ఛులగుహూణరాజుల కయ్యది యాక్షేపణీయము కాకుండుటచే, నటులే వైష్ణవమతచిహ్నములతో నుంటి. ఇప్పుడు మిహిరగులుఁడు శైవుఁడైనాఁడు. కాన నేనుగూడ నిపుడు విబూది పూసికొనవలయునుగాని, తిరుమణితిరుచూర్ణములజోలికిఁ బోరాదు. ఒక్క విషయము వినుము. 'స్వశ్రేయోభిలాషియగు సేవకుఁడు స్వామిమతస్థుఁడై యుండవలయును.' అని ముమ్మాటికి నమ్ముము.

నారాయణశర్మ పిడికెడువిబూది తీసికొని దంబముగా నొడలంతయు నలఁదుకొని, గోవిందాచారితో నాఁటిరహస్యభాషణముల బయటఁబెట్టవలదని చెప్పి, బాసచేయించుకొని, బిరబిర నగరివైపు నడచిపోయెను.

గోవిందాచారి యాతని జూపుకందినంతవఱకు నటులే చూచుచుండెను. నారాయణశర్మ విపరీతవర్తనము గోవిందాచారిమానసమున ననేకయూహలఁ బుట్టించెను. "ఆహా! ఎంత విపరీతము! మాయలమల్లి యగు నారాయణశర్మ నానాఁట నభ్యుదయము నొందుట! సజ్జనుఁడ నగు నేను మలమల మాఁడుచుండుట! ఈపటిలుఁడు పవిత్రతరమగు శివతత్త్వమున కపార్థము కల్పించి, మిహిరగులుని దన చేతికీలుబొమ్మగాఁ జేసికొనినాఁడు. ఔనౌను. శిలను శైలముపైకిఁ గొనిపోవుట యసాధ్యము కాని క్రిందికి దొర్లించుట కొకశిశువైనఁ జాలును! శివప్రభావము నెఱిఁగి, త్రిమూర్తులలో నొకఁడగు నా మహేశ్వరుని లీలామాహాత్మ్యమును గ్రహించుటకు సంయమీంద్రులకు సైత మశక్యమైయుండ, నా మహాదేవుని లీలలకు, నామములకు విపరీతార్థములఁ గల్పించుటకు నారాయణశర్మవంటి మూఢశిఖామణికి సాధ్యమయ్యెఁగదా! అవును. ఇంతకు లోకమే యిట్టిది. గ్రుడ్డిది. సత్యము గ్రహించుట యసాధ్యము. కాని మనసుకుఁ దోఁచినట్లు మాటలాడుట మిగుల సులభము. ఈజిత్తులమారి గుప్తసామ్రాజ్యమున వీరవైష్ణవుఁడైయుండి, యిప్పుడు హూణపాలనమున వీరశైవుఁడైనాఁడు. ఎంత చిత్రము! కడకు శ్రీచూర్ణమును గూడఁ దాకుటలేదు 'నారాయణ' అనునది విష్ణుపర్యాయము గదా! ఈమాయావి యింకను ఆపేరుతో నున్నందులకు విస్మయముగా నున్నది. 'శంకరశర్మ' అని పేరు మార్చుకొనుచుగాఁబోలు! మిహిరగులుని మిహిరకులు'నిగా మార్చిన దిట్ట కిట్టి దశక్యమా?...ఈతనికి, నీతనికలిమికి నా కసూయలేదు. ఎప్పుడో యొకప్పుడు, ప్రియశిష్యుఁడగు మిహిరగులుఁ డీపెద్దరి తలఁ దెగఁగొట్టి, సంహారరుద్రునకు బలియిచ్చి, గురుబోధను 'దూచా' తప్పక యాచరణలోనికిఁ దెచ్చి యఖండానందము నొందకపోఁడు...నిజముగా భూమకుఁడు మడిసియుండునా? వాఁడు సజ్జనుఁడు కాఁడనియే కాని, ఆమువ్వురిలో నాతఁడే నా మనస్సు కెక్కినవాఁడు. కుత్సితుఁడగు తోరమానుఁడును, రక్తపిపాసువగు మిహిరగులుఁడును, యథార్థవాదియగు భూమకుఁడే లేకుండిన, నుజ్జయినీ శూరులను మంగలములోఁ బెట్టి వేఁచియుండరా? ఆహాహా! కారుణ

విధులగుగు క్షత్రరాజన్యులకును, కటికరక్కసులగుహూణులకు నెక్కడిసామ్యము! ఆరామరాజ్యమున హంతకులు తప్ప నందఱు సంతోషవారిధిఁ దొప్పదోఁగుచుండిరి. ఈరాక్షసరాజ్యమున సాహంతకులే శ్రేయము నందుచున్నారు. ...ఓవిష్ణుదేవా! సర్వశరణ్యా! ఇఁకనైన నీ ప్రత్యక్షరాక్షసునుండి మమ్మురక్షించి, సుక్షత్రరాజ్యవైభవములఁ బ్రసాదింపవా!'' అని యనుకొనుచు గోవిందాచారి కాసారమును వీడి, మానవునికలిమిలేములను, ఉజ్జయినీపుర మొందుదుస్స్థితిని దలపోసికొనుచు, స్వగృహాభిముఖుఁడై పోయెను.

---

# నాలుగవ తరంగము

## పరాజితాన్వేషణము.

రాజగృహము ఉజ్జయినీరాజవీథికిఁ బురోభాగమున నున్నది. అచటికిఁ జేరువనే విష్ణుదేవాలయము కలదు. విశాలము నుత్తుంగమునగు నారాజప్రాసాదము నేత్రానందకరమై యుండెను. గుప్తరాజులు పూర్వము దానియందు నివసించుచుండిరి. వైష్ణవులుకాని హూణుల కందుండుట కిష్టము లేకున్నను, సౌందర్యప్రభాభాసురమును, శిల్పిచాతురీవిలసితము నగునట్టిప్రాసాదమును వేఱొకదానిని నిర్మింప నోడి, దానియందే నివసించుచుండిరి. ఆరాచనగరు, మధ్యమయుగమున నైరోపాదేశమునందలి నగళ్లవలె దుర్గమిశ్రితమై రక్షకస్థానమై యుండక, కేవలము నివాసయోగ్యమై యుండెను.

ఉదయము ఏడుగంటలైనది. రాచనగరంతయు సద్దడఁగి యుండెను. భటులు విన్నబోయినవదనములతో నెక్కడివా రక్కడ నిలిచియుండిరి. ఎందులకో వేఁడినిట్టూర్పులు విడచుచు వారు గుజగుజలు వోవుచుండిరి! ఏలొకో వారు కీడును శంకించుచుండిరి. హజారములోని వేదికపై ముప్వురు పురుషులు కూర్చుండి మంతనములాడుచుండిరి. రాజసేవకులప్పుడప్పుడు వారిని గ్రీఁగంటఁ జూచుచుండిరి. ఆపురుషులు ముగ్గురు తమకములో నెవరినో యెదురుచూచుచుండిరి. వారిలో మొదటివానికి రమారమి ఏఁబదియేండ్లుండును. అతఁడే హూణరాజగు తోరమానుఁడు. మఱియిద్ద ఱాతనికంటెఁ జాల చిన్నవారు. రెండవవాఁ డాతనికుమారుఁడగు మిహిరగులుఁడు. మిహిరగులుఁడు దీర్ఘకాయుఁడు. స్థూలశరీరుఁడు. జుంజురువెండ్రుకలును, మెలితిరిగిన బారడేసిమీసములును, చింతనిప్పులవలె నుండుమిడిగ్రుడ్లును, పాలచిప్పులవగిది నుండు మిట్ట

పండ్లును, నల్లబొగ్గును జూచి నవ్వుశరీరకాంతియు, రామాయణస్థములగు రాక్షసాకారములను మనసుకుఁ దెచ్చుచు నాతనివికృతాకారమునకు సమత్వము నాపాదించుచుండెను. కాని యాతనిరూపము వికృతమైనదనియే కాని, హృదయము మాత్రము విలక్షణమై అమాయకత్వమును వెల్లడించుచుండును. ఆతఁడు పచ్చనిదంతయుఁ బైడియని తలంచుచుండును. వికారారుణములగు నాతనినేత్రములనుండి వెలువడు తీక్ష్ణములు దారుణములై సజ్జనహృదయకంపితములై యుండెను. జలదగర్జనముల నణఁగఁద్రొక్కు కంఠస్వరమును, వంకరటింకరలై ఇఱుకుగనుండు కొండగుహనుండి జివ్వున వీఁచు ఝుంఝామారుతశబ్దమును బూరికిఁ గొననినవ్వును, ఆతనికరాళరూపమునకనురూపములైయుండెను. మూఁడవవాఁడు సుకుమారునివలెఁ గన్పట్టుచుండెను. ఆతఁడు పేడివలె నుండెను. అధికారమున నాతఁ డాతండ్రికుమారులకు సమాఁడై యున్నట్లు లేదు. దాదాపుగ నతని కిరువదియేడువత్సరము లుండును. ఆతఁడు నీతినియమములు గణింపక, ఎవరికిఁ దగినమాటలు వారిముందాడుచు స్వకార్యములఁ జక్కఁబెట్టుకొను జిత్తులమారి. చ్యుతరాజ్యులగు గుప్తప్రభువులకాతఁడు కులబంధువు. కాని యాకపటాత్ముఁడు వారికి నమ్మకద్రోహ మొనరించి హూణులకుఁ దోడ్పడి, యిప్పుడు హూణసామంతుఁడై పశ్చిమమాళవరాజ్యమునకుఁ బ్రభువై కాలమొకరీతిఁ గడపుచుండెను. ఆతనిపేరు భానుగుప్తుఁడు. మగధరాజ్యమునుండి బాలాదిత్యుని దఱుముటకై యాతఁడు భూమకునివెంటఁ బోయియుండి విజయముగొని మొనమొన్ననే తిరిగివచ్చెను. కాలితోఁ జెప్పినపనిని జేతితోఁ జేయు భానుగుప్తుఁడు విజయశీలుఁడై వచ్చుటకెంతయు సంతసించి, దానికి వరముగా నాతనికి సహాసనము ననుగ్రహించెను. తోరమానమిహిరగులులతో నుద్దిగఁ గూర్చుండుయోగము తన కొకనాఁడు పట్టునున్నదని భానుగుప్తుఁడు కలనైనఁ దలఁచియుండలేదు.

వారివదనములు గాఱావాఱియుండియు గాంభీర్యసదనములై యుండెను. తోరమాణుఁ డాలోచనాభరమునఁ గ్రిందఁజూచుచుఁ జెక్కిటఁజేయిచేర్చి

యుండెను. మిహిరగులుఁడు కూడ యోచనాతత్పరుఁడై చీటికిమాటికి చీదఱ బడుచుండెను. అధికారులమనోభావముల నెఱింగియుండు భానుగుప్తుఁడు సమయమున కనువగురీతిఁ దనముఖమునకు శోకరస మలఁదుకొని యుండెను. భూమకునిగతి యేమైనదియుఁ వారికిఁ దెలియలేదు. అందుచే వారు దిగులొందుచుండిరి. మిహిరగులుఁడు నిప్పులు ద్రొక్కినకోఁతివలె నెగిరిపడుచు "ఆ గాడిద నారాయణశర్మ యెక్కడ? వాఁడింకను రాలేదు. క్రుంకులిడుటకు గుంటను ద్రవ్వుచున్నాఁడా? ఎందుల కింతజాగు?" అని గర్జించెను.

"స్నానానంతరము సంధ్యాద్యనుష్ఠానములు తీర్చుకొనునాచార మాతని కున్నది. అదియే కారణమైయుండును. దేవరవా రాతని మన్నింపనగును" అని భానుగుప్తుఁడు మనవిచేసికొనెను.

"ఆసంగతి నాకుఁ దెలియకపోలేదు. త్వరగరమ్మని నేనాతనికి నొక్కి చెప్పితిని. కాని యాతఁడు 'కావలయునని జాగుచేయునట్లున్నది. కానిమ్ము. వానికి స్వామిభక్తి రుచి చూపెదను" అని మిహిరగులుఁ డనెను.

ఇంతలో నారాయణశర్మకూడ వచ్చెను. కుశాగ్రబుద్ధియగు నాతఁ డంతలోఁ బరిస్థితుల గ్రహించెను. "హరహర! మహాదేవ! మహాదేవ! అహాహా! ప్రాణమానములు ధారవోసి రాజులను గొలిచినందుల కైనఫల మిదియా! 'రాజులకుఁ జేసినకొలువు, పీనుఁగునకుఁ జేసినశృంగారము' అని చెప్పినవాఁడు మహాత్ముఁడు సుమా! సరోవరమునుండి చక్కగా నిచటికే వచ్చియుండిన, వీరు నన్నుఁ బొగడియుండెడివారు. భూమకునిగతి యేమైనదో నగరమంతయుఁ విచారించుచు, నా పాపిష్ఠులు బాలాదిత్యయశోధర్మల వెదకుచుండుటచే వీరు నన్ను ద్రోహిగా నెంచుచున్నారు... ఔనౌను. నే నిట్టిశిక్ష కర్హుఁడను. ఒకటికి రెండుమార్లు అనుభవమునకు వచ్చియుండియుఁ బుద్ధితెచ్చుకొనక, రాజకార్య మనిన నింకను నాసొంతపనిగాఁ జూచుకొనుచున్నాను. అట్లుండియుఁ రావలసిన నిష్ఠురము వచ్చుచున్నది. అబ్బబ్బ! దుర్భరము! అకటకటా! దుస్సహము" అని యాబాడబుఁడు వలవల నేడువసాగెను.

"నారాయణశర్మా! వినుమనుము. మిహిరగులుఁడు వినోదార్థ మట్టు లనెను. భూమకునివిషయమై నీవంత శ్రద్ధతీసికొనియుండఁగా నీసేవను భూషింపక దూషింతుమా! అంతతోఁ బోనిమ్ము. మన మిప్పు డేమి చేయవలయును? నీయభిప్రాయమున కింతవనుక వేఁచియున్నాము" అని తోరమాణుఁ డడిగెను.

"ఏలినవారికి యోచన చెప్పఁగలయంతవాఁడనా నేను? కాని, ఆవీ డంతయు వెదకి యేదైన శవము పడియున్న దేమో కనుఁగొనుటయు, నా దుర్మార్గులున్నారుగదా బాలాదిత్యయశోధర్మలు, వారికొఱకై నగరమంతయు గాలించుటయుఁ గార్యకారులని నాయభిప్రాయము. మఱచితి. ఆమైదానము నకుఁ బోయినభటుఁ డేమి చెప్పినాఁడు? వాఁడు తిరిగి రాలేదా?" అని నారాయణశర్మ యనెను.

తోర:—వచ్చినాఁడు. అచట నొకపాడుబావిమాత్ర మున్నదఁట. దానినిండుగ మురికినీళ్లు, వాననీళ్లు నిండియున్నవఁట. ఇవితప్ప నచట మఱే మియుఁ గాననగుటలేదని చెప్పినాఁడు.

నారా:—ఆనూతిని వాఁడు వెదకినాఁడా?

తోర:—లేదు. దానినిండుగ బురద, చెత్తయున్నదఁట.

నారా:—అయిన నాపాడుబావిని బరిశోధించుట మంచిది. సామాన్యముగా నాబావియందుఁ బీనుఁగులను బారవేయుట జరుగుచుండును.

భాను:—అవును. శర్మయూహ సమంజసముగా నున్నది. ఇపుడు బాలాదిత్యునకు మగధరాజ్యమునందు నిలువ నీడలేకున్నది. ఎటుపోవుటకును వీలులేకున్నది. కాన మనముఖ్యపట్టణమగు నుజ్జయినియందే నక్కియుండినఁ దనయునికిని సంశయింపరని యిటకే వచ్చియుండును. కొచ్చెలియగు యశోధర్మకూడ వెంబడించియుండును. ఆడుచేఁ దలవనితలంపుగా భూమకుఁడు యశోధర్మబాలాదిత్యులతోఁ దలపడవలసియుండును. వారిద్దఱుకూడఁ గత్తిసాములందును, బాహుబలమునందును భూమకునితోఁ దులఁదూఁగెడివారు.

భానుగుప్తుని మాటలకు నారాయణశర్మ ప్రమోదమందెను. తనహృదయశల్యమగు భూమకుఁడు బూదిదయై యుండునని వినుటతోడనే, తానెక్కడనుండునదియుఁ గూడ మఱచి యాబ్రాహ్మణుఁడు "అవునవును. భూమకుఁడు చచ్చియుండును. భూమకుఁడు చచ్చియుండును. అందులకు సందియము లేదు." అని పలికెను. నారాయణశర్మ విపరీతవాక్యములు, ఘోరమాన మిహిరగులుఁ గోపాభీలముఖులఁ జేసెను. అప్రయత్నముగా వారిచేతులు మొలనుండుకత్తులపై వ్రాలెను. నారాయణశర్మ యంతలోఁ దెప్పిఱిల్లి తనతప్పిదము నెఱింగి "అయ్యో! అయ్యో! అట్టివాఁడు పోయెను. ఇఁక నాగతి యేమి? నన్నాదరించువారిఁక నెవ్వరున్నారు? వెలలేని కానుక లిఁక నాకెట్లు వచ్చును? అకటా! ఈనిర్భాగ్యునిఁ జేరఁదీసి యాదరించువారిఁక నెవ్వరున్నారు?" అని వాపోవ మొదలిడెను.

మిహిరగులుఁ డాతని గాంచి "ఓహో! నీవు మొత్తుకొనుచున్నావా? ఓరీ గాడిదా! నీవు సంతసించుచున్నావనుకొని, యీఖడ్గమునకు నీతలను బలి యొసఁగనుంటిని. ఇఁకమీఁద నీసంతససంతాపముల విశదముగాఁ దెలియఁ జేయుచుండుము. లేకున్నఁ దగినశాస్తి కాఁగలదు." అని కసరికొట్టెను.

నారా:—శివశివ! అదేమికర్మమో కాని, అందఱు నన్నుఁ దప్పు దలంచువారలే కదా! భూమకునివంటిసజ్జనుని నాజీవితమునందుఁ గని విని యెఱుంగను. అయ్యో! అట్టి నాయాత్మబాంధవునిగతికై నేను పలవించుచుండ, సంబరపడుచున్నాఁడనని దేవరవారు తలంచుచున్నారుగదా! నా సంతాపమును సంతోషమని భావించుచున్నారుగదా! 'మానవజీవితము మాయామయము' అనుపెద్దలనుడి పొల్లగునా? లేకున్న, నే నిట్టి ఘోరవిపత్తునకై కుందుచుండ, ఏలినవారు నేను ముదమందుచున్నాఁడనని తలంచుచున్నారుగదా!

తోర:—అయినదేమో యైనది. అంతతోఁ బోనిమ్ము. ఉజ్జయిని యందలి గృహముల నన్నింటిని గాలించి గొందఱుసైనికుల నియోగింపుము.

ఆపాడుబావిని ఎనుబదిమందిభటులు శోధించి, యందేమైన గానవచ్చిన నిచటికిఁ దేవలయును. బాలాదిత్యయశోధర్మలదురాగతములు రానురాను దుస్సహములగుచున్నవి. దైవమో, దయ్యమో ఆదురాత్ముల నాకంటఁబడిన ఆకసఁబడుచెట్టునకే యురితీసెదను.

మిహి:—మనకు వారు తప్పక చిక్కెదరు. ఆపలువలను జిత్రవధలఁ బెట్టెదను. సంహారరుద్రునకు బలియిచ్చెదను. ఆమహాదేవునివరము లందెదను. సంతోషాంబుధి నీఁదులాడెదను. అన్నట్లు మఱచితి. శర్మా! శివాలయప్రతిష్ఠాపనమునకుఁ దగునేర్పాటు లొనరింప నేమఱితిని. తండ్రీ! నిరర్థకుఁడగువిష్ణువు నగరముమధ్య చేరి నిక్కుచుండుటయు, సర్వశక్తిమయుఁడును విష్ణువునకు బద్ధద్వేషియు నగుమహాదేవుఁడు నగరమున మూలమూలల నక్కియుండుటయుఁ జూడ, మనకు సిగ్గుకాదా? మహాదేవునిఁ ద్వరగా స్వస్థానమునకుఁ జేర్చి యాదరింపవలయును.

తోర.— (సగర్వముగా) కుమారా! నీవింతటినిపుణుఁడవని నే నెఱుంగను. రాజశాసనములు విజాతీయభావబద్ధములై యుండరాదని, యెన్నియో మారులు చెప్పియుంటిని. ప్రభువగువాఁడు నిరంతరాయపరిపాలనార్థము ప్రజాసాంప్రదాయముల నవలంబింపవలయును. ఇందులకే సుమా హైందవీయమగు 'మహారాజ' బిరుదమును నేను దాల్చియుండుట! ఇపుడు నీవు శివాలయనిర్మాణమునకుఁ బూనితి నంటివి. అటులే కానిమ్ము. గుప్తరాజులధనరాసులు ఆలయనిర్మాణమున కుపయోగపడుఁగాక! ఇఁక నీసంగతి నటుండనిమ్ము. భూమకుఁ డేగలిఁబట్టినదియు మనకింతవఱకుఁ దెలియదుకదా! భానుగుప్తా! ఆయెనుబదిమందిభటులతో నీవు మైదానమునకుఁ బోవలయును. మిహిరగులనారాయణశర్మల దీసికొని పట్టణము వెదకుటకు నేను బోయెదను.

రాజాజ్ఞను మౌళిఁదాల్చి భానుగుప్తుఁ డాభటబృందముతో నా మైదానమునకుఁబోయెను. తోరమానమిహిరగులనారాయణశర్మలు బాలాదిత్య

యశోధర్ములను వెదకుటకై బయలుదేఱిరి. ఇంతలోఁ బెక్కురు హూణులు వారలఁ గలిసికొనిరి. తోరమానుఁడు వారిలోఁ గొందఱను దేశమంతయుం వెదకుటకుఁ బంపెను. మిగిలినవారిని వెంటనిడుకొని యాతఁ డింటిని, మూలమూలలు వెదకుచుండెను. కడపఁ దన కాప్తులగుహూణులయిద్దఱుగూడ నాతఁడు వదలుటలేదు. చూడచూడ వారిప్రయత్నములన్నియుం సముద్రమునఁ జక్కెర కలిపినతీరున నిరుపయోగము లగుచుండెను. సముద్రగుప్తచిహ్నితములగు నాణెము లుంచుకొనినవారలను, సముద్రగుప్తపరములగుపద్యముల నుంచుకొనువారలను, హూణులు కఠినముగా శిక్షించుచుండిరి. కొరడాప్రేటుల కెందరో నిర్భాగ్యులు గురియగుచుండిరి. ఎందఱో సజ్జనులు ద్రోహులుగాఁ బ్రకటింపఁబడి సంతతము హూణచారులయడుగులకు మడుగులొత్తవలసినవారైరి. ఎప్పుడో యొకప్పుడు తెలిసియో తెలియకయో నారాయణశర్మను నొప్పించినవా రెవ్వరుగాని వానికోఱలనుండి తప్పించుకొనలేకుండిరి. రఘుపతియను పౌరపుంగవుఁ డొకఁడు గలఁడు. ఆతనికుమార్తెను దనకిచ్చి వివాహమొనరింప, నారాయణశర్మ యాతని నడిగియుండెను. కాని యాకుటిలకర్మునకుఁ దనతనయ నియ్య నాతం డియ్యకొనినవాఁడు కాఁడు. ప్రాఁతపగ తీర్చుకొనుటకు నారాయణశర్మ కిపుడు వీలుకలిగెను. స్కందగుప్తునిపాలనమున 'జయజయమహారాజా! జయజయమహారాజా!' అని రఘుపతి సంబరముతో నఱచుచుండుటను, అనేకమారులు తాను చెవులార వినియుంటిననియు, నాతఁడు గుప్తపక్షపాతియై హూణులయెడఁ గుట్రలు పన్నుచున్నాఁడనియు, లేనిపోనికథలు కల్పించి యాసజ్జనుని జావమోదించెను. నిజముగా రఘుపతియింట విద్రోహకరమగువస్తు వేమియుం దొరకలేదు. కాని యాతనికి దూరబంధువగు మూఁడేండ్లబిడ్డ మెడదండలో సముద్రగుప్తరూపముద్రితమగు బంగారునాణె మున్నదను సాకుపెట్టి, యానేరములను దండ్రిని గుమార్తెను ఆరవల్లిపర్వతములకుఁ బంపునట్లు శిక్ష విధించిరి. నిరుపమరాజభక్తి సముపేతుఁడగు నారాయణశర్మకు వారియాస్తిని బహూకరించిరి.

ఆపరిశోధన మిట్లు సాగిపోవుచుండెను. భద్రబాహుఁడనుధనాధిక జైనుఁ డొకయెడ మిగుల శ్రద్ధతోఁ దనవృషభమున కుపచార మొనరించుచుండెను. నారాయణశర్మ యాతనిని మిహిరగులునకుఁ జూపెను. మిహిరగులనారాయణశర్మలు వానికడకుఁ బోయిరి. మిహిరగులునికనులనుండి నిప్పుకలు రాలుచుండెను. ఆవృషభము పురికిఁ జెంగటనుండునడవుల మేయుచుండఁగా నొకపులి దానిపైఁ బడెను. కాని యాపశువు మెడపై గాయమొంది తప్పించుకొని పరుగెత్తెను. ఆగాయపుబాధ దానికి దుర్భరమై యుండెను. ఇప్పుడు భద్రబాహు వాగాయమునకుఁ గట్టుకట్టి చికిత్స చేయుచుండెను. ఆ జైనుఁడు ఎద్దుమూఁపు దట్టుచుఁ గరుణ యుట్టిపడునట్లు "అయ్యో! ఈ దిక్కులేనిజంతు వెంతగా బాధపడుచున్నది! అయ్యో! పాపము. ఓవృషభమా! నీబాధ కొంతయేని సంతసమున నే ననుభవింతునుగదా! కాని యిది యెట్లు సాధ్యము? ఓజంతురాజమా! వెఱఁగుందకుము. ఇచటిజీవితమే యట్టిది. కష్టసాంద్రమైనది. దుఃఖదుర్భరమైనది. జైనభగవానుఁడు సెలవిచ్చినవిధమున జీవుఁడు మట్టిలోనికమ్మరిపురుఁగువలె విషయములకు నిర్లిప్తుఁడై ద్వంద్వాతీతుఁడై యుండుట శ్రేయము. ఓదైవమా! ఇప్పుడు మిహిరగులుఁ డాజంతువైద్యశాలకుఁ జిల్లిగవ్వనైన నిచ్చుటలేదుగదా! ధార్మికపౌరధనసాహాయ్యమున నాధర్మవైద్యశాల సుస్థాపితమై సాగుచున్నది. అట్లుండియు నాకఠినాత్ముఁ డాధర్మశాల యుండఁగూడదని శాసించినాఁడుగదా! ఓభగవానుఁడా! ఈ యన్యాయమున కేమనుకొనవలయు? ఔనౌను. నాకుఁ దెలివిలేదు. జీవహింసకువ్విళ్లూరుమిహిరగులుఁడు, జీవరక్షణ కుద్యోగించునా?" అని తలంచుకొనుచు నేలతో తిరిగిచూచెను. మిహిరగులనారాయణశర్మలు వికారముగా నవ్వుచుఁ దన్ను డాయుచుండుటను గాంచెను. భద్రబాహువుముఖము వివర్ణమయ్యెను. దుఃఖాంధకార మాతనిహృదయాకాశము నావరించి, యాతనిచేత నాప్రపంచమును విస్మృతిఁ జొనరించెను. కటికరక్కసుఁ డగుమిహిరగులునివలన నాతఁడు

కీడు శంకించెను. కాని యంతలో నాతఁడు గుండె దిటవుపఱచుకొని, కాను న్నది కాకమానదని తెగించి, పశువున కుపచార మొనరింపసాగెను.

మిహిరగులుఁ డాతని సమీపించి "ఏమోయి నీసంగతి? ఎద్దుకు దెబ్బ తగిలినదని నీకు మతిచెడినదా? అంత వంతయేల? దానిచావువలన నీవు చెడఁ బోవుగదా!" అని హెచ్చరించుకొని, వికటముగా నవ్వ మొదలిడెను.

నారాయణశర్మ యాతనిమాటల నందుకొని "దేవా! వీని కింకను బశువులున్నవి, మహావీరునిక్షుద్రవాక్యములవలననో, బుద్ధునిపాడుబోధలవల ననో, ఈతఁ డింత జాలిగుండెవాఁ డైయుండును. తుచ్ఛమగు నొకగొడ్డు బాధను జూచి బావురుమని యేడువ నామహావీరుఁడు తనశిష్యుల కుపదే శించియుండును. ఇట్టి మూఢు లట్టికుమానాగురుని మానవాతీతుఁడని పొగడు చుందురు. ఎంతచిత్రమో చూచితిరా?" అని నవ్వసాగెను.

ఆతనియసంగతవర్తనమునకు భద్రబాహువు కుపితుఁడై "ఓరీ నీచాత్మా! నోరు మూయుము. ఓరీ నరాధమా! నీవు బ్రాహ్మణకులపాంసనుఁడవు. నీవంటి కుజనసంయోగముచే నెట్టిపావనకులమైనఁ గళంకము పాలై పోవును. పైశాచిక మత మెద్దియైన నీకుచితమైయుండుఁగాని, నీయట్టిచండాలునకు మతెట్టి మతము తగదు." అని నారాయణశర్మను జీవాట్లుపెట్టి, మిహిరగులునివైపు నకుఁ దిరిగి వినయాంజలియై "రాజశేఖరా! ఈగొడ్డువిలువను జూచి, నేను దీని నుపచరించుటలేదు; ఈదిక్కులేనిజీవ మొందుబాధ నాకు వేదనఁగలి గించుచున్నది. దేవా! దీనియాత్మకు మనయాత్మకు నెట్టిభేదములేదు. ఏమో! మఱుజన్మమున మనమును దానివలె నుండఁగూడదా?" అని విన్నవించెను.

మిహి:—దానికి బాధ దేనివలన?

భద్ర:—ఇటు చూడుడు. పాపము. ఈజీవి పులికాటుచే బాధనొందు చున్నది. కాని మనమేమిచేయఁగలము? ఇట్టిపశువులుతప్ప నాపులికిమాత్ర మాహారము మఱెక్కడ దొరకును? పాపము. ఈయెద్దుకూడ దానివలన జావ నుండెను.

ఆజైనుఁ డాయెద్దుమెడపైని పుండునకుఁ గట్టియుండుకట్టును విప్పెను. అప్పుడప్పుడే యాగాయము చెక్కుకట్టుచుండెను. జైనుఁ డాగాయమువంకఁ గరుణార్ద్రోత్కటములగు చూపులఁ బఱపుచుండెను. ఉన్నట్టుండి మిహిరగులుఁడు వికటాట్టహాస మొనరించుచు "ఓరిభద్రబాహూ! ఈగొడ్డుసేవ చేయుచు సంతోషించుచుండుము. దీనికేకాదు. అన్నింటిని సేవించుచుండుము" అని యఱచి, తటాలున నొఱనుండి తరవారి నూడఁబెఱికి యాగాయముపై గ్రుచ్చెను. ఆవృషభము వేదనాభరమున అంకెలువేయుచు గంతులిడసాగెను. ఆపుండునుండి జొటజొట నెత్తురుబొట్టులు క్రిందఁబడుచుండెను.

ఆదృశ్యావలోకనమున మిహిరగులుఁ డానందతరంగితాంతరంగుఁ డయ్యెను. ఆతనియుత్సాహ మతిశయించెను. ఆఖడ్గముతోడనే యాతం డచట నిలిచియుండు పశువులన్నింటిని గాయపఱుప మొదలిడెను. పశువులన్నియు బాధనోర్వఁజాలక అంకెలువేయుచుండ, మిహిరగులుఁడు వెఱ్ఱికేకలువేయుచు వానియంబారావముల ననుగమించుచుండెను. స్వామికంటె మఱి నాలుగాకు లెక్కువనేర్చిన సేవకుఁడు నారాయణశర్మకూడ, నాతనివెంట గంతులిడుచుఁ బాటకుఁ బల్లవి పాడుచుండెను.

ఈరాక్షసకృత్యములు జైనుని నివ్వెఱపాటుగొల్పెను. ఆతని మేను మొద్దువాఱిపోయెను. కాని యాతఁడు మఱుక్షణమునఁ బ్రజ్ఞవడసి యాదుష్టశీలుని చెంతకుఁ బోయి "ఓరాజకుమారా! నోరులేని యీజీవముల దయావిహీనుఁడవై సదమద మొనరించుటకంటె, నాకత్తితో నాతల నుత్తరించి యీపాడుప్రపంచమునుండి నన్ను గెంటివేయుము" అని వేఁడుకొనెను.

మిహిరగులుఁడు క్రోధావిష్టుఁడై కన్నులెఱ్ఱచేసి "ఓరిగాడిదా! నోరు మూయుము! మూయుము నోరు! ఏమీ? మాకడ్డుపాడెదవా? ఓరీ! ఎవఁడురా అక్కడ? ఈవదరుబోఁతు మాకెదురాడుచున్నాఁడు. వీనిని బంధించి ఆరవల్లి పర్వతములఁ ద్రోసిరండు." అని యాజ్ఞ చేసెను.

హూణభటు లాతని ద్రాళ్ళఁ గట్టివైచిరి. ఆదిక్కుమాలినపశువులవేదనలను మిహిరగులుఁడు, నాతనికుమానాగురువు నారాయణశర్మయుఁ గన్నులపండువుగఁ గాంచుచుండిరి. విపరీతమగువారికోరిక తీరినవెనుక, వారుపోయి వేఱొకయెడ నుండుదోరమానుని గలిసికొనిరి. అంతట వారందఱు రాజద్రోహులగు బాలాదిత్యయశోధర్మలకొఱకై యింటింటిని వెదకిరి. కాని నిరపరాధుల దండించుటయు, సజ్జనులఁ బ్రవాసమంపుటయు, దటస్థుల ననుమానించి ద్రోహులని ప్రకటించుటయుఁ దప్ప, మఱెట్టియుపయోగము కలుగలేదు.

ఈవిధమున నన్వేషణము తుదముట్టెను. అందఱును నగరునకుఁ దిరిగి వచ్చుచుండిరి. ఇంతలో హూణభటుఁ డొకఁడు "మాలెఁతమాధవికుటీరమును రోయలేదు" అని యఱచెను.

"అవును. మాలయింటి నెవరు డాయుదురు?" అని నారాయణశర్మ బదులిడెను.

మిహి:—నీవును నేనును ఆమాలయింటిని గాలించవలయును.

నారా:—దేవరవారు వినోదమున కట్లనుచున్నారు కాఁబోలు. అగ్రజన్ముఁడగు నేను మాలయింటిలో దూరవలయునని దేవరవారియభిప్రాయమా! అయిన నాకు నరకప్రాప్తి తప్పదు.

మిహి:—ఇప్పటికిఁ దప్పినట్లా? రమ్ము. నీవు రావలయును.

నారా:—దేవా! త్రాఁడు తెగునంతవఱకు లాగఁగూడదు.

ఆమాటలకు మిహిరగులుఁ డుగ్రుఁడై "గాడిదా! మాకు మాఱు పలికెదవా?" అని గద్దించెను.

నారా:—దేవా! నాయగ్రజన్మను గమనింపుఁడు. మాలయింటిని డాసినయెడల నేను భ్రష్టుఁడనగుదును. దేవరవారుకూడఁ బతితులయ్యెదరు.

మిహి:—ఊడుమునకేల యూరిపెత్తనము? దారితీయుము.

నారాయణశర్మ తికమకలాడుచుండెను. కాని యంతలో నాతఁడు సమయస్ఫూర్తివహించి "దేవా! ఒక మనవి. గుత్తరాజులు కులీనులమని గర్వం

చుచుందురు. వారు ప్రాణముకంటె మానము నెక్కుడుగా గణించుచుందురు. ఎన్నఁడుగాని వారు పంచములపంచలఁ జేరరు. ఈమాలయింటిలో వారిని వెదకియు నుపయోగము లేదు. అగ్రజన్ముఁడనగు నే నాయింటికిఁ బోకుండఁ దప్పించుకొనుటకై యిట్లనుచున్నానని దేవరవారు తలంపకుఁడు. అజీర్ణకుటీరాన్వేషణము నిరుపయోగమని నాయంతరాత్మ బోధించుచున్నది" అని పలికెను.

తోర:—ఆబాడబునిమాట నిజము. సాధారణముగ గుప్తవంశీయులు మాలయింటఁ దలఁదాఁచుకొనునంతటి నీచకార్యమున కొడిగట్టరు. కాన నా పంచమాంగనయింటిని రోయుటవలనఁ గాలహరణము, వృథాప్రయాసతప్ప, వేఱుప్రయోజన ముండఁజాలదు.

కడకు వా రాకుటీరమార్గణమును విరమించుకొనిరి. ఉదయమునుండియుఁ దారొనరించిన విశ్వప్రయత్నము లన్నియు వెల్లిఁగిలిపిన చింతపండై నందులకు నాశాభంగమొంది, వారు నగరికిఁ దిరిగిపోయిరి.



# అయిదవతరంగము.

## వికారదృశ్యము.

ఆయేనుబదిమందిభటులతో భానుగుప్తుఁడు పాడుబావికడకుఁబోయెను. ఆబావియందంతయు ముఱికినీరు, చెత్త నిండియుండెను. మబ్బువిడిచినయెండ చుఱచుఱ మనుచుండెను. ఆయెండలో నూయిలోనికి దిగి యొడలంతయు ముఱికిచేసికొనుటకు, భటు లెవ్వరును సమ్మతింపకుండిరి. ఆబావియందుఁ బీనుఁగుండిన నయ్యది పైకిఁ దేలకపోదనియుఁ, గాన నాకూపమును గాలించుటవలని యుపయోగము లేదనియు సాకులుచెప్పి తప్పించుకొనఁ జూచుచుండిరి. ఇట్టికుంటిసమాధానములు చెప్పెడివారికి నమ్మకముగానున్నను, వినెడి వారికిమాత్రము విశ్వాసార్హములై యుండఁజాలవు. భానుగుప్తుఁడు వారి మాటలఁ జెవులఁ జొనుపక, తోరమానునియాజ్ఞను దప్పక పాలింపవలయునని కట్టడిచేసెను. అంతఁ గొందఱు భటులా బావినుండి నీటిని దోడిపోయసాగిరి. మఱికొందఱు బావిలోనికి దిగి పూడికనుదీసి బుట్టలనింపుచుండ, పైనుండు వారు చేఁద్రాళ్లతో వానినిఁ బైకి లాగుకొనుచుండిరి. రానురాను పని చుఱుకుగ జరుగసాగెను. కాని, ఎంతనీరు తోడుచున్నను, ఎంతపూడిక తీయుచున్నను, ముఱికినీరు, బురద, చెత్తతప్ప మఱేమియుఁ గానవచ్చుట లేదు. భటులకు విసుఁగెత్తుచుండెను. ఇంతలో నొకఁడు తనపాఱకు నేదియో వస్తువు తగులుకొనినదని యఱచెను. తోడనే యందఱచటికి మూఁగిరి. ఆవస్తు వొక మానవమస్తకమని వారంతలో గ్రహించిరి. ఈసంగతి నిముసములోఁ బైనుండు వారికిఁ జేరెను. ఆశిర మేనిర్భాగ్యుదో యెఱుఁగఁ గోరి, భానుగుప్తుఁడు గబగబ బావిలోనికి దిగెను. ఆశిరము బురదచే నిండియుండెను. భానుగుప్తుఁ

దద్దానిని రెండుమూఁడుకడవలనీటిచేఁ గడిగించెను. ఆశిరము నంతయు గుర్తించిరి. ఇంతకు నయ్యది వీరకేసరి భూమకునిశిరము! సైనికులందఱు విభ్రమాశ్చర్య సంతాపములకుఁ జిక్కి ఱాతిబొమ్మలవలె నిలిచిపోయిరి. హాహాకారములచే వారు తమపరితాపమును వెల్లడించుచుండిరి. ఆశవమును బావినుండితీసి పైకిఁ జేర్పఁ నాజ్ఞ చేసి, భానుగుప్తుఁడు పైకెక్కివచ్చెను. అన్వేషణవశమునఁ బరాయత్తచిత్తులై యుండినసైనికు లాఘోరాకారము నంతగాఁ గనిపించిచూచిన వారుగారు. ఆపాడుపీనుఁగును జూచి యేవగించుకొనుభానుగుప్తునిఁ గాంచి, వారుగూడ నసహ్యపడసాగిరి. ఇంతకుఁ గావలసినపని కావలయుఁగదా! ఆశవమును వారు పైకిఁ జేర్చిరి. భానుగుప్తుఁ డద్దాని శుభ్రముగాఁ గడిగించి, యొకపాడెఁగట్టించి, దానిపై నాపీనుఁగును బరుండబెట్టించెను. స్థూలమై పటిష్ఠమై యుండు నామహాబలరాక్షసునికాయ మిప్పుడు నీటినానుఁడుచే నుబికి విపరీతమై భయముగొలుపుచుండెను. ఆశవముపై గుడ్డకప్పిరి. 'మఱేమైన బావియందున్న దేమో చూచుఁడు' అని భానుగుప్తుఁ డనెను. 'మఱేమియుఁ గానవచ్చుటలేదు' అని సైనికులు బదులాడిరి. ఆపాడె నెత్తుకొని యందఱును గలిసిరావలయునని భానుగుప్తుఁ డాజ్ఞ చేసెను.

వారు బయలుదేఱనుండునంతలో నారాయణశర్మ తమకడకు వచ్చుచుండుటను వారు గాంచిరి. ఇప్పటికే చాలప్రొద్దెక్కెను. దినమణి నడుమింటి కెక్కుచుండెను. కాని యిచట నీవిషయము మిహిరగులాదులకుఁ దెలియదు. అందుచే భానుగుప్తునిఁ దొందఱపఱచుటకై, మిహిరగులుఁడు నారాయణశర్మ నాతనికడకుఁ దఱిమెను. అమహానుభావుఁడు నారాయణశర్మ భానుగుప్తుని జూచి 'ఏమైనఁ బ్రయోజనముండినదా?' అని ప్రశ్నించెను. 'వీరకేసరి భూమకునిశవ మందుండినది' అని యాతఁడు మెల్లఁగాఁ జెప్పెను. నారాయణశర్మ తనవీనులను దాను నమ్మఁజాలకపోయెను. అసంగతి విశ్వసనీయమని యాతనికిఁ దోఁచకుండెను. 'అసంభవము. అది యసంభవము' అని యాతం డనెను.

'అసంభవమైన,నదిగో యాశవమును జూడుము. అతఁడు భూమకుఁడు కానియెడల నాతల్లికి నేను దప్పినవాఁడను' అని భానుగుప్తుఁడనెను. ఆశవముపై గుడ్డకప్పియుంచుటఁజేసి యింతటినుండియు నారాయణశర్మ దానిని గనిపెంచి చూడలేదు. ఇప్పు డాతఁ డొకగంతులో నాశవముకడకుఁ బోయి ముఖముపైనుండు వలువను దొలఁగించి, భూమకుఁ డౌనా కాదా యని తెప్పలల్లార్పక చూడసాగెను. ఒకనిముస మట్లు చూచి "ఔనౌను. వాఁడే వీఁడు. ఆవీకసింపఁడే యాతఁడు. అబ్బా! ఎంతగా నుబికియున్న దీపీనుఁగు! కొండంతపెద్దదిగా నుబ్బియు, నీపాడుకాయము పిగులకున్నది! ఎప్పటికంటె నీకుత్సితునిశరీర మిప్పు డినుమడిగా నున్నది!" అని యాతఁడనుకొని, భానుగుప్తునివైపునకుఁ దిరిగి "భానుగుప్తా! ఈసంగతిని మహారాజుతో మనవిచేయుటకై మనమిరువురము ముందుగాఁ బోవుదము. శవమును మోసికొని వీరు మన వెనుక రాఁగలరు" అని చెప్పెను. నారాయణశర్మభానుగుప్తులు ముందు నడువసాగిరి. వారు చూపుమఱుఁగగునంతవఱకు సైనికు లూరకుండి, అనంతర మిట్లు మాట్లాడుకొనిరి.

"కనివినియెఱుఁగనివంచకశిఖామణులు పోవుచున్నారు చూచితివా? ఆహా! కపటనటనములకు వారందెవేసిన చేతులుగదా!"

"అవును. అట్లని మనము వారివిషయమై నోరుజాఱరాదు. నారాయణశర్మ ప్రస్తావము నెత్తి యాకృపణు నధిక్షేపించుట కొఱవితోఁ దలగోఁకికొనుటవంటిదిగదా!"

"నీమాట నిజము. మున్నె నేకదా. పౌరుఁ డెవఁడో నారాయణశర్మ కాయాసముగాఁ బలికెననుమిష వెట్టి రాజకుమారుఁ డామందభాగ్యునిఁ గొరడావ్రేటులఁ గొట్టించెను!"

"యువరాజును ఆబ్రాహ్మణబ్రువుఁడును బద్ధానురాగులైయున్నారు. అతఁడు యువరాజును దనచేతి కీలుబొమ్మగాఁ జేసికొనియున్నాఁడు. శివాలయప్రతిష్ఠకై యోజనలు జరుగుచున్నవి. ఆనీచబ్రాహ్మణుఁడు యువరాజుతోఁ

"దేవరవారు శివభక్తశిఖామణులు. లెక్కకురాని జీవరాసుల నామహాదేవునకుఁ దామ బలియిచ్చుటయే దీనికి నిదర్శనము" అని చమత్కారముగాఁ జెప్పి యాతనికి నమ్మకము కలిగించినాఁడు. కాని యాబ్రాహ్మణచండాలుఁడు తేనె పూసినతరవారి. యువరాజు నాతఁడు లోలోన ద్వేషించుచున్నాఁడు."

"సరిసరి. ఈనాఁటికీముచ్చటలు చాలును. ఎండయెక్కుచున్నది. మనమోఁత చాలబరువైనది. రండు. మనపనికిఁ బోదము."

"ఈపీనుఁగెంత పెద్దదిరా! అబ్బా! నేను దీనిని మోయుటటుండ నిది మాత్రము నన్ను మోయఁగలదనుటకు సందియములేదు. కాని రాజబంధువులందఱిలో నీశవము సుజనునిదని నాకించుక యాప్యాయతగా నున్నది."

"ఔనౌను. ఈభూమకునకు నారాయణశర్మ యట్టియధములపైకంటె, సైనికులపై నెక్కుడభిమానము."

"నిజమాడితివి. అదిన మిప్పటికిఁగూడ మఱపునకువచ్చుటలేదు. నేనును నాసహచరులును, పాటలీపుత్త్రదండయాత్త్రయందు భూమకుని వెంబడించితిమి. అప్పుడీనారాయణశర్మకూడ మావెంటవచ్చెను. మేము బాలాదిత్యుని రోయుచుంటిమి. అడవియందు దాతఁడు వేఁటకుక్కలతో మృగయావినోదమునఁ దవిలియుండెను. మేమాతని నెదిరించితిమి. రాజభక్తికిఁ బెట్టనిపేరగు నాతనిభటులు తమప్రభువును గాపాడుటకుఁ దమప్రాణములఁ దృణప్రాయముగా నెంచి నడుముకట్టి నిలిచిరి. పోరు ప్రారంభమయ్యెను. స్వామిసంరక్షణమున వారు తమజీవముల ధారవోయసాగిరి. వారితెగువకు, నిష్కళంకరాజభక్తికి భూమకుఁడు విభ్రాంతుఁడై యట్లే నిలిచిపోయెను. ఇంతలో బాలాదిత్యుఁడు తప్పించుకొని కాలికి బుద్ధిచెప్ప మొదలిడెను. ప్రాణములఱచేతఁ బట్టుకొని పాఱిపోవు బాలాదిత్యునిఁజూపుచు నారాయణశర్మ 'అదిగో! అదిగో! పాఱిపోవుచున్నాఁడు. బాలాదిత్యుఁడు పాఱిపోవుచున్నాఁడు. పట్టుకొనుఁడు. పట్టుకొనుఁడు' అని యఱచెను. భూమకుఁ డందులకు రౌద్రుఁడై 'ఛీఛీ! స్వామిద్రోహీ! అమాగధులు చావనైనఁ జచ్చుట కియ్యకొనిరి కాని

నీవలె స్వామిద్రోహమునకుఁ బూనలేదు. నీవా! ఘాతుకుఁడవు. కృతఘ్నుఁడవు. ఇరువదేండ్లుసాకి సంతరించిన స్వామికి ద్రోహము చేయుచున్నాఁడవు. ప్రాణభీతిచేఁ బరుగెత్తు పూర్వప్రభువును వెన్నాఁడి యింత మొందింపనుండు ధూర్తుఁడవు. నరాధముఁడవు' అని కసరికొట్టెను. నాఁటఁగోలె నారాయణశర్మ కాతఁ డనినఁ గిట్టదు."

"అహాహా! అట్టి సజ్జనశిఖామణిసైతము మిత్తివాతఁబడెనుగదా! ఎంత చిత్రము! రండురండు! అట్టిసుజనునిశవమును మన మిప్పుడు మోయవలయును."

ఆశవమును పంతులప్రకారము మోయవలయునని వారనుకొనిరి. అంత వారిలోఁ గొందఱు పాడెనెత్తికొని నడువసాగిరి. మిగిలినవారు వారి ననుస రించిరి.

నారాయణశర్మభానుగుప్తులు వారికి ముందుపోవుచుండిరి. కొంతదూరము వారు మౌనము దాల్చియుండి, సైనికులచూపులకు మఱుఁగైనతోడనే నారాయణశర్మ "భానూ! భూమకునిమరణమునుగూర్చి నీయభిప్రాయ మేమి? ఇది ఘోరవిపత్తుకదా?" అనెను.

భాను:—అవును. కాని నీవుమాత్రము ప్రభుసమక్షమున దొంగయేడ్పు లేడ్చితి వనుకొనియెద. ఇంచుకంతలో నీతల యెగిరిపోనుండెను. అంతలో యుక్తియుక్తముగ మాటలుత్రిప్పి, నీతలను గాపాడుకొంటివి.

నారా:—హూణులకరములు కత్తివ్రేటులకనిన గంతులిడుచుండును. కాని భగవదనుగ్రహమునఁ గత్తివ్రేటులకు మిన్నయగుకలముపోటులు నాకుఁ దెలియును. బుద్ధిబలములేనినాఁడు బాహుబలము శోభిల్లునా? బాహుశక్తికిఁ దోడు దైవము హూణులకు బుద్ధిబలము నొసంగియుండిన, వారు భూమినంతయుం బూదిచేసి బుంగలకెత్తియుండరా? బుద్ధిహీనులగుహూణులను బాలురైన శాసింపఁజాలుదురు.

భాను:—ఆబాలురు నీయట్టివారు.

నారా:—నీయట్టివారేల కాఁగూడదు?

భాను:—కానేరదు. ఆకార్యమునకు నేను దగను. అంతశ్శక్తి నాకు లేదు. దాన భూమకునకు నాకు నెక్కడిసామ్యము?

నారా:—వాఁడు పశుప్రాయుఁడు; దుర్జనుఁడు. నేను స్తోత్రపాఠములఁ జదువునప్పుడెల్ల నాతఁడు "నీవు మాయావివి. నీతినియమవిహీనుఁడవు. విరోధింద కాఁగొడుగుబట్టు నరాధముఁడవు. నీవు భూసురకులనాశకుఁడవు" అనినన్నుఁదిట్టి నానోరు మూయుచుండును. అట్టి లోకవిరోధిమరణమునకు నేను సంతసించుటలో విస్మయమేమికలదు?

భాను:—నాకుమాత్రము సంతసముగాక మఱేమికలదు? మగధవందయాత్రసమయమున నేను భూమకునితో నుంటిని. అప్పు డాతఁడు నన్ను "'ద్రోహీ! దుష్టుఁడా!' అని దూషింపనిదిన మొక్కటియైనలేదు. భానుగుప్తుఁడను పేరుతోఁ జపలచిత్తుఁడవైయుండు నిన్నుఁజూచి, సంతతసన్మార్గసంచారియగుభానుఁడుసైతము సిగ్గొందుచుండును. ఆభానుఁ డెట్లు భగవంతుఁడు కాఁడో అట్లే నీవును గుప్తాన్వయుఁడవుగావు. నిన్నొకరాజ్యమున కధిపతిఁగాఁ జేయుటకుబదులు నామాటసాగినయెడల దాపుననుండుతరువున నురితీసెదను" అని యాతఁడు నన్ను దూషించుచుండెను. అట్టిపాతకుఁడు చచ్చెనన, నాకు మాత్రము సంతసముకాదా! భూమకుఁడో రాక్షసబలుఁడు. అట్టికట్టఁడితో నాయట్టివాఁడు కయ్యమునకుఁ గాలుత్రవ్వుట మంచికగునా? కాని వాని కాఱుకూఁతలన్నింటిని మ్రింగి యూరకుండెడివాఁడను. కడ కిప్పు డాపీడ వదలినది.

నారా:—ఓహో! ఇల్లలుకఁగనే పండుగయైనదా? ఈతోరమానుఁడు భూమకునికంటె నుపద్రవకరుఁడు. భూమకుఁడు ముక్కుమొగముచూడక మాటలాడుచుండును. వట్టియమాయకుఁడు. కాని యీతోరమానుఁడుమాత్ర మట్టివాఁడుకాఁడు. ఇతఁడు కుత్సితుఁడు. వానికి మనసత్త బాగుగాఁదెలియును. మనవలన నుపయోగముండునంత కాలము, ఆతఁడు మనలఁ జేరఁదీయుచుండును. మనతోఁ బనితీఱినవెనుక నాతఁడు మనల నురులఁ దగిలించునని

నాయభిప్రాయము. అతఁడు నోరుమిగులక సర్వజనసమ్మతముగా మాటలాడు కపటి. పామును చావనీయఁడు, బడితెను విఱుఁగనీయఁడు.

భాను:—అవును, అతఁ డట్టివాఁడే. అట్టిఖలునకు నీతలఁదఱుగుట సులభము. కాని, వారు నాజీవములఁ గొనవలయుననిన, ముందు తమప్రాణములఁ గోల్పోవలయును. ఏలయన, నేను గుప్తవంశీయుఁడను; మీఁదు మిక్కిలి రాజ్యాధికులెని.

నారా:—సరి. నీకంతయిష్టముగానుండినచో, సత్యాసత్యముల నిప్పుడే పరీక్షింతము.

భాను:—నీపుణ్యము! నీపుణ్యము! ఊరకుండుము. అట్టి తెలివిమాలిన పనికిమాత్రము పూనకుము. తెలియునా? నీవు నాయెడ ద్రోహ మొనరించిన యెడల, నీపాతకమును నేనుగూడ వల్లించెదను.

నారా:—ఏమాట నమ్మువారెవరు? దిక్కుమాలిన బసుగుబాళుఁ డొకఁడు రాజద్రోహ మొనరించెనన్న నమ్ముదురా? లేక పరాజయప్రభువంశీయుఁడును, పరాక్రమధనుఁడు నగురాజకుమారుఁడు కుట్రగావించెననిన నమ్ముదురా?

భానుగుప్తునియుల్లము జల్లనెను. "అవును. సత్యము సత్యము. నీవు నాయెడ ద్రోహ మొనరింపవని నాకుఁ దెలియును. మనము చిరమిత్త్రులము గదా!" అని యాతం డనెను.

నారా:—దారికి రమ్ము. నాప్రాముఖ్యము నీకిప్పుడు తెలిసినదికదా? ఈసంగతు లటుంచుము. ఇచట నీవు వెదకుచుండునపుడు, మేము నగరమున వెదకుచుంటిమి. అప్పుడు మాయానందమునకు మేరలేకుండెను. బాలాదిత్య యశోధర్మల రోయుటగదా మాపని! కాని, దాన నాకు వచ్చెడిదేమికలదు? వైరశుద్ధిపైఁ గన్నిడి దానికిఁ దగుయత్నము లొనరించుచుంటిని. నాశత్త్రువులలో ముఖ్యులు రఘుపతియు భద్రబాహువు నున్నారుగదా! వారిపైఁ గసి తీర్చుకొంటిని.

భాను:—రఘుపతిపై నీచలమునకుఁ గారణము?

నారా:—ఇంకను నీకుఁ దెలియదా! వినుము. ఈరఘుపతికిఁ ద్రిలోక మోహిని యగుతనయ యున్నది.

భాను:—సరస్వతియా!

నారా:—అవును. ఆమోహనాంగియే.

భాను:—ఆమె యచ్చరలమించిన మించుబోఁడియనుటకు సందియము లేదు.

నారా.—అవును. ఆలేమ సర్వాంగసుందరి. ఆసుదతి సౌందర్య సౌభాగ్యసౌశీల్యములకు నేను ముగ్ధుఁడనైతిని. ఆమెను జేపట్ట నిశ్చయించి, యామె మిహిరగులుని కంటఁబడకుండఁ జేసితిని. అంతట రఘుపతికి నాకోరికఁ దెలిపితిని.

భాను.—రఘుపతి యేమనెను? నీ ప్రస్తావము నాతఁడు నిరసించి యుండు ననుకొనియెద!

నారా.—ఆమూర్ఖు డట్లే ప్రవర్తించినాఁడు. తానును దనకుమారయుం నన్ను మనసార సేవగించుకొనుచుందురనియు, నేను ప్రాఁతపందికొక్కునని యు, కలఁపరానిగులువననియుం, పనికిమాలినవానినీఁడననియు, ఏమేమియో నిర్భయముగా నన్ను వారు తిట్టినారు. అంతటఁబోక, నావలె దొంగయేదుప్పు లేదుప్పు మేఁకవన్నెపులికి—ప్రాఁకులాడు మగపురుగునకుఁ దనపుత్రి నిచ్చుట కంటె, నామె చచ్చినను దనకానందమని యాతులువ కూసినాఁడు.

భాను.—నాయనా! సరియైనది. రఘుపతిస్వభావము నాకింతకు ముందే తెలియును. కుక్కకాటుకు చెప్పుదెబ్బ పెట్టినాఁడు!

నారా.—(కోపముతో) ఏమీ! నాపరాభవమునకు నీవు చంక లెగుర వైచుచున్నావా! ఓయిమిత్రమా! నీప్రాణములు నాచేతనున్నవి. నిన్నురికంబమునకుఁ బంపఁగలశక్తి నాకదనుండ నీకింతలో మఱుపునకు వచ్చినట్టున్నది.

భానుగుప్తుఁ డాతనిపరుషవాక్యములకు నొచ్చుకొనెను. "ఆహా! ఇట్టి నరాధమునియనుఁగులకు మడుఁగులొత్తవలసివచ్చెఁగా" అని తలంచుకొని "శర్మా! పదునేడేండ్లజవ్వనికిని, ఏఁబదియేండ్లముసలికి నెక్కుడియాడని నాయభిప్రాయము. వేఱుగాఁ దలంచకుము" అనెను.

నారా.—ఓహో! అందుల కభ్యంతర మేమికలదు? ఎనుబదియేండ్ల పండుముసలి, ఎనిమిదేండ్లపిల్లను బెండ్లాడినాఁడు. దీని కేమనియెదవు?

భాను.—ఏమనియెదనా! ఆదిక్కులేనిబాలిక త్వరలో ముండమోయుననియెద.

నారా:—అందఱుమాత్రము? అకాలమృత్యువువాతఁ బడవలయు నని నాకేమి కోరికయా? సౌందర్యమున, శౌర్యమున, చాతుర్యమున యువకులలో నేను దీటుగానా? అదియునుగాక, ఆమోహనాంగికదనుండు ధనరాసుల ననుభవించుభాగ్యము నాకుఁ గలుగలేదుకదా యని నాకుఁ జాల కొఱఁతగా నున్నది.

భాను:—సరి. పగఁదీర్చుకొనుటకు నీవేమిచేసితివి?

నారా.—నేనా! ఆరఘుపతి స్కాందగుప్తునికాలమున 'జయజయ మహారాజా! జయజయ సార్వభౌమా!' అని జయజయధ్వానము లొనరించియుండెను. వానికి దూరబంధువగు మూఁడేండ్లమూఁడుబిడ్డ మెడయందు సముద్రగుప్తచిహ్నితమగు నాణెముండెను. ఇందులకాతని రాజద్రోహిఁగాఁ బ్రకటించి, బాధింపఁజేసితిని. వానియాస్తియంతయు దివాణమున కధీనమొనరించితిని. వానిని, వానికుమారుని అరవల్లిపర్వతములకుఁ బ్రవాసముంపితిని.

భాను:—అయ్యో! పాపము!

నారా:—ఇప్పుడు వారికి నారాయణశర్మప్రభావము బాగుగా విదితమైనది. సరస్వతిని మిహిరగులుకంటబెట్టి యామెకుఁ దగినరీతి పాఠముఁ గఱపితిని. ఇఁక నే నాముసలితొత్తుకొడుకు రఘుపతిపైనిపగను మనసారఁ దీర్చుకొనఁగలను. ఓయీ భానుగుప్తా! ఈరహస్యమును గాపాడవలయును.

వినుము. రఘుపతి యిష్టానిష్టములతో నాకుఁ బనిలేదు. ఆమెను నేనే పెండ్లాడఁ దీరెదను. ఉజ్జయినియం దిట్టిబలవద్వివాహమునకుఁ 'గడంగినయెడల, పౌరుల యం దలజడి ప్రబలును. ఇందుచే, ఆరవల్లిపర్వతములయం దా కార్యమొనరించుట శ్రేయమని తలంచితిని. అచటనైన నొరులచెవిఁబడదు.

భానుగుప్తుఁ డాకృపణుని రాక్షసకృత్యములకు బిత్తరవోయెను. అతని మానస మాందోళపడసాగెను. "శర్మా! శర్మా! భద్రము! భద్రము! ఇట్టి సాహసకార్యమునకు ముందొకటిరెండుసారులు యోజింపుము. ఆకన్నియ మానవతి. ఆసాధ్వి శుభచారిత్ర. ఈసంగతి నెఱింగి వర్తింపుము. ఆతన్వంగిని నేనుగూడ నొకప్పుడు మోహించియుంటినిగాని, నీవలె మోటుగ నడచు కొనలేను. ఇట్టి పాడుపనికిఁ బూనుటకుముందు మేలుకొనుము" అని మాట లాతనినోటినుండి యప్రయత్నముగా వెలువడెను.

భానుగుప్తుని విపరీతభాషణములు నారాయణశర్మను విభ్రాంతునొనర్చెను. కొలంకదల్పక యాతం డటులే నిలిచిపోయెను. కాని యాతం డంతలో జడత మాని, "ఏల భద్రపడవలయును? దండనమునకు జడసియా? నీవు పొరపడుచున్నావు. ఇందులకు మిహిరగులుఁడు నన్ను శిక్షించుటకుమారు పంస్తుతింపఁగలఁడు. మాసదుద్యమములఁ దలంచుకొని, మేము సంతోషాంబుధి నోలలాడుచుందుము. ఇఁక నీవు భీతినందు నరకవేదనలా? వానియందు నాకు విశ్వాసము లేదు. అవి నన్నేమి చేయఁగలవు?" అనెను.

భాను:—అవును. ఇంత శిలాకఠినహృదయుఁడ వగుటఁజేసియే, నీ బ్రాహ్మణమిత్రులు నిన్నుఁ గటికవాఁడని దూషించుచుందురు. దీన నాశ్చర్యమేమున్నది?

నారా:—వారెంతైనఁ దిట్టఁగలరు. కాని నారాయణశర్మయనిన వారికి సింహస్వప్నము. నన్ను 'నరకమునఁ బడియుండఁదగిన పాపిష్ఠుఁడవు' అని ముందువెనుక లాలోచింపక దూషించినయావదరుబోతు విప్రసన్న్యాసి పొందినదుర్మరణమును నీవు కన్నులారఁ గాంచియుంటివిగదా!

భాను.—చూచితిని. నీ వామహాత్ముని మిహిరగులుచే హత్యగావించినాఁడవు.

నారా:—హత్య యనుచున్నావా? అటులే యనుకొనుము. కాని యాసంయమిమాత్రము తన చెయిదమునకుఁ జింతనొందక, తనభాగ్యమునకు మురిసెను.

భాను.—ఆసంగతి నాకుఁ దెలియదుకాని; యాయతీంద్రుఁడు వీరమరణమొందెనని చెప్పఁగలను. ఆవీతరాగునిఁ జితిపైఁ గూర్చుండఁబెట్టిరి. చితికి నిప్పువెట్టిరి. అప్పు డామహాత్ముఁడు భక్తిమోదాత్ముఁడై యంజలిగీలించి యంబరమువంకఁ జూచుచు "మహాదేవా! దేవా! దేవా! మహాదేవా! నన్నుద్ధరింపుము" అని ప్రార్థించి, నిన్నుఁజూచి "శర్మగారూ! కృతజ్ఞుఁడను. ఆత్మహత్య కవకాశమిచ్చి నన్ను వైతరణియందుఁ ద్రోయక, పాపపంకిలమగు నీపాపప్రపంచమునుండి పవిత్రమగుపుణ్యలోకమునకు నన్నుఁ బంపుచున్నందులకు, శర్మగారూ! కృతజ్ఞతాభివందనములు. కాని యిఁకమీఁద బ్రాహ్మణధర్మ మనుష్ఠించి మ్లేచ్ఛజనార్హములగు నిట్టిహేయవర్తనములు మానునట్లు మాటనిండు. నా కాత్మశాంతి యగును" అని బతిమాలి సానందహృదయమున సస్మితాననుఁడై యట్లే యామండుచున్న చితిపై నంతయుం ముగియువఱకుఁ గూర్చుండియుండెను.

నారా:—అవునవును. వానిమరణము మిహిరగులునకు మోదావహమై యుండలేదు. మానవులను గాల్చుటలోఁ దనకు వేడుక లేదనియుం, ఇఁకపై వేఁడి బల్లెములఁ బొడిచి చంపుటయే తన కానందమని యుం నాతఁ డనినాఁడు.

భాను:—మాయిరువుర కెంతయో వ్యత్యాసమున్నది. అత్రిదండి పావనుఁడు. అట్టిమహాత్ముఁడు నిలువున నీఱగుటఁ గాంచి నామానస ముడికినది. అంతయుఁ గర్మఫలానుభవము. అయిన రఘుపతియుం నాతని తనయామణియుం దేశభ్రష్టులు గావింపఁబడిరా?

నారా:—అవును. ఆపెద్దమ్మ భద్రబాహువుకూడ.

ఖాను:—(ఆశ్చర్యముతో) భద్రబాహువా! అతనికిఁగూడ నట్టిగతి పట్టినదా!

నారా—అవును. వాఁడు నాకడ కొకనాఁడువచ్చి యిట్లు కాఱు కూఁతలఱచెను. "ఓయీశర్మా! తొలిపుట్టువున నీవు బంకమట్టిముద్దవై యుందువు. ఏలయన, కుమ్మరిచేతి బంకమట్టిముద్ద క్షణక్షణమునకు రూపమున మాఱ్పొందునట్లు, కాలానుసారముగ నీవును నీస్వామిమనస్సున కెక్కుటకు వేషముల మార్చుచుందువు. స్వరూపసంరక్షణ మొనరించుసలిలమును తడిబంకమట్టి త్రోసిపుచ్చువిధమున నీవును మానవున కావశ్యకములగు నాత్మగౌరవమును, హృదయకారుణ్యమును విడనాడి, నీతి నియమ విహీనుఁడవై వర్తించుచుందువు." వానిపరుషవాక్యముల నింతవఱకు మ్రింగియుంటిని. ఈనాఁటికి సమయమబ్బెను. ఆభద్రబాహువును, వృషభసేవన మొనరించువానిని మిహిరగులునకుఁ జూపితిని. అతఁ డాపశువులనన్నింటి గాయపఱచి, భద్రబాహువును శోకసాగరమునముంచి, తాను వినోదవీచికలఁ దేలియాడెను. అప్పుడే భద్రబాహువునుసైతము బంధించి, దేశభ్రష్టుఁ గావించితిమి. నారాయణశర్మ జోలికి వచ్చినవారిగతి యంతయు నిట్టిదే యని నమ్ముము. ఎప్పుడో యొకప్పుడు నేను వారల మట్టుపెట్టికాని వదలను. ఎవరైననేమి; నాజోలికివచ్చుట కొఱవితోఁ దలగోఁకికొనుటవంటిదని తలంపుము.

ఖానుగుప్తుఁ డేమియుఁ బలుకలేదు. "ఆహా! ఈనారాయణశర్మ కిరాతుఁడుగా నున్నాఁడు. ఈదుష్టుని క్రూరకార్యములు కొనకెక్కినవి. నేను గుప్తరాజన్యులయెడఁ జేసినద్రోహమునకు ఫలముగ నిప్పుడీనరాధమునిచేతఁ జిక్కియున్నవాఁడనై మిణుకరించుచున్నాను. ఈపీడను త్వరలో వదలించుకొనవలయును. ఆహా! అకన్యాశిరోమణి, ఆసాధ్వి సరస్వతి పడునిడుమ లెట్టివో కదా! కోఁతిచేతిసుమదామమువలె, క్రూరకుటిలకర్ముఁడును న్యాయాన్యాయవిచక్షణవిహీనుఁడు నగునారాయణశర్మ తనసౌఖ్యదేవత కామదిరాక్షిమానమును బలియియ్యకపోఁడు" అని యాతఁ డనుకొనుచు నడచుచుండెను.

అంతలో నాతని కొకయోజన తట్టెను. "శర్మా! నగరాన్వేషణము ముగిసినదా?" అని యడిగెను. "అయినది. మాధవికుటీరమును మాత్రము తోయలేదు. కులాభిజాత్యసంపన్నుఁడని గర్వించు బాలాదిత్యుఁడు మాలయింటఁ దలదాఁచుకొనునా?" అని నారాయణశర్మ యుత్తరమిచ్చెను. భానుగుప్తుని నయనముల నాశాజ్యోతి ప్రజ్వరిల్లెను. "పరమేశ్వరా! నీమహిమ యనంతము. సంస్తుతిపాత్రము" అని భానుగుప్తుఁ డనుకొనెను. కాని నారాయణశర్మ భాను గుప్తునియానందమును గమనింపలేదు.

వారు రాజప్రాసాదమును డాసిరి. ఇద్దఱును మౌనముదాల్చి పోసాగిరి. అప్పుడు వారివదనముల లేనిగాంభీర్యభావ మొకటి పొడకట్టుచుండెను.



# ఆ అవతరంగము.

## సోదరునిశోకము.

సాధారణముగఁ దోరమానమిహిరగులులు పట్టమధ్యాహ్నమున నిద్రించుచుందురు. కాని యీదినముమాత్రము వారు వాడుకఁ దప్పించి మేలుకొని యుండిరి. వారివదనములు దురంతపరితాపముద్రితములై యుండెను. పరస్పరవిరుద్ధములగు మూఁడుభావములు మిహిరగులునిఁ బెనవైచుకొని యుండెను. పినతండ్రి యదృశ్యమునకైన విచారమును, పినతండ్రి హంతకునిపై నుదయించిన ప్రతీకారేచ్ఛయు, భూమకాన్వేషణార్థము చనినభానుగుప్తుఁ డొనరించు నాలస్యమునకైన యాతురమును మూర్తులఁ దాల్చి యాతని హృదయరంగమునఁ జిందులు ద్రొక్కుచుండెను. తోరమానుఁడుకూడ సోదరవియోగవ్యథాఖిన్నుఁడై యుండెను. దీర్ఘనిశ్వాసవ్యాకులముఖునిఁ దోరమాను నిదివఱ కెవ్వరును జూడలేదు. ఆతని మానసవీథియందు భూమకుని విగ్రహామే పొడకట్టుచుండెను. ఆతఁడుకూడ మిహిరగులునిపగిది వివిధభావములకు లోనై యుండెను. భూమకుఁడు మరలఁ దనకన్నులకుఁ బండువుచేయునో చేయఁడో యని యాతఁడు తహతహపడుచుండెను.

నారాయణశర్మభానుగుప్తులు తమకంటఁబడినతోడనే, రాజభటు లా సంగతిని తమప్రభువులకు విన్నవించిరి. వారు వచ్చుటతోడనే తమకడకుఁ బంప నాజ్ఞచేసి, సమాచారమును శీఘ్రముగా వినుతలంపున హజారమునకువచ్చి కూర్చుండిరి. రాజనగరును డాయుకొలఁది, నారాయణశర్మభానుగుప్తుల హృదయములు తటతటలాడుచుండెను. అట్టిఘోరవార్తను వారు తమదొర కెట్లు విన్నవింపఁగలరు! మహారాజతోరమాణుఁడును, యువరాజుమిహిరగులుఁ

డును, కృపాదూరులగుటఁ బ్రసిద్ధము. వీరు మిక్కిలి తమచెవులకు సొగ సుగనుండువార్తలఁ దెచ్చువారిని వారు ముక్కలుముక్కలుగాఁ దఱుగుట సామాన్యము. కాన, నాయసంగతకార్యము నొకనిపై నెట్ట మఱియొకఁడు చూచుచుండెను. నారాయణశర్మ భానుగుప్తులు తమకుఁ దాము తప్పించుకొనఁ జూచుచుండిరి. ఆమాయావు లాతరుణమున స్వకార్యసాధనముకొఱ కొం డొరులపై మిథ్యానురాగములఁ బ్రకటించుచుండిరి. "ప్రియమిత్రమా! నారాయణశర్మా! నీచాతుర్యమును జూపుటకు సమయము వచ్చినది. ఈదారు ణోదంతమును యుక్తియుక్తముగ వారి కెఱుకపఱచుశక్తి నీకుఁ గలదని నాకుఁ దెలియును" అని భానుగుప్తుఁ డాతని చెవిలోఁ జెప్పెను.

నారా:—నడుమ నాకేమి సంబంధ మున్నది? అపుని నియోగింపఁ బడనవాఁడవు నీవుగదా! సాధించినవాఁడవు నీవు. ముందుగా నీసమాచారమును వారిచెవులవైచి, నీకు వచ్చెడుపూలహారములను నేనేల వేయించుకోవలయును! నిజముగా నా కట్టియాస లేదుసుమా!

భాను.—నారాయణశర్మా! ఒక్కమాట వినుము. మనదొరలు కటిక రక్కసులని నీకు విదితముకదా! ఇట్టి విషాదవార్తలఁ గొనివచ్చువారల నుఱి మాడుట వారికాచారమనికూడ నీకుఁ దెలియునుగదా! స్కందగుప్తునిచేఁ బరాజితుఁడైవచ్చి, యాసంగతిని మనరాజున కెఱింగించిన, ఆనిర్భాగ్యుఁడు హూణసేనాని కట్టిగతిపట్టినదియు నీకింతలో మఱపువచ్చెనా?

నారా.—రాలేదు. కాని ప్రియమిత్రమా! నీకువలెనే, నాకుఁగూడ నాప్రాణములు తీపులని నీకు మఱుపునకు వచ్చెనా?

భాను.—అందులకుఁగాదు. మనరాజులకు నీవాంతరంగికమిత్రుఁడవు. నాబోఁటి సామంతరాజులకంటె, నీబోటివారలకు వారికడ నెక్కువ చనవుం డును. చొరవకూడ నుండును.

నారా.—బాగున్నది! అష్టదరిద్రుఁడగు నాయట్టి బానిసీఁ డెక్కడ? సకలైశ్వర్యసంపన్నుఁడగు నీయట్టి సామంతరా జెక్కడ? దోషము దంతిక

కొక్కడిపోలిక ! నీప్రాణములఁ గోలియెత్తిన, రాజభక్తిపరులగు నీప్రజలు తిరుగఁబాటొనరింతురేమో యని హూణులు వెనుదీయుదురు. వెనుకముందు యోజించికాని వారు నీజోలికిరారు. కాని, నావిషయ మట్టిదికాదు. నా ప్రాణము లొకవక్కయైనఁ జేయవు. నేను చచ్చిన నెవరికేమి నష్టము? ఎప్పుడనుకొనిన నప్పుడు వారు నాప్రాణముల హరించుట కెట్టియాటంకము లేదు.

భాను.—కాని, యొక్కవిషయము యోజింపవైతివి. నన్నుఁ జంపిన యెడల, హూణులకు మఱియొకరాష్ట్రము హస్తగతమగును. వారిసిరి పెంపెక్కఁగలదు. కాని, నిన్నుఁజంపిన వారికిఁ జిల్లిగవ్వయైన దొరకదు. అది యటుండ, నిన్ను హతమార్చిన, నీయట్టి కపటశిఖామణి వారికి మఱెక్కడ లభించును !

వారిరువురును దంబాచారులు. ఈవిధమున వారెన్నఁడుగాని భాషించి యెఱుఁగరు. ఇప్పుడు వారు తమ ప్రభావములకుఁ బేదఱికము గల్పించుకొనఁ జూచుచుండిరి. భానుగుప్తుఁడు నారాయశర్మయెడఁ దనవాక్చాతుర్యమ్ము నంతయుఁ వినియోగించుచుండెనుగాని; ఇట్టివిషయములకుఁ బట్టుకొమ్మయగు నారాయణశర్మమాత్ర మాతని మాయాజాలమునఁ జిక్కక తప్పించుకొనుచుండెను.

కడ కాతఁడు భానుగుప్తుని ప్రార్థనాదికములకు విసుఁగొంది "భానుగుప్తా! కడుపారఁ గన్నబిడ్డను తల్లి మోయక విధిలేదు. తనబిడ్డను మోయుంటకుఁ దన కిష్టములేదని చెప్పి, ఇతరులభుజములపై కెక్కించుట యెట్లుండునో యించుక యోజింపుము. ఈసంగతిఁ గనినవి నీవు. కాన, మోయవలసినవాఁడవు నీవు. అన్యులపై మోపుట న్యాయముగాదు." అనెను.

నారాయణశర్మ నిఁక బలవంతపెట్టుటవలన నుపయోగములేదని భానుగుప్తుఁడు గ్రహించెను. మూఁడనుండుకీడునకై యాతఁడు వ్యాకులుఁడై యుండెను. మనస్సు మనస్సులో లేనందున వారిద్ద ఱడుగులో నడుగువై చూచుకొనుచు

నడచుచుండిరి. ఇంతలో వారు ద్వారమును జూచిరి. తోడనే ద్వారపాలుఁ డొకఁడు వారిఁ జేరి "మీరు త్వరలో రావలయునని దొరగారియాజ్ఞ. మహారాజును యువరాజును హజారమునం దున్నారు. మీకై నిరీక్షించుచున్నారు" అని చెప్పెను.

"సార్వభౌమునానతి మీఱుదుమా?" అని వారు నడక వడిని హెచ్చించిరి. కాని యప్రయత్నముగ వారికాళ్లు వెనుకాడుచుండెను. వారు ద్వారమును దాఁటి లోనికిఁ బోవుటతోడనే, తోరమానమిహిరగులులు వారి కంటఁబడిరి. నారాయణశర్మ భానుగుప్తులహృదయములు భయకంపితములయ్యెను.

"ఏమి సమాచారము?" అను ప్రశ్నావాక్యము తండ్రికుమారుల కంఠములనుండి యొకేమారు వెలువడెను.

"సార్వభౌమా! ఈదాసుని మన్నింపవలయును. అయ్యో! మహారాజా! వీరసింహుఁడు, రాజచంద్రుఁడు, వదాన్యశేఖరుఁడు, సత్యసంధుఁడు, మనభూమకుఁడు మనకు లేఁడు" అని భానుగుప్తుఁడు గద్గదస్వరమునఁ బలికెను.

తోరమానునకు నెత్తిపైఁ బిడుగుపడినటు లయ్యెను. "ఏమీ! ఏమీ! నాతమ్ముఁడు లేఁడా? నాతమ్ముఁడు మరణించెనా? అయ్యో! అయ్యో!" అని యాతఁడు శోకోపహతుఁడై సింహపీఠినుండి క్రిందికి దొర్లి మూర్ఛమునిఁగెను.

భానుగుప్తునిపలుకులు మిహిరగులునిచెవులకు ములుకులవలె నుండెను. జనకుని యవస్థ కాతఁడు మతి గోల్పోయెను. అతఁడు కాలాంతకునివలె మండిపడుచుండెను. "కుమతులారా! మహనీయుఁడు నాజనకుఁడు క్రిందఁబడియుండ, మొద్దులవలె నిలువఁబడియున్నారా?" అని యాతఁడు గర్జించుచు లేచి, నారాయణశర్మ భానుగుప్తులఁ దన్నుపైఁ దన్ను యెగసి యెగసి తన్నెను. వారు నోరెత్తక దెబ్బలు తినిరి. అంత వారు మూవురు తోరమానుని లేవదీసి.

సింహాపీఠినుంచి, శీతలోదకముల నాతనివదనమునఁ జల్లి సేదదీర్చిరి. తోరమాణుఁడు మెల్లగా తెప్పలు విచ్చెను. అతని శోకము ముంచుకొనివచ్చెను. "అయ్యో! భూమకా! అయ్యో! నాసోదరా! అయ్యో! భూమకా! నీయగ్రజుని వీడిపోయితివా! అక్కటకటా! నాతమ్ముఁడు కాలగతినొందినాఁడు. అయ్యో! మాయయ్య మరణించినాఁడు. అహహా! నాతల్లి పరమపదించినది. ఇప్పుడు నాతమ్ముఁడు చచ్చినాఁడు. నేనుమాత్ర మింకను జావక నడపీనుఁగునై యున్నాను." అని యాతఁడు పలవించుచుండెను. కన్నీ రాతని నేత్రములనుండి కాల్వలుగట్టి పాఱుచుండెను.

తోరమానునివిలాపములకు వారిహృదయములు చలించుచుండెను. ఇంతకుముం దెన్నఁడుకాని యాతఁ డావిధముగా శోకసాగరమున మునుఁకలు వేయుటను వారు చూచి యెఱుఁగరు. గుప్తహూణసంగ్రామమున నాతం డొకప్పు డెనుబదివేలసైనికోత్తములఁ గోల్పోయి పరాజితుఁడయ్యెను. కాని యాతఁ డాపరాభవమును బూరికిఁగొనక 'ఇప్పటికిఁ బోయి, మఱువత్సరమున వత్తము' అనిమాత్ర మనెను. అంతటిధీరుఁడు తోరమానుఁ డిప్పుడు పసిఁగందువలెఁ గంటికిఁ గడవెడుగా నేడ్చుచుండెను.

తనతండ్రి పరిదేవనము నారయుంకొలఁది మిహిరగులుని యాగ్రహపిశాచము చెలరేఁగి, దానికిఁ గారకులగు నారాయణశర్మ భానుగుప్తులపైఁ బడెను. "ద్రోహులారా! దున్నలవలె నిలువఁబడి కన్నులుపుంచుపుగ నాజనకునిదుఃఖాలాపముల నాలకించుచున్నారలా!" అని యాతఁడు గర్జించుచు, నారాయణశర్మను గాలితో నొక్కతన్ను తన్నెను.

నారాయణశర్మ యాదెబ్బకు సంతసమున నుప్పొంగుచు "ఆహాహా! ఏమి నాయదృష్టము! ఇంతవఱకు నన్ను దన్నుటకు దేవరవా రనుగ్రహించినవారుగారు. నాభాగ్యమే భాగ్యము. ఈదినమే సుదినము" అని ప్రస్తుతింపసాగెను.

ఇచ్చకాలమారి యగు నారాయణశర్మ స్తుతివాక్యములకు మిహిరగులుఁ డుగ్రుఁడై పటపట పండ్లుగొఱుకుచు "అయిన, మిగిలియుండుతన్నులు తినుము" అని యాతని తెక్కుముక్కు యాడనీయక యొగిసియొగిసి తన్న సాగెను. పదద్వయములఁ బరిగ్రహించి, నారాయణశర్మభానుగుప్తులు కొలువుకూటమువదలి యావలఁబోయిరి.

ఘోరమానుఁడు కన్నులు తుడుచుకొనుచు "కుమారా! భూమకుఁ డెందుచే మరణించెను? ఆతనిశవ మెచ్చట?" అని యడిగెను.

"ఆ తెలివిమాలినకుంక లావిధము చెప్పలేదు. ఓరీశర్మా! ఓరీభానుగుప్తా! ఓరీగాడిదకొడుకులారా! ఎక్కడపోయితిరి?" అని మిహిరగులుం డఱచెను.

"చిత్తము. మహాప్రభో!" అని వారు వినయాంజలులై కొలువుకూటమునఁ బ్రవేశించిరి.

మిహి:—ఆగాగా! మాకు వార్తల నివేదించుట? శవము నెచటఁ గాంచితిరి? ఇపు డెచట నున్నది?

భాను:—సార్వభౌముఁడు సోదరమరణమునకై పలవించుటను మేము వినరాదని, దేవరవారు మమ్ముల నావలఁబో నాజ్ఞ చేసినందునఁ బోయితిమి.

మిహి:—పలుగాకీ! అధికప్రసంగము సేయకుము. సార్వభౌముని సంతాపవాక్యములు మీకు సంగీతారావములా యని ప్రశ్నించినందులకు, మొదలే నిజోదంతమును గప్పిపుచ్చఁజూచుచున్నారలా?

భానుగుప్తుఁ డందులకు వినమితస్వరమున "దేవా! దేనినిగాని కప్పిపుచ్చవలయునని నాతలంపుగాదు. బీడునందలి పాడుబావియందు భూమకుని శవము జూచితిమి. దానిని మోసికొని నాభటులు వెనుక వచ్చుచున్నారు" అని మనవిచేసెను.

మిహిరగులుఁడు క్రుద్ధుఁడై "నీభటులా? నీభటు లెవరోయి!" అని గద్దించెను.

భాను:—దేవరవా రనుగ్రహించి నాయధీనమున నుంచినభటులు.

భూమకునిశవముతో భటు లింతలో వచ్చి చేరిరి. వారిచూపులు విచారభరితములై యుండెను. వారు కొలువుకూటము ప్రవేశించి, పాడెను శవమును మహారాజుముందుంచి, చేతులంగట్టుకొని నిలుచఁబడిరి.

తోరమానుఁడు లేచి యాశవముపైని వలువను దీసెను. ఆదృశ్య మాతనికి దుస్సహమై యుండెను. "అయ్యో! అయ్యో! నాభూమకుఁడే! నా కూర్మితమ్ముఁడే! నాయనుఁగుసోదరుఁడే! సందియము లేదు. సందియము లేదు" అని యాతఁ డాక్రందన మొనరింపసాగెను. ఆతఁ డాపీనుఁగు నాలింగన మొనర్చుకొని యేడ్చుచు, ఉష్ణాశ్రుధారల నద్దాని కభిషేకము సేయుచుండెను. ఆశోకమయరంగమును జూడఁజాలక భటులహృదయములు బీటలువాఱుచుండెను. వారినేత్రగోళములు బాష్పవారిచే నిండిపోయెను. భానుగుప్త నారాయణశర్మలు కన్నులకు లేనినీరు తెచ్చుకొని, బావురుమని యేడ్చుచుఁ దోరమానునిదుఃఖారావముల ననుకరించుచుండిరి. మిహిరగులుఁ డొక్కఁడు మాత్రము తొణఁకక నిలిచియుండెను. ఆతఁడు కంటఁ దడిపెట్టలేదు; కాని భూమకాంతకునియెడఁ బ్రతీకారేచ్ఛమాత్ర మాతనియెదఁ దామరతంపర లగుచుండెను. ఆతఁడు భానుగుప్తనారాయణశర్మల దొంగయేడ్పుల గమనించి "మీరందఱు పొండు. సార్వభౌముని వీడిపొండు. తెలివిగలిగి బ్రదుకఁదలంచినయెడల, మీ రీదినము నగరునకు రాకుఁడు. నేను పిలుచువఱకు రాకుఁడు. ఒకగంటతాళి నారాయణశర్మమాత్ర మిచటికి రావలయును" అని యాజ్ఞ చేసెను. చపలచిత్తుఁడును, క్రూరకర్ముఁడు నగుమిహిరగులునిస్వభావము నెఱింగినవారందఱు, ఆతనినోట నామాట వచ్చుటయే తడవుగా నాచోటువాసి వెలికివచ్చిరి. భానుగుప్తుఁడు తనభటుల కానాఁడు విచ్చలవిడిగాఁ బోవ నాజ్ఞ చేసెను.

భటు లాతనిమాటలకు సంతసించిరి. వారు తిరిగిపోవుచు నీవిధమున భాషించుకొనుచుండిరి.

ఒకఁడు:—ఈముసలిరాజు సోదరునిమరణమునకై బావురుమనియేడ్చునని నేను కలనైనఁ దలంచియుండలేదు.

ఇంకొకఁడు:—నేనుమాత్రము? కాని యువరాజు కాలిబొమ్మవలె నిలిచియుండునని నేను భావించలేదు.

వేఱొకఁడు:—అన్నింటికంటెఁ జిత్రముఁ గంటిరా? అపుట్టుదొంగలు తమకొంప మునిఁగినట్లు విలపించినారు.

ఇప్పటికి వారు నగరువీడి చాలదూరము వచ్చియుండిరి. విశృంఖలావృత్తిమై యుండు భటులంద ఱాతనిమాటలకు దిక్కులు పిక్కటిల్లునట్లు నవ్విరి.

భానుగుప్తనారాయణశర్మలు నగరుబయటికివచ్చి నిలిచియుండిరి. నిరపాయముగ ప్రదేశముఁ జేరువఱకు, నోరుదెఱచుటకు వారికి దిటవు చాలకుండెను. మూఁగనాఁగేళ్లవలె వారు కాలుసాగించుచుండిరి. ఎంతయోదూరము వారిట్లు నడచిరి. "నిరంకుశులగు పాషాణరాజసేవనము నానాఁటికి దుర్భరమగుచున్నది. లేకున్న నీయువరాజు మనలఁ బ్రహరించుట నేమనుకోవలయు!" నని నారాయణశర్మ పలికెను.

భాను:—అది నీవిషయము. ఆతనిచే దెబ్బలు తినినది నీవుకదా!

నారాయణశర్మముఖము జేవురించెను. "ఓహో! అందులకు నీవు సంతసించుచున్నాఁడవా? నీకుఁగూడ దెబ్బలు కావలయునా? ఒక్కమాట చెప్పినఁ జాలును. నీకుఁగూడ బడితపూజ కాఁగలదు" అని నారాయణశర్మ బెదరించెను.

భానుగుప్తుఁ డిఁక వేళాకోళమును గట్టిపెట్టి "శర్మా! నీవంతటి కర్కశుఁడవు గావని నాకుఁ దెలియును. నిజమాడిన నిష్ఠురము సమాజము. నేను గూడ నీతో సమానముగఁ దన్నులుతింటిని సుమా!" అనెను.

నారాయణశర్మ శాంతుఁడై "అవును. అట్లనుము. నీకును మంగళహారతులైనవి. నాకంటె నీకే యెక్కువదెబ్బలు పడినవి" అనెను.

అపలింతులకు భానుగుప్తుఁ డొదుఁగబుచుచు "అటులే యనుకొనుము... ఇప్పుడు నీ కేమి పనియున్నది?" అని ప్రశ్నించెను.

నారా:—ఇంతలో మఱచితివా? ఒకగంటతాళి, కొలువుకూటమునకుఁ బోవలయును.

భాను:—ఔనౌను. మఱచితి. శర్మా! ఇంతకు నీయదృష్టము మంచిది.

నారా:—అదృష్టమా! నేఁడు యువరాజసందర్శనమునకుఁ బోవుట కంటె ముక్కుపట్టుకొని యొకసంవత్సరమైనను మూలఁగూర్చుండుట మంచి దని నాయభిప్రాయము.

భాను:—నిజము. ఇఁకఁ బోయివచ్చెద.

నారా:—నాకును సెలవు.

వారిద్ద ఱొకరినొకరు వీడి, చెరియొకదారిఁ బోయిరి. నారాయణ శర్మ వెనుకకుఁ దిరిగి రాజప్రాసాదమున కభిముఖుఁడై పోయెను. భానుగుప్తుం డొకరహస్యమార్గమునకుఁ దిరిగి, తన్నెవ్వరైనఁ జూచుచున్నారో యను శంకతో నడుగడుగునకు నలుదెసల బిక్కిరిచూపులఁ జూచుచుఁ బోవు చుండెను.

---

# ఏడవ తరంగము

## జీర్ణకుటీరము - ఆగంతుకుఁడు.

నాఁటియపరాహ్ణమున భానుగుప్తనారాయణశర్మలు భూమతునిశవముతో నగరునకుఁ బోవునపుడు, మాతంగిమాధవి, యుజ్జయినియందుఁ దన పనిఁ జూచుకొని యింటికిఁ దిరిగివచ్చుచుండెను. ఆమిడిరోయెండలో నంతగా నెవ్వరు నడచుటలేదు. తమ్మటపుధ్వని విని పంచమాంగన మాధవిరాకను గ్రహించి, ఆకొండలుకూడ బయటికిరా వెఱచుచుండిరి. ఇంతకుముందుకంటె మాధవిమొగము మిక్కిలి మార్పుచెందియుండెను. నిన్నటివఱకు విచారసాగరనిమగ్నయై యుండినమాధవి నేఁడు సంతోషాంబుధి నీఁదులాడుచున్నట్లగపడుచుండెను. కాని, కడకడలాడు నాసాధ్వి మొగము మేలిమిలో పరితాపరేఖామిళితమై యుండెను. ఈమూఁడేండ్లుగా నడచుచుండకకంటె నామె నేఁడు మఱింత చుఱుకుగాఁ గాలు సాగించుచుండెను. కారణము విదితము. ఇంటికడ నిన్నాళ్లుగాఁ దనకొఱకు వేఁచియుండువా రెవ్వరును లేరు. చీఁకటికోనయై పాడు వాఱియుండు నాజీర్ణకుటీరమును కౌముదీకాంతుల వెలిఁగించువా రెవ్వరును లేరు. కాన నామె సామాన్యముగా జనావాసములవెంగటనే తారాఁడుచుఁ గాలము గడపుచుండెను. కాని, యీదిన మామెకుటీరమున బాలాదిత్యుఁ డున్నాఁడు. బిడ్డకై పరుగిడు భారతమాతవలె, నతిత్వరితగతి మాధవి స్వకుటీరాభిముఖియై పోవుచుండెను.

దఱిలేనిసంతోషవారిధి మునకలిడుచు, మాధవి మైమఱచియుండెను. మైమఱచి యథారీతి తమ్మటమును గొట్టుటకూడ మానెను. దీర్ఘాలోచనానిమగ్నురాలగు నాకడజాతివనిత యప్రయత్నముగ నాస్థితులగుపౌరులను

దరిసి, వారిముక్తిమార్గమున కడ్డుతగులుచుండెను. ఆవీథియం దప్పుడు కొందఱు సైనికులు పోవుచుండిరి. అన్యమనస్కయగు నామె వారికిఁగూడ నవరోధము గల్గించుచుండెను. కడ కామె యొకసైనికునిపైఁబడెను. తోడనే యామె తనప్రమాదమునకు, తెలివిమాలినపనికి మ్రాన్పడి నిలిచెను. తాను తప్పెటఁగొట్టుట మానుటయుఁ, బతితయగు తాను సదాచారుల నెందఱనో సమీపించి పతితులఁజేసి తానుగూడ లేనిపాపమును మూటకట్టుకొనుటయు స్మరణకుఁ దెచ్చుకొని చింతించుచుండ నింతలో నాసైనికు లామెదృష్టి నాకర్షించిరి.

ఇరువదిమంది సైనికులు మూవురఖైదీలఁదీసికొని పోవుచుండిరి. ఆబంధితులముఖములు వసనాచ్ఛాదితములై యుండుటంజేసి వారిని గుర్తింప నశక్యమై యుండెను. వారి నెఱుంగుటకు మాధవికి వ్యవధి లేకుండెను. ఆమె ప్రమాదవశమునఁ దాఁకినసైనికుఁడు, ఆమె యంటరానిదని యెఱుంగుటతోడనే యాగ్రహోదగ్రుఁడై యామెచేతనుండు చీపురుకట్టను లాగుకొని యామెవీపుపైఁ దబదబ మోదెను. పాపము, మాధవి బాధ కోర్వఁజాలక పెద్దపెట్టున రోదన మొనరింపసాగెను. ఈదురాగతమునకు బంధితులలో నొకఁడు "అయ్యో! పాపము. అబల యెవ్వరో యేడ్చుచున్నది. ఆఁడుదాని పైకిఁ జేతినెత్తుధీరుఁ డెవఁడో?" అనెను. అంతల నాసైనికుఁడు కోపతామ్రాక్షుఁడై "ఆఁడుదికాదురా. చండాలినిరా!" అనెను. "చండాలినియా! చండాలినిమాత్రము ఆఁడుది కాదా? ఆమెకూడ మనవంటి మనుష్యప్రాణియే కదా! మఱుజన్మమున మనముకూడ నామెవలెఁ బుట్టుదుమేమో! కైన పరమాత్మ యేమి సెలవిచ్చినదియుఁ దెలియునా?" అని యాబంధితుఁడు పలికెను.

"మీదైనపరమాత్మను గంగలోఁ ద్రోయుము. ఆపాపిష్ఠుడైనునివలననే, వి. శ్రీ డారవల్లిపర్వతములఁ ద్రోయుట! తెలియునా!"

"ఏమి నీయజ్ఞానము! అయ్యో! పాపము." అని బంధితుఁడు భద్ర బాహువు పలికెను.

"ఓరీ! పాపపుణ్యములమూట నీఁట విప్పకుము. ఇఁక నీయధిక ప్రసంగములఁ గట్టిపెట్టి కాలుకదల్చుము."

వారు నడువసాగిరి. ఆబంధితు లెవరైయుందురా యని మాధవి యించుక గమనించెను. అందొక వనితావిగ్రహ మామెకుఁ బొడకట్టెను. ఆస్త్రీవ్యక్తిముఖము పూర్తిగాఁ గప్పఁబడియుండుటచేఁ గొంచెమైన నగపడుట లేదు. మూఁడవబంధితుఁ డాయువిద నానుకొని నడచుచుండెను. మందగమనమునఁ బోవునాతఁడు శోకభారమునఁ గ్రుంగియున్నట్లుండెను. మందభాగ్యులగు నాఖైదీలను మాధవి గుర్తించునంతలో వారామెచూపుకు మఱుఁగై పోయిరి. నాఁటిసంగతులఁ దలపోసికొనుచు నామె జీర్ణకుటీరమునకుఁ బోసాగెను.

కడపపై నడుఁగిడుటయే తడవుగా, మాధవి నాఁటివార్తలఁ (దనకుఁ దెలిసినంతవఱకు) బాలాదిత్యయశోధర్మలకు వినిపించెను. మార్గమధ్యమునఁ దనకైనపరాభవమును, బందీలయుందంతమునుగూడఁ జెప్పెను. అబలాజనమును సైతము ఆరవల్లిపర్వతములకుఁ బంపుచున్నారని విని, బాలాదిత్యుఁడు నొచ్చుకొనెను. "అకటా! నామాతృభూమియవస్థ యెంతకు వచ్చెను! నాతోఁబుట్టువుల మానధనము దక్కుటలేదుగదా! ఓభారతజననీ! అబలాజనములఁ జెఱుచు, నీహూణపిశాచముల నేమిచేసినను దోషముందునా?...వారిని దూషించు టెందులకు? ఇప్పుడుకూడ నుజ్జయినీనగరమునందు హూణపక్షపాతు లెందఱో కలరు. హూణులు ప్రజలయందలి వర్ణవిభేదముల రూపుమాపిరి. స్వకులధర్మములకుఁ గట్టువడి యుండువారలను, కడకు రాజబంధువులనియైనఁ బాటింపక, హూణులు శిక్షించుచున్నారు. మాధవీ! ఆతరుణి యెవ్వతెయైయుండునో ఊహాబలమునకైనఁ జెప్పఁగలవా!" అని బాలాదిత్యుఁ డడిగెను.

"అయ్యో! ఆవ్యక్తి యింతకును స్త్రీ యగునా కాదా యనికూడ నే నంతగాఁ జూడలేదు. వేషమునుబట్టిమాత్రము నేనూహించితిని. ఖైదీలకందఱకు ముసుఁగులుండెను. కాని వారిలో నొక్కనిమాత్రము నిర్ధారించనగును. అతఁడు భద్రబాహువు. దీనికిఁ సంశయములేదు."

"ఏమీ! భద్రబాహువా? ఓభద్రబాహూ! నీకుఁగూడ నారవల్లి పర్వత ప్రవాసప్రాప్తియా?"

యశో:—సంతాపమున కిది సమయముగాదు. ముందు మన మీనరకమునుండి బయటఁబడునుపాయముఁ జూచుట సమంజసము, నాత్మక్షేమంకరముగదా?

మాధవి:—అవును. అట్లుచేయుట మంచిది. సురక్షితస్థానము చేరుట మంచిది. కాని యాశత్రు[illegible]జృంభణ మణఁగనిండు. [illegible]ంతరము పోనగును.

బాలా:—నే నెచటికిఁ బోఁగలను? నన్నాదరించువా రెవరున్నారు? హూణుఁడు వీర్యశాలి. అతనిమిత్రులు పెక్కురు. సామంతులు పలువురు. సైనికులు కాలకింకరులు. శిక్షలు నరకప్రాయములు. మగధసామ్రాజ్యమునకు నేను రాజునైయుండియుఁ దలదాఁచుకొనుట కచటఁ దావు దొరకదు. ఇఁక నెక్కడికిఁ బోదును?

యశో:—ప్రభూ! మాఱువేసములఁ గానని దేశముల కేఁగి, యిచటి యిడుమలు తప్పించుకొని సుఖముగా జీవించుచుందుము. ఇదియే నాయుపదేశము. ఒకనెలతాళి వర్తకనౌక రేపొకటి ప్రోచినుండి కేరళపుత్రమునకుఁ బోనున్నది. కస్తూరి, ఇంగువ, మొకమాలులు, చిల్లరసామానులు మొదలగు వానిఁ దీసికొనిపోయి, వానికిమాఱుగ నారికేళములు, అల్లము, వాసనద్రవ్యములు మొదలగుసామానులు మార్చుకొని తిరిగివచ్చునఁట. ఉజ్జయినికివచ్చునపుడు మార్గమధ్యమున నే నీసంగతి వింటిని. ఆనౌకనెక్కి నీవు కేరళపుత్రమునకుఁ బోవుట మంచిదని నాయభిప్రాయము. ఆభూమి వసుమతి. ఆధారుణి కల్యాణాత్మకము. ఆరాజ్యము సౌందర్యనిలయము. ఆరాజ్యా

ధీశులు ధార్మికశేఖరులు. అందఱిప్రజలు సుచారిత్రులు. ఆమేదిని సర్వసస్య సంపన్నము. ఆసైన్యము పరాక్రమ మద్వితీయము. ఆవైశ్యులు చాతురీ ధురీణులు. ఆనావికులు సాహసులు. ఆరాజ్యవాణిజ్యము నలుమూలల వ్యాపించియున్నవి. అందలి నౌకానివహములు అరేబియా, చైనా, సుమత్రా, జావా, బలి, కాంభోజదేశములకుఁగూడఁ బోవుచుండును. ఆరాజ్యమున ముందు శిఖలతోడను వెనుక ముసుఁగులతోడను నుండుపురుషు లున్నారఁట. అందలియువతులు విచిత్రస్వభావలై గాంధారదేశయువతులఁ బోలియుండు రఁట. ఈరీతి నచటిజనుల స్వభావాచారములఁ బరికించుచుఁ గాలము గడపు చుండనగును. వేదత్రయోక్తములును, ఉపనిషద్విహితములు నగుదేవాల యము లాధరణియంతట నిండియున్నవి. అచటిప్రజలు బుద్ధుని, జైనునిఁ గూడ నారాధింతురఁట. క్రైస్తవులు, యూహూదీయులును నచట నున్నా రని కొందఱందురు. ఇఁక నచటి యుద్ధభటులవిషయమా ? వారివర్ణనము చర్వితచర్వణ మగును. ముంజేతికంకణమునకు ముకుర మేల? అసమానవిక్రమ సముద్రుఁడగు మాపూర్వుఁడు సముద్రగుప్తుఁడు సయితము, ఉగ్రసేనపాలకుని జయించినతఱిఁ బడినకష్టముల స్మరించుకొనిన, వారిబలపరాక్రమాతిశయముల నీవే యూహింపఁగలవు.

బాలా:—అవును. అయ్యది యుత్తమరాజ్యము. దివ్యదేశము. కాని యశోధర్మా! అచటికి నేను పోయినయెడల, మనయున్నతాశయములకు విఘాతమగునుగదా? స్వదేశమునకు ద్రోహ మొనరించిన ట్లగుఁగదా?

యశో:—అట్లేలయగు ? మన ప్రయత్నముల కయ్యది యెంతో సాహాయ్యకారి. కాలగతి నెఱింగినవా రెవరు? ఆధారుణీకాంతులు మన యుద్యమమున కొకవేళ సాయపడవచ్చుఁగదా! ఎంతసాయ మబ్బిన మన కంత మంచిది. హూణులో, పరాక్రమోపేతులు. వారిపరాక్రమ మసదృశము. అట్టిరక్కసమూఁకల నొకరిద్దఱు హైందవవీరులు జయించుట సందేహము. సంఘీభావబద్ధమగు రాజమండలి వారల నాపదుదధి ముంప సమర్థమైనది.

స్వప్రాణరక్షణార్థమైన నీప్రయాణము, స్వదేశచారిత్రమున నూతనశకసమారంభమున కంకురార్పణ మగునుగాఁబోలు!

బాలా.—నిజమాడితివి. ఏమైనఁ గానిమ్ము. ప్రయాణము నిర్ధారించుకొంటిని. కాని నీవు నాతోడ రావా?

యశో:—నేనేల? ఇట నిలిచి, మనప్రయత్నములయం దప్రమత్తుఁడనై యుండెద. ఉజ్జయినియందలివిశేషముల నెప్పటికప్పుడే నీకుఁ జేర్చుచుండెద.

వా రీవిధమున భాషించుచుండ, బయటినుండి సన్ననియీల వారికి వినవచ్చెను. అట్టియీల జనవాసమున వినఁబడియుండిన వారద్దానిని సామాన్య విషయముగా భావించియుండెడివారు. కాని దుర్గమస్థలమగు నామాలయింటి కడ నాయీల నాలకించి, వారు చకితులైరి. వారు మాటలనిలిపి, మరల నాయీలపైఁ జెవినిడి వేఁచియుండిరి. మరల యీల వినఁబడెను. ఇంకను సంశయమా? మానవుఁ డెవ్వఁడో ఎందులకో యీలవేయుచున్నాఁడని వారు గ్రహించిరి. వారిహృదయాకాశమున వివిధ భావవిద్యుల్లతలు మెఱసి యంతలో మాయమొందుచుండెను. 'మాధవికి ముచ్చెమ్మటలుపోసెను. తన యాశ్రితసంరక్షణకై, అందును బాలాదిత్యునికొఱకై, మాధవి తహతహ పడుచుండెను. యశోధర్మ, స్వామిరక్షణమునకు స్వరక్షణమునకు సంశయాకుల మానసుఁడై యుండెను. తాము బంధింపఁబడినయెడల నగుపర్యవసానముఁ దలంచుకొని బాలాదిత్యుఁడు నిర్విణ్ణుఁడయ్యెను. శత్రువుల కాశ్రయ మొసంగిన నేరమునకై యాసాధ్వి మాధవి చిత్రవధలకు లోనై కత్తి కొక కండ కాకపోదని యాతనిమది భయముదయించెను. అతని హృదయసాగరము నందు భావతరంగములు ఘూర్ణిలుచుండెను. హతభాగినియు శరణాగత వత్సలయు నగుమాధవి ప్రాణసంరక్షణార్థము తనజీవముల నుంకువగా నిడుట తనవిధియనియు, ఇందుఁ బర్యవసానముల లెక్కకుఁ గొనరాదనియు, బాలాదిత్యుఁడు కృతనిశ్చయుఁడై, తటాలున నొఱనుండుతరవారి నూడఁబెఱికి

యాకొన్న సింగపుఁగొదమవలెఁ గుటీరమునుండి బైటికొకగంతువైచెను. మెఱపు మెఱయునంతలోనైన యీకార్యమునకు యశోధర్మ విభ్రాంతుఁడై నిలిచి పోయెను. కాని యాతఁ డంతలో బాలాదిత్యు ననుగమించెను.

ఈవిపరీతమునకు మాధవి శోకవివశయై క్రిందికొఱఁగెను. "దేవాది దేవా! ఓనారాయణమూర్తీ! ఈపసికందులఁగాపాడి, నాపాడుజీవములఁ దీసికొనుము." అని యాసాధ్వి ప్రార్థించుచుండెను.

ఆయువకులిద్దఱు కుటీరము నానుకొనియుండు సమతలమునకుఁ బోయిరి. ఎఱ్ఱనియెండలో నచట నొకమానవుఁడు నిలిచియుండుటను వారు చూచిరి. అతనిముఖముపై వలువ కప్పఁబడియుండెను. ఆమానవుఁడు వారు తన్ను డాసియుండుటను గ్రహించి, వినయాంజలియై "దేవా! అవసర విషయములఁ గొన్నింటిని ఏకాంతముగా మీకు మనవిచేసికొనవలయును" అనెను.

బాలా:—నిన్ను నాకుఁ దెలియదు. నీవెవఁడవు?

ఆగంతుకుఁడు.—నాకంఠస్వరమును గుర్తింపఁజాలకున్నారా?

బాలా:—అవును, నీవెవఁడవో త్వరగాఁ జెప్పుము.

ఆగంతుకుఁడు మాఱువలుకక, ముఖముపైనివలువను దొలఁగించెను. అతనివదనము నిస్తేజమై శుష్కించియుండెను. కన్నులు గుంటలుపడి, వ్రీడాభరమున నరమోడ్పులై యుండెను. ఆతఁడు భానుగుప్తుఁడని వారు గుర్తించిరి.

తోడనే యశోధర్మ కాలడచినత్రాఁచుపగిది బుస్సునలేచి "ఓరీభానుగుప్తా! ద్రోహబుద్ధివై యిచటికిఁగూడ మమ్ము వెన్నాడి వచ్చితివా? నీయేకాంత భాషణములు, నీకాంతభాషణములు తగులఁబడనిమ్ము! కృతఘ్నుఁడవై నీ స్వామికి మగధరాజ్యమునందు నిలువ నీడలేక చేసినదిచాలక, యీనాఁటికి మేము శరణొందిన యీజీర్ణకుటీరమునకుఁగూడఁ దఱుముకొనివచ్చితివా? ఓరీ! చేసేతఁజేసినపనికి ఫలము ననుభవింపక పోవుసుమా! దైవమునెదుటఁ జెప్పుచున్నాఁడ. తగినఫలముఁ దప్పక యగును. ఓరీ భానుగుప్తా! నీజీవితము చిల్లి

గవ్వకైనఁ జెల్లునని సీతలం పైనచో, రమ్ము, క త్తిదూసి నిన్నుఁ గాఁచుకొనుము" అని కరవాలము నొఱనుండి వెలికి తెను.

బాలాదిత్యుఁ డాతని చేయిపట్టుకొని "యశోధర్మా! కొంచెము తాళు ము. క త్తిదూయకుము. అతనిమాట లెట్టివో విందము. ఓయీ!, ఇఁక నీవచ్చిన కార్యము కానిచ్చి మమ్ము విడువుము" అని బాలాదిత్యుఁ డడి గెను.

యశోధర్మ కఱకుపలుకులకు భానుగుప్తుఁడు విభ్రాంతుఁడై యట్లే నిలిచి పోయెను. అతని మొగము వెలవెలపోయెను. కాని, బాలాదిత్యునిశాంతవచ నము లాతనికిఁ బ్రజ్ఞనొసంగెను. "దేవా! యశోధర్మ దురుకుపలుకుల లెక్కిం పను, అవసరవిషయములఁ గొన్నింటిని, మీకుమాత్ర మేకాంతముగా విన్న వింపవలయునని నామనవి. దేవా! ఈవలకు వచ్చెదరా?" అని భానుగుప్తుఁడు వేడుకొనెను.

బాలాదిత్యుఁ డందుల కియ్యకొనక "రాజాలను. యశోధర్మ వినరాని నారహస్యము లుండ నేరవు. నీ వేమైనఁ జెప్పఁదలంచినచో మాయిరువురి యెదుట నెఱింగింపవగు. లేకున్న నీదారిఁ బోవచ్చును" అనెను.

భాను:—చిత్తము. అట్లే కానిండు. మీయిరువురసమక్షమున నావిష యముల విన్నవించుట కెట్టియాక్షేపణము లేదు. యశోధర్మశీలమును నేను సంశయింపను. కాని తీవ్రమగు నాతనిహృదయపేటికయందు రహస్యార్థ మిముడదేమో యని మాత్రము తలంచితిని.

బాలా:—ఓయీ! ఇఁక నీవ్యాఖ్యానములఁ గట్టిపెట్టుము. అరహస్య ములు వెలువడుప నిన్ను మేము బలాత్కరింపము. ఇష్టమున్నఁ జెప్పుము; లేకున్న వచ్చినదారిఁ బొమ్ము.

భాను:—దేవా! నారహస్యముల విలువను మీరు గమనింపకున్నారు. దేవా! మీకు నాపై దయతప్పితి రేల!

బాలా:—భానూ! ఎల్లప్పు డిట్లుండినవాఁడఁ గాను. కంటినిఁ బొడిచి, తప్పిటికిఁ గారణ మడిగెద వేల? ఇందులకుఁ గారణము నీకుఁ దెలియనిది కాదు.

ఒకప్పుడు నేను నిన్నుఁ బ్రేమించియుంటిని. నిన్ను విశ్వసించియుంటిని. కాని నీకృతఘ్నానలము నాహృదయమందలి కరుణారసము నివురఁజేసినది. నీవు నా వైరిశ్రేణి జేరి, మగధమాలవభూములనుండి నన్నుఁ దఱిమివైచితివి. భానూ! విషాహి యని, తెలిసియుం ముద్దాడుమూఢుఁడుండునా? నీయట్టి ద్రోహాత్ముని యెడ ననురాగ మెవ్వని కుండఁగలదో నీవే సుంత యోజింపుము.

“నిజము. దేవా! మీమాట నిజము” అని భానుగుప్తుఁడు విహ్వలస్వరమునఁ బలికెను. అతని నేత్రములనుండి యశ్రుధార లుగలుచుండెను. అతఁడు తెప్ప లద్దుకొనుచు “దేవా! ఈదినము మేము మిమ్ము బంధింపఁ బురమంతయుఁ గాలించుట వినియుంటిరా?” అని ప్రశ్నించెను.

బాలా:—వింటిని తరువాత?

భాను:—దేవా! కాలకింకరుఁడగు నారాయణశర్మను వెంటనిడికొని మిహిరకులుఁడు మిమ్ముల వెదుకసాగెను. పర్యవసానము తెలిసియేయున్నది కదా? వారు మిమ్ముఁ గనుఁగొనఁజాలరైరి. కాని నారాయణశర్మమాత్ర మా సముదాయమును జారవిడువలేదు. అతఁడు తనవిరోధులనందఱ శిక్షింపఁజేసెను. ఆకాలకాకోలవిషముఁజోలికిఁ బోయినవారందఱును, అతనికోఱల కాటునుండి తప్పించుకొనలేకపోయిరి. భద్రబాహువు సర్వకాలసర్వావస్థల జైనభగవానుని బోధామృతపాన మొనరించు పావనమూర్తి కదా! పాపము, అనిర్భాగ్యునిఁ గూడ నారవల్లిప్రాంతములకుఁ బ్రవాసమంపిరి.

“ఔనా? మము వినినమాట యబద్ధము గాదు!” అని యశోధర్మ బాలాదిత్యులు పరితాపమొందిరి.

భాను.—అంతతోఁ బోలేదు. ఈదారుణోదంతము వినుఁడు. రఘుపతిని, అతని తనూజాతే సరస్వతినిగూడఁ బ్రవాసమంపిరి.

“సరస్వతినా? ఆకుసుమకోమలి సరస్వతికిఁగూడ నట్టియవస్థయా?” అని వారొక్కుమ్మ రసిరి.

భాను —దేవా! అవును.

"అయ్యో! పాపము. అసహాయయగు నాకన్నియ ఆరవల్లిపర్వత ముల నెట్లుండఁగలదు! భయంకరులగు హూణులకును, నాగరకతావిహీనులగు యౌధేయులకును, క్రూరులగు మ్లేచ్ఛులకు నాపర్వత మావాసముగదా! వారి విపరీతాచారములును, విచిత్ర సాంప్రదాయములును చూచుటకు వెగటుగ నుండును. ఇచట హూణులు ప్రజోద్రేకమునకు వెఱచి కట్టుపడియున్నారు కాని, అచటమాత్రము వారు స్త్రీలఁ జెఱపుట కిసుమంతయైన వెనుదీయరు. ఇచటసైతము హూణులదురాగతముల మన మప్పుడప్పుడు వినుచుందుముగదా! ఆకన్యామణి నారాయణి బలవన్మరణమే యిందులకుఁ బ్రబలతార్కాణము. మానముపోయినఁ బ్రాణము బరువుచేటని యామానవతి నిశ్చయించుకొని, చితి పైకెక్కి యనలజ్వాలల కాహుతియై వీరస్వర్గముఁ జూఱఁగొనలేదా?" అని బాలాదిత్యుఁ డనెను.

భాను:—దేవా! నిజము. సరస్వతికిఁగూడ నట్టిగతిపట్టునేమో యని నాకు సందియముగానున్నది.

బాలా:—ఆమెకుఁగూడ నట్టిగతియా? కలనైన నట్లు జరుగనేరదు. మాలో నెవరున్నను, ఆయకార్యము జరుగఁజాలదు. క్షత్రియకులభూష ణులము మేము కుందలవలె నావల నిలిచియుండుటయు, ఉజ్జయిని కలంకార ప్రాయమగు నాకన్యావతంసము మానము గోల్పోవుచుండుటయునా? అటు లెన్నటికిఁ గాఁజాలదు. ఈబాలాదిత్యుని మేన నూపిరియున్నంతదాక—ఈ బాలాదిత్యుని చేత ఖడ్గమున్నంతదాక—యట్లు జరుగనేరదు. నేను క్షత్రి యుండను. మానినీమానసంరక్షణము క్షత్రియులకు ముఖ్యకర్తవ్యము. కాని, యీనీచకార్యమునకుఁ గర్తయగు నరాధముఁ డెవఁడు? నీకు మహాస్వామి యగుమిహిరగులుఁడా లేక ఆముసలినక్క తోరమాణుఁడా? భానూ! ఇట్టి ఘోరకృత్యములఁ జూచుచు నూరకుండునంత నీచుఁడవైతివేమి?

భాను:—దేవా! ఊరకుండలేదు. కాని నేను ద్రోహిని. కృతఘ్నుఁ డను. ఏది యెట్లున్నను, భారతకన్యామణులు మానధనములై ప్రాణములఁ

బణములంగా నొడ్డుచుండ, నూరక చూచునంత శిలాకఠినహృదయుఁడఁగాను.

యశో.—అదియే ధీరలక్షణము. ఇట్టి నీచకార్యములకుఁ దలపెట్టిన రాక్షసాధముఁ డెవఁడు? తండ్రియా? పుత్త్రుఁడా?

భాను.—ఇద్దఱును గారు. వారిమంత్రి నారాయణశర్మ.

"ఏమీ! నారాయణశర్మయా?" అని వారు విస్మయస్తబ్ధులైరి.

భాను.—అవును. ఆబ్రాహ్మణచండాలుఁడు నారాయణశర్మయే యీ నికృష్టపుఁబనికి నాథుఁడు.

బాలా:—ఆక్రూరుని బ్రాహ్మణుఁడని పిలిచి, బ్రాహ్మణకులమునకుఁ గళంకము తేకుము. బ్రాహ్మణు లాతని దూషించుచుందురు. ఆతని వారు వెలి వేసినారు. ఆతఁడు మాకొలువునున్నంతకాలము తనక్రూరస్వభావము నగ పఱుపలేదు. అప్పుడుకూడ నుజ్జయినీవిప్రు లాతనితో నంతగాఁ బలికెడివారు కారు. ఏమనిన నేమనిమాత్ర మనుచుండిరి.

భాను:—ఆతఁడు నిజముగా బ్రాహ్మణుఁడైయుండెనా యనికూడ నా సందియము. పశ్చిమోత్తరమునందలి గాంధారమునుండి యాతఁడు వచ్చెను. మీపినతండ్రియాస్థానమునందును, మీపితామహునికొలువునందును నాతఁ డుండుతఱి, ఆతనికులము నెవ్వరు విచారించియుండినవారు కారు. అప్పు డాతఁడు విష్ణుభక్తుఁడై ద్వాదశోర్ధ్వపుండ్రధారణ మొనరించుకొనుచు, దొంగవేషములు వేయుచుండెడివాఁడు.

బాలా:—అప్పు డాతఁడు దుశ్శీలుఁడై యుండెనా?

భాను:—లేదు. ప్రజాదూషణమునకు వెఱచి, యాతఁ డందులకు సాహసింపలేదు. కాని యప్పుడప్పుడుమాత్రము బోగమిండ్లకుఁ బోవుచుండెడి వాఁడు. దేవా! ఆకాలమున దురాచారులు తగినవిధమున శిక్షింపఁబడు చుండిరి. ఆదుర్జనుఁడు రాజదండనమున కోడి, తుంటరితనము మానియుండెఁ గాఁబోలు! నాస్తికులును, నీతినియమవిహీనులు నగుహూణులసాంగత్యము చేతను, మ్లేచ్ఛులమైత్త్రివలనను, అంతకుముందుండిన యాగుణలేశముకూడ

వాతని వీడిపోయెను. ఇప్పు డాకృపణుఁ డొకక్షత్రియకన్నియఁ జేఱుప నిశ్చయించియున్నాఁడు. ఇంద్రియదాసుఁడై యాతఁడు మిన్నుమన్నుగానక వర్తించుచున్నాఁడు. అకటా! దుర్లభమగు మానవజన్మమెత్తియు, ఇట్టి నీచ కార్యములకుఁ బూనుట కరము శోచనీయముగదా!

బాలా:—ఓభానూ! నీకు లోకజ్ఞానము కొంచెమైన నున్నట్లు లేదు. వర్ణసంకరుఁడైన బ్రాహ్మణునికడ మాన్యవర్తన మెట్లుండును? 'భ్రష్టస్య కావా గతిః' అన వినమా! అగ్రకులమునువీడి యధమకులమును జేరిన కుజనుఁడు కూలికిఁగూడ విషముఁ ద్రాగుటకు వెనుదీయఁడు. కులభ్రష్టునకు మానావమానములకుఁ గడుంగడుదూరము. అతఁ డవియెట్టివో యెఱుఁగనే యెఱుఁగఁడు. అందులకేసుమా, మహాత్ముఁడగు మనువు "బ్రాహ్మణ్యమునకుఁ జండాలత్వమునకు నడుమ నవలంబనము లేదు. బ్రాహ్మణుఁడు కానివాఁడు చండాలుఁడగును" అని సెలవిచ్చియున్నాఁడు. కులము కట్టుబాటులకులోనై యున్నంతకాలము మానవుఁడు సంఘదూషణకు జంకి దురాలోచనములజోలి మాని యుండును. కాని కులమునే కోల్పోయిననాఁడు, అతని కిఁక నగునష్ట మేముండును? అధమాధముఁడై, నడపీనుఁగై దినములఁ గడపుచుండును. వ్యభిచరించినవనితను వెలివేయ నామె యేమిచేయును? అంతకుముందుండిన యా కొద్దిపాటిసిగ్గు బిడియములనుగూడ మాని యిష్టానుసారము వర్తించునుగదా? అట్లే కులభ్రష్టుఁడు నెంతనీచకార్యమునకైన వెనుదీయఁడు. నారాయణ శర్మ బహిష్కారణమునకుఁ గలకారణము నీకు బాగుగాఁ దెలియునా?

భాను:—దానికి మేమిరువురముఁ దులదూఁగుదుము. పాపము. ఆ దిక్కులేనికన్నియను నారాయణునిఁ జెఱచినతఱి, ఉజ్జయనీపురవాసులు బ్రాహ్మణులు, క్షత్రియులు రోషావేశులై యపరాధులఁ గఠినముగ దండింప వలయునని పట్టుపట్టిరి. కాని రాజకింకరు లాపామరులను నోరెత్తనీయక యణఁచివేసిరి. అనిరంకుశవర్తనమునకుఁ బ్రజలోర్వఁజాలక, యిఁకఁ దోరమా ముని యాస్థానమువైపైనఁ జూడరాదని వారాదినమే కట్టుబాటొనరించు

కొనిరి. కాని నారాయణశర్మ వారినియమములఁ జెడచెవిఁబెట్టి యథారీతి కొలువుకూటమునకుఁ బోవుచుండెను. మానినులఁ జెఱుపుటను నేనుగూడ నందఱకన్న మిన్నగ గర్హించియుండియు, నెప్పటివలెనే తోరమానునికడకుఁ బోవుచుంటిని. అనంతరము పురపాలకసంఘమువారు సమావేశమై, మమ్ముల నిద్దఱ సంఘమునుండి బహిష్కరించుచు నేకగ్రీవముగా దీర్మానించిరి. ఆ పాపిష్ఠనారాయణశర్మముఖమైనను జూడరాదని గట్టికట్టడఁ గావించిరి. దేవాలయప్రవేశమునకు, సరోవరస్నానమునకు నారాయణశర్మ యనర్హుఁడని వారు ప్రకటించిరి. కాని మిహిరగులుఁడు వారితీర్మానములను, ప్రకటనములను లెక్కవెట్టక, కొలనిస్నానమునకు నారాయణశర్మ కెట్టియాటంకము లేదని యాతని కావరము నొసఁగెను. ఆకాసారమున నారాయణశర్మ త్రుంకులిడునపు డచటికి మఱెవ్వరుగాని పోరు. కాని గోవిందాచారి యను నొకవైష్ణవుఁడుమాత్ర మాతనితో నచట జతగూడి యుండును. ఆతనిఁగూడ నంములకై పౌరు లతినీచముగాఁ జూచుచున్నారు. ఇంతటితో నిలువలేదు. దేవాలయప్రవేశమునకు నారాయణశర్మకుఁగూడ నర్హతకలదని మిహిరగులుఁడు శాసించెను. కాని పౌరులు మొండికిపడి నారాయణశర్మను గోవెలలోనికి రానీయక దడికట్టి సత్యాగ్రహము బ్రకటించి నిల్చిరి. మిహిరగులుఁడు కాలానలునివలె మండుచు బలాత్కారముగ దారిచేయ సమకట్టెను. కాని ప్రజోద్రేకమును గమనించిన తోరమానుఁడు, తొందరపడవలదని తన కుమారునకు బోధించెను. ఇంతకును నారాయణశర్మ బుద్ధిహీనతను వినుఁడు. దీని కాతనికి విష్ణుదేవునిపైఁ గోపమఁట! కానఁ గసితీర్చికొనవలయునఁట! తనకు బ్రవేశములేనికోవెల యుండిన నేమి మండిన నేమి యని సాకువెట్టి, శివాలయనిర్మాణమునకు మిహిరగులు నియ్యకొనఁ జేసినాఁడు. తోరమానుఁడును నంములకుఁ దలయూఁచినాఁడు. చూచితిరా! నారాయణశర్మ విషయమై మీరు చెప్పినదంతయు సత్యమైనది. ఆతనిసాహస మతినీచము. కాని యపారము. మానావమానములు, సిగ్గగ్గులు, పెద్దచిన్న లేని యాతం డెంతకైన

జంకఁడు. అట్టిదుర్జనునకు దూరముగ నుండుట మేలు. తెగించినవానికి, తెడ్డే లింగముగదా!

బాలా:—సరస్వతి నెచట బంధించియున్నారు?

భాను:—అరవల్లిపర్వతములందలి యొకానొకదుర్గము దుర్గమునందు. అచో టిచ్చటి కిన్నూరుమైళ్లుండును.

బాలా:—ఏమీ! ఆయబల దారుణకర్ములగు యోధేయులమధ్య నుండవలయునా?

భాను:—అవును పాపము. ఆమె యాదుర్గము పదినాళ్లలోఁ జేరఁ గలదు. ఆరాక్షసుఁడు నారాయణశర్మ కూడ నొకనాఁడాలస్యముగఁ జేరఁ గలఁడు. అతఁడు రేపు తప్పక బయలు దేఱనున్నాఁడు. ఆకోమలాంగిఁ గాపాడ నాచే నైనంతఁ బ్రయత్నించవలెంచి, యిట్టిగూఢవేషమున నిాకడకు వచ్చితిని. ఇప్పటికే మనకు వ్యవధిచాలదు. ఏమాత్రము జాగొనరించినను, కార్యము మిాఱఁగలదు. వెనుక చింతించుట వెఱ్ఱితనము.

బాలా:—అనాథకన్యాసంరక్షణమునకు మాయుం దుపేక్షాభావ మెన్నటి కుండఁజాలదు. కాని, మనకు గుఱ్ఱములు కావలదా?

భాను:—మూఁడుగుఱ్ఱములు చెంగటనున్నవి. పౌరపుంగవుఁ డొకఁడు వాని నిట్టియుత్తమకార్యమున కిచ్చెను. కాన నావిషయమై చింతవలదు. అయినను, మనము మువ్వురముగదా, వారలరక్షింప సమర్థులమా యని నా సంశయము. ఏలయన, ఖైదీలవెంటనుండుభటులు రాక్షసభటులు. వారు పేరు నకుమాత్ర మిరువదిమందికాని, కనుమూసితెఱచునంతలో వారు బలములఁ గూర్చుకొనఁగలరు.

బాలా:—బలాబలములతో మనకు నిమిత్తము వలదు. ధర్మము మన పక్షిఁ గలదు. అధర్మబద్ధమగు బలఁగ మెంతయైన నేమి, ధర్మమునుండు విఱిసిపోవును. రమ్ము. పోవుదము. సూర్యాస్తమయములోపల సరస్వతి సంరక్షణమో, మనమరణమో జరుగవలయును.

"మాధవీ! పోయివచ్చెదను" అని బాలాదిత్యుఁడు మాధవితోఁ జెప్పి, గుఱ్ఱము నెక్కఁబోయెను. యశోధర్మ భానుగుప్తు లాతని వెంబడించిరి.

"అయిన భోజనముచేసి మఱి పోఁగూడదా?" అని మాధవి హెచ్చరించుకొనెను.

బాలా:—భోజనమా! కన్యామణియొకర్తుక కష్టాటవులఁబడి మాన ప్రాణములఁ గోల్పోవుచుఁ గుయ్యిడుచుండ, గుప్తవంశీయుఁడొక దూర ముండుటయే కాక, కడుపునకుఁగూడు కూరుకొనుచుఁ గూర్చుండియుండెనని నలుగురు వినినయెడల, నవ్వులచేటుగాదా?

వారు మువ్వురు గుఱ్ఱములెక్కి పోసాగిరి.

"ఆహా! పులికడుపున మేఁక పుట్టునా?" అని మాధవి ముక్కుపై వ్రేలిడుకొని, యట్టులే నిలుచుకొని బాలాదిత్యునిఁ గన్నార్పక చూచుచుండెను.

"ఈసత్కార్యమున రాజకుమారునకు సర్వేశ్వరుఁడు తోడగుఁగాక" అని యనుకొనుచు నామె గుడిసెలోనికిఁ బోయెను.

---

# ఎనిమిదవ తరంగము.

---

## విశ్వకారిణి మహారణ్యము.

వారు మూఁడు గుఱ్ఱములపై నతివేగముగా హూణగృహమునకుఁ బోవుమార్గమునఁ బోవుచుండిరి. ఆమార్గము రమ్యమై యుండెను. స్కాందగుప్తసార్వభౌముఁ డున్నతస్థితియందుండిన దినములలో నాతఁ డాబాటను నిర్మించెను. జవోగ్రములగు నాసైంధవముల గిట్టలతాఁకున నెడనెడ మిణుఁగురు లుద్భవిల్లి తళుక్కుమని మెఱయుచుండెను. ఇట్లు వా రాపురాతనపురము నుజ్జయినిని వెనుకవైచి నిర్మానుష్యమగు నామార్గమునఁ బట్టి పోవుచుండిరి. ఆదినములు మంచివి కావు. ఎల్లకడల నరాజకత్వ మావసియుండెను. పూర్వము గుప్తరాజ్యమున దొంగలకుగాని, దుర్మార్గులకుగాని త్రోవలు కాచి దోఁచుకొనుటకుఁ దగువలేకుండెనని ఫాహియాను ప్రత్యక్షప్రమాణములఁ జూపుచున్నాఁడు. కాని, హూణులు రాజ్యాధికారులైననాఁటినుండియుఁ జోరులు గణనాతీతులైరి. గుప్తరాజ్యమున గౌరవజీవన మనుభవించుచుండిన జనులు, హూణులచేఁ దమధనాదికములఁ గోల్పోయి, పొట్టకూటికై విధిలేక దోపిడులుగావించి జీవించుచుండిరి. ఇట్లాదొంగ లడవిగాడిదలపై నెక్కియు, సొంతముగా నడచుచును, నడవులంతయు నిండియుండిరి. ఎట్లయిన నేమి? దూరపత్రమార్గులగు పాంథులను వస్తువాహనాదిభారవిముక్తులఁ జేసి, చోరవ్యాపారమునకు లాభముఁ జేకూర్చు పశ్యతోహరులు, మనకథాకాలమున శతసంఖ్యాకులై యుండిరి. చోరవృత్తి నవలంబించినంతమాత్రమున వారు గౌరవవిహీనులని చెప్ప వీలుపడదు. భామినీవృద్ధబాలాతురులజోలికి వారు పోయెడివారుకారు. బీదలను దాఁకెడివారుకారు.

మూటముల్లెలతో బాటనేగు జనుల కాదొంగలగుంపువలన భయము గాని, మనమూవురుపథికు లట్లు భయమంద నవసర మేమున్నది! రిపుదర్పవిభేదులగు మనపాంథు లనాయాసముగ స్వారిచేయుచుండిరి. వారు బయలుదేఱి యిప్పటికి కొలఁగంబు రైనవి. క్రమక్రమముగ వారు ఘోరకాంతార ప్రాంతరముల డాసి, నిర్జనమార్గమునఁ బయన మొనరించుచుండిరి. మార్గవిభేదమునం జేసి, వారిప్రయాణ మిప్పుడు సౌఖ్యావహమై యుండెను. ఇంతటినుండియు వారు వచ్చినత్రోవ కిరుపైపుల గుప్తరాజన్యులు నాటిన వృక్షశ్రేణులుండినను, వారు సూర్యాతపతప్తులై వడఁదగిలి యుండిరి. కాని యీ యడవిమార్గముపైఁ దరుశాఖలు గుబురుగట్టి, భానుకిరణనిరాఘాటప్రసరణము నరికట్టుచుండెను. ఆపర్ణపటాంతరములనుండి సూర్యకాంతి రేఖలు రేఖలుగఁ జీలి నేలపై వ్రాలి యాప్రదేశమునంతటి నస్పష్టకాంతుల నింపుచుండెను. శీతలచ్ఛాయాపరాజితమగు నామార్గ మిప్పుడు పథికజనశ్రమాపనోదకమై యుండెను. పెదవి మెదలుపక యరుదెంచు నాబాటసారు లిపుడు తమ గుఱ్ఱపుఁగళ్లెముల వదలి తమయిచ్చ మెయి హాయిగాఁ బోవుచుండిరి. పథిశ్రమ వాయుటచే వారిపుడు మాటలకు దిగిరి.

"దేవా! ఈయడవి నెఱుంగుదురా? 'విశ్వకారిణి' అని దీనికిఁ బేరు. ఇయ్యది యోజనమాత్ర వైశాల్యము. పేరుపొందినదొంగల కీయరణ్య మావాసస్థానము." అని భానుగుప్తుఁ డనెను.

బాలా:—అవును. వారిలో హరిరాముఁ డనుదొంగలరాయఁ డున్నాఁడు. కత్తిసామునం దాతనికిసాటి మఱెవ్వరు లేరని వినికిడి.

యశో:—నిజమాడితిరి. కాని, యాదొంగలమిండని తలఁదన్ను ఖడ్గవిద్యాకుశలు నొక్కనిమాత్రము నాకుఁదెలియును. అతఁడు దేవరవారేసుమా!

బాలా:—సరిసరి. అంతతోఁ బోనిమ్ము. మనకు హరిరాముఁ డుపద్రవమొనరింప సాహసముచేయఁడు. మనముకూడ నాతనికై భయమొంద నవసరములేదు.

అట్లు వారు సంభాషించుచుండ గహనాంతరమునుండి భీకరశంఖారావ మొక్కటి ప్రతిశబ్దితమై భూమ్యాకాశముల నించెను కాని యా ధ్వానము దగ్గఱనుండి వచ్చినట్లు లేదు. రెండుమూఁడుకూఁతవ్రేటులదూరము నుండి వచ్చినట్లుండెను. వారు సంభ్రాంతులై గుఱ్ఱముల నాపిరి. వారికేమియుఁ గన్పట్టుటలేదు. అతిశ్రద్ధతో నా రాశబ్దము వచ్చినదిక్కుఁ జూచుచు నాలకించుచుండిరి. కొంతసేపటికి వారికి గుఱ్ఱపుడెక్కలసడి వినవచ్చెను. ఆవచ్చు గుఱ్ఱము లిరువదింటికుండునని వారు గ్రహించిరి. అవి తమ కభిముఖముగాఁ బరుగెత్తుటను గూడ వారు గ్రహించిరి. తోడనే వారు మువ్వు రొక్కమారుగాఁ దమగుఱ్ఱముల నాదిశ కెదురుగాఁ దమశక్తికొలఁదిఁ దఱిమిరి. రౌతుల యాకుకమును గమనించినవో యన నాయశ్వరాజములు నిడుదచెంగలిడుచు కాళ్లను గ్రిందఁబెట్టక పరుగిడసాగెను. అయిదునిముసములకంతయు నా రాస్థలమును డాసిరి. అట బలాధికులగు నాటవికులు కొందఱు కంచరగాడిదలపై నెక్కియుండిరి. వారిహస్తములందలి ఖడ్గములు తళతళలాడుచుండెను. వారు కొందఱు మనుజుల నశ్వములపైనుండి బలవంతముగాఁ గ్రిందికి దించుచుండిరి.

"హూణులు. హూణులు. వెదకఁబోయినతీఁగె కాలఁదగిలినది" అని యశోధర్మ యఱచి తనతురంగమును దఱిమెను. ఒక్కగంతులో నావారువ మాతని నాప్రదేశమునకుఁ జేర్చెను. బాలాదిత్యభానుగుప్తులు గూడ నాతని వెంబడించిరి. అచ్చటఁ జీమలగామలవలె గందరగోళముగా నుండెను. ఆగుంపునందు హూణులు, దొంగలు చేరియుండిరి. తాను రక్షింప సమకట్టియుండుబంధితు లాగుంపునం దున్నారేమో యని, బాలాదిత్యుఁ డతిసంభ్రమహృదయముతో నంతటఁ దనవిలోకనములఁ బఱపుచుండెను. ఆగుంపు బాట క్రిందిభాగమున నుండెను. బలిష్ఠకాయుఁ డొకఁడు సరస్వతి యధిష్ఠించియుండు గుఱ్ఱపుఁగళ్లెమును బట్టుకొనియుండుటను బాలాదిత్యుఁడు చూచెను. తోడనే యాతఁడు చకితుఁడై, మెఱపు మెఱయునంతలో నా యశ్వమును సమీపించి "ఓరీ పిఱికిపందా! కళ్లెమును వదలుము. ముందు

వదలుము.” అని కోపతీవ్రస్వరమున గద్దించెను. ఆగద్దింపునకు సరస్వతిమేను మొద్దువాఱెను. ఆమెకు ముచ్చెమటలు పోసెను. సెగనుండి శిఖానికిఁ బడుదుర్దశ తనకుఁ బట్టనున్నదేమో యని యామె దిగులొందెను. సుకుమార మగు నామె తనూవల్లిక, దీర్ఘప్రయాణశ్రమాపరిశోషితమై యుండెను. హూణు లుజ్జయినినుండి గుఱ్ఱములెక్కి బయలుదేఱిరి. సరస్వతిక్షేమమును మనమున నుంచుకొని, హూణనాయకుఁ డాయెలనాగను దనతురగముపై భద్రముగాఁ దీసికొనివచ్చుచుండెను. చోరులు తమ్మెదిరించినపు డాహూణ నాయకుఁడు తెగించి వారల డీకొనెను; కాని యాదొంగలమిండని ప్రచం డాఘాతమున కాతనితల గింగురుపోవ నాతఁడు క్రిందికొఱిగెను. కత్తికి నాగేటికిమధ్య హూణులకు దొంగలకు నడుమఁ జిక్కి సరస్వతి చాల యలసి పోయెను. కాని యుపకారశీలుఁడగు నొకపురుషుఁ డిపుడు తనగుఱ్ఱము నరి కట్టియుంచి చోరశిఖామణిని కరాళించి తన్నుఁ గావవచ్చినందుల కామె ద్దియమున నాశారేఖ పొడచూపెను. ఆకమలాక్షి తనమనోనయనముల విచ్చి చూచెను. ఎట్టయెదుట నొకవిలాసవంతుఁడు నిలిచియుండెను. ఆయువకుని యం దామనిరాక్షి కాదరభావ ముదయించెను. “అయ్యో! రక్షింపుఁడు. రక్షింపుఁడు. ఈదారిదోపిడిదొంగలబాఱినుండి కాపాడుఁడు” అని యాబాల కుయ్యిడెను.

బాలా.—తప్పక కాపాడెదను. ఓరీ తుచ్ఛుఁడా! కన్నెము వదలుము. త్వరగా వదలుము.

బాలాదిత్యుని కరాళింపులకుఁ జోరనాయకుఁడు విభ్రమాశ్చర్య మగ్నుఁడయ్యెను. ప్రత్యుత్తరమొసంగుట కాతని కేమియుఁ దోఁచలేదు. ఎనిమిదేండ్లుగా నాతఁ డీయడవియందున్నాఁడు; కాని యీవిధముగాఁ దన్ను శాసించినసాహసు నాతఁ డెఱుంగఁడు. హరిరాముఁ డనిన నెల్లరకు సింహస్వప్నము. అట్టుండ నేఁ డాతని ధిక్కరించి మాటలాడుయువకుఁ డెవ్వఁడు చెపుమా! తనమానధనము నాదొంగలరాయఁ డపహరించునని

తలంచి యాయంగన యాయువకుని వేఁడుటయు; నాయువకుఁ డాయువతిఁ గాపాడ సిద్ధపడుటయు; హరిరామునకుఁ దలగొట్టినటు లుండెను. హరిరామునికైన పరాభవము దుస్సహమై యుండెను. హరిరాముని మానసవీథి నిట్టిభావములు మూర్తులఁదాల్చి చిందులు ద్రొక్కుచుండెను. ఉన్నట్లుండి యాతఁడు కళ్లెమును వదలి "తల్లీ! మన్నింపుము. నాతప్పును గావుము. మూర్ఛపోయితివేమోయని నిన్ను డాసితినిగాని దురభిప్రాయమునఁగాదు" అని సరస్వతిని వేఁడుకొని, బాలాదిత్యుని వైపుఁదిరిగి "ఓయీ! [illegible]! ఇఁక నీసంగతి కానిమ్ము. భయభక్తులఁ బాఱఁద్రోలి, యిట్టి తెంపరివగుటకుఁ గలకారణము నేను వినవలయును. ఇంతకును నీవు నన్నెఱుఁగవు కాఁబోలు. ఔనౌను. నిజముగా నీవెఱింగియుండవు. వినుము. విని గడగడలాడుము. తెలియునా చోరశిఖామణి హరిరాముఁడితఁడే" అని గంభీరముగాఁ బలికెను.

ఆమాటకు బాలాదిత్యుఁడు నిర్లక్ష్యముగా నవ్వుచు "వింటిని, కాని గడగడలాడను. ఓరీ యహంకారీ! హరిరాములు కోటానుకోట్లయినను ధర్మము ముందు నిలువఁజాలరు. తెలియునా?" అనెను.

హరి:—నిజము నిజము. కాని హూణరాక్షసులచేతనుండి కన్యావతంసము నొకర్తుకఁ గాపాడుట ధర్మము కాదందువా?

బాలా:—ఎన్నఁటికినను. ఇపుడు నిజమెఱింగితి. క్షమింపుము. దుఃఖవివశరాలై యున్నదేమో చూచుటకై కళ్లెమును బట్టుకొంటివని నాకిపుడు నీవనగాఁ దెలిసినది. కాని నేనుమాత్రము తప్పుఁదలఁచితి. మన్నింపుము.

హరి.—ఓయువకుఁడా! అట్లు నీవందువని నాకుఁ దెలియును. యువకులస్వభావమే యట్టిది. ఉద్రేకహృదయమున నాలుకమీఱి మాటలాడి, తరువాతి ప్రతిక్రియకు వెఱచి వెంటనే మన్నింపఁ బ్రతిమాలుటలు, యువకులకు సర్వసామాన్యము.

బాలా.—హరిరామా! నావిషయమునమాత్ర మట్లనుకోవలదు. నీ ప్రతిక్రియలకు నేను భయపడను. నీతోడిసఖ్యము నాకు వాంఛనీయమే కాని, తగునని తోఁచినయెడల నీతోడి విరోధమునకు వెఱచువాఁడఁగాను.

"ఓవళో! నీవు మిగుల సాహసుఁడవుగ నున్నాఁడవు. ఇప్పుడే నాశక్తి నించుక చవిచూపెద నుండుము. ఓచోరపుంగవులారా! రండు. రండు. కత్తులు దూసి నిలువుఁడు" అని హరిరాముఁ డఱచెను. అనియేతడవుగా వృక్షాంతరములనుండి యిరువదియైదుమంది యాటవికు లరుదెంచి, బాలాదిత్యుని జుట్టుముట్టి నిలిచిరి. వారిచేతులయందు విచ్చుకత్తులు భానుదీప్తులయందుఁ దళతళలాడుచుండెను.

"ఓయీ మిడుతా! ఇప్పు డేమందువు? శరణందువా? చచ్చెదనందువా? కాళ్లు పట్టెదవా? కంఠము నర్పింతువా? ఓయీ! ఇంటికిఁబోయి సుఖముండుము. హరిరాముఁ డనవసరముగా హత్యగావించెనను లోకాపవాదము రాకుండుఁగాక! శరణనుము. శరణనుము" అని హరిరాముఁడు గర్జించుచు, నారాణువలోనికి దూకి "కాళ్లఁబడుము. లేకున్నఁ గాలునిమందిరమున కనిపెదను" అని భీకరాట్టహాస మొనరించెను. తోడనే యాయట్టహాసధ్వనులు మూఁడు గొంతులయందుఁ బ్రతిధ్వనించెను. భానుగుప్తయశోధర్మలయుద్ఘోషనారావములు, సరస్వతీకలహంసతదీనాలాపమున మేళవించి, హరిరామునియాజ్ఞావాక్యముల ననుకరించెను.

అందులకుబాలాదిత్యుఁడు మూఁడవకన్నులేనిరుద్రునివలె మండిపడుచు "ఏమీ! శరణొందవలయునా? నేను 'మాం పాహి' అనుటయా? ఊరును పేరును లేనిదొంగలరాయనిపాదములను, గుప్తవంశభూషణుఁడు పట్టుకొనుటయా? ఓరీ! హరిరాముఁడా! రమ్ము! ధీరుఁడవేని నిన్నుఁ గాచికొనుము" అని యావీరమాళి చివాలునఁ గత్తిదూసి యాతనిపైఁబడెను. బాలాదిత్యుని సాహసకార్యమున కందఱును విస్మయపరీతచేతస్కులైరి. ప్రశంసావాక్యము లొక్కమాఱుగా వారివదనములనుండి వెలువడెను. కడకు హరిరాముని యనుచరులు

సైతము సంతోషవివశులై "జయజయమహారాజా" అని బాలాదిత్యునిఁ గొనియాడలేకుండఁబోయిరి. హరిరాముఁడు దిక్కులు పిక్కటిల్లునట్లు నవ్వుచు "దేవా! మన్నింపుము. మీరు సముద్రగుప్తసార్వభౌమవంశభూషణులగుట నాకుఁ దెలిసియుండిన, మీసాహససంపన్నత నొఱసి చూచియుండెడివాఁడఁ గాను. నాసర్వస్వమును మీయధీన మొనరించుచున్నాను. ఈభృత్యునిపైఁ గరుణదాల్చి, వీని దరిద్రనిలయమునకు విజయంచేసి, వీఁడొసంగు గంజినీళ్లను స్వీకరింప ననుగ్రహింతురా?" అని ప్రార్థించెను.

యశో.—అవునవును. హరిరామునియాతిథ్యమును స్వీకరించి యాఁకలిబాపుకొనుట మేలు.

హరిరాముఁడు దారితీయసాగెను. అందఱు నాతని ననుగమించిరి. ఆమార్గము వృక్షలతాకంటకశిలాకీర్ణమై మిగుల నిఱుకుగానుండెను. పరిచితులు గూడ మరల నామార్గమును గుర్తింప నశక్తులైయుండిరి. వారట్లు కొంతకాలమునకు విశాలమగు సమస్థలమును జేరిరి. అచటఁ బెక్కురాటవికులు శాకములతో బలువిధములగుపదార్థముల వండుచుండిరి. కమ్మనివాసన గుమ్మని కొట్టుచు, నోట నీరూరఁజేయుచుండెను. ఆప్రదేశము మధ్యభాగమున నొకవటవృక్షముండెను. దానిమూలము నానుకొని చుట్టును నున్నతమును విశాలము నగుశిలావేదిక యుండెను. ఇట్టివృక్షములును, వేదికలును భారతదేశమునందు నేఁటికిని సర్వసామాన్యము. అందఱు నాయరుఁగుపైఁ గూర్చుండి యిష్టాగోష్ఠినిమగ్నులైరి. ఇప్పుడు హూణులక్షిగీలై యుండురఘుపతియు, నాతనితనయయు, భద్రబాహువును నిర్భయులైయుండిరి. కడకు హూణభటులుసైతము తాము బంధితులమనుమాటయేమఱచి యాలోకాభిరామమునందుఁ బాల్గొనుచుండిరి. హరిరాముఁడు తనసాహసపుఁబనులఁ గథలుగా సల్లి సభ్యులకుఁ గర్ణరసాయన మొనరించుచుండెను. సరస్వతి తనతండ్రిప్రక్కఁ గూర్చుండి యాకథల నాలకించుచుండెను. హరిరాముఁడామెతో "ఏమమ్మాయీ! నేను ఘాతకుఁడనని నీవనుకొంటివికదా! హరిరాముఁడనిన యమ

కుల కెంత యసహ్యమో చూడుము! చోరాధముఁడని తలంచురాజకుమారుం డచట; హంతకశిఖామణియని యెగ్గులాడురామామణి యిచట! ఆహా! దైవమా! ఈదిక్కుమాలినహరిరాముని నిర్దోషిత్వము బయలగు టెన్నఁడో కదా!" అని రఘుపతివైపు తిరిగి "ఆర్యా! ఈబాల పేరేమి?" అని యడిగెను.

రఘు:—సరస్వతి.

హరి:—సరస్వతి! సరస్వతి! మిగుల సుందరమగు పేరు! మనోహరమగు నామధేయము! ఈ పేరును మఱువను.

మనోజ్ఞమగు నానామధేయబీజము, బాలాదిత్యునిహృదయతలమునఁ బడి నాటుకొనినదనిమాత్ర మచట నెవ్వరికిఁ దెలియదు.

హరి:—ఈ మెపయ స్సెంతయుండును?

రఘు:—పదునేడేండ్లు నిండినవి.

"పదునేడా! నాకు నలువదియేండ్లుండును. నావయస్సున కీయాడు గలపుత్రిక యుండవచ్చును. ఇఁకమీఁద నీబాల నావిధమునఁ జూచుకొనియెదను" అని హరిరాముఁడు సరస్వతిఁ జూచి "అమ్మాయీ! నీవిఁక నాపై దయమాలి యుండరాదుసుమా! అట్లుకాక, నీవు నన్ను ఘాతుకుఁడని తలంచి నిన్ను రక్షించుటకై యీరాజకుమారుఁ బ్రార్థించినయెడల, మీరిద్దఱు అనురాగబద్ధులై యున్నారని ప్రకటించెద. ఇందుల కేమనియెదవమ్మా? ఇది నీకు సమ్మతమా?" అని పరిహాసమాడెను. హరిరాముని పరిహాసభాషణములకు సరస్వతి సిగ్గొంది, పైఁటకొంగున ముఖము గప్పుకొనెను. ఆచోరనాయకుని హాస్యపుఁబలుకులకు బాలాదిత్యుఁడుకూడ లజ్జపడెను. ఆతనివదనాంబుజము ప్రఫుల్లమయ్యెను. ఆతఁడు సిగ్గుపెంపున ముఖము నావలఁ ద్రిప్పుకొనెను. ఆతనియభిప్రాయ మిప్పు డందఱకు వ్యక్తమయ్యెను. ఆతఁడు సరస్వతిని క్రీఁగంటఁజూచుచు, ముసిముసినవ్వులు నవ్వుచుండెను. హరిరాముఁడు మందహాస మొనరించుచు "రాజకుమారా! యుద్ధనియమములకు వ్యతిరేకముగ, నే నాయుధములు ధరింపని నీతోఁబోర సమకట్టియుంటినికదా! ఇప్పుడైన

నిదిగో, యీవలువను ముఖమున ధరింపుము." అని యొక వస్త్రము నాతని పైకి విసరివైచెను. సభ్యులందఱు పెద్దపెట్టున నవ్విరి. హరిరాముఁడు తన చెయిదమును మన్నించ బాలాదిత్యుని వేఁడుకొనెను. ఇంతలో విందు సిద్ధమయ్యెను. అందఱును బాఱులందీరి భుజింప మొదలిడిరి. తలకొకతీరుగాఁ బదార్థరుచి భేదములపై వ్యాఖ్యానము లొనరించుచుండిరి. సాధకములలో నుప్పు తక్కువ యని కొందఱాక్షేపించుచుండ, మఱికొందఱు హెచ్చుగా నున్నదనుచుండిరి. అన్నము సంకటియైనదని కొందఱనుచుండ, మఱికొందఱు బిరుసుగా నున్నదనుచుండిరి. మంచినీరు వేడిగానున్నవని కొందఱనుచుండ మఱికొందఱు చల్లగా నున్నవనుచుండిరి. పాయసములోఁ బంచదార యెక్కువ యని కొందఱనుచుండ, మఱికొందఱు తక్కువ యనుచుండిరి. విస్తరాకులు చాల విశాలములని కొందఱనుచుండ, మఱికొందఱు చాల చిన్నవనుచుండిరి. ఈ విధమున వారు తలకొకవిధమున మాటలాడుచు 'లోకో భిన్నరుచిః' అను నానుడిని సార్థక మొనరించుచుండిరి. విందు క్రమముగ పాయసముకడకు వచ్చెను. ఎవరైన బద్యమో శ్లోకమో చదువవలయునని హరిరాముఁడు పట్టుపట్టెను కాని యెవ్వరైనను నందులకు బూనునట్లుండలేదు. అంతట నాతఁడు సరస్వతిని "అమ్మాయీ! సరస్వతీ! నీవొక పాట పాడవలయును" అని యడిగెను.

సర.—నేనా పాటపాడుట! నాకేమియు జ్ఞప్తిలేదు.

హరి.—ఆశువుగాఁ బాడుము.

రఘు.—ఆశుకవిత్వమునం దీబాల నిపుణురాలు.

వీరిమధ్య సరస్వతి తప్పించుకోలేకుండెను.

హరి.—హూణులు నీవదనమునఁ గప్పినముసుఁగు నిఁకఁదీయుము.

హరిరాముఁడు సరస్వతి వదనావకుంఠనమును దొలఁగించెను.

ఒక్కసారిగా సభ్యులందఱాశ్చర్యచేతస్కులైరి. సూర్యరశ్మి కగమ్యమైయుండు నాయుటవీస్థలము, భానుకిరణదీప్తిభాసురమైనట్లయ్యెను.

అయింతివదన మంత విలాసభాసమానమై యుండెను. ఆమె తనూవల్లిక బంగారు కాదుగాని, బంగారునకు దానికి నెట్టివ్యత్యాస మగపడుటలేదు. సంపూర్ణవసనాచ్ఛాదితమయ్యు, మెఱుపుఁదీఁగెఁబోలిన నామె మేనికాంతి నల్గడలఁ దళతళయని ప్రసరించుచుఁ జూపఱ కా కోమలాంగి యలౌకిక విలాసవిభాసిని యని చాటుచుండెను. లావణ్యసంభరితమగు నాతరుణీమణి వదనాంబుజము వినమ్రభావసంపూరితమై ముద్దులు మూటగట్టుచుండెను. సకలజన సమ్మోహనకరములగు మందహాసాంకూరములు హృదయాహ్లాదప్రదములై, యా మోహనాంగి యమాయకత్వమును వెల్లడిసేయుచుండెను. ఆశిరోజములు సాంద్రములు; స్వాభావికనీలవర్ణ సంశోభితములు. ఆలలాటమతివిశాలము; ఉన్నతము. ఆకన్బొమలు కమనీయములు; శిల్పచాతురీ విలసితములు. ఆనేత్రము లాకర్ణాంతములు; శాంతశృంగార వ్రీడాభరితములు. ఆకర్ణము లతిమృదులములు; అమూల్యకర్ణాభరణశోభితములు. ఆనాసిక సమున్నతసుందరము; సక్రమసంశోభితము. ఆపలువరుస ప్రభాసంపూర్ణము; దాడిమీబీజసదృశము. ఆసభ్యులయెదుట సాక్షాత్కరించి నిలిచిన దట్టిదివ్యాంగన. ఎక్కడి సరసాలాపము లక్కడ నాగిపోయెను. దిదృక్షువులదృక్చంచరీకము లాయువనామణి యాననాంబుజముపై వ్రాలి, సౌందర్యరసాస్వాదన మొనరించుచు విడిచివచ్చుటలేదు. నిలుకడఁగాంచిన మెఱుపుఁదీఁగెయో యనునుండు నాలావణ్యరాశి యంతలో నంతర్ధానమగునేమో యని సభ్యు లామెను గన్నార్పక చూచుచుండిరి. ఆముప్పదిమంది సభ్యుల యఱువదికన్నులనుండి వెలువడు వీక్షణనారాచములధాటికి, సరస్వతి యోర్చుకోలేకుండెను. లజ్జాభరమున నామె యొకవైపునకుఁబోయెను. అచట బాలాదిత్యుఁడాసీనుఁడై యుండెను. ఒక్కమాఱు వారివిలోకనము లొండొంటితో వియ్యమందెను. వారిమోముదమ్ములు స్మేరాంకూరవిలసితము లయ్యెను. సిగ్గుపెంపున సరస్వతి తలవాంచెను. హరిరాముఁడామెతడఁబాటు నాలోకించి "అమ్మాయీ! సరస్వతీ! ఏదీ నీపాట?" అని హెచ్చరించెను.

“దేనినిఁగూర్చి పాడుట?” అని యా ముద్దుగుమ్మ మందస్వరమునఁ బ్రశ్నించెను.

హరి:—ఏదైనను సరియే. యుగయుగంబులనుండి యీమఱ్ఱిచెట్టిట్లే నిలిచియున్నది. మనబోఁటివారలకు నిలువనీడనిచ్చి, పరోపకారియై జీవించుచున్నది. దీనిపవిత్రచారిత్రము నించుక పాడుము.

సర.—సరియే. అయిన దీనిచారిత్రమునుఁగూర్చి పాడెద.

హరిరాముఁ డామె యంగీకారమున కుప్పొంగి ‘సద్దు. సద్దు’ అని చప్పట్లుగొట్టెను. తోడనే సరస్వతి సౌందర్యముపైని వ్యాఖ్యానము లెక్కడి వక్కడ నిలిచిపోయెను. సభయంతయు నిశ్శబ్దముగా నుండెను. సరస్వతి తన మృదుమధురస్వరమున మ్రోడులు చిగిరించున ట్లీవిధమున గానమొనరింప మొదలిడెను.

మఱ్ఱిచెట్టు.

ఓతరూత్తమ! నీవు సనాతనుఁడవు.
కాలపరిణామదశ నీకుఁ గలుగదేల?
కాలవశమున సర్వంబు కదలిపోవ,
ఎట్టు లుంటివి యీరీతి? ఎఱుఁగఁ జెపుమ.
అవని నాయకరత్నమై యలరె నెవఁడు?
మానవులలోన మేటియౌ మాన్యుఁ డెవఁడు?
దానధర్మప్రవీణుఁడై తనరె నెవఁడు?
ఘనుఁ డశోకునిపాలనఁ గాంచితీవు.
దొసఁగు లెప్పుడు చేసెడిదుష్టమతుల
బారిఁబడలేక, దేశంబుపడెడుపాట్లు
కననియట్టుల నంతయుఁ గాంచితీవు.
మానవులచర్య గమనించి మంటివీవు.

అవనిజనులకు నెఱుఁగంగ నలవికాని
జీవిమర్మంబు సాధించి వెలఁగితీవు.
సంయమీంద్రులె నీతోడ సాటిగారు
సకలగుణసీమ! ఓవటసార్వభౌమ!

ఆదివ్యగీతిక కమ్మగానుండెను. 'సెబాస్ సెబాస్' అని సభ్యులు తల లూఁపిరి. ఆగానామృతమును వారు వీనులఁ గ్రోలి, దానిమాధురీమహిమను బ్రశంసించుచుండిరి. హరిరాముఁడు ప్రమోదహృదయుఁడై "భళిరే. భళిరే. నా వటవృక్ష మింత ప్రసిద్ధమైనదని నాకింతవఱకుఁ దెలియదు. గీతములందలి భావములన్నియు నీహృదయపూర్వకము లనుకొందును. కాని యశోకుఁడు మానవులలో మేటియగు మాన్యుఁడంటివి. ఆవిషయముమాత్రము విశ్వసనీయము కాదు. అశోకునికంటె మేటియగు మానవుఁడు లేఁడా? నీమానసము నిట్లు నొవ్వఁజేయుట నాయభిమతముగాదు. సరి. ఇఁకఁ జాలును. ఇఁక నందఱకు సెలవు" అనెను. అతనియానతిని తలాల్చి హరిరామునసుచరులు స్వకార్యములపై నటకేనిఁబోయిరి. పనియుఁ బాటయుంలేనివారుమాత్రము, ఇష్టాగోష్ఠిఁ గాలముఁ గడపుచుండిరి.

---

# తొమ్మిదవ తరంగము.

## బాలాదిత్యుఁడు-సరస్వతి.

బాలాదిత్య, యశోధర్మ, భానుగుప్తులకుఁ బ్రొద్దుపుచ్చుట కేమియుఁ దోఁపకుండెను. అట్లే సరస్వతి, రఘుపతి, భద్రబాహువులుకూడ గోళ్లు గిల్లుకొనుచుఁ గూర్చుండియుండిరి. అంతకుమున్నే హరిరాముఁడు గుఱ్ఱముల నొకకుటీరమున బంధించి వారికిఁ గాపుండెను. హరిరాముఁడు జనరాణువతో నెందో చనెను. వీరార్గురును నావిశాలశాద్వలతలమున నెట్లనదు నను, నికుంజములమధ్యను, తలకొకమూలకుఁ జేరి, యెట్లో కాలము వెళ్లఁదీయసాగిరి. ఆవనము మనోహరముగా నుండెను. బ్రహ్మాండములగు పాదపరాజము లంబరము నంటుచున్నవో యన నిలువఁబడియుండెను. వివిధ లతాద్రుమములు ల్లిబిల్లిగాఁ బెనవైచుకొని యాపాదపాగ్రముల కెగఁబ్రాఁకియుండెను. బాలాదిత్యుఁ డచట నిటుఁ దిరుగుచు, నానికుంజాంతరముల నొకయెడకు వచ్చెను. ఆరణ్యకదృశ్యరామణీయకమో-అస్పృశ్యవ్యక్తిమోహనరూపమో-ఆతనిభావనాప్రపంచము నావరించియుండెను. మతి యొకచోటను, మేనొకచోటను నుండు తోలుబొమ్మవలె నిలిచియుండు నారాజకుమారునివీనులకు "ఆర్యపుత్రా! మీమానసము నంతగాఁ గలఁచున దేమ్యది?" అనుమృదుమధురప్రశ్నావాక్యము వినఁబడెను.

ఆసవ్వడి కారాజకుమారుఁ డులికిపడి తిరిగిచూచెను. చూడఁగా నచట సరస్వతి యుండెను. ఎందులకో యాతఁడు బిడియమందెను. ఆతఁడాదరిం గూర్చియే యాతఁ డింతవఱకుఁ దలఁచుచుండెను. ఆతఁడు మందహాసము నొనరించుచు "ఏమియులేదు. నాసంగతులఁ గూర్చి తలపోసికొనుచున్నాను" అనెను.

సర:—అంతయేనా! ఆర్యపుత్రా! ఎచటికిఁ బోవలయుననిమీ తలంపు? ఉజ్జయినియందలిహూణులు కటికరక్కసులు. మీకు మగధయందు జేసెడు నేలయైన లేదు. మహానుభావులగుమీరు చోరగృహనివాసము నతినీచముగాఁ జూతురు. ఇఁక నెచటికిఁ బోఁగలరు?

ఈసంప్రశ్న మారాజకుమారునకుఁ దన కేరళపుత్రప్రయాణమును దటాలున స్ఫురింపఁజేసెను. అనాథజనసంరక్షణోద్యోగమునందును, హరిరామునియాతిథ్యస్వీకారప్రమోదమునందును,ఆవిషయము నాతఁడు మఱచియేపోయెను. కాని సరస్వతి యట్లాతనిఁ బ్రశ్నించుటతోడనే యావంగతి యంతయుం మరల మనసుకు వచ్చెను. "అవును. నేను కేరళపుత్రమునకుఁ బోయెదను" అని బాలాదిత్యుఁడు గద్గదకంఠమునఁ బలికెను.

సర.—కేరళపుత్రమునకా? ఆర్యపుత్రా! ఈదేశమును వీడిపోవుటకు మీకు దుఃఖముగా నున్నదా?

బాలా:—సిన్నటివఱకు లేదు. కాని యిప్పుడుమాత్రము చాల సంకటముగా నున్నది.

సర:—ఈభావపరివర్తనమునకుఁ గారణము?

"నీకుఁ బరిచయములును, నాకు సంతోషావహములును నగునాలుగక్షరము లిందుకుఁ గారణము" అని బాలాదిత్యుఁడు మందహాస మొనరించుచుఁ బలికి, కన్నార్పక యాకోమలిఁ జూడసాగెను. ఆయక్షరముల గ్రహించి, సరస్వతి లజ్జనొందెను. ఆమగువ మోము నావలకుఁ ద్రిప్పుకొనెను. కన్నీటిబొట్టొకటి యామెచెక్కిలిపైనుండి జాఱి క్రిందఁబడెను. ఆయువతి పైఁటకొంగున తెప్పలద్దుకొనుచు నొకటిరెండునిముసము లట్లే నిలువఁబడియుండెను. "అయిన నార్యపుత్రా! మాగతి యేమగు ననుకొంటివి?" అని శోకనిరుద్ధస్వరమున నడిగెను.

బాలా:—అందులకు నేనేమి చేయఁగలను? ఆవిషయమున నాకేమి జోక్యమున్నది? నీతండ్రి నిన్నుచటికైనఁ దీసికొనిపోఁగలఁ డనుకొనియెద. ఆయనకుఁ దెలియని దేమికలదు!

సర:—ఆర్యా! ఆయనకేమియుఁ దెలియదు. అతఁడు మూఁడుకాళ్ల ముసలి. అశక్తుఁడు. యువకసామాన్యములగు కార్యనిర్వహణశక్తియు, కార్యనిర్ధారణసామర్థ్యమును నాతనికి లేవు. ఆర్యపుత్రా! హయరాజము నధిరోహించి హరిరాము నాజ్ఞాపించు మిమ్ములను నాఁడు నేను చూచినపుడు, 'నన్నుఁ గాపాడి ప్రేమించుటకు మీవంటిసోదరుని. గలిగియుండుభాగ్యము నాకు లేకపోయెఁగా' అని నొచ్చుకొంటిని.

బాలా:—అటులనా? అసమానవిలాసభాసురాంగివి. నీవు గాన మొనరించుచుండ, నేను గాంచి నాకు నీవంటి...

"అనుఁగుసహోదరి లేకపోయె ననుకొంటిరా?" అని సరస్వతి మందహాస మొనరించుచుఁ బలికెను.

బాలా:—సహోదరియనికాదు. ఏమియో వేఱుగాఁ దలంచితి. చెప్పుమనియెదవా?

సర:—వలదు. చెప్పవలదు. మనగమ్యస్థానమునుమాత్ర మొఱింగింపుఁడు.

బాలా:—హరిరామునికడ నేల నుండరాదు?

స:—హరిరామునికడనా? చోరనాయకునిచూరుపట్టుకొని వ్రేలాడుటయా? ఆర్యపుత్రులు మాకొనరింపనుండుసాయ మియ్యదియేకాఁబోలు. దొంగలరాయనియింటఁ గాలముగడపుటయా? ఛీ ఛీ! ఆర్యపుత్రా! ఉన్నతవంశజులగు మీనోట నిట్టిమాటలు వచ్చినందులకు నాకు సిగ్గగుచున్నది.

బాలా:—సరస్వతీ! నిన్ను నొప్పించితిని. తప్పుఁదలంపకుము. కాని యీయొంటిదేశమునకుఁ గారణము కలదు. నిన్నుఁ గనుఁగొనుటకు హూణులు

నిశ్శ్వప్రయత్నము లొనరింపఁగలరు. ఏలయన, నీవిషయమున నారాయణ శర్మకుఁ జాలసంబంధమున్నది.

సర:—(విస్మయముతో)నారాయణశర్మకా?

బాలా.—అవును. అతఁడు నిన్ను సాధించితీరును. నీవు వారికిఁ జిక్కకుండఁజాలవు. హరిరాముని వంటిపరాక్రమసంపన్నుఁడు నిన్నుఁగావకున్న, వారు నిన్ను మరలఁ బట్టుకొనిపోవుట నిశ్చయము.

సర.—నిజము. కాని ఆర్యపుత్రా! ఇచటఁగూడ నిరంకుశులు గామాంధులు నగుయుంపకులు పెక్కురున్నారు. నేనుగూడ మీతోడఁ గేరళపుత్రమునకు వచ్చినమొదల, సురక్షితనై యుందునుగదా?

బాలా.—కేరళపుత్రమునకా? కేరళపుత్రమునకు రావలయునని నీవు మనసార ననుచున్నావా? ఆహా! ఆదేశము మిగుల సుందరమైనది. అచటి జీవన మత్యంతసౌఖ్యప్రదము.

సర.—(మందహాసముతో) అయిన నార్యపుత్రా! అచటికిఁ బోవలసి వచ్చిన మీాగ్రహచారమునకై కుందుచున్నారా?

బాలా.—అవును. కేరళపుత్రమున సరస్వతి లేదుగదా!

బాలాదిత్యుని నర్మభాషణములకు సరస్వతి లజ్జావనతముఖియయ్యెను. "ఆర్యపుత్రు లిఁక నీవిధముగఁ బలికిన, నేను బోయెదను. మరల మీాతోఁ బలుకను" అని యామెలువ నిష్ఠురోక్తులాడెను.

బాలా.—వలదు వలదు. నీయట్టిసుందరాంగు లాదేశమున లేరంటిని గాని మఱేమియుఁ గాదు.

సర.—అంతతోఁ బోనిండు. ఆర్యపుత్రా! మమ్ములఁగూడ మీావెంటఁ గేరళపుత్రమునకుఁ గొనిపోనియ్యకొనరా?

బాలా.—అందుల కభ్యంతరములేదు. కాని నీజనకుఁ డంగీకరించునా? మఱియొకమాట. సరస్వతీ! విదేశజీవనము నీకు సరిపడునా? నీమాతృదేశము

నకును గేరళపుత్రమునకు నెంతయో వ్యత్యాసమున్నది. నిజన్మభూమిపాలఁ తువ యచటఁ గానరాదు.

సర.—ఆర్యపుత్రా! ఈసంశయములన్నిఁటి నొఱసిచూచియే, యీ విషయమును నిర్ధారించుకొంటిని. గుప్తాన్వయభూషణుఁడే దేశత్యాగమొన రించుచుండ, ననదయగు నిసరస్వతిమాత్ర మేల యట్లొనరింపరాదు?

బాలా.—కాని సరస్వతీ! మరల మాతృభూమికిఁ దిరిగివచ్చు నుద్దేశ ములోదనే పోవుచున్నాను.

సర.—నేనుమాత్రము? ఒక్కమారుగా స్వదేశమును విడువ నుద్యో గించితినాయేమి? భయపడకుఁడు. మీవెంట నేనుగూడ మరలివచ్చెద.

బాలా.—నీ వతిచాకచక్యముగా వాదింపఁగలవు!

సర.—మీరుమాత్రము! యుక్తియుక్తముగాఁ దప్పించుకొనరా!

బాలా.—అయిన రమ్ము! ఈవిషయమై భద్రబాహువుతోడను నీతండ్రితోడను సంప్రదింతుదము.

అని బాలాదిత్యుఁడు, రఘుపతిభద్రబాహువు లుండుచోటకుఁ బోయి, రఘుపతితో "ఏమండీ! మిమ్ములనందఱను నేను కేరళపుత్రమునకుఁ దీసికొని పోవలయునని, యిదిగో మీకుమారి మొండికిఁబడియున్నది. దీనికి మీకు సమ్మ తమా?" అనెను.

సర.—ఆహా! అయనకు సమ్మతమే. ఒప్పుకొనితీరును.

రఘు.—ఏమమ్మా! ఇదిన్యాయ్యముగాదు. ఇంతకు నన్నేల యడుగవల యును? నీయిష్టానుసారము బదులిచ్చుటకు నన్ను బలవంతపెట్టుటే! అది ధర్మము గాదు. నాసొంతయభిప్రాయ మేమనిన, నయ్యది నాకు సమ్మతమందును. ఆరాజ కుమారుని నీవు బలాత్కరించుచున్నావు కాఁబోలు. సరస్వతీ! ఈతఁడు రాజకుమారుఁడు. మనకొఱకై యాతఁడు శ్రమనొందుచుండఁజాలఁడు. ఈ సంగతి నీవు మఱచినట్లున్నది. ఇంతదనుక నీవిషయమై దిగులొందుచుంటిని. నీయోగక్షేమములభారము నీరాజకుమారుఁడు వహియ నియ్యకొనినచో, నా

స్వాంతము ప్రమోదభరితముకాఁగలదు. కాని అమ్మాయీ! నన్ను సంరక్షించుటకుఁగూడ నాతఁడు మాటయిచ్చెనా?

సర.—ఇచ్చెను. నిన్నును, నీస్నేహితునిభద్రబాహువునుగూడ రక్షింపఁ గోరియున్నాఁడు.

భద్ర.—అవును. 'బాలాదిత్యునికంటె, నిర్మలహృదయము నయనానందకరముగ నుండును' అని జైనపరమాత్ముఁడు సెలవిచ్చియున్నాఁడు.

బాలా.—అనఁగా, బాలాదిత్యుఁడనగు నాకంటె, సరస్వతి సహృదయసంపన్నురాలని నీమాటలయర్థముగదా! ఇట్టిమనోహరభావప్రకటనమున కొకదయ్యము కావలయునా! మీజైనపరమాత్ముఁడుగూడ దానికి వలదు. ఇఁకఁ బ్రస్తుతము కేరళపుత్రప్రయాణము నీకు సమ్మతమేనా?

భద్ర.—అచటఁ జాలమంది జైనులున్నారట! కాన నేనుగూడ నచటికివచ్చి, పవిత్రమతగ్రంథముల నింకేమైనఁ గ్రొత్తవిషయము లుండిన గ్రహించుట మంచిదిగదా?

సర.—అచట జైనులు లేకుండిన?

భద్ర.—లేకుండిన, నేనచటికివచ్చి జైనమతమును వారలకు బోధింపఁదగియున్నది.

సర.—చూచితిరా? వారిద్దఱు వచ్చుట కిష్టపడుచున్నారు. నేనుగూడ సురక్షితముగా నుండఁగోరుచున్నాను. ఆర్యపుత్రునిప్రయాణ మెప్పుడో?

బాలా.—ఒకనెలమీఁదట విక్రమయనునొక బారుకచ్ఛమునుండి కేరళపుత్రమునకు బయలుదేఱుచున్నది. దానిలో నొకగదిఁ దీసికొనవలయుననియున్నాను. మీరును వచ్చెడల, మనము నాలుగుగదుల నేర్పాటుచేసికొందము.

రఘు.—సరియే. ఈసంగతిని హరిరామున కెఱింగింతము.

అంతలో హరిరాముఁ డచటి కరుదెంచెను.

హరి.—దేవా! మీరేమి యోజించుచున్నారు!

బాలా.—హరిరామా! ఒకనెలతాళి కేరళపుత్రమునకుఁ బోనెంచి యున్నాఁడను. ఈబంధితులు మూవురు నాతో రానెంచియున్నారు. ఇప్పుడు వీరు నీయధీనులుకదా! వీరు నావెంటవచ్చుట నీకు సమ్మతమేనా?

హరి.—దేవా! ఆముగ్గురిలో నిద్దఱివిషయము నాకు వలదు. ఇఁక మూఁడవవ్యక్తియా? ఆకోమలాంగి నాకూఁతురు సుమా! నాకూఁతువలె నామెను నేను ప్రేమించుచున్నాను. కారణము నాకే తెలియదు. నా పుత్రిక గతించి యిప్పటి కెనిమిదేండ్లైనది. కాని యీహరిరాముఁ డింత కాలముగా నిందులో నర్ధాంశమైన వేఱొకసాధ్విపై ననురాగ ముంచి యెఱుఁగఁడు.

సర.—నీపుత్రిక యేమైయుండెను? ఆమె యీడెంత? ఆమె యేల మరణించెను?

రఘు.—అమ్మాయీ! ఈవిషయము నీవెఱుంగవా?

హరిరామునివదనాంబుజము కోపానలమునఁ జేవురించెను. అతని కనులు చింతనిప్పులవలె గనగనలాడుచుండెను. కటము ఎగిరిపడుచుండెను. అతనికుడిచేయి యొకమారు మొలనుండు కరవాలముపై వ్రాలెను. కాని యా దొంగలరాయఁడు దంతలోఁ బ్రజ్ఞవడసి గద్గదకంఠమున "ఈసంగతి నీకుఁ దెలియనే తెలియదా? నారాయణిని నీవెఱుంగవా?" అని ప్రశ్నించెను.

సర.—నారాయణియా? ఆసాధ్వీశిరోమణి నీకూఁతురా!

హరి.—నా కామెయొక్కతయే కూఁతురు. ఆమెకు నీవయస్సుండును. ఆమె రూపమునఁ దల్లికిఁ దీసిపోయెడిది కాదు. అచ్చుగ్రుద్దినట్లు తల్లి వలె నుండెడిది. నాతనయ నాపెన్నిధానమైయుండెను. ఆమెఁ జూడ నా కన్నులకుఁ బండువైయుండెను. అప్పుడు నేను ధార్మికుఁడనై యుండెడి వాఁడను. నాహృదయము కుసుమకోమలమైయుండెను. నాగుణము లతిసున్ని

తములై యుండెను. నేను నారాయణిని నాదైవముగనే ప్రేమించుచుంటిని. కాని యట్టియలౌకికశుభచారిత్ర యీలోకమున నుండఁదగదు. కడకొక నాఁడు హూణులామెను జెఱబట్టిరి. వారామెను మానభంగమొనరించిరని వినిననాఁడే, యామె చచ్చిన మతియు మేలనుకొంటిని. కాని యామానవతి యగ్గిఁబడి మ్రగ్గియయ్యెనని వినినయప్పుడు, అయ్యో! నాకూర్మిపుత్రి జీవములతో నుండకపోయెనే యని చింతించితిని.

సర.—అన్నన్నా! నిన్నుఁ జూచిన జాలియగుచున్నది.

హరి.—నాగతికై జాలిపడరాదు. నాకుఁ దగినశాస్తి యైనది. హూణులతోఁ బోరాడ నేనెట్టి ప్రయత్నములుఁగాని చేసినవాఁడఁగాను. వారు మనదేశముపై దండెత్తివచ్చినప్పుడు స్వార్థపరుఁడనై నాయాస్తిని, నాతనయమాత్రము రక్షించుకొనినఁజాలునని తృప్తినందియుంటిని. అందులకు భగవంతుఁడు నాకుఁ దగురీతి బుద్ధిచెప్పెను. స్కాందగుప్త సార్వభౌముఁడు మృత్యుశయ్యఁ జేరియుండినప్పుడుకూడ, స్వదేశరక్షణార్థము సైనికులకొఱకుఁ గుయ్యిడెను. కాని యామహారాజు యుద్బోధములన్నియు నరణ్యరోదనములయ్యెను. ఒక్కఁడైన ముందునకు వచ్చి, నడుముకట్టి నిలువలేదు. ఆరాజన్యుఁడు విసుఁగుగొని జీవములఁబాయుచు బెట్టినశాపఫలమును నేనిప్పు డనుభవించుచున్నాఁడఁ గాఁబోలు!

బాలా.—అట్లనకుము. నాపినతండ్రి స్వభావ మట్టిది కాదు. నీకుమారికైన పరాభవము నాతఁడు చూచియుండినచో, 'తనవిధ్యుక్తధర్మమునకు వ్యతిరేకముగ నామెను గాపాడకపోవుటఁ జేసియే, యట్టియవస్థ తనకుఁ గలిగెనవియు, నంతయు స్వయంకృతాపరాధఫలమని' తానే యని యుండెడివాఁడు.

హరి.—ఆతం డట్టివిశాలహృదయుఁడని నాకుఁ దెలియును. ఆతఁడు కరుణానిధి. 'నారాయణి యలౌకికరూపలావణ్య. ఆమె యేదే నొకరాజకుమారున కర్ధాంగియై యుండఁదగును. ఆయువరాజు రాజ్యపీఠి నధిష్ఠింపఁ

జేయుఁ భారము నాయది' అని యారాజశేఖరుఁడు సెలవిచ్చుచుండెడివాఁడు. కాని యిప్పుడు నాతనయ సింహాసనము నెక్కుటకుమారు సమాధి నలంకరించినది. అయ్యో! నారాయణీ! అయ్యయ్యో! నారాయణీ! నారాయణీ! ఓకృతఘ్నురాలా! నీజనకునిఁ బాసిపోయితివా? నీతండ్రిని పుత్రికాహీనుఁ జేసిపోయితివా?

ఆచోరనాయకుని దుఃఖదీనాలాపములు వారల నిర్విణ్ణులఁగాఁ జేసెను. అతని హృదయతలమునందొక గాయ మింకను బచ్చిగానుండి చురచుర మంట లెత్తుచున్నదనియు వారు గ్రహించిరి. కరుణయన నేమియో తెలియని యాదొంగలరాయఁ డంత మోహోన్మాదుఁడై, జీవకారుణ్యపరుఁడై యుండుటకు వారు వెఱఁగుపడిరి. నారాయణి మానముఁగోల్పోయినదని హరిరాముఁడు వినినపు డాతఁడు చకితుఁడుగాక 'అయిన నామె యింకను జీవముతో నుండ నేల?' అని పలికినట్లు వారు తలఁచియుండిరి. కాని వారి కిపుడు సంగతులన్నియు నున్నవి యున్నట్లు తెలిసిపోయెను. హరిరాముని యారాటముఁ గాంచి సరస్వతి చాల పరితపించుచుండెను. ఆయువిద హరిరాముని చెంతకుఁబోయి "నీతనయ మరణించినదికదా? ఇఁక నీతనయఁగా నన్నుఁ జూచుకొనుము." అని యనునయించెను. దుఃఖాంధకారబంధురంబై యుండిన హరిరామునిహృదయకుహరమున నానందజ్యోతి ప్రజ్వలించెను. అతనివదనము వికసించెను. "ఆహా! దైవమా! ఇంకను నాశాజ్యోతి మినుకుమినుకుమనుచున్నదా? ఈముసలిహరిరామునకు ముందుముందు మంచిదినము లున్నవా? లేవు. లేవు. అమ్మాయీ! నీవు నాకుమారి వెట్లయ్యెదవు? నీజనకుఁడు రఘుపతిగదా!" అని యాతఁ డనెను.

సర.—నాహృదయ మతివిశాలమైనది. మిమ్ములనిరువురను ప్రేమించుట కందు స్థలమున్నది.

హరిరామునిస్వాంతము సంతోషోత్సాహముల గంతులిడసాగెను.

"అయిన నన్నుఁ 'బినతండ్రి' అని పిలువుము. నీవు నాదత్తపుత్రివి" అని యాతఁడు మందహాసాంచితముఖుఁడై పలికెను.

హరి.—ఇంతకాలముగా మీరేమి యాలోచించుచుంటిరి? అమ్మాయీ! సరస్వతీ! ఇపుడు నీవు నాస్వీకారపుత్రికవుకదా! ఇఁక నీవు నన్ను వీడిపోఁ గూడదు. నాతోడనే యుండవలయును.

సర.—తండ్రీ! అదెట్లువీలగును? నాకొఱకై హూణులీవనమంతయు గాలించి, మనలఁ గనుఁగొనకమానరు. నీవుకూడ మాతోఁబాటు విపదంబుధిఁ బడుటేల?

హరి.—ఏమీ! వారు నానిజమూర్తిఁ గైకొనిరిగాక. నాదత్తపుత్త్రిం జెఱఁబెట్టఁజాలుదురా? దైవానుగ్రహమున నాకిపుడు ధైర్యోత్సాహము లపారములైయున్నవి.

సర.—అట్లని, మృత్యువును వలచి యింటికిఁ జేరంటమునకుఁ బిలుచు టెందులకు? అంత సాహసమువలదు. కొంతకాలము మేము కేరళపుత్రమునం దుండుట శ్రేయోదాయకము. ఇచటిపరిస్థితులు మాకు నిరపాయములైనపుడు, మరలిరానగును.

హరి.—అయిన నీయిష్టము. కాని త్వరలోఁ దిరిగిరావలయును. మీరందఱును ప్రయాణమునకు సిద్ధముగనున్నారుగదా! మీలో నెవ్వరైన ముందుగా నాకాశ్రయమునకుఁబోయి, దేవరవాఱుపోయిన మఱియు మేలు. అందఱ కన్నిగదుల నానాకయందు వసతిగలవానిగా నేర్పరించుకొనుట సముచితము. మీఁదు మిక్కిలి మీవెంట నీసుదతికూడ నున్నదికనుక నీకార్యము మిగుల ముఖ్యము.

బాలా.—నేనిప్పుడే బయలుదేఱెదను. వీరలఁదీసికొని నీవు బారుకచ్ఛమునకు రావలయును......తాళుఁడు. తాళుఁడు. ఆపాదపయందు గలగల శబ్దమేమి? మానవుఁ డెవ్వఁడైనఁ బ్రాఁకిపోవుచున్నాఁడా?

అని బాలాదిత్యుఁ డావైపునకుఁ బరుగిడెను. కాని యచట నెవ్వరు గాన్పింపలేదు.

"అయ్యా! వి కుందేలో గోమాయువో యైయుండును లెండు. మీరు రండు. కోమలగాత్రియగు సరస్వతి పదక్రమ నోర్వఁజాలదు; కాన నేను వీరలఁ దీసికొని మెల్లగా వచ్చి చేరుదును. నాకాశ్రయ మిచటికి నూఱుక్రోసు. మూఁడయనము కడచిన మైదానములు వచ్చును. భగవదనుగ్రహమున నాకడ బలాఢ్యములగు నడపిగుఱ్ఱములున్నవి. అవి సరాసరి గంటకు నాలుగుక్రోసులు పరువెత్తఁగలవు. దీర్ఘప్రయాణమున కవి తాళఁగలవు. రఘుపతియును, భద్రబాహువును, సరస్వతియును, నేనును నెమ్మదిగా వచ్చెదము. మీరుమాత్రము ముందుగాఁబోయి, మాకొఱకుఁ దగుప్రయత్నములఁ జేయుఁడు. ఇఁక ధనము గుఱించియా? మీకుఁ జాలకావలసియుండును. ఇదిగో తీసికొనుఁడు" అని హరిరాముఁడు, సముద్రగుప్త విక్రమాదిత్యరూపముద్రితములగు నేఁబది బంగారునాణెము లుంచిన సంచి నాతని కొసంగెను. బాలాదిత్యుఁ డద్దానిఁ గైకొని, హరిరాముఁ గొనియాడెను.

ఇంతలో నచటికి భానుగుప్తయశోధర్ములు వచ్చిరి. తనస్వామి యగుహూణరాజు సంశయమొందకుండఁ దాను కొలువుకూటమునకుఁ జేరి పోవలయునని భానుగుప్తుఁడు మనసుచేసికొనెను. కాలంజరుకోటకుఁ గల మార్గములు హూణులకంటఁ బడకుండునంతదనుకఁ దాను మహాకోసలమున సౌఖ్యముగ నుండవచ్చునని యూహించి, యశోధర్ముఁడు స్వరాజ్యమునకుఁ బోవ నిశ్చయించి, తనయభిమతమును బాలాదిత్యున కెఱింగించెను. కోదనే బయలుదేఱి, మహాకోసల బారుకచ్ఛములకుఁబోవు చీలుపుదారులవఱకుఁ గొండొరులు కలిసిపోయి, యాపైనఁ దమతమదారులఁబట్టి పోవలసినట్లు వారు నిర్ధారించుకొనిరి. ఇందులకుఁ గాలవ్యవధి లేకుండెను. వారిరువురును గుఱ్ఱముల నెక్కి యందఱ వీడ్కోలు లందిరి. సరస్వతిమాత్ర మొంటరిగా నావల నిలిచి

యుండెను. బాలాదిత్యుఁడా చిలుకలకొలికికడకుఁ బోయి "సరస్వతీ! మనము వీడిపోవలయును" అనెను.

"వీడినను, మరలఁ గలియకపోముగదా!"

ఆమెయొక్కమారు మిన్నుఁ జూచెను. అస్పష్ట మంజుభాషణము లేవియో యామె మధురాధరములనుండి వెలువడెను. ఇంతలో బాలాదిత్య యశోధర్మ లదృశ్యులైపోయిరి.

---

# పదియవతరంగము.

## బారుకచ్ఛమునకుఁ బోవుబాట.

ఇంతకుముం దరణ్యములోనికి వచ్చినమార్గమునఁ గాక, బాలాదిత్య యశోధర్మ లిప్పుడు వేఱొకమార్గమునఁ దిరిగివచ్చుచుండిరి. వృక్షలతాకీర్ణమై యిఱుకుగనుండు నాయరణ్యమునందు వారు తమగుఱ్ఱములను మెల్లఁగాఁ బోనిచ్చినను, అడవిని దాటి వెలికి వచ్చినవెంటనే వానినడకవడిని హెచ్చింపఁజేసిరి. ఒకగంటకంతయు వారు చీలుడుదారికడకు వచ్చిరి. తోడనే యశోధర్మ యశ్వము నాపెను బాలాదిత్యుఁడుకూడ గుఱ్ఱమును నిలిపెను. ఎవ్వరు నేమియుఁ బలుకలేదు. వారిమానసములు కర్తవ్యతామూఢములై యొకింతతడ వట్లే యుండెను. కడకు యశోధర్మ “దేవా! మనము విడిపోవలసివచ్చెఁగదా యని నాకు సంతాపముగా నున్నది” అని హెచ్చరించుకొనెను.

బాలా.—యశోధర్మా! నిజమాడితివి. మనవీడ్కోలునకై నాస్వాంత మెంత వేఁగుచున్నదో నీ వెఱుఁగనేరవు. నీవు నాబాల్యస్నేహితుఁడవు. ఒకకంచమునఁ దిని యొకమంచమున మనము పరుండుచుంటిమి. మరల నిన్నుఁ జూచుభాగ్యము నాకున్నదో లేదో!

యశో.—దేవా! కష్టములు కాఁపురము సేయునా? మంచిదినములు రావా! మరల మిమ్ములఁ జూచుభాగ్యము నాకుఁ గలుగదా! ఇంతకును గేరళపుత్ర మంతదూరదేశము కాదు. అప్పుడప్పు డచటివిశేషముల నక్రమముగా తెలుపుచుండెదను.

బాలా.—నేనుగూడ నటులే తలంచుచున్నాను. అందుచే నాకుఁ గొంతయూఱటగా నున్నది. హైందవపావనీశులసహకారము గూర్చియు,

హూణులదురంతములఁగూర్చియు నీవలన నప్పుడప్పుడు వినఁగలుగుదు నను కొనుచున్నాను.

యశో.—దేవా! మీముదల నాదలఁ దాల్చి నడుచుకొనుచుండెదను. ఇప్పుడు నేను మిమ్ములఁ బాసిపోవుచున్నాఁడనుగదా! ఏమో! ఇటు లెన్ని యేండ్లుండవలయునో! కాన మీతో రెండుసంగతులు విన్నవించుకోవలయును. సెలవా!

బాలా:—రెండుమూఁడుసంగతులా! పదివేలసంగతులఁ జెప్పవచ్చును. ఎట్టియాటంకము లేదు.

యశో:—సరి. ఈభానుగుప్తుఁడు ద్రోహియగుట, విశ్వసింపఁదగనివాఁ డనియు నా మొదటిమనవి. ఆతఁడు మీకు గర్భశత్రువు. బూటకపునటనలచే నాతఁడు శూరమ్మన్యుఁడై యున్నాఁడు. సందిగ్ధసమయముల నాతఁడు మిమ్ము విడనాడితీరును. ఆతనియందుఁ బూర్ణవిశ్వాస ముంచినయెడల, మి మ్మాతఁడు ముంచివేయును.

బాలా.—నే నాతని మితిమీఱి విశ్వసించుటలేదు. లాభకరములగు సమాచారముల నాతనికడనుండి లాగుకొనుటయందు మనకు నష్టమేమున్నది? సరస్వత్యాదులసంరక్షణమున కాతఁడేకదా కారణము! ఉపయోగకరములగు విషయముల సంగ్రహించుట కాతని దగ్గఱఁ జేర్చుచున్నాను. యశోధర్మా! వింటివికదా? ఇఁక నీసంశయమేమి?

యశో:—లేదు. ఇంకొకమనవి. దేవా! వీని యధికప్రసంగమునకుఁ గోపమొందక, సత్యమాడ వేఁడెద......మీరు సరస్వతిఁ బ్రేమించితిరా?

ఈప్రశ్నచే బాలాదిత్యునకు సిగ్గయ్యెను. "లేదు. ప్రేమించియుండ లేదు. అయినఁ బ్రేమించిననేమి?" అని యాతఁ డడిగెను.

యశో:—దేవా! ప్రేమించలేదుకదా? అహా! నాకు సంతసమైనది. ప్రేమించితిరేమో యని నాకు దిగులై యుండెను. వింధ్యసందర్భమునందలి మీచర్యయు, వారలను మీరు కేరళపుత్రమునకుఁ గొనిపోవుయోజనయు, మీ

మోహాంకూరమునకు సూచనలని భావించితిని. కాని మీచర్యలన్నియు ధీరోదాత్తనాయకుని సహజగుణములని గ్రహించి యూఱడిల్లితిని.

బాలా:—యశోధర్మా! ఆసరోజముఖిని నేను మోహించితినో లేదో యిపు డెందులకు? ఆలావణ్యవతి యేదే నొకరాజకుమారున కర్ధాంగలక్ష్మియై యుండఁదగినదని నీవు తలంపవా?

యశో:—ఆసౌభాగ్యవతి కమనీయగుణరాజములఁ గప్పిపుచ్చుటకు నేను మూఢుఁడఁగాను. ఆవనితామణి యనన్యరూపలావణ్యయని నాకుఁ దెలియును. ఆమెకంఠస్వర మతిమృదులమని నాకుఁ దెలియును. గానవిద్యయం దాసుందరాంగి యచ్చరమచ్చెకంటులకైన మించిపోఁగలదని నాకుఁ దెలియును. కాని యిన్నిసుగుణములుండియు నేమి ప్రయోజనము? దేవా! పురుషోత్తముఁ డగునీకును, సామాన్యయగు సరస్వతికి నెంతయో యంతరమున్నదని కూడ నాకుఁ దెలియును. వంశగౌరవవిహీనయగు నాతెఱవ యెక్కడ? ఉన్నతవంశప్రదీపకుఁడవగు నీ వెక్కడ? ఈఁగకు విధమునకు నెంత భేదము! ఆమె నీకర్ధాంగియగుటకుఁ దగదు. కాన నో దేవా! మీయుభయులయోగక్షేమముల మనసున నిడికొని, యిట్టియనర్థకరములగు మోహవాగురులనుండి మిమ్ముఁ దప్పించుట నావిధియని నిశ్చయించుకొంటిని. కాని దారుణములగు నాసందియములన్నియు నిరాధారములగుచున్నందుకు నాకు హాయిగా నున్నది.

బాలా:—ఆయోలనాగను నేను ప్రేమించుటలేదు. ప్రేమించినను బశ్చాత్తాప మొందను. ఇఁక మాబోఁటివధూవరులవిషయము నీతో నించుక ముచ్చటింపవలయును. వివాహనిర్ణయమునకు వధూవరులసమానగుణములే ప్రధానములు. కాని నీవనునట్లు కాముకీకాముకులపవిత్రప్రేమకు నడుమ నొండొరులకలిమిలేములను, వర్ణవిభేదములను, సంఘవిపర్యాసములను గొని వచ్చి యట్టివివాహముల నాక్షేపించుట యుక్తముకాదు. ఈసంగతులఁ బట్టి యించుక గమనించినచో సరస్వతి యెట్టిరాజకుమారికైనఁ దలఁదన్ను శక్తురా

లనియు, సముద్రగుప్తసార్వభౌముని మాతయు విచ్ఛవుల కుమారితయు నగు మా కుమారీదేవి కినయైన సాధ్వీశిరోమణి యనియుఁ జెప్పవచ్చును.

యశో:—దేవా! సద్గుణములు సమ్మాననీయములని నాకుఁ దెలియును. కాని యవి స్థానబలిమిఁబట్టి ప్రకాశించుచుండును. సౌందర్యము-సౌశీల్యము-సత్యము-శౌర్యము-క్షమ-వీనికన్నింటికి నేను దోసిలొగ్గుదును. అటులని సరస్వతిని గుమారీదేవితోఁ బోల్చుట కియ్యకొనను. సామాన్యుఁడగు నుజ్జయినీ పౌరుని పుత్రి యెక్కడ? విశ్వాధిక విక్రమవిరాజితుఁడగు సముద్రగుప్తసార్వభౌముని తల్లియు, పరాక్రమోజ్జ్వలులగు విచ్ఛవులతనయయు నగు కుమారీదేవి యెక్కడ? కాష్ఠమునకుఁ గల్పలతికకు సామరస్య మెక్కడిది?

బాలా:—సరిసరి. ఇఁక మన కీవిషయమున వాగ్వాదము వలదు. చెప్పవలసిన సంగతు లింకేమైన నుండినఁ జెప్పి కానిమ్ము.

యశో:—దేవా! ఒక్కవిషయము. కేరళపుత్రము పాషండమతమయమని వింటిని. అచట బౌద్ధులును, జైనులును బెక్కురున్నారఁట. రోమదేశమునకు వ్యాపారార్థముపోయివచ్చిన మన నావికులు, అచట జీససుని యనుచరులున్నారని చెప్పిరికదా! వారు కేరళపుత్రమునఁగూడ నున్నారఁట! దేవా! నాయుపదేశము నాలకింపవలయును. అనాస్తికమతావలంబులరై మీశరీర మానసిక శక్తులఁ గోల్పోయి యధఃపతితులు గావలదు. మీరు మతాంతరులైన యెడల, తోరమాన మిహిరగులుల నాశమొనరింప సమకట్టియుండు హైందవ నరేంద్రమండలి కధ్యక్షపదవిని నిర్వహించు నర్హతనుగూడఁ గోల్పోఁగలరని చెప్పక తప్పదు.

బాలా:—(చిఱునవ్వుతో) ఓహో! యశోధర్మా! నేను మతభ్రష్టుఁడనౌదునేమో యని యీ నీభయము? అవునా? కాని నా మతాంతరము హైందవ నరేంద్ర సమితి కధ్యక్షపదవి కడ్డుతగుల నేరదని నీకుఁ జెప్పఁగలను. ఇంతకును బుద్ధుఁ డెవరు? అతఁడు హైందవుఁడై పుట్టలేదా! హైందవుఁడై మన

లేదా! హైందవుఁడై యస్తమించలేదా! హైందవోత్తముఁడని హిందూదేశ చారిత్ర మాతని వేనోళ్ల గీర్తించుచుండుటలేదా!

యశో:—దేవా! మీమాట కాదనఁజాలను. కాని యాతనిసిద్ధాంతములు ప్రస్తుత మీప్రపంచమున కనవసరములనిమాత్రము చెప్పవలసియున్నది. అతఁడు మనకేమైన వినూతనసిద్ధాంతముల బోధించినాఁడా? లేదు. స్వానుభవములగు వినూతనమార్గములఁ జూపించెనా? లేదు. అసదృశమగుతత్త్వమును వినిపించెనా? అదియులేదు. అయిన నాతఁడు మనకేమిచ్చినాఁడు? ఏమియు లేదు. ఆర్షమతగ్రంథస్థములగు సిద్ధాంతముల నాతఁడు వల్లెవేసి, తానును నొకనూతనమతకర్తనని ప్రకటించుకొనినాఁడు.

బాలా:—ఆర్షమతగ్రంథములందలి సిద్ధాంతముల నొప్పుకొనినాఁడని నీవే యంటివి కదా! కాన నాతఁడు నాస్తికుఁ డెట్లగును?

యశో:—విపరీతసిద్ధాంతముల వెల్లఁబెట్టినందువలన.

బాలా:—నీకు విపరీతములైనవి, యితరులకుఁ దత్త్వసారములై యుండనగుఁగదా?

యశో:—ఉండనగును. కాని నాకుమాత్రము వికారములై యున్నవి. ఇంతకును బుద్ధుఁ డేమని బోధించినాఁడు? 'తల్లిదండ్రుల ప్రేమించి, వారిని సేవింపుము. గురుని బూజింపుము. దొంగతనము చేయకుము. మద్యపానము మానుము' అతనిముఖ్యసిద్ధాంతము లివియేకదా! సర్వసాధారణములగు నిట్టిబోధనలకు బుద్ధుఁడు కావలయునా?

బాలా:—సత్యవాక్యములయందలి పైమెఱుఁగులఁ జూపుటకు, దారిఁబోవువాఁ డెవ్వఁడైనఁ జాలును. మానవప్రకృతి మిగులఁ జిత్రమైనది. మాలిమివలన మానవుఁడు మతవిధుల నప్రయత్నముగా నొనరించుచుండును. స్వమతసిద్ధాంతముల నొఱపిడిపట్టకయే, యాతఁడు గ్రుడ్డినమ్మకమున వాని నవలంబించుచుండును. అట్టిమతవిధులకుఁ గలయవసరమును, తన్మతసూత్రములను స్వానుష్ఠానమునఁ గన్నులకుఁ గట్టునట్లొనరించి, మానవుని స్వమతసిద్ధాంతసార

మును గ్రోలఁజేయుటకు సమగ్రుఁడగు ప్రజ్ఞావంతుఁడుకాని చాలఁడు. అట్టిధీశాలియే బుద్ధభగవానుఁడు. జోరొస్టరు, కాన్ ఫ్యూషస్, ఏసుక్రీస్తు మున్నగు మతకర్తలకు నిస్సందియముగ నట్టిప్రజ్ఞాబలము లుండెను.

యశో:—అంతవఱకు నాకుఁ దెలియదు. ఆవిషయము లెంతమట్టుకు శాస్త్రవిహితములైనదియుఁగూడ నాకనవసరము. కాని నాస్తికులగు చార్వాకమతస్థులను దూషించునంతగా, నేను బౌద్ధులను దూషింపను.

బాలా:—నీవు నీకోడికి మూఁడేకాళ్లనుచున్నాఁడవు. కాన నీతోడి వాదము నిరుపయోగము. యశోధర్మా! ఒకమాత్రముగా నేను బౌద్ధ, జైన, క్రీస్తుమతములయందుఁ గలియను. ఇది నిజము.

యశో:—నాకుఁ గావలసిన దదియేసుమా! దేవా! ఇఁకఁ బనివినిరొద. భగవానుఁడు మీపయనమున మీకుఁ జేఁదోడువాఁదోడై యుండుగాక. జలాధిదేవతయగు వరుణదేవుఁడు మిమ్ముల సముద్రవీచికలపై సౌఖ్యముగాఁ గొనిపోయి, రత్నమయములగు కేరళపుత్రతీరముల దిగవిడుచుఁగాక!

అని దీవించియుం దీవించకపూర్వమే యశోధర్మయొక్కగంతులో గుఱ్ఱమునెక్కి, దానిని దోలెను. ఆతురంగ మంతలో వాయుగమనమునఁ బోయి చూచుచుండఁగనే యదృశ్యమైపోయెను. బాలాదిత్యునకుఁ బదులాడుటకుఁగూడ విలంబములేకపోయెను. అంతయు నొకతెప్పపాటులోఁ జరిగిపోయెను. దూరమునఁ జనుయశోధర్మ నవలోకించుచు, బాలాదిత్యుఁ డీవిధమునఁ దలపోసికొనసాగెను. "ఆహా! ఈయశోధర్మ యెంతవిచిత్రపుమానిసి. మాయెడబాటును సహింపనొల్లక యాతఁడు తనవారువమును దఱిమినాఁడు. ఉన్నతాశయసంపన్నుఁడయ్యును, తెల్లనిచంద్రునియందలి నల్లనిమచ్చవలె, నీతనికొకించుక దురహంకారము గలదు. ఇందుల కేమనుకొనవలయు? హైందవేతరులనిన నాతనికిఁ గిట్టదు. 'హైందవ' పదము నాతఁడు కుంచితదృష్టిఁ జూచుచుండును. నేనిపుఁడు హైందవుఁడఁగాన, నాతఁడు నావెంట నిపుడు నరకమునకు వచ్చుటకుఁగూడ వెనుఁదీయఁడు. నాకష్టముల నాతఁడు పంచు

కొన సంతసమున నంగీకరించును. నాకిపుడు గోఁచిపాతకు గతిలేకున్నను, నన్నాతఁడు 'దేవా' యని గౌరవపూర్వకముగాఁ బిలుచుచుండును. ఎల్లవిధముల నాకు విధేయుఁడై యాతఁడు నన్నుఁ దనయావత్ప్రాణముగా భావించుచుండును. కాని నేను వృద్ధుఁడనైనచో — సాధారణముగ నట్టివాఁడఁ గాను; ఏమో, రేపటిసంగతి నేఁడెట్లు చెప్పవలెను — నేను కవిసార్వభౌముఁ డనైయున్నను, నన్నాతఁడు పూరికిఁ గొనఁడు. నన్నాధార మొనర్చుకొని యుండిన దనయనురాగవల్లిక నాతఁడు మూలమట్టుగాఁ బెల్లగించి పాఱవేయును. దానఁ దనకు దుస్సహవేదనకలిగినను, సంతసమున భరించును. ఎంత చోద్యవర్తనుఁ డీయశోధర్ముఁ! అవును. లోకముకూడఁ జోద్యమైనదియే కదా! నేనుమాత్రము చోద్యుఁడఁగానా? పరకాంతలఁ గన్నెత్తిచూడని నేను— ఇటు లాచరించుటకుఁ గలనైన నెంచియుండని నేను— ఇప్పుడీకాంతాశిరోమణి సరస్వతికై వలవంతలఁ గుందుచున్నాఁడఁగదా! ఆ మెయిమూలమున నాకిపుడు చిచ్చుపట్టినట్లున్నదికదా! ఆమెతోడి సౌఖ్యముకొఱకు సర్వమును సమర్పింపవలయునని నాకు బుద్ధిపుట్టుచుండును. నాయెడ నెప్పుడా మోహనాంగి నను నాలోకింపవలయునని నేనపేక్షించుచుందును. సమయ మబ్బినపుడంతయు నాకలకంఠితో నించుకయైన భాషింపవలయునని యాశ జనించుచుండును. ఇట్టిభావము లనివార్యములై నన్నుఁ గలఁచి నలిచివేయుచుండును. మీఁదు మిక్కిలి యాముద్దులగుమ్మమనసున కెక్కుటకై నేనెల్లపుడు కోరుకొనుచుందును."

భావనాప్రవాహమునుండి బాలాదిత్యుఁ డిప్పుడు గట్టుకెక్కెను. అతఁ డిప్పుడు తనయశ్వమును బారుకచ్ఛమునకుఁ బోవుబాటపైఁ బోనియ్యసాగెను. ఆమార్గము నిర్జనమని చెప్పఁదగును గాని యుజ్జయినీనగరాభిముఖులై చను నొకరిద్దఱుబాటసారులుమాత్ర మక్కడక్కడఁ గానవచ్చుచుండిరి. ఆవిధమున బాలాదిత్యుఁ డించుమించుగ నొకగంటకాలముపోయెను. ఇప్పటి కినుఁ డపరాద్రి నలంకరించి, పశ్చిమదిక్కాంతఁ గూడఁ బోవుచుండెను. బాలా

దిత్యుఁ డట్లొకబాటసారిఁ గలిసికొనెను. ఆపాంథుఁడు బాలాదిత్యునికంటె వయోవృద్ధుఁడు. అతఁడు జవాధికమగు నశ్వము నధిరోహించియుండెను. బాలాదిత్యుఁ డాతని డాసి నమస్కారపూర్వకముగా "అందమైన యశ్వమండీ" అని హెచ్చరించుకొనెను.

బాటసారి:—ఓహో! అశ్వహృదయమునందు నీవు నిపుణుఁడవుగా నున్నావు. ఎనిమిదివందలపణములు పెట్టి దీనిని గొంటిని.

బాలా:—ఎక్కడ కొన్నారండీ?

బాట:—బవేరమునందు. ఇది యవనాశ్వము.

బాలా:—బవేరమునందా? నీవు బవేరమునకుఁ బోతివా?

బాట:—నేను వర్తకుఁడనండీ! నేను వ్యాపారార్థము వివిధదేశములకుఁ బోవుచుందును. మీ గుఱ్ఱము నెచటఁ గొన్నారండీ? ఇది సత్వసంపన్నముగాఁ గాన్పించుచున్నది.

ఆబాటసారి బాలాదిత్యుని వారువమును గన్నార్పక చూడసాగెను. అతఁడు విస్మితుఁడై "ఇది యపూర్వ గుఱ్ఱము. మీరు దారిదోపిడి చేయు మహానుభావు? కాని మీ మాట లీ పరమార్థికడ సాగవుసుమా! తెలియునా? ఒంటిమై యనమొనరించునపుడంతయు నీతనికడ ధనము శూన్యమై బల మధికమై యుండును." అని యాతఁడు నడుముకుఁ గట్టికొనియుండు 'తక్షశిల' కరవాలరాజమును—సుప్రసిద్ధమగుదానిని—లాగి జళిపించెను. కాని బాలాదిత్యుఁడుమాత్రము ఖడ్గమును దీయలేదు. అతఁ డించుక భ్రాంతినొందినట్లు నటించి "అయ్యా! నీవు నన్ను దొంగనుగా భావించుచున్నాఁడవా? అయిన వినుము. నేను దొంగనుగాను. ఇంకొకమారట్లు మీరు నుడివినయెడల, మనము పోరాడవలసివచ్చును. నీవు నన్ను నీచునిగాఁ దలంచితివి కాన, నీతోఁ గలిసి వచ్చుటకంటె నొంటరిగఁ బయనమొనరించుట సమంజసము." అని తనహాయమును బరువెత్తింపసాగెను. బాలాదిత్యుఁడ ట్లయిదాఱునిముసములు పోయియుండఁ బోకపూర్వమే, పరమార్థి యాతనిఁ గలిసికొని "అయ్యా! నిలువుము. నిలు

పుము. సుజనుఁడగువానిని పరమార్థి చోరునిగా భావించెనని నలుగురు విన కుందురుగాక! అయ్యా! నాతప్పును మన్నింపుము. మనఃపూర్వకముగా మన్నింప వేఁడుచున్నాను.'' అని పలికెను.

''నీప్రార్థనకు ముందే మన్నించితిని. నన్ను జోరునిగా భావించిన వానిలో నాకేమియు నీకుఁ బనియుండఁజాలదు. ఆహా! కడకు నేను దొంగ నైతినా!'' అని బాలాదిత్యుఁడు రోషమునఁ బలికెను.

పరమార్థి.—ఇవి యరాజకదినములు. ప్రభువులునయితము పేరునకు రాజులై దొంగలవలెఁ దడిగుడ్డలఁ గొంతులు గోయుచున్నారు. ఇఁక నేనో! వర్తకుఁడను. నీవో! అడవిగుఱ్ఱము నెక్కియున్నాఁడవు. మీఁదు మిక్కిలి బలాఢ్యుఁడవు. అట్టిచో నిన్ను నేను జోరుఁడవని తలంచుటలో నసంభావిత మేమున్నది!

బాలా.—నిజము. వైశ్యాగ్రణీ! నిజము. మీపయన మెచటికో నే తెలియంగనగునా?

పర:—కుమారా! దాని కాటంక మేమికలదు! 'విక్రమ' నావపైఁ గేరళపుత్రమునకు? జనుటకై ప్రస్తుతము బారుకచ్ఛమునకుఁ బోవుచున్నాను. నాసంగతియంతయుఁ జెప్పితినిగదా! ఇఁక నీగమ్యస్థానము నే తెలియంగ నగునా?

బాలా:—బారుకచ్ఛమే.

పర:—ఓహో! మనయుభయుల గమ్యస్థాన మొక్కటియేనా! అయిన మనమిప్పుడు మిత్రులమైతిమి. నిర్జనములును, నపాయకరములునగు నీమార్గములందొంటరిగఁ బయనమొనరించుట కించుక సంశయించుచుంటిని. అట్టి ప్రసంగమనుకోవలదు; బారుకచ్ఛమునకు మీప్రయాణమునకుఁ గారణము?

బాలా:—కారణము లేదు గీరణము లేదు. ఊరక. నేనుగూడ 'విక్రమ' నౌకపై రాఁదలంచియున్నాఁడ. నేనుగూడ కేరళపుత్రమునకు వచ్చెద.

పర:—ఓరే! బలేవాఁడవురా నీవు! నీ ప్రయాణముగూడఁ గేరళపుత్రమునకటరా! ఓ దైవమా! ఇదియేటి చిత్రము! ఇచట నుండువారు మనమిద్దఱము. ఉభయులకు నొకబాటపైఁ బ్రయాణము. ఉభయులకు నొక్కటియే నౌక. ఉభయులకు నొక్కటియే గమ్యస్థానము. అట్టియెడ నుభయులు నొండొరుల యెడ సంశయాత్ములై యున్నారుగదా!

అని పరమార్థి దిక్కులు పిక్కటిల్లునట్లు నవ్వ మొదలిడెను. పరమార్థి పొగరుఁబోతుతనమునఁ దన్ను 'ఒరే' అని సంబోధించుట బాలాదిత్యునకు వెగటుగా నుండెను. కాని యాతఁడు మోటుమానిసియై యుండనోపునని బాలాదిత్యుఁ డూఱటఁజెంది 'విక్రమనౌక పెద్దదా?' అని యడిగెను.

పర:—బవేరము, రోమదేశము, జావా మున్నగు దేశములకు బోవు నావ లంత పెద్దవి కాదు. కాని వానికంటె విశాలమైనది. దానియం దపరిమిత వస్తుజాలములతోఁబాటు నూఱులకొలఁది పయనమొనరించుటకుఁ దగినవీలు కలదు.

బాలా:—ప్రయాణికులు పెక్కురుందురా?

పర:—పెక్కురా? 'పెక్కురు' అనుపదమున కర్థము నిర్ణయించుకొను వానిఁబట్టి, దానిసంఖ్యాపరిమితి యాధారపడియుండును. ఇప్పటి కేఁబదిమంది ప్రయాణీకు లానావయందు స్థానముల నేకరించుకొనియున్నారు. నేనుగూడ రెండుగదుల నేర్పాటుగావించుకొనియున్నాను. అందు సౌఖ్యముగా నుండును. కాని యవి మిగుల విశాలములగుటచే, భాగస్థులఁ బడయ నెంచియున్నాఁడ. మేము మువ్వురమున్నారము. ఒక్కొక్కగదియందు నలువురుండుటకు మంచివీలున్నది. ఎవరో నలుగురు ప్రయాణీకులు మాగదులయందు మాతో నుండ మాటయిచ్చిరి: కాని తుట్టతుదకు వారు మమ్ము మోసగించిరి.

బాలా:—మీరు మువ్వురున్నారా? నీవొక్కఁడవే యనుకొంటిని. నీతో మఱెవ్వరైన సోదరవణిజు లున్నారా?

పర:—సోదరవర్తకులు కాదు కాని; కుటుంబవర్తకులున్నారు. వర్తకుని భార్యయు, వర్తకునికుమారియు వర్తకులే కదా!

బాలా:—ఓహో! నీపత్నియు పుత్రియు నిన్ను వెంబడించుచున్నారా!

పర:—అవును. వారెల్లప్పుడు నాతో వచ్చుచుందురు. నాకుమారి నన్ను విడిచియుండఁజాలక మొండికెబడి నాతో వచ్చుచుండును. పుత్రికా వాత్సల్యమున నా పెతల్లి యామె ననుసరించుచుండును.

బాలా:—కేరళపుత్రము మీజన్మభూమియా?

పర:—కాదు కాదు. మేము మాగధులము.

బాలా:—అయిన నీకు బారుకచ్ఛమునకుఁ బోనవసరమేమివచ్చినది! తామ్రలిప్తిలో నావ నెక్కినయెడల నీకింకను సౌఖ్యముకదా!

పర:—నేను నేఱుగాఁ గేరళపుత్రమునకుఁ బోనెంచియుండిన, నటులొనరించుటయే యుక్తము. వణిజునకు నిర్దిష్టస్థలమునకుఁ జేరులోపల మార్గమధ్యమునఁ జేతినిండఁ బనియుండును. నీసంభాషణమువలన నీవు వర్తకుఁడవుగావని విదితమగుచున్నది. పాటలీపుత్రమునుండి బారుకచ్ఛముపర్యంతము సాటాబేర మొనరించుచుఁ బోనగుఁగదా!

బాలా:—అవును. ఇంతకు నీవనినట్లు నేను వర్తకుఁడఁ గాకపోవుటచే నీసంగతి నాకుఁ దెలియలేదు.

పర:—అయిన నీవృత్తియేమి?

బాలా:—ఏమియులేదు. నేను నిరుద్యోగశాఖాధికారిని. పైఁగా దేశద్రిమ్మరిని.

పర:—దేశద్రిమ్మరివా? నీవు వయోవంతుఁడవు; బలవంతుఁడవు; శౌర్యవంతుఁడవు. ఇఁక నీవు బీదవాఁడవందునా? అయినచో, నీవు ముసలితనమున సుఖించుటకై కావలసినధనసంపాదనమున కిదియే యదనని గ్రహింపుము. లేక 'నేను ధనికుఁడను. నాకేమి?' అని విఱ్ఱవీఁగుదువా? నీవు కుబేరుఁడవై

యుండవచ్చును; కాదనను. లక్ష్మి చంచల యని గ్రహింపుము. నీకుఁ గలధన రాసులనభివృద్ధిపఱచుకొనుటకుమారు,మూలకొట్టులఁ జేర్చి . మూర్ఖఁ జేయుచు, దినదిన మాధనమునఁ గొంచెముకొంచెముగాఁ దీసి కాఁజేసి, యావెనుక వృద్ధాప్యమున లేమిడిఁజిక్కి సిలుగులబడుచు 'అన్నా హా రామచంద్రా! అకటా కావు వేంద్రా!' అని యల్లాడుటెందులకు? ఎండకాలమున సేకరించుకొనిన యాహారము నెప్పటికప్పుడే తినివేయు నడవియీఁగలు వానకాలమున నెఱదొఱుకక యాఁకటమాడి మడియుచుండ, దీర్ఘదర్శులగు భ్రమరములు వఱపుదినములకుగూడఁ గూడఁబెట్టుకొని సౌఖ్యజీవన మొనరించుచుండునుగదా! ఇప్పుడీసంగతియంతయు నెందులకు? నీవు వైశ్యుఁడవుగావంటివికదా? అయినఁ గేరళపుత్రమునకు నీపయన మెందులకు?

బాలా:—దేశదిదృక్షచేఁ బోవుచున్నాను. నావెంట మఱిమూవురు మిత్రులుకూడ నున్నారు.

పర:—వారుకూడఁ గేరళపుత్రమున కేల వచ్చుచున్నారు? దేశముచు జూచుటకేనా?

బాలా:—కాదు. బాలాణులు పెట్టు హింసలనుండి తప్పించుకొని బ్రదుకుటకు.

పర:—అయిన నాకారణమునం దొకించుక యర్థమున్నది. కాని పయనమునకుమాత్రము సవ్యమగు కారణ మగపడదు. బాణాపతి పాలన మంత దుస్సహమై యున్నదా?

బాలా:—అని యడుగవలయునా? వారివలన నాకును గొంతభయమునకు హేతువు గలదు.

పర:—అయిన నీవుగూడఁ గేరళపుత్రమునకు వచ్చుట క్షేమకరము. ఈసంగతి నింతకుముందే యేల చెప్పవైతివి? డంబాచారులును, నిరర్థకులు నగు ధనవంతులు విలాసార్థముకని పేరుపెట్టుకొని యేటేట విదేశములకుఁ బోవుచుందురుగదా! అట్లే నీవుకూడ స్వదేశమునువిడిచి పోవుచున్నా వనుకొంటిని.

బాలా:—పరమార్థీ! అదేల? విదేశగమనము లోకజ్ఞానమును బెంపొందఁజేయునుగదా!

పర:—అవును. న్యాయమార్గమున ధన మార్జించుతలంపునఁ జేయు వ్యాపారము, విదేశగమనకౌతూహలము నభివృద్ధిపఱుచును. దానివలన లోకజ్ఞాన మతిశయించును. నీవాచరించు క్రయవిక్రయములఁబట్టి యాదేశ సౌభాగ్యముల నీవెఱుంగఁగలవు. నీవ్యాపారవస్తుప్రచయరక్షణమునుబట్టి, యాదేశీయులయోగ్యతను బరీక్షింపఁగలవు. వినోదార్థము విదేశములకుఁ బోవువానికంటె, వర్తకుఁడగువానికిఁ దద్దేశీయులతోఁ గలిసిమెలిసియుండుట కవకాశము చాలయుండును. కాన నాతఁడే వారిసహజగుణనికరముల నెఱుఁగ సమర్థుఁడు. పండితమ్మన్యులును, సోమరిపోతులును, కుహనాసంఘప్రతినిధులును, విలాసప్రయాణికుని బజ్జఁజేరుదురు. కాని వర్తకునికడమాత్రము సజ్జనులును సత్తైశ్వర్యసంపన్నులును జేరి యాతనిఁ దగురీతి నాదరింతురు. వర్తకుఁడు రాజోద్యోగులగృహముల నలంకరించుచుండును. రాజప్రాసాదముల సన్మానములందుచుండును. రాణివాసములఁ బ్రవేశమంది వారిమన్ననలు వడయుచుండును. వారి యాతిథ్యమును బొంది తృప్తినందుచుండును. చూచితివా? విదేశములకు విలాసార్థము పోవువానికిని, వ్యాపారార్థము పోవువానికిని గలయంతరము! వర్తకుఁడు జనులఁ బెక్కుఱఁ జూడఁగలుగును. పెక్కుఱతోఁ బరిచయమును బడయును. అనేకులతో సహవాసభాగ్యము నందును. ఇంత ధనమును వెచ్చించి విలాసమునకని విదేశములకుఁ బోవుమానవునిఁ గడకొకపూటయైన వా రాదరింతురా! కాని శుష్కదరిద్రులగు బడిపంతు లాతని డాసి 'ఇచట మావేతనములు మాకుఁ జాలుటలేదు. పరదేశములయం దైన మేము సౌఖ్యపడుటకు సౌకర్యములున్నవా?' అని మిగుల నాతురతతో నాతనిఁ బ్రశ్నించుచుందురు. పనియుఁ బాటయు లేనిసోమరులు వీథులఁ దిరుగుచు నాతనిఁజేరి వేళాకోళమొనరించుచుఁ గాలముపుచ్చుచుందురు. ఇంకేమికావలయును? ఊరిలోనిముసలమ్మ లాతని 'మీదేశములోని వింతలేమి?'

అని యనుకొనుచుందురు. దారిద్ర్యదోషమునఁ దమదేశము కలఁకబాఱి యుండ, నితరదేశములుఁగూడ లేమికిఁ జిక్కి గింగురుమని సుడివడుచున్నవని కడ కాముసలక్కులు గ్రహింతురు. ఇట్టి యనవసరములగు కాలహరణములు వర్తకున కెక్కడివి? కాలహరణము లేకపోవుట యటుండ, నాతనికి ధనార్జనమును వేఱులాభముఁగూడ నున్నది.

బాలా:—సరి. మనము మెల్లగా నడచుచున్నారము. నేను బారుకచ్ఛమునకుఁ ద్వరగాఁ బోవలయును. నామిత్రులకుఁగూడ నావయందు గదు లేర్పాటు గావింపవలసియున్నది.

పర:—ఆవిషయమై తొందఱపడవలదు. గదులన్నియు నేర్పాటై యున్నవి.

బాలా:—ఏర్పాటైయున్నవా? ఏర్పాటొనరించినవా రెవరు?

పర:—నేను. రెండుగదుల నేకరించియున్నాను. ఆమువ్వురువనితలొకగదియందును, మనము నలుగురము వేఱొకగదియందును నుండవచ్చును.

బాలా:—అయిన నాకు సగముభారము తీఱినట్లయినది. నాకు గుఱ్ఱముపైఁ దరుమఁ గోరికయయ్యెను. ఏమందువు?

పర:—అయినఁగానిమ్ము. మనలో నాశ్వికశ్రేష్ఠుఁ డెవఁడో పరీక్షింతము. నేనో? నీవో? నాధవళాశ్వమో? నీయరుణాశ్వమో?

ఇచటికి రెండుపరుగులలో నొకసత్రమున్నది. దానిఁజేరువఱకుఁ గళ్లెముల వదలఁగూడదు.

బాలా:—సరియే. కానిమ్ము.

వారు గుఱ్ఱములఁ బరుగెత్తింపసాగిరి. జవోగ్రములగు నాయశ్వరాజములు వాయువేగమునఁ బోవుచు నచట నచటఁ జనుబాటసారులకు వెఱఁగుఁ దోఁపించుచుండినవి. వానియడుగులసంఘట్టనమునకు దుమ్మురేఁగి యాకాశమున కెగయుచుండెను. ఇట్లు వారు బారుకచ్ఛమునకుఁ బోవుబాటపైఁ బోవుచుండిరి.

---

# పదునొకండవ తరంగము.

## లక్ష్మి - పార్వతి.

అట్లు వారు రమారమి యరగంటకాల మతివేగమున స్వారిచేసిరి. సంజ వేళకంతయు వారు బాటప్రక్కనుండు ధర్మశాలఁ జేరిరి. గుఱ్ఱములదిగి వానిని లాయములఁ గట్టివేసిరి. తనకుఁ బరిచితుఁడగు ధర్మశాలాధికారినిఁ బరమార్థి పిలిచి తమ కారాత్రి భోజనము నేర్పాటుచేసెను. భోజనానంతరము మన పాంథు లిద్దఱు నిద్రఁజొక్కి, వేఁకువనే లేచి మరలఁ బ్రయాణము చేయ మొదలిడిరి. నిద్రాహారసమయములఁ దప్ప, వారు మఱి గుఱ్ఱములు దిగినవారు కారు. ఈవిధమున వారు ఎనిమిదవనాఁటియుదయమున కంతయు గమ్యస్థానమును సమీపించిరి. బాటకచ్చ మిక రెండుమైళ్లలోనుండెను. అప్పటికి బాలభానుఁడు పొడుపుకొండపై కెక్కి లోకమునంతయుఁ దేఱిపాఱ చూచుచుండెను. ఆతనియరుణకాంతులు మందమారుతసంచలితములగు వృక్షాగ్రములపై కెక్కి, సుహరితావృతశాద్వలస్థలములపై వ్రాలి వానిని శోభామయములుగా నొనరించుచుండెను. మార్గమునకు రెండుప్రక్కలనుండు కాసారములు రాజీవపుండరీకరక్తోత్పలాదివివిధప్రసూనమండితములై, పథికజనరంజకములై యుండెను. సహజశోభావిభాసురమగు నీప్రకృతిదృశ్యము నవలోకించుచు బాలాదిత్యుఁ డరుదెంచుచుండఁ బరమార్థి యాతనిఁ బిలిచి "ఆమెను నీ వెంట నేలతీసికొనిరావైతివి? ఆమె నిచటి కెవరు పిలుచుకొనివచ్చెదరు?" అని హెచ్చరించుకొనెను.

బాలా:—ఆమెకుఁ దోడుగా మఱియిరువురున్నారని చెప్పితిఁగదా!

పర:—అవును. పావనుఁడగు నొకజైనుఁడును, ఉత్తముఁడగు నుజ్జయినీ కాపుఁ డొకఁడును నున్నారని యంటివి. కాని యుపద్రవకరములగు నిట్టి

యరాజకపుదినములలో సౌందర్యవతియగు నబలను సురక్షితముగాఁ దీసికొని వచ్చుటకు వారు చాలరని నాయభిప్రాయము.

బాలా:—ఆశ్రితరక్షకుఁ డగుహరిరాముఁడుకూడ నామెవెంట రానున్నాఁడు.

పర:—హరిరాముఁడా! అయిన నీవాతని నెఱుంగుదువు?

బాలా:—మహారాణికిరాతులవలన నాతనికిఁగూడ ననుభవమైనది. అతఁడు నామిత్రులమూఁవురను వారికోఱలనుండి తప్పించినాఁడు. అతఁడే వారిని బారుకచ్ఛమునకుఁ జేర్ప మాటయిచ్చినాఁడు.

పర:—అతఁడు గొప్పోపేతుఁడు. అతనిరక్షణమున నిరపాయముగా నుండవచ్చును. హరిరామునిహృదయము కరుణకు నిలయము. అతఁడు సజ్జనుఁడు. సజ్జనశేఖరుఁడు. కాని యాఘోరకృత్యము జరిగినది మొద లాతని జీవితము ధ్వాసమైపోయినది.

బాలా:—అతని తనయను నీవెన్నఁడైనఁ జూచియుంటివా?

పర:—'చూచియుంటివా' అనియడుగవలయునా! ఒక్క పార్వతి సంగతి యటుంచి, హరిరామునితనయకడ నాకుఁ గలచనువు మఱెవ్వరికి లేదని చెప్పఁగలను.

బాలా:—పార్వతి యెవరు? నీకుమారి యనుకొందును.

ప:—అవును.

బాలా:—నారాయణిసంగతి చెప్పుము.

పర:—నారాయణిసౌందర్య మద్వితీయము. ఆబాలసౌశీల్య మనుపమానము. ఉజ్జయినియం దామె నెన్నియోమారులు నేను జూచియుంటిని. నేను హరిరామునకుఁ జిరమిత్రుఁడను. నేను వ్యాపారార్థము ఉజ్జయినీనగరమునకుఁ బోయినపుడంతయు నాతనియింటియందే విడియుచుండెడివాఁడను. అప్పుడు నారాయణికిఁ బదునాలుగేండ్లుండెను. ఆకన్నియ నాకు సాధారణముగ సావిత్రిచరిత్రమును జదివి వినిపించుచుండెడిది. పరలోకమునకుఁగూడ

నిజనాథుని వెంబడింప నడుముకట్టియుండు సావిత్రీదేవి సుస్థిరమానసమును వర్ణించు ప్రకరణమును బఠించునపు డాకన్యావతంసము తనమరాళగ్రీవము నెత్తి యథారీతి నన్నుఁ 'చిన్నాయనా' అని పిలిచి "చిన్నాయనా! నాపతి మరణించినయెడల, నేనేమి చేయుదునో నీకుఁ దెలియునా? నేనుకూడ సావిత్రివలె నాభర్తను వెంబడింతును" అని గర్వోక్తులాడుచుండెడిది.

నేను:—అప్పనమ్మా! ఇంతకు నీకుఁ బెండ్లియే కాలేదుకదా?

ఆమె:—త్వరలో నగును గదా! సత్యవంతునిఁ బోలినవానిని, నామనసుకువచ్చినవానినే, నేను వివాహమాడుదును. నేను బెండ్లాడవలయునే కాని, నాపతిని నేను దైవమువలెఁ బూజింతును. కాని చిన్నాయనా! అట్టివాని యర్ధాంగినైయుండుభాగ్యము నాకుండఁబోదని యే దుర్దేవతయో యంతర్వాణి నాయంతరాత్మకు బోధించుచుండును.

నేను:—అమ్మా! ఈ దుశ్శంకలు మానుము. నీకుఁ దగినవరుఁడు లభించును. వానినిఁ జేపట్టి, మనుమలు మనుమరాండ్రనుగూడఁ గాంచి సుఖింతువు.

పర:—కడ కాకన్యామణిపలుకులు యథార్థములయ్యెను. అవన్నిఁ దలంచుకొనిన నాకు దుఃఖము గలుగుచున్నది. ఆమె ముద్దులు మూటగట్టుచుండును. ఆమె సుగుణములకు గని. అట్టి నారీశిరోమణిని మరలఁ గాంచుభాగ్యము నాకు గలుగదు.

పద్మార్థికి మాట తొట్రుపడెను. ఆతఁ డిఁక మాటాడఁజాలకపోయెను. ఆతనికన్నులనుండి బాష్పకణము లురలసాగెను. ఆకథను వినినబాలాదిత్యుఁడు కూడ శోకము నాపుకొనఁజాలకపోయెను. ఆతనినయనవారిదములుకూడ నశ్రుజలముల వర్షించుచుండెను. 'ఆదిక్కులేనికన్నియ మరణించుట కెట్లు సాహసించెను?' అని యాతఁడు ప్రశ్నించెను.

పర:—మానభంగమొందినదిమొదలు లామె యెవరితోఁగాని పలికెడిది కాదు. కనుపడినవారినందఱ నామె కత్తిగానో, ఖడ్గముగానో ప్రతి

చూలుచుండెడిది. కాని యాకోర్కెలన్నియుం నిష్ఫలము లగుచుండెడివి. అంతట నామె తనతండ్రియింటికిఁ బోయెను. పోయి, యింటియందుండు వంటచెఱకునంతటిని ప్రోవు చేసి యగ్గిముట్టించెను. పిదప నాధీరురాలు చితిపై కెక్కి కూర్చుండి "ఓసావిత్రీ! నన్నుఁ గైకొనుము. ఓసీతామహాదేవీ! నన్నా హ్వానించుము. ఓదమయంతీ! నన్ను దయఁజూడుము. నే నపవిత్రనుగాను. వ్రతచ్యుతనుగాను. హవ్యవాహనునికరుణచేఁ బునీతనైయున్నాను. ఈపాపు దేహము నగ్నిదేవున కర్పించితిని. భరతవర్షమంతయుం నిట్టిసాదలచే నిండుఁ గాక. ముందుముందు నన్నుఁ బెక్కురనుసరింతురుగాక" అని యామానవతి ప్రార్థించుచుండెను: ఆమె సంరక్షణార్థము పౌరులు చితికడకువచ్చిరి. ఆమె వారలఁ గాంచి రోషరంజితలోచనయై "ఈపాపను జల్లార్చువారు పాతకూ దురగుగాక. మానావమానములను దూరముగుపశువులఁబోలినవారఁ డిట్టి నీచకార్య మునకుఁ బాల్పడును. ఇట్టిసాహసమునకుఁ గడంగి నాజోలికివచ్చినవాఁడు నాతండ్రియైన నగుఁగాక. శపంపకమానను. మానమే పోయినది. ఇఁక నా ప్రాణము లెందుకు!" అని యామె ప్రజలఁ దనదరిఁ జేరనీయకుండెను. ఆమానవతి పలుకులు వారియడుగులకు బంధనములయ్యెను. అడుగెత్తిపెట్టుటకు వారికి ధైర్యముచాలకుండెను. ఆమానినీమణి నవ్వుమొగమునఁ బద్మాసనస్థయై నిశ్చలముగాఁ గూర్చుండియుండెను. చూచుచుండగనే యమూల్యములగు నామెకట్టుబట్టలన్నియు గాలిపోయెను. కురులుకూడఁ గమలిపోయెను. హుతాశనుఁడు క్రమక్రమముగ నాసాధ్వీమణిశరీరమును మాయమొనరింప సాగెను. కడకంతయు నైపోయెను. ఇంతవఱ కాధీరవనితను నాకుఁ దెలి యదు.

అకథాశ్రవణమున బాలాదిత్యుని మేను జలదరించెను. అతనిస్వాంత మున వివిధభావము లుద్భవిల్లి యంతలో మాయము లగుచుండెను. అల్లంత దూరమున బారుకచ్ఛమునందలి యున్నతగోపురాగ్రములు వారికి లోచన గోచరము లగుచుండెను. అపురమునందలివీథు లతిదీర్ఘములైనవి. కాని యవి

నిర్మాణకౌశలవిహీనములు. నానావిధగృహసమన్వితము లగునయ్యవి చూడ వింపుగొల్పకుండెను. గంభీరములును, నున్నతములునగు నావలు నౌకాశ్రయమున నిలిచియుండెను. మనపథికు లచటికేఁబోయి 'విక్రమ' నావను గుర్తించిరి. ఆయోడ మిగుల విశాలమైనది. పరమార్థి యనినట్లు, ఆనావయందు నూఱుగురు ప్రయాణము చేయఁదగియుండెను. అయ్యది యూహాతీతవస్తుప్రచయమును మోయఁజాలియుండెను. 'నీసామాను లెచ్చట?' అని బాలాదిత్యుఁ డాతని నడిగెను.

"నాసామానంతయు భద్రపఱిచియున్నాను. నావ్యాపారవస్తువులఁ గొన్నింటినైనఁ జూచినచో, నీవు వెఱఁగందకపోవు" అని పరమార్థి యనెను.

బాలా:—మొకమాలులనిన నాకు సంతోషము.

పర:—అవియుం నాకడఁ గొన్నియున్నవి; కాని వానివిషయము కాదు నేనిపుడు మాట్లాడుట. నాపుత్త్రికఁగూర్చి చెప్పుచున్నాను.

బాలా:—నీతనయకూడ నీవ్యాపారవస్తుజాలమునఁ గలిసియున్నదా?

పర.—వ్యాపారవస్తుజాలము కాదు. సుకుమారసుందరవస్తుజాలమునఁ జేరియున్నది. ముందుగాఁ దెలియఁజేయుచున్నాఁడ; వినుము. నాకుమారి పార్వతి యసదృశవిలాసవతి యని గర్వించుచుందును. అచ్చరలేమయైనఁ దనకు నివాళి యిచ్చుటకైనఁ దగదని యామె పిఱ్ఱవీఁగుచుండును. ఈప్రధానసిద్ధాంతములఁ గాదనువాని నెవ్వనినైన నామె గౌరవింపదు. కాని కుటిలహృదయుఁ డెవ్వఁడైన నామె యలౌకికసౌందర్యముల నాకసముముట్టునట్లు పొగడినచో, నామె నాకడకు వచ్చి 'ఇంతకు నాతఁడు కృత్రిముఁడు కాఁడు' అనుచుండును. ఆమె స్వభావ మంత విచిత్రమైనది.

బాలా:—అయిన నేనామెను నొప్పించను.

అనంతరము వారు పడవనెక్కి నావపైకిఁ బోయిరి. స్థూలకాయుఁడును, యువకుఁడు నగుకర్ణధారుఁడు వారలఁ గలిసికొని "స్వాగతము! పరమార్థీ! స్వాగతము. ఈయౌవనమిత్రుఁ డెవరు?" అని ప్రశ్నించెను.

"ప్రాణబాధలకుఁ దాళఁజాలక యాతఁడు స్వదేశమును వీడివచ్చుచున్నాఁడు. రామచంద్రా! ఈతని మనము రక్షింపఁగలుగుదుమా?"

"ఓయువకుఁడా! నిన్ను వెంటఁగొనిపోవుటకుఁ బరమార్థి కెట్టిలోట్పాటు తెచ్చితివి?"

"ఏమియు లేదు. కాని నాయరుణాశ్వము నాకీవిషయమున సాయమొనరించినదని తలంచెద."

"ఆయరుణాశ్వమా! అది హరిరామునిది కాదా?" అని రామచంద్రుఁడు విస్మయమందెను.

"అవును. అది హరిరామునిదే."

"అయిన దొంగలమించిన సాహాయ్యము సజ్జనుఁడగువర్తకునికడ నాదరముఁబడసినది. నిజమాడవలయునన్న, హరిరాముఁడు సుజనుఁడని చెప్పవలయును. సుజనశిఖామణి యనికూడఁ జెప్పవలయును. పేదలను, రోగులను నాతఁడు దోఁచఁడు. లోకమందలి జనులందఱు సమానముగనంతస్థునం దుండవలయుననుతలంపున, ధనాధికులను పిసినిగొట్టులనుమాత్ర మతఁడు దోఁచుచుండును. బీదలనోట మట్టిఁగొట్టి సేకరించినవిత్తమువలన మానవుఁడు సంపన్నుఁడగుచుండును. కాని ధనార్జనకు వేఱుమార్గ మేమున్నది? ఐశ్వర్యవంతుల యన్యాయార్జితవిత్తమును దిసికొని, సత్క్రమాధికారులగుపేదల కొసంగుమానవుఁడు చోరుఁ డెట్లగును?" అని రామచంద్రుఁ డనెను.

పర:— ఈవిపరీతవ్యాఖ్యానము లిఁకఁ గట్టిపెట్టవచ్చును.

రామ:— మన్నింపవలయును. మీకు విధేయుఁడను. ఈదినము మీరు నాయతిథులరుగాన, మీకు హృద్యములగుసంగతులఁ జెప్పితి. ఇష్టము లేకున్నఁ బోనిండు.

బాలాదిత్యుఁ డానౌకను, నావికులను బరీక్షించుచు "మిగుల మంచి నౌక గానున్నదండీ! సురక్షితమైనదిగా నున్నది. బాగుగా నిర్మితమై యున్నది. నౌకరులు, నావికులు సుజనులై యున్నారు" అనెను.

రామ:—నీమాట నిజము. దీనిఁ జూచుకొని నేను గర్వించుచుందును. ఇది యెన్నియో యుద్ధములఁ జూచియున్నది. ఎన్నియో ప్రయాణము లొనరించియున్నది. పశ్చిమమున బవేరము, రోమదేశములకుఁ బోయివచ్చినది. తూర్పున సుమత్రా, జావా, మకరు, కాంభోజము, చైనా, జపాను మున్నగు దేశములఁ జూచివచ్చినది.

బాలా:— ఓహో! ఇంతదూర నాదేశములకుఁ బోయియుంటివా? ప్రాక్పశ్చిమదేశపునౌకలు మనవానికంటెఁ బెద్దవా!

రామ:— పెద్దవా! సరి. అవి మనవానికంటెఁ జాలఁ జిన్నవి. పశ్చిమదేశపునౌకలు మఱియుఁ జిన్నవి. అవి మన నౌకలంత వేగముగాఁ బోఁజాలవు. మన యీ 'విక్రమ' రోమదేశమునకుఁ బోయియుండినప్పుడు, దొంగలయోడ 'పెగాసస్' అనునది దీని నడ్డగించెను. అయోడకూడ 'విక్రమ' యంతయుండును. పశ్చిమదేశవాసులగు యవనులనావలన్నిటిలో నదియె పెద్దది. 'బలేరిప్పులు' అనుపేరుగలనావికు లాతరణియందుండిరి వారు సాహసమునకుఁ బెట్టినపేరు. ఆనాఁడు 'విక్రమ'ను డాసి ఢీకొనెను. 'విక్రమ' యంతలోఁ దప్పించుకొని దూరముగా నిలిచెను. కాని 'విక్రమ' నౌక దెబ్బతినినపార్శ్వము నించుక చెడెను. అసలు నావమాత్రము కట్టు కదలలేదు. కాని 'పెగాసస్', అయాఘాతమునకు సడలిపోయెను. అనౌకయందుఁ బెద్దరంధ్ర మేర్పడెను. ఓడలోనికి నీరు రాసాగెను. అప్పు డాగర్వితులగు నావికులు "అయ్యాలారా! రక్షింపుఁడు. రక్షింపుఁడు" అని యఱచుచుండ వారినౌక యుక్కుంగు మని మునిఁగిపోయెను. ఇఁకఁ బ్రాగ్దేశపు నౌకలా! చైనాదేశమున 'జంకులు' అనునోడ లున్నవి. జపానుదేశమున 'పట్టామరులు' అనునావ లున్నవి. కాని యవి మనయోడ లట్టు గంభీరములును విశాలములును గావు. జావా

దేశమున నతివిశాలములగునావ లున్నవి. కాని మననౌకలే వానికన్న విశాల తరములు.

బాలా:—నీవుఁ జూచినయోడ లన్నింటియందు విశాలతరమైనదేది?

రామ:—'విజయ' అను నౌకారాజము. దానియందు వస్తుజాలము నకుఁ దోడు మున్నూఱుమంది ప్రయాణము చేయుటకు వీలున్నది. కార్కూ, సింహళ, జావాదేశములమధ్య నయ్యది పయనమొనరించుచుండును.

పర:—అవును. నీమాట నిజము. ఆయోడ యొకవర్తకసంఘమునకుఁ జెందియున్నది.

రామ:—అవును. ఆవర్తకసంఘమునఁ బరమార్థికిఁగూడ సభ్యత యున్నది.

బాలా:—అవునా?

రామ:—నీకుఁ జెలియదా? ఇంతటిధనసంతుని మఱియొకని నేనెఱుం గను. ఈతఁడు తలంచినచో, 'విజయ' 'విక్రమ' నౌకలఁ గొన సమర్థుఁడు. కార్కూసింహళ మాత్రనిఁ జూచుకొని గర్వించుచుండును. ఈనౌకపైఁ బరమార్థి సామానులు ౧,౦౦,౦౦౦ పణములు విలువగలవి యున్నవి. రోమదేశమునుండి హిందూదేశమున కేటేటఁ బ్రవహించుసహస్రకోటి సంఖ్యాకములగు సువర్ణ పణములయం దితనికిఁ బదియవభాగము వచ్చుచుండును.

బాలా:—అటులనా?

తాను మగధసామ్రాజ్యరమావల్లభుఁడై యుండినప్పుడు, రాజసేవకులు 'పరమార్థియే తనపౌరులందఱిలో ధనాధికుఁడు' అని తనకు నివేదించుచుం డుట బాలాదిత్యునకు స్మృతికివచ్చెను. కాని పరమార్థినిఁ దనకుఁ దెలియన ట్లాతఁడు నటించుచుండెను. కర్ణధారుఁడు రామచంద్రుఁడు వారలకడ సెలవు గొని నౌకలో మఱియొకయెడకుఁ బోయెను.

"నీవు పార్వతిని, లక్ష్మినిఁ జూడ నిచ్చగించెదవా? నీవిపుడు నాయతి థివి. వారు నిన్నాదరింతురు." అని పరమార్థి బాలాదిత్యునితో ననెను.

బాలా:—నా కభ్యంతరము లేదు.

పర:—అభ్యంతరమా! సౌందర్యవతియగు కన్నియం జూచుట కభ్యంతరము లేదనుచున్నావా? బాగుగా నంతరాత్మను దఱచి చూడుము. అన్వేషణ లేశమైనఁ బొడఁగట్టుచున్న దేమో యారయుము. ఓయీ! యువకుఁడా! నీవు యత్యాశ్రమమునఁ జేరి విరాగివై యున్నాఁడవని నిట నమ్మువా రెవరున్నారు?

బాలా:—నే నట్లంటినా?

పర:—ఆ భ్రమమున నీవుండినచో, నిన్నొక మట్టిబొమ్మ యనియో కీలుబొమ్మ యనియో యనుకొని, నీతో మైత్రి సేయఁదలంచను. సరి. ఆలస్య మెందులకు! రమ్ము పోవుదము.

అతఁడు బాలాదిత్యుని దనమిత్రుఁడగు ధనభూషణుని గృహమునకుఁ దోడ్కొనిపోయెను. దివ్యాలంకారశోభితమగు నొకవిశాలప్రాంగణమునకుఁ బరమార్థి దారిఁదీసెను. అచట నిరువురు చెలువ లాసీనలై యుండిరి. వారిలో నొకతెకు వయసు మళ్లియుండెను. ఆమెకు రమారమి ముప్పదియైదేండ్లుండును. అయినను నామె తనూవల్లి నవనవోల్లసితమై యుండెను. 'పుత్రికకు హాసము పెరుగుకొలఁది, తల్లికి దఱుఁగుచుండును' అని పూర్వ మొక కవీశ్వరుఁడు సెలవిచ్చియుండెను. కాని లక్ష్మి సూచించినవాక్యమునకు వ్యతిరేకార్థము గలిగింపఁ గల్గెను. ఇప్పటికిఁగూడ నామె యౌవనము దిగువు చెడకుండెను. ఆమె మైకాంతి యించుక నలుపైనను, కళాభాసురమై, రమణీయదృశ్యమై యుండెను. ఆమెరూపవిలాసములు సక్రమములై యువకజనచిత్తరంజకములై యుండెను. ఆసుందరాంగి సురుచిరవదనమునఁ దోలకాడు దరహాసచంద్రికలు, చూపఱకు సమ్మోహనకరములై, తదీయ హృదయనిష్కళంకత్వమును వెల్లడించుచుండెను. ఆలక్ష్మి యటుల హంసతూలికాతల్పమునఁ గూర్చుండి, తనయెదుటఁ గురులు సవరించుకొనుచు నాసీనయైయుండు నిజకుమారివైపు కన్నార్పక చూచుచుండెను. ఆమెపుత్రిక ద్వారమునకు వెనుక మరలి,

నిలువుటద్దము నెదుటఁ గూర్చుండి చికురరాసిని దిద్దుకొనుచుండెను. ఆమె వదనసరోజమును బాలాదిత్యుఁ డానిలువుటద్దమునఁ బొడఁగాంచెను. ఆతరుణీమణి యసమానవిలాసభాసురాంగి యనియుఁ, సౌందర్యమున నామె సరస్వతీదేవిసమునఁ దీసిపోదనియు నాతఁడు గ్రహించెను. కాని యావరవర్ణిని రూపవైఖరి వేఱొకవిధముగ నుండెను. తల్లివలెనే యీమె శరీరకాంతికూడ నించుక నీలిమమై యుండెను. ఈమె రూపరేఖావిలాసములుకూడ నతిమార్దవములై, మనోహరములై యుండెను. ఈమె హాసన్ముఖము వలపుల వెదఁజల్లుచుండెను. అసదృశమగు నాత్మీయసౌందర్యగర్వమున నామెలనాఁగవదనమున సంతోషము తాండవించుచుండెను. ఎదుటనుండు నిలువుటద్దమున బాలాదిత్యుని ప్రతిబింబమును గాంచుచుండియు, నామె లేచినదికాదు. అలౌకికమగు తన మోహనరూపమును గాంచి యాతఁడు 'ఔరా' యని విభ్రాంతుఁడుకావలయునని యామె యటులే కూర్చుండియుండెను. ఆత్మీయవిలాసములన్నింటి నాతఁడు దర్శనమునఁ జూచి మెచ్చుకొనుటకు వీలుండవలయునని యామె లేవకయే యుండెను. ఈరీతి నైదునిముసములసే పీనాటకము జరిగెను. పరమార్థిరాయ లక్ష్మియు నీనాటకఖేలనమున కడ్డుతగులక, దానినిఁ జూచుచు మరియుం జూడిరి. "అమ్మాయీ! మీనాయనగారిరాకను గమనింపలేదా?" అని లక్ష్మి యామెను హెచ్చరించుకొనెను.

"ఆయన నాకెట్లగపడును?"

పరమార్థి యామాటకుఁ బకపకనవ్వుచు "అవునవును. తన మెప్పునకువచ్చిన యీయువకునిఁ జూచునా? నన్నుఁ జూచునా!" అని మేలమాడెను. పార్వతి కామాటలకు సిగ్గుగలిగెను. "ఓబాబూ! నీవు కిరాతుఁడవుగానున్నావు. నీవెన్నఁడో యొకనాఁడు నాహృదయమును బగులఁగొట్టుకొని వదలవు!" అని యామె తనజనకుని నిష్ఠురోక్తులాడెను.

పర:—అమ్మాయీ! నాకాభయములేదు లెమ్ము. నీహృదయము నవనీతమృదులమైయుండ నదెట్లు పగులఁగలదు?

పార్వతి:—నీ వెన్నఁడుగాని యీయుత్తమోత్తములఁ జూడవు. పరపురుషు నెదుట నిట్లు చులకన సేయుట యేన నేమనుకొంటివి?

"ఓహో! అందులకు నీకాయాసము గానున్నదా? అయినఁ బోనిమ్ము!" అని పరమార్థి బాలాదిత్యునితో "ఓయువకుఁడా! నీవు వినుటకై యేమిట్లు భాషించుకొంటిమని నీవు తలంపఁగూడదు. నీవు బధిరుఁడవై యుండినచో బాగుండెడిది. లేక మూఁగవై యుండినఁగూడ మాకు హాయిగా నుండెడిది. కాని యివి యసాధ్యములు కాన నీవిషయములను బయటపెట్టవలదని మాకోరిక"

బాలా:—అట్లు బాస చేయుచున్నాఁడ.

పరమార్థి తనయర్థాంగిఁ గాంచి "ప్రేయసీ! ఈతఁడు నాకనుఁగుఁజెలి కాఁడు. మనతోఁ గేరళపుత్రమునకు రానున్నాఁడు. ఈతని వెంటఁ బావనుఁ డగు నొకజైనుఁడును, సజ్జనుఁడగు నొకచోరుఁడును, సుందరాంగి యగునొక కన్నియయు రానున్నారు. ఇక నాకన్యామణి సహవాసభాగ్యము మీకుఁ గలుగఁగలదు. ఆపురుషోత్తములపరిచయభాగ్యము నాకబ్బును" అని పరిహా సించెను.

లక్ష్మి:—ఈతనిపరిచయమున నేను ధన్యనైతిని. ఈతఁడు నవవయ సుననుండియు నట్లగపడుచున్నాఁడు! ఈతని పేరేమి!

అందులకుఁ బరమార్థి సవ్యథముగా "నీ వేమనుకొందువో కాని, యీతని యభిధేయమును నేను మఱచితిని" అని చెప్పెను.

లక్ష్మి:—మఱిమఱపు నీకిప్పుడు క్రొత్తయైనఁగదా!

బాలా:—అతఁడు నాపేరు మఱచిపోలేదు. నేను నాపే రాతని కెఱిఁగింపలేదు.

బాలాదిత్యునియధికప్రసంగమునకుఁ బరమార్థి చీకాకించుకొనుచు "హా హాయీ! నోరుమూసికొనియుండలేవా యేమి? ఇంతకాలముగా నీవు వాతోడిపాంథుఁడవై యుంటివి. ఇఁకమీఁద నాకపైఁగూడ నట్లే యుండ నున్నాఁడవు. అట్టియెడ నేను నీపేరు నడుగనైతినని నేను చెప్పినచో వారు

నన్నేమని భావింతురు! ఏమయ్యా! నీవడవడి యసహ్యముగా నున్నదే." అనెను. బాలాదిత్యునియందుఁ బరమార్థికుండినసద్భావ మించుక తగ్గెను.

లక్ష్మి:—సరి. ఐనదేమో యైనది! అతని పేరేమి?

పర:—ఓయువకుఁడా! నీ పేరు చెప్పుము.

బాల:—బాలాదిత్యుఁడు.

పర:—బాలాదిత్యుఁడా! ఏమీ! బాలాదిత్యుఁడా! మా ప్రభుశేఖరుని పేరుగూడ నయ్యదియే! కాని, ఓయువకుఁడా! నీభాగ్యమునం దర్ధాంశమైన నాతనికి లేదుసుమా! హూణక్రోధానలమునుండి నీవు తప్పించుకొంటివి కాని, పాప మా రాజకుమారుని మాత్రము వారు విడచుటలేదు. మొన్న మొన్ననే, భానుగుప్తభూపతు లాతనిస్వరాజ్యమునుండి తఱిమివైచిరి. ఆహా! ఆచల్లని ప్రభువు మమ్మెల్లవేళల నాదరించుచుండెడివాఁడు.

బాల:—అయ్యో, పాపము! బాలాదిత్యుఁడు కడకు వృద్ధాదిత్యుఁ డగును గాఁబోలు.

"పాపము శాంతించును గాక. పాపము శాంతించును గాక!" అని పరమార్థియుఁ, బార్వతియు, లక్ష్మియు నొక్కమారనిరి.

బాల:—మీకోరిక సఫలమగుఁగాక. కాని నాయూహ సరియని నాకుఁ దోఁచుచున్నది.

వారు:—మేమట్లు తలంపము.

బాల:—సరి. ఆసంగతులతో నాకేమిపని? కాని నాకు నూఱువేల పణములిచ్చినను, నేనాతనియవస్థయం దుండనోపను.

పర:—నీమాట నిజము. ఆదురదృష్టవంతుఁ డిపుడు ప్రాణాపాయదశ యందున్నాఁడు. ఇరువదియైదేండ్లున్నవో లేవో, అతఁ డీవిశాలప్రపంచమునఁ దోఁచునీడలేక యల్లాడుచున్నాఁడు. ఒక్కయశోధర్మ మాత్ర మాతనికిఁ బ్రాపై యున్నాఁడు. అతనియనుచరులలో విశ్వసనీయుఁ డాయశోధర్మ యొక్కఁడే. వారిద్దఱునుగలిసి, భూమతునిఁ జంపిరఁట. ఇది నిజమా!

బాలా:—నిజమే. ఈవిషయము నుజ్జయినియందు వింటిని. పలూఱు లారాజకుమారులు కెల్లరొదల వెదకిరి. కాని వారు సఫలప్రయత్నులు కాలేదు.

లక్ష్మి:—అయిన నారాజకుమారులు తప్పించుకొనిరా!

బాలా:—అవును. నిర్ధారణగాఁ జెప్పఁగలను.

"భగవానుఁడు వందనార్హుఁడుసుమా" అని వారు మువ్వురు మందహాసము చేయుచుఁ బలికిరి.

"సరి భోజనము చేసి విశ్రమింతము రండు" అని పరమార్థి యనెను. అంతట వారందఱు విశాలమగు భోజనశాలకుఁ బోయిరి.



# పదిరెండవతరంగము.

## బంధితుల పునర్బంధనము.

ఆదినముసాయంకాలము భానుగుప్తుఁడు హరిరామునికడనుండి యరుదెంచి, ఉజ్జయినియందలి తనప్రాసాదమున విడిసెను. ఆసౌధము పూర్వము యశోధర్మస్వాధీనమున నుండెడిది. భానుగుప్తునిరాకను మిహిరగులుం డెఱింగి, యాతనిఁ బిలువనంపి యాతం డెచటికిఁబోయిననియుఁ దెలియఁజేయ నొత్తిడి పఱచెను. భానుగుప్తుఁ డాతని మందలింపులకుఁ దాళఁజాలక "దేవరా! ఎక్కడికిఁగాని పోలేదు. ఆహూణవిద్రోహు లింకను మనపట్టణప్రాంతములందే యున్నారేమో యని వెదుకఁబోయితినికాని వేఱుగాదు." అని బొంకులాడెను.

నారా:—సరియే. మనహూణసైనికుల నెవ్వరినైనఁ జూచితివా?

భాను:—ఏహూణసైనికులు?

నారా:—ఆమూపురుషులఁ దీసికొనిపోయిన హూణసైనికులు.

భాను:—చూడలేదు.

నారా:—అయిన నేను రేపు హూణగృహమునకుఁ బోయెదను.

భాను:—నీ కిష్టముండిన నేనుగూడ వచ్చెదను.

నారా:—వలదు. ఇచట నీకుఁ బనియున్నది. వీఁడు మిక్కిలి యిట్టి విషయములందు నీ కనుభవములేదు.

భాను:—అయిన నేను రానులెమ్ము.

అని యాతఁ డనుచుండ నింతలో నొకమానవుఁ డెగరొఁజుచుఁ బరుగిడివచ్చి "మహాప్రభూ! మన్నింపవలయు. మహాప్రభూ! మన్నింపవలయు." నని మిహిరగులునిపాదములఁ జాఁకట్టుగాఁ బడెను. మిహిరగులుఁడు విస్మయ

కోపసంభ్రాంతుఁడై “మన్నించుటయా! ఎవరిని మన్నించుట? ఎందులకు మన్నించ వలయునురా!” అని యడిగెను.

“ఈచేష్టుని క్షమింపవలయును. దేవరవారియానలఁ దప్పినందుల కీ దీనుని దయఁజూడవలయును.” అని యామానవుఁడు వేఁడుకొనుచుండెను.

“ఏమీ! చేఁజిక్కినపక్షు లెగిరిపోయినవఁటరా? ఏమయ్యెను? త్వరగాఁ జెప్పుము.” అని నారాయణశర్మ గద్దించెను.

“దేవా! ఆచోరులు—ఆదొంగలు...” చేష్టునినోటినుండి మాటలు రాఁజాలకుండెను.

మిహి:—వారిసంగతి యేమి?

చేష్ట:—హరిరాముఁడు నాకనిరాజువ, బంధితులవెల్లఁబో!, వారి వెంటనుండుహూణసైనికుల బంధించుకొనిపోయినారు.

ఆమాటలకు మిహిరగులుఁడు దెబ్బదినిన పామువలె నెగిరిపడుచు “ఓరీ ద్రోహీ! హూణసైనికులు బంధింపఁబడ, నీవిచటి కెట్లు రాఁగలిగితివి?” అని గర్జించెను.

చేష్ట:—మహాప్రభూ! చిత్తగింపవలయును. హరిరాముఁడు గుఱ్ఱముపై నుండినన్నుఁ గత్తిపిడితో మోదెను. ఆదెబ్బకు నేను వివశుఁడనై క్రిందఁ బడితిని. ఆదొంగలు నేను జచ్చితినని తలంచి నన్ను విడిచి గహనాంతరమునకుఁ జనిరి. తరువాత నెవరో మూఁడురుపురుషులు వారలఁ గలిసికొనిరి. అంతఁ గొంతసేపటికి నేఁ బ్రజ్ఞవడసి, యాచోరులకంటఁబడకుండ వారిని వెంబడించిపోయితిని. వారొకసమప్రదేశమున నాగిరి. నేనుకూడఁ జెంతనుండు పొదయందు దాఁగితిని. అచట నాదొంగలు విందువేడుకలయందు మునిఁగి యుండిరి. ఆనందమున వారొడలు తెలియక యేమేమియో భాషించుకొను చుండిరి. నేనుండు నికుంజము వారికి దూరముగా నుండుటచే వారిసంభాషణము నాకు స్పష్టముగా వినరాలేదు. కాని నే నద్దానిని వివరముగా నాలకింప నెంచి యాపొదలయందుఁ బ్రాఁకిపోయి వారి డాసి నక్కియుంటిని.

కాని యంతలో నవాగతులగు నామూపురిలో నొకఁడు నాయునికిని సంశయించి కాఁబోలు, నేనుండు నెడ కరుదెంచి యంతటఁ గలయవెదకెను. అప్పుడు నాకుఁ జెమటలుపోసెను. కాని నాపూర్వజన్మపుణ్యమున నే నెట్లో తప్పించుకొనఁ గలిగితిని. అచటి కనతిదూరమున నడవిగుఱ్ఱ మొకటి మేయుచుండ, దాని కెక్కి నే నిచటికి రాఁగలిగితిని. ఆహూణసైనికుల రక్షించుటకుఁగాని, బంధితులను మరల బంధించుటకుఁగాని నేను శక్తిహీనుఁడనైయుంటఁజేసి, దేవరవారి కీయుసుమలను మనవి చేసినయెడలఁ దమరే యందులకుఁ బ్రతిక్రియ లాచరించి ఖైదీలను మరలఁ బట్టుకొనఁగలరని యనుకొని, యీరీతిఁ బరుగిడివచ్చి తమదివ్యదర్శనము చేసికొంటిని.

"ఆఖైదీలబంధవిమోచనమునకు నేఁ జింతింపను. కాని యీదొంగల యహంకారము నాకు దుస్సహమై యున్నది. ప్రాణములైనఁ బోవుఁగాక; ఆఖైదీలను మరల బట్టుకొనువఱకు నిద్రింపఁజాలను. పొమ్ము. రెండువందల మందిరౌతుల నిచటికి నాయాజ్ఞగాఁ బంపుము." అని మిహిరగులుం డఱచెను. అశ్వికు లంతలో నరుదెంచిరి. మిహిరగులనారాయణశర్మలు వారికి నాయకత్వమువహించి చూచుచుండఁగనే కనుచూపునకు మఱుఁగైపోయిరి. క్రమముగ వారు హూణగృహమార్గముఁబట్టిరి. ఆమార్గమున మూలలిరుగుదునకు వచ్చునప్పటికి, వారికెక్కడివో కొంతదూరమునుండి గుఱ్ఱపుగిట్టలచప్పుడులు విననయ్యెను. కాని యూపడి తమహయములగిట్టల ప్రతిశబ్దమని వారనుకొని పోవుచుండిరి. నిజమారయ నయ్యది ప్రతిశబ్దముగాదు. హరిరాముఁడు తన రాణువతో నచటికిఁ గొంతదూరమున వచ్చుచుండెను. మిహిరగులాదులవలెనే హరిరాముఁడుకూడ గుఱ్ఱములగిట్టలశబ్దము విని, యయ్యది తమయశ్వపుగొరిజలసడికిఁ బుట్టిన ప్రతిధ్వానమని తలంచియుండెను. ఇంతలో వారొండొరులు ముఖాముఖులైరి. హూణులు విస్మయాక్రాంతచేతస్కులైరి. హరిరామాదులు భయవిహ్వలులైరి. హరిరాముని బలగమునందు ముప్పదిమందిరౌతులుండిరి. వారికి మధ్యభాగమున రఘుపతి భద్రబాహువు లుండిరి. వారిప్రక్క హరి

రాముఁడు సరస్వతిని దనహయముపైనెక్కించుకొని కూర్చుండియుండెను. అప్పుడప్పుడే వారు గహనాంతరమునుండి వెలువడి బాటకచ్ఛమునకుఁ బోవు బాటపైఁ జనుచుండిరి. ఇంతలో నిశ పరిణత మొందెను. హూణసందర్శనమున సరస్వతి వెలవెలఁబోయెను. హూణసైన్యమందుండు నారాయణశర్మ యామె కంటఁబడెను. ఆవాఁడు తనకష్టములకంతయుఁ గారణము నారాయణశర్మ యనుబాలాదిత్యునిపలుకులు జ్ఞప్తికిరాఁగా, నాచంద్రానన దుఃఖవివశయయ్యెను. ఆమె కది యొకకలగా నుండెను. అన్యమానసమున రెప్పవాల్పక యామె యాదృశ్యము నవలోకించుచుండెను. అచట నేమి జరుగునదియు గ్రహించుట కామె మానసమునఁ దావులేకుండెను. హరిరామాదులు సన్నద్ధులగు నంతలో హూణులు వారలఁ జుట్టుముట్టి నిలిచిరి. తప్పించుకొనిపోవుటకు వారికి వెరవుదోఁచకుండెను. మిహిరగులుఁడు హరిరాముని సమీపించి "శరణము. లేకున్నఁ జావుఁగలదు. ఆకన్యను మావశ మొనరింపుము. నీదారిదోపుడులకు మాకెట్టి యాక్షేపణ కానిలేదు. కాని మాకైదీలను మావశమొనరించి, యిఁకమీఁద మాజోలికిరానని మాటయిమ్ము" అని గద్దించెను.

ఆగద్దింపునకు హరిరాముఁడు కోపతామ్రాక్షుండయ్యెను. అతని బొమలు ముడివడెను. "నోరుమూయుము. నాసరస్వతిని నీవశ మొనరింపను. నీవు నానారాయణిని నాశమొనరించినది చాలదా? రారా! ఓరీరాక్షసుఁడా! రారా. కత్తిదూయుము" అని హరిరాముఁడు కోపఘూర్ణితస్వరమునఁ బలికి, కుడిచేత ఖడ్గమును లాగి యెడమచేత సరస్వతిని భద్రముగాఁ బట్టుకొని, వానితోఁ బోరాడసాగెను. ఇప్పుడిరువాగులవారును తలపడిరి. కాని రెండు వందలహూణు లెక్కడ? ముప్పదుగురుచోరు లెక్కడ? సంఖ్యాతీతులగు హూణు లాతస్కరుల నంతలో నాక్రమించిరి. హరిరాముఁడు మిహిరగులునిపైకి దూఁకెను. హరిరామునికత్తిదెబ్బకు మిహిరగులుఁడు నేలకొఱఁగెను. తోడనే హూణభటు లాతని రక్షింపఁ బరుగిడి హరిరాముని కడ్డుతగిలిరి. హరిరాముఁడు వారలతోఁ బోరాడసాగెను. కాని యొక్కం డెంతసేపని

పోరఁగలఁడు? కడకు హూణు లాతని బంధించిరి. చోరు లందఱుగూడ బంధింపఁబడిరి. ఆనాఁటిపోరాటమున మిహిరగులుఁడు గాయపడుటంజేసి, యిరువదిమందిహూణు లాతని సుజ్జయినికిఁ గొంపోయిరి. బంధితులను మధ్య నుంచుకొని హూణసైనికులు పయన మొనరింపసాగిరి. హరిరాముఁడు సరస్వతి ప్రక్క నుండెను. అతఁడు సన్నపుటెలుఁగున నామెను బిలిచి "కుమారీ! మనకుఁ గాల మనుకూలించినది కాదు. ఈహూణులు కిరాతులు. కాలకింక రులు. వీరు నిన్ను హింసింతురు కాఁబోలు. హింసించిన హింసింపవచ్చును. సజ్జనరక్షకుఁ డాభగవానుఁడు నిన్ను సంరక్షించుఁగాక" అని యనున యించెను.

"జనకా! స్వయంసాహాయ్యులకు సర్వేశ్వరుఁడు సాయ మొనరించును. నారాయణికి నాలకించినతర్వాత నాకుఁగూడ విపరీతమగుసాహసము కలుగుచున్నది. ఆమెవలెనే నేనుకూడ మంటలఁబడి మడియవచ్చునని తలంచుచున్నాను" అని సరస్వతి మెల్లఁగా ననెను.

హరిరామునియెడలు జల్లనెను. అతఁడు గద్గదకంఠమున "అయ్యో! కుమారీ! వలదు. నాహృదయము పగులును. అఘోరకార్యానంతరము హరిరాముఁ డింకఁ జీవింపఁజాలఁడు" అనెను.

సర:—లేదు. వేఱుదారిలేదు. నీకేమైన యోజన తగులుచున్నదా?

హరి:—ఈసందిగ్ధసమయమున నాకేమియుఁ దోఁచుటలేదు.

సర:—ఇట్టివేళ బాలాదిత్యుఁ డెచట నున్నాఁడో కదా!

హరి:—ఇపు డాతఁ డెందులకు?

సర:—అతఁ డిపు డిచటనుండినయెడలఁ జోరబలమును నుత్సాహ పూరిత మొనరించి, యీరెండువందలహూణులఁ బలాయనసూత్రముఁ బఠింపఁ జేసియుండెడివాఁడు.

హరి:—బాలాదిత్యుఁడు ధీరాగ్రేసరుఁడై యుండవచ్చుఁగాని, యీ పనికిమాత్రము చాలఁడని నాయభిప్రాయము.

సర:—ఏల? పాషాణకేసరిభూపతు నాతఁడు కాలువీటి కనిపియుండ లేదా!

హరి:—అవునవును. బాలాదిత్యుఁ డపారబలుఁడు.

సర:—జనకా! ఆతఁ డిపుడు మనల నేమని తలంచుచుండును. తన వెంటఁ గేరళపుత్రమునకు వచ్చునట్లు మాటయిచ్చి, కడకుఁ దన్నొంటరిగాఁ బంపినమాయలాఁడ్రని మనల నాతఁడు దూషింపఁడా? నేను మోసకత్తియ నని యాతఁడు తలంచిన నాయపయశమును నేను భరింపఁజాలను.

సరస్వతియుమాయకప్రసంగముల నావిషత్సమయమునఁగూడ హరి రాముఁడు చిఱునవ్వు నాపుకోఁజాలకపోయెను. "అమ్మాయీ! బాలాదిత్యు నకు నిజస్థితి నెఱుంగఁజేయుభారము నాయది. నీపై నాతఁడు కినుకఁబూనఁడు లెమ్ము. మోస మొనరించితివని తలంపఁడు లెమ్ము" అని యాతఁడనెను.

సర:—బాబా! నీవు సరళహృదయుఁడవు. ఒకమా రాతఁడు నన్ను హూణాధములనుండి కాపాడెను. కాన నామానరక్షకుఁడే నేఁడు కృతఘ్ను రాలననియు, మోసకత్తెననియు భావించిన నే నోర్వఁగలనా?

హరి:—ఏమిసరస్వతీ! హూణులనుండి నిన్ను రక్షించినది యాతఁడా! నేనుగదా?

సరస్వతి తనతప్పిదమును గ్రహించి "నారక్షకుఁ డాతఁడుకాకపోయి నను, నేను మోసమొనరించితినని యాతఁడు భావింపఁగూడదు" అనెను.

ఇంతటినుండియు వేదాగ్రభాగమునఁ బనుచుండిన నారాయణశర్మ యున్నట్లు దశ్వగలిని దిగ్గించి బంధితులఁ గలిసికొనెను. ఆతఁడు మూసిమూసినగవుల సరస్వతిఁ జూచుచు "ప్రియామణీ! నీకంతవంత యెందులకు? దిగులు మానుము. నిన్ను మేము విడఁబోవుటలేదు లెమ్ము" అని హెచ్చరించు చుండెను.

కాని సరస్వతి యొకపలుకైనఁ బలుకలేదు.

నారాయణశర్మ మరల "మనోహారిణీ! సరస్వతీ! నన్నెఱుంగవా? నేను నారాయణశర్మనుగదా! నాతోఁ బలుకవేల?" అని ప్రియోక్తులాడెను.

ఆపాపకర్ముని మోటుసరసమున కామె పెదవియైనఁ గదల్చినది కాదు. కాని హరిరాముఁడు కోపసంరక్తలోచనుండై పటపట పండ్లుగొఱుకుచు "ఓరీ! మనోహారిణియా? మానవాధమా! మనోహారిణియఁటరా?" అని గద్దించెను.

నారా:—ఛీ! నీవెవఁడవు; నన్ను గద్దించుటకు?

హరి:—ఎవఁడా? సలక్షణుఁడనగు మానవుఁడను. హృదయమును, అంతరాత్మను గలమనుజుఁడను. దైవమునకు, న్యాయమునకు భయపడి చరించు మనుష్యుఁడను. ఓరీ! అధమాధముఁడా! నీవింతటికసాయివాఁడవైతివేమి?

"ఛీ! హంతకాధమా! నీతో మాటలాడరాదు. కాని నీనోటిపోగరు నకుఁ బరితపింతు వుందువు. ఓసరస్వతీ! సౌందర్యగర్వమున నీవు నిలుచుట లేదుగదా! నీవుగూడఁ బశ్చాత్తాపమొందెద వుందువు" అని నారాయణ శర్మ వారల బెదరించి పూర్వస్థానమునకు వచ్చెను.

హరిరాముఁడు సరస్వతి కాతనిఁ జూపుచు "ఆకాలాహిఁ గాంచుము. ఆతనిఁ గని పెట్టియుందుము. అతఁడు కుటిలకర్ముఁడు. అహో! హూణాధముని కంటె నాతఁడు కఠినతముఁడు" అని చెప్పెను.

సర:—అవును. ఈకిరాతునిబారినుండి నేనెట్లు తప్పించుకోఁగలను? ఆసీతామహాదేవియే నాకుఁ దోడునిడయై యుండఁగలదు. పతివ్రతామతల్లి సావిత్రియే నాకు బాసటయై యుండును.

ఎవ్వరు నేమియుఁ బలుకక కాలుసాగించుచుండిరి. కాని వారిమాన సము లాలోచనాధీనములై యుండెను. 'సరస్వతిపైఁ దనకుఁగల కసిఁదీర్చు కొనుట యెటులా?' అని నారాయణశర్మ యాకసమునఁ జూచుచుండెను. దత్తపుత్త్రికదీనావస్థను హరిరాముఁడు చింతించుచుండెను. హూణగృహాదుర్గ మును జేరినంతనే నారాయణశర్మ తన్నుఁ బెట్టుబాధలను, వానిఁ దప్పించు కొనునుపాయములను, బాలాదిత్యునిఁదలంచుకొని సరస్వతి పరితపించుచుండెను.

తనభావనాదృశ్యమున బాలాదిత్యుని మనోహరవిగ్రహము పొడకట్టి నిలిచి "నిన్నుఁ గాపాడెదను' అనిచెప్పిన ట్లాకోమలాంగి తలంచుచుండెను. బాలాదిత్యునిఁ దలంచుకొనునప్పు డామెవదనాంబుజము వికాసభాసురమై, మరల మఱుక్షణమే తనదుస్థితిని జూచినప్పుడు కళావిహీన మగుచుండెను. ఇంతలో నారాయణశర్మ యొకమా టామెను గాంచెను. ఆసుందరాంగివదనము సంతోషాంకూరముల కాలవాలమై యుండుట నాతఁడు గమనించెను. అతనియానందముకూడ వెల్లివిరిసెను. యశశ్చంద్రసాంద్ర మగు తనచారిత్రమును దలంచుకొని సరస్వతి మోదమందుచున్నదని నారాయణశర్మ యూహింపఁగసాగెను. ఆహా! లోకవృత్తమే యిట్టిదికదా! కురూపియైననేమి! క్రూరకుటిలహృదయుఁడైననేమి! లోకులసమ్మానములకుఁ దానర్హుఁడనని మానవుఁడు భావించుట సహజము. లేకున్నఁ బశుప్రాయుఁడును విప్రవృశ్చికము నగు నారాయణశర్మ, తనపై సరస్వతి బోటిబోటి యువ్విళ్లూరుచున్నదని యెటు లనుకొనఁగలఁడు? కామలరోగికి లోకమంతయుఁ బచ్చగాఁ దోఁచువిధమున, లోకులందఱుఁ దనయట్టివారని యాతఁడు తలంచుచుండెను ఎట్లైననేమి? చేమనిన ట్లాతఁడు సంతోషమున నుప్పొంగుచుండెను. వారు హూణగృహమును జేరునప్పటికి బదిదినములుపట్టెను. రాత్రులయందుమాత్ర మచట నచట విశ్రమించి యాహారము దినుచు గుఱ్ఱముల మార్చుకొను కాలములఁ దప్ప, విశ్రాంతియను సంగతి నెఱుంగక వారు పయన మొనరించుచుండిరి. పదియవనాఁటిప్రాతఃకాలమునకంతయు నాదళ మారవల్లిపర్వతప్రాంతములఁ జేరెను. అచట నాపర్వతసానువులు ఘోరకాంతారమయములై యుండెను. ఆకాంతారాంతరముల నొకయెడఁ గారాగారశ్రేణు లుండెను. ఆచెఱసాలలందు నేలమాళిగలుగూడ నుండెను. అవి శోభావిహీనములై, చీఁకటికొనలై, పాడువాఱియుండెను. అగడులకుఁబైన నేడడుగులయెత్తున నొకచిన్నకిటికీమాత్ర ముండెను. వాని మూలమున నాగదులలోనికి నేకొంచెము గాలియో, యేకొంచెము వెలుతురో పోలేక పోవుచుండెను. అస్థలమును జేరినంతనే హూణులు హయములనుండి

దిగిరి. ఒక్కొక్కఖైదీ నొక్కొక్కగదియందు బంధించి నారాయణశర్మ వారల శిక్ష చేసెను. అట్లే యాబంధితులందఱు వేఱువేఱుగదులఁ ద్రోయఁ బడిరి. పాపము రఘుపతి తనకుమారితోఁబాటు తన్నుఁగూడ నామెగదియందు బంధింప నారాయణశర్మ కెంతయో బ్రతిమాలెను. కాని నారాయణశర్మ యందులకుఁ గుపితుఁడై "ఏమీ! యౌవనవతియు, సుందరాంగియు నగుసుదతి యుండు గదియందు మఱియొకమానవు నుంపుమందువా?" అని గద్దించెను.

"కాని యాయౌవనవతి నాపుత్రికయేకదా?"

"పుత్రికయైననేమి, పత్నియైననేమి ? నేను వారియందు భేదము పాటింపను."

నారాయణశర్మ నీతిమాలినపలుకులకు రఘుపతి కనలెను.

"ఛీఛీ! నీవు మానహీనుఁడవు. ఆనారాయణమూర్తి—ఛీఛీ. కాదు కాదు—నీపేరుతో నుండినయెడల నాపూజ్యుఁడునయిత మపవిత్రుఁడగును— ఆగోవిందుఁడే నాతనయ కేడుగడయైయుండును...అయ్యో! కుమారీ! అయ్యో! కుమారీ! ఈపాడులోకమున నీవేల పుట్టితివి? అకటా! నేనెంత నిర్భాగ్యుఁడను!" అని రఘుపతి వాపోవుచుండెను.

"ఓరీ! రఘుపతీ! నీకుమారి నీకొఱకుఁ బుట్టలేదుసుమా! పెఱవారికొఱకు జన్మించినది. తెలియునా?" అని నారాయశర్మ యనెను.

దీనినంతయు వినుచుండినహరిరాముఁడు బాలునివలె నేడ్చుచుండెను. అతనికన్నులనుండి యశ్రువారి కాల్వలుగట్టి పాఱుచుండెను. "ఆహా! భగవానుఁడా! అగ్రజన్మమునుండి యధఃపతితుఁడైన మానవుఁ డధమాధముఁ డగు వఱకు నిలువఁడుగదా!" అని యాతఁ డనకొనుచుండెను.

నారాయణశర్మ యామాటల నాలకించి "ఓరీ!ఇచట నీయభిప్రాయము కెవ్వరడుగలేదు. నోరుమూసికొనియుండుము" అని హరిరాముని గద్దించి యాతని నొకగదియందుఁ ద్రోయించి తాళము వేయించెను. ఇఁక సరస్వతిమాత్రము మిగిలియుండెను. ఆమెనుగూడ నొకగదియందుంచిరి. ఆగది కడపు.

గదు లంత పాడువాఱియుండలేదు. దానియం దొక కొత్తనిపా న్పమర్పఁబడి యుండెను. హాయిఁగూర్చ్పడి యాగదిఁ గాంచి, సరస్వతి భయభ్రాంతయయ్యెను. నారాయణశర్మ క్రూరాలోచనాసఫలతకై యాగది యారీతి నలంకరింపఁబడి యున్నదని యామె గ్రహించెను. ఒకపాడుగదియందైనను దన్ను బంధించి యుండిన కొంతయో హాయిగా నుండెడిదని యామె చింతించుచుండెను. ఆమె యామృదుశయ్యపైఁ గూర్చుండి, పాపము, కంటికిఁ గడివెడుగా నేడ్వ సాగెను. ఒకమా ఱామె విలాపము నాపి 'ఓబాలాదిత్యా! ఓకృతఘ్నుఁడా! ఎందున్నావు! ఈవిపదంబుధినుండి నన్నేల గట్టెక్కింపవు!'' అని బలిమా లెను. మఱియొకమాఱు నిట్టూర్పులు విడుచుచు 'సర్వేశ్వరుఁ డాతనిఁ గా పాడుఁగాక! నేను చచ్చినఁ జత్తునుగాక! ఆతనిమాత్రము శ్రీమహావిష్ణువు కాపాడుఁగాక' అని ప్రార్థించును. శోకాతిశయమున నామె పారాట మెక్కు డయ్యెను. అప్పుడుతల్పమునఁబడి యామె పొర్లాడుచుండెను. కష్టాటవులఁబడి పరిభ్రమణ మొనరించుచుండినయామె భావచంచరీక మిప్పు డొక్కమాఱు గా నాగిపోయెను. ఆమె నిప్పుడు నిద్రాదేవి చేఁగొనెను. అటు లాకయువ కంటి విలపించి విలపించి, గాఢసుషుప్తి మైమఱచెను.

---

# పదమూడవతరంగము.

## స్త్రీచాతుర్యము.

ఎంతకాలమట్లు నిద్రించినదియు సరస్వతికిఁ దెలియదు. గదితలుపులు కదలుసవ్వడి నాలకించి యామె మేల్కాంచెను. ఆజవ్వని కన్నులు నలుచుకొని నిద్రమత్తును బోఁగొట్టుకొనెను. తరువాత రెండుమూఁ డావులింతలుకూడ వచ్చెను. గాఢనిద్రవలన నాకోమలాంగి సేదదేఱి, పూర్వోత్సాహమును బడయఁగలిగెను. ఆమెలేచి పాన్పుపైఁ గూర్చుండి కిటికీనుండి బయటికిఁ జూచి యది నిశాసమయమని గ్రహించెను. ఆచిగురుఁబోఁడి రమారమి యొనిమిదిగంటలసేపు నిద్రించినది. ఇప్పు డాగదియందు గుడ్డివెలుతురుమాత్ర ముండెను. ఆమె కాకలియగుచుండెను. నిన్నరాత్రి తినిన యన్నముతప్ప, మరల నామె యేదియుఁ దినియుండలేదు. ఆమె యాకలి దుస్సహమై యుండెను. అచట నేమైనఁ దినుబండార మున్నదేమోయని నలుమూలల దృష్టులఁబఱపెను. పాన్పునకు దాపుననే గోడయందుండు నట్టువపై నొకపాలగిన్నెయుఁ గొన్నియరటిపండ్లు నుండుట నామె కాంచెను. కాన నామె కొన్నియరటిపండ్లను దిని, యాపాలఁ ద్రావి యాఁకటిఁ బాపుకొనెను. ఆమె భుజించునపుడు తలుపులుతీయుశబ్దము తన్ను సమీపించుచుండుటను గ్రహించెను. ఇప్పు డాశబ్ద మామెగదికి మూడవగదియం దగుచుండెను. తోడనే యామె భోజనమునుమాని యాఫలముల నేలపైనుంచి పాన్పుపైఁ గూర్చుండెను. తనవంతుకూడ ద్వరలో రానున్నదని యాకన్నియ తెలిసికొనెను. ఆమెహృదయము త్తలమున దడదడఁ గొట్టుకొనసాగెను. [illegible]తిరేకమున నాబాల కూపిరియైన నాడకుండెను. అటులామె తెప్ప [illegible]క ద్వారముపై నవలోకించుచు శయ్యాతలమునఁ గూర్చుండియుండెను.

ఇంతలోఁ దలుపు తెఱవఁబడెను. గదిలోనికి వెలుతురు వచ్చెను. ఆవెలుఁగునం దామె నారాయణశర్మను గుర్తించెను. ఒకభటుఁడు దివ్వెఁబట్టుకొని, పాలగిన్నెను, లేఁతటెంకాయను, అరటిపండ్లగెలను దీసికొని యాతనివెంట వచ్చెను. ఆఫలాదికముల నట్టువపైఁ బెట్టించి, వానిచేతిలాంతరును దాను దీసికొని, నారాయణశర్మ వానికి సెలవిచ్చి పంపెను. ఆయోఁగుబోతు, నారాయణశర్మమాట వినుటయే తడవుగా వెడలిపోయెను. అభటుని నడకసడి వినరానంతవఱకు నారాయణశర్మ యటులే నిలిచియుండి, యనంతరము గదిలోని కరువెంచి, లాంతరు నొకపీఠముపైఁ బెట్టి, తలుపుల బిగించెను. ఇంతటియుండియు సరస్వతి యేమియో మాటాడఁ బ్రయత్నించినది కాని, భయోద్రేకము లావెను బెనవైచుకొని యామె నధీరమానసనుగా నొనర్చెను. అభటుని వచటనుండుమని యామె బతిమాలఁ దెంచియు, నోట మాటరానందున విఫలమనోరథయయ్యెను. నారాయణశర్మ ఘాటుకుని నూహించియుండిన సరస్వతి, యిపు డాతఁడు నీవను నచటినుండి పంపివేయుటను గాంచి బెగడొందెను. అతనిహృదయస్థితాభిప్రాయ మామెకు వ్యక్తమయ్యెను. కాని యొక్కసారిగాఁ నాక్రూరుఁడు తలుపులబిగించినందుచే నామె లేనితెగువఁ దెచ్చికొని "తలుపులు మూయుటేల? తెఱచి యుంచరాదా?" అని గద్గద స్వరమునఁ బలికెను.

అందులకు నారాయణశర్మ 'చలిగాలి లోనికి వచ్చును' అని సవిలాసముగఁ బ్రత్యుత్తరమిచ్చెను.

సర:—చలిగాలి యొచటనున్నది? దయచేసి వానినిఁ దీసెదవా?

"అది నీకేల? మరలఁ గవాటమును దీయఁజాలను." అని యాతఁ డామెకయ్యాడఁ బ్రక్కనుండు మృదుపీఠమునఁ గూర్చుండెను.

సరస్వతి యవస్థ దుస్సహమై యుండెను. ఒక్కగంటులోఁ గవాక్షము కడ వ్రాలి దానిఁ దెఱచుకొని పరాత్పరుఁ డిచ్చుకొనినచోటికిఁ బోవలయు నని నిశ్చయించుకొనెను. కాని యింతలో నయ్యది యుక్తియుక్తి కాదని

యామెకు స్ఫురించెను. ఇచటిపరాణు శ్రీనారాయణశర్మకంటె మిన్నయగు క్షుద్రులని యామె యనుకొనెను. వారును నారాయణశర్మవలెనే కామాంధులని యామెకుఁ దెలియును. వా శ్రీనారాయణశర్మకంటె న్యాయాన్యాయవిహీనులనియు, బలగర్వితులనియు నామె యెఱుఁగును. ఇట్టిభావము లామె మానసవీథిఁ జిందులు ద్రొక్కుచుండెను. ఆదారుణకర్ముని దురుద్యోగతీవ్రతకు దావానంగళ యచటనుండుటయే యిప్పటి కించుకసముచితమని యామె దృఢపఱచుకొనెను పాపము! నారాయణశర్మ యొకవేళఁ దన్ను విడిచి పోయినఁ బోవచ్చునని, యాదీనురాలు తలంచుచుండెను.

నారాయణశర్మ యామెముఖాంబురుహమునందలి సౌందర్యరసమును నయనేంద్రియములఁ గ్రోలుచు నిలిచియుండెను. "ముద్దులగుమ్మా! నీవు తప్పించుకొనుటకు దారిలేదు. నీకును ద్వారమునకును నడుమ నేను కూర్చుండియున్నాను. అవియటుండె నావల నెవరున్నారో తెలియునా? దేశద్రిమ్మరులగు హూణరాక్షసులు—దారిదోఁపుడు లొనరించుదొంగలు—కామాతురులగుభటులు—కాఁచియున్నారు. నీపైనివలపులో మునుఁగలిదుచు నేను నీసన్నిధిఁ జేరియున్నాను. నావలె వారు నిన్ను గౌరవమునఁ జూడరు. నీ మానమును వారు మోటుతనమునఁ గొల్లఁగొట్టికాని వదలరు." అని యాతఁడామెకుఁ దెలియఁజెప్పెను. సరస్వతి పెదవివిప్పి యొక్కపలుకైనఁ బలుకలేదు.

నారా:—ఓ మోహనాంగీ! నన్ననుగ్రహింపవా? ఈదీనుని దయఁ జూడవా?

సర:—నేను నిన్ను దయఁజూడవలయునా? నీవు నన్నుఁ బరిహాసమొనరించుచున్నాఁడవు! నీవుకదా నన్నుఁ గరుణఁ జూడవలయును. నేను నిర్భాగ్యురాలను. భూమికి బరువుగా నొంటరినై నిలిచియున్నాను. కన్యలందఱవలె నేనుకూడ నబలను. అసహాయను. ఇఁక నీవో! బ్రాహ్మణుఁడవు. హితాహితముల నెఱింగినవాఁడవు. రాజోద్యోగులమేటివి. నాపై నింత కరుణించి,

నన్నుఁ గావుము. నన్నువిడిచి, సర్వాధికారియగు బ్రహ్మదేవుని యనుగ్రహము వడయుము. నీయభీష్టమునకు నేను సమ్మతింపఁజాలను. సమ్మతింపను. నీకోరికలతినీచములు. బ్రాహ్మణుఁడు కోరఁదగినవి కావు. పొమ్ము. వక్రుఁడగు నీవర్తనమును బ్రహ్మదేవుఁడు చక్కఁజేయునుగాక!

ఈప్రబోధమునకు నారాయణశర్మ చకితుఁడయ్యెను. కాని యంతఃకరణములేని మూర్ఖులస్వభావము విచిత్రమైనదిగదా! వారికిఁ దమనైజము తెలియుకొలఁది, యహంకారము పెంపొందుచుండును. అందుచేఁ దమ కార్యము సాధింపవలయు ననుకట్టుదల హెచ్చగుచుండును. లోఁగాము నాలోచింపక ముక్కుసూటిగాఁ బోవుచుందురు. అటులే నారాయణశర్మ మనసునందు మార్పేమియుఁ గలుగలేదు.

"వీలుపడదు. సరస్వతీ! నన్ను మన్నించుము. నీవబలవనియు, నసహాయవనియుఁ బలికితివి. ఇప్పుడెకదా నినోట నిట్టిమాటలువచ్చె! ఉజ్జయినియం దొకమారు నిన్ను నేను వివాహమాడఁ గరుణించి యావిషయమై నీతండ్రి రఘుపతితోఁ బ్రస్తావింప, నాతఁడు నన్ను నోటికొలఁది మాట్లాడినాఁడు. నన్నుఁ జేపట్టుటకంటె నీవు చచ్చినను దనకానందమని యాపొగరుబోతు పలికినాఁడు. నేను పోటుపశువునఁట. కృతఘ్నుఁడనఁట. అకించనుఁడనఁట. కురూపినఁట. నన్నుఁ దగులీరునఁ దనకుమారి త్రోసిపుచ్చినయెడలఁ దనసంతోషమునకు మేరయుండదఁట. అమదాంధుఁ డీవిధమున నోటికివచ్చినట్లు ప్రేలినాఁడు. ఇప్పుడు నీవునాచేఁ జిక్కితివి కావున, నబలనని యు నసహాయననియుఁ బొల్లిమాటలాడి కల్లయేడ్పు లేపుచున్నావు. ఇట్టికుతంత్రము లిచట సాగవుసుమా! అప్పుడు నిన్ను ధర్మపత్నిగాఁ జేకొన ననుగ్రహించితిని. ఇప్పుడో నాయుంపుడుకత్తెగా నుంచుకొనఁ గరుణించితి."

సర:—నీవు కరుణింతువా? సుక్షత్రియకన్య నీయుంపుడుకత్తెయై యుండవలయునా? ఓరి క్రూరుఁడా! ఓరి నీచాధముఁడా! ఓరి పాపకర్ముఁడా! ఇందులకు నీవు కరుణింతువా! ఓరి! ఇచట నుండవలదు పొమ్ము. నీపాపాంధ

కారకుహారములకుఁ బొమ్ము. నీకుతంత్రాగారములకుఁ బొమ్ము. నీఘోరకార్యపర్యాలోచనామందిరములకుఁ బొమ్ము. నామేన నెత్తురు పాఱువఱకు నిన్నుఁ బ్రతిఘటించి నిలిచెదను. నేను దిక్కులేనికన్నియ నని నీవు తలంచుచున్నాఁడవు! నేనే యట్లంటిని. నాయభిప్రాయము ప్రమాదజనితముసుమా! నాకు దిక్కులేకపోలేదు. నాకు గతిలేకపోలేదు. నిష్కళంకపవిత్రచారిత్రలు, పతివ్రతామతల్లులు, సీత సావిత్రి దమయంతి శకుంతల మొదలగువారు నాకుఁ దోడుపడదలఁచి నిలిచియున్నారు. విశుద్ధచారిత్రయగు వనితారత్న మెంతవానినైనఁ దనకోపాగ్నిఁ గాల్ప సమర్థురాలని పురాణములు ప్రకటించుటలేదా? మోహాంధుఁడగు నాకిరాతుని దమయంతీదేవి నీఱు చేయలేదా?

నారా:—ఓహో! పురాణము లట్లు పలుకుచున్నవందువా? పురాణము లెట్టివో నీకుఁ దెలియునా? పనిపాటలులేని బాఁపలు పొట్టకై నాలుగు దుగ్గానులు సంపాదించుకొనుటకు వ్రాసిన యబద్ధపుఁగథలు. కల్పితగాథలు. బూటకపుఁగథలు. నేను పురాణముల నమ్మను.

సర:—ఓరీకృపణుఁడా! దేనినైన విశ్వసించినఁగదా, దీనిని విశ్వసింతువు. కనుక నీవు భూతకృత్యములనైన నమ్మినచో, లోకమునకుఁ గొంత మేలు చేయఁగలవు. కాని యెవరికిఁ దెలియును? అభూతములకుఁగూడ నీవు క్రూరకర్మలఁగలుప సమర్థుఁడవు కాఁబోలు.

నారా:—నేను బ్రాహ్మణుఁడను. తెలియునా?

సర:—నీవు నిజముగా బ్రాహ్మణుఁడవా? అయిన బ్రాహ్మణుఁడునయితము పిశాచము కావచ్చును. అసదృశశేముషీభూషితుఁడును, అసమానచాతురీవిలసితుఁడు నగుబ్రాహ్మణుఁడు వక్రమార్గముఁబట్టినచో, యొక్కమారుగాఁ బైశాచికజన్మ మెత్తును. అదియటుండ, నిన్ను బ్రాహ్మణుఁడని పిలుచువా రెవరు!

నారా:—అందఱు.

సర:—ఉజ్జయినీపౌరులు నిన్ను బహిష్కరించిరి. సర్వజనవంద్యమైయుండిన నీబ్రాహ్మణత్వ మిట్లు భగ్గని మండిపోయినది.

నారా:—ఉజ్జయినియందలి యీబాలనదయ్యములు నన్ను వెలి వేసిరి. నాకుఁ బ్రియతమయగు నాకులమునే నేను కోల్పోయినవాఁ డిఁకఁ గోల్పోవున దేమికలదు! ఇప్పుడు నాకు హాయిగా నున్నది. నిన్ను సంతుష్ట మానసమునఁ జేపట్టి, నీతో సంతోషముగా రమింప వీలుకలిగినది. మాలవాని యొద్ద మాన్యవర్తనము నెవ రాకాంక్షింతురు? ఇప్పుడు నన్నా కైలాసాధి నాథుఁడైన నిరోధింపఁజాలఁడు.

అని యాతఁడు లేచి సరస్వతికడకుఁ బోవ నుద్యమించెను. కాని యాలలనామణిమాత్ర మట్లే జాతిబొమ్మవలెఁ గూర్చుండియుండెను. ఆమె విషాదవిహ్వలయై "హా! గౌరీ! నన్నుఁ గావుము. ఓ పార్వతీ! నా పాలరమ్ము. ఓ హిమాచలతనయా! ఓ ఈశ్వరీ! నీవు మానినీమణులపాలిటి సురభివి కదా! అయ్యో! రక్షింపరమ్ము. రక్షింపరమ్ము." అని యామె యేడ్వసాగెను.

నారా:—ఆమెను విడిచి యుపయోగములేదు.

సరస్వతీకనులనుండి యశ్రుజలము లురులుచుండెను. ఆకాంత చేతులం బైకెత్తి యాకసముఁ జూచుచు "ఓ సావిత్రీ మహాదేవీ! ఒక్కసారి ప్రీనింపి పడ్డుండి యిటురమ్ము. నిన్నే నమ్మియుండిన నారీరత్నముమానము సంరక్షణమునకై నీపతిని విడిచివచ్చుట, యాకసిన నాదరించుట యని భావింపకుము. ఓ సీతామహాదేవీ! ఓ సర్వలోకమాతా! శ్రీరాముఁడు క్రూరుఁడై నిన్ను వలన పంపఁగా, మరల నీ పాడుభువికి వచ్చుటెట్లని వెనుదీయకుము. నీరాక, నారక్షణమునకుఁ గాదా? ఓ దమయంతీ! ఇటురమ్ము. ఓ చెలీ! దమయంతీ! ఆకిరాతున ట్లీక్రూరునిఁగూడ భస్మము సేయుము. అయ్యో! నారాయణీ! ఓ సోదరీ! నాయనుఁగుసహోదరీ! రమ్ము. ఈ నరాధముఁడు నిన్ను ధ్వంసము చేయుటతోఁ బోక, నన్నుఁగూడ—నీయట్టి శుభచారిత్ర నగు నన్నుఁగూడ—నాశ మొనరింపఁ జూచుచున్నాఁడు. ఈనీచునిపైని పగఁదీర్చుకొనుము." అని ప్రార్థించు చుండెను.

ఆయవసరమున నామె యింక మాటలాడలేకపోయెను. "ఈరోదనము లిపుడు పనిరావు" అని నారాయణశర్మ తిరస్కారముగా బలికెను. కా

సరస్వతి పరిదేవనములు పనిచేయకపోలేదు. ఏదేవత కాని, ప్రత్యక్షముగ నరుదెంచి యామెను రక్షింపకపోయినను, సర్వలోకజనని పార్వతి మొదలు సర్వసాధారణనారాయణివఱకును, పరమపవిత్ర సీతామహాదేవి మొదలు పతివ్రతాశిరోమణి సావిత్రిదేవివఱకును, నామె విలాపస్వరములు వ్యాప్తిగాంచెను. దీనశరణ్యులగు నామహాదేవులు సరస్వతిమొఱ నాలకించిరి. అదృశ్యరూపముననే వా రామె కభయప్రదానమిచ్చిరి. ఇప్పుడు సరస్వతి నవనవోత్సాహభరితమయ్యెను. సరస్వతి హృదయనీరధిధైర్యోత్సాహవీచిక లంబరము నంటుచు భవిష్యచ్ఛుభసూచకములై యుండెను. అనన్యమానసమున దైవారాధన మొనరించువానియాపదలు పటాపంచలగుట జగద్విదితముగదా! ఇఁక నిక్షణమునుండి సరస్వతి యొంటరిగా లేదు. సరస్వతి మానధనమును జూఱఁగొన సమకట్టియుండు మానవాధముని మద మణఁచుటకై యిపుడు పార్వతి, సీత, సావిత్రి, దమయంతి యామెకు సాయ మరుదెంచియుండిరి. ఆమహాదేవులు తనయెదుటనిలిచి తనకభయహస్త మిచ్చుటను, సరస్వతి తనభావనాదృశ్యమునఁ బొడఁగాంచుచుండెను.

నారాయణశర్మ కొంతసేపటులే కదలక మెదలక నిలిచియుండెను. "సరస్వతీ! సరసముగనో, విరసముగనో, మోసముననో, యెట్టులో యొకట్టుల నిన్నుఁగూడి సుఖింప నిశ్చయించియున్నాను. నాయభిమతము నీవాదరింతువేని నిన్ను నేను ప్రేమింతును. పువ్వులతోఁ బూజింతును. నీయానందమును నాయానందముగా భావింతును. నిన్ను మానవాధికునకిచ్చి వివాహ మొనరింతును. అట్లుకాక, నీవు నన్నిప్పుడు నిరాకరింతువేని, నిన్ను ముప్పుత్రిప్పులఁ బెట్టి మూఁడుచెఱువులనీరు ద్రావించెదను. నీమానభంగమును లోకమంతయుఁ బ్రకటించెదను. అటో యిటో యొకనిముసములోఁ జెప్పుము. ఇట్లు నేను నీతో వృథాప్రసంగమున నాకాలమంతయు వ్యర్థమొనరింపఁజాలను. ఇట్టి కాలహరణములు నాకుఁగిట్టవు." అని యాతఁ డనెను.

సర:—నీవు మానవుఁడవుగావా! పిశాచముకూడఁ గాదనుము.

నారా:—ఆహా! నాకుఁ దృప్తియైనది. నీవెట్లు పగిలినను, నాయధీనవై యుండిన నాకదియే పదివేలు.

అని యాతఁడు ముందు కడుగిడి యాకన్నియను డాసెను. సరస్వతి వెనుకకు జరిగి నిలిచి "నన్నుఁ దాఁకకుము. శుద్ధచారిత్రయగు కన్నియను ముట్టకుము. ఎన్నఁడో నన్ను నేను బాలాదిత్యున కర్పించుకొనియున్నాను. అతనిఁ గామించియున్నాను. సావిత్రివలె నేనుగూడ నాచిత్తరంజనుని వివాహ మాడుదును. ఆపురుషపుంగవు నొక్కనిమాత్రము నేను బెండ్లాడఁగలను. ఆనరేంద్రునిమాత్రము నేను బ్రేమింపఁగలను. ప్రేమించెదను. ప్రేమించితీరెదను" అని ప్రత్యుత్తర మొసఁగెను.

ఆమాటలకు నారాయణశర్మ విభ్రాంతుఁడై "బాలాదిత్యుఁడా! అతని నెప్పుడు కామించితివి?...అయిన నీతాతనిఁగూడఁ దలఁచియుంటివా! అతనికి నీవప్పు డాశ్రయమిచ్చి యుంటివి కాఁబోలు! ఔనౌను నిజము. దీనికి నీవు పరితపించెద వుండుము. నీవిప్పుడు నాసెయ్యమున కియ్యకొందువేని, బాలాదిత్యునివివాహ మాడఁగలవు. లేకున్న, బాలాదిత్యుఁడే నీవు మానభంగ మొందితివని వినఁగలఁడు." అని బెదరించెను.

సర:—నామానభంగమును నాప్రాణకాంతున కెఱింగింతువా? ఒకరికిఁ దెలియఁబఱచువఱకు నీవు జీవించియుండఁగలవా?

నారా:—ఉండ కేమి? ఆబాలాదిత్యుఁడు బుద్ధిహీనుఁడని నాకుఁ దెలియును. మీఁదు మిక్కిలి నీకృతఘ్నతాబుద్ధిని, నీరాజద్రోహమును మిహిరగులునకు నివేదించెదను. అతఁడు నిన్ను నీతండ్రిని నుఱితీయును.

సర:—అకటా! క్రూరకర్ముఁడా! రాక్షసాధముఁడా!

నారా:—రాక్షసశ్రేష్ఠుఁడనని చెప్పుకొనఁగదా, నీవు రాక్షసాధముఁడనని పిలుచుటకు? ఏదీ నీయుత్తరమును వినిపింపుము.

అని యాతఁడు ముందు కడుగుఁబెట్టెను. సరస్వతి యొకక్షణ మాలోచించెను. అతనికి మానావమానములు లేవు. దయాదాక్షిణ్యములు లేవు. అతఁడు

ప్రత్యక్షరాక్షసుఁడు. పట్టినపట్టును జెల్లించుకొనుమూర్ఖుఁడు. సరస్వతికి సాయ మొనరించువా రెవ్వరును దాపున లేరు. అక్రూరుఁ డాయబలకన్న నెన్నియోరెట్లు బలాధికుఁడు. సాధ్యమైనంతవఱకు నాతఁడు తన్నుఁ దాఁకకుండఁ జేయవలయు నని, యామె యందుల కుపాయ మాలోచించుచుండెను. ఒక్కమారుగా నాతనిఁ దిరస్కరించుటకంటె, మాయమాటలచే దేలుపుచ్చు టెంతయో కార్య కారియని యామె మది నూహించెను. ఆయూహ నామె తఱచితఱచి చూచెను. ఆనీచుఁడు తెచ్చిననారికేళముపై నామె విలోకనములు వ్రాలెను. ఆమె మానసాకాశమున నాలోచనావిద్యుద్దామ మొకటి తళుక్కని మెఱ సెను. ఆమె వదనాంబుజము వికాసభాసురమయ్యెను. ఆమెనేత్రములు తేజో వంతములయ్యెను. తనకట్టిస్ఫూర్తినొసంగుటకై, సర్వశక్తిస్వరూపులగు సకలదేవ తాపికముల నామె ప్రార్థించెను. నారాయణశర్మ క్షణమును యుగముగా నెంచుచుఁ దహతహలాడుచుండెను. "సరస్వతీ! ఏమనియెదవు? త్వరగాఁ జెప్పుము" అని యాతం డనెను.

సర:—నాకు గొంతు యెండిపోవుచున్నది. దాహము కావలయును.

నారా:—అయిన, బాలుత్రాగుము.

అని యాతఁడు పాలగిన్నె నందియ్యఁబోయెను.

సర:— పాలు నాకు సహించవు. నీరైన, మఱేమైనఁజాలును.

నారా:—నీకొఱకు నేను తెచ్చినటెంకాయ యిచట నున్నది. నీవు నాదానవగుటకు సమ్మతింపవలయునే కాని, యీనారాయణశర్మ నీకొసంగరాని వుండునా! దాని నుజ్జయినియందు విలుచుకొని నీకై ప్రత్యేకముగా నిచటికిఁ దెచ్చినాఁడను.

సర:—అలాగా? కృతజ్ఞురాలను.

నారాయణశర్మ యుబ్బి తబ్బిబ్బులగుచు నాటెంకాయ నామె కొసంగెను.

సర:—దీనికి రంధ్రముచేయుటెట్లు? నీకడ గత్తియేమైనఁ గలదా?

"ఆహా! ఇది వాడియైనకత్తి" అని యాతఁడా కత్తిఁ జూచెను.

ఆకత్తి తక్షశిలయందుఁ జేయఁబడినది. అతఁడా టెంకాయను సరస్వతి యొద్దనుండి తీసికొని, యావెడల్పాటికత్తితో దానిపైనుండి తొలికను చెక్కివేసెను. ఇఁక దానిలోనినీటిఁ గ్రోలుటకై, దానిపైనుండుకన్ను నొకదానిని దొలుచుటయే మిగిలియుండెను.

సరస్వతి యాటెంకాయను దీసికొనెను. ఆమె, యాతనిచేతనుండి యాకత్తిఁగూడఁ గైకొని, దానితో నాటెంకాయకన్ను నొకదానిని దొలిచి కొంత నీరు త్రాగి 'యిఁకఁ జాలును' అని యావివరమును మఱింత పెద్దచేసి 'మిగత నీటిని నీవు త్రాగుము. నీవుఁగూడ దప్పిగా నుండవలయును.' అని యాతని కాకాయ నెడమచేత నందిచ్చెను. కత్తి యామె కుడిచేత నుండెను. ఆమాటలకు నారాయణశర్మ తనకు దేవేంద్రపదవి యిచ్చిన ట్లుబ్బి తబ్బిబ్బులగుచు 'అంత దప్పిలేదు. కాని నీసంతోషమునకై త్రాగెదను' అని యాతఁడా టెంకాయను పెదవులఁజేర్చుకొని, ముఖమును పైకెత్తి, వెనుకకువంగి నీరు గ్రోలసాగెను. సరస్వతినేత్రములు వికారకళాభాసురములయ్యెను. ఒక్కసారి యామె దైవమును బ్రార్థించెను. ఒక్కసారి నారాయణశర్మను జూచెను. నీటిని గ్రోలు నారాయణశర్మ పైనఁజూచుచు సరస్వతి నారయఁజాలకుండెను. ఆమె యొక్కమారుగా నాకత్తితో నాతని మెడయందుఁబొడిచెను. ఆకత్తి యాతని కంఠమున విడివడకు జొఱఁబడి వెనుకకు దూసికొనివచ్చెను. వేడినెత్తురు రాపా శాస్త్రుని మెడనుండి చిమ్మినగ్రోవినుండివలె గడువేగమున బైటికి వెడలెను. ఒక్క యఱుపఱచి యానారాయణశర్మ—యావాంతకశిఖామణి—అట్లె వెనుక కొఱఁగెను. ఒక్కపలుకైన బలుకక యాతఁడు పరలోకముఁజేరెను. సరస్వతి చేతులు, దేహము రుధిరమయమైయుండెను. ఆసాహసికవనిత నిపుడు భయోద్రేకములు పైకొనెను. ఆబీభత్సదృశ్యముచే నామె కనులు తిరుగుచుండెను. ఆమె యట్టే శయ్యపైఁబడి మూర్ఛమునిఁగెను.

# పదునాల్గవతరంగము.

## బందీవిమోచనము.

సరస్వతికి మెలఁకువవచ్చునప్పటి కర్ధరాత్రియయ్యెను. ఆమె నలుదిక్కులఁ జూచెను. ఏమిజరిగినదియు నాలోచించుట కాసుందరాంగిమానసము శూన్యమైయుండెను. అర్థరహితములును, విభ్రమసహితములు నగుచూపుల నాభీతహరిణేక్షణ, యాగదియంతయుఁ బఱపుచుండెను. దీపము మసకగా వెలుఁగుచుండెను. ఆపలపలని వెలుతురులో నెత్తుటఁ దొప్పఁదోఁగునారాయణశర్మ మలినశవము గానవగుచుండెను. చేతనారహితములగు నాతనిచేతులపట్టు దప్పి, యానారికేళము దొర్లిపోయి యొకమూలకుఁ జేరియుండెను. పాలు, పండ్లు బల్లపై నట్లేయుండెను. సరస్వతిస్వాంతము క్రమక్రమముగ నామె స్వాధీనమునకు వచ్చుచుండెను. ఆకాళి రాత్రియందలి భీకరసంఘటనము లొక్కొక్కటిగ నామెమదికి రాసాగెను. అఘోరకార్యమును దలంచుకొని, యామె భయాతిరేకమున సొక్కిపోయెను. ఆమెతల గిఱ్ఱునఁ దిరుగుచుండెను. బలహీనతచే నామె ప్రాణము లెక్కడనో యుండెను. ఆమె మెల్లగా నాపాలగిన్నెను దీసికొని యొకగ్రుక్కలో వానిని గ్రోలెను. ఇప్పు డామె కొంతబలమువచ్చెను. ఇఁక నామె కర్తవ్యాంశము నాలోచింప మొదలిడెను. హూణుల కత్యంతసన్మాననీయుఁడును, వివిధకార్యవాదియు నగురాజోద్యోగి ప్రాణములఁ దానుదీసియుండు టామెకుఁ దెలియును. కాన నిఁకమీఁద నీమాత్రమచట నిలిచినను ప్రాణములఁ గోల్పోవవలసివచ్చు టటుండ, ముందుగా మానముపోవుననికూడ నామెకుఁ దెలియును. ఆతొయ్యలి లేచి యటనుండి పాఱిపోనెంచెను. కాని యొక్కడికని పోఁగలదు! ఆమె కేమియుఁ దోఁచలేదు.. ఆహంతకునిశవమునకు కొండినప్రేలాడు తాళపుగుత్తిపై నామె

విలోకనముల వ్రాలెను. తోడనే యామె యా తాళములఁ దీసికొనెను. ఆ క్రూరునిగొంతునఁ గ్రుచ్చుకొనియుండు కత్తి నూడఁబెఱికి, యాతనిగుడ్డలతో నాకత్తి నంటుకొని యుండు నెత్తురుఁ దుడిచి, దానిని భద్రపఱచుకొని, దీపము నార్పి బయటికివచ్చెను. ఆమె ప్రక్కగదికిఁ బోనుండునంతలో నొకయోజన తట్టెను. ఆమె మరల వెనుకకువచ్చి యాశవము నట్లే యుంచి యాగదితలుపులు మూసి తాళమువేసెను. అనంతర మామె ప్రక్కగదికిఁబోయి, తలుపు సందునఁ గన్నుంచి చూడసాగెను. లోపలఁ జీకటిగానుండెను. ఆమె కేమియు నగపడలేదు. కాని యాగదియందలి బంధితుఁడు నిద్రాదేవి యనుగ్రహమునకు దూరుఁడై, హృదయారాట మొందుచుండుట నామె గ్రహించెను. తాళపురంధ్రమున నోరిడి 'ఎవరులోపల' అని యామె యడిగి, ప్రత్యుత్తరముకొఱకు కలతే వేచియుండెను.

"నేను, హరిరాముఁడను" అను ప్రత్యుత్తరము మందస్వరమున వినవచ్చెను. ఆమె మెల్లగాఁ దలుపుదెఱచి లోనికిఁబోయెను. హరిరాముఁడు నిలువఁబడి 'వేళకానివేళవచ్చిన నీవెవఁడవు? అందునఁ గత్తిఁగూడఁ దీసికొని వచ్చితివి' అని యడిగెను.

"బాబూ! నేనే, సరస్వతిని"

హరిరాముఁడు విస్మయాక్రాంతచిత్తుఁడయ్యెను. "నీవెట్లు తప్పించుకొని వచ్చితివి?" అని యాతఁ డడిగెను.

"అంతయుఁ దర్వాతఁ జెప్పెద. ఈకత్తితో నీగోగునారబగ్గపుఁగట్లను గోసికొనుము."

"ఏమీ! నాబంధవిమోచనమునకుఁ గత్తిఁగూడఁ దెచ్చితివా! అమ్మాయీ! నీవు దివ్యాంగనవు కాని సరస్వతివి కావుసుమా! నాకాలుచేతుల నేను గదలింపఁజాలను, నీకోమలకరముల నాబంధములఁ గోయుము."

హరిరాముని చేతికట్లను సరస్వతి కోసివేసెను. అంతట నాతఁడు తన కాలిబంధములఁ గోసికొని, తాను చేయవలసినకార్యము నామె నడిగెను.

అందుల కామె తనకడనుండు తాళపుగుత్తిని కత్తిని హరిరామున కొసంగుచు, నదను తప్పక ముందే ప్రతిగదిని దెఱచి తమవారినందఱ విడిపించి వారి నా గండమునుండి తప్పింపవలయుననియు, హూణులు తమకరాని కెఱుంగకుండునట్లాలస్యము చేయుటకై గదులన్నింటిని మరలఁ దాళములువైచి యథారీతిగా నుంచవలయుననియు బోధించెను. హరిరాముఁ డాయబలచాతుర్యమునకు విస్మయమొందుచు 'ఇదికలకాదుకదా!' అని యప్రయత్నముగాఁ బలికెను.

"ఇది కలకాదు. నిజము. హరిరామా! నీవు దొంగలరాయఁడవు. ఎన్నియోమారులు నీవు బంధింపఁబడి, యెన్నియోమారులు తప్పించుకొని యుందువు. ఈరీతి విస్మయమొందుట కిట్టిసంఘటనము లీనాఁడు నీకుఁ గ్రొత్తలా యేమి?

"నాబంధవిముక్తికి నాకు నాశ్చర్యములేదుగాని, తత్కారణమగు నిన్నుఁ జూచి యచ్చెరువందుచున్నాఁడ. ఈతాళపుగుత్తి, యీకత్తి నా కుమారి కెట్లు లభించినవో?

"వీనితో నారాయణశర్మ నాగదికివచ్చెను. అతఁడు నన్నుఁ జెఱుప నుండ, నేనాతనిఁ బొడిచితిని. నామానసంరక్షణమున కింతకంటె వేఱుదారిని దైవము నాకుఁ జూపలేదు. అంతతో నాతఁ డంతకు చెంతకేగెను. అంత నేనాతనికడనుండిన యీవస్తువులఁ దీసికొని, గదికిఁ దాళమువైచి యిచటి కరుదెంచితిని."

సరస్వతి సాహసమునకు హరిరాముఁ డధీరుఁడై యటులే నిలిచెను. అతఁ డంతలోఁ దెలివొంది "అయిన నారాయణశర్మను నీవు చంపితివా? సరస్వతీ! నీవు వీరవనితవుసుమా! నారాయణి నాతఁడు హతమొనరించినందుల కాతనికిఁ దగినశాస్తి చేసితివి. వాఁడు హంతకశిఖామణి. అతని నరకలోకమునకు గెంటివైచితివి. అమ్మాయీ! ఈక్షణమునుండియు నీవు నా నారాయణివైతివి." అనెను.

"బాబా! గట్టిగాఁ భాషింపకుము."

"అవునవును. నన్ను 'బాబూ' అని పిలువుము. ఇఁక నీకు విధేయుఁడనై యుందును."

"బాబూ! ఉండుము. నేను విచారసాగరమునఁబడి మునుఁగులిడు చున్నాను. ఒక్కప్రశ్నకు నుత్తరమిచ్చి, నన్ను గట్టుచేర్చెదవా!"

"ఒక్కప్రశ్నయేల! వెయ్యింటికి జవాబు లిచ్చెదను."

"నాపని నెవ్వరైన హత్యగా భావింతురా! బాలాదిత్యుఁడు నన్ను హంతకురాలని భావింపఁడా! ఆమహాత్ముని యనురాగము లేక నేనోర్వఁగలనా? కాని, బాబూ! నామానమును గాపాడుకొనుటకై నేనాపనిఁ గావింపవలసి వచ్చెను."

"ఏమీ! దీనిని హత్యయందురా! అట్లు భావించువాఁ శిరశ్ఛేదము నకుఁ దగినవాఁడగును. ఇఁక బాలాదిత్యుఁడా! అతఁడు మిగుల దొడ్డవాఁడు. ఆయుదారపురుషుఁ డావిధమునఁ దలంపఁడు. అతఁ డొకవేళ యట్లు తలంచి నచో, మూఁగనైనను నాన్యాయవాదిగాఁ గైకొనుట కియ్యకొందునుగాని, బాలాదిత్యునియభిప్రాయము నొప్పుకొని దానికి విలువనియ్యనొల్లను. ఏమమ్మా! అమ్మాయీ! ఇప్పుడు తృప్తినందితివా!"

"ఆహా!"

బంధితులవిడిపించుటకై హరిరాముఁడు వెడలిపోయెను. ప్రతిగవికదకుఁ బోయి హరిరాముఁడు, సంకేతశబ్దము గాఁబోలు, కీచుమని యఱచెను. గోష్ఠి దొంగలు వెంటనే తమనాయకుని గుర్తింతురు. తమస్వామి హరిరాముఁడు తమ్ముఁ దప్పించుటలో నాచోరులకు విస్మయము లేదు. అతఁడు తమ్ము బంధ విముక్తులఁ జేయుట వారలకు సాధారణమైయుండెను. ఇఁకఁ దమనాయకుఁడు పాశములను గత్తిని నెట్లుఁ బడసెననయూ! అతఁడు 'హరిరాముఁడై' యుండుటయే వానిసంపాదనకుఁ బ్రబలకారణముగదా! రఘుపతియు, భద్రబాహువును సులభముగా విడిపింపఁబడిరి. కాని మున్ముందు భద్రబాహువు మాత్రము "జైనపరమాత్మునిసిద్ధాంతము తెలియునా? 'ఈప్రపంచము విశాల

మగుబంధనాలయము' అని యామహాత్ముఁడు సెలవిచ్చియున్నాఁడు. కాని నేనిపుడు చిన్నచెఱసాలనుండి పెద్దచెఱసాలకుమాత్రము వచ్చుచున్నాను." అని గొణఁగుకొనెను.

బంధితులందఱును గుఱ్ఱపులాయమునకుఁబోయిరి. అచటఁ జాలగుఱ్ఱము లుండెను. హరిరాముఁ డాయశ్వములలోఁ దనయుపయోగార్థము గొన్నింటి నేర్పఱచుకొని, మిగిలినవానిని దాను దెచ్చిన దారుణపాషాణప్రయోగమున జమునింటి కనిపెను. వా రాయశ్వముల నెక్కి మెల్లగాఁ గారాగారప్రాంగణమును దాఁటిరి. దానితర్వాత హూణస్కంధావారము. దానినిగూడఁ బ్రవేశించి నిరాటంకముగ నీవలఁబడిరి. ఇట్లు నిశ్శబ్దముగా వారు రాజమార్గమునకు రాఁగలిగిరి. ఆమార్గమున వారు కొంతకాలము మెల్లగాఁబోయి, హూణులు తమ్ముఁ దఱుముకొనివచ్చునంతలోఁ దప్పించుకొనిపోవుతలంపున, నతివేగముగా దఱుమసాగిరి. అశ్వహీనులగు హూణులు పాదచారులై వారిని దఱుమవలసియుండిరి. హరిరామునియనుచరు లాశ్వికశ్రేష్ఠులు. జనులులేకున్నను, రికాబులులేకున్నను, వాయువకు లీకాలపు 'కొసక్కుల'తో సమానముగ స్వారిచేయ సమర్థులై యుండిరి. కాని మేమిట్లంటిమేని, యప్పటియనాగరకపశ్చిమఖండమునందలి పోటుజాతివారిలోఁ దమ్ము నీరీతిఁబోల్చి యగౌరవించుచున్నారని, హరిరాముఁడు నాతనియనుచరులు మమ్మాక్షేపింపకపోరు. హరిరాముఁడు పల్లెత్తిపలుకక స్వారిచేయుచుండెను. సరస్వతికూడ నాగుఱ్ఱముపై నెక్కియుండెను. అప్పుడప్పుడు హరిరాముఁ డామెను ప్రీతిపూర్వకముగాఁ దిలకించుచుండెను. అతఁ డిప్పుడు తనయనుచరులఁ గాంచి "మిత్రులారా! మీప్రాణదాత్రిఁ జూడుఁడు" అని హెచ్చరించుకొనెను.

"మాకుఁ దెలియును. మాస్వామి హరిరాముఁడు చిరంజీవియగుగాక." అని వారుత్సాహమున నఱచిరి.

"కాదుకాదు. మీరక్షకుఁడను నేనుగాను. మీపాలిటి ప్రాణధాత్రి యీయచ్చరలేమ" అని హరిరాముఁడు నాటిసమాచారముల వారి కెఱింగిం

హరిరాముఁడు దైవమును దూషించినందులకు భద్రబాహువు నిర్విణ్ణుఁడయ్యెను. "సోదరా! నిజము నిజము. అతఁడు బుద్ధిమంతుఁడగుటెంతయు నిజము. కాని యాతఁడు పిశాచమునకు బలికావలయునంటివి. నీనోట నిట్టి దుర్భాషలాడించినదియుఁగూడ నాభూతమేసుమా!" అని యాతఁడు పలికెను.

హరి:—ఓహో! సోదరా! ఇందుకు విరుద్ధముగాఁ జెప్పియుండినచో, నాతఁ డట్లు కావలయునంటిని. జైనుఁ డాతీరునఁ జెప్పలేదని నాకుఁ దెలియును. కాన నీకార్యమును దూషించువారు, జైనబోధలను దలక్రిందుచేసి చెప్పినవారగుదురు. జైనసిద్ధాంతములు విశ్వజనీనములు. వానికిఁ బ్రతివాదములు భ్రమాత్మకములు. సత్యదూరములు. జైనపరమాత్ముఁడు దేవాంశసంభూతుఁడు. జైనేతరులు పిశాచావతారములు. జైనమతస్థుఁడైనజనుఁడు, భూతావేశపరవశుండై యుండినచో, జైనపరమాత్ముని బోధామృతరసమును విషముగామార్చుటకు సాహసింపఁడు. అమానుషపవిత్రసిద్ధాంతములకపార్థమును గలిగింపఁజాలఁడు. అట్టికుజను నేకదా యాభూతముకూడ తనయాత్మబాంధవుని తలంచుచుండును.

భద్ర:—నిజముపలికితివి. అరిషడ్వర్గముల కధీనుఁడవై నీవు చెప్పరానిపనులఁ గావించుచున్నను, నిజముగా నీవు సజ్జనుఁడవని నాకుఁ దెలియును.

ఇప్పటి కరుణోదయమయ్యెను. వారిప్పటికి హూణగృహదుర్గమును విడిచి మున్నదిమైళ్లు వచ్చియుండియు, నింకను గుఱ్ఱములఁ దఱుముచుండిరి. మధ్యాహ్నమునకంతయు వారొకసాంద్రారణ్యమును జేరఁగలిగిరి. నేఁటిప్రభుత్వపు టటవీశాఖాధికారులవలెఁగాక, హరిరామాదులు గహనాంతరప్రదేశముల కతిపరిచయముతో యుండిరి. అది మామిడిపండ్లకాలమగుటచే నాయడవి నొకయెడఁగల మామిడిచెట్లపై వారిలోఁ గొందఱెక్కి, నూర్లకొలఁది పండ్లను గ్రిందికిరాల్చుచుండ. క్రిందనుండువారు వాని నేఱుకొనుచుండిరి.

అంతకుముం దాచెట్లనుండి రాలినమామిడిపండ్లు నేలయంతయు నిండి క్రుళ్లి పురుగులుపట్టియుండెను. ఈవిధముగఁ జెట్లక్రిందివారు పండ్లు తినుచుండఁగా నొకఁడు 'పాముకఱచినది' అని యఱచెను. ఉష్ణదేశాటవులయందలి వృక్ష సమూహములనడుమ పచ్చిగడ్డి, తీఁగెలు మొలబంటియెత్తు మొలచి చాల దట్టముగా నుండును. కఱచియుఁ గఱవనంతలో నాప్రాణిని గొనిపోయి సర్ప పతియొకటి నిలువఁబెట్టు కత్తిగలత్రాఁచులవంటి విషసర్పముల కాప్రదేశము లావాసములై యుండును. ఆమూలక్రందనము వారు వినుటయే తడవుగా హరి రాముఁ డానిర్భాగ్యుకడకుఁ బరుగెత్తెను. మూడడుగుల త్రాచు గడ్డిలోఁ బ్రాఁకిపోవుచుండెను. ఆపామును జంపఁ దనయనుచరుల కాతఁడు కేకవేసి, పామెక్కడకఱచినదని యానిర్భాగ్యు నడిగెను. వాఁడు తన యెడమకాలి చిటికెనవ్రేలిఁ జూపెను. తోడనే హరిరాముఁడు వెనుకముం దులుచూడక, తనమొలనుండు నారాయణశర్మకత్తితో నావ్రేలిని దెగనే సెను. బాధ నోర్వఁజాలక యానిర్భాగ్యుఁ డొక్కయఱపుఱచెను. అంతక కచటివారందఱు పరిపరి హరిరాముని ధైర్యసాహసములఁ గాంచి "దైవా నుగ్రహమున నితఁడు జీవించినాఁడు. ఇంకను విషము పాదమున నెక్క లేదు" అనెను. ఇంతలో నిరువురుదొంగ త్రాఁచును గఱ్ఱలతోఁ గొట్టి చంపి యింకొకటి యగపడిన నంతకాలయమునకుఁ బంపుటకు సంసిద్ధులైయుండిరి. రఘుపతి భద్రబాహువులతో సరస్వతి దూరమున బాటపైనుండెను. ఈసంద డివిని యామె యచటి కరుదెంచెను. దుస్సహమగు వేదనవలన బావురుమని యేడ్చు నాహతభాగ్యు నామె గాంచి "చేయవలసినదిఁ జేసిరి. అచటికన వ్రేలిని గోయకుండినచో, నీవు మరణించియుండెడివాఁడవు. అబ్బా! ఎంత పెద్దత్రాఁచుపా మిది!" అని వారిలో నొకఁడు తెచ్చిన యాసర్పకళేబరమును జూచి వెఱఁగందెను

సర:—కాని బాబూ! అరఁటిరస మొక్క గ్రుక్కెడు త్రాగినయెడలఁ త్రాఁచుకాటువలని విషముదిగునని కొందఱందురు. ఇది నిజమా?

హరి:—అవును. అది పరమౌషధము. కాని విషము దేహమునఁ బ్రసరించుటకుఁ బూర్వమే, యరఁటిరసము ద్రాఁగవలయును. ఈయరణ్యమధ్యమున నరఁటిచెట్లెక్కడివి! తిరిగితిరిగి దానిని బడయులోపల, నిచట నీతఁడు పరలోకమును చేరును. వెన్నపుసునప్పటికిఁ గుండపగిలినట్లగును. కాన నిట్టిసమయముల నేఁజేసినపని యుత్తమమైనది.

అని యాతఁడనుచుండఁగా భద్రబాహువువచ్చి పామునుజూచి "అయ్యో! పాపము. ఇచట నొకప్రాణిం జంపితిరి!" అని జాలిపడెను.

సర్పదష్టునిచెవుల కాపలుకులు వాఁడిములుకులవలె నుండెను. అతఁడు క్రోధోన్మత్తుఁడై "ఓరిపలుగాకీ! పాముచచ్చినదని పశ్చాత్తాపమొందుచున్నావా! ఆపాపపుపాము నన్నుఁ గఱచినదయ్యా! నావ్రేలు పోయినదయ్యా!... అయ్యోయ్యో! నావ్రేలుపోయినది. చూడవయ్యా! చూడవయ్యా!" అని యఱచెను.

భద్ర:—చూచితిని. సోదరా! నీకు వ్రేలుపోయెను. పామునకుఁ బ్రాణములుపోయెను. కాని వ్రేలుకంటె బ్రాణము లెక్కువకదా?

ఆమాటల కారోగి యుగ్రుఁడగుచుండెను. అతనిమోము జేవురించెను. హరిరాముఁడదిచూచి భద్రబాహువుతో "నీవేదాంతముల కాతనికి వెఱ్ఱియెత్తుచున్నది. దయచేసి యూరకుండుము" అని చెప్పెను.

"కుమారా! అయినఁ బోనిమ్ము. ఈగాయము త్వరగా నిమ్మళించుఁగాక!" అని భద్రబాహు వాసర్పదష్టుని దీవించి, సంజీవికొమ్మను దీసికొనిరమ్మని హరిరామునికిఁ జెప్పెను. సంజీవిచెట్లు విపినముల సర్వసాధారణముగా నగపడుచుండును. భద్రబాహువు సంజీవిరసము నాగాయముపైఁ బిండెను. ఆరోగి యొకపెదబొబ్బపెట్టెను. ఆయఱపునకు హరిరాముఁడుగూడ నదరిపడెను. భద్రబాహువునకు జీవహింస యనిన గిట్టదు. క్రౌర్య మాతనికి దుస్సహము. కాని మానవుని యోగక్షేమములకుఁ బ్రాణిహింస తప్పని సరియగుచో, నందులకాతఁడేమాత్రము వెనుకంజవేయఁడు. ఆరోగిలేచి పాఱిపోవుచుండుటకై

మఱియిద్దఱుచోరులచే వానినిఁ గదలకుండునట్లు పట్టుకొనఁజేసి, యారసమును బాగుగా నాగాయమునకు భద్రబాహువు పట్టించెను. అయిదునిముసముల కంతయు మంట తగ్గెను. ఇపు డాతస్కరునకు బాధ యుపశమించెను. నెత్తురు కారుట మానెను. గాయముచెక్కు గట్టుపడ్న లగపడుచుండెను. గుడ్డపేలిక తో దానిఁ గట్టుకట్టిరి. ఆదొంగలు పిండుమామిడిపండ్లను, వన్యఫలములు తిని, వాఁగులయందలి నిర్మలోదకములఁ ద్రాగి, మరల గుఱ్ఱములనెక్కి ప్రయాణ మొనరింప మొదలిడెను. నిద్రాహారకాలములఁదప్ప వారు మఱెచ్చటనుగాని నిలువక తొమ్మిదిదినములు పయనముసాగించిరి. తొమ్మిదవనాఁటిసాయంత్ర మున వారు హరిరాముని సామ్రాజ్యమును బ్రవేశించిరి.



# పదునైదవతరంగము.

## పాలబానలోఁ బాషాణపుఁజుక్క.

యశోధర్మ బాలాదిత్యుని బాసినతోడనే, తమవియోగవ్యథాగ్ని నార్పివేయుటకును, వియోగదృశ్యము మెఱుపుఁదీఁగెవలె నంతలో మాయమగుటకును, గుఱ్ఱము నొకటిరెండుమైళ్లు మిగుల వేగముగాఁ దఱిమెను. కాని బాలాదిత్యుఁడు చూపునకు మఱుగయ్యెనని యాతఁ డెఱింగినపిదప, కళ్లెమును వదలి యశ్వమును దానియిష్టానుసారము పోనిచ్చెను. ఆహయము కొంతసేపు దాట్లువేయుచుఁ బరుగెత్తును. కొంతసేపు మెల్లగా నడిచినడిచి యొక్కమాఱుగా నాగిపోవును. పరధ్యానమున మునిగియుండు నాశ్వికుఁ డప్పుడు మేల్కొని, కాలితో దానిప్రక్కలఁ దన్ని దానిని సాగించుచుండును. ఇందువలన యశోధర్మ దీర్ఘాలోచనాసముద్రమున మునిగియుండుట విశదమగుచుండెను. కొన్నిదినములుగా నాతఁ డొందుచుండిన యనుభవములన్నియు నాతనిమానసమున నిండియుండెను. అప్పుడు సర్వశక్తులను నిర్విఘ్నకార్యాచరణమునకు వినియోగింపవలసియుండుటఁజేసి, యేమాత్ర మాలోచించుటకుఁ గాని యాతనికిఁ దీఱికచిక్కినదికాదు. కాని యిప్పు డాతనికిఁ బనిపాటలు లేకుండుటచే, నాతనిభావము లిప్పుడు భూతకాలసంఘటనాదృశ్యములపై వ్రాలి వానిని బరీక్షింపసాగెను.

మొట్టమొదట యాతనిభావమునకుఁ దట్టినవాఁడు బాలాదిత్యుఁడు. ఈగుప్తవంశకుమారునిగుఱించిన యాతని యాలోచనములు విచిత్రభావసమ్మిళితములై యుండెను. యశోధర్మకు బాలాదిత్యునిపైనుండునాదర మపారము. యశోధర్మ బాలాదిత్యునిలోఁ జిన్ననాఁటినుండియు నొక్కటిగాఁ బెరిగెను.

ఇద్దఱును గూడి యెన్నియో యాటల నాడుకొనిరి. నిజముగా నవియే సంతోష దినములు. గుప్తసామ్రాజ్యము పశ్చిమప్రాంతములఁ గోల్పోయి చెదరియుం డియు నీవిధముగా నొక్కమాఱు కూలునంతటి చెడియుండెనని యెవ్వరుఁ దలంపరైరి. చంద్రగుప్తుఁ డంకురార్పణ మొనరింప, సముద్రగుప్తుఁడు ప్రోదిచేసి కుదురునేర్పఱుప, విక్రమాదిత్యుఁడు దోహదముసల్పి ప్రాణముపోయ, శ్రేష్ఠ నాటుకొని పెరిగి పెద్దదై, కుమారగుప్తుఁడు సంరక్షించుచుండ దశదిశాయ తమై సర్వజనసమాహ్లాదకరమై యుండెడు గుప్తసామ్రాజ్యపాదపరాజము కన్నుల పండువై యుండెను. కుమారీదేవియాత్మ తనకుమారుని ప్రాజ్యసామ్రాజ్యపాద పమున కనిలప్రసాద మనుగ్రహించుచు దానిని పోషించుచుండెను కాని యంతలో నాపాడుదిన మెక్కడనుండియో వచ్చెను. హూణనామక ప్రళయ వాయువు లొక్కమాఱుగా నాసామ్రాజ్యవృక్షముపై వీచెను. అంతఃకలహ కీటకములచేఁ దొలువఁబడిన యావృక్షరాజము బాహ్యాకాలశాత్రవ ప్రచం డాఘాతములచే నూఁగులాడుచుండ, హూణప్రళయప్రభంజనులు దానిని నేలమట్టముగావించిరి. ఆసుప్రసిద్ధసామ్రాజ్యపాదప మీవిధమున రూపుమాసెను. బాలాదిత్యునితోఁ దానుగూడ నభేదభావమునఁ బెరిగినవిషయ మాతని కన్నులకుఁ గట్టుచుండెను. చిన్ననాఁటిదినములు మఱపునకురావు. ఆతనిభావ నాకాశమున బాల్యచేష్టలు మెఱసి మాయమగుచుండెను. కరుణానిధియగు బాలాదిత్యుఁడు తనకొనరించినసాయము లనేకము లాతనితలంపునకు వచ్చు చుండెను. ఆతఁడు తనపై నెప్పుడును దయతో నుండెడివాఁడు. ఒక్కతల్లి కడుపునఁ బుట్టినయన్నదమ్ములభంగి వారుండిరి. అన్నదమ్ములకంటె మిన్నగా వారొండొరులఁ బ్రేమించుచుండిరి. ఎన్నియోమాఱులు వారల్పవిషయములఁ గూర్చి కలహించుచుండెడివారు. కాని యామనస్పర్థ లంతలో మాయమై, మునుపటిమైత్రిని గాఢతర మొనరించి విశుద్ధ మొనరించుచుండెడిది. శతాధిక వత్సరప్రతిష్ఠాపితమై, ప్రళయప్రభంజనములకుఁ, బ్రబలవర్షములకుఁ గదలక మెదలక నిశ్చలమై నిల్చియుండు గాలిగోపురమువలె వారిస్నేహము పెక్క—

కలహాగ్నులఁ గళలు దేఱియుండెను. హూణరాక్షసుల కావాసమగు నుజ్జయినీ నగరమునకు బాలాదిత్యుఁ డొంటిమై పోయెనని విని, సహృదయుఁడగు యశోధర్మ యాతనిరక్షణార్థ మచటికిఁ బయనమెత్తెను. భూమకుఁ గలిసికొనిన యా కాళరాత్రి యశోధర్మకు జ్ఞప్తికివచ్చెను. ఆనాఁడు బాలాదిత్యుఁడు తనకుఁ బ్రాణదాన మొనరించినందులకు, యశోధర్మ సంతోషమందెను. ఆతని ముఖాంబుజము వికసించెను.

ఆతనిహృదయపేటికయం దేమూలనో యణఁగియుండిన యనుమానము లిప్పుడు మరల వెలికి దూఁకుచుండెను. ఈనడుమ నాతఁడు రెండుమూఁడు విషయములఁ గమనించియుండెను. ఆవిషయము లాతని విచారసాగరమున ముంచెను. ఆతని మనశ్శాంతి కంతరాయ మొనరించు నాభావముల నణఁచి పెట్టుట కాతఁ డెంతయో ప్రయత్నించెను. కాని యాభావములఁ దఱుమఁ బ్రయత్నించుకొలఁది, యవి యాతనిహృదయమును వేధించుచుండెను. మొదటిభావమునకు సరస్వతియు, రెండవభావమునకు బాలాదిత్యునకు బౌద్ధమతము నందలి పక్షపాతమును గారణములై యుండెను.

బాలాదిత్యసరస్వతుల మోహమును నిరసించుచు, యశోధర్మ తనయుసమ్మతిని బ్రకటించియున్నాఁడు. యశోధర్మకు సరస్వతిపై నభిమానమున్నది. ఆమె సౌందర్యసౌశీల్యములు సంస్తుతిపాత్రములని యాతనికిఁ దెలియును. కాని సమానయోగ్యతలతో నుండు స్త్రీపురుషులుమాత్ర మొండొరులఁ జేపట్టుట కర్హులని యశోధర్మ ప్రధానసిద్ధాంతము. సామాన్యుఁడగు గృహస్థునితనయను బాలాదిత్యుఁ డుద్వాహ మొనరించుకొనుటవలన సార్వభౌమచంద్రులకుఁ బట్టుగొమ్మయగు గుప్తాన్వయమునకుఁ గళంక మాపాదిల్లకపోదని యాతనియభిప్రాయము. లిచ్ఛవకుమారీవంశదీపకుఁ డెక్కడ? సామాన్యపౌరకాంత యెక్కడ! అదియునుగాక, భారతనరేంద్రులు సంఘీభావసముదగ్రులై సనాతనధర్మోద్ధరణార్థము, హూణకిరాతులతోఁ దలపడుటకై నడుముకట్టి నిలిచియుండు సమయ మిది. అట్టియెడ నిచట బాలాదిత్యుఁ డూరుపేరులేని యొకసామాన్య

కాంతం గావించియున్నాఁడు. ఇట్టిసమయముల నాతఁ డొకరాకుమారిఁ బెండ్లాడినచో, హైందవనరేంద్రమండలియం దింకొకరాజేంద్రుఁడు చతురంగబలములతోఁ జేరి, తనకు సాయమొనరించియుండుఁగదా! తనసదుద్యమముల కెంతయో బలము చేకూఱియుండుఁగదా!

బాలాదిత్యుఁడు బౌద్ధమతముపైఁ గన్పఱచిన యాదరభావము యశోధర్మకు దుర్భరమైయుండెను. వాడిపత్తులైయుండు హైందవబలమున కుత్తేజముఁ గల్గించి, హూణోపద్రవము నణఁచుటకై హైందవనరనాయకు లిప్పుడు ప్రయత్నించుచుండిరి. గుప్తసామ్రాజ్యకాలమున నిలుకడఁ గాంచియుండు సనాతనార్షమత మిప్పు డుత్సాహభరితమై పెంపొందుచుండెను. బౌద్ధమతము వలన నార్షమతమునకు జాలబీభత్స మొదవుటం జేసి, సనాతనధర్మపరాయణు లా బౌద్ధమతమును ద్వేషించుచుండిరి. యశోధర్మ, చిన్ననాటినుండియు సనాతనధర్మావలంబుఁడై యుండెను. అతఁ డీబౌద్ధమతాచార్యు, నకారణముగ నీసడించుచుండును. హూణరాక్షసునిపైఁ గత్తిఁ బట్ట నాయత్తమైయుండు హైందవనరేంద్రమండలి కధ్యక్షుఁడగ దనప్రియమిత్రుఁడు, బాలాదిత్యుఁడు, తనకేమాత్రమును గిట్టనిపాషండమతము నాదరించుచున్నాఁడేమో యని యాతనిచిత్తము తత్తలమొందుచుండెను.

ఇట్టి భావపరంపరలచే యశోధర్మమానసము కలవరమొందియుండెను. అతఁ డాభావముల నలికపట్టమున సరికట్టి, యీరీతిఁ జింతింపసాగెను. "నా స్వాంత మిట్టివిపరీతాభిప్రాయములకు లోనగుచున్నది. అసంభవములని తెలిసియు నాపంగతులకై నేను దిగులొందనేల? తన కా యంగనపై మనసు లేదని యా బాలాదిత్యుఁడే చెప్పియుండలేదా? కాని యాతఁడు నిర్ధారణగాఁ జెప్పలేదు.... ఓ దైవమా! నా చిత్తమును నే నేమనుకోవలయును. ఎడతెగనిభయములచే నన్ను వేధించుచున్నదిగదా? 'ఓ మానవుఁడా! మదపుటేనుఁగునైన నధిష్ఠింపఁగలవు. కోపమున గర్జించు కేసరినైనఁ గైవశమొనరించుకోఁగలవు. ప్రళయవాతాకంపితవార్థినైన నవలీల నీదఁగలవు. కడకు తొందిలోఁ గైలాసము

నకుఁగూడఁ బోఁగలవు. కాని నీమానసము నఱినిమ్నమైన నిరోధించుటకు నే చేతగాదుకదా? ఓమానసమా! విచిత్రమగుదైవసృష్టియందు నీయట్టిచోద్యమగు వస్తువు వేఱొకటిలేదుసుమా!' అనిన యాకవీంద్రునిపలుకు లెంతయు నిజము.”

ఇట్లనుకొనుచు యశోధర్మ యొకధర్మశాల డాసెను. అతఁడు గుఱ్ఱము నాపి క్రింద దిగెను. అప్పటికి సూర్యాస్తమయము కావచ్చుచుండెను. అతఁ డాధర్మశాలఁ బ్రవేశించి, రాత్రిభోజనముకొఱకు నాయాలయాధికారితోఁ జెప్పి, పథశ్రమభరమున విశ్రాంతిన పేక్షించు తనయశ్వమును మూదప స్తంభము నకుఁ గట్టివైచి; యాతఁ డానత్రపువసారాయందుఁ గూర్చుండి, పశ్చిమాం బుధిఁ గ్రుంకనుండుపతంగబింబము నవలోకించుచుండెను.

ఇట్లాతఁ డినబింబావలోకనతత్పరుఁడైయుండ 'నారాయణ! నారాయణ!' అనుభగవన్నామకీర్తన మాతనిమానసము నాకర్షించెను. తోడనే యాతఁ డావైపుచూచెను. ఇద్దఱు మనుజులు దక్షిణమునుండి యాతని కభిముఖులై వచ్చుచుండిరి. వారు కాషాయధారులై యుండిరి. పవిత్రములగు తులసిమాలలును, రుద్రాక్షపేరులును వారికంఠముల నలంకరించియుండెను. వారికుడిచేతులయందు దండములును, యెడమచేతులయందుఁ గమండలులు గాన నగుచుండెను. వారిలో నొకనికి రమారమి నలువదేండ్లుండును. హసన్ముఖుఁడును, సౌమ్యమూర్తియునగు నాత్రిదండి చూపఱకానందసంధాయకుఁడై యుండెను. రెండవవానికి షుమారు ముప్పదేండ్లుండును. అతనిముఖము గంభీరమై, భావభరితమై యుండెను. వారు యశోధర్మను సమీపించి 'కల్యాణమస్తు' అని దీవించిరి. యశోధర్మ వారివేషవర్తనములఁబట్టి వారు సన్న్యాసులని గ్రహించెను; కాని వారితోఁ బరిచయము గావించుకొనుటకు ముందు వారి నిజోదంతము తెలియుట లెస్స యని యాతఁడు తలంచెను. చాణక్యాచార్యుని కాలమునుండియు గూఢచారులు, సన్న్యాసివేషములఁ దిరుగుట సర్వసాధారణమైపోయినది. యశోధర్మ, బాహ్యవేషములకు బేలువోవునంత తెలివితక్కువవాఁడు కాఁడు. అతఁ డట్లు సుంత యోచించి, వారిప్పుడిప్పు

డించుక, కలఁకదేఱుచుండు హైందవమతమునకుఁ జెందినపరివ్రాజులై యుండ నగునని మనసు కుదుటపఱచుకొని "ఓయతీశ్వరులారా! మీరెక్కడినుండి నేంచేయుచున్నారలు?" అని వారల హెచ్చరించుకొనెను.

అందులకు వారిలోనివృద్ధుఁడు "నేను, నదియే యెఱుంగఁగోరు చున్నాఁడ. నేనెక్కడనుండివచ్చితిని? ఈనరకకూపమునందుఁ బడుటకుముందు —ఈదుఃఖనిలయమును జేరుటకుముందు—ఈవిషసాగరమునఁ బడుటకు ముందు—నేనెక్కడ నుంటిని! ఈజన్మసముద్రమునఁబడి మునుఁకలిడుచుఁ, దీరమును జేర నీఁదుటకుముందు నాయవస్థ యెట్లుండెను? ఇప్పటికి నేనెన్ని జన్మములెత్తితిని? ఏమేమి జన్మములెత్తితిని? ఈజన్మ కాజన్మ లెట్లు సంబంధపడియున్నవి! సారూప్యపదవి నందులోపుగ నెన్ని జన్మలెత్తవలయును? ఎన్ని మాఱులు మరణింపవలయును? ఎవరైన దీని నన్నింటినైనను లేక దేనినైనను జెప్పఁగలరా! ఈసంశయములఁ దీర్చుకొనుటకై, నాపదునెనిమిదవయేఁట నుండి దేశదేశములం దిరిగితిని. ఇట్టియిరువదేండ్లుగా నేను పల్లెయనక, పట్టణమనక, కొండయనక, కానమనక, దూరమనక, దగ్గఱనక, స్వదేశమనక, విదేశమనక, రాత్రియనక, పగలనక, కంటికిఁగానవచ్చినపురుషుని, పలఁకితిని, బాలుని నాసందియముల నివారించుటకై యడుగుచు సంచరించుచున్నాను. కాని యకటా! సంతృప్తికరమగునుత్తరము నెచటఁగాని బడయఁజాలనైతిని. మనము మనజీవితముల నజ్ఞానాంధకారమునఁ గడపుచున్నాము. జీవితరహస్యముగాని, జననమరణసమస్యాపరిష్కారముగాని మనకుఁ దెలియదు. ఎప్పటికైనఁ దెలియఁజాలుదుమా?" అనెను.

అందులకు రెండవయతి యాతనితో "సోదరా! ముముక్షుహితవాక్యములచే మనమిత్రునిఁ గలవరపఱుపకుము. ఇప్పుడు మనరాక యెచటనుండి యని యాతనిప్రశ్న; కాని యీప్రపంచమునకు మనరాక యెచటినుండి యని యాతఁ డడుగుటలేదు. ఓమిత్రుఁడా! మేము నర్మదాతీరమునుండి వచ్చుచున్నాము. ఇపుడు కాశీక్షేత్రమునకుఁ బోవుచున్నాము." అనెను.

యశోధర్మ సంతుష్టుఁడై "ఇట్టి యమూల్యసంభాషణభాగ్యమును నాకుఁ బ్రసాదించిన స్వాముల పవిత్రనామాక్షరములు నేనెఱుంగనగునా!" అని యడిగెను.

అందులకుఁ జిన్నవాఁడు "నాపేరు సుబంధువు. ఈనామిత్రునిపేరు అజ్ఞానాంధకారుఁడు" అని చెప్పెను.

యశో:—కడునింపైనపేర్లు. ఒకదానియర్థము మంచిచుట్టము; స్నేహితుఁడు. రెండవదానియర్థము అజ్ఞానమనుచీకటి. ఓయతీశ్వరా! ఇట్టిపే రేల పెట్టుకొంటివి?

అజ్ఞా:—మిత్రుఁడా! నజీవితమును, నాయనుభవములే యిందులకుఁ గారణము. నేనుగూడ నీవలెనే జీవితసౌఖ్యామృతపానమునఁ జొక్కి ఱెక్కలువచ్చినపతంగమువలె నిశ్చింతతో నుంటిని. నేనప్పు డుజ్జయినియందు విద్యార్థినై యుంటిని. నామనసుకు వచ్చినకన్యను—అసమానసౌభాగ్యవిరాజితను—వివాహమాడితిని. కాని యొకదినము—అకటా! అదిన మింకను మఱపురాకున్నది. రాఁజాలదు. నాయర్థాంగి యొకశిశువును బ్రసవించెను. ఆ రాత్రియే తల్లిబిడ్డ లిద్ద ఱసువులువాసిరి. సూర్యరశ్మికి నావిరియగుమంచువలె, నాజీవితసౌఖ్యమంతయుఁ నొక్కమాఱుగా మాయమైపోయెను. మృత్యుశయ్యపైనుండు నామనోహారిణిఁ జేరి, కడపటిముద్దుకొనుటకు వంగితిని. ఆతన్వంగి యొలుఁగు డాపడ "నాథా! నాకొఱకై యేడ్వకుఁడు. జీవితరహస్యము నెఱింగినవా రెవరున్నారు! ఎచటినుండివచ్చితిమో, ఎచటికిఁ బోవుదుమో యెవరికెఱుక!" అని నన్ననునయించి, యొక్కమాఱుగాఁ గన్నులుమూసెను. అక్షణమే నేనుసన్న్యసించి, యిల్లువాకిలివదలి, యీకాషాయములు ధరించితిని. జీవన్మరణతత్త్వమును మథించు ప్రయత్నమున నెల్లకడలఁ ద్రిమ్మరుచున్నాను. ఆసేతుహిమాచలము సంచరించితిని. హిమగిరిశిఖరచ్ఛాయల నెన్ని యహోరాత్రులు గడపితిని. మనోహరమగుమానససరోవరమునకుఁ బోతిని. సింధు, గంగా, బ్రహ్మపుత్రానదీతీరములకుఁ జేరితిని, కాశీనుండి రామేశ్వరమువఱకుఁ

గలపుణ్యక్షేత్రముల సేవించితిని. మూఁడేండ్లపాటు నిర్జనమగు దండకారణ్యమున నేకాంత ముపవసించితిని. ఇదియే కాదు. నగరములందేమైన నాకు మనశ్శాంతి చేకురునేమోయని, యన్నింటి దర్శించితిని. ఎన్ని యోజనములు పాటలీపుత్రము, ఉజ్జయిని, తక్షశిల, అయోధ్య, మధుర, కంచి మొదలగు పట్టణములకుఁ బోతిని. సముద్రములు తరించి సుమాత్రా, జావా, కాంభోజము, సువర్ణభూమి మొదలగు దూరదేశములకుఁగూడ వెళ్లితిని. ఇంద్రగిరి, మాకాంగు, ఇఱ్ఱవాడి నదికూలముల కొన్నియో రాత్రులు జాగరమొనరించితిని. విశాలసముద్రములపైఁ బయనమొనరించుతఱి, ప్రచండతరంగములనుండియో, పైనుండుగగనమునుండియో దైవప్రేరణము గలుగునేమో యని వేచియుండెడివాఁడను. కాని యెచ్చటఁగాని నాసమస్యకుఁ దగినసదుత్తరము దొరకినది కాదు "ప్రేతకర్మలకు నోచుకోనక యాకాశమున నటించుజీవుని" పగిది, నేనుగూడ విఫలమనోరథుఁడనై యిల్లెల్లకడల గాలికి జలమునకు కొట్టుకొని తిరిగితిని. ఈవిధమున నాజీవితమంతయు వితథమగుచున్నదని నేను తలఁచినప్పుడంతయు, నాకు దురంతవ్యధకలుగుచుండును. ఈయజ్ఞానాంధకారము నన్ను సిలుగులముంచుచున్నది. జ్ఞానజ్యోతికొఱకు నేను ప్రాణములర్పించుచున్నానుగాని, నాకది యగపడకున్నది. నేనుసైతము సనాతనఋషీంద్రులవలె "అసత్యమునుండి సత్యమునకు నాకు దారిఁజూపుము. అజ్ఞానతిమిరమునుండి లేవనెత్తి నన్ను జ్ఞానకూలమునకుఁ జేర్పుము. మరణమునుండి యమృతత్వమునకుఁ గొనిపొమ్ము" అని పరమాత్మునిఁ బ్రార్థించుచుందును. ఇప్పుడు నేను నిష్కారణముగా నిట్టిపేరుఁ బెట్టుకొనలేదని తలిసికొంటివా!

యశో:—ఓయతిగ్రామణీ! ఇందులకు మీరు తగినకారణములఁ జెప్పితిరి. మీయట్టియతీశ్వరులయనుభవము లాకర్ణించుట మాయట్టివారి కెంతయు పుణ్యదాయకము. కావున మీయాత్మాన్వేషణకథను వినఁగోరెద. కాని ముందుగ మనము భోజనమొనరింతము. రండు.

---

# పదునాఱవతరంగము.

## ధర్మశాల.

అని యశోధర్మ లోనికిఁబోయి, ధర్మశాలాధికారితో మఱియిద్దఱున్నారు. అని యఱచిచెప్పెను. అధర్మశాలాధికారి యపుడు బయటికరుదెంచెను. ఆఁతనుముందు వచ్చియుండినబాటసారు లెవరో నల్గు రాతనివెంట వచ్చిరి. అధర్మశాలాధికారి బ్రాహ్మణుఁడు. అతని కించుమించు నలువదియైదేండ్లుండును. అతనిపేరు కమలాక్షుఁడు. అతనిబొజ్జ మిగుల వింతగానుండెను. ఇతరశరీరభాగములతిండినికూడ తానే మ్రింగుచు, నాతనిపొట్ట వికారముగాఁ బెరిగియుండెను. ఇఁకఁ గమలాక్షుని వర్ణించుచో, కుండకడుపుగల మనుజుఁడనుటకంటె, మిగతయవయవములతోనుండు లంబోదరమే కమలాక్షుఁడనుఁటెంతయు యుక్తముగానుండునని మాయభిప్రాయము. సాధారణముగా బొజ్జయ్యలందఱివలె, మనకమలాక్షుఁడు సౌమ్యవర్తనుఁడుకాఁడు. నేఁడాతని కేలతో జీవితముపై నేవగింపుకలిగెను. అందుచే నాతనిముఖ మిప్పుడు చిటచిటలాడుచుండెను. పూజ్యులగు నాయంతీంద్రులసందర్శనమునఁగూడ నాతని కావిసుఁగు తగ్గలేదు.

"ఓస్వాములారా! నమస్కారములు." అని యాతఁడు హీనస్వరమునఁ బలికెను.

"కల్యాణమస్తు. వత్సా! చిరంజీవివై వర్ధిల్లుదువుగాక." అని యజ్ఞానాంధకారసుబంధువు లాతనిదీవించిరి.

"ఈయుద్యోగమునకును నాకును ద్వరలో ఋణముతీఱునని తోఁచుచున్నది." అని కమలాక్షుఁడు గొణఁగెను.

సుబం:—ఏల! ఇచట నీకు హాయిగా లేదా? ఇట్టి ప్రశాంతస్థలమున నిశ్చింతతో నుండు నీ వెంతయో యదృష్టవంతుఁడ వని నేను భావించు చున్నాను.

కమ:—ప్రశాంతస్థలమైనంతమాత్రమున నేమి ప్రయోజనము! ఈ యుదరపోషణచింత యెట్లుపోవును!

అందులకు యశోధర్మ "నీపొట్టకుఁ దగినపోషణ జరుగుటలేదని నీకుఁ జింతగానున్నదా? ఏమయ్యా! నీకుక్షి మానవకుక్షి కాదు; సరికదా! అది మహా పర్వతమును బోలియున్నది." అని పకపక నవ్వసాగెను.

ఆతనిపరిహాసభాషణములకుఁ గమలాక్షుఁడు కన్నులెఱ్ఱఁజేసి "సరియే! నేను వండినపదార్థములనుమాత్రము నాపొట్ట నిముడ్చుకొందును. కాని పరులు కష్టపడి వండినపదార్థములచే నిండు కొండలవంటి పొట్టల నే నెఱుంగుదును." అని బదులిడెను. ఈమాటలకుఁ గమలాక్షుని వెంటఁ దరలివచ్చిన నలువురు మను జులు నవ్విరి. యశోధర్మ కూడ వారితోఁబాటు పెద్దగా నవ్వుచు "సెబాస్, సెబాస్" అని కమలాక్షుని మెచ్చుకొనెను. తనచాతుర్యమునకు వారు తన్నుఁ బ్రశంసించిరని తలంచి, కమలాక్షుఁడు శాంతినొందెను. అంత నతఁడు వారిఁ గాంచి "అయిన మీ రెవ్వరు? సరే. మీపేళ్లు వ్రాసికొందును" అని యొక కాగితమును, గంటమును జేకొని వ్రాయఁగడంగెను.

కమ:—ముందు మీపేరు; మీ రెచటనుండి వచ్చినది. ఎచటికిఁ బోవు నది; ఇచట మీ రింకెంతకాలము విశ్రమింపఁదలఁచినది—కాని మూఁడుదిన ములకు మైన నుండరాదు—ఒక్కొక్కరుగాఁ జెప్పుఁడు. మఱి కానిండు.

లోనుండి యాతని వెంటవచ్చిన యానలుగురు క్రమముగా "ఉదరానందుఁడు, కుంభదంతుఁడు, వాతవ్యాధి, శుక్రాచార్యుఁడు" అని యంటిరి. కమలాక్షుఁడు వినఁగొనుచుఁ జేతనుండుగంటమును క్రిందఁబెట్టి "ఇటులైన మీపేళ్లు వ్రాసికొనను. ఈదిన మిఁక నన్నము వండను. మీకన్నము వలయునేని, యొక్కొక్కరుగా మీపేరు లిండు" అని బెదరించెను. తోడనే

వారందఱు "శుక్రాచార్యుఁడు, వాతవ్యాధి, కుణపదంతుఁడు, ఉదరానందుఁడు" అని పరుసనుడప్పించి రొక్కుమారుగా నఱచిరి. కమలాక్షుఁడు క్రోధతామ్రాక్షుఁడై "మీయట్టివారలఁ జేసియే, ధర్మకార్యాధికారులనిన నింత యలుసైపోయి నది. ఓయీ ఉదరానందా! నీవు సన్న్యాసివిగదా! ఇంచుక సేపు నీవు తాలిమితో నుండవచ్చునుసుమా!" అనెను.

ఉద:—మిత్రుఁడా! కమలాక్షా! సన్న్యాసికిఁగూడ నందఱికివలెఁ గడుపున్నదనుట, నీవు మఱచితివి కాఁబోలు. మోక్షపదవినందుట కని యుప వాసములొనరించుచు శరీరమును హింసలపాల్సేయు, సన్న్యాసులవంటివాఁడ ననుకొంటివా? నేను చార్వాకమతమును నమ్మువాఁడను.

యశో:—'ఋణం కృత్వా ఘృతం పిబేత్' అనికదా యామతా చార్యునియుపదేశరాజము. అతఁడేకదా యీచార్వాకుఁడు?

ఉద:—అవును. ఆచార్వాకుఁడే. గురుశిష్యులగుమమ్ముఁ బోలినవా రీదేశమున మఱెవ్వరున్నారు. సనాతనమునులు మోక్షసామ్రాజ్యపదవినందుట కెంతయుఁ దపించుచుండిరి. కాని యేకొందఱికో మాత్రము భౌతికజ్ఞాన మల వడుచుండెడిది. నాకుఁ దెలిసినంతవట్టున కట్టిమహాసీయుఁడీచార్వాకుఁ డొక్కఁడేసుమా!

శుక్రా:—అది నాకు సరిపడదు. అట్టిసిద్ధాంతములవలనఁ బ్రయోజన మేమున్నది? 'అప్పుచేసితిమి' అనుభావము, నెయ్యిత్రాగుటయందలి సంతసమును బోలియుంపఁజేయుచున్నది. అంతతో గష్టములు గట్టెక్కునా? ఎక్కవు. ఋణదాత తనధనమును రాఁబట్టుకొనుటకై ఋణగ్రస్తుని బెట్టుబాధలు హృదయవిదారకములై యుండును. వాని ననుభవించినవానికే యాబాధ లెట్టివని తెలియును. అవమానభరమున నాతనితల క్రిందికివంగును. రాఁగలఱట్టుఁ దలంచుకొని వానిహృదయము గడగడవడఁకును. అప్పులవానియెదుటఁబడిన సాహుకుఁడు పిఱికిపందయైపోవుట సహజము. ఆయాపద లంతతో నంత మొందవు. అడిగడిగి విసిఁగివేసారిన యప్పులవాఁడు కడకుఁ దనయప్పును రాఁ

బట్టుకొనుటకై, న్యాయస్థానమున దెలుపుదు. ఇంక నడ్డేముండును? ఒక్కసారిగా ఋణగ్రస్తుని యిండ్లువాకిండ్లు, గొడ్డుగోదలు, కుండ చట్లు - అన్నియు నమ్మివేయఁబడును. అంత నాతనిభార్యాపుత్త్రు లనాథులై వీథులఁబడుదురు. అతని కంతటఁ జెఱసాలావాసమే గతియగును. ఇంతకు నచట నెయ్యి లభించు మార్గ మించుకేని కాన్పింపదు. ఇంక ఫలితములవిషయ మటుంచి, యోఁగాము లించుక యాలోచింతము. అప్పటికిసైతము నీచార్వాకునిసిద్ధాంతము తెగి కూలినదని యనవలసియున్నది. ఏలయన, నీవు నెయ్యిత్రాగునిమిత్తము ఋణముగావించుచున్నావని నలుగు రెఱింగినయెడల నీకు మఱి చేబదులిచ్చువా రెవరుందురు! ఇన్నియు నాలోచించిచూడ, మీచార్వాకునికంటె మాయాచార్యుఁడు విశ్వేశ్వరభట్టు చాల తెలివిగలవాఁడని తలంచెదను.

ఉద:—విశ్వేశ్వరభట్టేమని చెప్పినాఁడు?

శుక్రా:—'శ్రాద్ధసమయములందును, తదితరకార్యములందు, నుచితముగాఁ బడయునేతిని మాత్రము త్రాగుము. మఱియొకదాని నంటకుము' అని వారిసిద్ధాంతము. అనవమానమగునిట్టిసిద్ధాంతరాజము మీచార్వాకుని యుపదేశముకంటె మాఁపికెట్లు లాభకరము. చార్వాకమతస్థున కెవ్వఘృతపానసమయములకంటె, నిప్పు డెక్కువమాఱులు నెయ్యి త్రాగనగును. ఘృతపానముచితముకాన, వెనుక నెట్టివిపత్తుల కవకాశము లేదు. అన్నిటికంటె మిన్న యేమనఁగా, నేతితోఁబాటు మఱికొన్నిరుచ్యపదార్థములుకూడ లభించును. చూచితివా!

ఉద:—కాని, నీవు నిమంత్రణకు సమ్మతించినయెడల దైవ మెదుట నక్కవినయములఁ జూపవలసియుండునుగదా!

శుక్రా:—చూపిన నేమి? తన తేరగఁ గావలసినంత నెయ్యి వచ్చుచుండఁగా నంతమాత్రము నటింపఁగూడదా? అదియటుండ, నీవు ఋణము గ్రహించునప్పుడు మరల దీర్చునట్లు దైవసాక్షిగా వాగ్దాన మొనరించుటలేదా! ప్రపంచమున నొచటఁగాని మంచియే లేదు. గులాబికిఁగూడ ముండ్లున్నవి కదా!

ఉదరానందునిబుద్ధి పనిచేయలేదు. అది గ్రహించి 'విశ్వేశ్వరభట్టును మించిన ప్రతిభావంతుఁడు లేఁడు' అని శుక్రాచార్యుఁడు జయభేరి మ్రోయించి బడాయిఁ గొట్టెను. అంతలో సావాగ్వాద మంతరించెను. అచటివా రెవ్వరుగాని ఉదరానందశుక్రాచార్యుల తర్కప్రతితర్కములఁ బాల్గొనినవారు కారు.

అంతఁ గమలాక్షుఁడు వారిఁ గాంచి "సరి. ఇఁక నన్నుఁ బోనిండు. అన్నము వండవలయును" అని యజ్ఞానాంధకారసుబంధువులఁ జూచి "తమరు పాలు, ఫలము లారగింతురు కాఁబోలు" అని యడిగెను.

వారు:—అవును.

ఉద:—నేనుమాత్రము సలక్షణభోజన మొనరింతును.

కమ:—నాకుఁ దెలియును. కాని రాత్రిపూట నెయ్యి వేయుటకు వీలు లేదని చెప్పుటకుఁ జింతిల్లుచున్నాను.

ఉద:—(ఇంచుక కోపముతో) ఈపిచ్చిభ్రమలకు బాధ్యులెవరు? ఆహాహా! ఇట్టి వెఱ్ఱిభ్రమలు మనదేశమును బాసిపోవు టెన్నఁడో గదా! అట్లని నీవనినయెడలఁ, బగటికంటె రాత్రి చెడ్డది కాదని చెప్పఁగలను. రాత్రికాల మొంతయో శ్రేయోదాయకమనియు నందును. పగటికాలము లేకున్న, మన కంతనష్టము లేదు; కష్టము లేదు. కాని యెవ్వరైననేమి? రాత్రికాలము లేకున్న —ఆహా! మనోజ్ఞమగునిద్ర లేకున్నఁ—దాళఁగలరా? అదియునుగాక, మన ముండునది యుష్ణదేశము. చల్లనిరాత్రులసాయమున మనము జీవితములసాగించుటకు సమర్థులమైయున్నాము. ఇట్లుండియు మనతత్త్వశాస్త్రవేత్తలు, ప్రభువులు, రాజనీతిజ్ఞులు నొకమొగి రాత్రి నమితముగా దూషించుచుందురు. దానిని జ్ఞాని యజ్ఞానమునకును, గలుషమునకుఁ బోల్చుచుండును. రాజు రాత్రుల సభలు చేయరా దనుచుండును. రాజనీతిజ్ఞుఁడు రాత్రులందు ఋణము లియ్యరా దనుచుండును. ఇట్టియెడ మనదౌర్భాగ్యదేశ మిఁక యున్నతస్థితిఁ గాంచుటెట్లు?

స్వదేశమునకై యుదరానందుఁ డొందుదిగులును వారిద్దరకు బంచుకొనఁజాలకుండిరి. కాన నాకు హానాయని చీదఱఁగొనుచుఁ గమలాక్షునితో "మిత్రమా! కమలాక్షా! నన్నుమాత్ర మితరులతోఁ జేర్పకుము. నేయిలేక యన్నముతినుట నాకలవాటులేదు" అని చెప్పెను.

శుక్రా:—మిత్రమా! ఉదరానందా! నేఁటివఱకు నీవు నేయిలేని యన్నము తినియుండలేదని మేము తలంపవచ్చునా?

ఉద:—ఆహా! అప్పుపుట్టనిదినములందు, 'నేయిలేనియన్నముఁ దినుటకంటె నుపవాసముండుట మే' లని, పస్తుండెడివాఁడను. ఆహా! ఘృతసమన్వితాన్నముతో సమాన మేమికలదు? అబ్బా! తలఁచుకొనిన నోట నీళ్లూరుచున్నది.

శుక్రా:—నిజమే.—అభిఘరింపనియన్న మపవిత్రమని మనశాస్త్రములుద్ఘోషించుచున్నవికదా!

ఉద:—ఓహో! మిత్రరత్నమా! ఆవిషయము విధించుటకు శాస్త్రములుకావలయునా! అందుకు మనపొట్టలు చాలును.

శుక్రా:—మూర్ఖుఁడా! శాస్త్రములు, చిరపూర్వానుభవఫలములని యెఱుంగవు! ఆకాలపుతిండిపోతులు ఘృతవిరహితాన్నము నిరుపయోగమను రహస్యమును గ్రహించిరి. ఆమర్మమును మనఋషులే గ్రహించినవని చెప్పి, శాస్త్రోక్తవివరణము లసత్యములందువా!

ఉద:—కాని ఘృతమును పవిత్రమొనరించుటయందుఁ బిచ్చిభ్రమ లెందుకుంచుకోవలయును?

శుక్రా:—కారణము విదితమేకదా! మంచికిఁగాని, చెడ్డకుఁగాని జనసమూహమునందలి నమ్మకమే ప్రధానము. మతవ్యాజములేక—మతసంబంధములేక—వారు దేనినిగాని విశ్వసింపరు. కాన మనపూర్వు లన్నమును బవిత్ర మొనరించుట యుక్తమనిచెప్పి, తమకుఁ గావలసినంత నేతిని బడయుచుండిరి. ఒక్కటిమాత్రము గమనింపుము. వారెంతయు బుద్ధిమంతులు. ఏలయన; వారు పొట్టలకొఱకైన కత్తినవారుకారు. పవిత్ర యము

పేరుఁబెట్టి, యెల్లప్పుడును వారు తమపొట్టలు నిండించుకొనుచుండిరి. కాని నీవు 'కడుపో, కడుపో' అని కొట్టుకొనుచు, నలుగురునోళ్లలో నాని, తిండిపోతనుబిరుదును గాంచితివి కాని యొకకాసైన సంపాదింపలేదు.

ఉద:—నేఁటిసంఘస్థితి యింత నీచమైపోయినది. నీమాట కొంతయు నిజములని నేనొప్పుకొనక విధిలేదు.

శుక్రా:—మనదేశమున నయ్యది కలకాలము నిలిచియుండును. మన దేశజనులకు మతావేశము మెండు. వారి కెద్దానినైన, మతవ్యాజమునఁ దెలియఁజేయవలయును. వారిచే స్నాన మాడించవలయుననిన నయ్యది మతవిధుల ననుసరించుట కెంతయు సాయపడునది యని నుడువవలయును. వారిచే ధర్మము చేయించవలయుననిన, నయ్యది మతమునకు మూలమని యూదవలయును. ఇంతయేల? విచిత్రమనుజులగు మనజాతీయులు భౌతికసౌఖ్యము కొఱకు, వ్యభిచారమునుగూడ మతవిధిగా మార్చినారు.

ఈయుపన్యాసములును, వివాదములును గమలాత్మునకుఁ దలనొప్పి గలిగించుచుండెను. "అయ్యలారా! ఇఁక నేఁబోయెదను. రాత్రికి నేయి లేదు. ఇది నిజము" అని యందరానందునితో—"కాని, నీవు దానిఖరీదు నిచ్చుటకు సంసిద్ధుఁడవైనచో, గ్రామములోఁ గొనితెప్పించెదను" అని చెప్పెను.

ఉద:—అహా! అందుల కభ్యంతర మేమికలదు. కాని, కావలసిన మొత్తమునుమాత్రము నీవు పెట్టుఁబడిపెట్టవలయును,ఇపుడు నావద్దడబ్బులేదు.

కమ:—(ఆశ్చర్యముతో) ఏమీ! నావద్ద నప్పుతీసికొని, నేయిత్రాగఁ జూచుచున్నావా? చార్వాకమతస్థు లీవిధమున బిడియము మానియుందురని నేను గలనైనఁ దలంచియుండలేదు.

ఈమాటల కందఱును బక్కున నవ్విరి. కాని యందరానందుఁడు మాత్రము నెమ్మదిగా "నాకు ఋణముపుట్టినది ఇది మొదటితూరియేఁగదా! కాన నేనెందుల కాయాసమొందవలయును?" అనెను.

కమ:—అయిన నీవు నేఁడు భుజింతువా?

ఉద:—(కోపముతో) ఏల?

కమ:—నెయ్యిలేని యోగిరం బారగించుటకంటె నుపవసించుట మేలను భావమున నెన్నిమారులు భుజింపనని నీవే చెప్పితివి కదా!

ఉద:—ఓహో! అదియా నీయభిప్రాయము! కాని యీదినము మాత్రము విధిలేక వచ్చినది. నేయిలేకున్నను నేఁ డన్నము తిన నిశ్చయించితిని. నాకుఁ జాల శ్రమగా నున్నది.

ఉదరానందుఁ డాయాసము నభినయించుచుండెను.

"అయిన మంచిది. నేనుపోయి యన్నమువండుటకు మొదలిడెదను" అని కమలాక్షుఁడు లోనికిఁబోయెను.

ఉద:—ఈతఁ డిప్పు డన్నమువండుటకుఁ బోవుచున్నాఁడు. ఇఁక నయ్యది సిద్ధమగు టెన్నఁడు?

కుణ:—ఈజోస్యు నడుగుదము.

శుక్రా:—మిత్రుఁడా! మంత్రవాది! నన్నుఁజూచిన నీకుఁ బరిహాసముగా నున్నదిగాఁబోలు. ఇదియేటిప్రశ్న? 'అన్నము సిద్ధమగు టెన్నఁడు, గిన్నము తగులఁబడు టెన్నఁడు' ఇట్టిప్రశ్నమా నాకు గావలసిన ?

తత్త్వవేత్తయగు వాతవ్యాధి యాదులకు "ఒకదానిఁగని నిజముగా సూచించినయెడల, మఱియొకదానిని సూచించుట మిగుల సులభమని తర్కశాస్త్రము చాటుచుండలేదా?" అని పలికెను.

శుక్రా:—అవునవును. భవిష్యత్ఫలములఁ జెప్పఁగలుగుదునా? లేదా? యనుశంకయు మీచటలేదు. అట్టిశక్తిని జోస్యునకు దైవము ప్రసాదించియున్నాఁడు. అనమానమగు నట్టిసామర్థ్యమును 'అన్న మెప్పుడు సిద్ధమగును?' అను వాదిగాఁగల యసంగత నీచప్రశ్నలకు వినియోగించుట సముంజసము కాదు.

వాతవ్యాధి యందుల కించుక క్రుద్ధుఁడై "మిత్రమా! విశ్వవిద్యాలయపు ముక్కుమొగము తెలియఁగనిమూఢునితో నావంటిపండితుఁడు వాద మొనరించి గెలుపొందుట మిగులఁ గష్టము. కాని పండితుఁడు సర్వతంత్ర స్వతంత్రుఁడనియు, కొద్దిగొప్పలనుభేదము లాతనికి లేవనియు, నీకుఁగూడఁ దెలియకపోదని నాయభిప్రాయము" అనెను.

శుక్రా:—(కోపముతో) వాతవ్యాధీ! నేను విశ్వవిద్యాలయముల నెఱుఁగనని నీవు ప్రల్లదములాడుచున్నావు. ఇంతయేల? నేను కాశిలో రెండేం డ్లుంటిని. తక్షశిలయందుఁ బదునైదువత్సరములుంటిని. నిజమాడవలయు ననిన, నేను నావిద్యను సంకర్షణగురూత్తముని పాదపద్మములకడ నభ్యసించితిని.

వాత:—ఈ విశ్వవిద్యాలయములయం దుంటినని యసత్యమాడుటయు కాక, సంకర్షణుని పాదములకడ జ్యోతిషకళోపాసన మొనరించితినని బడాయిలు కొట్టుచున్నావా! సంకర్షణుఁడు వైద్యశాస్త్రాధ్యాపకుఁడనియు, నాతఁడు నేర్పునది వైద్యవిద్యయనియు నీకుఁ దెలియదా? ఓయీ! నాకు బడాయిమాటలకుఁ దెగువ సేయకుము. వారణాసియందు నేను పదియేం డ్లుంటిని. నలందలో రెండేం డ్లుంటిని. పండ్రెండేండ్లు తక్షశిలయందుంటిని.

శుక్రాచార్యుఁడు మ్రాన్పాటొంది, యించుక తెప్పిఱిల్లి "అప్పుడు సంకర్షణుఁడు జ్యోతిశ్శాస్త్రమును గఱపుచుండెను." అని పలికియుఁ బలుకక ముందే, వాతవ్యాధి మండిపడుచు "అది కల్ల. కృష్ణజ్యోత్స్నాయనుఁడు ముప్పదివత్సరములుగా జ్యోతిశ్శాస్త్రము నేర్పుచున్నాఁడు" అని యడ్డు పలికెను.

శుక్రాచార్యున కమితమగు వేసట కలుగుటచే నేమియుఁ బలుకలేదు. శుక్రాచార్యున కైన పరాభవమున కుదరానందుఁడు ప్రమోదమంది "మిత్రమా! వాతవ్యాధీ! ఈస్థలము పేరేమి? ఈధర్మశాల నెవరు ప్రతిష్ఠించినారు? నీకేమైనఁ దెలిసినఁ జెప్పెదవా?" అని యడిగెను.

వాత:—ఆహా! చెప్పెదను. ఈసత్రము విజయపుర మహాగ్రామమునకు సమీపమున నున్నది. శాంతిదేవుఁడను జైనుఁడీ ధర్మశాలను గట్టించినాఁడు.

శుక్రా:—నీమాట యబద్ధము. ఆతనిపేరు శాంతదేవుఁడు. శాంతిదేవుఁడు కాదు.

శుక్రాచార్యవాతవ్యాధుల కఖండముగ వ్యాకరణాంశములపై వాదప్రతివాదములు జరిగెను. కాని కడకు మొండియగు వాతవ్యాధికే గెలుపయ్యెను.

తరువాత జైనసిమునములవలన కచట నిశ్శబ్దముగా నుండెను. అంత యశోధర్మ యజ్ఞానాంధకారునిఁ బిలిచి, యాతని యనుభవముల వినిపింపఁ బ్రార్థించెను.

అజ్ఞా:—ఇతరులకు మనవలన నిబ్బందిగానుండును గాఁబోలు.

యశో:—ఏలగానుండును! ఎంతో సేపుగా వీరందఱల్లరి చేయుచు మన కిబ్బందిఁ గలుగఁజేయుచున్నారుగదా! కాన మనకు వారికి నిబ్బందిఁ గలిగించుట కధికారముగలదు.

అజ్ఞా:—అట్లనకుము. అపకారమునకు బదు లపకారమొనర్పరాదు. అపకారమును నేలోకయుపకారము నణఁపఁజాలను. దౌర్జన్యము దౌర్జన్యమును జయింపఁజాలదు. కోపము కోపము నోడింపఁజాలదు. దౌర్జన్యమును శాంతము జయించును. కోపమును ప్రేమ కట్టివేయును. కొన్ని సమయములందు, బలమును బలమే జయించును; కోపమును గోపము గెలుచునందువు కాఁబోలు. కాని యావిజయము నీటిబుగ్గవంటిదని యెఱుంగుము. పోఁడుగాలివలె నావిజయములు నిలువక కరిగిపోవుచుండును. సద్బోధామృతమును బోసి పెంపరించిన యెడల శాశ్వతవిజయము సమకూరును. బలప్రయోగమున నొకధీరునిఁ బట్టుకొనుట సులభమా? ప్రేమపాశమున నొకయబలను లోఁబఱచుకొనుట సులభమా? ఇంకొకయుదాహరణము. మిహిరగులుఁబోలిన కోపావిష్టమానవుఁ

డును, క్రూరచిత్తుఁడు మఱియొకఁడు లేఁడుగదా! శాంతశీలుఁడగు యశోధుని యెడఁజూపు వినయగౌరవములను జను లీతనియెడఁ జూపుచున్నారా! హూణునిక్రోధముకంటెను యశోధుని ప్రేమయే లోకులహృదయములఁగట్టివైచినది.

శుక్రా:—ఏమండీ! నోటికివచ్చినట్లెల్ల హూణుని దూషింపకుఁడు. అతనిగూఢచారు లెల్లకడలఁగలరు. అతనియాగ్రహము కాలానలసన్నిభ మైనది.

వాతవ్యాధి, కుణపదంత, ఉదరానందు లాతనిమాట నందుకొని "నిజము. నిజము. హూణులకు వ్యతిరేకముగ భాషించువారివద్ద నుండుట మాకు శ్రేయముగాదు" అనిరి.

యశోధర్మ కన్నులెఱ్ఱఁజేసి "అయిన మీరిటనుండి పోవగును. హూణునిపేరు విన్నంతమాత్రమున గడగడలాడుపిరికిపందలా మీరు?" అని గద్దించెను.

శుక్రా:—మిత్రుఁడా! నీవు క్షత్రియుఁడవుగనున్నావు. కాన నీకు హూణుఁడనిన భయములేదు. కాని నేను బ్రాహ్మణుఁడను. మఱిభయపడక నేనేమి చేయఁగలను?

"అవునవును. బ్రాహ్మణులమగు మాచేత నేమగును?" అని కుణపదంత, వ్యాతవ్యాధి, ఉదరానందు లాతనిఁ గలిసికొనిరి.

యశో:—ఈయజ్ఞానాంధకార, సుబంధువులుమాత్రము బ్రాహ్మణులు కారా? వారు మీవలెఁ బిఱికిపందలైయున్నారా? బ్రాహ్మణుఁడుకూడ నంవఱివలె ధీరుఁడైయుండనగును. యుద్ధవిద్యాకుశలుఁడు కాకున్న నేమి? ప్రబలధైర్యోత్సాహము లాతనికడలేవా? కత్తిసాము తెలియకున్న నేమి? నిరంకుశప్రభువు నెదురొడ్డి నిలుచుసాహసము లందఱికివలె నాతనికిఁగూడ నుండును. అభిమానధనుఁడగు నొకతత్త్వవేత్త, అలెగ్జాండరును లెక్కసేయక యాతనికడకుఁ బోనొల్లకుండెనని యెఱుంగరా? అలెగ్జాండరును బ్రతిఘటించి నిలువ సింధురాజున కుపదేశించిన యాయిరువదియైదుమందివిప్రవరులు, అతె

గ్గాంధరుచేతుల నెట్లు వీరమరణమొందినదియు జ్ఞాపకమున్నదికదా? ఓపిఱికి పందలారా! ఎల్లకాలము మీరు పిఱికిపందలరై, భూమికి బరువై, యుండ నిశ్చయించుకొనిన, నిశ్చయించుకొందురుగాక; బ్రాహ్మణజాతియంతయు నట్టిదనిమాత్ర మనకుఁడు.

వాత:—మానవుఁడు ప్రాణరక్షణ మొనరించుకొనుట, ప్రకృతివిరుద్ధము గాదు. ప్రాణమేపోయిన నిఁక సత్కార్యము లెట్లు కొనసాగును? వీరుఁడై మరణించుటకంటె, పిఱికియై జీవించియుండుట మంచిది.

శుక్రా:—మిగుల మంచిమాట. అదియటుండ, నిచట మనమిట్టు చూపెడి త్రోవ యాత్మహత్యకు మూలము. ఇఁక నాత్మహత్య నరకప్రాప్తికి హేతువని పవిత్రములగు మనశాస్త్రము ఉద్ఘోషించుచున్నది.

కుణ:—అదియేకాదు. ఒక్కసారిగా మనప్రాణములు పిటుక్కునఁ బోయినను మంచిదనవచ్చును. కాని యటులగునా? ఈభూమియందున్న నానావిధజంతువులఁ గ్రవపలపాల్సేసికాని హూణులు మనల జంపరు.

ఉద:—అవును. అదియుఁగాక పరలోకమునందు నెయ్యిలేమగా బోలు. అప్పుడు మనగతి యేమగును.

ఈమాటల కందఱును నవ్విరి. యశోధర్మ యజ్ఞానాంధకారునిఁ జూచి "ఇఁక సికరను మొదలిడవగును" అని యడిగి, వాతవ్యాధి, కుణపవంత, శుక్రాచార్య, ఉదరానందులతో "అయ్యలారా! ప్రాణము ప్రాణమని ప్రాకులాడువా రిచటినుండి పోవచ్చును. హూణులఁజూచి భయమొందువారుకూడఁ బోవచ్చును" అని చెప్పెను.

అంత వారు నలువు రాచోటువాసిపోయిరి. పోవుచు శుక్రాచార్యుఁడు వాతవ్యాధిచెవిలో "ఈతఁడు సనాతనధర్మిష్ఠుఁ డగుక్షత్రియునివలెనున్నాఁడు. హూణులనిన నీతనికిఁ జంకుగొంకులేకున్నది" అని రహస్యముగాఁ జెప్పెను.

వాత:—అవును. అతని యాకారవేషములు వీరపురుషోచితములై యున్నవి. ఇఁక నందుల కాశ్చర్యమేముండును? కాని యాసన్యాసు లెవరో! వారుకూడ మనవలె బ్రాహ్మణులయ్యును, హూణులనిన భీతిల్లుటలేదు.

శుక్రా:—ఏమో! నాకుమాత్రము నమ్మకము పుట్టుటలేదు. నాకుఁ గూడ వారు నిజముగా యతులవలెఁ గాన్పించుటలేదు. వారు బాలాదిత్యుని గూఢచారులని నాయభిప్రాయము.

కుణ:—లేక మిహిరగులుని గూఢచారులో ఈదినములలో నీవేగులే రాజపక్షపాతులైనదియు నిర్ణయించుట మిగులఁ గష్టముగా నున్నది.

ఉద:—నిజము పలికితివి, వీరిపీడవదలినందులకు నాకు సంతోషముగా నున్నది.

శుక్రా:—ఏమియుఁ బ్రొద్దుపోవుటలేదు. మనమిపు డేమిచేయుదము.

ఉద:—వంట యగుచున్నదో లేదో చూతము రండు.

వారు నలువురు వంటగదికిఁబోయిరి. కమలాక్షుఁడు వారలఁ గాంచి "మీరందఱిచటి కేలవచ్చితిరి?" అని యడిగెను.

శుక్రా:—వారు మువ్వురును హూణుని ప్రస్తావము నెత్తుచుండ, మే మీవలవచ్చితిమి.

కమ:—అటులనా? వారిరాజ్యరహస్యముల నసత్రమునందుఁ దర్కించుకొనుచు వారు నాకు విపత్తుఁగలిగింతురాయేమి?

శుక్రా:—ఆహా! అందుకు సందియముండదు.

ఆమాటలకుఁ గమలాక్షుఁడు గడగడవడఁకుచు "నేనిప్పుడే వారికడకుఁ బోయి, రాత్రి కన్నములేదని చెప్పెదను" అనెను.

వాత:—మిత్రమా! కమలాక్షా! ఈవిషయమై ప్రస్తావించినయెడల నాక్షత్రియుఁడు నిన్నుఁ బరలోకమునకుఁ బంపివేయకమానఁడు.

కమ:—ఏమీ! అతఁడు క్షత్రియుఁడైనచో నావంటిబ్రాహ్మణునిఁ జంపి మహాపాతకము నొడిఁగట్టుకొనునా?

వాత:—అందుల కాటంకమేమికలదు? హూణులు బ్రాహ్మణుల నెందఱినో చంపిరి. కాని యందువలన వారి కెట్టియాపదవచ్చినది? కాన క్షత్రి

యందుఁగూడ నిప్పుడాసిచ్చి భ్రమలు వదలిపోయినవి. అదియుఁగాక, ప్రాయశ్చిత్తముల వారు పాపపంకిలములఁ గడుగుకొనఁగలరు.

శుక్రా:—ఔనౌను. ఆపాపపరిహారార్థము,వారు సహస్రబ్రాహ్మణ్యమునకు సమారాధనలుగావించి, భూరిదక్షిణలఁగూడ నొసంగుదురు. ఆహాహా! అట్టిసమారాధనలయందు, నేను భుజించి చాలకాలమైనది.

కమ:—(కోపముతో) అయిన నేను చంపఁబడిన, నీకుఁ బప్పన్నమును, పెద్దపెద్దసంభావనలును లభించునని తలంచుచున్నావా?

శుక్రా:—మిత్రమా! నిష్కారణముగాఁ గోపమొందకుము. ఏబ్రాహ్మణుఁడు చంపఁబడిన నాకేమి? ధనాధికుఁడగు క్షత్రియుని చేతుల నేవిప్రుఁడైనను సరియే, ప్రాణములఁ గోల్పోయినయెడల, నేనిప్పుడు చెప్పినవిధముగా నా క్షత్రియుఁడు పాపపరిహారార్థము సమారాధనలొనరించునని నాయభిప్రాయము. ఇంకొకవిషయముకూడఁ జెప్పెదను. బ్రాహ్మణుఁడు హతుఁడైనను, బ్రాహ్మణేతరుఁడు నిహతుఁడైనను నాకు సంబంధములేదు. బ్రాహ్మణసమారాధన జరిగిన నాకదియే పదివేలు.

వాత:—ఇప్పుడు పలుకులు కించుక సవ్యములుగా నున్నవి.

శుక్రాచార్యుఁడు కమలాక్షుని మెప్పించుట కెంతయుఁ బ్రయత్నించు చుండెనుగాని, కమలాక్షుఁడు మాత్ర మాతనిపైఁ గఱబిఱలాడుచుండెను. శుక్రాచార్యుఁడు దీనముగా "ఓమిత్రుఁడా! కమలాక్షా! నాపైఁ గినియకుము. నీవు చావవలయునని నాయభిప్రాయముగాదు. నీయట్టియుపకారశీలురఁ జంపుటయా? నీవు నిహతుఁడవైనచో, మాకన్నముపెట్టువా రెవరు గలరు?" అని బ్రతిమాలెను. కాని శుక్రాచార్యుని వేడికోలునకుఁ గమలాక్షుఁడు శాంతించుటకుబదులు నేయిపోసినయగ్నివలె మండిపడుచు "ఏమీ! మీవంటిదేశద్రిమ్మరులకు వండిపెట్టుటకా నేనుపుట్టినది. ఓరీ! సత్రములపాలిటిచెదలుపురుగులారా! బుద్ధితెచ్చుకొని బ్రతుకకుండినచో, తగినఫలమును దప్పక యనుభవించి తీరుదురు. తెలిసినదా!" అని తీవ్రముగా గద్దించెను.

“నీమనసు కష్టపెట్టవలయునని నేను దలంపలేదు. కమలాక్షా! మన వాగ్వాదముల మఱచిపోవ నిన్ను మఱిమఱి ప్రార్థించుచున్నాను” అని శుక్రాచార్యుఁ డాతని వేడుకొనెను.

శుక్రాచార్యుని వినయవర్తనమునకు, ప్రార్థనాదికములకుఁ గమలాక్షుఁ డించుక శాంతినొంది ‘చూచెదను’ అనెను. ఆనలుఁగురును మౌనము దాల్చి యుండిరి. కమలాక్షుఁడు తనవంటపనికిఁబోయెను. ఉదరానందుఁడు రహస్యముగా “వాతవ్యాధీ! దుమ్ములోనుండి కుమ్ములోనికివచ్చితిమి. ఈబ్రాహ్మణుని కంటె నాక్షత్రియుఁడే యెంతయు సజ్జనుఁడుగానున్నాఁడు. మరల వారి కడకుఁ బోవుదమా?” అని యడిగెను.

వాత:—వలదు. వారు మనలను గూఢవర్తనులని సంశయింతురు.

శుక్రా:—కాని మన మచట నిలువనేరము. ఇది నిజము.

కుం:—అయిన నొంటరిగా నొకమూలఁ గూర్చుండియుందము.

అనంతరము వారొకమూలకుఁజేరి చీఁకటిలోఁ గూర్చుండిరి. కమలాక్షుఁ డేవేళ కేమనునో యనుభయ మొకవంకను, యశోధర్మ యెప్పటి కేమి చేయునో యనుభీతి మఱియొకవంకను బీడింప, వారొండొరులతో నతిరహస్యముగ నేమేమియో భాషించుకొనుచుండిరి. అట్లు వారు భోజనవేళవఱకుఁ గూర్చుండియుండిరి.



# పదునేడవతరంగము.

---

## అజ్ఞానాంధకారుఁడు.

ఇంతలో నజ్ఞానాంధకారుఁడు తనభూతపుచారగాథను యశోధర్మ, సుబంధువులకు వినిపింపఁదొడఁగెను. సుబంధు వింతకుముం దొకనాఁడును విని యుండలేదు. కాన నాతఁడుకూడ యశోధర్మవలె నాకథ నాలకింప నాతురుఁడై యుండెను.

అజ్ఞా:—నాజీవితమునఁ బరివర్తనము కలుగునప్పటికి నాకుఁ బదు నెనిమిదేండ్లుండెను. నాయర్ధాంగి గతించినపిదప నామె కంత్యక్రియ లొనరించి, దండకమండలుకాషాయధారినై, జీవితసమస్యను విచారించుచును, చావుపుట్టుకలమర్మము నరయుటకు [illegible] బ్రవేశించితిని. అప్పుడు నేను నింపుయౌవనమున నుండుటఁజేసి, యుత్సాహాధికుండనై యుంటిని. యువకులు, ఉత్సాహవంతులట్లు నేఁగూడ విశ్వసంతోషినై యుంటిని. పవిత్రమగు కాశీక్షేత్రమునందలి పండితులు తత్త్వవేత్తలని పెద్దలు సెలవిచ్చియున్నారుకదా! అట్టిపూజ్యప్రదేశమునకు నేనేల పోరాదు? అచటి మతాచార్యు లొకటిరెండుదినములలో నాసంశయ నివారణము నొనరింప సమర్థులు. నేనును ద్వరలో సుజ్ఞానినై దిరిగి రావచ్చును. అట్లనుకొని నేను కాశికిఁబోయితిని. కాని యాకాశీపట్టణమున మతాచార్యులకు మారుగా మొద్దుగొడ్డులుమాత్ర ముండిరి. పరమజ్ఞానులకుఁ బదులు పూజారులుండిరి. నావిస్మయమున కంతములేకపోయెను. అటులయ్యును, నేనాశవదలలేదు. నేనొకయప్పకుని డాసి “స్వామీ! జీవితరహస్యమును, జననమరణమర్మమును నేనెఱుఁగవలయును.” అని యడిగితిని. అందుల కాతఁడు “శ్మశానమునకుఁ

బోయి తలపోసికొనుము." అని వెడలిపోయెను. అతనియానతి నాదలఁదాల్చి నేను వల్లకాటికిఁబోయి నిలిచితిని. అచట మూఁడుపీనుఁగులు తగులఁబడుచుండెను. ఆమంటలకడఁ గూర్చుండి కొందఱు చలికాఁచుకొనుచుండిరి.

"నీవు శవముఁదెచ్చితివా?" అని కాటికాఁపరి నన్నుఁ బ్రశ్నించెను.

"లేదు."

త్వరలో నొకదానిని దేనున్నాఁడవు కాఁబోలు!"

"అట్టి దేదియు నుండదు."

"అయిన నిచట గుంపుకూడు టెందులకు? ప్రయోజకులగు వారికిఁ జోటుకావలయును. పొమ్ము."

అచట నిలుచుటకు నాకు వీలులేకపోయెను. కొన్నియడుగులిడి, నేను దేవనదియగు గంగను డాసితిని. అప్పటికి సంజవేళయయ్యెను. ఆయేఱు గట్టొఱసి పాఱుచుండెను. ఆమహానది విశాలాకారమును నయనానందకరముగఁ దిలకించుచు నటులే నిలువఁబడితిని. "వారణాసికీర్తిప్రతిష్ఠ లిచట నున్నవి. ఇట్టిదివ్యతరంగిణివలనఁ గాశి విశ్వవిఖ్యాతమై, యశోభరితమై యున్నది; కాని యీనగరమునందలి వృషభరాజములఁబట్టియు, మఠాధ్యాపకులమూలమునను గాదు." అని గ్రహించితిని. ఆఘట్టమున నొకమెట్టుపైఁ గూర్చుండి చీఁకటిపడువఱకు, నాగంగాప్రవాహమును జూచుచుంటిని. నేను రోయుచుండినసమస్యయందలి గూఢభావము నాకప్పు డవగతమయ్యెను. అట్టియాలోచనాధరమున నాహృదయము క్రుంగిపోయెను. "ఆహా! యీసమస్యను విడఁదీయుటెన్నఁడోకదా!" అని నే ననుకొంటిని.

తోడనే "నీసమస్యయేమి?" అని యొకమానవుఁడు నన్నుఁ బ్రశ్నించెను. అతఁడు నాప్రక్కఁ గూర్చుండియుండెను. అతనిరాకను నేను గమనించి యుండలేదు.

"నాసమస్యయా! జ్ఞానులెల్లప్పు డీసమస్యను విడఁదీయఁ బ్రయత్నించుచుందురు. జీవితస్వరూప మెట్టిది? చావుపుట్టుకలయర్థ మేమి? ఎటనుండి

డెవ్వఁడో, యిట్లు ప్రకటించియుండును. అధర్మబద్ధములగు నిట్టిపాడుప్రకటనములకు విశ్వనాథస్వామి బాధ్యుఁ డెట్లగును? నాయందియములఁ దొలఁచి వేయుట, కామహోమహానిఁ బ్రార్థించెదను" అని యనుకొని దేవాలయము లోనికిఁ బోయితిని. క్రమముగ గర్భాలయముడాసి విశ్వనాథస్వామిని సందర్శింపనుండ నొకపూజరి యరుదెంచి "నిన్ను లోని కెవరు రానిచ్చిరి?" అని నన్ను గద్దించెను.

"నాకై నేనేవచ్చితిని. శ్రమాభిన్నమగుప్రాణి తనసృష్టికర్తతోఁ గలిసి భాషించుట కెవరియానతి నందవలయును?"

"అవకతవకపుమాటలాడకుము. నీప్రాణితో గీణితో నాకుఁ బనిలేదు. నీసృష్టికర్తలు వలదు. గిష్టికర్తలు వలదు. నాయప్పనము నాకుండినఁ జాలును. పురుషుఁడైనను, స్త్రీయైనను, బాలుఁడైనను, వృద్ధుఁడైనను, నెవరైన నాకేమి? మొదట నాకట్నము నాకుఁ జెల్లించి తరువాత గుడిలోనికి రావలయును. ఏదీ! ఇమ్ము." అని యర్చకుఁడు నన్ను బలవంత పెట్టెను.

నేను విభ్రాంతినందితిని. విశ్వనాథసందర్శనమునకు లంచము పెట్టవలయునా? నాస్వాంత మారాటపడసాగెను. 'నే నియ్యను' అని నే నంటిని.

"అయిన, నీవు విశ్వనాథునిఁ జూడఁజాలవు" అని యాతఁడు తలుపులుమూసెను. నేను నాచిత్తమును గట్టిపఱచుకొని "స్వామీ! ఈకోవెలనుండు విశ్వనాథస్వామిని నేను జూడఁజాలనుగాని, నాహృదయమందలి విశ్వనాథస్వామినిఁ జూడఁగలను. సర్వవ్యాపియగు విశ్వనాథస్వామినిఁజూడఁగలను." అని నే నాతనిఁ జీవాట్లుపెట్టి "ఈదేవళమునందలి విశ్వనాథునకుఁ బరిష్కరించవలసినసమస్య లిట్టివి లెక్కకు మిక్కిలిగానున్నవి. అట్టియెడ నాసమస్య నీతఁ డెట్లు పరిష్కరింపఁగలఁడు!" అని యనుకొనుచు, దేవాలయములోనుండి వీథిలోనికివచ్చితిని. ఒకముసలిది చేత నొకటెంకాయను, పూలను దీసికొని నాకభిముఖముగా వచ్చుచుండెను. నా కాషాయాంబరముల నామె గాంచి "ఈగుడిపూజారివి నీవేనా?" అని ప్రశ్నించెను.

"కాదు. నేఁగూడ నీవంటిభక్తుఁడను. విశ్వనాథసందర్శనమునకుఁ ప్రతిమానవుఁ డష్టపణమును బూజారి కియ్యవలయునఁట." అని నేను నవ్వితిని.

"ఆసంగతి నీ కింతవఱకుఁ దెలియదా?" అని యామె మందహాస మొనరించెను.

నేను:—తెలియదు. దేవళములో నీసంగతి తెలిసినది.

ఆమె:—అయ్యో! పాపము. కాని యాయాసపడకుము. ఆరూకను నీకుగా నేనిచ్చెదను. విశ్వనాథుని సందర్శింపక, నీవు కాశివిడిచి పోఁగూడదు.

నేను:—తల్లీ! లంచమిచ్చి దేవునిఁ జూచుట నాకిష్టము లేదు.

ఆమె:—అయిన నాయర్చకుని పొట్టపూడు టెట్లు?

నేను.—భక్తు లిచ్చు కానుకలవలన.

ఆమె:—అష్టపణముమాత్ర మట్టికానుకలలోఁ జేరదా?

నేను:—చేరదు. నిర్బంధమునఁ బడసినది పారితోషిక మెట్లగును!

ఆమె:—కాని భగవత్సందర్శనమునకై భక్తుఁడు కొద్దిగనో, గొప్పగనో, త్యాగము జూప సంసిద్ధుఁడై యుండవలయును గదా!

నేను:—నిజము. కాని యాత్యాగము దైవప్రీతికొఱకు కాని, పూజారి పొట్టకు గాదుసుమా! అదియును గాక, యాలోపలయున్న మనకు దేవుఁడగపడుట లేదు. దైవము మనహృదయసీమలఁ గలదు. ఆతఁడు సర్వాంతర్యామి. కాన నాతని నెల్లకడలఁ గాంచనగును.

ఆమె:—నీమాట సత్యము. ఆమార్గము ప్రశస్తమగుటకు సందియము లేదు. కాని పామరు లందులకుఁ జాలరు. వారికంత జ్ఞానము లేదు. వారికొఱకే విగ్రహారాధనము చెల్లుబడిలో నున్నది. దైవము సర్వాంతర్యామియని నీవే యంటివి కదా! అట్టియెడ నాశిలావిగ్రహమునందుమాత్ర మేల లేకుండును!

నేను:—ఏల లేకుండును. ఉండుటకు సందేహము లేదు.

ఆమె:—సరి. ఈపావనగంగాజలముల స్నానమాచరించితివా! గంగాస్నానము సర్వపాపహరమైనదిసుమా! చూచితివా! ఆస్నానసమయమునందు,

డబ్బుకై పీఁకుకొని తినువా రెవ్వరుండరు. మనయిచ్చవచ్చినయెడలఁ గొంత దానము చేయవచ్చును.

నేను:—నేను స్నానము చేయలేదు. రేపటిదినము చేయ నెంచి యున్నాను.

ఆమె:—(విస్మయభయములతో) అయిన నీవు గంగయందుఁ గ్రుంకు లిడకమున్నే యాలయప్రవేశమున కుద్యమించితివా?

నేను:—తెలియక యిట్టితప్పు చేసితిని.

ఆమె:—నీవు యతివికదా. ఇట్టివిషయముల నీ వెఱిఁగి యుండనగు.

నేను:—నే నీ తురీయాశ్రమున నడుగిడి యెన్నియోనాళ్లు కాలేదు.

ఆమె:—ఒక్కవిషయము చెప్పుము. గృహస్థాశ్రమముకంటె సన్న్యసాశ్రమము ప్రయోజనకారియా?

నేను:—నే నట్లుతలంపను. కాని నాసంతివేఱు. నాపత్ని కాలధర్మ మొందినపిదప మరలఁ బెండ్లాడుటకు నాకిష్టము లేకుండెను. నేను సన్న్యసించి జీవన్మృత్యురహస్య సంపాదనావ్యగ్రుఁడనై దేశదేశములు తిరుగుచున్నాఁడను.

ఆమె:—నీసతీమణి చనిపోయెనా? అయ్యో! పాపము. నీకుఁ దల్లి యున్నదా?

నేను:—ఆమెకూడఁ గతించినది.

ఆమె:—మీతండ్రి?

నేను:—అతఁడుకూడ లేఁడు.

ఆమె:—అయిన నీవు సన్న్యసించుటలో నాశ్చర్య మేమున్నది. ఈపరిస్థితులయందు నీకు వేఱుమార్గ మేమున్నది. మఱచితి. తలదాఁచుకొనుట కైన నీకింత కొంపయున్నదా?

నేను:—అదియు లేదు.

ఆమె:—అయిన నాయింటికివచ్చియుండుము. 'రాను' అనకుము. నాయింటిలో నేనొక్కదానను మాత్రమున్నాను. నీసౌఖ్యమును నేను

జూచుకొనియెదను. నీవు కాశియందున్నంత కాలము, నాపుత్రునివలె నాతో నుండవచ్చును.

శ్రమనశనయించుకొనుట కింత సెలవుదొరకినందులకు నేను మోద మొంది "అమ్మా! ఎంతయుఁ గృతజ్ఞుఁడను. అవశ్యము నీమాట నడపుదును" అని యంటిని.

ఆమె:—సజ్జనలక్షణము. ఒకనిమున మిచట నుంపుము. గుడిలోనికిఁ బోయివచ్చెదను. నీవు స్నానముచేయలేదుగాన లోకిని రాఁగూడదు.

ఆముసలియామె త్వరత్వరగా గుడిలోనికిఁబోయెను. నేను వీథిలో నిలిచి "ఆముసలిదానికి విగ్రహములందుండు మూఢవిశ్వాసము మంచిదగునా? చెడ్డదగునా?" అని ప్రొద్దుపోకకై తలపోసికొనుచుండ, నొకమానవుఁడు నాకంట బడెను. అతఁ డాద్వారముకడ నుండు ప్రకటనము నట్టే చూచుచు నిలువఁబడి యుండెను. ఆతనియాకారము రూపొందినశోకరసమో యన నుండెను. అతఁడు తడిగుడ్డలతో, దేహమంతయు విభూతినలఁదుకొని యుండెను. నేనాతని సమీపించి "నాయనా! ఏల శోకించెదవు?" అని ప్రశ్నించితిని. దాని కాతఁడు "దేనికా! ఈప్రకటనఁజూచిన, నాకు దుఃఖముకలుగుచున్నది. నాది కళింగ దేశము. నేను మాలవాఁడను. పంచములుసైతము విశ్వనాథాలయమునఁ జొర వచ్చునని నేను విని, యింతదూర మొంటిమై పాదచారినైవచ్చితిని. దేవాలయమును బ్రవేశింప నెంచి, గంగాస్నానమొనరించితిని. కాని నాయాశలన్నియు నొక్కమారుగాఁ గూలిపోయెను. ఇంతకాలము నే నువ్విళ్లూరుచుండిన దేవాలయప్రవేశమునకు నే నర్హుఁడనని నాకిపుడు విదితమైనది. అకటా! ఇంత దూర మరుదెంచి, విశ్వనాథసందర్శనభాగ్య మందక తిరిగిపోవుటకంటె నవ మాన మేమున్నది?" అని వాపోవసాగెను.

నేను:—నీవు లోపలి కెందుకుఁబోరాదు? నీవు పంచముఁడవని యిటఁ దెలిసినవా రెవరున్నారు? ఏల యోచించెదవు?

ఆతనిముఖాంబుజము విస్మయాంకురముల కాలవాలమయ్యెను. అతని తెలము వివర్ణమయ్యెను. "ఏమీ! సన్న్యాసివై యుండియు నీవిట్టియుపదేశము



అజ్ఞానాంధకారునితో పంచముఁడు దేవాలయప్రవేశమునకు
అస్పృశ్యుఁడు కా నని చెప్పెను. పుట—190

లోనరించుచున్నాఁడవా ! దొంగవేషములతో దేవళములోనికిఁ బోవుట వలని లాభమేముండును? పుణ్యము రాకపోవుటయుండ, పాపము మూటగట్టు కొనిపోవుటమాత్రము నిజము." అని యామాల యనెను.

ఆమాటలకు నేను వెఱఁగందితిని. "కడజాతివారు సామాన్యముగ ధర్మ మెట్టిదో తెలియనివారై యుందురుగదా! అట్టిజాతియందుఁ బుట్టినమానవుఁడు స్వధర్మపరిపాలనమం దద్వితీయుండై యున్నాఁడుకదా! బ్రాహ్మణుఁడనగు నావర్తనముకంటెఁ బంచముఁడైనను నీతనివర్తన మెన్నిరెట్లో మెఱుగైయున్నదిగదా!" అని సంతసించి, యాసత్పురుషునితో "వత్సా! నీవడవడి సంస్తుతిపాత్రమైయున్నది. ఈకోవెలయందుండు విశ్వనాథునిప్రస్తావము వదలి, నీహృదయమందును, బ్రపంచమం దెల్లకడలను నుండువిశ్వనాథు నెఱుఁగఁ బ్రయత్నింపుము." అని యుపదేశించితిని. అతఁ డొకనిముస మాలోచించి "ఇప్పుడు తెలిసినది. మీయుపదేశరాజమునకు నాకృతజ్ఞతాభి వందనములు" అని వెడలిపోయెను.

అతఁడు పోవునపుడు, దేవాలయములోనుండి వృద్ధురాలు తిరిగి వచ్చెను. "నీతో భాషించుచుండిన దెవరు?" అని యామె నన్నుఁ బ్రశ్నించెను.

నేను:—ఒక మాలవాఁడు.

వృద్ధు:—వాఁ డిచటి కేలవచ్చినాఁడు?

నేను:—పంచములు లోపలికిరాఁగూఁడదని యాతఁ డెఱుఁగఁడు.

వృద్ధు:—ఏమీ! వానిగర్వము. పవిత్రమగు శ్రీకాశీకావిశ్వనాథాల యమునకుఁ దాను రావచ్చునని యామాలతలఁచెఁగా? హోరా! ఏమి వాని కులుపతనము. అహాహా! ఇంకేమున్నది? అధర్మపరులగుహూణులు పరిపాలించు తఱి యేవేళ కేదిరానున్నదో తెలియుటలేదు.

నేను:—తల్లీ! హూణు లేమిచేసిరి?

వృద్ధు:—ధర్మదేవతలగు గుప్తసార్వభౌములకాలమైయుండినయెడల నాగర్వశీలునకుఁ దగినశాస్తియై యుండెడిది. అప్పుడు వానికిఁ గొరడాప్రేటుల పూజరైయుండదా?

నేను:—గుప్తరాజులు హూణులఁ బ్రతిఘటించి నిలువనశక్తులై యుండుటకుఁ గారణ మీపవిత్రపాతబుద్ధియే కాఁబోలు.

అందుల కామె కోపమొంది "పన్నాస్యసివైయుండియు నిట్టియధర్మ వాక్యము లాడుచున్నాఁడవుగదా!" అనెను.

నేను:—తలఁచినది తలఁచినట్లుగాఁ బలుకుచున్నాను.

వృద్ధు:—(కోపముతో) తలఁచినదియా?

నేను:—అవును.

వృద్ధు.—అయిన నాచండాలునకు నీవేమిబోధించితివి?

నేను:—ఈకోవెలయందలి విశ్వనాథునిబోలిమాని, చుట్టుపట్టుల నెల్ల కడల నిండియుండు విశ్వనాథుని వెదకఁజెప్పితిని.

వృద్ధు:—(తిరస్కారముగా) ఓహో! వాఁడాతనిఁ గాంచినాఁడా?

నేను:—ఇంకను లేదు. అనన్యమానసమున వాఁ డామహాదేవుని వెదక మొదలిడినాఁడు. సఫలుఁడగుట సత్యము.

వృద్ధు:—ఎంతవఱకు సఫలుఁడగునో యాకన్నులతోఁడనే చూడనా! ఇంతకును నేను నిన్నుఁజూచి చీదరించుకొనుటకై నీవు ప్రయత్నించునట్లున్నది.

నేను:—మన్నింపుము. పరాధీనుఁడనై యుండుటకు నాకుఁ గోరిక లేదు. సెలవు తల్లీ! నాఁకిక సెలవు.

వృద్ధు:—సెలవేల! నాయింటవిడిసియుండునట్లు నీవు మాటయిచ్చి యున్నాఁడవుగదా!

నేను:—అవును. మనవ్యతిరేకవర్తనములు మనయుభయులకు సంకట ముగా నుండుఁగాఁబోలు!

వృద్ధు:—నిమ్నజాతులగుఱించి మనకుఁగల భేదాభిప్రాయములఁబట్టి యట్లనుచున్నాఁడవా? అట్టి యభిప్రాయము మానుము. భయపడకుము. నీవు

తురీయాశ్రమధారివి. లోకసాంప్రదాయములకు నీవతీతుఁడవు. అది నిన్నంటఁ జాలవు. కాన నాకుఁ బాషండమైనది, నీకుఁ బరమపవిత్రమైయుండవచ్చును. నాపైని కోపముమాని, నావెంటరమ్ము. నేను స్త్రీని. అందును వృద్ధురాలను. అట్టి నేను నిన్ను నొప్పించియుండినచో, నీవు మఱచిపోవుట నీవిధియై యున్నది.

ఆమెప్రార్థనను నేనంగీకరించి, యామెయింటికిఁ బోయితిని. ఆవృద్ధు రాలియింట నేనెన్నియో నాళ్లుంటిని. అనుదినము నేను గంగకుఁబోయెడి వాఁడను. అప్పుడప్పుడు విశ్వవిద్యాలయమునకుఁబోయి కనఁబడినవానితో నంతయు నాహృదయము నావరించియుండిన సమస్యఁగూర్చి తర్కించు చుండెడివాఁడను. కాని నాప్రయత్నములన్నియు నీటివ్రాఁత లగుచుండెను. నా సమస్యాపరిష్కారమునందుఁ బండితులును, ప్రజ్ఞానులును విఫలులగుచుండిరి. నా యవిశ్వాసమును నేను వెల్లడించునపుడంతయు, వారు నన్నుఁ జూచి విసుఁ గొందెడివారు. వారిలోఁ గొందఱు నన్నేవగించుకొనుచు "తుచ్ఛమగుసమస్య నొకదానినిఁ బరిష్కరింప మన మసమర్థులమని పేళనమొనరించుటకై యీ శేఁషం మసకడ కరుదెంచినాఁడు. ఇందుకు సందియములేదు." అని దూరుచుం డెడివారు. ఒకనాఁడు వారిలో నొకఁడు నన్నుఁజూచి "నీసమస్యానివారణ మునకై సొంతముగా నీవే పరిశోధనలుసల్పుట చాలసహాయకారి. నీవు కాల ధర్మమొంది, మృత్యుస్వరూపము నెఱుంగరాదా?" అని తిరస్కారముగా ననెను. అందులకు నేను గినియక, ఆత్మహత్య పాపమగుటచే నాతనియుప దేశ మనుసరించుట కశక్తుఁడనని చెప్పితిని.

మఱియొకనాఁడు నేను భోజనార్థము విస్తరిముందుఁ గూర్చుండి యుండఁ, నాసమస్యాపరిష్కారమునకు నాయసమర్థతను దలంచుకొని, నేను దుఃఖింపసాగితిని. ఆవృద్ధురాలు నాదీనావస్థఁగాంచి "నాయనా! ఈసమ స్యకై యిట్లు వెతనొందనేల? ఏవానవలన నేయేఱునిండునదియు, ఏనీ రేసము ద్రమునఁ గలిసి యొకటులగునదియుఁ దలంచుకొన్న, మనము · కుందుచున్నామో

కాని మనయాత్మ లీపుట్టువునకుఁ బూర్వము స్వర్గమందుండెననియు, మనమర ణానంతరము మరల నాకముఁ జేరుననియు, మనము తెలిసికొనినఁజాలును.'' అని యనునయించెను.

నేను:—అయిన జీవుఁడు చావుపుట్టుకలఁబడి పరిభ్రమించుచుండునని నీవు నమ్మనా?

వృద్ధు:—అనియే నానమ్మకము. తొలిపుట్టువునకు ముందునంగతిని, కడపటిచావునకుఁ దరువాతిసంగతినిమాత్రము చెప్పితిని.

ఆమె:—పరంజ్యోతినుండి పరిశుద్ధమైవచ్చినప్రాణి, కాలక్రమమునఁ బాపపంకిలమునఁబడును. అనంతర మాప్రాణి, జననపరంపరలొంది, పుణ్యజలముల నాపాపపంకిలములనుండి తప్పించుకొని, నిర్మలుఁడై నిగ్గుఁదేఱి సర్వాత్ముఁడగు పరంజ్యోతియందు మరల లీనమైపోవును.

తాను వివరించినసిద్ధాంత మెంతయు నిజమని యావృద్ధురాలి గుడ్డి నమ్మకము. దానిమూలమున నామె సంతుష్టినందియుండెను. అట్టియెడల నామె మానసమును జిన్నపుచ్చరాదని తలంచి, నేనేమియుఁ బలుకనైతిని. కాని నేనుమాత్రము సంతృప్తినందనైతినని వేఱుగఁ జెప్పవలయునా? నా హృదయవేదనానలజ్వాల లించుకయైన నుపశమిల్ల లేదు. నాసమస్యాపూరణమునకుఁ గాశీనగరము తగినస్థలముగాదని క్రమక్రమముగా నేను గ్రహించితిని. ఇఁక నచట నాయునికివలనఁ బ్రయోజనముగానక, లాభకరమగు మఱియొకస్థలమునకుఁ బోవ నిశ్చయించుకొంటిని. ఒకనాఁడు నేనొకతత్త్వవేత్తతోఁ దర్కించుచుండఁగా నాతఁడు ''ఇట్టిసమస్యలను నీవు పరిష్కరింపవలయుననిన, హిమాలయపర్వతశిఖరములకుఁ బోవలయుఁగాని, యిట్టి స్థలములందుఁ జీవించుట నిరుపయోగము'' అని చెప్పెను. అంత నే నావృద్ధురాలిని దుఃఖాంబుధిముంచి వారణాసివదలి మంచుకొండకుఁ బయనమైతిని. నేను బయలుదేఱుచుండ నాముసలియామె నాతో ''నాయనా! నీయన్వేషణమునందు నీవు కృతకృత్యుఁడవయ్యెదవో లేదో నేను చెప్పఁజాలను. నీవు

సఫలుఁడవు కావలయుననియే నాయభిలాషము. కాని నాకుమాత్రము నమ్మకము లేదు. నేను ముసలిదానను. కాటికిఁ గాళ్లుచాఁచుకొనియున్నాను. నేను మరణించినపిదప నేదియైనఁ దెలిసికొంటినేని, దానిని నీకుఁ దెలియఁజేయఁ బ్రయత్నించెదను" అని చెప్పెను. ఆమెమాధుర్యమునకు నాకు నవ్వువచ్చెను. "తల్లీ! నీకంతటిశక్తి యున్నదని నాకుఁ దెలియును. నీకు శతాయువౌఁగాక! అమ్మా! కరుణించి, నాకు దీవనలిమ్ము" అని నేఁ బ్రార్థించితిని. ఆమె నన్ను దీవించెను. నేను బదరీనాథమునను, ఋషికులమునకు బయలుదేఱితిని. ఆ క్షేత్రములందు ఋషీంద్రులుందురని నేను వినియుండుటఁజేసి, వారివలన నా సమస్యకుఁ బరిష్కారణభాగ్య మొదవఁగలదని మోదమందితిని. ఉజ్జయినివిడచిననాఁటినుండియు నాప్రయత్నములన్నియు గహనచంద్రికలగుచున్నను, నాయపేక్షమాత్రము నానాఁటఁ దామరతంపరలగుచుండెను.

పలుశ్రమలఁబడి, నేను బదరీనాథము చేరఁగలిగితిని. అచటి ఋషిబృందముఁ గాంచి నాస్వాంతము ప్రమోదసంభరితమయ్యెను. ఇట నా సమస్య చాలవఱకుఁ బరిష్కారమగునని నేఁదలంచితిని. "నీసమస్యను బరిష్కరించుసామర్థ్యము మాకుండినయెడల, మే మీబదరీనాథమునం దుండుటకు బదులు, దేశదేశములఁ జరించుచు, జనుల కీతత్త్వజ్ఞానము నుపదేశించి, వారల నుద్ధరించియుండమా?" అని నేనడిగిన ప్రతిఋషియుఁ బ్రత్యుత్తరమొసంగెను. అంతఁ గొన్నినాళ్లు బదరీనాథమునఁ గడపి, ఋషికులమునకుఁ బైనమైతిని. ఇచట నేనొకత్రిదండిఁ గాంచి, నాప్రశ్న నడుగ నాతఁడు "ఓహో! ఈసమస్య మున్నెన్నఁడో పరిష్కరింపఁబడియున్నది" అని చెప్పెను. "ఎవరివలన? ఎక్కడ?" అని నేనొకగ్రుక్కలో నడిగితిని. "ఉపనిషత్తులయందును, అందును ముఖ్యముగా భగవద్గీతయందు" అని యాతఁడనెను. ఆగ్రంథముల నంతకుముందు నేను జదువలేదు. కాని వానిఁబడసి మిగుల నాతురతతోఁ బఠించితిని. నిజమే. ఆగ్రంథములయం దీసమస్య యున్నది. పరిష్కరింపఁబడికూడ నున్నది. కాని యాగ్రంథములయందు నా

ప్రశ్నకుఁ దగినయుత్తరము తృప్తికరముగా లేదు. మరణమునకై మానవుఁడు దుఃఖించుట తగదనియు, నాపదలన్నింటికంటె మరణము దుఃఖప్రదముగా దనియు నందుఁ జెప్పఁబడియుండెను. అంతవఱకు నాసమాధానము సంతృప్తి కరమై యున్నదనుటకు సందియము లేదు. వేదనానలమునఁబడి మ్రగ్గుప్రాణుల కట్టి యమూల్యమగు నుపదేశమున నూఱట జనింపఁగలదు. కాని నాసమస్య యేమి. పుట్టువునకుఁ బూర్వదశను, చావున కపరదశను గనుఁగొన నెంచి యుండు నాకు భగవద్గీతయందుఁగాని, ఉపనిషత్తులయందుఁగాని సంతృప్తికర మగుసమాధానము లభించదయ్యెను. అపవిత్రగ్రంథపఠనమున నాజ్ఞాన మతిశ యించినది కాని నాసమస్యమాత్ర మపరిష్కృతమైయుండెను. ఇందులకై నేను చింతించుచుండ నొకమునీశ్వరుఁడు నాతో "మానససరోవరతీరములకుఁ బోయి కైలాసశిఖరమూలమున దపమొనరింపుము. శివపీఠముకడ ఘోరతప మొనరించి వరమును బడయని మానవుఁడు లేఁడు." అని చెప్పెను. అతని బోధనామృతమును గ్రోలి, హిమాలయముదాఁటి సౌందర్యనిలయమగు మానస సరోవరము చేరితిని. ఆకాసారమును వర్ణించుటకు శేషుఁడైనఁ జాలఁడన నే నెంతవాఁడను; అయ్యది వివిధవర్ణశోభితమై నేత్రపర్వ మొనరించుచుండును. హిమాచ్ఛాదితములై యంబరచుంబితములై యుండుపర్వతశిఖరములు దానిఁ జుట్టుముట్టియుండును.అమృతప్రాయములగు నాసరసి సలిలవీచికలరాయంచలు మిగుల నుల్లాసమున దేలియాడుచుండును. నానాజాతులగుమృగపక్షిసంఘ ములు స్వజాతివైషమ్యముల వీడి యన్యోన్యసోదరభావమున నాకొలనిగట్టుల సంచరించుచుండును. అహా! ఆకాసారసౌందర్యప్రభల గన్నులారఁ గాంచ వలయునేకాని, యిట్టిదని యూహింప నసాధ్యము. దివ్యానందబంధురమును, నతులితమనోజ్ఞకరము నగునట్టిప్రదేశము ధరణీస్థలి నున్నందులకు విస్మయ మగుచున్నది. శాంతాభిలాషులగుబద్ధాత్ముల కాప్రదేశము సముచితమైయుం డును. అచట నేనొకయాశ్రమము నిర్మించుకొని యాయడవినుండు కాయ గసరులఁ దినుచు నాదివ్యసరస్సలిలముల స్నానమొనరించుచుంటిని. అనద్భుత

శోభాభాసమానమగు నట్టిదృశ్యనిర్మాణమునఁ దనమహాశక్తిని బ్రకటించిన, సర్వశక్తిసంపన్నుఁడగు సర్వేశ్వరుని ధ్యానించుచు నచటఁ గాలము గడపు చుంటిని. అచట నేనుండినమూఁడేండ్లును శాంతిప్రదములై సౌఖ్యావహములై యుండెను. ఆమూఁడేండ్లును నాకు మూఁడుక్షణములవలె నుండెను. ఈవిధమున దినములపై దినములు పడిపోవుచున్నను, నేను వానిని గణించినవాఁడఁగాను. ఆప్రదేశమున నంతహాయిగా నుండెను. కాని నాసమస్యనుమాత్రము నేను వదలలేదు. రెండుసంజలయందును, రాత్రింబవళ్లందును, నాసందేహాధ్వాంతమునఁ బ్రజ్ఞానజ్యోతి వెలిఁగింపుమని దైవమును ధ్యానించుచుంటిని. ఆకొలని కరుఁడెంచుయాత్రికు లందఱను నాసమస్యఁ గూర్చి ప్రశ్నించుచుండెడివాఁడను. కడకుఁ బతంగకూజితములను మృగారావములనుగూడఁ జెవివిచ్చి యాకర్ణించుచుంటిని. కాని నాప్రయత్నము లన్నియు విఫలములగుచుండెను. నాసమస్య కట్టుకదలక నిలిచియుండెను. మానవుఁడు తనజీవితకాలమునందు జీవన్మరణరహస్యములు గ్రహించుట శ్రేయస్కరము కాని భగవంతునియభిప్రాయము కాఁబోలు! "ముక్కున నూర్పుండువఱకు నీసమస్యను విడువరాదు. ఇఁక నచటనిలుచుట నిరుపయోగము." అని దృఢపఱచుకొని, బుద్ధభగవానుని జన్మస్థానమగు లుంబినీవనమునకుఁ బోయితిని. అచట నశోకుఁడు ప్రతిష్ఠించిన శిలాస్తంభ ముండెను. నేను దానియెదుట నిలుచఁబడి "ఓమానవోత్తమా! నా కీవర మొక్కదానినిమాత్ర మనుగ్రహింపుము. ఈపుట్టువునకు మానవుం డెచటినుండివచ్చినాఁడు? మరల మరణించి యెటకుఁబోనున్నాఁడు?" అని పెద్దగా నఱచితిని. కాని సమాధాన మేమియు లేదు. దాపుననే తపమొనరించిన బౌద్ధభిక్షువులు కొందఱు నాకడ కరుఁదెంచి "ఈవిధమునఁ బ్రశ్నింప నీ వెవరు?" అని యడిగిరి.

"అజ్ఞానాంధకారుఁడను. తథాగతునిప్రజ్ఞానదీప్తులచే నాయజ్ఞానాంధకారము మాసిపోవలయును."

భిక్షువు:—అతఁడు సజీవుఁడైయుండిన నీకు సాయపడియుండెడి వాఁడు. ఇపు డాపురుషోత్తముఁడు పరమపద మలంకరించియున్నాఁడు. ఇఁక నదెట్లు వీలగును?

నేను:—ఇప్పు డాతఁ డధికతరప్రజ్ఞావంతుఁడై యుండును. జీవితానంతరముగూడ మతప్రవక్తలు తత్త్వములఁ బ్రసాదించుచుందురు. వారు మహామహులుగదా!

"అవును. అది నిజము. నన్ను బ్రయత్నింపనిండు." అని మఱియొక బౌద్ధభిక్షువు, చెంగటనుండు బుద్ధవిగ్రహమున కెదుట మోకరించి "నమో భగవతో అర్హతో బుద్ధస్స. బుద్ధం శరణం గచ్ఛామి. సంఘం శరణం గచ్ఛామి. ధర్మం శరణం గచ్ఛామి.—ఓపరమపవిత్రమూర్తీ! పుట్టువునకుఁ బూర్వదశను, మరణమునకుఁ దరువాతదశను మాకుఁ దెలుపుము" అని ప్రార్థించెను.

కాని యెట్టిసమాధానమును లేదు. మఱియొకసన్న్యాసి యాతనిఁ గాంచి "నీధర్మమును బాగుగాఁ బరిశీలింపుము. అంతయు దానియందే కనుఁగొనఁగలవు" అని చెప్పెను. దానికి మొదటివాఁడు "సోదరా! నిజమాడితివి. ధర్మమును సమూలముగ నెఱుంగుట కెవ్వరుఁజాలరు." అని యుత్తరమొసంగెను. "మీధర్మపథమునందు నాసమస్య పరిష్కరింపఁబడియున్నదా?" అని నే బ్రశ్నించితిని. "దానియందుఁ బరిష్కరింపఁబడనివిషయమే లేదు." అని రెండవయాతఁ డుత్తరమిచ్చెను. అంత నేను బ్రక్కనుండు మఠమునుండి '.ధర్మపథము' (దమ్మపదము)ను దీసికొని, పుట్టుకకుఁ బూర్వదశనుగుఱించియు, చావునకుఁ దరువాతిదశనుగుఱించియు బుద్ధునిసిద్ధాంతము లన్నింటిఁ బలుమారు పఠించితిని. దాన నాకెంతయో యూఱటకలిగినది; కాని యకటా! నాసమస్యమాత్ర మసంస్కృతమైయుండెను. కరుణానిధులగు నాయతీంద్రుల కీసంగతిని, నేను విన్నఁదనముగాఁ దెలియపఱచి, తత్త్వమార్గణమునకై మరలఁ బయనమైతిని. తరువాత, మహాత్ముఁడగు నశోకుఁడు నివ

సించుచుండిన పాటలీపుత్త్రమునకుఁ బోయితిని. అచటఁ బాఠశాలలును, మఠములును లెక్కకు మిక్కిలిగాఁ గలవు. కాని యాసార్వభౌమేంద్రుని కాలమునందువోలె, నిప్పు డయ్యవి పటుత్వములై సంస్తుతిపాత్త్రములై యుండుట లేదు. ప్రమదావనపరివృతములై బ్రహ్మాండములై యుండు ప్రాసాదరాజములఁ గాంచి దైవసృష్టివైచిత్త్ర్యమునకు నేను వెఱఁగందితిని. ఆహార్మ్యనిర్మాతలందఱు కాలగర్భమున లీనమైపోయినను, నాప్రాసాదములుమాత్త్ర మట్లే చెక్కుచెదరక నిలిచి 'మానవజీవితము బుద్బుదప్రాయము' అని చాటునటులుండెను. ఒకనాఁ డొకపండితశ్రేష్ఠునితో వాదించుతఱి "నీవు జననమరణమర్మమును భేదింపవలయుననిన, నొకవైద్యశాలకుఁ బోవుట యుత్తమము. అచ్చోట శిశుజననములు, మానవమరణములును సర్వసాధారణములుగ నుండును." అని యాతఁడు సెలవిచ్చెను. ఆయోజన యుక్తియుక్తమని తలంచి, పట్టణమందలి ప్రధానవైద్యశాలకుఁ బోతిని. ఆవైద్యాలయము మిగుల విశాలమైనది. ఆసంస్థమందిరము లొక్కచోఁ గుదించినట్లుండక, చెదరియుండు చిన్నకట్టడములచే నిండి, చుట్టును ప్రాంగణకుడ్యమును గలిగియుండెను. ఆకట్టడములలోనికి వెలుతురును గాలియు నిరాఘాటముగాఁ బ్రసరించుచుండెను. ఆగదులు మనభారతదేశశీతోష్ణస్థితి కనుకూలములై యుండెను. ఆచికిత్సాగారము పురాతనమైనది. సూర్యచంద్రగుప్తునకుఁ బూర్వముకూడ నాధర్మసంస్థ యుండెనని జను లనుచుందురు. ధార్మికశేఖరు లగు పౌరజను లావైద్యశాలను బోషించుచుండ, నొకపంచాయతీసంఘము వా రద్దానినిఁ బాలించుచుండిరి. ఆవైద్యశాలయందు వివిధవ్యాధులకు వివిధగదులు ప్రత్యేకింపఁబడియుండెను. సమర్థులగువైద్యు లనవరత మప్రమత్తులై యుండిరి. విశాలమగుప్రాంగణమునందు నానావిధములగునోషధులు పెరుగుచుండెను. ఒకమందిరమున వైద్యులు కొందఱు కషాయములను, ద్రావకములను సిద్ధము చేయుచుండిరి. వేఱొకయెడ నొకపాఠశాలయందు వైద్యశాస్త్రమును, ఔషధప్రయోగములను భిషగ్వరులు బాలురకుఁ గఱపుచుండిరి.

నేఁ బ్రసూతిగృహములకుఁబోయి నూతనాగంతుకులగు నాపసికూనల వలనఁ బుట్టువునకుఁ బూర్వదశను గనుఁగొన నెంచితిని. నాయస్మత్ప్రియయగు నొకదాది నన్నొకయెడకుఁ గొనిపోయెను. అచట నవసుకుమారులగు శిశువులు మువ్వురుండిరి. నేనొకబిడ్డకడకుఁబోయి "ఓ పాపా! ఓ దేవదూతా! నీపుట్టువునకు ముందు నీస్థితి యెట్లుండెను? దయచేసి చెప్పుము" అని యడిగితిని. ఆబిడ్డ నన్నుఁజూచి "అంతయు నాకుఁ దెలియును. కాని చెప్పుటకు మాటలురావు" అనుచున్నదో యన నవ్వసాగెను. అంత రెండవబిడ్డ కడకుఁబోయి మునుపవలెనే ప్రశ్నించితిని. కాని యాచంటిపాప "నాదుఃఖము నేలతడవుదువు? నేనుండినచోటికి, నీలోకమున కెక్కడిపోలిక?" అనుచున్నదో యన వెక్కి వెక్కి యేడువసాగెను. అంత మూఁడవబిడ్డకడకుఁ బోయి ప్రశ్నించితిని. వికచారవిందసదృశములగు నేత్రద్వయమునుండి భావగర్భితములగు వీక్షణముల నాశిశువు నాపైఁ బఱపుచుండెను. ఆపసిఁగూన తనపుట్టువునకుఁ బూర్వదశ నెఱుఁగఁ బ్రయత్నించియు, విఫలప్రయత్నయగుచున్నదనుకొంటిని. నాస్వాంతము శోకనిమగ్నమయ్యెను. ఆశాభంగమొంది ప్రసూతిగృహముల వదలివచ్చితిని. ఆదాది నావెతను గాంచి "నీ వెక్కడనుండిన నేమి? ఈరహస్యభేదనము మానవున కసాధ్యమని నీ వెఱిఁగియుండవలసినది. ఎన్నియో శిశుజన్మలను నేఁగాంచియున్నాను. కాని యీసమస్యాపూరణము నావలనఁగాలేదు. అట్టుండ నీవిపు డీమువ్వురు శిశువులనుండి యెఱుంగఁ బ్రయత్నించుచున్నావు గదా!" అనెను. ఆమెకడ నేను సెలవు దీసికొని, ప్రక్కగదుల యమలోకద్వారమును డాయ సంసిద్ధులై యుండు రోగులకడ కేగితిని. ప్రసూతిగృహములకును, మరణమందిరములకు నెంతయు వ్యత్యాసముండెను. దివ్యహాసములు, శిశురోదనములచట శ్రవణానందములై యుండ, రోగులదుర్భరవేదనారావము లిచట హృదయవిదారకములై యుండెను. కుట్టాపిరితోనుండు నొకమానవుని సెజ్జ పజ్జఁజేరి, నే నామందభాగ్యుని చేయిపట్టుకొని "వత్సా! నీకిపు డెట్లున్నది?" అని

ప్రశ్నించితిని. దాన నారోగి క్రుద్ధుఁడై "ఓరిక్రూరుఁడా! నేను 1,00,C00 పణముల నిలోకమున వదలిపోవుచున్నానురా! అధనమును నామరణానంతర మనుభవించువా రెవరున్నారు? ఒక పెద్దయింటిని, చాలభూములను, ఏడావు లనుగూడ వదలిపోవుచున్నాను. అయ్యోయ్యో! నేను వీని ననుభవించుట కొఱకు, దైవము నాకు మఱివత్సర మాయు వియ్యఁగూడదా?" అని యేడువసాగెను. అట్టిసమయముల నైహికవాంఛల విడువవలయునని నే నాతనికి బోధించితిని. దాని కాతఁడు మండిపడుచు "అయినఁ గావలసిన దేమి?" అని యడిగెను. ఇఁక నట్టివానితో నేమిమాట్లాడి యేమియుపు యోగముండును! కాన నేను మృత్యువదనముఁ జొరఁబడనుండి వేఱొక రోగిని జూచితిని. అతఁడు మరణమాతన కోర్వఁజాలక యల్లాడుచు "అయ్యో! అయ్యో! నాభార్య. నాబిడ్డలు. అయ్యోయ్యో! నేను మరల మిమ్ముఁ జూడఁజాలనుగదా!" అని పెద్దపెట్టున నేడ్చుచుండెను. నేను వెడఁగంది మఱియొకనిఁ జేరితిని. మృత్యుకోఱలఁ జిక్కియున్నను, నారోగి నిర్వికారుఁడై యుండెను. ఆసౌమ్యమూర్తియందు దివ్యతేజము తొలఁకాడుచుండెను. నేనాతని జూసి, వినయాంజలినై "నీకిపు డెట్లున్నది?" అని యడిగితిని. "ఆహా! సుఖముగా నున్నది. భవిష్యదవస్థ నెఱుంగుటకు నేను మిగుల నాతురతతో వేఁచియున్నాను." అని యాతఁడుత్తరమిచ్చెను. "పరలోకము నీకు కన్నులకుఁ గట్టుచున్నదా!" అని నేఁ బ్రశ్నించితిని. "ఏమియు లేదు. నాభక్తి దైవమందు నిశ్చలమైయున్నది. కరుణానిధియై యుండదక యాతనికి విధిలేదు. నన్నుద్ధరించుటకై శివకేశవులఁ బ్రార్థించుచున్నాను. వారు నామొఱనాలింతురని నాకు నమ్మకమున్నది" అని యాతఁడనుచుండఁగనే యూతనికంఠస్వరము సన్నగిలెను. "శివశివా!" అని యాతఁడు మందముగఁ బలికి కన్నులుమూసెను. అతనియధరమున మందహాసాంకురములు తాండవమాడుచుండఁగనే, జీవము లంతలో లేచిపోయెను. ఒకనిముసముక్రింద నిహలోకమున నాయెదుటనుండిన యాతఁ డింతలో

ఇచటికిఁ బోయెనా యని దీర్ఘముగా నాలోచించుకొనుచు నట్లే యొక క్షణము నిలిచియుంటిని. నావిస్మయ మపారమై యుండెను. ఆమానవుఁడు సౌఖ్యముగఁ బరలోకయాత్ర సల్పుటను నేఁగాంచి “మరణమునిక మహావిపత్తుగా జనులు భావించుటకుఁ గారణములేదు” అని నిర్ధారణ మొనరించుకొంటిని. చూచుచుండఁగనే మాయమైన యామానవుఁడు, దివినుండి భువికి వ్రాలి యంతలో నదృశ్యమైన నక్షత్రమును దలఁపింపఁజేసెను.

అంత నావైద్యశాలవదలి యీవలవచ్చి యిఁకఁ బాటలీపుత్రము నందలి నాయునికి నిరుపయోగమని గ్రహించి, నలందానగరమునకుఁ బోయి, తరువాతఁ దక్షశిలకుఁ బోయితిని. నాయాశాభంగముల వినిపించి, మీకు విసుగుఁగొల్ప నేల? నాసమస్యాపరిష్కరణమునకుఁ దోడ్పడఁగలపండితుఁ డా విశ్వవిద్యాలయములఁ గానరాలేదు. తక్షశిలయం దొకపండితప్రకాండుఁడు “మనకడ మానవప్రజ్ఞమాత్రమున్నది. పుట్టుకకుఁ బూర్వము మానవుఁడు కాఁడు. మరణమున కనంతరము మానవుఁడు కాఁడు అవశేషము మానవుని కందుబాటులో లేవు. అయ్యవి మానవాతీతమండలమునకుఁ జెందియున్నవి. కాని మాబోఁటివారలను సందిగ్ధములగు నిట్టివిషయములఁ గూర్చి ప్రశ్నించి నిరాశఁ జెందుటవలని యుపయోగము లేదు.” అని నాకుపదేశించెను. నేనాయుద్బోధన యందలి నిజమును గ్రహించి, యటనుండిఁ బోవుచుండ నాతఁడు మరల నాతో “ఒక్కమనవి. నీవు నీసమస్యను బరిష్కరింపఁజాలితివేని, వచ్చి మీవిశ్వవిద్యాలయమునకు దయచేసి తెలియఁజేయుము. నీపుణ్యమున రానున్న తరములవారు తరింపఁగలరు.” అని చెప్పి బ్రతిమాలెను. అట్లే యని మాటయిచ్చి నేను బయలుదేఱితిని. వీథియం దొకవృద్ధుఁడు నాకగపడి “నీముఖము వాడియున్నది. కారణమేమి?” అని యడిగెను. అతనికి నాసమస్యను వినిపింప నాతఁడు మందస్మితమొనరించి “భోగదోషముల మునుఁగుచుండు నిట్టిపాడు పట్టణములయం దేల వెదకుదువు? సింధునదికిఁ బూర్వదిక్కునుండు యెడారులకు నీవు పోవుట మంచిది. అచటిజనులు నిష్కళంకులు. సరళస్వభావులు.”

అని నుడివెను. తోడనే నే నాయెడారికిఁ బయలుదేఱితిని. అపయానమున నాకుఁ జాలశ్రమకలిగినను, నాకార్యసాఫల్యమునకు విశ్వప్రయత్నము లొనరింపవలయుననుసంకల్ప మింకను దృఢమయ్యెను. కడకు నే నాయిసుకప్రదేశము చేరితిని. ఆహా! సారవంతములును, సస్యశ్యామలములునగు గంగామైదానములకు నాసైకతప్రదేశమునకు నెంతయో వ్యత్యాసముకలదు. ఆయెడారి పశుపక్షిపాదపతృణరహితమై యుండుటయేఁగాదు, విజనమై విసుఁగుఁగొల్పుచుండెను. అచట నిశ్శబ్దముగానుండి బావురు మనుచుండెను. కావలయునని వెదకినఁదప్పు, నచట మానవునిపొలఁకువయే కాన్పించుటలేదు. అచట సూర్యాతపము దుస్సహమైయుండెను. మంటలులేచు నాయెండలో నసుగెత్తి యడుగుపెట్టుటకంటెఁ బ్రాణముపోయినను మేలనిపించుచుండును. కాని లొట్టియమాత్ర మావిపరీతప్రదేశమున జీవించుటకు సాహసించినది. సాధుమృగము నాయొంటె నిర్విచారముగ నాయిసుకతెల్లభూములఁ బయన మొనరించుచుండును. ఎడారులయందు మానవజీవితమున కూఁతకోలగాఁ బరమేశ్వరుఁ డీలొట్టియను సృష్టించె ననవచ్చును. ఈయెడారులలోని కొన్నినూతులు రెండువందలయడుగులలో తుండును. అందలినీరుతోడుటకు నలుగురైదుగురు కొకటిగాఁ జేరవలయును. ఒకయెడఁ గొందఱు నీరుచేఁదుచుండిరి. నేను వారికడకుఁబోయి "పుట్టుకకుఁ బూర్వదశనుగాని, యపరదశనుగాని మీరు నాకుఁ జెప్పఁగలరా?" అని యడిగితిని. అందులకు వారు "మేము చెప్పఁజాలము. కాని జననమరణమునకు మధ్యదశనుమాత్రము చెప్పఁగలము. ఆదశ ననుభవించు మాకిప్పుడు చావుపుట్టుకలకంటెఁ గష్టముగా నున్నది. ఈదశ మాకిపుడు దుస్సహమైయున్నది." అనిరి.

నేను:—ఇట్టిసమస్యలమునిఁగి తపస్సమాధినుండు ఋషీశ్వరుఁ డెవ్వరైన నీప్రాంతములఁగలఁడా?

వారు:—లేఁడు. అట్టిసోమరులకు నీదేశమునఁ ద్రాగుటకు నీరైనదొరకవు. ముఖ్యతమములగు నుదరంభరిత్వసమస్యలిచటఁ బ్రతిమానవుని వేధించు

చుండును. అట్టియెడ నీసమస్యాపరిష్కరణమును దలపెట్టుట కిచట బుద్ధి యెట్లుండనోపును?

వారిమాటలకు నాకు నవ్వు పెల్లగించుకొనివచ్చెను. వారిలో నొకఁడు నన్నుఁ గాంచి "మీగంగామైదానములందువలె నిచట సోమరిపోతులు లేరు." అని హేళన మొనరించెను.

అనంతరము నేను సోమనాథపురమునకుఁ బోయితిని. కాని యుపయోగము లేదయ్యెను. అచటినుండి కంచి, కార్కల, కాయాలునగరములకు వెళ్లితిని. కాయాలునుండి నావపై సుమత్రాద్వీపమునకుఁబోయితిని. ఆ సముద్ర మధ్యమునందైన నాసమస్యను బరిష్కరింప ననుగ్రహించుటకు దైవమును బ్రార్థించితిని. కాని యన్నియుం వమ్ములయ్యెను. అంత సుమత్రాయందు ఇంద్రగిరినదీతీరమునఁ దప మొనరించుచుండిన ఋషీంద్రు నొకనిఁ గాంచితిని. నే నాతని డాసి, నాసమస్యాభేదనమున కుపాయము నాశించితిని. అందుల కాతఁడు "నాకంతశక్తిలేదు. మానవమాత్రుఁ డందులకుఁజాలఁడు. ఈపరమరహస్యము మనకుఁ దెలియకుండుట మనమంచికని నాయభిప్రాయము" అని సెలవిచ్చెను.

నేను:—ఏల?

అతఁడు:— తెలిసియేయుండిన, జీవితముపై మనకుఁ బ్రాణము పిసిఁగి యాత్మహత్యఁ గావించుకొందుము. పూర్వాపరదశలు మనకు గూఢముగ నుండునంతవఱకు మనము పాపభీతులమై పుణ్యసంపాదన మొనరించుచుందుము.

నేను సుమత్రానుండి జావా, మధుర, బలి మొదలగుప్రదేశములకుఁ బోయితిని. కాని నాయత్నములన్నియుఁ బుచ్చకుఁ జేవయెక్కిన ట్లయ్యెను. బలినుండి నేఁ గాంభోజమునకు వెళ్లితిని. కాని ప్రయోజనములేకపోయెను. నేను మరలఁ దామ్రలిప్తికిఁ దిరిగివచ్చి, జగన్నాథముమీఁదుగా నర్మదానదీకూలములకు వెళ్లితిని. ఈసుబంధువును నాసికపట్టణమునందుఁ గలిసికొంటిని.

కేమిరువుర మిచటి కరుదెంచితిమి. ఆహా! ఈతత్త్వాన్వేషణమున కెన్నిరో-జులుండ్లు శ్రమించియుఁ గడకు విఫలుఁడనైతిగదా! ఇఁక నెంతకాలము నే నెందులకు శ్రమింపవలసియున్నదో కదా! ఈభావములు నాస్వాంతమునఁ బొడచూపినపుడంతయు, విఫలుఁడనాదునేమో యని నాకు వేదనగలుగు చుండును. కాని పరమపవిత్రమగు భగవద్గీతయందు,

"శ్లో. కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన,
మాకర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽస్త్వకర్మణి.

కర్మయే ప్రధానము. ఫలములో నీకు నిమిత్తము వలదు. కర్మఫలము నకు నీవు కారణభూతుఁడవు కావలదు." అని చెప్పఁబడియున్నదిగదా! ఆ దివ్యబోధామృతము నప్పుడప్పుడు చవిచూచుచు, నేనూఱటఁ జెందుచుండెడి వాఁడను.

అజ్ఞానాంధకారుఁ డీవిధముగాఁ దనయనుభవముల వినిపించుచుండ, వారికి నశ్వఖురపుటధ్వానము వినవచ్చెను. అందఱివీక్షణము లావైపునకుఁ దిరిగెను. చల్లనివెన్నెలయం దొకరౌతు వారికభిముఖముగా నరుదెంచుచుండెను. అతఁడు ధర్మశాలసమీపించినతోడనే, గుఱ్ఱముదిగి, కళ్లెముఁబట్టుకొని ప్రాంగణములోనికివచ్చెను. అచట మఱియొకవారువము నాతఁడు గాంచి విస్మయ మంది, సత్రపువసారాయందుండువారలఁజూచి "ఎవరక్కడ? ఈగుఱ్ఱ మెవ రిది?" అని యధికారపూర్వకముగాఁ బ్రశ్నించెను.

యశో:—అది నాగుఱ్ఱము.

ఆగంతుకుఁ డామాటకు ముఖమంతయుఁ గన్నులుచేసికొని "దాని నటనుండి తొలఁగింపుము. అచట నాగుఱ్ఱమును గట్టివేయవలయును." అని యాజ్ఞచేసెను. వాని పొగరుఁబోతుతనము యశోధర్మకుఁ గోపముఁ దెచ్చెను. "ఓరీపలువా! నీపాడుగుఱ్ఱమును నీయిచ్ఛవచ్చినచోటఁ గట్టివేసికొనుము. నీ జీవితముపై నీకు విలువయుండినయెడల, నాగుఱ్ఱముజోలికి రాకుము." అని యూతఁ దఱచెను. "శాంతం శాంతమ్." అని యజ్ఞానాంధకార, సుబంధువులు

వారిక్రోధాగ్ని నార్ప నెంచి నూతనపురుషునితో "నాయనా! అంతరోషము తోఁ దగవులాడుటేల? నీకుముందే వచ్చిన యాతని, నీకై తొలఁగుమనుట నీకు భావ్యముగాదు." అని చెప్పిరి. యశోధర్మ ప్రచండభాషణములవలన నూతన పురుషుని యహంకార మెప్పుడో శమించెను. తప్పించుకొని బయటఁబడు తెలివెద్దియా యని యాతం డిప్పటికే యాలోచించుచుండెను. ఆయతీశ్వరుల సాంత్వనవాక్యములకు శాంతించినట్లాతఁడు నటించుచు, హాసన్ముఖుఁడై వారల డాసి వినయాంజలియై "పూజ్యపాదులగు మీయట్టియతిచంద్రుల యానతి మీఱుటకు నేనెంతవాఁడను. నేఁ గులీనుఁడను. ఉన్నతోద్యోగిని. కాన నావారువము నటఁ గట్ట నెంచి, యాగుఱ్ఱమును దొలఁగింప నీతని కాజ్ఞ చేసితిని. ఇందులకు నాకధికారము లేదా?" అని యాతఁడు నక్కవినయములఁ జూపుచుండెను.

యశో:—నీయుద్యోగ మేమి! నీయధికార మేమి? నీ వెవఁడవు?

వారుభయు లొకళ్లొకళ్లఁ జూచుకొనిరి. ఆగంతుకుఁడు మాఱుపలుకక "సరియె. నాయధికారము చెలాయించుటకు నేఁ బెనఁగులాడను. నేను గుఱ్ఱమును గట్టివైచి, రాత్రిభోజనమున కేర్పాటుగావించుకొందును" అని యాసన్న్యాసులతో ననెను.

---

# పధునెనిమిదవతరంగము.

---

## ఘోరమగుకుట్ర.

అతఁడుపోయినతర్వాత "ఆతఁ డెవఁడైయుండును!" అని సుబంధువు యశోధర్మ నడిగెను.

యశో:—నాకుఁ దెలియదు. కాని యాతఁడు క్షత్రియుఁడని నే ననుకొందును. ఆతనివేషవైఖరులు నాకు సంశయముఁ గొల్పుచున్నవి.

అజ్ఞా:—వత్సా! అనవసరముగా నెవ్వనిఁగాని సంశయింపఁగూడదు. ఈప్రపంచ మిప్పటికే పాడువాఱియున్నది. అన్యాయములగు పరస్పరసంశయములచే దీనిని నారకప్రాయము గావించుటెందులకు?

యశో:—నిజము. ఈదినములు మంచివికావు. గుడ్డినమ్మకము వినాశమునకు మూలము.

అజ్ఞా:—అవును. ఈదినములలో మానవులఁ బరీక్షింపనిదే. నమ్ముట వలన శారీరకహాని సంభవించునుగదా. సరియే. సంశయాళువు దుర్బలశరీరుఁ డగుటయేగాక, కాలక్రమమున నైతికప్రజ్ఞలఁగూడఁ గోల్పోవును. అది యటుండ, మనకు భీతినొంద నవసరమేమున్నది! హూణపాలనము మనకు దుస్సహమైయున్నను మన మాతనియెడఁ గుట్రలుగావించుటలేదు. అతనితోఁ బోరాడఁగడంగుటలేదు. కాని యాతనియనుచరులు, హూణశాసనబలమునఁ దమయిష్టానుసారము వర్తించుట కాటంక మేమున్నది?

సుబంధువు:—ఈహూణసేవకులటుండ! వివిధవేషధారు లనుగూఢచారులు గుంపులుగుంపులుగఁ జరించుచుందురు. హూణునకు వ్యతిరేకముగ వర్తించినను, మాటలాడినను, గడకుదలంచినను, వారద్దాని నాతని కందఁజేసి,

యాతనిచేఁ జిత్రవధలఁ బెట్టించుచుందురు. అగూఢచారులలోఁ గొందఱు కుహనాయతివేషధారులై యుందురనుటకు నాకుఁ జిన్నతనముగా నున్నది.

అజ్ఞా:—సరి. సన్న్యాసులందఱును దొంగసన్న్యాసులనుట నీవెఱుంగనిది కాదు. మనదేశమునఁ గలగణనాతీతయతిబృందమున వేయింటి కొక్కఁడు మాత్రము, ఆధ్యాత్మికచింతాసంపన్నుఁడై యుండునని నేఁ జెప్పవలసియున్నది; సన్న్యాసివేషము భిక్షాటనవృత్తికి లాభముగలిగించు ననుతలంపున, రమారమి తొమ్మిదివందలమంది కుహనాభిక్షువులై యుందురు. ఏఁబదిమంది విద్యావంతులై యుండియు నధ్యాత్మికపరిజ్ఞాన మెట్టిదో యెఱుంగక శమదమాది సౌజన్యవిహీనులై యుందురు. వైరాగ్యభావావేశమున నొక్కపెట్టుగాఁ దురీయాశ్రమమందు దూఁకి, యనంతర మాశివము సన్నగిల్ల లౌకికజీవనమునకుఁ దిరిగిన లోకదూషణకుఁ బాలాదుమని వెఱచియుండు 'విధిలేనియతులు' నలువదియుందురు. ఇంచుమించుగ తొమ్మిదిమంది కీర్తిసంపాదనమునకనియో, సలక్షణభోజనమునకనియో, అప్రయత్నలబ్ధవనితాసంగమమునకనియో, యిట్టి దొంగవేషముల నుందురు. ఇఁక మిగిలినయొక్కఁడే గూఢచారిగనో, యే హంతకుఁడుగనో, యేద్రోహాత్ముఁడుగనో, లేక యప్పులపాలై యాత్మరక్షణార్థము సన్న్యాసివేషమున దాగియుండు నేమోసగాఁడుగనో యుండును.

యశో:—నిజము. నీవును సన్న్యాసివికదా! ఇట్టి నిష్పక్షపాతవిమర్శనమునకు నీవు పూనుదువని నేను దలంపలేదు.

అజ్ఞా:—మహాత్ములని నీవు తలఁచుయతులయందుఁగూడ నీకెట్టినీచభావముండునదియుం దీనివలనఁ దెల్లమగుచున్నది. స్వపరతారతమ్యములను గమనింపక, సత్యమాడుట సన్న్యాసికిఁ బ్రథమకర్తవ్యమైయున్నది. పూజ్యమగు నట్టి కార్యమును విడనాడిననాఁ డాతఁడు సన్న్యాసియనుటకుఁ దగఁడు.

ఆతనిధోరణియందలిసత్యమును గ్రహించి, యశోధర్మ వ్యాఖ్యానమొనరింపక యూరకుండెను.

ఇంతలో నాయాగంతుకుఁడు గుఱ్ఱమునుగట్టివైచి, వెనుకకువచ్చి ధర్మశాలలోనికిఁ బోనుండ "వత్సా! నీపేరేమి? ఎక్కడనుండి వచ్చుచున్నావు?" అని సుబంధు వడిగెను.

అందుల కాతని కించుకకోపమువచ్చినట్లుండెనుగాని, యాతఁ డించుక సేపు వారిఁ గన్నార్పకచూచి "నాపేరు వాసుదేవుఁడు. యాధేయదేశము నుండి వచ్చుచున్నాను." అని చెప్పెను.

ఆతనిప్రత్యుత్తరము నాలకించి యెవ్వరు నేమియుఁ బలుకలేదు. ఇంతలో నాతఁడు సత్రములోనికిఁబోయెను. వాతవ్యాధి, కుణపదంతుఁడు, శుక్రాచార్యుఁడు, ఉదరానందుఁడు త్రోవలో నొకమూలఁ గూర్చుండి గుసగుసలువోవుట నాతఁడు గాంచి, వారంద ఱొక్కమొగముగాఁ దనపైఁబడఁ గుట్ర చేయుచున్నారేమోయని సంశయమొందెను. ఆతఁడు కంపితస్వరమున "ఎవరు మీరు?" అని వారి నడిగెను.

"వాతవ్యాధి, కుణపదంతుఁడు, శుక్రాచార్యుఁడు, ఉదరానందుఁడు" అని యామానవచతుష్టయ మొక్కమాఱుగా నఱచెను.

వాసు:—మీయుద్యోగము లేమైయుండునో?

"పండితుఁడు, మాంత్రికుఁడు, జోస్యుఁడు, సన్న్యాసి" అని వారు పైవరుసలోఁ జెప్పిరి.

వాసుదేవునిమనస్సు కుదుటఁబడెను. 'అబ్బ' అని యాతఁడు చింతాభరమును ద్రోసిపుచ్చి "ఓహో! ఇంతకు మీరుగూడ నావలెనే బాటసారులా?" అని పలికెను.

"నీపేరేమి? నీవెచటినుండివచ్చుచున్నావు?" అని వారంద ఱొకమొగి యాతనిఁ బ్రశ్నించిరి.

వాసు:—నాపేరు వాసుదేవుఁడు. నేను యాధేయమునుండి వచ్చుచున్నాను.

వాత:—యాధేయు లతిభయంకరులు.

వాసు:—అవును. వారివైరులకుమాత్ర మనుము.

వాత:—దైవానుగ్రహమున సేనావర్గమునఁ జేరియుండలేదు.

"మేముకూడ, మేముకూడ" అని కుణపదంత, శుక్రాచార్య, ఉదరానందు లొక్కమాఱుగా నఱచిరి.

వాసు:—ఇందుకు నాకు సంతోషముగా నున్నది.

అనంతర మాతఁ డాపథికచతుష్టయమును గొంచె మావలకుఁ గొని పోయి రహస్యముగా "మిత్రులారా! బైట వసారాలోఁ గూర్చుండియుండు యామువ్వు రెవ్వరు? ముఖ్యముగా నారా తెవ్వఁడు? మీరు నాకీసంగతి నెఱింగించినయెడల మిమ్ముఁ బసదనములఁ దృప్తిఁగావించెద. ఎఱింగింపకున్న యెడల నందులకు వెనుక వగవఁగలవు!" అని బెదరించెను.

వాత:—వారిసంగతి మాకుఁ దెలియదు. కాని వారిలో నిరువురు యతులనియు, నొకఁడు యోధుఁడనియు నేననుకొందును. ఎట్టులైననేమి? వారుమువ్వురును ప్రాణద్వేషులు. వారిచెలిమి సిలుగులకు మూలము.

వాసు:—మీమాట లర్థమగుటలేదు.

వాత:—ఒక్కయుదాహరణము వినుఁడు. వారు మిహిరగులు నాక్షేపించుచుండ మేమాక్షేపించితిమి. అందుల కాయోధుఁడు క్రోధభీషణభాషణముల మమ్ముఁ గసరెను. అంత నాతనికడనుండుట యుక్తము కాదని యిట నున్నారము.

"అవునవును" అని మిగిలినమువ్వు రనిరి.

వాసు:—ఓహో! అటులనా? అయిన నీసత్త్రాధికారిస్వభావము మీకుఁ దెలియునా?

వాత:—ఆహా! తెలియకేమి? అతఁ డొకవింతమనిషి. ఏండ్లు ముదిరిన వాఁడు. అతనిపేరు కమలాక్షుఁడు. ఈయుద్యోగముపై నాతని కంతయిష్టము లేదు. దీనివలన నాతనికిఁ దలవంపులుగానున్నవి. ఎవరైనఁ దన్నుఁ బరిహసించు చున్నారని యాతనికిఁ దోఁచినచో నాతని వారలతోఁ బోరునకుఁ గడంగు

చుండును. మానమున కాతఁడు పడిచచ్చుచుండును. ఇంతయేల? అచటనుండు యువకవీరుని కోపానలమును దరికొల్పుట కాతఁ డేమాత్రము వెనుదీయ లేదు. అన్నింటికంటె విచిత్రమేమనఁగాఁ, గడకుఁ గమలాక్షుఁ డాతనిఁ దిరస్కరించి యాతనిఁ బూరికిఁగూడఁ గొనలేదు.

వాసు:—ఇది మిగుల నాశ్చర్యకరమైనవిషయమనుటకు సందియము లేదు. మిత్రులారా! ఇంచుక సేపు నాకు సెలవిండు. లోనికిఁబోయి, యన్నమున కేర్పాటుగావించుకోవలయును.

అని యాతఁడు లోనికిఁబోయెను.

ఉద:—ఈతఁ డెవ్వఁడైయుండునో?

వాత:—ఖండితముగాఁ జెప్పఁజాలము. అహంకారులగు క్షత్రియు లెందఱో హూణుల చేతఁ గోలువాడఁగొట్టఁబడి యున్నారుకదా! ఈతఁడు గూడ నాదురహంకారులలో నొకఁడైయుండుటకు విస్మయమేముండును?

గుణ:—ఆతఁడు హూణగూఢచారి కాదని నీ కెట్లు నమ్మకము?

వాత:—అదియు సహజమైయుండవచ్చును. ఈదినములలో నెవరి గూఢచారు లెవరైనదియుఁ గనుఁగొనుట యసాధ్యముగా నున్నది.

శుక్రా:—అవును. నిజము. కన్నుమిన్నుఁగానని క్షత్రియాపసదులు కొందఱు చ్యుతరాజ్యులై, విధిలేక యిప్పుడు వారితోఁకలు ముడుచుకొని హూణపాదాక్రాంతులై యాతనివేఁగులంగాఁ బనిచేయుచు వాని మోచేతి క్రింది నీరు త్రాగుచున్నారుగదా!

ఆమాటల కందఱకు నవ్వువచ్చెను. కాని యానవ్వు బయటికి వినఁబడకుండునట్లుమాత్రము వారు నోటికిఁ జేతు లడ్డముంచుకొనిరి. ఏలయన, హూణుఁడు నిరంకుశుఁడు. ఇట్టి సంభాషణలు నిరుపద్రవకరములైనను, హూణుని చెవులఁబడినచోఁ దగినవిధమున శిక్షింపఁబడుట వారికిఁ దెలియును. 'ప్రాణములుండిన బలుసాకుతినియైన బ్రతుకనగును' అని వారి

మతము. అందుచే వారు తమప్రాణసంరక్షణార్థము తగుశ్రద్ధఁ దీసికొనుచుండిరి.

వాసుదేవుఁడు లోనికిఁజని, వంటయింటిలోని కడుగుపెట్టునప్పటికిఁ గమలాక్షుఁడు ముక్కాలువంట ముగించియుండెను. ఆవంటయిల్లు ఇంచుమించుగ నాలుగైదంకణములు పొడుగుఁగల యొకనిడుపాటిగది. ఆగది యం దొంటివత్తిదీప మొకటి వెలుఁగుచు, మందకాంతులనంతట నించుచుండెను. ఒకవైపు గనగనమని నిప్పు మండుచుండెను. దానిపై నెయ్యదియో పాత్రలయందు సలసలఁ గ్రాఁగుచుండెను. కట్టెలు సగము ప్రొయ్యి యీవలకువచ్చి, బాగుగా మండుచుండెను. ఆప్రొయ్యి నానుకొని యుండుగోడ యెంతకాలమునుండియో పొగచూరి నల్లగానుండెను. ఆమంటలవెలుతురు వెనుకనుండు కాటుకగోడపై వ్యాపించి, దానిని ధగధగమని మెఱయింపఁ జేయుచుండెను. ఆప్రొయ్యి కెదురుగా, ద్వారమునకు వీఁపుద్రిప్పి కొండంత మానవుఁ డొకఁడు నిలిచియుండెను. అతఁడు నడుమునకొక తుండుగుడ్డనుమాత్రము గట్టుకొనియుండెను. అతనికుడిచేతి నొకగరిటె యుండెను. అతఁడే కమలాక్షుఁడు. అతని కమితముగాఁ జెమటపోసియుండెను. ఆగదికుండు చిన్నకిటికీ నొక్కదానిని, యాద్వారమును మూసియుంచుట కాతఁ డేమరినవాఁడుకాఁడు. గాలివలన మంటచెదరిపోకుండుటకై యాతఁ డాకిటికీని గూడ మూసియుంచెను. ఉదరానందాదిమహానుభావులు నలువురు తన పని కడ్డుతగులకుండుటకై ద్వారమును బంధించెను. వాసుదేవుఁడు వంటయింటికిఁ జొచ్చునప్పటికిఁ గమలాక్షుఁడు ప్రొయ్యిపైనిబాణలి కలియఁబెట్టుచుఁ గాళిదాసమహాకవికృతములగు శృంగారశ్లోకములను వినోదార్థము పఠించుచుండెను.

తలుపుదీయుచప్పుడి నాలకించి, ఉదరానందాదులలో నొకతిండిపోతు లోనికి వచ్చుచున్నాఁడనుకొని, కమలాక్షుఁడు వెనుకకుఁ దిరిగిచూడకయే "నాయానతిలేక యీగదియందుఁ బ్రవేశించువాఁ డెవఁడు?" అని

కోపములో నణఁచెను. వాసుదేవుఁడు తనజేబునుండి నాలుగుబంగారునాణె
ములఁదీసి కమలాక్షునిఁజూచి "ఓమిత్రుఁడా! కమలాక్షా! నేను. ఇదిగో
వీనిఁ దీసికొనుము." అని యానాణెము లాతనిచేతియం దిడెను. ఆహేమ
నాణెములు తళతళకాంతులకును, ఘలుఘల్లు మనుశబ్దమునకుఁ గమలాక్షుని
కన్నులు పచ్చనయ్యెను. అతఁడు తనకన్నులఁ దానే నమ్మలేకపోయెను.
అట్లే యాతఁ డానూతనపురుషునిఁ గాంచుచుండెను. కమలాక్షునివంటి
మానవులను వశవర్తులఁ జేసికొనుశక్తి, బంగారమునకున్నదని వాసుదేవునకుఁ
దెలియును. ఆస్వర్ణమణి ప్రభావమునఁ గమలాక్షుఁ డొందుమార్పుల
గమనించుచు వాసుదేవుఁడుగూడ నట్టే తెప్పలార్పక యాతనిఁ గాంచు
చుండెను. నూతనపురుషుని నిజచారిత్రము కమలాక్షునకుఁ దెలియదు.
ఇప్పటివఱ కాతని ముఖపరిచయమైనఁ గమలాక్షునకు లేదు. అట్టియెడ
నాతఁడు తన్ను 'మిత్రుఁడా!' యని సంబోధించుట నూతనికిఁ గర్ణరసా
యనమై, విస్మయకారణమై యుండెను. వాసుదేవుఁడు మహోరస్కుఁడు.
ఆతనివదనము సుస్థిరగంభీరభావద్యోతకమై యుండెను. పెండ్లియనినఁ
బొంగుటయు, మరణమనినఁ గ్రుంగుటయు నాతనిప్రకృతికి విరుద్ధములని
చూపఱకు వ్యక్తమగుచుండెను. కాని కమలాక్షునకుమాత్రము తనయెదుట
నుండువాసుదేవుఁడు, సర్వేశ్వరుఁడగు వాసుదేవునికంటె నధికుఁడై కాన్పించు
చుండెను. ఏలయన, నాసర్వేశ్వరుఁ డగువాసుదేవుఁడు తాను కరుణా
నిధియనియు, భక్తచింతామణియనియు నేతిబీరకాయరీతిఁ బేరుపెట్టుకొని
యున్నాఁడని యాతని యభిప్రాయము. ఆవాసుదేవుఁడు కమలాక్షున
కీక్షణమువఱకు రాగిరువ్వయైన నిచ్చియుండలేదు. ఇఁక నీప్రత్యక్ష వాసు
దేవుఁడో, యగపడియు నగపడకముందే నాలుగు బంగారునాణెములఁ
బహూకరించినాఁడు. కమలాక్షుని హృదయాంబుధియందు సంతోషతరం
గము లంబరము నంటుచుండెను. అతనిమానసము తన్మయతఁ జెందియుండెను.
అట్టిదానశౌండుని దానెట్లు భూషింపవలయునో యాతనికిఁ దోఁచలేదు.

తనమూకీభూత మాపేదలపాలిటిపెన్నిధి యౌదార్యగుణము నణఁచివేయుం జేసెనో యని యాతఁడు దిగులొంది "ఓమహాప్రభూ! ఓమహాప్రభూ! మీరు నాయెడఁజూపిన నిరుపమాన దయాదాతృత్వములకు నాహృదయపూర్వకవందనము లేరీతి నర్పింపవలయునో నాకుఁ దెలియకున్నది. ఏమి యుపకృతిఁగావించి మీఋణవిముక్తుఁడఁ గాఁగలను. మీకొఱకై నాయొనరింపఁదగిన దేమికలదు?" అనెను.

వాసు:—కావలసినంతకలదు.

కమలాక్షున కాశాభంగమయ్యెను. అతఁడు వాలకమున కట్లనియెనే కాని, మనఃపూర్తిగ ననియుండలేదు. అతని కృతజ్ఞతాభివందనముల కిట్టి యుత్తరము రానున్నదని, యాతఁడు తలంచినవాఁడు కాఁడు. అతని కెక్కుడలేనిభయము కలిగెను. "ఏమీ! నాసేవలఁగొనుటకు నీవీధనము నొసంగితివా?" అని యాతఁ డప్రయత్నముగాఁ బలికెను.

వాసు:—కమలాక్షా! వేగిరపడకుము. దీనిని నీకు బహూకరించితిని. నీసేవ నాకుఁ గావలసినయెడల, దానికై నీకుఁ దృప్తిగా ధనమిచ్చెద.

కమలాక్షునిమానసాబ్జము, వాసుదేవునిమాటలయుఱవడిచే నాశాడోలికలపై వెనుకముందున కుఱ్ఱూఁత లాఁగసాగెను.

వాసు:—మిత్రమా! కమలాక్షా! నన్నుఁగూడ నతిథులపట్టికి జేర్పుము.

కమ:—ఎప్పుడో చేర్చితిని. మిమ్ము బంగారుకాళ్లయ్యను గాంచియుం గాంచకపూర్వమే, మీపేరు నతిథులజాబితాయం దెక్కించితిని.

వాసు:—కృతజ్ఞుఁడను. అన్నము సిద్ధమైనదా?

కమ:—ఉడుకుచున్నది. ఒకయరగంటపట్టును. నీకాఁకలియగుచున్నదా?

వాసు:—లేదు. అంతగాలేదు. ప్రొయ్యికడ నీవుండవలయునా?

కమ:—అవసరములేదు. అన్నియుఁ గలియఁబెట్టితిని. ఇఁక నాపదార్థము లుడుకఁబట్టవలయును. అవి యుడికినతర్వాత, నుప్పుకారమువేసి తిరుఁగఁబోఁతపెట్టవలయును.

వాసు:—ఓహో! అటులనా? అయిన మన ముభయులము పదినిమిషములసేపు మాట్లాడుటకు నీకుఁ దీరికయుండు ననుకొనియెదను.

కమ:—దేనినిగుఱించి?

వాసు:—చెప్పెదను.

అని యాతఁడు తలుపుగడియవైచి, కిటికీతలుపులబిగింపఁబోయెను.

కమలాక్షుఁ డించుక భయభ్రాంతుఁడై "ఈజాగ్రతలన్నియుం నెందులకు?" అని యడిగెను. "భయపడకుము" అని వాసుదేవుఁ డనుచుఁ గిటికీతలుపులబిగించి, కమలాక్షుఁ జేరఁదీసికొని "నీకు భయముగానున్నదా?" అని ప్రశ్నించెను.

"లేదులేదు. నీవు కరుణామయుఁడవు. సుజనశిఖామణివి. వదాన్యశేఖరుఁడవు. అట్టి నీవు నన్ను హింసింతువని తలంచుటకు నేను మూర్ఖుఁడనా?" అని కమలాక్షుఁ డనెను. కాని యాపలుకు లాతనిచిత్తసంక్షోభమును వెల్లడించుచుండెను.

వాసు:—ఇదికదా ధీరలక్షణము. ఇదికదా ప్రాజ్ఞలక్షణము. ఇఁకఁ బ్రస్తుతమునకువత్తము. కమలాక్షా! నిజమాడుము. నీవు హూణునకు మిత్రుఁడవా? శత్రుఁడవా?

అని యాతఁడు కమలాక్షుని ఱెప్పవేయక చూడసాగెను. కమలాక్షున కాపాదమస్తకము ముచ్చెమ్మటలుపోసెను. ఆతఁడు గడగడవడఁకుచుండెను. ఆతనిభయ మినుమడించెను. ఇదెట్లువచ్చెను? పృచ్ఛకుఁ డేపక్షమువాఁడైనదియుం దెలిసికొనుటకుముందే, విపత్కరమగు నిట్టిసంప్రశ్నమునకుఁ గమలాక్షుఁ డేమని బదులియ్యఁగలఁడు. వాసుదేవుఁ డేరాజపక్షావలంబి యగునదియుఁ గమలాక్షున కించుకయైన విదితమగుటలేదు. ఆతఁ డిపుడు కత్తికి నాఁగలికిసందున నిఱుకుకొనియుండెను. ఎటువోయిన నెటువచ్చి, తనగొంతు కురితగులుకొనునో యని కమలాక్షుఁడు గ్రుక్కిళ్లుమ్రింగుచు నిలిచియుండెను. కాని యంతలో నాతనిమది నొకభావము తళుక్కుని మెఱసెను. తోడనే

యాతఁడు "నేనేమి రాజకీయవేత్తనా? నాపని నాకుఁ జాలును. ఉదుమున కూరిచెత్తన మెందులకు? నాపనితోడిదే నాలోకము. మహారాజులజోలి నాకేల!" అని నుడివెను.

వాసు:—బాగుగఁ జెప్పితివి. అయినను, నీవు మహారాజ తోరమానుని భూషింతువా? దూషింతువా? ఇది చెప్పనగును.

కమలాక్షున కిప్పుడు సందు దొరకెను. వాసుదేవుని ప్రశ్నావాక్యమే కమలాక్షునకుఁ బ్రత్యుత్తరముఁ బ్రసాదించెను. "అవును అందుకు సందియము లేదు. మహారాజ తోరమానుఁడన్నను, రాజకుమారుఁడు మిహిరగులుఁడన్నను, నాకు మిక్కిలి యభిమానము. నేను వారిపాదాశ్రయుండ నేకదా!" అని యాతఁడు వెంటనే బదులిడెను.

వాసు:—నీమాటలు నాకు సంతసమునిచ్చినవి. మన ప్రభువరేణ్యునకు బద్ధవైరి యొకఁడీధర్మశాలయం దిప్పుడున్నాఁడని నీకుఁ దెలియునా?

కమలాక్షుఁడు విభ్రాంతుఁడై వెనుక కడుగిడెను. హూణవిద్రోహకార్యము లొనరించుచున్నాఁడని వాసుదేవుఁడు తన్ను వెతలపాల్సేయునా! అదిక్కుమాలినవాఁడు భయముతో రావియాకువలె గడగడవడఁకసాగెను. "ఓదీనదయాళూ! ఓమహాత్మా! అతనియునికికిఁ గారణము నేనుగాను. అతని నిచటినుండిఁ బొమ్మని చెప్ప నెంచితిఁగాని, యాతఁడు నన్నుఁ గత్తి కొకకందఁ గావించునేమో యని దిగులొంది నోరుమూసికొనియున్నాను. నేను నిరపరాధిని. దైవసాక్షిగాఁ జెప్పుచున్నాఁడ. నేనెట్టినేరము గావింపలేదు. నాపై నేరముమోపి, నన్ను నాశమొనరింపకుము." అని కమలాక్షుఁడు వెక్కివెక్కి యేడువసాగెను. భీరువగు కమలాక్షుని విలాపములకు ధీరుఁడగు వాసుదేవునకు నవ్వువచ్చెను. "భయపడకుము. నీ కెట్టిహానియుఁ గలుగదు. హానికలుగకపోవుటయేగాదు; నేఁజెప్పిన యొకస్వల్పకార్యము నీవొనరించినచో, నీకు చాల లాభము కలుగును. కాని నీవందుల కియ్యకొనకపోయితివేని, హూణ

కోపానలమునుండి నిన్నుఁ గాపాడుటకుఁ గడకా వైకుంఠవాసుఁడేని చాలఁడుసుమా!" అని వాసుదేవుఁ డాతనితోఁ జెప్పెను.

కమ:—నావలన నీ కేమి కార్యము కావలయును?

వాసు:—చేసెదనని మాటయిమ్ము.

కమ:—కార్యస్వభావము నెఱుఁగుటకుఁ బూర్వమే మాటయిచ్చు టెట్లు?

వాసు:—నీతోడివాదమునకు నాకుఁ దీఱిక లేదు. నామాట చెల్లించుటకు నీకు సమ్మతమైనయెడల, నట్లు వాగ్దానమొనరింపుము." లేకున్న నీ యిష్టము ననుసరించి యావెనుకఁ బర్యవసానము ననుభవింపుము. కాని, రాజద్రోహులు హూణులచేతఁ బడుబాధ లెట్టివో నీకుఁ దెలియఁజేయుట యుక్తమని నాకుఁ దోఁచుచున్నది.

"హూణులు వారలఁ దుదముట్టించు ననుకొనియెదను" అని కమలాక్షుఁడు వణఁకసాగెను.

వాసు:—అంతసులభముగా, నంతయనాయాసముగాఁ జంపుననుకొంటివా! ఆనిర్భాగ్యు లంతమొందుటకు సందియములేదుగాని, చెప్పరానిచిత్రవధలకుఁ జిక్కి కాని చావరు. ముందు వారిభుజముల వెడల్పు గొలుతురు. తరువాత వెన్నెముకపై మొదలిడి, వీఁపుపైనుండు చర్మమునంతయు నొలిచివేయుదురు. అనంతరము మిరపగుండయందు లవణము గలిపి, వీఁపంతయుఁ బూయుదురు. అప్పుడు నీటికణములు వీఁపంతట నూరును. తరువాత గనగనలాడు నినుపకమ్ముల నాభాగముపైఁ బొర్లించి యానీటిబిందువులఁ దొలఁగింతురు.

కమలాక్షునకుఁ జిత్తవిభ్రమము గలిగెను. "అయ్యో! దైవమా! ఘోరములగు నిట్టిశిక్షల నేను వినఁజాలను." అని యాతఁ డఱచెను. కాని వాసుదేవుఁ డాతనివేదనను లెక్కఁగొనక, యాశిక్షావిపులీకరణమున కువ్విళ్ళూరుచు "అంతతోఁ బోదు. ఇనుపకమ్ములచేఁ గాల్చినపిదప, నెఱ్ఱగాఁ గాల్చిన పటకారులఁ దెత్తురు. మిగిలినయంగముల చర్మములఁగూడ నొలిచి, పటకారు

లతో వానిని గాల్తురు. అంతటఁ గుడిచేతిని నెఱకుదురు. పిదప నెడమచేతిని ఛేదింతురు. ఆపిదప రెండుకాళ్లను మోకాళ్లవఱకు ఖండింతురు. ఆవెనుక రెండుతొడలను మొలలవఱకుఁ గత్తిరింతురు." అని మాటనిలుపక, మాట చెప్పుచుండెను.

కమలాక్షుఁడు బావురుమని యేడ్చుచుండెను. "ఓస్వామీ! ఓతండ్రీ! నీమాటప్రకారము నడుచుకొందును. ఓమహాప్రభూ! ఘోరమగు నిట్టిశిక్షల నుండి నన్నుఁ గావుము." అని యాతఁడు బ్రతిమాలుచుండెను. కాని వాసుదేవుఁడాబానసీని పరిదేవనములఁ జెవులఁబెట్టక "ఉండుము. అంతయు వినుము. తొడలఁ గత్తిరించినంతట, జెవులుకోయుదురు. పిదప నొకమొద్దు కత్తితో ముక్కు నెఱికివేయుదురు. ఆతర్వాత నొకకంటియందు మిరపపొడిఁ బోయుదురు. దానిబాధచే నాతఁడు తపించుచుండఁగా, రెండవకంటియందుఁ గూడఁ జల్లుదురు. అనంతరము........" అని యాతఁడు సాగుచుండఁగాఁ గమలాక్షుఁడు కంటికిఁ గడవెడుగా నేడ్చుచు "అయ్యోయయ్యో! ఓస్వామీ! ఓస్వామీ! ఈభయంకరశిక్షలనుండి నన్నుఁ దప్పింపుము. ఏమైననేమి! నీయానతి మాఱుదాల్తును" అని బతిమాలుచుండెను. కాని కఠోరహృదయుఁడు వాసుదేవుఁడాతని కుయ్యాలింపక "తరువాత గనగనలాడు పటకారులఁ దెచ్చి ముందొకకంటిని, యావల రెండవకంటిని పెఱికివేయుదురు. అంతయు నైన పిదప మిగిలియుండు దేహము నొకపెనముపై నుంచి, పొయ్యిపైఁబెట్టి మెల మెల్లగాఁ బ్రాణవాయువుల నాబొందినుండి తఱిమివేయుదురు." అని చెప్పెను. కమలాక్షున కిట్టి పాడుకథలు క్రొత్తలుగాకున్నను, ఈఘోరశిక్షావిధుల నాకర్ణించి మూర్ఛమునిఁగెను. వాసుదేవుఁడాతనిముఖమునఁ జన్నీటఁ జిలకరించి సేదఁదేర్చెను. కమలాక్షుఁడాతనియడుగులఁబడి పెకలుఁగున "ఓస్వామీ! నీయిష్టానుసారము వర్తించెదను. నీవు వర్ణించిననరకమునుండి నన్ను లేవనెత్తుము" అని వేడుకోసాగెను.

వాసు:—అట్లే కానిమ్ము! అవచ్చియుండుకొంతు మాళవరాజగు యశో ధర్మయని నీకుఁ దెలియునా?

'ఏమీ! అటులనా!' అని కమలాక్షుఁడు విస్మయపరీతుఁడై జాలిబొమ్మ వలె నిలిచిపోయెను.

వాసు:—అవును. ఆయువకుఁడు యశోధర్మయే. ఇది నిస్సందేహము. నేనెవఁడనో నీకుఁ దెలియునా? తోరమానునకు నమ్మినబంటును. 'యశోధర్మ బాలాదిత్యు లెక్కడ నగపడిన నక్కడనే మట్టుపెట్టవలయును' అని నాకు రాజాజ్ఞయున్నది. కాని యశోధర్మ నాకంటె బలాధికుఁడు. ఆతనిమారొక్క నుటకు నాకిపుడు శక్తిచాలదు. రాత్రిపూట నాతఁడు నిద్రించుతఱి చంప వచ్చు ననుకొనిన, నదియు సాధ్యముకాదు. రాత్రియంతయు నాతఁడు కుక్కవలె నప్రమత్తుఁడై యుండును. ఇదియుఁగాక, ఆతని సహచరుండు యతు లిద్దఱుగూడ రాత్రియంతయు మేల్కొనియుందురు.

కమ:—అయిన నేమిచేయుమనియెదవు?

వాసు:—అదియే చెప్పఁబోవుచున్నాను. ఒక్కమాటలోఁ జెప్పెదను. నీవు యశోధర్మకు విషముపెట్టవలయును. అందుకు నీకు ౧౦౦ బంగారునాణె ములు బహూకరింతును. ఈకానుకతో నీ వీపాపవృత్తిపదలి సుఖింప వచ్చును.

ఈకడపటివాక్యములకుఁ గమలాక్షునివదనాంబుజము వికసించెను. కాని మొదటిప్రార్థనావాక్యమునకుమాత్ర మాతనిహృదయము క్రుంగిపోయె ను. ఆతం డొకించుక యోజించి "అబ్బబ్బ! ఈపని మిగుల నసహ్యము. చాల ఘోరము. నీపారితోషికము నీవు తలంచునంత యాకర్షణీయము గాలేదు. ఏదియెట్లున్నను, నావద్ద పాషాణమేదీ?" అని పలికెను.

"నాకడనున్నది. దానికై దిగులొందకుము." అని వాసుదేవుఁ డొక చిన్నపొట్లమునుదీసి, విప్పి, యందుండు తెల్లనిచూర్ణము నాతనికిఁ జూపుచు "తెలియునా? ఈచూర్ణము చాల దారుణమైనది. దీనితో నిరువదిమందిని జంపవచ్చును." అని చెప్పెను.

కమ:—అటులనా? నీవు నాకాంక్షించుకార్యము మిగుల నీచమైనది.

వాసు:—దీని నెరవేర్చిన ట్లింతకుముందే నీవు బాసచేసియున్నావు.

కమ:—కార్యస్వభావము తెలియంగుటకు ముందుకదా!

"అయిన మంచిది. అనినమాటఁదప్పి, పర్యవసానము ననుభవింపుము" అని వాసుదేవుఁడు పోఁబోయెను.

కమలాక్షునకు ముచ్చెమటలుపోసెను. "అయ్యో! స్వామీ! పోకుఁడు. పోకుఁడు. మీమాట వినియెద. కాని యూ ౧౦౦ బంగారునాణెములకంటెఁ గొంచె మెక్కువమాత్రము దయచేయుము" అని యాతఁడు ప్రార్థించెను.

వాసు:—మంచిది. నెత్తురుమీఁదిడబ్బు నిచ్చుటకు మాకు నెట్టియభ్యంతరములేదు. ౧౫౦ గా నిచ్చెదను.

కమ:—౨౦౦ అయిన దయచేయుము. అని పండ్లికిలించెను.

"౧౫౦ కెక్కువ యొక్కదమ్మిడియైన నియ్యను. ఒప్పుకొనినసరి. లేకున్న దానిపర్యవసాన మనుభవింపుము." అని వాసుదేవుఁడు ఖండితముగాఁ బలికెను.

కమ:—అయిన సొమ్మెక్కడ? ఇమ్ము.

వాసు:—పనియైనపిదప నిచ్చెద. కాని దానిని నీకు ముందుగాఁ జూపెదను.

అని యాతఁ డొకమూటవిప్పి రెండుమూఁడువందలబంగారునాణెములఁ జూపెను. 'సర్వేజనాః కాంచనమాశ్రయంతి' అనుట యనుభవముకదా! సర్వశక్తివంతమగు సువర్ణసందర్శనమునఁ గమలాక్షుఁడు వికసితనేత్రుండయ్యెను. ఆతనిమానసము నరికట్టుప్రతిబంధములన్నియు నొక్కమారుగా వీఁగిపోయెను. ఆతనిసంతసము వెల్లివిరిసెను. "౧౭౫ అయిన నిండు. మీపనిఁ దూచాతప్పక తెలివేర్చెదను" అని యాతఁ డనెను.

కమలాక్షుఁడు తనచేతఁ జిక్కినాఁడని వాసుదేవునకుఁ దెలియును. ౧౫౦ రూకల కాతఁడు సంతృప్తుఁడైనదియుఁగూడ నాతనికిఁ దెలియును.

కాని జిల్లిగవ్వయైన నెక్కువగా నొసంగుట కాతఁ డిష్టపడక “౧౫౦ కంటె నొక్కరువ్వయైన నియ్యను” అని ఖండితముగాఁ జెప్పెను.

కమ:—అయిన సరి. పైకము నిమ్ము.

వాసు:—పనియైనతర్వాత నిచ్చెదను.

కమ:—పదార్థములన్నింటిని భోజనశాలకుఁ గొనిపోయి, యతిథులందఱ కచటనే వడ్డింపవలయునుగదా! అట్టియెడ, యశోధర్మకుమాత్రము విషమిచ్చుటకు వీలెట్లుండును? ఆపంక్తియందుండు యానలువురను దప్పించి వడ్డించు టెట్లు?

వాసు:—వారికిఁగూడ విషమిచ్చుటకు నాయభ్యంతరము లేదు.

కమ:—ఈపనులకంతయుం మొత్తముగా నీవు ౧౫౦ యిచ్చెదవా?

వాసు:—చాలబాగున్నది! నీవు వారినందఱఁ జంపవలయునని నిక్కచ్చిచేయను. వారిని వేఱుచేసి, సంరక్షించుటకు వీలులేనియెడల వారికిఁ గూడ విషమిచ్చుటకు నాకెట్టియాక్షేపణ లేదు. ఇది సంగతి. వారికిఁగా నే నేమియు నియ్యఁజాలను.

కమ:—ఒక్కనికిఁగా నీవొసంగుధనమునకుఁ బొల్పడి, యైదుగురినిఁ జంపుటకు నాచేతఁగాదు. మఱికొంతయిచ్చినఁదప్ప ఆపనిని నేఁజేయను.

కమలాక్షుఁడు తెగించి మాట్లాడుచున్నాఁడని వాసుదేవుఁడు గ్రహించెను. కాన నాతఁడు కొంచెము లొంగి కడకు ౨౦౦ బంగారునాణెము లిచ్చున ట్లంగీకరించెను.

కమ:—౨౫౦ యైన నిమ్ము.

వాసు:—(ఖండితముగా) ఎక్కువ నొక్కరువ్వయైన నియ్యను.

కమలాక్షుఁడు వేఱుమార్గముఁ గానక, ౨౦౦ ల కంగీకరించి, ౫౦ రూకలను సంచకరువుగా నడిగెను. కడ కాతఁడు ౨౦ రూకలను సంచకరువుగాఁ దీసికొని, మిగిలిన ౧౮౦ నాణెములను కార్యానంతరము తీసికొనునట్లు పైకొనెను.

కమ:—నీ వెవఁడవో నే నెఱుంగవగునా!

వాసు:—నా పేరు వాసుదేవుఁడు. నాయది యౌధేయదేశము. వారాణసకుఁ గూర్చుసచివుఁడను.

"ఓహో! అవునవును." అని యావంటవాఁ డంతయుఁ తెలిసినట్లు నటించెను.

కమ:—ఆయతులిద్దఱినిఁగూడఁ దుదముట్టించిన మంచిదనుకొనియెద. లేకున్న, దేశద్రిమ్మరులగువా రీవిషప్రయోగోదంతమును దేశదేశములఁ జాటుదురు.

వాసు:—ఆభయమువలదు. ఇట్టి వ్యాపారములు వారాణసి కీనాఁడు క్రొత్తలుగావు. కాని యాయతుల నిద్దఱినిగూడ నంత మొందించుట మంచిదని నీతలంపైనచో నందులకు నాయాక్షేపణ మేమియులేదు.

కమ:—ఈ పైపనుల కేమిచ్చెదవు?

వాసు:—పెద్దసున్న. వారినిఁ జంపినఁ జంపుము. వదలిన వదలుము. అది నీయిష్టము.

కమ:—అటులైన, వారిని జీవములతో వదలివేయవలయునని నా యభిప్రాయము.

వాసు:—అది నీయిష్టమంటినిగదా! నేఁబోయి వారితోఁ గలిసియుండెదను. మాటయిచ్చితివి. ఏమఱుదువేమో! జాగ్రత! అని యాతఁడు వంటయిల్లు విడిచిపోయెను.



# పందొమ్మిదవతరంగము.

## వసంత.

వాసుదేవుడుపోయినపిమ్మటఁ గమలాక్షుఁడు మరలఁ దలుపులుమూసి బంధించెను.

"భళిభళీ! ఇపుడు నేనేమి చేయవలయును? నాయట్టిబ్రాహ్మణుఁ డెక్కడ? ఐదుమందిని హత్యగావింప నుండుటెక్కడ? అబ్బబ్బా! ఎంతఘోరము! ఎంత ఘోరము! నాపూర్వు లెవ్వరుగాని యొక్కనినైన హత్యయొనరించినవారుగారు. కాని నేనుమాత్ర మిప్పు డిచట నైదుగురఁ జంపనున్నాను. ఇంతయేల! నిజమాడ వలయునన్న, నాముత్తాతతమ్ముఁ డొకమానవుని హత్యగావించినాఁడు. కాని యా పరిస్థితులు వేఱు. అప్పుడు కన్యాకుబ్జరాజ్యమును విగ్రహరాజనుయువకుం డేలుచుండెను. అతనిపినతండ్రి యారాజ్యమును లాగుకొన నెంచి, యారాజకుమారుని హత్యగావించుటకై, నాప్రపితామహునిసోదరునిఁ బ్రేరేపించెను. దాని కాతఁడు సమ్మతించి, విగ్రహరాజును బరలోకమునకుఁ బంపెను. కాని యాతం డాయొక్కహత్యకుమాత్రము ఏనూఱుహేమనాణెములఁ బడసినాఁడు. నేనో! ఐదుహత్యలకు రెండువందలుమాత్రము పొందుచున్నాను; ఇన్నూరుబంగారునాణెముల కాశనొంది, ఘాతుకుఁ డౌట యుచితమా! ఏమో నాకుఁ దెలియదు. నేఁ జెప్పఁజాలను......కౌనాను. హంతకుఁ డనుపేరు మిగుల నీచమైనది...అయిన నన్నట్లు పిలుచువారెవరు? ఈసంగతి యొరుల కెట్లు తెలియును!...ఆహా! ఆసన్న్యాసులకుఁ దెలిసినఁ దెలియవచ్చును. తెలిసిన నేమి! నేను చోళదేశమునకో, పాండ్యరాజ్యమునకో, కేరళరాష్ట్రమునకో పోయి, స్థిరనివాస మేర్పఱచుకొందును...అకటకటా! అయిన నాజన్మభూమిని వదలి

పోవలయుంగదా! చోళదేశ మెక్కడ? పాండ్యభూమి యెక్కడ? జన్మభూమిని వదలిపోవుటకంటె దుఃఖకరము మఱేమున్నది? మడువు వట్టిపోయినందుచే స్థలాంతరమునకుఁబోయిన మొసలిసైతము, మరల నయ్యది నీటిచే నిండినతోడనే తిరిగివచ్చుట సహజముగదా! నే నామొసలికంటె నీచుఁడనా? ఇదియటుండఁ, జోళపాండ్యరాజ్యములందు నన్నుఁబ్రేమతోఁజూచువా రెవరున్నారు. ఇచటిజీవితమునకు నచటిజీవితమునకు నెంతయో వ్యత్యాసము గలదు. అచటి యాచారములు వేఱు; వ్యవహారములు వేఱు; మతములు వేఱు. కడకు దైవములు, పిశాచములుగూడ సుస్థిరములుగా నిలిచియుండును. అట్టిచోట నేను నిలుచుటెట్లు? కాని నావద్ద నప్పు డిన్నూరుబంగారునాణెము లుండును. అదియే నాయోగక్షేమము లారయుచుండును......కాని యెంతబంగారముండియు నేమిప్రయోజనము? అనురాగమును నిలుచుకొనుశక్తి దానికున్నదా? ఎందుకులేదు?...కాని కొనితెచ్చుకొనినప్రేమ యప్పుటముగా నుండదు. ఇంతయేల? నాజీవమణి వసంతయున్నదిగదా! మేమిరువురముఁగలసి దక్షిణదేశమున కేలపోరాదు? ఆపడఁతితోఁ బ్రస్తావించెద. ఆచిన్నది గోపికాంగన. నేనో, బ్రాహ్మణుఁడను. అయిన నేమి? దాక్షిణాత్యులు వర్ణవిభేదముల నంతగాఁ బాటింపరు. ఇఁక వసంతయా! ఆతొయ్యలి ముద్దులుమూటఁగట్టుచుండును. ఆచిలుకలకొలికి కచట బాంధవు లెవ్వరును లేరు. పొట్టకూటికై ఱెక్కలు విఱుచుకొనుచుండును. కాన నానవలామణి, నన్ను వెంబడించుట కెట్టి యాటంకము చెప్పదు. కమలాక్షునిపై నాకమలాక్షిప్రేమ యద్వితీయము. ఆముద్దులగుమ్మ యిచటికిఁ బాలను దెచ్చినప్పు డీసంగతిఁ బ్రస్తావించెద. పొయ్యిపై నుండి పాత్రలు దించవలయును." అని యాతఁ డనుకొని, యాపాత్రలు దించి, యాపదార్థముల నుప్పుకారముచేర్చి కలియఁబెట్టెను.

మరల నాతఁ డీవిధమునఁ దలపోసికొనసాగెను. "ఈవిషము నేపదార్థమునఁ గలుపవలయును? ముద్దపదార్థములయందుఁ జేర్చినయెడల నయ్యది బాగుగఁ గలియదు కాఁబోలు! అందుచేఁ గార్యభంగమగును. చావఁగూఁడని

వాఁడు చచ్చును. కాన నద్దాని నొకద్రవపదార్థమునందుఁ గలుపుట కార్యకారి. ద్రవపదార్థ మేమున్నది? మంచినీరుండలేదా! నేనెంతమందమతిని. ఇదియే సుళువగుమార్గము. ఇంకులకుఁ బ్రయత్నించెదను.” అని యాతఁడు వాసుదేవుఁడిచ్చిన విసపుఁబొడిని, యతిథులుత్రాగుటకై తెచ్చియుంచిన నీటియందుగలిపెను. ఆచూర్ణ మంతలో నీటియందుఁగలిసి మాయమైపోయెను. నీటిరంగుకూడ నించుకేని మాఱలేదు. కమలాక్షుఁ డాజలము నవలోకించుచు ముక్కుపై వ్రేలిడికొని “ఎంతచిత్రము! ఎంతచిత్రము! ఎంతసుళువుగా, సున్నితముగాఁ గఱఁగిన నీచూర్ణము. నీటిరుచి యేమైన మాఱినదేమో?” అని యనుకొనెను. కాని యానీటిని జవిజూచుట కాతనికి నిబ్బరముకలుగ దయ్యెను.

కమలాక్షుఁ డాగంగాళమునందలి దారుణపాషాణద్రావకము నవలోకించుచు దానికడ నాసీనుఁడై “నా యీవాగ్దానమువలన నాకు నరకముగలుగునా? అవునని మనుశాస్త్రకర్త చెప్పినాఁడు. శాస్త్రములుగూడ దానినె బలపఱచుచున్నవి. కాని వారందఱు చెప్పెడువారేకాని, చేసెడు వారుగారు. అనేకు లాచరణమున కయోగ్యములు. ఇంతయేల? రాజకీయ ప్రపంచమునందు విషప్రయోగ మనుచితముకాదని, నావలెనే చాణక్యుఁడు గూడఁ దలంచుచున్నాఁడు. రాజకీయపరిస్థితులు వేఱు. న్యాయబద్ధములగు సాంఘికనియమావళిచే, రాజకీయనౌకను నడుపఁజాలము. అట్లుకాదని నచో, నేఁటిరాజులఁ బెక్కుమందిని తూఁకుమానుకడకుఁ బంపవలసియుండును. ఏరాజవంశమైనను జూడుము. హత్యాకళంకరహితమైనది లేనే లేదు. ఇట్టి రాజాన్వయము లొకదానిని మించి వేఱొకటియున్నవి. ఇంతయేల! మహాత్ముఁడగు నశోకమహారాజునైతము, రుధిరారుణమగు సింహాపీఠి నధిష్ఠించియుండెనని చెప్పవలసియున్నది. ఏలయన, నందుల వధించి కదా, చంద్రగుప్తుఁడు రాజ్యమువడసినాఁడు. అకార్యమును మనము సాంఘికప్రపంచమున హత్యయని యందుము. కాని రాజకీయప్రపంచమున

హంతకశిఖామణి వీరోత్తంసుఁడని ప్రఖ్యాతిఁగాంచును. ఇఁక నే నీసంశయములఁ జిమ్మివేయనగును. అది యటుండ, నిట్టిపాఁపపని నేదియో యొక దానిఁ గావించిననేతప్పు, నాకు రెండువందలబంగారునాణెము లెట్లువచ్చును? నూఱేండ్లపాటు వంటపనిఁజేసినను, ఈవిత్తము నార్జింపఁగలనా?...సత్యదేవత సౌజన్యవిహీనురాలు. ఆమెఁ గొలుచుటవలన నుపయోగము సున్న. నాకెవరైన రెండువందలుకాదు—వందబంగారునాణెము లిచ్చినఁజాలును; సదాచారసత్వముల కణఁగి మణఁగి నడుచుకొనుచుఁ దృప్తినందియుండెదను. కాని యూనూఱునాణెము లిచ్చు పెద్దమ్మయేడీ? నూఱుకాదు; ఏబదిచాలును. కడ కిరువదియైనఁజాలును. ఆధర్మాత్ముఁడేడీ?......ఓకమలాక్షా! ఒక్క మాట వినుము. సత్యమార్గమున సంపాదనము లేదు......అదియుఁగాక, హూణశిక్షాభీతిచే నే నీహత్యాకార్యముల కొడిఁగట్టుచున్నాను. ఈపాపకృత్యము నామనసునఁ బుట్టినదికాదు. తెలియకచేసినపాపమునకుఁ బరలోకమున శిక్షలేదని పెద్దలందురు. తప్పించుకొలేక చేసినపాపమునకుఁగూడ నా నియమము చెల్లుఁగదా! ఎందు కన్వయింపదు? ఈహూణుఁడు నిరంకుశుఁడు. ఆతనివలనిభయము నాకు మిక్కుటమైయున్నది. ఈతనిపాలనమున నాదారిద్ర్యము మేరమీఱియున్నది. ఈరెండును జేరి నన్ను నలిచివేయునని నాసందియము. నాచేతుల నాలుఁగుదుగ్గానులు మెదలుచుండినయెడల, నిట్టి నీచకార్యమునకుఁ గలనైనఁ దలపెట్టియుండెడివాఁడఁగాను. ఇచటికి నిన్నటిదినమొకబౌద్ధపరివ్రాజకుఁ డరుదెంచియుండి "ద్రోహాచరణముకంటె ద్రోహచింతనమే విశేషపాపప్రదము" అని బుద్ధుని యుపదేశమని నాతోఁ జెప్పినాఁడు. నే నీహత్యాప్రయత్నముల నీవఱకే తలపెట్టితిని. ఇఁక హత్యయొనరించుటవలన రానుండువిశేషపాప మేమున్నది? ఉత్రవడియముగా నిన్నూరుబంగారునాణెములు వచ్చుచుండ, నీపిచ్చితలంపు లెందులకు? నేను వాసుదేవునకొసరించినవాగ్దానము నెఱవేర్చు టాత్మక్షేమంకరము." అని నిర్ధారించుకొనెను.

ఈవిధమున నాతఁడు దీర్ఘాలోచనసముద్రమునుండి బయటఁబడెనో లేదో, ఎవరో తలుపుతట్టుశబ్దము మాతనికి విననయ్యెను. 'ఎవరచట?' అని యాతఁడు గద్గదికతోఁ బ్రశ్నించెను.

"ఎవరులేదు." అని సమాధానము.

కంఠస్వరమునుబట్టి యావ్యక్తి యొకస్త్రీయని గ్రహించి, కమలాక్షుఁడు కుదుటఁబడెను. "ఓహోహో! వసంతవచ్చినది. వసంతవచ్చినది." అని యాతఁ డుప్పొంగి 'వసంతా!' అని మాఱుపలికెను.

"అవును. నేనే వసంతను. మఱెవ్వ రనుకొంటివి?"

కమ:—మఱెవ్వరున్నారు? అంతమాత్రము నాకుఁ దెలియదాయేమి?

"అయినఁ దలుపుతీయుము." అని యావనిత నొక్కిపలికెను. కాని యాతం డింకను నస్థిరమానసుఁడై యుండెను.

"వంటయింటితలుపులు మూసియుంచితి వెందులకు? లోన నంతఃపుర రహస్యము లేమైన జరుగుచున్నవా యేమి?"అని యాగోపిక యధికారసూచకముగాఁ బ్రశ్నించెను.

కమలాక్షుఁడు కలవరమొంది "ఇంకేపనులకును దలుపులు మూసి యుంచఁగూడదా?" అని ప్రత్యుత్తరమిచ్చెను.

"ఆహా! కూడదని యెవరందురు? కాని వంటచేయునపుడు తలుపులు మూసియుంచవలసినంత యవసర మేమున్నది? తలుపులు తెఱచినసరి. లేకున్నఁ బాలతోఁ దిరిగిపోదును."

ఆబెదరింపునకుఁ గమలాక్షుఁడు గవాక్షముతీసెను. ఒంటివత్తిదీపపు సెమ్మె యాతనిచేతనుండెను. ఆగుడ్డివెలుతురునం దాగోపసుందరి సౌకుమార్య విలాససంపద కాన నగుచుండెను. ఆమెకు రమారమి యిరువదేండ్లుండును. భాద్రపదమునందలి తరంగిణివలె నాతరుణీమణి సౌందర్యరాశి యుంభయ కూలముల నాఱసి ప్రవహించుచుండెను. ఆకోమలిప్రవాళాధరముల మీఁద హాసము చిందులు ద్రొక్కుచుండెను. ఒకమందస్మితము మాయమగుచు మఱి

యొకమందస్మితమును దెచ్చి విడుచుచుండెను. వనధివీచికలకువలె, వసంత సుందరసుకుమారమందహాసముల కంతము లేకుండెను. వాని మొదలుతుదలకు విరతి లేకుండెను. సామాన్యముగా సృష్టిపొందుమూర్పులవలె, నొకచిఱునవ్వు పొడ వడంగుట, మఱియొకటి పొడముటకుఁ గారణమైయుండెను. ఇఁక నీవనితకు 'వసంత' అనుపేరు తగియుండెను. వసంతకాలసోయగములన్నియు నాచిన్న దానియందు మేళవించి తొలఁకాడుచుండెను. నవయౌవనాంగియగు నా గొల్లపడుచు ముఖాంబుజము సరళతకావాసమై, సకలలోకసమ్మోహనకరమై ముద్దులు మూటఁగట్టుచుండెను. పలుచబాఱి నిలుకడఁగాంచిన మెఱుపుఁ దీఁగవలె నుంపొతనూలత—సువాసనాసంభరితములగు విరులసరులచే నిండి యుండుతుఱుము—పదియాఱువన్నె కుందనమును గేరుశరీరకాంతి—వాడని మందహాసచంద్రికలు—అన్నియు శ్రీకృష్ణునికాలపు గోపికఁ దలపింపఁజేయు చుండెను. రూపొందినయారోగ్యలక్ష్మివలె వసంతసవిలాసముగ నిలిచియుం డెను. చంద్రసందర్శనమునఁ జంద్రకాంతముకరణి, వసంతసందర్శనమునఁ గమలాక్షుని శిలాకఠినహృదయము కరఁగుచుండును. అతఁ డామెను మోహిం చినవాఁడుకాఁడు. తరుణుల నెట్లు మోహింపవలయునో యాతని కించుక యైనఁ దెలియదు. కాంతలయెదుటఁ బడినపుడంతయు గుండె దడదడఁగొట్టు కొనుచుండియుఁ, గంటఁబడిన కాంతలచుట్టును గుక్కలవలెఁ దిరుగు పెదగుఁ లెందఱో గలరు. కమలాక్షుఁ డట్టివారిలో మేలుబంతియనిచెప్పిన దోషము కాదు. కాని సాధారణముగాఁ బ్రతిదిన మాతఁడు వసంతనుదప్ప మఱేవని తను జూచుచుండఁడు. అందుచే నాతనియనురాగవల్లిక మఱియొకయెడకుఁ బ్రాఁకుటకుబదులు, వసంతనే యాధార మొనరించుకొనియుండెను.

ఆమె తెచ్చినక్షీరమును గమలాక్షుఁడు తీసికొనెను.

వసంత:—నేఁడు చాలమంది వచ్చినట్లున్నారు.

కమలాక్షునియెడలు జల్లుమనెను. "అవును"

వసంత:—ప్రాకారమున రెండుహయములు ఉన్నవి. అవి యెవరివి?

కమ:—ఏమో! నాకుఁ దెలియదు.

వసంత:—తెలిసియుండవలయును. తెలియకపోవుటెట్లు? నీకుఁ దెలియక యిచటఁ జీమయైనఁ జిటుకనునా?

కమలాక్షుఁడు తబ్బిబ్బులయ్యెను. "ఆగుఱ్ఱము లెవరివైనవి నాకుఁ దెలియును. కాని నేను జెప్పఁజాలను."

"ఏమీ! నాకుఁ జెప్పననుచున్నావా?" అని వసంత కఠినముగాఁ బలికి "అయిన నిప్పుడేపోయెదను. రేపటినుండియు నేను క్షీరము తీసికొని రాను. నాతమ్మునిఁ బంపెదను. ఆహా! నన్నుఁ జూచిన నీకింత చులకనయైనది కదా!" అని నిష్ఠురములాడెను. ఆసుందరాంగి కన్నులనుండి బొటబొట నీరు గారుచుండెను. అకస్మాత్తుగాఁ గురియు వసంతకాలపు వానజల్లువలె మిలమిల మను బాష్పవారికణము లాకోమలాంగి నయనవారిదములనుండి ధరణిఁ దొరలుచుండెను. ఇఁక నాజలజనయన పోఁబోయెను. అంతలోఁ గమలాక్షుఁడు "వసంతా! వసంతా! పోవలదు. పోవలదు. అంతయుఁ జెప్పెదను." అని ప్రతిమాలెను. క్షణములో వసంతవదనారవిందము వికసించెను. దరహాసకౌముదు లామె మోమునందలి శోకాంధకారమును జిమ్మివేసెను. వానజల్లు వెలిసినపిదప వెలుఁగొందుభానుబింబమువలె, నాభామిని మనోజ్ఞరూపముఁ దాల్చియుండెను. ఆగొల్లచిన్నది తెప్పలద్దుకొనుచు "అవును. నీవు చెప్పెదవని నాకుఁ దెలియును. కానిమ్ము." అని యడిగెను.

కమ:—నాకుఁ దెలిసినంతమట్టుకుఁ జెప్పెద. ఒకయశ్వము వాసుదేవుఁడనువానిది. ఆతఁడు యాధేయుఁడు. తోరమానమహారాజున కాతఁడు ప్రియసచివుఁడు.

వసంత:—ఇంకొకగుఱ్ఱము?

కమ:—వసంతా! నీవు సప్తగంగలతోడుగాఁ, త్రిమూర్తులతోడుగా, రహస్యమును గాపాడునట్లు బాసచేసిననేతప్ప నీకాసంగతి నెఱింగింపఁజాలను.

వసంత:—అట్లే యొట్టుపెట్టుకొందును. నక్షత్రగంగలు, త్రిమూర్తులు, విశేశ్వరుఁడు, వీరితోడుగా నీమర్మమును దాఁచియుంచెదనని యిదే బాస చేయుచున్నాను.

"అది, మహాకోసలమాళవప్రభువగు యశోధర్మగుప్తము" అని కమలాక్షుఁడు మిగుల రహస్యముగా నామె చెవిలోఁ జెప్పెను.

వసంతకు విస్మయమయ్యెను. "ఏమీ! అయ్యది మాళవాధిపుఁడు యశోధర్మయశ్వమా! ఆత్మగర్భశాత్రవుని ప్రియసచివుఁడుండు కష్యక్రిం దనే, యశోధర్మకూడ నెట్లున్నాఁడు." అని యామెమలి యడిగెను.

కమ:—అతఁడు వాసుదేవుఁడని యశోధర్మకుఁ దెలియదు.

వసంత:—అయిన నీతఁడు యశోధర్మ యని వాసుదేవునకుఁ దెలియునా?

కమ:—ఆహా! తెలియును.

కమలాక్షుఁడు నాలుక కొఱుకుకొనెను. నోరుజాఱిలినని యాతఁడు గ్రహించి, యంతలో నామాటను ద్రిప్ప నెంచి "తెలిసియుండు ననుకొని యెదను" అని చెప్పెను.

వసంత:—అతనికిఁ దెలియునని నీవు బాగుగా నెఱుంగుదువు. నీవు నాచెవులకుఁ బిడకలుకట్టఁ జూచుచున్నావా?

కమలాక్షునకు దిగులయ్యెను. అతని ప్రజ్ఞాకౌశలము మొద్దువాఱెను. అతం డితికర్తవ్యతావిమూఢుఁడైయుండెను. "వసంతా! నన్ను నాశమొనరింపకుము" అని యాయన దరహాయబలను బ్రతిమాలసాగెను.

వసంత:—నీవనునదేమి? నాకు నీపరిచయముకలిగి పదియేండ్లయినది కాని; నేఁటి నీవర్తనముమాత్రము నాకర్థమగుటలేదు.

కమ:—వసంతా! అంతయుం సిద్ధముగానున్నది. నాకుఁ గాలము కలిసి వచ్చినయెడలఁ గొలఁదిదినములలోనే నిచటినుండిఁ బోనున్నాను.

వసంత:—ఏమీ! మమ్మందఱ విడిచిపోయెదవా!

కమ:—కాదు కాదు. వచ్చుటకు నీకిష్టమైనయెడల, నిన్నుఁగూడ వెంటఁబెట్టుకొని పోనెంచియున్నాను.

వసంత:—నన్నా? ఎక్కడికి? నీకు మతిపోయినదాయేమి?

కమ:—లేదు లేదు. నామాట యబద్ధము కాదు.

వసంత:—పరదేశములకుఁ బోవుటకు నీకు రొక్కము రొండినుండ వలయునుగదా!

కమ:—అందులకై నీవు తమకమొందకుము. నేను రెండువందలబంగారునాణెములఁ బడయనున్నాను. ఇవి చాలవా?

వసంత:—చాలకేమి! కాని యీడబ్బు నెచట దాఁచియుంచితివి? ఇంతవఱకీవిషయమై నాతో నొక్కపలుకైనఁ బలుకవైతివికదా! నిన్నెంత వఱకు నమ్మవలసినదియు నాకిప్పుడు తెలిసినది. నీవింతమాత్రపుఁ బెద్దమనిషివని నాకింతదనుకఁ దెలియదు. ఇట్టి కుత్సితుఁడవయ్యు, నన్ను నీవెంటరమ్మని పిలువ నీకు గుండెలున్నందుకు నవ్వువచ్చుచున్నది.

అతనిపైఁ దనకుఁ గలయభిమానాదరణ లంతరించినట్లు, జాణ యగు వసంత నటించుచుండెను.

కమ:—వసంతా! ఊరక నాపైఁ గోపమూనకుము. నిన్నుఁగాదని నేనేమియు దాఁచినవాఁడఁగాను. రేపుప్రొద్దునఁగాని డబ్బు నాచేతఁబడదు.

వసంత:—అంత పెద్దమొత్త మంతలో నెట్లువచ్చును?

ఆమెకుఁ బ్రత్యుత్తరమిడుటకుఁ గమలాత్మున కిష్టములేకుండెను. వసంత యాతని ఱెప్పవ్రాల్పక చూచుచునట్లే నిలిచియుండెను. ఆమెతో నబద్ధములు చెప్పుటకుఁ గమలాత్మునకు ధైర్యములేకుండెను. తన కాఁగొల్ల పడుచుపైఁ గలగాఢమోహమున కాతనికి సిగ్గయ్యెను. ముఁగాము లాలోచింపక, తానిట్టి పాడుపనిఁ జేయునట్లు వాసుదేవునకు మాటయిచ్చినందులకై యాతఁడు పలుమారు తన్నుఁదాను దిట్టుకొనుచుండెను. కాని కడచిన

దానికి వగచి యుపయోగమేమి? ఆతఁ డాకార్య మొనరింపక విధిలేదు. తాన నాతం డించుట దిటవుదెచ్చుకొని "వసంతా! ఈవిషయముమా త్రము నన్నడుగకుము. దీనికి రాజకీయములతో సంబంధముకలదు." అని నుడివెను.

వసంత:—మంచిది. నీవు నాకాసంగతిఁ జెప్పకపోయినచో, నాతరువాత నీకగుగతి నీకుఁ దెలియునా?

అని యామె పోఁబోయెను. కమలాక్షుఁడు తందటలాడుచుండెను. అతనికి వెనుకఁబోయిన నూయి, ముందుఁబోయిన గోయిగా నుండెను. ఎటులైననేమి? తాను వసంత మది కెక్కవలయునని యాతఁడు నిర్ధారించుకొనెను. "వసంతా! వసంతా! రమ్ము. పోవద్దు. అంతయుఁ జెప్పెదను." అని యాతఁ డఱచెను.

వసంత:—అయినఁ జెప్పుము. మాయమాట లిఁకఁ జెల్లవు. ఉన్న దున్నట్లు వినిపింపుము.

కమలాక్షుఁడు కంపితస్వరమునఁ జిన్నగా "ఇది నిజము. యశోధర్మ త్రాగెడుపదార్థములోఁగాని, తినెడు నాహారములోఁగాని యొకవిషపుఁబొడినిఁ గలిపినచో, వాసుదేవుఁడు నాకిన్నూరు బంగారునాణెములు బహూకరించునట్లు మాటయిచ్చినాఁడు." అని చెప్పెను.

వసంతగుండె జల్లుమనెను. "ఇందులకు నీవియ్యకొంటివా?"

కమ:—మఱి విధియేమున్నది? సమ్మతింపకపోయినచో, హూణులు నన్నుఁ జిత్రవధలఁబెట్టుదురని యాతఁడు బెదరించినాఁడు.

వసంత:—అయిన రెండువందల బంగారునాణెములకు నీవమ్ముడు పోతివి.

కమ:—ఈరహస్యమును గాఁచునట్లు సప్తగంగలతోడుగాఁ, ద్రిమూర్తులతోడుగా బాస చేయుము.



వసంత కమలాక్షునిమీదు నొట్టు పెట్టుకొనెను

పుట—233

వసంత:—నేఁజేయను. నీవు ఘాతుకకృత్యమునకుఁ బూనియు న్నావు. అట్టియెడ నేను బాసచేయుట ధర్మసమ్మతము కానేరదు.

కమ:—అయిన నీవు కృతఘ్నురాలవు. రహస్యముగాతునని నీవు మాటయిచ్చినందుచేత నేకదా, నీకాయుదంతము వినిపించితిని. దీని నొరుల చెవులపై చిలికేని, నీమానమేపోవును. మీఁదుమిక్కిలి, నీవు తమకార్యముల కడ్డుతగులుచున్నావని హూణులకుఁ దెలిసినయెడల, వారు నలుగురిలో నీ మానముఁ దీసికాని వదలరు, తెలియునా?

ఈబెదరింపుల కాయబల కించుక దిగులుపుట్టెను. హూణు లన్నంత పనిఁ జేయువారని యాతలోదరికిఁ దెలియును. ఇఁకఁ బ్రాణము తెగువఱకు లాగ రాదని యామె యనుకొని, కమలాక్షునియిష్టానుసారము బాసచేసెను.

వసంత:—కమలాక్షా! ఇప్పుడైనఁ జెప్పుము. ఆవిషమును దేనిలో గలిపితివి?

కమ:—ఒట్టుపెట్టుకొనుము.

వసంత మరల నొట్టుపెట్టుకొనెను.

కమ:—త్రాగెడునీటిలోఁ గలిపితిని. దానివలన నీటిరంగుకూడ మాఱలేదు.

వసంత గంగాళముకడకుఁబోయి యందలిజలముఁ జూచెను. "ఆహా! ఈ ప్రపంచమునం దీనీటినిఁబోలిన, పాలసు లెందఱో యున్నారుగదా!" అని యాపడఁతి నిట్టూర్చెను.

కమ:—ఆచూర్ణములో నిరువదిమందినిఁ జంపవచ్చునని వాసుదేవుఁడు నాకుఁ జెప్పినాఁడు.

వసంత:—ఉండవచ్చును. దానికిఁ జాలమహిమ యుండును. ఆచూర్ణమే యాకమలాక్షున కిన్నూరుబంగారునాణెములఁ బ్రసాదించుచున్నదికదా!

కమ:—అవును.

అతనికి నవ్వు పెల్లగిలుకొనివచ్చెను. కాని యాతనిభయోద్రేక మద్దానిఁ ద్రొక్కిపెట్టెను. హృదయమువిచ్చి నవ్వుట కాతనికి ధైర్యము చాలలేదు.

వసంత:—ఇఁక నేఁబోవలయును. ఇప్పటికే ప్రొద్దుపోయినది.

కమ:—మంచిది. కాని నీబాసమాత్రము తప్పకుము. తప్పినయెడల నిహాపరముల నీకుఁ గలుగుపర్యవసానములను మఱువకుము.

“ఏలతప్పుదును! నాకు వెట్టియాయేమి!” అని వసంత నమ్మకముగాఁ బలికి, యావట్టికుండకత్తి కత్తిపైఁబెట్టుకొని, యాసత్రమునుండిఁ జీఁకటి లోఁబడి కంటికి మఱుఁగైపోయెను.

---

# ఇరువదియవతరంగము.



## ఇంతకు వారియదృష్టము మంచిది.

వసంత యట్లు కొంతదూరము పోయెనో లేదో, యామె మానసాంబుధియందు వివిధములగు యోజనాతరంగములు ఘూర్ణిల్లసాగెను. ఆకోమలికి కర్తవ్యతాపరిజ్ఞాన మించుక యుదయించెను. ధర్మశాలయం దిపుడు మాధవస్వామిని, మఱి నలువురు బ్రాహ్మణులను జంపుటకుఁ బ్రయత్నములు జరుగుచున్నవి. వసంతయందలి సౌజన్యగుణమంతయు నీఘాతుకకృత్యము నెడ దిరుగుబా టొనరించుచుండెను. ఆరాజీవగంధికి రాజకీయవ్యవహారములతో నేమాత్రము పరిచయములేదు. సంబంధమునులేదు. కాని యీవిషయము నాగొల్లపడుచు రాజకీయవ్యవహారమని భావింపలేదు. 'అకటా! అయిదుగురు మానవులను దుర్భరములగు వధలఁబెట్టనున్నారుగదా' అనిమాత్ర మామె తలంచెను. ఆఘోరకార్య మాయబలమనసుకుఁ దట్టుకొలఁది, ఆమెకు ముచ్చెమటలు పోయసాగెను. ఆముగుదమేను జలదరించెను. ఆహా! అచట నైదుగురుమానవులు మృత్యువదనమునఁ జిక్కుస్థితిలోనుండ, నిచట వసంత వారిసంగతి నించుకయినఁ దలపెట్టక యింటికిఁ దిరిగిపోవుచున్నదిగదా! ఈవెయిదమునకామెకు సిగ్గుకలిగెను. కమలాక్షునియిష్టానుసారము తానాతనికి మాటయిచ్చినందుల కామానవతి పశ్చాత్తాపమొందసాగెను. కోపశోకము లామెయెడఁ జిందులుద్రొక్కుచుండెను. ఆమె పటపటమని పండ్లుగొఱికెను. పెదవులఁగఱచెను. కాని యాకార్యములన్నియు నిష్ఫలములని యామె యంతలో గ్రహించెను. ఇప్పుడు కర్తవ్యమేమి? క్రూరాత్ములగు నాకుట్ర చేయువారికొలఁబడి మడియనుండు నామందభాగ్యులఁగాపాడుట కేదియేని చక్కని యుపా

యము కావలసియున్నది. హత్యారహస్యమును గాంచునట్లు వసంత కమలాక్షునకు బాసచేసియున్నది. ఆబాసను భంగమొనరించుట కామె కేమాత్ర మిష్టములేకుండెను. ఆమె ప్రతిజ్ఞాపాలనేచ్ఛ యజేయమై యుండెను. వాగ్దానభంగమువలనఁ జెఱుపునకు బదులు మంచికలుగుననుట నిస్సందేహము. అనాథులగు నైదుగురప్రాణముల సంరక్షించునిమిత్తము తనవాగ్దానభంగమునఁగలుగు పాపము ననుభవించుటకు వసంత సంసిద్ధమతియైయుండెను. కాని విధిలేకుండినఁ దప్పు, మాటతిరుగుట కామానవతి సమ్మతింపకుండెను. అంత యవసర మిప్పుడున్నదని యామె తలంపలేదు. ఆమె దీర్ఘాలోచనానిమగ్నయై యుండెను. ఆమె యట్లే యొకరావిచెట్టుక్రింద నిలిచియుండెను. ఒక్కసారిగా నామె ముఖారవిందము వికాసభాసురమయ్యెను. ఒకభావనావిద్యుద్దామ మామెమానసాకాశమునఁ దళుక్కుమని మెఱసెను. "ఆహా! ఇప్పుడు తెలిసెను. ఇదియే నాకు మహాబోధివృక్షము" అని యాచిన్నది యుత్సాహమునఁ బలికెను. తోడనే యామె గబగబ ధర్మశాల కభిముఖయై నడువసాగెను. ఆమె యెద్దానినో త్వరలోఁ గావింపనున్నదనియు, నాకార్యాచరణమున కామె కృతనిశ్చయురాలైయున్నదనియు నామెవైఖరి చూపఱకు విదితమొనరించుచుండెను. అంతలో వసంత వంటయింటి వాకిటికడకుఁబోయెను. అప్పటికిఁ గమలాక్షుఁడు పాలుకాచియుండెను. ఇఁక నాతఁ డావిషపునీటిగంగాళమును లోగిటిలోనికిఁ గొనిపోయి, యచట విస్తళ్ళముందుఁ గూర్చుండియుండు నతిథులపంచపాత్రలయం దాజలమును బోయవలయును.

అప్పుడు కమలాక్షునకుఁ దీఱిక లేకుండెను. అతఁ డప్పుడు వసంతను గాంచి మండిపడెను. కాని యంతలో నాతఁడు కోపమణఁచుకొని "మరల యెందుకువచ్చితివి?" అని తిన్నగా నడిగెను.

వసంత:—గొంతెండిపోవుచున్నది. కొంచెము మంచినీరు కావలయును.

"ఓహో! అంతయేనా? ఇప్పుడే యిచ్చెదను." అని కమలాక్షుఁడు మందహాసమొనరించుచు నొకపంచపాత్రఁదీసికొని వంటయింట నొకమూల నుండు మంచినీటికుండకడకుఁబోయెను. కమలాక్షుఁడు ముందుకువంగి యాకుండలోనినీటిని పంచపాత్రలోనికి వంచుచుండుట నామె గాంచెను. ఒక్క క్షణమైన నామె జాగు సేయలేదు. ఒక్కయడుగైన వెనుకనిడలేదు. ఆయు బలముఁ దెగువకలిగెను. ఒక్కగంతులో నామె యావిషపునీటిగంగాళము బైటికెత్తుకొనిపోయి యానీరు క్రిందఁగుమ్మరించెను. వ్రాయుట కింత యైనదికాని, యింతయు నొకఱెప్పపాటులో జరిగెను.కమలాక్షున కంతయుఁ దెలియకపడెను. ఆగోల్లపడుచు తనముందుఁజూపిన తెగువను, నిర్ధారణమునకుఁ గమలాక్షుఁ డొక్కింతతడవు చేష్టలుదక్కి కొయ్యబొమ్మవలె నట్టే నిలువఁబడెను. ఇంతకాలముగా నాతఁ డామె సాధ్వియనియుఁ, నబలయనియుఁ దలంచియుండెనుగాని, యామె కట్టిసాహసకార్యాచరణమునకుఁ జాలినశక్తి కలదని యాతఁడు కలనైనఁ దలంచియుండినవాఁడు కాఁడు. అంతలో నాతఁడు ప్రజ్ఞవడసెను. జరిగినపనినంతయు నాతఁడు బాగుగా గ్రహించెను. ఇఁక హూణరాక్షసులు తన్నెట్టి యిడుమలఁబెట్టుదురో కదా! ఆరావలసిన ౧౮౦ బంగారునాణెము లట్లే చిక్కినట్లు చిక్కి జాఱిపోయినవి గదా! చేతఁ జిక్కిన ౨౦ కాసులైనఁ దనకుఁ దక్కవనునమ్మక మిఁక నేమున్నది. ఇట్టి యూహ లాతనిమానసవీథినించెను. ఆతని కపరిమితమగుకోపము కలిగెను. ఆతనియొడ లాతనికిఁ దెలియలేదు. "ఓసీ దుర్మార్గురాలా! ఎంతపనిఁజేసితివే? ఎంతపనిఁజేసితివే? హూణులిందులకు నీమానముఁ బోకార్చికాని వదలరు. నీప్రాణములఁ దీసికాని యూరకొనరు." అని యాతఁ డఱచెను.

కమలాక్షునియఱపులు లోగిలిలోనియతిథులకు వినఁబడియెను. సంగతి తెలియుటకై వారందఱు పిలపిల వంటయింటికడకుఁ బరుగిడిరి. అప్పుడే యశోధర్మ నోట ముద్దఁబెట్టుకోఁబోవుచుండెను. కమలాక్షునినోటనుండి 'హూణులు' అనుపదమును వినుటయే తడవుగా నాతఁ డొఱనుండి కరవాలము నూడఁ

వెలికి, యచటికిఁ బరువెత్తెను. అతఁడు మున్ముందే యాధేయుని వాసుదేవు న కారణము సంశయించియుండెను. ఒక్కగంతులో నాతఁడు వాసుదేవు నరికట్టెను. హఠాత్సంభవమైన నీవిషమపరిస్థితుల నెదుర్కొనుటకు వాసుదేవుఁడు సంసిద్ధుఁడైయుండినవాఁడు కాఁడు. యశోధర్మ వాని రెండుచేతుల నశ్రమముతోఁ గలిపికట్టి, వానిఁ దనవెంట వంటయింటికి నడిపించుకొనిపోయెను.

అప్పు డచటిదృశ్యము మఱచినను మఱపురాకుండెను. రోషావేశమున నోటికొలఁది నఱచినకమలాక్షుఁ డిపుడు తనభీషణారావములకు ఫలితముగఁ దనకేమి కీడుమూఁడునో యని గడగడలాడుచు నిలిచియుండెను. ఆసమాచారమును గప్పిపెట్టుటకు నామందమతి యెంతయుఁ బ్రయత్నించుచుండెను. ఇఁక నచట వసంత; ఆమెముఖచంద్రబింబ మానందచంద్రికల వెదఁజల్లుచుండెను. ఆమెనేత్రములు మిఱుఁగురుల గురియుచుండెను. తనవిధిని నెఱవేర్చితి నను ముదముచే నామోమున గౌరవగాంభీర్యములు తొలఁకాడుచున్నను, తనకార్యము నౌరులకు వినిపించి ప్రశస్తిఁబడయనొల్లని కర్మయోగివిధమున, వసంత యొకయెడ తొలఁగక నిలిచియుండెను. ఆమందకాంతులలో వాతవ్యాధి, శుక్రాచార్యుఁడు, కుంపదంతుఁడు, ఉపరానందుఁడు, అజ్ఞానాంధకారుఁడు, సుబంధువు నిలిచి, కమలాక్షుని వసంతునిఁ గాంచుచుండిరి. వాగ్వాదమునకుఁ గారణమును వారు గ్రహింపలేకుండిరి.

బంధితుని వాసుదేవునిఁ గొనివచ్చినయశోధర్మను గాంచి వారందఱు వెఱఁగందిరి. కాని కమలాక్షునకుమాత్ర మపరిమితమగుభయ మంకురించెను. బంధితుని వాసుదేవుని, యశోధర్మచేతియందుఁ గాలాహివలెనుండు విచ్చుకత్తినిఁ జూచి, కమలాక్షుఁ డాపాదమస్తకము గడగడవడఁక మొదలిడెను. కాని యశోధర్మమాత్ర మూరకుండలేదు. అట్లాతఁడు చక్కఁగాఁ గమలాక్షుని డాసి యావణకుఁడుపురుఁగుపై ఖడ్గము జళిపించుచుఁ గఠినస్వరమున “ఓరీ! నిజమాడుము. నిజమంతయుఁ జెప్పుము. ఒక్కముక్కయైన దాఁచఁ గూఁడదు. లేకున్న నీప్రాణములు నీవి కావని తలంపుము” అని గద్దించెను.

కమలాక్షుఁ డంత తెలివిమాలినవాఁడు కాఁడు. యశోధర్మ యని నంతపనిఁ జేయుం నని యాతఁ డెఱుంగును. ఆఘాతుకకృత్యమునంతయుం నొక్కముక్కయైన దాఁచక చెప్పినసరి; లేకున్నఁ దనప్రాణములు తనవి కావనియు నాతనికిఁ దెలియును. ఈరహస్యమును వెలువఱించుట హూణకోపానలమును గొనితెచ్చి కొనుట యనికూడ నాతనికి బాగుగాఁ దెలియును. రహస్యగోపనము మృత్యువును వలఁచుట యనియుఁగూడ నాతఁ డెఱుఁగును. కమలాక్షుఁడు కనులు మూసికొని యుండఁజాలఁడు. ఎప్పుడో రానుండు నాపదసంగతి యటుండఁ నిశ్వాసమాత్రము తనకుఁ గష్టముకలుగనుండుట నిక్కువమని యాతఁడు గ్రహించెను. ఎప్పుడో తాను గత్తులబోనులోఁ బడనున్నాఁడనని, యిప్పుడు మరణమొందుట కాతని కిష్టములేదు. వీఁడు మిక్కిలి యానాలుగు కాసులు వచ్చుననునాశకూడఁ దునాతునకలైనవి. హూణులవలనిభీతికంటె, నీభావములే యాతనిఁ బిచ్చి పిప్పిచేయుచుండెను. బంధితుని వాసుదేవునిఁ గాంచిన వెంటనే, యావంటివానియుల్లమునందలి యాశాజ్యోతి యాఱిపోయెను. ఆతనిసందియములు తామరతంపరలయ్యెను. ఆతం డొక్కమాఱు వాసుదేవునిఁ జూచెను. ఆఘోరరహస్యముల బయలుపఱుపవలదని యాతఁడు కమలాక్షునకుఁ గాలితో సన్న జేసెను. వాతవ్యాధి దానిని గమనించి "ఈవాసుదేవుఁడు తన కాలితోఁ గమలాక్షునకు రహస్యములఁ జెప్పవలదు" అని సన్నఁజేయుంచున్నాఁడు అని యఱచెను. 'ఆతనిపాదములఁ గట్టివేయుము' అని యశోధర్మ వాతవ్యాధి కాజ్ఞఁజేసెను. ఎటువోయిన నెటువచ్చునో యని భయపడుచు వాతవ్యాధి యశోధర్మ చెప్పినట్లుచేసెను. అంత యశోధర్మ కమలాక్షుఁ గాంచి "నిజముచెప్పుము. లేకున్న నీప్రాణములు తీసెదను." అని మరల బెదరించెను. వాసుదేవుని పాదబంధనమును గాంచిన కమలాక్షుఁ డీగద్దింపునకు లొంగిపోయెను. యశోధర్మ యన్నమున విషముఁ గలుపు వాసుదేవుఁడు తన మొదలువిడిచినది మొదలు, విషపునీటిని వసంత క్రమ్మరించుటవఱకు జరిగినకథనంతయుఁ గమలాక్షుఁడు పూసఁగ్రుచ్చినట్లు చెప్పెను. అభయా

నరకకథాసంశ్రవణముచే నచటివారందఱు నిర్విణ్ణులైరి. ఆవంటవాని కాలుఁ జేతులఁ గట్టివేయునట్లు యశోధర్మ యాజ్ఞాపించెను. కమలాక్షుని పాదు పన్నుగడల విని రౌద్రమూర్తులై యుండినవాతవ్యాధి, శుక్రాచార్యుఁడు, కుణపదంతుఁడు, ఉదరానందుఁడు, తోడనే వానిని గట్టివైచిరి. ఇంతలో వారికిఁ బ్రక్కనుండు పెరటినుండి కుక్కయఱుపు వినవచ్చెను. వెంటనే వాత వ్యాధి యచటికిఁ బరువెత్తెను. "ఇచట నొకకుక్క వచ్చుఁబోవు ప్రాణములతోఁ దన్నుకులాడుచున్నది." అని యాతం డఱచెను. వసంతకూడ నచటికిఁబోయి దానిఁ జూచి "అయ్యో! పాపము. దీనికి మిక్కుటముగ దాహ మయ్యెఁగాఁబోలు! నేను గ్రమ్మరించిన యావిషపునీటి నిది గ్రోలి యుండును" అని యనెను. యశోధర్మ దీపముఁదీసికొని యచటికిఁబోయి, నీళ్లమడుఁగులోఁబడి గిజగిజఁ గొట్టుకొనుకుక్కం గాంచి "వసంతా! నీవు పాఱఁబోసిన విషజల మిదియేనా?" అని యామె నడిగెను.

వసంత:—అవును.

యశో:—ఈసంగతిని నీవు మాకేల చెప్పలేదు?

వసంత:—తనకుట్రల వెలువరించకుండునట్లు, కమలాక్షుఁడు నాచేఁ బవిత్రప్రమాణములఁ జేయించుకొనినాఁడు. సప్తగంగలు, త్రిమూర్తులు, సర్వేశ్వరుఁడు వీరియెదుటఁ జేసినప్రమాణపవిత్రత మీఱఁగలిగిన దేకదా!

యశో:—అవును. నాకుఁ దెలియును. కాని మమ్ములఁ గాఁచుటకై నీప్రాణములఁ బణములుగా నొడ్డితివి. మాపై నీకంత యనురాగాభిమానములకు హేతు వేమి?

వసంత:—జీవకారుణ్యమే యిందులకుఁ గారణము. నేను నీచురాల నగు గొల్లపడుచుఁగానని చెప్పను. కాని నాయందుఁగూడఁ గులీనులకువోలె భూతదయాపశ్చాత్తాపములు లేకపోలేదు.

యశో:—నిజము. నిజము. అజ్ఞానాంధకారుఁ డేఁడీ? అతం డేమి చేయుచున్నాఁడు?

ఆత్రిదండి యూసురులఁబాయుతక్కం జూచుచు నిలిచియుండెను. అది కొంతసే పట్లు తన్నుకులాడి, అట్టె నిలువఁబడి వారలఁజూచి కన్నులు మూసెను. అంతలో దానిప్రాణవాయువు లెగిరిపోయెను. అజ్ఞానాంధకారుఁ డంతయుఁ గాంచి యొకనిట్టూర్పువిడిచి "ఆహా! ఈప్రాణి యెంతలోఁ బరలోకమునకుఁబోయెను. దీనిమర్మ మేమియోకదా!" అనెను.

వాత:—కమలాక్షుని పాదుపన్నుగడలన్నియు ఫలోన్ముఖములై యుండిన, మననిష్క్రమణముకూడ నింత యాకస్మికముగ నింత యగోచరముగ నై యుండెడిది.

శుక్రా:—అందుకు సందేహములేదు. మనము వసంతఋణము నెట్లు తీర్చుకోఁగలము. ఆమె యుపకార మపారము.

శుక్రాచార్యుం డనినఁ గుణపవంతునకు లోలోన గిట్టదు. "నీవు జ్యోతిష్కుఁడవనియే కాని, యీపాడుకుట్రను సూచింపఁజాలకపోతివికదా" అని యాతని నెత్తిపాదుపుమాట లనెను.

శుక్రా:—మిత్రమా! కుణపదంతా! ఈవిషయమై నన్నుఁ బ్రశ్నించినవారేరీ? లగ్నస్ఫుట మొనరించితినా? గోచారముచూచితినా? ఇందులకు నాకుఁ దీరుఁబడియేదీ? తారాబలము, చంద్రబలమును జూడకయే దేనినిఁగాని చెప్పుటెట్లు? మానవునకుఁ గన్నులున్నంతమాత్రమునఁ జాలునను కొంటివా? ఎదుటనుండువస్తువును వర్ణింప నమకట్టుటకుముందు, వానిఁ జూడఁ బ్రయత్నింపవలయును. ఈవిషయమును నామనోనేత్రముల నెప్పుడో చూచితిని. మనల నీయూకుదుదధి గట్టెక్కించినది. వసంతబుద్ధికుశలతలుగాని, నీమంత్రమహిమలుగావు.

కుణ:—మిత్రమా! శుక్రాచార్యా! నీవాదమునకు వ్యతిరేకముగ నీవే యనుచున్నావు. క్రూరాత్ములగు నీతుంటరులయెడ నామంత్రమును బ్రయోగింప నన్నడిగినవారెవరు? ప్రయోగింపకయే, నామంత్రమును బరీక్షించుటెట్లు?

పూజచేసి చింపిచేటు, చీపురుఁగట్టలతోఁ బాదఁగొట్టినాఁడు. సహించుకొనుట లేని నాకు వ్యవధి లేకపోయెను. కాని నీవ్యాపారమునం దిట్టియవస్థ లెక్కడివి? ఇన్నియవస్థలుండినను, ఇట్టినృత్యవిద్యను విడువ నాకు బుద్ధిపుట్టకున్నది. నావిద్యయందుఁ బరిశ్రమ చేసినమానవుల కదృశ్యసంచారము మిగుల సులభము కదా!

వాత:—అయిన మిత్రమా! కుసుమదంతా! నీవిపు డదృశ్యుఁడవై, నామాటలయందలి నిక్కమును తెలిసికొనుము. అతిమానుషములగు నిట్టికార్యములను వాక్యరూపమున జెప్పినవారి నెందఱినో చూచితినిగాని, కార్యరూపమునఁ గావించినవానినిమాత్రము చూడలేదు.

కుసు:—మిత్రమా! వాతవ్యాధీ! ఈకార్యము మాటలతో నున్నదనుకొంటివా? నీవిషయమై నీకించుకేని తెలిసినట్లులేదు. అపురూపములు కష్టసాధ్యములు నగు నెన్నియో సాధనము లిందుల కావశ్యకములై యున్నవి. అదృశ్యకార్యము నొనరించుటకు నదృశ్యములగు నుపకరణములు కావలయును. మానవుఁ డగోచరుఁ డగుట సామాన్య మనుకొంటివా?

వాత:—కాని నీవద్దాని నెన్నఁడైనఁ జేసిచూపఁగలవా? ఏండ్లకొలఁదియైన నిన్ను సేవించెద, నీకార్యమునకు నిను వలయు నుపకరణముల సేకరించుటకు నాకభ్యంతరము లేదు.

కుసుమదంతునిమానము పోవుచుండెను. "మిత్రమా! వాతవ్యాధీ! ఇంతకు నామాటలు నీకర్థమైనట్లులేదు. మంత్రమునకు మానవు నగోచరు నొనరించుశక్తి కలదని చెప్పితిని. నేనగోచరుఁడ నగుశక్తి నాకుఁగలదని చెప్పినట్లు జ్ఞప్తిలేదు." అని యాతఁ డనెను.

వాత:—ఓహో! కాని, నీవృత్తియందుండువాని కెవ్వనికేని నిట్లు మాయమగుశక్తియుండుటను నీవు చూచియున్నావా? చూచియుండిన, నేను నీవెంటవచ్చి యావిచిత్రమును జూడవలయునని యున్నాను.

కుణ:—మిత్రమా! వాగవ్యాఘ్రీ! నాకంతశ్లాఘకములేదు. నిజముగ తలయూననిన, నగోచరమగు సామర్థ్యము చాణక్యునికిఁదప్ప మఱెవ్వరికిలేదని నాయభిప్రాయము.

యశో:—చాణక్యుఁ డంతశక్తిమంతుఁడయ్యెను, నగరమునుట్టఁబడి సంకటమొందుచుండెను. ఇఁక నేటి కీవృథాప్రసంగముచాలును. ఇప్పు డీ క్రూరుల నేమిచేయుదము!

వాగ:—చంపివేయుదము. ఈనీచాత్ములు మనలను రహస్యముగాఁ జంపివేయ సమకట్టిరి. వారికిఁ దగినశిక్ష, వారిని మృత్యుప్రవాహమునఁ ద్రోయుటఁదప్ప వేఱొకటిలేదు. ఆవిషజలము వారికే త్రాఁగనియ్యవలయును. నాయుద్దేశము కౌటిల్యుని యర్థశాస్త్రసిద్ధాంతములతో సరిపోవుచున్నది. ఆవిషజల మిప్పుడు లేదు గాన, వారిప్రాణములఁ దీయనగును.

కుశ్రా:—అవును. వారిప్రాణములఁ దీయుదము. నాయభిమతమును గూడ నయ్యదియే. వీరి నిపుడు ప్రాణములతో వదలినయెడల, సంగతులు లోకమునం దంతయుఁ జాటి మనలను మహాలోకాపానలజ్వాలల కాహుతి గావించి కాని వదలరు.

కుణ:—అవును. వారిఁ జంపివేయుదము. నాకోరికయుఁగూడ నదియే. వారు చచ్చినచో, మనకిఁక విషమిచ్చినవా రెవ్వరుండరు. వారు సప్రాణులై యుండినయెడల, నాకు వారనిన మహాదుస్స్వప్నముగా నుండును. వారు ప్రాణములుఁబాసి ప్రేతలైనయెడల నామంత్రమహిమచే వారిని క్షణములో స్వాధీనమొనరించుకొందును.

ఉద:—వారిం జంపుటయే మంచిది. నాయభిప్రాయముగూడ నదియే. మనము త్రాగనుండు పదార్థములో విషమిడుటకు వారు ప్రయత్నించిరి. ఆవిషమును వారు చేతిలోఁగలిపియుండినయెడల వారి పాపము క్రూరతరమైయుండెడిది. కాని యిప్పుడుగూడ నీకార్యము క్రూరతరమనుటకు సందియములేదు. మానవ

ప్రాణభీతిచేతను, పసిఁడిపైని భ్రమచేతను నాతఁడీనీచకృత్యమునకుఁ బాల్పడి యెను. మీకాతని క్షమియింపఁదలఁచుటకుఁ జోటులేదు. కాన నాతనిఁ గఠినముగ దండించి, బాధావిముక్తుఁ జేయుట సమంజసము.

వారిమాటలన్నింటిని యశోధర్మ యాలకించుచుండెను. అతఁడు వసంతతో ' వసంతా! నీయభిప్రాయ మేమి?'' అని యడిగెను.

వసంతకు లజ్జకలిగెను. ''దేవా! నేను బీదరాలను. గొల్లదానను. కన్యను. అట్టియెడ మీరిరువురు చిత్తగించిన సమంచితాభిప్రాయములకు నాయభిప్రాయమునకు హస్తిమశకాంతరము గలదు.'' అని యామె చెప్పెను.

యశో:—ఉండవచ్చుఁగాక! ఏపుట్టలో నేపామున్నదో యెవరి కెఱుక? ఏచిక్కులవిడఁదీయుట కేవ్యక్తికడ సిద్ధికళలఁగలవో యెవరికిఁ దెలియును. కాన నీయభిప్రాయమును నేను వినవలయును.

వసంత:—దేవా! మీరు నాయభిప్రాయము వినవలయునని యున్నారుగాన విన్నవించుకొందును. దానికి విలువయుండినఁ గాక; ఉండకపోవుఁగాక. వీరిరువురు రెండుమార్గములఁ జూపియున్నారు. కాని యొక్కటియైన నాకు నచ్చలేదు. వారినిరువురవధించుట న్యాయసమ్మతమై యుండవచ్చును. కాని నేఁటిరాజకీయపరిస్థితులయం దిదియుక్తముగాదు. నీతియుఁగాదు. ఆకార్యము ప్రజాక్రోధాగ్ని కింధనప్రాయమై, యీజ్వాలలను మనపైఁ గ్రుమ్మును. లోకులు కాకిమూఁకలు. మీరు తలకుమీఁటి శిక్షించితిరనియు, కఠినకర్ములనియు వారు మిమ్ము నిందింపకపోరు. రాజకార్యసంసిద్ధికిఁ గొన్నియెడల విషప్రయోగము సైతము నీతిబాహ్యము కాదని యెల్లరకు విదితమే కదా! ఆయభిప్రాయము ప్రమాదజనితము. కాని యది యాచరణలోనున్నది. 'పదుగురాడుమాట పాడియై ధరఁ జెల్లు' ననుట లోకప్రసిద్ధముగదా! పతికి విషమిడినసతిని దండించునంతకఠినముగా నిరువురు వీరలఁ దండించుట ధర్మవిహితముగాదు. అట్టిపాపములగు నీయతీశ్వరుల యభిప్రాయమునందు నే నేకీభవింపఁజాలను. వారియభిప్రాయము కొంతయు సత్యము. కాని రాజకీయ

మాత్రశక్తిమాని, మాకు స్వాతంత్ర్యమొసఁగియుండెను. కాని మాయందు దినము లంతతో సంతరించెను. వానిని నేను మరలఁ బడయఁదలంచి యీ మహారాణుల నాశ్రయించితిని. భగవానికి విప్రద్రోహ మొనరించుట ధర్మబద్ధ మగు రాజకీయసిద్ధాంతమని నానమ్మకము. దానిం జేసియే యీకార్య మొనరించితిని. చేయరాని కార్యమును నేను జేయలేదు. కాన నీవిప్పుడే నన్ను బంధవిముక్తుఁ గావింపుము. లేకున్న మహారాణీ క్రోధాగ్నికీలలు పైకిఁ దిరుగును. ఆకీలలవేడిమి నిను దహించుచున్నదిగదా! నన్నుఁ జంపుటగాని, కైదిగానుంచుటగాని, నీకు క్షేమముగాదు. ఇష్టము లేకున్నను, నన్ను విడువక నీకు గత్యంతరము లేదు. నాకుఁ జరుపకుండినచో, వికలప్రయత్నములను కొంతకాలము పట్టును.

కమ:—నేను రెండుమూఁడుమాటలు విన్నవించుకొందును. దేవర వారు గొప్పవారు. పరాక్రమవంతులరు. ఉదారచరితులరు. ధీశాలులరు. కరుణానిధులరు. సద్గుణసంశోభితులరగు మీరు నన్ను జంపుటకైనను, కైదీగాఁ గొనుటకైనను గలనైనఁ దలంపరు. నన్ను మీరు విడిచిపుచ్చెదరని నానమ్మకము. చోళరాజ్యమునకేసి, పాండ్యభూమికేని నేను వెడలిపోయెదను. తిరిగి రానని ప్రమాణమొనరింతును. నా వెంట వసంతకూడ రానున్నది.

వసంత యందులకుఁ గోపగించుకొని "ఓహాంతకుఁడా! నేనురాను" అని కఠినముగాఁ బల్కెను.

"అయిన నొంటరిగాఁ బోయెదను. ఏకాకినై వెడలిపోవుటకుఁగూడ నేను సంతసింతును. నేను దరిద్రుఁడను. వంటచేసి బ్రదుకువాఁడను. నీచాతి నీచుఁడను. దేవరవారిదర్శనము చేసికొనుటకైన నాకర్హత లేదు. ఓ దేవా! నన్ను రక్షింపుము. నన్ను రక్షింపుము." అని కమలాక్షుఁడు రాజుని పాదములఁ బట్టుకొని "నేను బ్రాహ్మణుఁడను. మీరు క్షత్రియులరు. నన్ను రక్షించుట మీపనికాని, చంపుటగాదు. అయ్యో! అయ్యో! నన్ను చంపకుండునట్లు దయ చేయుఁడు. అంతమాత్రము పుణ్యమునఁ బొందుఁడు" అని పెద్దపెట్టున నేడువ

సాగెను. కమలాక్షునికన్నులనుండి బాష్పజలము కాలువలుగట్టి పాఱుచుండెను.

యశోవర్మ వానిని లేవనెత్తి ప్రాణదానమొసంగెను. ఆమాటలకుఁ గమలాక్షుఁ డానందపరవశాంతఃకరణుండై "ఓ దేవా! నీవు నా పాలిటి బ్రహ్మదేవుఁడవు. ఆ బ్రహ్మదేవుఁ డొసంగిన ప్రాణములను నేను బోఁగొట్టుకొంటిని. నీవు మరల వాని ననుగ్రహించితివి" అని యాతనిఁ గొనియాడెను.

యశోవర్మ కొంచె మాలోచించి "ఏమంతయభిప్రాయము సర్వోత్తమమైయున్నది. వీనిని పురమునకు తీసికొనిపోదము" అనెను.

కమలా:— అయిన నన్నుఁ గూడ మీవెంటఁ గొనిపొండు. ఇఁక నే నిచట నిలువనోపను. నేను సుఖముగఁ గాంచి, మీ కాంతలయూడిగమునఁ బొట్ట పోసికొనుచుండెద.

యశో:—ఇట్టి ప్రజ్ఞావంతుని, విశ్వాసపాత్రుని, బనికత్తెగాఁ గదసినంతులను వారియూనంద మహానందమై యుండును. ఇఁక మనము భోజనమునకుఁ బోవుదము, రండు.

వారు:—భద్రము. భద్రము. ఆపాత్రలయందుమాత్రము విషము లేదని మన కెట్లు నమ్మకము?

కమ:—అవి విషపూరితములు కావు. కానే కావు. ప్రమాణము చేసి చెప్పుచున్నాను. ఆవిషము సీసలోమాత్ర ముంచితిని.

వారు:—అసత్యరాత్ముని నేను విశ్వసింపను. ఇంతవరకు నుపవసించియున్నాను. ఈపూట కన్నము లేకున్న మానెఁగాక. నేఁడు లేనియన్నము రేపురాదా! కాని పోయిన ప్రాణము మాత్ర మెట్లువచ్చును!

"నిజము. నిజము. ఈరేయి మేముకూడ బస్తుండ నిశ్చయించితిమి." అని బృహస్పతి, శుక్రాచార్యు లనిరి.

ఉద:—మిత్రులారా! మీపలుకు లెంతయు నిజము. కాని యుపవసించుట మాటలు చెప్పునంత సులభముగా నుండదని నాయభిప్రాయము. వాత

సుంచునట్లు వారిచే బాసచేయించుకొనెను. అతఁడు వసంతను "వసంతా! ఇంకను నీవు నావెంటవచ్చుట కిష్టపడుచున్నావా?" అని ప్రశ్నించెను.

వసంత:—అవును. ఇచట నాకు సౌఖ్యము గానుండదు. ఇఁక నే నే మాత్ర మిచటనిలిచినను, నాజీవితము దుర్భరమైపోవును.

యశో:—అయిన నావెంటరమ్ము.

ఆమెను దనగుఱ్ఱముపై గూర్చుండఁజేసి, యశోధర్ముఁడు దానెక్కెను. వాసుదేవకమలాత్ము లెక్కియుండిన గుఱ్ఱపుఁగళ్లెము నంటుకొని, యశోధర్ము బయలుదేఱెను.

---

డానా కాశ్రయమునందుండు పరాజితులు తమవ్యాకులమనోభావముల నెంత యణఁగుపఱుపఁ బ్రయత్నించుచుండినను, నయ్యది వారిముఖదర్పణముల సువ్యక్తము లగుచుండెను. కాని వారిలో నొక్కవ్యక్తిమాత్రము నిరామయ చిత్తుఁడై యుండెనని యాతని మోముతీరు చెప్పకయే చెప్పుచుండెను. అతఁడే మనబాలాదిత్యుఁడు. అతఁ డొకయెడ బరమార్థితో సంభాషించుచుండెను. అప్పుడు రామచంద్రుఁడు వానిఁ జూచి "ఆర్యా! నావ రేవు నాయకులందఱును. విశ్వామిత్రులాముఖ్యులెక్కడ? అని బాలాదిత్యునిఁ బ్రశ్నించెను.

బాలా:—ఇంతవఱకు వారిపొలఁకువయే లేదు. కాని వారల ననుక్షణము నిరీక్షించుచున్నాను.

రామ:—నియమితకాలమునకుఁ దర్వాత నొక్కదినమైన నిలుప జాలము. ఇప్పుడు సముద్రము ప్రశాంతముగా నున్నది. మనము కేరళము నకుఁ జేరుటకు ముప్పదిదినములైనఁ బట్టును.

బాలా:—నేనేమి చేయుదును? వారు లేక నేను రాఁజాలను. వారి కట్లు మాటయిచ్చితిని. మా తండ్రిగారు నా చేతఁ జిక్కిరని. అట్టియెడ వారలను నిర్దయహృదయుండనై హూణులవాతకై విడిపోవుటకు నాకిష్టము లేదు.

రామచంద్రు. శోకించుక నీవు బాలాదిత్యుని నిశితవీక్షణములఁ జూచుచు రహస్యముగా "ఆర్యా! నీవు హూణవిరోధివా! మఱి మీస్నేహితులుంగూడఁ దోరమానుశత్రువులా!" అని యడిగెను.

అందులకుఁ బరమార్థి "మిత్త్రమా! అట్లడుగుచున్నావేమి! సముద్రయానార్థమై నౌకనుపచ్చియుండువారిపై నిట్టిప్రశ్నావళిఁ గురిపింపరాదని నీ వెఱుంగవా?" అనెను.

రామ:—కాదు కాదు. అతనిఁ జిన్నపుచ్చవలయునని నా యభిమతము కాదు.

బాలా:—రామచంద్రా! హూణక్రోధానలమునకు నీవు భయపడుచున్నావా!

రామ:—(రోషముతో) నేనా? నాకా! హూణులందనిన నాకా భయము. ఓయువకుఁడా! నిర్వక్రపరాక్రమోజ్జ్వలుఁడగు సముద్రుని సంక్షోభములఁ జూచికొనని నేనా, హూణులందనిన వణఁకుట! సంక్షోభసమయమున సముద్రుఁ డొనరించు వజ్జకల్లోలములకు ముందు మిహిరగులుని రాక్షసకృత్యములు లెక్కకువచ్చునా! పంచభూతములతోడి పోరాటమునందే నాజీవితము గడచిపోవుచున్నది. సర్వశక్తిసమోపేతమగు ప్రకృతికిని, తుచ్ఛమగు పౌరుషమునకు నెంతయో వ్యత్యాసముగలదని నాకుఁ దెలియును. లేదు లేదు. మిహిరగులుండనిన నాకు భయములేదు. నీవు హూణవిరోధివనితోఁచి నందున నిట్టిప్రశ్న మొనరించితివి.

బాల:—నీకు హూణభయములేదని వినుటకు నేను సంతసించుచున్నాను. కాని నేనుమాత్రము హూణవిరోధియగుట నిజము. అందుచే నామిత్రులకొఱకై నాకించుక యాతురముగా నున్నది.

సర:—ఓహో! అవచ్చువాఁడు దొంగలరాయఁడు హరిరాముఁడు గదా?

హరిరాముని పేరు విన్నంతనే యాత్రాజనసమూహమునం దలజడి పుట్టెను. పడవవాండ్రందఱు విస్మయభయాక్రాంతచేతస్కులై తమతమపనులను భద్రపఱచుకొనసాగిరి. కాని బాలాదిత్యునివదనాంబుజ మానందప్రఫుల్ల మయ్యెను. తనపూర్వస్నేహితునిఁ గలిసికొనుటకుఁ బరమార్థి యువ్విళ్ళూరుచుండెను. రామచంద్రుఁడుకూడ నాతురతాపన్నుఁడై యుండెను. పరమార్థి సూచించిన దిక్కున కందఱవలోకనములు వ్రాలెను. తమ కభిముఖముగా నలుగురు మానవులు వచ్చుచున్నారని వారు గ్రహించిరి. అవచ్చు వాఁడు దొంగలరాయఁడు హరిరాముఁడే. అందుకు సందియములేదు. రఘుపతి, భద్రబాహువు, సరస్వతి-మువ్వురు నదవిగుణ్ణములై నాతనివెంట వచ్చుచుండిరి. వారు మువ్వురు బడలియున్నట్లగుపడుచుండిరి. కాని సరస్వతి పరిశ్రాంతయై యుండియుఁ ద్రిలోకసమ్మోహనకరమగు రూపసంపదతో నలరారుచుండెను.

పొనబెట్టినను నారత్నము కాంతుల నీనుచుండెను. 'ఈయచ్చరవువ్వెకంటి యెవ్వరైయుండును!" అని రామచంద్రుఁ డాలోచించుచుఁ బరధ్యానమున మునిఁగి, హరిరామునిఁగాని, యాతని రాకనుగాని గమనింప మఱచిపోయెను. హరిరాముఁడు బాలాదిత్యుని పరిహసించి, "గొంతుపైకివచ్చినకత్తుల కెన్నింటినో తొలఁగించుకొని, కడ కెట్టులో యిక్కట్టుల నిచటికిఁ జేరఁగఁగలిగితిమి" అని హెచ్చరించుకొనెను. అంతలో నాతఁడు పరమార్థిఁ జూచి, విస్మయ మొంది "ఆహా! పరమార్థి, రామచంద్రు లిచటనే యున్నారా!" అని యనెను.

ఈకుశలప్రశ్నము పరమార్థిరామచంద్రుల మానసములయందు వివిధ భావములకుఁ బోటిచ్చెను. కాని రామచంద్రుఁ డంతలో సమయస్ఫూర్తి వహించి "అవును. హరిరామా! మేమిచటనే యున్నాఁడము. ఆహా! మన మొండొరుల జూచి యెంతకాలమాయెనది. అవును. ఈయెనిమిదేండ్లుగాఁ గాననమునందు నీవును, సముద్రమునందు నేనును గాలము గడపుచుంటిమి. ఉజ్జయిని యెట్టిదో నేను బూర్తిగా మఱచిపోతిని" అని ప్రత్యుత్తరమొసంగెను.

పర:—అందు విస్మయమేమున్నది! ఈముగ్గురుస్నేహితు లెవరో మన మెఱుంగవలయును.

హరి:—ఈతఁడు భద్రబాహువు. ఉజ్జయినీ పౌరశేఖరుఁడు. జైనుఁడు. ఈతఁడు రఘుపతి, ఉజ్జయినీపౌరపుంగవుఁడు. ధర్మైకనిరతుఁడు. ఈమె యీతనితనయ. సరస్వతి. ఈమె నాకుమారిత.

పర:—నీకుమారితయా!

హరి:—అవును. ఈమెను నేను పుత్త్రికగా స్వీకరించినాఁడను. ఈమె యిపుడు నా నారాయణిసుమా!

నారాయణిపేరు విన్నంతనే బాలాదిత్యుఁడు, పరమార్థి, రామచంద్రుఁడు, సరస్వతి, భద్రబాహువు, రఘుపతి, అందఱు దుఃఖించిరి. వారినయ

నములు బొమ్మపుఁబొరికము లయ్యెను. హరిరాముని యశ్రుకణములఁగని వారుకూడ గంట నీరుగార్చిరి. దయార్ద్రహృదయులగువారి గాంచి, యా దొంగలమిందని కాఠిన్యహృదయముకూడఁ గఱగెను. ఇన్నియేండ్లుగా దన్నుఁ గనికరించినవారల నాతఁడు గాంచియుండలేదు. అతనిహృదయము కఠినశిలా యద్రిశిలకూటమున నానావికసులనుండి వెల్వడసాగెను. హరిరాముఁడు కుఱ్ఱవానివలె వెక్కి వెక్కి యేడ్చుచుండెను. బొమ్మవారి కాలువలుగట్టి ప్రవహించుచుండెను. అందఱకు నాశ్చర్యమయ్యెను. హరిరాముఁడు విలపించుట సింహదమునకు నెవ్వరు చూచినవారు కారు. చోరనాయకుఁడగు హరిరాముఁ డంత దుష్టుఁడని సంశయము వారికిఁ దోఁచెను. హరిరామునియంతరాంగమున వ్యక్తులచిత్తమై యుండిన మానవశీలములంత నిప్పు డాతనియందు సోదరమానవునియెడఁ జూపుటకుఁ గావలసినప్రేమయు నిండారఁ గలిగెను. వానిచూపులు కరుణారసపూర్ణము లై యుండెను. నరసయ్య మాదొంగలరాయుని చెంతకు బోయి “బాబూ! ఏ విధమున నేను నీకు నుపకరింతును? నేనిఁకమీఁద నీ నాయకుఁడనై యుండుమని చెప్పితివా!” అని యనునయించెను. కాని హరిరాముఁ డింకను పెద్దపెట్టున నేడ్వ మొదలిడెను. “ఓ అమ్మాయీ! ఓ తల్లీ! నన్నేడువనిమ్ము! నేను విలపించి చాలకాలమైనది. విలపించుటయనఁగూడ మఱచితిని. నాకన్నీటిబుగ్గ పట్టిపోయినదనుకొంటిని. నీయనురాగంపు టింపున నేను బోఁగొట్టుకొనిననిధిని మరలఁ బడసితిని. ఆహా! సంతోషసంతాపవిహీనమగు మానవ జీవనము కాల్పనా!” అని హరిరాముఁడు పలికెను.

భద్ర:—దైవభగవానుఁ డేమిసెలవిచ్చెనో తెలియునా? సంతోష సంతాపములు మర్త్యులనిమిత్తములు. అద్వంద్వములను జయించుట కాతఁడు ప్రయత్నింపవలయును. ద్వంద్వాతీతుఁడే ముముక్షువనఁ జెల్లును.

రామ:—దైవభగవానుఁ డేమైనఁ జెప్పియుండవచ్చును. ముద్దుబిడ్డల తొక్కుపలుకులకు మురియనివానిఁగాని, నారాయణిపోలినమానవతి దుర్మరణమునకుఁ గంటఁదడిపెట్టనివానిఁగాని, మన మేమని తలంతుము.

బాలాదిత్యుఁడు వ్రాసియుండిన చిత్రమును మఱల్చుకొని సరస్వతి "ఆహా! అంతకన్న నాకుఁ బ్రమోదావహ మింకేమికలదు!" అని పలికెను.

పర:—భద్రము. అలౌకికమగు నీరూపమును గాంచి నాతనయ పార్వతి యసూయపడును. తాను సౌందర్యప్రభావమూర్తినని యామె గర్వించుచుండును. కనుకనీరూపమునఁ దనకేనయగుశయుం డగపడినచో, మఱుక్షణమునందే యామెకు మిక్కుటమగుకోపము వచ్చుటకలదు.

సర:—ఆవిషయమును నాకు విడువుఁడు.

పర:—అయిన రమ్ము. పోదము.

రఘుపతి, భద్రబాహుఁడు, బాలాదిత్యుఁడు, హరిరాముఁడు, సరస్వతి, పరమార్థి వీరు ధనభూషణునిగృహమునకుఁ బోయిరి. ధనభూషణపరమార్థులు చిరస్నేహితులు. బాంధవులు. పరమార్థి భార్యాపుత్త్రికలు ధనభూషణునియింటి యందే విడిసియుండిరి.

అట్లు వారందఱు ధనభూషణుని విశాలోన్నతహర్మ్యముఁ జేరిరి. పరమార్థి తనయువతీబృందమునుదీసికొని, చక్కఁగాఁ దనపుత్త్రికుమారిక లుండు గదికిఁ బోయెను. అతఁడు పార్వతిఁ జూచి "పార్వతీ! ఈమె నీసఖి. పేరు సరస్వతి. కాని యీమెనుజూచి యసూయపడకుముసుమా!" అనెను. ఆమాటలకుఁ బార్వతి చిదటించుకొని "నీకెంత తెగువవచ్చినది! నీవి కేమఱపోవల దయ్యెను." అని పలికెను. అనంతర మాకోమలి, సరస్వతికి స్వాగతమొసంగి కుశలప్రశ్నపూర్వకముగా సన్మానించెను. సరస్వతిని పార్వతి తనతల్లి లక్ష్మికిఁ జూపుచు "అమ్మా! రానురాను మాబాబునడవడి నాకు దుస్సహమగుచున్నది. సరస్వతిపై నసూయఁ జెందవలదని మందలించి నన్నితఁడు నలుగురిలోఁ జిన్న బుచ్చినాఁడు. ఈమెను నాసహోదరిగా భావించుచున్నాను. ఈ నాచెల్లెలిపై నాకెందుల కోర్వలేనితనముండును." అని చెప్పెను.

"అమ్మాయీ! ఎప్పటికైన నీమాట నువ్వు లొక్కటి; గాండ్లవాఁడే వేఱు. మీయుల్లిబిగదములలోని నాకేల! నేను నిన్నుఁ గైవసముచేసికొనివచ్చునప్పుడంత

యము, వివాహము నిన్ను బుజ్జగించి యొడిలో కైచుకొనుచుండును. అప్పుడు నేను దిక్కులేక నిలువబడలేకయుందును.” అని లక్ష్మి నవ్వెను. పార్వతీపరమార్థులుకూడ నవ్విరి.

భద్ర:—మాకైనపరమార్థుఁ డిట్లేకదా సెలవిచ్చెను. 'పోరాటములం దన్నిటికిఁగాని పక్షము లవలంబింపకుము. నీకోర్కమెక్కువని హాయిగానుండినచో నిష్పక్షపాతబుద్ధితో మధ్యస్థ మొనరింపుము.'

పర:—ఎంతయును నిజము. లక్ష్మీ! ఇది నీకొఱకై చెప్పినమాట.

లక్ష్మి:—అదో ధనమునకై కైనపరమార్థునకుఁ గృతజ్ఞురాలను.

పరమార్థి, బాలాదిత్యుని, హరిరాముని, భద్రబాహులను, రఘుపతిని కొంటెశెట్టిగారిని, ధనభూషణుఁడిగరికిఁ బోయెను. తనమిత్రుని, మిత్రుని మిత్రులను ధనభూషణుఁ డంచితరీతి గౌరవించెను. నగరమునందలి విఖ్యాతసంగీత విద్వాంసుల నాహ్వానించి, అతి గౌరవపూర్వముగా నాఁటిసాయంకాల మొక సంగీతసభను జరిపి, ధనభూషణుఁడు సమ్మానము గావించుచుండెను. ఆట్టి గానసభ కతిథులు విముఖులైయుండుటను పరమార్థి గమనించి యాకార్యమును విరమించునట్లు ధనభూషణుని నొప్పించెను. అందఱును లేచి, ధనభూషణుని సౌధప్రాకారమునందలి ప్రమదోద్యానమునఁ బ్రచారోనరింప సాగిరి. కుసుమితలతాంతములతోడను, ఫలభారవినమ్ర పాదపములతోడను, అల్లిబిల్లిగఁ దిరిగియుండు కాలిబాటలతోడను, ఆయుద్యానరాజము మనోహరమై యుండెను. బాలాదిత్యుఁ డావనాంతరములఁ జేరి ప్రొద్దుపుచ్చుచుండెను. ఆ రాజకుమారుఁ డొంటిపై నిలుచుండి యధోవదనముగ నేమియో తలపోయు చుండెను. వీటిలో నాతం డొక్కమాఱు కన్నులెత్తి చూచెను. యూపాందిత లావణ్యరాశియో యనఁ దనయెదుట సరస్వతి యొకశిలాఫలకముపైఁ గూర్చుండియుండెను. సునీతములును, సుకుమారములును, సానురాగములు నగు విలోకనమాలిక లాచంద్రముఖనేత్రములనుండి వెలువడి యాతనిపై వ్రాలు చుండెను.

"హృదయాంతమున కద్దుకగిరిలోనే యని నాకుఁ జింతగా నున్నది. సెలవొందెదను." అని పార్వతి నవ్వుచుఁ బలికెను.

సరస్వతి విభ్రమముఁ జూపి "పార్వతీ! ఉండుము. పోవలదు. నీకు నాపై ననురాగముండినచో, నీవు కదలవు" అనెను.

"అయిన నే బోను. అవునమ్మా! ఎంతయో కన్నులకుం బండువైయుండెను. 'సరస్వతీ! ప్రాణనాయకీ! నీవు లేని నాజీవితము చీకటి కొనయగుఁగదా!' అని యాతఁడనుటయుఁ, 'మనోహరా! నేను నీదానఁగదా' అని నీవనుటయు దివ్యముగానుండెను. కాదా మఱి" అని పార్వతి వికటముగా నవ్వసాగెను.

స:—పార్వతీ! ఆవిషయమును వెల్లడిచేయకుము...... చేయుదువాయేమి?

పార్వతి:— చేయను. ఇంతకును దీనియందు బాహ్యమందికి దాఁచరాని దేమికలదు? కల్యాణమునకుఁ బూర్వము వధూవరుల కిట్టియనుభవము గూఢమే సుమా! కొందఱికీయనుభవము చిరకాలము నిలిచియుండును. మఱి కొందఱికిఁ దృణాగ్నివలె నప్పుడే చల్లాఱిపోవును.

అనంతరము పార్వతి బాలాదిత్యునివైపు తిరిగి యభిమానపురస్సరముగా "వయస్యా! నేఁడు సుదినము. మానవసౌఖ్యములకు నిర్మితమై యుండు రత్నపుగని నేఁడు నీయధీనమైనది. విశుద్ధమగు ప్రేమామృతమును నీకుఁ బ్రసాదించిన శుభచారిత్ర, సౌందర్యరాశి, యీ సరస్వతి యెంతయు వంద్యురాలుసుమా! ఆమె యపాత్రదాన మొనరించె ననుమాటమాత్రము మాకెన్నఁడు రానీయకుము. అపూర్వమును అనర్ఘమునునగు నిట్టిపారితోషికమును దుర్వినియోగ మొనరించుచుండువారు కొందఱు నేఁడు కానవచ్చుచున్నారు. వారికి నీవర్తన మాదర్శప్రాయమై అనుసరణయోగ్యమగుఁగాక!" అని ప్రస్తుతించెను.

లేదు. బ్రాహ్మణపురోహితులు నిర్మితులైరి. వివాహోచితసన్నాహములు క్షణములో నయ్యెను. హోమమునకుఁ గావలసిన ప్రయత్నములఁ గావించు, మహాసేనుఁడు రాజపురోహితుని బాలాదిత్యునివిడిదికిఁ బంపెను. శుభోదర్కముగాఁ దెల్లవారెను. రాజమందిరమునుండివచ్చిన బాజాబజంత్రీలు పెండ్లిపాటలు పాడసాగిరి. మేళతాళములు చెవులఁ జిల్లులచేయుచుండెను. అసంఖ్యాకులగు విప్రవరులు మంత్రములఁ జదువుచుండిరి. లక్ష్మీపార్వతులు బాలాదిత్యసరస్వతులకు పెండ్లియలంకారము గావించుచుండిరి. ఆసమయమున వారు లక్ష్మీపార్వతుల చేతికీలుబొమ్మలై యుండిరి. ఉదయమే వధూవరులు మంగళస్నానము గావించిరి. పార్వతీపరమార్థులు పారితోషికములుగా నొసంగిన యమూల్య వివాహాంబరములు ధరించిరి. ప్రత్యక్షమగు హవ్యవాహనుని యెదుట నావధూవరు లాసీనులైరి. శుభముహూర్తకాలము సమీపించెను. బాకాశబ్దములు, మంగళవాద్యములు, శంఖారావములు, నాగస్వరనినాదము లొక్కుమ్మడి ఘనఘోంకారరాశుల నించెను. సప్తపది పూర్తియయ్యెను. బాలాదిత్యుఁడు సరస్వతికరగ్రహణ మొనరించి, యేడడుగులు నడపించెను. పండితులతో వివాహకార్యము ముగిసెను. ఇఁకఁ గలకాలము పవిత్రమగు దాంపత్యమైత్రికి లోటులేదు. ఇప్పుడు సరస్వతి బాలాదిత్యుని కర్ధాంగి. అతని ప్రాణము సహధర్మచారిణి. సచివురాలు. స్నేహితురాలు. ఆవధూవరులపవిత్ర ప్రేమ నిష్కళంకమై, నిరుపమానమై యపారమైయుండెను. కన్యాదాన మొనరించినరఘుపతి బాలాదిత్యునివంటియల్లునిఁ బడసినందులకై మురిసికొనుచుండెను. షష్టివివాహమునకు విచ్చేసియుండిన మహాసేనుఁడు, రామచంద్రుఁడు మున్నగువారు పరితోషాంబుధి నోలలాడుచుండిరి. గణనాతీతులగు బీదలకు మహాసేనుఁడు నానా దన్నప్రదాన మొనరించెను. పరమార్థి బ్రాహ్మణసమారాధన మొనరించెను. ఆదిన నెక్కడఁ గాంచినను సంతోషారావములే. ఎక్కడఁ జూచినను మంగళవాచకములే. ఆనంద మెల్లెడల రూపొందియుండెను. ఆ నాఁటిసాయంకాలము వధూవరులు హోమముచేసిరి. రాత్రి విందులు, వేడు

# ఇరువది రెండవతరంగము.

## కాలాగ్ని, సర్వసమ్మతుఁడు, సుమతి.

ఆనాఁ డట్లు హూణులు మిహిరగులుని యుజ్జయినికిఁ గొనిపోయిరి గదా! తనమూర్ఛకు దోరమాణుని కెలంగింపవలదని మిహిరగులుఁడు వారికి గట్టికట్టడఁ గావించెను. ప్రేమాపకారుఁ డగు తోరమాణుఁడు తాను లోనైన కష్టముల నాకర్ణించినచో, దుఃఖించునని యాతం డట్లొనరించెను. మీఁదు మిక్కిలి తనకు దొంగలతోడి పోరాటమునందు గాయమయ్యె నని పరులు వినిన నవ్వుదురని యాతఁడు సిగ్గుపడుచుండెను. కాని మహారాణి తుషవ్వ 'దండయాత్ర సంగతియేమి?' అని యువరాజు ననుగమించియుండిన రౌతుల నడిగెను. సంధిగులను మరలఁ జిక్కించుకొంటిమనియు, యువరాజుగారు శత్రుమధ్యమునకుఁ దలమిగులఁ బోవుటఁ జేసి, గాయమొందెననియు వారామెకు నివేదించిరి. తోడనే తుషవ్వ తనపుత్త్రునికడకుఁ బరుగిడెను. అతినీరసమునఁ మంచముపట్టియుండు మిహిరగులు నామె గాంచి "కుమారా! నీవు సాహసుఁడవు. నీతండ్రి మహారాజు భూమకమరణమునఁ జేసి యిప్పటికే క్రుంగియున్నాఁడు. ఇప్పుడు నీవు గాయపడితివి. ఈసంగతి మహారాజు వీనులఁబడినచో నాతఁ డేమని తలంచును!" అని వాపోవసాగెను.

మిహి:—ఇది యాతనికిఁ దెలియవలసినంత యవసరమేమి?

తుషవ్వ:—కాని తెలియకపోదు. మీజనకుఁడు ఆవులించినఁ బ్రేవు లెంచువాఁడు. వివేకవంతుఁడు. అతనివంటివారలేక యీహూణులసామ్రాజ్యమును ఏమఱినఁ జేటుకొనఁజాలదు.

వశేష్ప, హూశేష్పలు నన్నుఁ బరిహసించుచున్నారు. కాని యిందులకు నే నేమి చేయఁగలను?

మిహి:—అమ్మా! నాతల గిఱ్ఱుమనుచున్నది.

సుషప్ప యాతనిని శయ్యపైఁ బరుండఁబెట్టి, గాయములఁగడిగి కట్టుకట్టి, కొంత గంజియిచ్చెను. ఆరాజకుమారుఁడు బలహీనతచే నిద్రించెను. ఎంతయో కాల మాతఁడు గాఢనిద్ర నొక్కలాగుండెను. మేలుకువవచ్చి నప్పటి కాతని కెంతయో హాయిగా నుండెను. మహారాణులగు సుషప్ప, వశేష్ప, హూశేష్ప లాతనికి స్వయముగ నుపచారము లొనరించుచు, నాతనిపట్లను బరిచారకుల నెవ్వరిఁ జేరనియ్యకుండిరి. ప్రేమపూర్ణావతారలగు తల్లుల యుపచారములచే మిహిరగులుఁడు కొన్నిదినములలోఁ దేఱుకొనెను. తోరమాణుఁడు పైకిఁ జూచుటకుమాత్రము గంభీరముగ నగపడుచుండెఁగాని, భూమకువిమర్దనమునుండి యాతఁడు లోలోనఁ గ్రుంగిపోవుచుండెను. సోదరవియోగవ్యథానల మాతని హృదయోద్యానమును నానాఁటికి దహించి వేయుచుండెను. మెల్ల మెల్లగా నాతఁడు చరమదశాభిముఖుఁడై యొక్కొక్క యడుగు పెట్టి పోవుచుండెను. ద్రోమాణుఁడు కాలధర్మమొందుటఁ జేసి, యావృద్ధరాజన్యుని యనురాగవల్లిక యాతని యేకైకపుత్రునిపైఁ బ్రాఁకి పైపైఁ జుట్టుకొనియుండెను. ఇప్పు డాతఁడు సుషప్పమాట యనిన నాదరింపసాగెను.

స్వస్థుఁడగుచున్న మిహిరగులుఁడు, తోరమాణునితో నొకనాఁడు రాజకీయములఁగూర్చి యాలోచించుచుండెను. సుషప్పయు నచట నుండెను. అప్పు డొకసేవకుఁ డరుదెంచి "మహాప్రభూ! మహాప్రభూ! హూణగృహమునుండి శోకవార్తవచ్చినది." అని విన్నవించెను.

"ఏమివార్త? ఏమివార్త?" అని తండ్రికుమారు లొక్కమా రడిగిరి.

"నారాయణశర్మనుజంపి, ఖైదీలు తప్పించుకపోయిరి."

మిహి:—నారాయణశర్మ హతుఁడయ్యెనా! ఎవరు చంపిరి!

"దేవా! లేదు. ఆముప్పదిమంది హూణసైనికులు బంధితులను హూణగృహమునఁ బెట్టుకొని వారికిఁ గాపుండిరి. కాని యాఖైదీలు తమ కంటమన్నుఁగొట్టి తప్పించుకొనిపోయిరని తెలిసికొనుటతోడనే, యాహూణు లాత్మహత్యఁ గావించుకొనిరి. హూణనాయకుఁడు కాడ్ఫిసాను దేవరవారి కొకలేఖ వ్రాసియుంచినాఁడు. 'మాయలక్ష్యభావమునకుఁ దగినప్రాయశ్చిత్త మందితిమి. కరుణించి మమ్ము మన్నింపుఁడు. హూణులవలె మేము మృత్యువును గలసితిమి' ఇదియే దానిసారాంశము."

"అయిన వారుకూడ నాశమొందిరికదా" అని తోరమానుఁడు మిహిరగులుఁడును బలికిరి.

తోర:—నారాయణశర్మ యెచట మరణించెను? ఎట్లు మరణించెను?

"[illegible] బంధింపఁబడియుండిన గదియం దాతఁడు చచ్చిపడియుండెను. అతనిపుక్కటయందు లోఁతైనగాయ మొకటియుండెను. దానిచే నాతఁ డసువులఁ బాసినాఁడు. అతని కావల నేలపై నొక లేఁతకొంకాయ కన్ను పొడిచినది కనఁబడుచుండెను. అసురాత్ములు తప్పించుకొని, యీసంగతి యొరులకుఁ దెలియకుండుటకై హూణగృహతలుపులన్నింటిని మరలభద్రముగాఁ దాళము వేసిరి. తాము లేసికొనిపోయినగుఱ్ఱములుదప్ప, మిగిలినవానినన్నింటిని వారు చంపివైచిరి."

తోర:—వారికిఁ దాళపుఁజెవు లెక్కడివి?

"నారాయణశర్మ సరస్వతికడకుఁ బోవునపు డాతనికడఁ దాళపుగుత్తి యుండెను. తనవెంట నామెగది కరుదెంచినహూణసేవకు నాతఁడు వెనుకకుఁ బంపివైచెను. తూఁగుఁబోతగువాఁడు నిద్రించుటకు వెడలిపోయెను. మఱునాఁ డుదయమున నేనుగంటలకు యథారీతిగా కాడ్ఫిసాను నిద్రలేచి, కాల్యకృత్యములఁ దీర్చుకొనుచుండెను. కారాగారరక్షకుఁడు గదిద్వారములఁ దెఱచి, హూణపరాక్రమమును బంధితులకు రుచిచూపుటకై శ్రీశ్రీయువరాజకుమారులుంగారు ముదలచేసినట్లు ఖైదీలను గొరడాప్రేటులఁగొట్టనెంచి, తాళపుఁ

"దేవరవారు నన్నుఁ దప్పుఁ దలంచుచున్నారు. నేను హూణగూఢచారినని యీదొంగలకుఁ దెలిసియుండినచో, దేవరలంద ఱొక్కటై వచ్చినను నన్నుఁ గాచియుండెడివారు కారు. ఆదొంగలమధ్య మెలఁగుచుండినంతకాలము, నేను ఖడ్గధారపై నుండిన ట్లుంటిని. పలుకకపలుకక యొక్క తెలివితక్కువపలుకుపలికి నాకు రాజకీయములందు జోక్యముకలదని వారి కించుకయైనఁ దెలియఁజేసియుండినచో, నేనిప్పటికి యమాలయమునఁ బ్రాఁతకాఁపై యుండెడివాఁడను. దేవరవారికొఱకై నేనిట్టిగండముల నెదుర్కొని తప్పి బయటఁబడిరాఁగా, మీరు నన్ను ద్రోహాత్ముఁగా నంశయించుచున్నారు గదా!"

తోర:— కాలాస్కి! నాపుత్త్రునిపలుకుల లెక్కసేయకుము. వాఁడు పసివాఁడు. వానికి లోకజ్ఞాన మంతగాలేదు. నిర్మొగమోటముగా మాటలాడుట మంచిదన్న యాతనియభిప్రాయము. కాని యెల్లెడల నయ్యది కార్యకారి కానేరదు.

"దేవరమాట సత్యము."

తోర:— ఈదొంగలగుంపును మనము సర్వనాశ మొనరింపఁగూడదా?

"దేవా! అది సులభసాధ్యముకాదు. కాని రణరంగభీములగు మీయట్టిరాజవరేణ్యుల కసాధ్య మేమికలదు? ఇంతకు వచ్చినకష్టమేమన, ఆ దొంగలు మనయెదుటఁబడి పోరాడరు. బిడ్డకుఁ దల్లిరొమ్ములు తెలిసినట్లు, వారి కదవియంతయుఁ దెలియును చూచుచుండఁగనే వా రాప్రదేశములయందు దాగి, మాయమై పోవుచుందురు."

తోర:— కాని వారిపు డనాథులై యున్నారుగదా!

"అవును. కాని యీదొంగలయెడ 'స్వయంరాజా స్వయంమంత్రీ' యనునానుడి యన్వర్థమైనది."

తోర:— హూణులుకూడ నట్టివారేకదా!

"అవును. దేవా! ఆదొంగలకు హూణు లేవిధమునఁ దీసిపోరు."

తోర:—ఓహో! బాలాదిత్యునితోవడిఁదీయుంటకు నీకు నైదువందల నాణెములు కావలయునందువా? ఔనా?

కాలాగ్ని యేమియుం బలుకలేదు. తోరమాణుఁడు సంచివిప్పి యేనూరు బంగారునాణెముల నాగూఢచారి కొసంగుచు "మీరు బ్రాహ్మణులు, మిగుల నేర్పరులు. నిప్పుని బ్రప్పుని, బ్రప్పుని నిప్పుగామార్చి, మీపనుల నెఱవేర్చుకొనుచుందురు. మంచిది. పోయి, నీకార్యమును సాధింపుము." అని కొండాడెను.

"చిత్తము" అని కాలాగ్ని రాజమందిరమునుండి బయటి కరుదెంచెను. భానుగుప్తుం డాతనిసింహద్వారముకడఁ గలిసికొని, నిరపాయమగుస్థలమున కాతని వెంటఁ నడచెను. అచట గాలాగ్ని యాతనితో "నేను నీప్రస్తావనను వదిలి, నీకుఁ బ్రాణదాన మొనరించితిని. ఆకొలఁది నైదువందలనాణెము లిచ్చెదవా?" అని యడిగెను. "ఇదిగో! ఇచటనేయున్నవి" అని భానుగుప్తుఁ డొక బంగారునాణెములమూట నాతని కిచ్చెను.

భాను:— ఆంధభటులలో నొకమాఱు కాపాడిన పురుషత్రయములో మూఁడవవానిని 'కుఁడ' యనట్లు నటించితివని, నాగూఢచారి నాతోఁ జెప్పె…

కాలాగ్ని:— ఔనౌను. సుముఖుఁడుగదా? వాని నచటఁ జూచితిని.

భాను:—అయినఁ గాలాగ్నీ! మూఁడువేలుసువర్ణనాణెముల బహుమతిగా గ్రహించి, హరిరాముని, యాతని యనుచరవర్గమును అరణ్యప్రాంతములనుండి తఱుమనున్నావా?

కాలాగ్ని:—అవును. అందులకు నేను చాలనందువా?

భాను:—నీకసాధ్యకార్యముకలదా?

కాలాగ్ని:—మిత్రమా! చెప్పెద వినుము. గూఢచారునిజీవితమునకు సౌఖ్యమనునదిలేదు. అతని నెవ్వరునమ్మరు. కడ కాతనియజమానులు నైతము నమ్మరు. కొర పాటించుకయైన వాటిల్లిన నాతనికిఁ బ్రాణాంతకమగును. చార

అతఁడు దూర మాలోచించెను. అనంతర మాతఁడు తనపుస్తకభాండాగారము నకుఁబోయి రాజ్యపాలనాక్రమముంగూర్చిన గ్రంథము నొకదానిఁదీసికొని, రాజులఁగూర్చి వ్రాసియుండుప్రకరణమును జూచెను. అతనిచూడ్కికిఁ దగిలిన వాక్య మియ్యది. "తనరహస్యమును — వెల్లడియైనఁ దనకంతమున కుఱిఁదగి లించుదానిని — తెలిసినమానవుని, రాజగువాఁడు న్యాయముగనో యన్యాయ ముగనో పరలోకమునకుఁ బంపివేయుటకై సర్వవిధములఁ బ్రయత్నింపవల యును. ఆమానవుఁడు పతితుఁడై యుండినయెడల నేమివెల్లడిచేయునో, యేమి చేయఁడో చెప్పుట కెవరికిశక్యము? వచ్చినవాలుకయందుమాత్రము సంపూర్ణ విశ్వాస ముంచవగును." భానుగుప్తుఁ డానందాంతరంగుఁడై "ఆహా! వెదుకఁ బోయినతీఁగె కాలఁదగిలినది" అని, కర్తవ్యాంశమును నిర్ధారణచేసికొనెను. ప్రియభృత్యుఁ డగువిశ్వనాథునిఁ బిలిచి భానుగుప్తుఁడు వానిచెవిలో "విశ్వ నాథా! ఇప్పుడే హరిరాముని యడవులకుఁ బొమ్ము. పోయి, దొంగలతో 'లోకమాయని చారుఁ డొకఁడు కాలాగ్ని యనువాఁడు మిమ్ములఁజేరి, కపట వచనలచే మిమ్మునెల్ల వాతమార్చియున్నాఁడు. మీయడవులందు యతిరూప ధారియై దొంగజాడ మొనరించువాఁడే యాగూఢచారి కాలాగ్ని.' అని నచ్చఁ జెప్పుము. ఈసంగతి నొరులచెవులవేయకుము." అని యానతిచేసెను.

"దేవరవారిచిత్తము." అని విశ్వనాథుఁడు వెడలిపోయెను.

"ఇఁక మూఁడుదినములలోఁ గాలాగ్ని యమునింటఁ బ్రాఁతకాఁపై యుండఁగలఁడు. వాఁడు నర్మదానదిగట్టుపై నుండుటేమో కాని, వైతరణీ నదీకూలమునమాత్ర ముండుట నిశ్చయము. హహహహా! కౌసాను! మానవుఁ డొకటితలంచిన, మాధవుఁ డొకటితలంచునుగదా!" అని భానుగుప్తుఁ డను కొనెను. మఱునాఁ డాతఁడు తోరమాణమిహిరగులులకడ సెలవుగొని, స్వరా జ్యమగుపశ్చిమమాళవమునకుఁ దరలెను.

తోరమాణుఁడు కాలిమిహిరుని, సుమతీసర్వజ్ఞులఁగూడి కనుఁగొన యెదురుచూచుచుండెను. భానుగుప్తుఁడుపోయిన యైదవనాఁడు రాజమందిర

రాజాజ్ఞచే నాడూత వెడలిపోయెను. తోరమానమిహిరగులు అత్యాతురతతో సుమతీసర్వసమ్మతులకై యెదురుచూచుచుండిరి. అనుక్షణ మావేగులై తండ్రికుమారులు నిరీక్షించుచుండిరి. కాలాగ్నివలె నాగూఢచారు లిద్దఱుఁగూడ నకాలమృత్యువునకుఁ జిక్కిరేమో యని వారు సంశయించుచుండిరి. కాని వారిసంశయములన్నియు నిరాధారములని తెల్లమయ్యెను. ఏలయన, నొకనెల పిమ్మట సుమతి సర్వసమ్మతు లిద్దఱును రాజసన్నిధిన కరుదెంచిరి. సర్వసమ్మతుఁ డుదయమునవచ్చెను. సుమతి సాయంకాలము వచ్చెను.

సర్వసమ్మతుఁ డరుదెంచునప్పటికిఁ దోరమానమిహిరగులిరువురు కొలువుకూటమున నుండిరి.

ఎప్పటివలె నాగూఢచారి మహారాజునకు సాష్టాంగదండప్రణామము లొనరించి, వినయాంజలియై నిల్చెను.

తోర:—సంగతు లేమి?

సర్వ:—దేవా! బాలాదిత్యుఁడు బారుకచ్ఛమునకుఁ జని, యటనుండి 'విక్రమ' నావపై కేరళపుత్రమునకుఁ బోయినాఁడు. సరస్వతి, రఘుపతి, వారి రాముఁడు, భద్రబాహుండు నాతని ననుగమించిరి.

తోర:—ఈసంగతి మాకుఁ దెలియును. ఈసంగతినిఁ గాలాగ్ని మాకు నివేదించియున్నాఁడు. నీవెఱిఁగివచ్చినవి శేషము లివియేనా?

సర్వ:—కాదు. దేవా! ఇంకను వెక్కులున్నవి. కేరళస్వామి మహాదేవుని ప్రాపున, బాలాదిత్యసరస్వతులకు వివాహమైనది.

తోర:—ఏమీ! మాశత్రువున కాశ్రయమిచ్చుటకు వానికి గుండెలున్నవిగా!

సర్వ:—ఈ తెలుఁగుదిక్కునందలి ధరణీశు లహంకారపూరితులై యున్నారు. వారికి మిన్నుమన్ను కానవచ్చుటలేదు. తనపూర్వుఁడగు నుగ్రసేనుఁ బరాభూతుఁ గావించిన సముద్రగుప్తసార్వభౌముని వంశీయుఁ డొకఁ

రించువా రెందరో గలరు. కళింగరాజన్యునిపుత్రిక యగుచారుమతికిఁ ద్వరలో స్వయంవరమహోత్సవము జరుగనున్నది. అప్పట్టున నచటికిఁ బెక్కుఱుభూమీశులు రానున్నారు. కేరళాధీశుఁడు మహాసేనుఁడుసైత మాస్వయంవరమునకుఁ బోయి, దేశకాలపరిస్థితుల నారసి, సాధ్యమైనంతవఱకు సాయమునుబడయ నున్నాఁడు. గుణసాగర, వ్యాఘ్రరాజుల సంపూర్ణసాహాయ్యమునుబడయుట కాతఁడు కృతనిశ్చయుఁడై యున్నాఁడు.

తోర:—స్వయంవర మెప్పుడు?

సర్వ:—పైనెలలో. మహాప్రభూ! అందులకు దివ్యసన్నాహములు జరుగుచున్నవి. నలుఁబదియొనిమిదిదినములు వెయ్యిన్నినూటయొనిమిదిమంది బ్రాహ్మణులకు సమారాధనలుగావించి, భూరిసంభావనలచే వారిని సంతృప్తులఁ గావింతురఁట. రాజకుమారి చారుమతి కెనయగువిలాసవతి యీసేతుహిమాచలమునఁ గానరాదు. ఆమె సోయగ మలౌకికము. అసదృశము. అత్తరుణి పాణిగ్రహణమునకుఁ బోటీ లతిచుఱుకుగా నున్నవి.

తోర:—ఆరాజకుమారి యంతయందకత్తెయా?

సర్వ:—దేవా! ఆప్రభుతనయ సౌందర్యసౌభాగ్యసౌశీల్యముల నభివర్ణించుటకు భాషయం దుపకరణములులేవు. ఆమె మహారాజ్ఞియై యుండఁ దగియున్నది.

తోర:—అయిన మన మామె కెందులకు మహారాజ్ఞిపద మొసంగ రాదు? ఆసుందరాంగిని మన మిహిరగులునకు వివాహమొనరించుట సమంజసముగదా?

తోరమానునిసూచన సర్వసమ్మతునకుఁ దత్తరపాటొదవఁజేసెను. అంతలో నాతఁడు తెప్పిఱిల్లి "దేవా! సామాన్యురాలగు కళింగరాజకుమారికిని, విశ్వవిఖ్యాతసామ్రాజ్యాధినాథునికుమారునకు నెంతయు నంతరముండును." అని పలికెను.

వజేన్న, హంజేన్నలు మఱేమియు వ్యాఖ్యాన మొనరింపలేకపోయిరి. వారు విధిలేక నోరుమూసికొనిరి.

హంజేన్న:—మహారాజాగారిముందలము మూళిందార్హులము. దేవరమాటను గాదన మేమెంతవారము!

వజేన్న:—సాయుమాత్రపణలుకూడ మాయమైనవి.

తోర:—మంచిది. ఇక్ష్వాకుసంబంధము సానుకూలమగుమార్గము నరయవలయుంగదా!

మిహి:—పరాక్రమోపేతమగు చమూసమూహము నిచ్చి నన్నుం బంపుఁడు. ఆరాజకుమారిని నేఁబట్టుకొనివచ్చెద.

వజేన్న:—ఇట్లుగదా నిజమగుహాజాతుఁడు పలుకును.

తోర:—కాని, మున్ముందు మనము సౌమ్యరీతిఁ బ్రయత్నింతము. ఇట్టి సందిగ్ధసమయముల మనము కళింగులతోఁ బడసగముపైఁ గాలూను టాత్మక్షేమంకరము గాదు.

మిహి:—పేదకోపము పెదవులచేటుగదా! కళింగులకోపము మనల నేమిచేయును?

తోర:—నిరర్థకముగావచ్చును! కాని దానికిఁ బ్రసాధనముల వ్యర్థముగాఁ జెచ్చింపవలసివచ్చును. చతురుపాయముల మొదటి మూఁడుపాయములు బ్రయోగింతము. దాన నుపయోగము లేకుండిన నాలుగవయుపాయమున్నదిగదా! కార్యసాఫల్యార్థము యుద్ధమునకుఁ గలసామర్థ్యము మఱిదేనికి లేదని, నీవయును నేనుగూడఁ దలంచుచుంటిని. కాని వయోభారము భుజములకెక్కుకొలఁది నాయభిప్రాయమును మార్చుకొనుచుంటిని. జయాపజయములు మఱికేమిపై నాధారపడియుండునని నమ్ముము. కాని నీతిప్రయోగమునఁ గలుగుఫలము వేఱు. సర్వసమ్మతా! మనయోజనలు ఫలప్రదములై యావివాహము జరుగుట కుపాయమేమైనఁ గలదా?

భాను:—దేవరవారియాజ్ఞను శిరసావహింతును. కాని, దిగంత కీర్తి విస్తారుఁడగు మనయువరాజునకుఁ గళింగరాజకుమారితోడి వివాహము, హూణప్రతిష్ఠకు భంగకరమని నావిన్నపము.

తోర:—కానేకాదు. హూణులు మీవలెగౌరవప్రతిష్ఠలపై నంతగాఁ బడిచావరు. మేము వర్ణవిభేదములఁ బాటింపము. ఆకారణమున మా మగఁటిమి చేవయొక్కుడయున్నది. మాజాతియందుఁ గులకట్టుఁబాటు లుండి యుండినచో, మీహైందవులకంటె మేము విక్రమాఢ్యులమై యొప్పుండెడి వారము.

భాను:—అదియటుండ, మఱియొకసంకట మున్నది. ఈకళింగులకు సురభిమానము మెండు. తామే యార్యులమని వారు విఱ్ఱవీఁగుచుందురు అట్టియహంకారులు హూణులతోడివియ్యమున కియ్యకొందురా? యని నా సంశయము.

తోర:—అట్లు వారిబుద్ధి గడ్డిమేసినచో మనము వారికిఁ దగిన పాఠముఁ గఱపుదము.

భాను:—దేవరవారి చిత్తము.

అని భానుగుప్తుఁడు కొలువువీడి యావలవచ్చెను. సర్వసమ్మతుఁడు కానుకలంది తోరమానుని సెలవుపొంది, బయటికరుదెంచెను. ఇరువురుఁగలిసి కొంతదూరము పోయినతరువాత, సర్వసమ్మతుఁడు భానుగుప్తునిఁ గాంచి "ఆహాహా! ఎంతవిపరీతకాలమువచ్చినది. నిషాదాధముఁడును నాస్తికుఁడు నగు హూణుఁడెక్కడ? కులాభిజాత్యసంపన్నయగు హైందవనారీశిరోమణియెక్కడ? నక్కయెక్కడ? నాగలోకమెక్కడ?" అని నొచ్చుకొనుచుఁ బలికెను.

భాను:—ఇంతకుఁ జిత్రమేమన, నీవివాహసంధానప్రక్రియ, నాకుత్తుక కురియై తగుల్కొనినది. హూణుఁ డగువానికి నాపుత్రిక నొసంగుటకుమాఱు చావనైనఁ జావ నియ్యకొనుదునే, నీతినియమవిహీనుఁడగు నానిషాదునకు సుక్షత్రియాంగన నిచ్చి పెండ్లిచేయుటకై ప్రయత్నించుచున్నాఁడఁగదా!

సర్వ:—అయిన దీని కీవేల యియ్యకొంటివి

భాను:—నీకుఁ దెలియదా! నా రాష్ట్రము. హూణరాజ్యముఁ బోలి మేర నానుకొనియున్నది. కాని వారిం బ్రతిఘటించి నిలుచుటవలన నాకు సౌఖ్యములేదు. అహా! ఈ పాడుపల్లెపుమాళవమునకంటె, నేను మగధాధినాథుఁడనైయుండినచో, నెంతయు హాయిగా నుండెడిది.

సర్వ:—అది మన కెట్లు సాధ్యము? దైవ మిచ్చినదానితోఁ దృప్తినంది, హెచ్చుగాఁ గోరక తనప్రాప్త మదియే యని తలంచి నిశ్చయంతో స్థిరుఁడై యుండుమానవుఁడే సర్వగుణోత్తముఁడు. వాఁడే ప్రజ్ఞావంతుఁడు.

భాను:—మంచిది. నాకేఁక సెలవు. అన్నట్లు మఱచితి. మహాసేనాని భూవరు లొకటికానున్నారని నీవంటివిగదా! వారియత్నము లెట్లున్నవి? వారు హూణుల నోడింతురా?

సర్వ:—ఏమో, చెప్పఁజాలము. అంతయుఁ గళింగబాలాదిత్యులపై నాధారపడియున్నది. వారుభయులకు మైత్రి కుదిరిన, జయము కలుగుటకు సందియముండదు. లేకున్న, బాలాదిత్యాదులకు సర్వనాశము సిద్ధము. మఱే మియు లేదు.

భాను:—ఒకవేళ వారు హూణు నోడించిరేని మనయుభయులకుఁ గూడ సర్వనాశము సిద్ధము.

సర్వ:—దానికి నీవుమాత్రము దిగులొందనగుఁగాని, నాకు దిగులెందుకు? గూఢచారు, లేరాజునకుఁగాని కావలయును. రాజునకు గూఢచారులు కన్నులవంటివారుగదా! అందున నాయట్టిచతురమతియగుగూఢచారిని వారెన్నటికి విడనాడరు. మేమే గాలి కాచాపపెత్తుచుందుము. పసిపూసి మారేడుకాయఁ జేయుటకు మేము వెనుదీయము. బూటకపుమగఁటిమిఁ బ్రకటించుటకు మేము సంసిద్ధులమైయుందుము. బక్కపీనుఁగులమగు మమ్ముఁజూచి, భయపడువా రెవ్వరులేరు. కాని నీసంగతియే వేఱుసుమా!

భాను:—నిజము. కాలాగ్నిగతియేమైనదో నీ వెఱుంగుదువా?

సర్వ—నగరునకుఁ బోవుతఱి నేఁడు వింటిని. ఎవఁడో యొకదుష్టాత్ముఁడు పగఁదీర్చుకొనుట కీపనిఁ జేసియుండును. లేకున్నఁ జాతురీధురీణుఁడగు కాలాగ్ని కేమి? ఇట్టిదుర్మరణము సంభవించుటేమి! సోదరగూఢచారి యెవ్వఁడైన నాతని యభ్యుదయమున కసూయపడియో, మానవుఁ డెవ్వఁడైన దనరహస్యము లాతనికిఁ దెలిసినవని సంశయించియో, కాలాగ్నిని పట్టిపెట్ట నెంచి యాతనియుదంతమునంతయుఁ దొంగలకుఁ దెలిపియుండవలయును. లేకున్న, వారాతనిసంశయింప వారికి వేఱువెరవెక్కడిది?

భాను:—ఆదొంగలు నాకుఁగూడ నొకబెదరింపుజాబును వ్రాసిరి. నీకది తెలియునా?

సర్వ:—అవునఁట. వింటిని. ఆహా! మహారాణియనుగ్రహసంపాదనమున కెట్టియుక్తులఁ బన్నితివయ్యా నీవు.

భాను:—(కోపముతో) ఏమీ! ఆజాబును నేనే వ్రాయించితినని నీవు తలంచుచున్నావా?

సర్వ:—లేదులేదు. తత్తఱపడకుము. ఆజాబు నీప్రేరణచే వ్రాయఁబడినదని నేను వింటిని.

భాను:—దేనింజూచి, నీవింత తెగువతోఁ బలుకుచున్నావు?

సర్వ:—దేనింజూచియా? కాలాగ్ని ఖండితశిరము నీబసలోఁబడిన ముందటిదినము నీసేవకుఁడు విశ్వనాథుఁడు హరిరాముని యతిథులనుండి తిరిగి వచ్చుచుండెను. నేనుగూడ గూఢచారిననియు, జగజ్జేగీయమానుఁడననియు, నావులించినఁ బ్రవుతెంచునిపుణుఁడననియు దేవరవారు మఱచితిరి కాఁబోలు.

భానుగుప్తుఁడు పెదవులఁగఱచుకొనెను. "ఈ నీయనుమానములను గోరంతలు కొండంతలుగాఁ జేసి, మహారాణికి నివేదింప వచ్చెదవు." అని భానుగుప్తుఁ డుస్సురనుచుఁ బలికెను.

సర్వ:—అంత యవసరమేమివచ్చినది? నీవు నాకేమియుఁ గీడొనరించినవాఁడవు కావు. అట్టియెడ నేను నీకుఁ గీడుఁదలంచుటకుఁ గారణమేది

కలదు! సరియగుకారణముండినఁదప్ప, మే మెవ్వరిమనసు నొప్పించుట కిష్ట పడము. అదియటుండ, ఉత్తరమీఁదికిఁ గత్తివచ్చినప్పుడు, మాకు సాయమొన రించువా రుండరు. ఇది తెలిసి, మేము సాధ్యమైనవఱకు కితరులజోలికిఁబోము. విదితమొట్లున్న నేమి? కాలాగ్నిగతిఁ గన్నులారఁగాంచియు, దేవరవారి జోలికి వచ్చుటకు నాకు మతిపోయినదా యేమి? కాని యొక్కవిషయము. నేను దరి ద్రుఁడను. కూటికిగుడ్డకు వాఁచియుందును. సమయాసమయముల నాకడుపు కాలునప్పుడుమాత్రము, తమరు నన్ను 'అయ్యో!' అనుచుండినఁజాలును. 'దేహి' యనిన 'నాస్తి' యనుట గుప్తవంశీయుం దెలియంగరుగదా!

భాను:—కావలసినది కైకొనుటకు నీ కాటంకము లేదు. మంచిది. పోయి వచ్చెద.

సర్వ:—నాకును సెలవు.

వారు చెరియొకదారిఁ బోయిరి.

రాజాజ్ఞపైఁ బోయివచ్చినసుమతి, నాఁటిసాయంకాలము తోఁట లోన మిహిరగులులసన్నిధికి వచ్చెను. సుమతి బోగముది. మంచుకెక్కిన గూఢచారిణి. స్కందగుప్తసార్వభౌముని సామంతరాజులు కొందఱు తానని యెడఁ గుట్రలొనరించుచుండ, నాతఁడు వారిదుశ్చేష్టితములఁ గనిపెట్టఁ దలంచి, కొందఱుగూఢచారులఁ జేరఁదీసి యావృత్తి కవసరము లగుతంత్రములను వారికిఁ గఱపెను. ఆగూఢచారులలో నీసుమతియు నొక్కతె. సుమతి సంగీతవిద్యయందుఁ బ్రవీణురాలు. నాట్యకళయం దప్రతిమురాలు. కేశసం స్కారణ మొనరించి, రాకుమారికలమనసులఁ జూఱఁగొను నేర్పరి. పూలమాలలఁ గట్టుటయం దతి నిపుణురాలు. ఈయోగ్యలతో నావేశ్యాంగన శాత్రవ రాజాంతఃపురతరుణులఁ జేరి, తనకళాపాటవమున వారిమానసము నాకర్షించి, వారు తన్నించుకేని సంశయింపకుండునట్లు, తనకుఁ గావలసినసంగతులను వారికడనుండి ముక్కలుముక్కలుగా నొలుచుకొనుచుండును. తనకుఁ గావల సిన విషయమంతయుఁ దొరకినతర్వాత, నాగూఢచారిణి తనకు సమీప

బంధువు మరణించె ననువార్తతో, నారాజకాంతలు కాయశేక పాసినట్లు, దొంగయేడ్పులేడ్చుచు వారికడ సెలవుగొనిపోవుచుండుదురు. గుడిని, గుడిలోనిలింగమును మ్రింగులేర్పుగల సుమతియనినc, గాలాగ్ని సర్వనిమ్మతులకు గుండె గాలమైయుండెను. ఆమెతోc బగcబూనుట, కొఱివితోc దలగోకుకొనుటవంటిదని వారు తెలియుచుండిరి. ఆచెలియాలి కిప్పుడు నలువదిరెండేండ్లుండును. చిన్ననాటి నైపుణ్యము, విలాసము, ఇప్పటికిని నామెను విడిచిపోయినవికావు. ఆమెంజూచినతోడనే తోరమాణుcడు మందస్మితమొనరించుచు "సుమతీ! విశేషము లేమి?" అని యడిగెను.

సుమతి:—దేవరవారనుగ్రహింపవలయును. ఈమాఱు నాకార్యభాగమునందు నేcబడినశ్రమలు నాకుc గ్రొత్తలై, దుస్తరములై యుండినవి.

తోర:—నీవుపోయినపని కాలేదా? నీకసాధ్య మేముండెను.

సుమతి:—దేవా! నేను కృతకృత్యురాలనైతిని. కాని మఱియు వణకుగా నట్లేయుండెను. కాయ కాయగానేయుండి, యొక్కమాఱుగాc బండినది.

తోర:—యశోధర్మ యెచటనున్నాcడు?

సుమతి:—స్వరాష్ట్రమందలి కలంజారుకోటయం దున్నాcడు. ఆ దుర్గము ప్రభుభక్తిసాంద్రమైనది.

తోర:—ఆసంగతి నీవెట్లు గ్రహించితివి?

సుమతి:—కలంజారునకుc బోయి, యాతని స్వయముగc జూచితిని.

తోర:—సెబాస్! సెబాస్! నీవు స్వయముగాc గలంజారుకోటలోనికిc బోయితివా? ఈయద్భుతకార్యముc గావించుటకుc జేతకాక నాగూఢచారులును సైనికులు నింతకాలముగా మిణకరించుచుండిరి. ఇదిగో, ఈసంచిని దీసికొనుము. ఇందు ఏనూరుబంగారునాణెము లున్నవి.

అని యాతcడు సుమతి కొకసంచి నొసంగెను. ఆమె నాసంచిని వినయముతోc గైకొని "దేవరవారికరుణ యపారముగదా" అని కొనియాడెను.

తోర:—కాదేకాదు. నీవింకను మెప్పుకోలు నందఁదగినదానవు. మనకన్నులఁదుమ్ముకొట్టి, ఉజ్జయినినుండి యశోధర్మ యానాఁ డెట్లు తప్పించుకొనెను! భూమకాంతకుఁ డెవఁడు?

సుమతి:—దేవా ! యశోధర్మ భూమకునితో నలుకఁజిక్కి మడియనుండ, బాలాదిత్యుఁ డాతని రక్షించి, వీరకేసరి భూమకునిఁ గాలునిమందిరమునకు గెంటివైచినాఁడు.

తోర:—ఏమీ! భూమకాంతకుఁ డాపోగరుఁబోతు బాలాదిత్యుఁడా!

సుమతి:—అవును దేవా! అనంతరము యశోధర్మ బాలాదిత్యు లుజ్జయిని యందొకయింటఁ దలఁదాఁచుకొనిరి.

తోర:—ఎవరియిల్లు?

సుమతి:—దేవా! చండాలిని మాధవికుటీరము.

తోరమాణుఁ డదరిపడెను. "అయ్యో! పాపిష్ఠదైవమా! ఆయింటిని మాత్రము మేము వెదకమైతిమి. ఇందుల కానారాయణశర్మయే కారణము. ఆదుర్మార్గునియాత్మను భగవానుఁడు నాశమొనరించుఁగాక! హూంఁ. పోయి, యాద్రోహాత్మురాలిని మాధవిఁ బట్టుకొని యీడ్చుకొనిరండు. ఆనీచురాలి నావలితీఁగొనువఱకు మాకోపాగ్ని చల్లాఱదు." అని తోరమాణుఁడు కోపతామ్రాక్షుఁడై, తనభటుల కాజ్ఞ చేసెను.

సుమతి:—దేవా! క్షమింపుము. ఆమాలవి మొన్ననె చనిపోయినది. దేవరవారిసన్నిధికి వచ్చునప్పుఁ డీసంగతి వింటిని.

తోర:—అయిన దానిశవమును గుక్కలకు వేయుదము. పోయి, సమాధి త్రవ్వి శవముఁ గొనిరండు.

సుమతి:—ఆమెశవమును దహించిరి. ఆమె యస్థులను నలుదిక్కుల వెదఁజల్లిరి.

తోర:—అయిన నాకపటాత్మురాలు తప్పించుకొనినదా! ఓహో! ఆమెకు బిడ్డలులేరా? వారి దుంపతెంచెదను.

సుమతి:—దేవా! ఆమెకు బిడ్డలులేరు.

తోర:—అయిన నామాలదానియింటిని దగులఁబెట్టి, యచట నొక గుంటఁద్రవ్వుఁడు. ఇప్పుడే నూఱుగురుభటులుపోయి, దానిగుడిసెకు నిప్పు పెట్టవలయును. ఇఁకపై ద్రోహులకును, శత్రువులకు నాప్రదేశ మాశ్రయ మియ్యకుండుఁగాక!

మిహిరగులుఁడు నూఱుగురుసైనికుల నాపనిపైఁ బంపెను. తోరమాణుఁడు కోపము నణఁచుకొనెను. "బాలాదిత్యయశోధర్మలవెదకుటకై, యాతఁడుయుఁ దగువాసుదేవునిఁ బంపియుంటిని. అతనిగతి నీకేమైనఁ దెలియునా?" ఇంత వఱ కాతనిపోవడిలేదు. వాఁడు కృతఘ్నుఁడయ్యెనా! అని యాతఁ డడిగెను.

సుమతి:—అతనిమొక్కిన నూర్పుండినంతవఱకు నాతఁడు మీకు కృతజ్ఞుఁడైయుండెను. ఒకవర్షకాలమం దాతఁడు యశోధర్మను గలిసికొనెను. యశోధర్మవెంట మఱిపలువురుండిరి. కాని యట్టియెడ విప్రద్రోహమే కార్యకారియని వాసుదేవుఁడు భావించెను. కాన నాతఁడు ధర్మాధికారి యగు కమలాత్మునకు లంచమిచ్చి, వానిని లోఁబఱచుకొని, త్రాగెడునీటిలో దారుణవిషమును గలిపి వాని నిద్యుకొనఁజేసెను. వసంతయను నొకగొల్ల చిన్నది, జోక్యము కలుగఁజేసికొనకపోయినచో, నాకార్యము నిరంతరాయముగఁ గొనసాగియుండెడిది. ఆగొల్లదానివలన నంతయుఁ జెడిపోయినది. వెంటనే వాసుదేవుఁడు బంధింపఁబడి నిరాయుధుఁడుగాఁ జేయఁబడెను. వాసుదేవకమలాత్ము లొక్కగుఱ్ఱముపైఁ గట్టఁబడిరి. యశోధర్మవసంతలు మఱియొకవాజి నెక్కిరి. బంధితులు కూర్చుండియుండినగుఱ్ఱపుఁగళ్లెమునుబట్టుకొని యశోధర్మ తనయశ్వమును నడిపించుచుండెను. మార్గమధ్యమున నొక కొండకాలువ యడ్డుతగిలెను. అది గట్టొఱసి పాఱుచుండెను. దానిపైనివంతెన యిఱుకుగానుండెను. వాసుదేవకమలాత్ములవారువమును ముందుపోనిచ్చి, తన గుఱ్ఱమును యశోధర్మ దానివెనుకఁ బోనిచ్చుచుండెను. వాసుదేవుఁ డున్నట్టుండి "నేను ఖైదీనై యుండనేరను." అని యఱచి గుఱ్ఱము నొకతన్ను

తన్నెను. తోడనే యాహయము బెదరి, దబాలున నాకాలువలోఁబడెను. కమలాక్షుఁడు "అయ్యో! రక్షింపుఁడు. రక్షింపుఁడు. దానిపనైనమాని, నా ప్రాణములుండినఁజాలును" అని యేడువసాగెను. కాని ప్రయోజనమేమియు లేకపోయెను. యశోధర్మవసంత లింకలో నావలికూలము చేరిరి. వారాగ్రుడ్డి వెన్నెలయందు, నిర్ఝరిణీసోపానంబులఁ గన్నార్పక చూచుచు నిలిచియుండిరి. వంతెన ప్రక్కనుండి సుడిగుండములోఁబడి నిముసములనేపు బుడగలుపుట్టుచుండెను. నీరు పైకెగురుచుండెను. గుఱ్ఱమందుఁబడి తన్నుకులాడుచుండెను. దానిఁగట్టియుండిన త్రాళ్లు బిగువుగానుండుటచే, నవి తెగినవి కావు. బరువుచే మోయఁజాలక గుఱ్ఱము నీటిలోనికిఁ గ్రుంకిపోవుచుండెను. వాసుదేవుఁడు పెదవియైనఁ దెఱచినవాఁడు కాఁడు. ఆతఁడేమియుఁబలుకలేదు. కాని కమలాక్షుఁడుమాత్రము 'అయ్యో! మొఱ్ఱో!' అని కొట్టుకొనుచుండెను. "అయ్యో! నన్నుఁగాపాడుఁడు. దానినేదనైనను బ్రతికియుండినఁజాలును" అని గూతలు మొత్తుకొనుచుండెను. ఆసుడిగుండ మంతలో నాహయమును దానిబరువును తనపొట్టఁబెట్టుకొనెను. అంతయు నిశ్శబ్దముగా నుండెను.

తోర:—అయిన నావీరోత్తముఁడు పాడుచావుచచ్చినాఁడు.

సుమతి:—దేవా! ఈయాధేయుల పౌరుషము మీకనుభవము లేదు. వారికి స్వాతంత్ర్యాభిలాష మెండు. దాస్యవృత్తిని వారేవగించుచుందురు. పౌరుషైకధనుఁడగు వాసుదేవునకుఁ గలాంజారునందలి బాధజీవనమసహ్యమై యుండెను. యశోధర్మనయితము వాసుదేవుని సాహసమునకు నిర్విణ్ణుఁడయ్యెను. అతఁడు వసంతఁగాంచి "మానినీ! ఈతనికిఁ జావునందుండు తెగువ, బ్రదుకునందుండినచో, నీతనిబంధింప నాకు శక్తియుండెడిది కాదు. ఈతఁడు సుఖప్రియునివోలె మృత్యువును వలచినాఁడు" అని పలికెను.

తోర:—ఈయంశములన్నింటిని నీవెచట విచారించితివి?

సుమతి:—దేవా! వసంత చెప్పినది.

తోర:—ఏమీ! నీవు వసంతను వలలో వేసికొంటివా! ఆమె కలాంజారునం దేమిచేయుచున్నది?

సుమతి:—యశోధర్మ తల్లియగు మహారాణి మహామాయయు వసంత కిచ్చెలియై యున్నది. అదియుంగాక, యశోధర్మ కాఁగోల్లది సకలకార్యములఁ గుడిభుజమై యున్నది.

తోరమాణుఁ డాశ్చర్యమొందెను. "అయిన నీవు యశోధర్మమర్మభేదన మొనరించివచ్చితివి? కలాంజారుపరిమాణ మెట్టిది? ఆదుర్గరాజము నించుక వర్ణించుము?"

సుమతి:—దేవా! ఈవిషయమునమాత్రము నేను మీకాశాభంగ మొనరింపక విధిలేదు. ఆమాయావి వసంత నాకంటె మతినాలుగాకు లెక్కువ చదివియున్నది. యశోధర్మ నాకోరిక కభ్యంతరము చెప్పలేదు. కడకు మహామాయకూడ నందుల కంగీకరించినది. వసంత—ఆవసంతయొక్కతె మాత్రము "మగవారిపనులలో మనకు జోక్యమేల? దుర్గమునఁ గ్రొత్తలేమున్నవి? ప్రాకారపరిహృతమగు విశాలప్రదేశమైన నేమి? ప్రాకారరక్షితమగు ప్రదేశమైన నేమి! మన కాజోక్యమేల! రెండును మనకు సౌఖ్యదాయకములే గదా!" అని పానకములోని పుడకవలె నడ్డుతగులుచుండును. కడకు సముద్రగుప్త సార్వభౌముఁడుకూడ లోఁబఱచుకొనఁజాలనిదుర్గ మెట్లుండునువా? యని వినోదార్థము చూడ నెంచితినని నేను బయలిడితిని.

"వినోదములఁ జూడగోరుట స్త్రీలకు సహజము కాదా! కాని యింత యవసర మేమున్నది?" అని వసంత యనుచుండెడిది. మూఁడుదినము లాగి నే నీవిషయమై మరల నామెతోఁ బ్రస్తావింప ఇంతవేగిర మేల? నీవు మమ్ము విడిపోవుటలేదుగదా! పోవుదువాయేమి!" అని యామె నవ్వెను. నేనుగూడ నామెతోఁ గలిసి నవ్వితిని. తరువాతఁ గొన్నాళ్ల కామెకడ నీసంగతి నెత్తితిని. అందుల కామాయావిని మరల "ఈకోటనుజూడ నీకంతకోరిక యేల? ఇచటఁ గనీస మొకవత్సరముండినఁగాని, యీదుర్గము నెవ్వరును జూడ నర్హులుగా రనునియమ మున్నది" అనెను. "వసంతా! ఎన్నియో మాఱులు నీ విదుర్గమును గాంచియున్నావు. కాని నీవిచటికివచ్చి కొన్నినెల

తైన గాలేదు. దీని కేమందువు? అని నేను నవ్వుచు నడిగితిని. "అవును. నేను నీవు కాదుకదా!" అని యామె నవ్వుచు నన్నుత్తిపొడిచి "యశోధర్మరాజేంద్రుని ప్రాణముల నేను గాపాడి రాజానుగ్రహమునకును, మహారాణి మహామాయదయకుఁ బాత్రురాలనైయున్నాను" అని ప్రత్యుత్తర మొసంగెను. ఈమాటలకు యశోధర్మమహామాయలు మందహాసమొనర్చిరి. మాటిమాటికి నేను ప్రశ్నించుచుండినచో వారు నన్ను శంకయింపకపోయిరని తలంచి మరల వసంతతో నావిషయమై ప్రస్తావింపనైతిని. ఒకటిరెండు సారులు శాకోరికను మహామాయకును, కడకు యశోధర్మకును దెలియఁబఱచితిని. అందులకు వారు శాకోరికను జౌకచేసి, వసంత మహాకోసలమునకు సర్వాధికారిణియనియుఁ, నామె సమ్మతిలేక యొట్టిపని గాని జరుగదనియుఁ ననిరి. యశోధర్మమహామాయలను నేను బ్రార్థించితినని, వసంత చెవులఁబడెను. కలాంజారుదుర్గపుమర్మముల గ్రహింపవలయుననికదా నాయభిప్రాయము. వాఁటితో శాకోరిక కూడిపోయెను. ఒక్కనాఁడామె యశోధర్మతో నన్నుగురించి "అవృద్ధురాలు స్వయముగ సజ్జనురాలు. కాని ముసలులనోట మాటదాఁగదు. ఊరక వారు వదరుచుందురు. కొన్నిసమయముల వారిచేతలకుఁ దీఁటపట్టి గులగులలాడుచుండుటయుఁ గలదు." అని చెప్పుచుండ, నేను జెవులార వింటిని. అంతకు తంత్రకుశల యీవసంత!

తోర:—కాని యీదుర్గమునకుఁ బోవుదారియైన, నీవు చూచియుందువనుకొనియెద. ఇంతవఱకైనఁజాలును.

సుమతి:—ఈవిషయమునఁగూడ దేవరవారి కాశాభంగ మొదవఁగలదు. మహాకోసలమున నమలాపురియను నొకచిన్నపట్టణమున్నది. నేనచట యశోధర్మఁగలిసికొని నాసంగీతనాట్యకౌశలముల నాతని కెఱుకపఱచుకొని, కుసుమదామములఁ గట్టుటయందును, కురులు సవరించుటయందును, మహారాణి మహామాయగారి కుపయోగింతునని మనవిచేసికొంటిని. నాకళాప్రావీణ్యమునుగుర్తించి, మహామాయవసంతలు నన్నుఁ బెద్దదాసిగాఁ జేయునుద్దేశముతో

నగరములోనికిఁ దీసికొనిపోయిరి. అప్పుడే పఠాణులు మహాకోసలముపైఁబడ నున్నారని వార్తవచ్చెను. తోడనే మేమందఱము, శత్రుదుర్భేద్యమగు కాలాంజారుదుర్గమునకుఁ బోనెంచితిమి. నేను గాలిలో మేడలఁగట్టుచుంటిని. అతిజనభయంకరమగు నిట్టిదుర్గమును జేరుమార్గము నరయఁగల్గుదునుగదా యని నే నుప్పొంగుచుంటిని. కాని మాపయనము నిశాసమయమున జరుగ నున్నదని నేనంతలో వింటిని. నేను మహామాయకడకుఁ బోయి "రాత్రికాలమున మహారాణిగారు జాగర మొనరింపఁజాలరు. కావున పగటిపయనము శ్రేష్ఠముగదా?" అని చెప్పితిని.

ఆమాటవిని రాణి కేలుఁబడి యోచించెను. నాపలుకుల కామె విషాదఖిన్నయై "అమ్మా! జాగరములు నాకు నేఁడు క్రొత్తలుగావు. గుణవతీశిఖామణి యగు స్కందగుప్తుఁడు పరాజితుఁడైననాఁటినుండి, నాజీవితాకాశము దుఃఖాంధకారబంధురమైపోయినది. ప్రకాశాదిత్యునిమరణము తొలుకాఱు మబ్బులు పుట్టసాగినవి. బాలాదిత్యుఁడు మగధనుండి వెడలఁగొట్టఁబడి, కేరళమునకు ప్రవాసముపోయినంతనే యీకాఱుమబ్బులు విస్తరిల్లి నలుగడల నలముకొనినవి. నాకుమారుఁడును, నేను దిక్కులుతెలియక ప్రాణసూత్రములఁ గాంచుచు దుర్దినములఁ గడపుచున్నారము. ఎన్నికష్టములువచ్చిననేమి? స్వేచ్ఛాగౌరవములకు లోటురాకుండినచో, వానినిఁ గష్టములుగాఁ దలంపము. పగటిపూటఁ బయనమొనరించుట యాపదలకుమూలము. కావున మేము సాధారణముగ నిశాసమయములందుఁ బయనమొనరించుచుందుము." అని సమాధానమిచ్చెను. ఆమాటలతో నాయాశ లడుగంటినవి కావు. చీకటి రాత్రులైననేమి? బహిరంగముగనుండు మాపల్లకినుండి మార్గమును గుర్తుపట్టఁ గలుగుదు ననునాయాశాజ్యోతి నామానసమున మినుకుమినుకు మనుచుండెను. కాని వసంత యంతలో నొక్కమాఱుగా నాయాశాజ్యోతి నూఁదివైచెను. ఆమాయలాఁడి, పల్లకిచుట్టును మందమగు తెరలుదించి గట్టిగాఁ గట్టివేయవలయు నని పట్టుపట్టెను. నేనించుక తెగువఁజేసికొని "లోనికి గాలి వెలుతురు రాక

లదా?" అంటిని. అందుల కాగొల్లది "మొదట జీవితమునకే మోసమువాటిల్లి యుండ గాలి వెలుతురుల సంగతి యిపు డెవరికిఁబట్టినది?" అని చెప్పెను.

నేను:—మనకుఁ బ్రాణభీతియేల?

ఆమె:—మ్లేచ్ఛులు భరతవర్షమున నిలిచియున్నంత కాలము, మనకుఁ బ్రాణములపై నాశయొక్కడిది?

నేను:—కల్లకీచుట్టును దడులఁగట్టుకొని రాత్రికాలమునఁ బయిన మొనరించినచో, మనము [illegible] దలమనిసినలుగురు నవ్వరా? మనమట్టికళంకమును యశోధర్మకుఁ దేరాదు.

శే[illegible]ర:—సెబాస్. సెబాస్. అందుల కామె యేమనినది?

సుమతి:—'ఓసరో! భద్రపసు[illegible] [illegible]జనముకానేరదు' అని వసంత యనినది. అంత నేను "మూసినపల్లకీలలోఁ బయిన మొనరించుటఁ నాకిలవాటు లేదు. కాన నన్ను పట్టిపల్లకీలో రానిమ్ము" అని మొఱపెట్టితిని. కాని యా మాయావిని యందుల కియ్యకొనక "నీవు మా[illegible] నభిలషించినచో [illegible] కూడ మాయభ్యాసముల నలవఱచుకొనవలయును. పట్టిప్రస్తావ [illegible] రావిదవ్వుటకు నాకు సంతోషముగానున్నది" అనెను. ఇఁక నేనేమి చేయఁ గలను? ఏమియుఁ బలుకక యూరకుంటిని. [illegible] వారు నన్ను వెడలనడిపింతురేమో యనుభయమున, మూసినపవారియందే పోవుటకు నేను సమ్మతించితిని. దుర్గమునకుఁబోయినపిదప వారివిశ్వాసమునకుఁ బాత్రురాలఁ గావచ్చుననియు, వారి నమ్మకము నాకు దుర్గమునుజూపునట్లు బలవంత పెట్టుటయేకాక, రహస్యమార్గములను సులభముగాఁ జూడ వీలుండుననియు నూఁహించితిని. నేను, వసంతమహామాయలకు విధేయురాలనై వర్తించుచు, వారు 'నంది' యనిన 'నంది' యనియు, 'పంది' యనినఁ 'బంది' యనియుఁ గాలము వెళ్ళఁదీయుచు వారిమనసునకెక్కి నడచుకొనుచుంటిని. నాగానకళా ప్రావీణ్యమునకు, మాల్యరచనాకౌశలమునకు, వేణీబంధనచాతుర్యమునకు,

వసంత విస్మయమందుచుండెడిది. తనకీకళలఁ గఱపు మన్నామె ప్రార్థించెను. కాని నేను మాత్రము "ఈవిద్యలం నీకేల? ఎప్పుడు కావలయుననిన, అప్పుడు నేనున్నానుగదా!" అని యామెను బుజిమిపుచ్చితిని. కాని యాగొల్లది యావృచించినఁ బ్రవృతెంచునది. ఆమె నాతో "ఓకరుణా! (మహాకోసలమున నాపేరిది) నీమేన నూపిరియుండునంతవఱకు, నీవు మాకుఁ దోడునీడవై యుందువనుట నిస్సంశయము. కాని యాపనులకు నీయనంతర మెవరున్నారు? నీవు మనుష్యురాలవు. నీస్థానము నాక్రమించుటకు నీయనంతరము మఱి యొకరుండవలయుఁగదా! నీవాక్రమించియుండు నిరుపమకళాప్రావీణ్యము నంతటిని, నీతోడనే యంతరింపఁజేయుట కరము శోచనీయముగదా! యశోధర్మ మహారాజన్యుని పట్టమహిషి కుపచారములొనరింప నీయట్టివా రెవరో యొకరుండవలయుఁగదా! నేను పసిదానను. నీపాదములకడ విద్య నభ్యసింప నాకభిలాషగలదు. దయచేసి యాకళల నాకుఁ గఱపుము." అని నన్ను బలిమాలెను. వసంత ప్రార్థన నంగీకరింపనగునని మహామాయకూడ నన్ను ప్రేరేపించినది. ఆమెయాజ్ఞను పాటింపక నాకు విధిలేకపోయెను. నాకార్యసాధు కాలముకొఱకు నే నామెమానతిని మాటిఁదాప్చితిని. వసంత విద్య నేర్చుకొన మొదలిడెను. కుశాగ్రబుద్ధియగు నాశిష్యురాలిఁ గాంచి నాకు విస్మయభయము లొదవెను. ఇట్లొక నెలలోపల నాగొల్లచిన్నది నాట్యకళను, పుష్పమాలికా నిర్మాణచాతుర్యమును, వేణీబంధనకౌశలమును గ్రహించెను. కాని గానకళ యందుమాత్రము నాప్రావీణ్యమును నే నీక్షణమువఱకు నిలుపుకొనియున్నాను. కాని యాపాండిత్యము నిష్కళంకమై, నిరుపమానమై, సర్వజన రంజకమై యుండెడిది కాదు. ఏలయన, నావ్రేతయౌవన మామెకు సాయకారియైయుండెను. నే నామెఁ బాండిత్యమునఁ దలఁదన్నుచుంటిని. కాని యాగోపిక నవయౌవనాంగియై తనకంఠస్వరమాధురీమహిమచే శ్రోతలకుఁ గర్ణరసాయన మొనరించుచు, వారి మెప్పు లందుచుండెను. ఇట్లామె యహోరాత్రములం విద్య నభ్యసించుచుండెను.

తోర:—ఆమె శిక్షాభ్యసనమునందుఁ గలపట్టుదలకుఁ గారణము నారసితివా!

సుమతి:—అది దైవమునకే యెఱుక. అంతఃపురికను, శిక్షకను, నేనిప్పటికిఁ జూచియుండలేదు. ఆటుక్కులాడి యేదియో పన్నాగముఁ బన్ని యున్నది. ఇదిమాత్రము నిశ్చయము. వేళకానివేళలఁగూడ నే నాకన్నియకు విధిలేక విద్యనేర్పవలసివచ్చినది. అచట నామె పెట్టినది భిక్షయగుటంజేసి. నే నామె మదికెక్క వర్తించుచుంటిని. కాని యెట్టులో యొకట్టుల నామెకడ నుండి భూమకునివృత్తాంతమును, వాసుదేవునివార్తను గ్రహింపఁగలిగితిని.

తోర:—ఇంకేమైన గ్రహించితివా?

సుమతి:—ఆహా! యశోధర్మ, తనస్వామియుఁ బ్రభువు నగుబాలాదిత్యునకుఁ జారుమతిని సంధానమొనరించుప్రయత్నమునఁ గళింగమునకు బోనున్నాఁడు.

తోర:—ఓహో! ఆలాగా? ఆరాజకుమారిని మనమిహిరగులునకు సంధానపఱచునిమిత్తము, భానుగుప్తునిఁ గళింగమునకుఁ బంపుచున్నాము. నీకిది తెలియునా?

సుమతి:—తెలియును. కాని దేవరవారి కార్యభంగమొదవునేమో యని నాభయము. ఈహైందవరాకుమారికలు రూపమదాంధలై, మిన్నుముట్టఁగానక వర్తించుచుందురు. హూణులనిన వారికి సింహస్వప్నము. వీరలోకాలంకారుఁడగు హూణప్రభుతనయుని పాణిగ్రహణమునకు వారియ్యకొనకపోవుటయే కాక, మీఁదు మిక్కిలి యీసంబంధము నతిహీనమని యుపహసించుకొనుచుందురు.

తోర:—ఇది మిక్కిలి చిత్రముగానున్నది.

సుమతి:—దేవా! ఇట్టిదేశముల కిట్టినడవడులు చిత్రములుగావు. ఈదేశమే మిగులఁ జిత్రమైనది. అట్టియెడ నిందలిచర్యలుకూడ, విచిత్రములగుటలో నాశ్చర్యమేమికలదు! దేవరవారియడుగులకు మడుగులొత్తుచు పొట్ట

నింపుకొనువారున్నైతము, చిత్రవిచిత్రభావభరితులై కొన్ని సమయముల నధికార మదమునఁ జరించుటలు తాము కాంచియేయుందురు. మాటవరుసకు మనవి చేసెద. ఆనాఁడు దేవరవారు మాధవికుటీరమును విదళవలయునని యూహాపోహ విష్ణునారాయణశర్మకు గట్టికట్టడి నొనరించియుం, నాఁడు మిమ్ము ధిక్కరించెఁ గదా! మాలయింటి నిడాసినచోఁ దనకుఁ గులభ్రష్టత్వ మొదవునని, నారాయణశర్మ యొక్కసారిగాఁ దిరుగఁబడినాఁడు. అప్పు డాతనికి హూణుని యెడ నుండు భయము, హూణానుగ్రహసంపాదనమునకుఁ గలయాశ లొక్కక్షణములో వలసపోయినవి. ఈభాగ్యగుప్తుఁడుకూడ నాతనికంటె మతిమాలు గాక యెక్కువ చదివినకపటాత్ముఁడు. తాను హూణాంగనను జేపట్టుట కైనను, తన తనయను హూణునకిచ్చి పెండ్లిచేయుట కైనను నాతఁ డిష్టపడఁడు.

తోర:—ఇది యంతయు మిక్కిలి వింతగా నున్నది?

సుమతి:—ఔను. దేవా! చారుమతి సుహితగుణుం దిరస్కరించి, 'సుక్షత్రియకులాబ్ధిచంద్రుఁడను, స్వాతంత్ర్యభాగ్యభూషితుఁడను' అని తేఁత పోరకాయలగోయు మనుజుఁ బేరు లేక యుండు పిచ్చివికారి నొకని, కూడు గుడ్డ లేని దరిద్రదామోదరు నొకనిఁ జేపట్టిన నేనాశ్చర్య మొందను.

తోర:—అయినఁ జారుమతి బాలావిద్యునో, లేక యట్టివాని మఱె వ్వనినో వరించుచునని తలంతువా?

సుమతి:—దేవా! ఇప్పటికే వసంత కళింగపట్టణమునకుఁ బోయియున్నది. ఇఁక నాయోజన సార్థకమగుననుట కాశ్చర్యమేమున్నది?

తోర:—ఆగోపికకూడ నచటికిఁ బోయినదా? ఏల, ఆమె యభిప్రాయ మేమి?

సుమతి:—దేవా! ఆమెయభిప్రాయ మాపిశాచమునకే తెలియవలయును. నాకు దగ్గఱచుట్టము కాలగతినొందె ననునెపములో నే నమలాపురికివచ్చితిని. అమాయలాడికూడ నన్ను వెంబడించినది. తెరలంగట్టినడోలికల నెక్కి, మేముపోయినదారినే రాత్రిపూట తిరిగివచ్చితిమి. సేనాకమాణు

దారిని గమనింప జెంచి, తెరను దొలఁగింపఁబోయితిని. నేనెంతయో శ్రమించి, మా ప్రయాణము వెన్నెలరాత్రులయందు జరుగునట్లు చేసితిని. కాని యిచటఁ గూడ నామాయలాడి నాకడ్డుతగిలినది. నేను తిన్నగాఁ దెరకడకుఁ బోవునంతలో వసంత "నీకేమి కావలయును?" అని నన్నడిగినది. 'చల్లనిగాలిని సేవింపవలయును' అని నేను బదులిడితిని. అందుల కామె "ఓహో! ఆ తెరఁదీయకుము. మహారాణిగారికి జలుబు చేయును" అనెను.

నేను:—ఉక్కపోయుచున్నది. మహారాణిగారికి జలుబు చేయునని నే ననుకోను.

మహా:—కుమారీ! వసంతా! నాకు జలుబుపట్టదు లెమ్ము.

సుమ:—ఆమాటలకు నాకపరిమితానంద మొదవెను. కాని వసంత "ఆత్మసౌఖ్యప్రదములగు హానికరముల మహారాణిగా రెఱుంగరు. దేవిగారియంగరక్షకురాలనుగాఁ బ్రాణపరిపోషకురాలనుగా నేను నియమింపఁబడియున్నాను కాదా?" అని మహామాయ నడిగెను. అందులకు మహారాణి మందహాస మొనరించుచు "అమ్మాయీ! నీయిచ్చవచ్చినట్లు కానిమ్ము" అనెను. దాన నా యాశాజ్యోతి యొక్కమాఱుగా నారిపోయెను. అంత నేను రక్తమును శాంతపఱచుకొని యాపాదుపల్లకిలోఁ గూర్చుండి 'అహా! నేఁడో వృథాదారి యెట్టిదో పరికింప నేనువ్విళ్లూరుచుండియు పాపిష్ఠదైవ మందుల కనుగ్రహింపఁ దయ్యెఁగా." అని యనుకొనుచుఁ బోవుచుంటిని. ఆక్షణమునుండి వసంత నాకు శత్రువైనది. ఆమె పేరెత్తిన నాహృదయము భగ్గుమనుచుండును.

తోర:—మంచిది. వసంత కళింగపట్టణమునఁ బన్నఁబోవుపన్నాగ మేమైయుండును!

సుమతి:— చెప్పఁజాలము. కాని యాగొల్లభామ నాకడ నభ్యసించిన కళాపాటవమున, రాజకుమారి చారుమతి యనుగ్రహమును జూఱఁగొనఁగల దని నేఁ దలంచెద.

తోర:—అకళలతో నాకెంటె నీవే ప్రవీణురాలవుగదా! కాన నిన్నుఁ గళింగరాజు గుణసాగరునికొలువునకుఁబంపి, వసంత నచటినుండి పంపి వేయుట మిగుల సులభము. సముచితముకూడ.

సుమతి:—అగొల్లదానితోడికయ్యమునకు నే నేమాత్రము వెనుకంజ వేయను. యశోధర్మ మహామాయలవలె, గుణసాగర, దాక్షాయణీ, చారుమతులు వసాతగీచినగీఁటును దాఁటకుండువారు కారు. కాన నీమాఱు మాపోరాటము తీవ్రతరమైయుండును.

తోర:—అయిన నేఁడే బయలుదేఱుము. ఇదిగో, ఈవేయిబంగారు నాణెములఁ గైకొనుము. గుణసాగరునిమూస్థానికిఁబొమ్ము. పోయి చారుమతిని నీమాయాజాలములఁ జిక్కించుకొనుము. చిక్కించుకొని, మనమిహిరగులుని వరించునట్లు రాజకుమారిపై మచ్చుమందుచల్లుము. సాధ్యమైనంతవఱకు వసంత కంటకములగున్నట్లుచూడుము. మహాసేనాధినరేంద్రమండలి హూణుని పైఁ గావించునట్లు పై నొక కన్నుంచియుండుము.

అని తోరమాణుఁడు గూఢచారిణి కొకబంగారునాణెములసంచిని బహూకరించెను.

సుమతి:—దేవా! అచట రాజసేవకులకును, మఱియవసరమని తోఁచినవారికెల్ల లంచములిచ్చుటకుఁ గొంతధనము కావలసియున్నది.

తోర:—ఔనౌను. మఱచితి. చక్కగా జ్ఞప్తిపఱచినందులకు సంతసమైనది. ఇదిగో, తీసికొను మీమూఁడువేలబంగారునాణెములు.

అని తోరమాణుఁడు పెద్దమూట నొసంగెను. సుమతి యాసంచులను, ౪౫౦౦ బంగారునాణెము లుండువానిని గ్రహించి "మహాప్రభూ! నాకును వసంతకును గలపోరు ప్రాగంభమైనది. నాసామర్థ్యమునంతయుం ధారవోసి, యీకార్యమునఁ గృతకృత్యనయ్యెద." నని విన్నవించెను.

తోర:—నీమాటలచే నాకు మితిలేని యానందమైనది.

అనంతరము సుమతి మహారాజుకడ సెలవుగొని వెడలిపోయెను.

ఇరువదిదినములుజరిగెను. ఒకనాఁ డిరువురువ్యక్తులు కళింగపట్టణము నుండి జావాద్వీపమునకుఁబోవు నావపై నెక్కియుండిరి. వారిలో నొకఁడు పురుషుఁడు. మఱియొకతె స్త్రీ. ఆస్త్రీపురుషులు సమానవయస్కులని చెప్ప వచ్చును. ఆనౌక సాగరమధ్యమునం దొంటరిగఁ బయనమొనరించుచుండెను. చందమామ వెన్నెలలవెదఁజల్లుచు నడిమింటఁ బ్రకాశించుచుండెను. అసంఖ్యాకతారకాగణసంశోభితమై, భావగర్భితమైయుండు నీలాంబరమును నేత్రపర్వముగా నవలోకించుచు, నాస్త్రీపురుషు లిరువురు నౌకోపరితలమున సుఖాసీనులై యుండిరి. ఆపురుషుఁ డాయువిదఁ గాంచి "అహాహా! సుమతీ! పాపపంకిలమగు మూఢచారిజీవితమునకు, సుశాంతిసముజ్జ్వలజీవితమునకు నెంతవ్యత్యాసమున్నదో చూచితివా! దీనికన్న మిన్నయగుశాంతాశ్రమము వేఱొండేమికలదు. ప్రశాంతమునకు నిలయమును, గాంభీర్యమునకు బట్టుకొమ్మయు నగుప్రకృతికాంత నిట్టిసాగరమధ్యమున నౌకమాత్రమైన సందర్శించినచో, మరల రాజకీయకర్దమమునఁ గాలూనుటకు బుద్ధిపుట్టునా?" అని పలికెను.

ఆస్త్రీవ్యక్తి మనకుఁ బరిచితురాలగుసుమతియె. ఆమాటల కావెలయాలు ముసిముసినవ్వులనవ్వుచు "ఓసర్వసమ్మతా! సర్వజ్ఞుఁడగుభగవాఁడు మనకిట్టిజీవితపరమావధిఁ గల్పించియున్నాఁడు. పరస్పరద్వేషభూయిష్ఠమును, దుఃఖాంధకారబంధురము నగుభరతవర్షమునకు నీళ్లువదలి, నూతనదేశమునం దమ వినూతనజీవితారంభసంరంభులమై యుండుట మనకెంతయో శ్రేయస్కరమై యున్నది." అని బదులిడెను.

"మోహనాంగీ! నీమాట లెంతయు నిజము. భరతవర్షమునందుఁ బ్రబలియుండువర్ణవిభేదములు మనకల్యాణమున కడ్డుతగులుచు, మనసంసారసౌఖ్యమును జెఱుపుచుండెను. కాని జావాద్వీపనివాసులకు వర్ణవిభేదములు లేవు. ఒకవేళ నుండినను, భారతీయులకుఁబోలె వారికి సంఘవ్యత్యస్తములయం దంత పట్టుదల యుండదు."

"కాని మనయనురాగబీజ మింతయాలస్యముగా మొలకెత్తుటకై నాకుఁ జింతగానున్నది."

"ఇంతయాలస్యముగనైన, నిట్టిస్నేహ మొదవినదని సంతసింతము. గ్రుడ్డిలో మెల్ల శ్రేష్ఠముగదా! మనోహారిణీ! నీవే కాదా నాకీయోజనఁ జెప్పిన దానవు."

"కాని, ప్రియా! నీవు లేకున్నచో, నాకోరిక నిష్ఫలమైయుండెడిది. నావద్ద ౧౧౦౦ బంగారు నాణెములున్నవి. వీనితో మనము సౌఖ్యముగ జీవింపవచ్చును."

"తోఁపమానుఁ డొకబుద్ధిహీనుఁడు. నీవు కళింగపట్టణమునకుఁబోయి క్రొంమియుఁదు లొనరించుచున్నావని, యాతఁ డనుకొనుచుండును. హాహా హాహా!"

"అతనియధికారపరిధిని మనము త్వరలో దాఁటిపోవుచున్నాము. కాని యాతనియాజ్ఞయు మనభక్తిముక్తులకుఁ గారణమైనది."

"అవునవును. అటుఁజూడుము" అని సర్వసమ్మతుఁడు పశ్చిమదిశఁ జూపుచు "భరితవర్ష మచటనున్నది. ఇఁక మనప్రాంతజీవితము లంతరించి, క్రొత్తజీవితములు మొదలుపెట్టనున్నవి" అని పలికెను.

"నామాతృభూమికి—నాకు సంతాపకారణమైయుండిన మాతృభూమికి—ఇవె వందనములు. అమ్మా! దేశమాతా! నాకిఁక సెలవిమ్ము."

"ఓ భారతభూమీ! నమస్కారములు. సెలవిమ్ము." అని సర్వసమ్మతుఁడు సుమలిని "చిలుకలకొలికీ! ముద్దులగుమ్మా!" అని పిలిచెను. కాని యావేశ్యాంగన పలుకలేదు. ఆకొలఁదిగా సర్వసమ్మతుని బిగ్గఁ గౌఁగిలించుకొని, రసము చిప్పులున నొకముద్దు నొసఁగఁబెట్టుకొని "మనోనాయకా! ఇప్పుడు మనము పాపపుఁబ్రపంచములము గాము. కాముకులము. ఆహాహా! ఎంత యదృష్టము. ఎంత భాగ్యము. ఎంత హాయిగానున్నది. పోయినపాపజీవితము మరల రాకుండుఁగాక!" అని వలపు లుట్టిపడునట్లనెను.

"తథాస్తు" అని సర్వసమ్మతుఁడు పలికెను.

---

# ఇరువదిమూఁడవతరంగము.

## ఒక స్వయంవరము.

ఉదయము పదిగంటలైనది. ఆనాఁడు కళింగపట్టణమునం దెచట చూచినను నేత్రపర్వమైయుండెను. అన్నిదిక్కులనుండి సపరివారముగా వరుదెంచినరాజన్యసమాజముచే వీథులన్నియుం గిక్కిరిసియుండెను. వీథిఁ గాంచినను బారబ్బంద మగపడుచుండెను. కాలికొలఁదినడచుట కించుకైనఁ దెఱపి లేకుండెను. ఇసుకచల్లినను రాలని యాజనసముద్రమునందు దారిఁజేయుట కష్టసాధ్యమైయుండెను. పాదచారకులవీచికల నెక్కురీతిగా, నచట దారిఁజేయుటకు విసుఁగెత్తుచుండెను. అచట నొకని మొగమునందైనఁ శ్రాంతభావము తోఁచుటలేదు. ఎవ్వరికిఁ గిలిక లేకుండెను. పౌరు లాదినము మహోత్సవము ననుభవించుచుండిరి. వారిముఖాంబుజము లానందతోయకణభరితము లైయుండెను. ఆనగరమునం దన్నియోప్రదేశములు దృశ్యరామణీయకములై, మనోరంజకములై యుండెను. అనర్ఘమణిమయాలంకారశోభితులగు భూకాంతులు, సచివసామంతసేనాపతులై రాజసము మెఱయ నట విడిసియుండిరి. ఈ శుభముహూర్తమునకై కళింగు లెన్నిరోజుదినములఁగ నెదురుచూచుచుండిరి. వీథుల కిరువైపులఁగల యున్నతప్రాసాదముల కమర్పఁగుంపు తాల్వారము లన్నియు భామినీబాలురతో నిండియుండెను. ఎన్నఁడెఱుఁగనియాభారముచే, నాప్రాసాదములు కూలునేమో యని సందియముఁగొలుపుచుండెను. నలుమూలలనుండి వచ్చుచుండుజనసమూహము, కళింగరాజసభాభవనమున మూఁగుచుండెను. ఆకొలువుకూటమున నొకయెడ సింహపీఠి యలరారుచుండెను. కళింగపట్టణమునఁగల శివకేశవాలయములపైఁ దనకుఁగల యాదరభావమున,

వానివైభవాతిశయముల నాదర్శముగాఁ గొని, తమసభామండపాలంకారముల నిమిత్తము కళింగరాజులు విశేషధనములను దరతరములుగా వెచ్చించుచుండిరి. శృంగారవైభవమునం దేమి? శిల్పికళాప్రావీణ్యమునం దేమి? రూపగాంభీర్యమునం దేమి? ఆకాలమునఁ గళింగరాజసభామండపములోఁ దులఁదూఁగఁగలభవనములు మృగ్యములనుట యతిశయోక్తి కానేరదు. ఇఁక నాఁటియాస్థానసౌందర్యము నేమని వర్ణింపఁగలము. కళింగరాజ్యభూషణమగుచారుమతి కానాఁడు స్వయంవరమహోత్సవము జరుగనుండెను. దేశమునఁగల రాజనామకులందఱు స్వయంవరమునకువచ్చి, కళింగాధీశుని యతిథులై యుండిరి. పౌరులందఱు సందడిసమయమునకు దగినతీరుగా వర్తించుచుండిరి. వారు జట్టులుజట్టులుగాఁ గూడి నగరిసేవకులతోఁ బాటు నలువదిదినములు కష్టించి పనిచేసి, యామహోత్సవార్థము సభామండపమును శృంగారించిరి. ఏలయనఁ, గళింగులకుఁ జారుమతిపైని యనురాగాభిమానము లనన్యశములు. తగినవరకట్నము లొసంగి, మహారాణి దాక్షాయణియు, రాజకుమారి చారుమతియు, దీనలగుకన్యలెందఱకో కల్యాణములఁ గావించియుండిరి. లెక్కకు మిక్కిలియగు పేదలు, తల్లికూఁతుల హస్తములనుండి కూడుగుడ్డలఁబడసి సంతృప్తులైరి. రాజు గుణసాగరుఁడును, రాణి దాక్షాయణియు, రాజకుమారి చారుమతియు నసంఖ్యాకులగు పండితవరేణ్యుల నాదరించియుండిరి. రాజవంశసంభూతలగు సుందరాంగు లెందఱవలెఁ జారుమతికూడ నసమానవిలాసభాసురాంగియనుట కించుకైన సందియములేదు. చతుష్కలసరస్వతియు, కరుణానిధియు, ధర్మదేవతయు, మంగళాంగియు నగుచారుమతిని పౌరులు మనసారఁ గన్నతల్లివలెఁ బ్రేమించుచుండిరి. సద్గుణముల మారాజకుమారి కెనయగు రాజకుమారి యొక్కతెయైనఁ బేరొక్కచో నుండదని కళింగులు పరరాజ్యనివాసులఁ బ్రశ్నించి, నిరుత్తరులై చిక్కమొగములతో [illegible]ంచి మురియుచుందురు. గుణసాగరుఁడు పండితాభిమాని. పలుమాఱతఁడు విద్వత్పరిషత్తుల జరుపుచుండును. వివిధదేశాగతు లగువిద్వాంసులకుఁ దనవిద్యాపాటవమునఁ జారుమతి

తలవంపులఁ గలిగించుచుండును. తమరాజకుమారి విద్యావైభవముల నయనానందకరముగఁ దిలకించు నుత్సాహముతోఁ వారు ఎల్లవేళల నట్టివిద్వత్సభల కెదురుచూచుచుందురు. అనాథశరణాలయముల స్థాపించి, దీనులగు బీదదంపతుల బిడ్డలవోలెఁ గాపాడి, వారి స్వతంత్రజీవనమునకు వలయు విత్తాదికముల బహూకరించి వారిసంసారసాగరమునకు నాకరై వెలుఁగు రాజకుమారి చారుమతి వారిమఱపునకు వచ్చుటెట్లు?

సర్వాలంకారసంశోభితమగు నాసభామండపమున నేబదియాఱుసింహాసనములు, భరతవర్షమునందలి స్వతంత్రరాజులకొఱ కమర్పఁబడియుండెను. ఆకాలమున స్వతంత్రరాజు లంతమంది లేకున్నను, అనవసరములగు సింహాసనములుమాత్రము సిద్ధపఱుపఁబడియుండెను. ఈవేదభూమియందు మార్పులు శీఘ్రముగా జరుగవు. నిత్యమగుసత్యమును గప్పిపుచ్చినపూఁతమెఱుఁగుపరిస్థితులను లెక్కపెట్టక గుణసాగరదాక్షాయణులు పూర్వసంప్రదాయములకుఁ గట్టుపడి వానిని నెఱవేర్చుచుండిరి. అవంతి, కోసలము, మహాచేది, మత్స్య, పాంచాలము. మహాపాంచాలము, సౌరాష్ట్రము, అయోధ్య, మిథిల మున్నగు ప్రాచీనసామ్రాజ్యములన్నియుఁ గాలవాహినిఁబడి కొట్టుకొనిపోయినను, నామమాత్రావశిష్టములై నిలిచియుండెను.

మనోజ్ఞమగు స్వయంవరమహోత్సవము పదునొకండుగంటలకు జరుగనుండెను. మహారాజులు, రాజులు నంతకుబూర్వమే యాసభారంగమందు సముచితసింహాసనముల నుపవిష్టులైయుండిరి. సభయంతయుఁ బౌరులచేఁ గిక్కిరిసిపోయెను. స్వయంవరపర్యవసానము నెఱుఁగుతమకమున వారు వేఁచియుండిరి. వేదికపైనుండు నెత్తగుసింహాపీఠపై గుణసాగరదాక్షాయణు లాసీనులైయుండిరి. వారికి దక్షిణపార్శ్వమున రాజపురోహితుఁడు విద్యాసముద్రుఁ డుపవసించియుండెను. పదునొకండుగంటలు కొట్టిరి. శంఖములు నాగస్వరము లొక్కమాఱుగా శ్రావ్యనినాదము లొనరింపసాగెను. ప్రక్కగది తెఱవఁబడెను. రాజకుమారి చారుమతి కుసుమమాలికాహస్తయై యరుదెంచి తలిదం

ద్రుల కెలఁకి మందస్మితసుందరవదనారవిందముతో వారియెదుట—రాజలోకము సమక్షమున—నిలిచెను. మూర్తిఁదాల్చినశృంగారమువలె నుండు రాజకుమారి, దివినుండి భువికివచ్చిన యచ్చరమచ్చకంటియో యనఁ జూపఱకు భ్రమగొలుపుచుండెను. లేకున్న నశాశ్వతములగు సౌందర్యసౌభాగ్యములు మనుజకాంత కెట్లుండును? నిలుకడఁగాంచియుండు మెఱుపుఁదీఁగెవలెనుండు నాసుందరాంగి, యచట మూఁగియుండు రాజలోకముపై నొకవిలోకనవిద్యున్మాలను జేసెను. రాజులందఱుఁ బులకితులైరి. తమయుడుపులు చెదరియుండుట నారిమణీమణిగమనించినచో దమ్ముఁ జిన్నచూపుచూచునేమో యను తమకముతో నాభూపవరు లతిశ్రద్ధమెయి యుడుపులను సరిచేసికొనుచు రాజసము మెఱయ నాసీనులైయుండిరి. సభయంతయు నిశ్శబ్దముగా గంభీరమైయుండెను. రాజా గుణసాగరుఁడు లేచి రాజమండలి కీరీతి నుపన్యసించెను. "సోదరమేదినీశులారా! ఆర్యావర్తము నలుమూలలనుండి విజయంచేసిన రాజకుమారులారా! మీకు స్వాగతము. కళింగరాజ్యమునకు మీకు సుస్వాగతము. విశ్వవిఖ్యాతములు మనక్షత్రియవర్ణమున కుచితములని మనపూర్వులు విధించినయాచారములప్రకారము, మాకుమారీమణి చారుమతికి స్వయంవరమహోత్సవము జరుపనెంచి మిమ్ము నీదిన మాహ్వానించియున్నాను. సాధారణముగ నిట్టిశుభకార్యములయందు రాజులు మత్సరగ్రస్తులై యొండొరులపైఁ గత్తులు దూయుచుందురు. కాన నేఁడు రాజకుమారి పాణిగ్రహణమహాభాగ్యమునకు నోఁచుకొనిన సౌభాగ్యవంతునిపైఁ గత్తిగట్టుఁడని మీరు ముందు వాగ్దానమొనరింపఁ బ్రార్థించుచున్నాను. దీనికి సమ్మతింపనివా రిచటనుండుట కర్హులుగారు. ఇట్లు వాగ్దానమొనరించుట యందఱకు సమ్మతమా?"

"నిరభ్యంతరముగా నిస్సందేహముగా" నని రాజులందఱు నఱచిరి. వేదికపైనుండు రాజపురోహితుఁడు విద్యాసముద్రుఁడు లేచి చారుమతిని జూచి సౌమ్యస్వరమున "కుమారీ! సీత, ద్రౌపది మున్నగుసనాతనరాజకుమారికలక్షత్రసంప్రదాయముల ననుసరించి యీస్వయంవరము చాటింపఁబడి

యున్నది. నీవిద్యావిభవములు, సౌందర్యవిలాసములు, సౌశీల్యసౌభాగ్యములు లోకవిశ్రుతములు. నీభర్తను నీవే వరింపవలయును. సీతామహాదేవికి శంకరు బాణము సాయమొనరించినది. ద్రౌపదీదేవికి మత్స్యయంత్రము దారిచూపినది. కాని నీవుమాత్ర మిప్పుడు నిస్సహాయురాలవు. నీలోకజ్ఞానమే నీకిప్పుడునఁ జేయూత నియ్యఁదగియున్నది. కుమారీ! దైవనిర్మితములగు పవిత్రసంస్థలన్నింటిలో వివాహము పవిత్రతరమైయున్నది. దైవశాసనమును ధిక్కరించుటకు మనమెంతవారము? తండ్రికిఁ దనపుత్రి కావివాహమునందు సంబంధము లేదు. ఆమెను బలాత్కరించు నధికారి మాతకైన లేదు. నిర్బంధవివాహము సంసారవృక్షమునకు వేరుపురుగువంటిది. నిర్బంధవివాహము, భువిపైదివియగుసంసారమును నరకముగా మార్చివేయును. స్త్రీపురుషులను దైవమే దంపతులనుగాఁ గూర్చుచుండినచో నెంతయో సమంజసముగానుండెడిది. కాని మానవు లామహాత్ముని చేతికీలుబొమ్మలు. మనుజు లామహామహానికరమునందలి యాయుధములు. అకడునానిధ మనయందు పవ్వైటుపులఁ జొప్పించి కాఁగలకార్యముల నానించుచుందుము. కుమారీ! కావున నీ విభాసితరాజ్యాధీశులమధ్యమునఁబోయి, నీయంతరాత్మ యెవ్వనివానిని మనసారవరింపుము. మహాత్ముకంటె మహాత్తును, అణువుకంటె నణువును, తనయందన్నియును, నన్నిఁటియందుఁ దానునై వెలయుతత్త్వము నీకుఁ దగినపతి ననుగ్రహించుఁగాక!" అని బోధించి దీవనలొసంగెను.

అనంతరము చారుమతి తనప్రియసఖియగు సుభాషిణితో వేదిక దిగి సభలోనికివచ్చెను. ముందు వారు మొదటనుండురాజును దాఁటిరి. రాజకుమారి తన్ను దాఁటినతోడనే యాతఁడు నిలుచుండెను. వెంటనే యాతనిస్తుతిపాఠకుఁడు "ఓ రాజకుమారీ! ఈరాజశేఖరుఁడు కామరూపరాజ్యాధీశుఁడగు కుమారపాలుఁడు. వసుమతీవార్థుల కెదురెందులేనివాఁడు. అనివార్యకార్యవిరాజితమూర్తి. దీనదయాళువు. రాజరాజు. విశ్వవిఖ్యాతమగు విధువంశజుఁడు.

నిజవంశకర్త యగుచంద్రున కీమహారాజు ముప్పదియవతరమువాఁడు" అని స్వామిచారిత్రగుణాధికములను బిగ్గఱగాఁ బొగడెను.

అపాంగ ద్తలనుఁ బలియగు నాతనిఁ జారుమతి కన్నెత్తిచూచి, చిఱునవ్వునవ్వి 'పద' మని సుభాషిణితో ననెను. 'పద' యనుపదము కుమారపాలుని యాశాపాశమును ద్రెంచివైచెను. మిగతరాజులకు నుమ్మలిక మధికమయ్యెను.

అనఘాన్వయము, దేవరాష్ట్రమహారాష్ట్రాధీశుని సమీపించెను. తోడనే యాతని మాగధుఁడు గొంతెత్తి "ఓరాజకుమారీ! దేవరాష్ట్రమహారాష్ట్రముల కధినాథుఁ డీరాజేంద్రుఁడు. ఈతనిపేరు అపరాజితుఁడు. ఈతఁడు రాజలోకచంద్రుఁడు. చతురుదధివేలావలయితధారుణీమండలమునందు సాటిలేనివాఁడు. అసంఖ్యాకప్రజాసమూహము లీతనికనుసన్నల మెలఁగుచుండును. ఈప్రభుచంద్రుఁడు సూర్యవంశమున కలంకారప్రాయుఁడు. వంశకర్త కీభూవరుఁ డేఁబదియవతరమువాఁడు" అని ప్రస్తుతించెను.

చారుమతి యాతనిఁ గ్రీఁగంటఁ జూచి 'ఇఁక బద' అని సుభాషిణితో మెల్లగాఁ బలికెను.

తర్వాత వేఁగిదేశాధీశుఁడు మహేంద్రవర్మ కూర్చుండియుండెను. అతనిమాగధుఁడు "ఓరాజకుమారీ! అప్రతిహతపరాక్రమోపేతుని, వేఁగిదేశాధీశుని మహేంద్రవర్మను జూడుము. ఈతఁడు పండితపక్షపాతి. ధర్మదేవత. కరుణాసముద్రుఁడు. దీనచింతామణి" అని కీర్తించెను.

'పద' అను నవ్వుమాట యారాజకుమారి పెదవులనుండి దూఁకెను.

పిదపఁ బ్రక్కనుండు స్తుతిపాఠకుఁ డెలుఁగెత్తి "ఓరాజకుమారీ! ఈ పురుషసింహుఁడు వ్యాఘ్రరాజు. గంధ్యాన, మహాకాంతారదేశాధిపతి. రణకేసరి. విబుధశేఖరుఁడు. ధర్మమార్గపరాయణుఁడు. కాళింగులకు కెచ్చెలి. శిల్పకళాచతురుఁడు" అని కైవారమొనరించెను.

వ్యాఘ్రరాజహృదయాలవాలమునందగి గూఢాంకూరమును 'పద' యనుకరవాలము కోసివేసెను. అనంతరము కాంచీపురీశ్వరునివంతు వచ్చెను. "ఓ రాజకుమారీ! ఈతం డవంతివర్మ. కాంచీపురవరుఁడు. దేవాలయమగు కాంచీనగరమును బోలినపట్టణ మీపుడమి పైఁగలదా? అవంతివర్మ కెనయగు మానవుఁ డీయవని పైఁగలఁడా! ఈపుణ్యమూర్తి రాజులకురాజు. సార్వభౌమేంద్రుఁడు. దక్షిణాబ్ధికధినాథుఁడు. చోళరాజు లీపార్థివేంద్రుని పాదరాజీవభృంగములు" అని మాగధుఁడు కీర్తించెను.

మరలఁ జారుమతి 'పద' యని పలికెను.

తరువాతిమాగధుఁడు "ఓ రాజకుమారీ! ఈపురుషోత్తముఁడు భానుగుప్తుఁడు. మాళవాధినాథుఁడు. హూణయువరాజకుమారుఁ డగుమిహిరగులుని ప్రతినిధియైయున్నాఁడు. మిహిరగులుఁడు మహారాజతోరమాణుని తనయుఁడు. రాజలోకమార్తాండుఁడు. శాసకులకు దండాసనుఁడు. గుప్తతురంగములపాలి సింహము. సేతువుమొదలు 'అక్షు' నదివఱకు దనయాటపాలముగ నేలుచున్నాఁడు" అని స్తుతించెను.

తోడనే యారాజసమూహమునుండి "మిహిరగులుఁ డార్యుఁడు కాఁడు. కాన నాతని ప్రతినిధి కిచటఁ దావులేదు." అని యెవరో యఱచిరి. హూణచక్రవర్తి నవమానపఱచినమానవుని సాహసమున కందఱు నిర్విణ్ణులైరి.

భానుగుప్తుని చేయి కరవాలముపై వ్రాలెను. 'ఎవఁ డాసాహసుఁడు!' అని యాతఁడు క్రోధముతో నఱచెను.

"నేను. నేనే. మాళవమహాకోసలాధీశుఁడను. యశోధర్మను. నేను. మాధర్మప్రభువు; రాజరాజు; మహారాజులకు మేటి; దీనశరణ్యుఁడు; హూణపన్నగవైనతేయుఁడు; నరసింహబాలాదిత్యుని ప్రతినిధిని" అని యశోధర్మ గర్జించెను.

సభ్యులందఱాశ్చర్యచేతస్కులైరి. ఏమీ! నిజముగా నాతఁడు యశోధర్ముఁడేనా! పేరోలగమున హూణునిఁ బరాభవించుట కాపరాజితునకు గుండెలున్నవా? అతఁడు మాళవమహాకోసలాధీశుఁడగు యశోధర్ముఁడే యని యందఱకు నమ్మకము కలిగెను. పరాభవానలతప్తుఁ డగుభానుగుప్తుని చిత్తము సంక్షుభితమై యుండెను. కాని యాతఁ డంతలోఁ దెప్పరిల్లెను. నిండోలగమునఁ దనస్వామికైన పరాభవమునకు మిన్నకుండుట పాడికాదని భానుగుప్తుఁడు తలంచెను. కాన నాతఁడు క్రోధోద్రిక్తకంఠస్వరమున "ఔను? నీవే యనుకొంటిని. సంకటియధికప్రసంగులును, పిఱికిపందలును మఱెవ్వరున్నారు. ఉజ్జయినీనగరమున నపుంసకునకైన మగతనములేని నీవిపుడు దీనవత్సలుఁడగు కళింగాధీశుబాహుబలము నూఁతగాఁగొని ప్రల్లదము లాడుచున్నావు. నీధర్మప్రభువు, నీరాజరాజు, నీమహారాజులకు మేటి, నీదీనశరణ్యుఁడు, నీహూణపన్నగవైనతేయుఁడు నరసింహబాలాదిత్యుఁ డేమూల నక్కియున్నాఁడు? మార్జాలసార్వభౌముఁడును, మూషికచక్రవర్తియుఁ దప్ప, నాతనికి నతులానర్హ్యవా రెవరున్నారు? తనకుఁ దానేతప్ప, నాతఁ డేరాజులకుఁ జక్రవర్తి" అని గద్దించెను.

యశోధర్మ రోషరంజితలోచనుఁడై, కోశాంతర్గతకరవాలము నూడఁ బెఱికి "ద్రోహీ! నేటితో నీజీవితముసరి. నీకృతఘ్నతాబుద్ధి నేటితోఁ దుదముట్టుఁగాక! అరాక్షసకఠోరములగు నీప్రశంసావాక్యము లిఁక నీభువిపై వినఁబడకుండుఁగాక!" అని భానుగుప్తునిపైకిఁ దూఁకెను. భానుగుప్తుఁడు భయోద్వేగమున గడగడవడఁకసాగెను. అతఁడు "గుణసాగరప్రభూ! నేను నీయతిథిని. నీవు, నాకు శరణ్యుఁడవు. ఓసోదరరాజులారా! మీరు నాప్రాణరక్షకులరు." అని కుయ్యిడెను. వెంటనే కేరళాధిపతియగు మహాసేనుఁడును, వేఁగీశ్వరుఁడగు మహేంద్రవర్మయు, కామరూపాధీశుఁడు కుమారపాలుఁడును, యశోధర్మ కడ్డునిలిచి భానుగుప్తుని రక్షించిరి. కాని యశోధర్మ పట్టుదలతో "నన్ను విడువుఁడు. ఆమ్లేచ్ఛరక్షపాలుని—అమానవమాత్రుని—అకృతఘ్నుఁ

పాపమును బ్రోవింపనింపు. మానముపోయిన ప్రాణము నిరర్థకము. సత్యపరిత్రాణార్థము, వివిధరూపాత్మకమగునసత్యమును రూపుమాపుట క్షత్రియోచిత ధర్మము కాదా?" అనెను.

వ్యాఘ్రరాజాతని రెండు చేతులఁబట్టుకొని "సోదరా! నీకోచితములగు నీభాషణములవలన నేఁడు నీకు విష్ణుశంకరదయచిహ్నము లభించినాఁడు. నిస్త్రపరుపదవిని, గంధర్వనమాకాంతారాధినాథుఁడు ఁడీవ్యాఘ్రరాజామాత్ర మామరణాంతము నీకుఁ బ్రియమిత్రుఁడై కుడిభుజమై యుండుట సత్యము. కాని నీవిపుడు శాంతించి కూర్చుండవలయును. ఇపుడు కళింగరాజకుమారికి స్వయంవరమహోత్సవము జరుగుచున్నది. ఇం దాటంకము ఉండరాదు. మన శాత్రవముల నెఱపుకొనుటకిది రణాంగణము కాదు. రాజకుమారి వరించిన భూపతుఁడామెను నిరాటంకముగఁ జేపట్టవలయును. ఆమెవరణమున కడ్డు తగులునధికారము మనకు లేదు" అని మందలించెను. ఈయభిప్రాయవివరణమున కందఱు చప్పట్లు చఱచిరి. ఎంతోకష్టమున వారు యుద్ధధర్మకర్తిని క్రిందికి దించి యాతనిఁ గూర్చుండఁబెట్టఁగలిగిరి. చారుమతి సుభాషిణి లీయుల జడినంతయు విస్మయముతోఁ దిలకించుచుండిరి. ఆయువతుల కించుకేని భయము కలుగలేదు. అంతయుం శాంతించినపిదప, చారుమతి సుభాషిణితో "'మిహిరగులుఁ డార్యుఁడు కాఁడా? కాకున్న, నాతని ప్రతినిధి కచటఁ దావున్నదా?' అని భానుగుప్తు నడుగుము" అని చెప్పెను.

భాను:—ఓకరుణాత్మురాలా! మిహిరగులుఁడు మిహిరకులాలంకారుఁడని రాజకుమారికి నివేదింపుము. అపురుషసింహుఁ డార్యుఁడు. ఉన్నతకులాభిజాత్యసంపన్నుఁడు. దేవదేవుఁడగు మహాదేవుని భక్తుఁడు.

చారు:—సుభాషిణీ! హూణుఁ డార్యుఁ డెట్లగును!

భాను:—ఓరాజకుమారీ! భరతవర్షమున కరుదెంచిననాఁటినుండియు నాతఁడు సర్వగుణశోభితుఁడగు నార్యుఁడయ్యెను.

చారు:—ఓరాజా! హూణుఁడార్యుఁ డౌటెట్లు? ఇది సాధ్యమా? పుట్టుకతోఁ గావలయుఁగాని పూఁతమెఱుఁగులతోఁ గాఁగలఁడా? పదివేల రాజ్యములున్నను, నూఱువేలపటాలములున్నను, అనార్యుఁ డార్యుఁడు కాఁజాలఁడు. భరతవర్షమునందు జన్మించిన రాజవంశజుఁడే యార్యుఁ డనిపించు కొనును. ఇది మాపురాణప్రసిద్ధము.

భాను:—రాజకుమారీ! నీసాహిత్యపరిజ్ఞానమునకు నాప్రణామములు కాని నీస్వయంవరమునకు యోగ్యుఁడగు వ్యాఘ్రరా జెంతటియార్యుఁడో మా స్వామి మిహిరగులుఁడునైన నంతటివాఁడని చెప్పఁగలను.

వ్యాఘ్ర:—(కోపముతో) ఏమీ! ఆకృతఘ్నుఁడు, ఆమ్లేచ్ఛాధముఁడు కూడయున నేమి? ఓరీ వాచాలా! నినోరుకట్టిపెట్టవేని, నీచరమదశ మహాకాంతా రమునఁ దుదముట్టునని తెలియుము.

భాను:—హూణుని మేనఁ బ్రాణములుండువఱకది యసంభవమని తెలియుము.

వ్యాఘ్ర:—హూణుఁ డేగంగలోదూఁకిన మాకేమి? అతఁడు చచ్చిన మాకేమి? బ్రతికినమాకేమి? అసంగతులు మాకు వలదు. కాని, ఓరీ మూఢుఁడా! పూజ్యమగు నీస్వయంవరమండపమునుదాఁటినతర్వాతఁగూడ నీవిట్టి కాఱు కూఁతలఁగూసినచో, నేను గంధ్యావనమహాకాంతారాధినాథుఁడను వ్యాఘ్ర రాజునైతి నేని, నీవు వాచాలత్వమునకుఁ బరితపింపకపోవని తెలిసికొనుము.

"శాంతం. శాంతం" అని గుణసాగరుఁ డఱచెను. మరల సభయంతయు నిశ్శబ్దమయ్యెను.

భాను:—ఓరాజకుమారీ! హూణసార్వభౌమకుమారుని పాణిగ్రహణమునఁ గలుగులాభనష్టముల నించుక యోచింపుము. ఇట్టికల్యాణమువలన, కళింగరాజదౌహిత్రుఁడు గుప్తసార్వభౌమసింహాసనాసీనుఁడగు భాగ్య మొదవును.

చారు:—ఓరాజా! అన్యాయార్జితమగు సింహపీఠిపై నాతనయుఁ గూర్చుండఁబెట్టుటకు నాకిష్టములేదు. హైందవరుధిరకళంకితమగు సింహపీఠి నాసీనుఁడగుటకంటె—నిర్భాగ్యులగు హైందవమానవేంద్రుల నెత్తురుబొట్టులఁ గ్రక్కుచుండుమకుటమును దాల్చుటకంటె—నాతనూజుఁ డింటింటఁ దిరుగుచు భైక్షుకవృత్తినవలంబించినను, నేను సంతసించెద. అది యటుండఁ, గాళింగులు కీర్తిచెరుపు తెచ్చుకొనువారుకారు.

భాను:—అయిన, రాజకుమారీ! మిహిరగులుని నీవు నిరాకరించుట వలన నీకుఁగానుండు ననర్థముల వివరించుట నావిధియైయున్నది. ఓగుణసాగరా! ఓచారుమతీ! మాహూణసార్వభౌముని సందేశమును, ఆతనిధోరణిగానే మీకు వినిపించెదను. 'రాజకుమారి చారుమతి మాకుమారుని మిహిరగులుని వివాహమాడ నొల్లదేని, కళింగరాజ్యమంతయుఁ గొల్లఁగొట్టి, చారుమతిని చెఱఁబట్టుకొనిపోయెదము. కళింగుల నాబాలవృద్ధులను గరవాలమున కెఱఁ గావింతుము. దేశమంతయు భస్మమొనరింతుము. రాజ్యమంతయు నాక్రమించెదము?

ఈప్రకటనము నాలకించి రాజలోకమంతయు అచ్చవడెను. కాని చారుమతిమాత్రము చలించలేదు. కాలఁదఁచిననాగమువోలె నాకోమలి 'బుస్సు' మనుచు "ఓరీ! భయపెట్టిదొ యెఱుఁగనిభారతనారీమణిని బెదరింపఁజూచుచున్నావా? పొమ్ము. పోయి, నీమిహిరగులునితో మ్లేచ్ఛబలములఁ దీసికొని యెప్పుడైన రానగునని చెప్పుము. యుద్ధభూమియందు దాతనితో వీరవిహారమొనరించుటకుఁ గాళింగులు సిద్ధముగానుందురు." అని చెప్పెను.

"సెబాస్. సెబాస్" అని కళింగులఱచిరి. "తల్లీ! నీవు ప్రజలపాలి కెన్నిధానమవు. కళింగరాజునకుఁ దగినతనయవు నీవేనమ్మా! పులికడుపునఁ బిల్లిపుట్టునా!" అని వారామె నగ్గించిరి.

వ్యాఘ్ర:—మఱియొకమాట. కళింగులకు సాయమైనిలుచువారిని వెదకఁబనిలేదు. ఈకళింగమిత్రుఁ డందఱికంటె ముందునిలుచుటకు నడుము కట్టియున్నాఁడు.

"భళి భళి" అని కళింగు లఱచిరి.

అవ:—దేవరాష్ట్ర మహారాష్ట్ర చమూసమూహములు కళింగరాజ్యమునకుఁ బెట్టనికోటలై నిలిచియుండఁగలవు.

"సెబాస్. సెబాస్" అని కళింగులు చప్పట్లుచఱచిరి.

యశో:—మహాకోసలసైనికులు వెనుకంజవేయరు.

మహా:—ఈధర్మయుద్ధమున మాకేరళరాజ్యము తనకోపినంతసాయ మొనరించితీఱును.

మహేంద్ర
అవంతి }:—వేఁగి, కంచిరాజ్యములు నిన్ననుసరించును.

కుమా:—కళింగమును మిహిరగులునిబారికిఁ ద్రోసి, కామరూపాధిపుఁ డీకుమారపాలుఁ దూరకుండ నేరఁడు.

"సెబాస్. సెబాస్. భళి భళి" అని కళింగులు మఱిమఱి యఱచుచుండిరి.

భాను:—లంకలు నూరైన నొక్కచిల్లి నేమిచేయఁగలవు. మీరందఱొక్కటియైనను, మిహిరగులు నేమిచేయఁగలఁడు. స్కందగుప్త, ప్రకాశాదిత్యసైన్యవారిధులకుఁ బ్రళయభంజనుఁడైనవాఁడు—యూఫ్రటిస్ పర్యంతము బ్రహ్మపుత్రవఱకుఁ బ్రభుశేఖరుఁడై వెలయువాఁడు—నలుగురైదుగురు రాజనామకులతుచ్ఛసైన్యములకు వెఱచునా! చీమలబారునకు భయమందువాఁడు, కొఱమాలిన మీభటవర్గమునకు భయమొందును. మిహిరగులుఁజూచిన యార్యావనీశులు, కంఠీరవమునుజూచిన కుందేళ్లవలెఁ, గాలికి బుద్ధిచెప్పక పోరు.

వ్యాఘ్ర:—(కోపముతో) ఆదురహంకారుని హత మొనర్చెదను. వాఁడు కళింగులకుఁ, గళింగరాజాత్మజుకు, నీప్రభుమండలికిఁ దలవంపుల గలిగించుచున్నాఁడు.

వెంటనే "వానిఁ జంపుడు. వానిఁ జంపుఁడు" అని అపరాజితుఁడు, మహేంద్రవర్మ, అవంతివర్మ, కుమారపాలుఁడు, యశోధర్మ యఱచిరి వారందఱు కత్తులుదూసి భానుగుప్తునిపైఁబడిరి. కాని భానుగుప్తుం డందులకుఁ దొలఁకక "రంపు. రాయబారిని జంపి, మిహిరాయార్యరాజశాసనమును నిలుపుకొనుఁడు" అని యెత్తిపొడుపుమాటల ననెను.

గుణ:—రాజులారా! భానుగుప్తునిభాషణము లెంతయు నిజములు. అతఁడు రాయబారి. కాన వాఁడు పూజ్యుఁడు. అతనిమాట లెంతయహంకారబంధురములైనను, ఆర్యులయుద్ధనియమములును, సంధిసూత్రము లొకనిఁ జెనకవు. మీఁదు మిక్కిలి యాతఁడు నా యతిథి. భారతధారుణీవరులకుఁ దమయతిథుల ప్రాణము లతిపవిత్రములను మాట మీకుఁ దెలియనిది కాదు. కాన, మీరందఱును దయచేసి కూర్చుండుమని ప్రార్థించుచున్నాను."

గుణసాగరుని సౌమ్యవాక్యంబులు లారాజులకోపానలము నార్చి వైచెను.

చారుమతి 'సరి' యని సుభాషిణితోఁ జెప్పెను. కాని వారా వెలు లడుగిడునంతలో భానుగుప్తుఁడు "ఓరాజకుమారీ! పరాభవాగ్నిఁ బడి మ్రగ్గుటకు ముందు—వినాశప్రవాహమునఁబడి వెతనొందుటకు ముందు—యించుక యాలోచింపుము. వీరిమాటలను విశ్వసింపకుము. వీరు చపలచిత్తులు. క్షణక్షణము వారి చిత్తము మార్పొందుచుండును. కోటలుదాటునట్లు మాటలాడు వీరిందఱు, కృపాణసందర్శనమున నుత్సాహము చల్లఁబడ, నిన్ను నీకర్మమునకు విడిచి స్వప్రాణములఁ జేతఁబట్టుకొని పలాయనసూత్రముల బఠింపకపోరు. కాని గంద్వాన మహాకాంతారాధినాథుఁ డగువ్యాఘ్రరాజుమాత్రము చెప్పినమాటఁ జేయును. ఏలయన, కిరాతుఁడగువాఁడు రాజనీతివిహీనుఁడు" అని చెప్పెను.

వ్యాఘ్ర:—ఓరీమూఢుఁడా! సత్యవాక్పరిపాలనము కిరాతసంప్రదాయమైనయెడల—నీతినియమమార్గానుసరణము కిరాతసంప్రదాయమైనయెడల—కిరాతుఁడనైయుండుట నాకెంతయుఁ దృప్తికరము. నేను మాట

తిరుగువాఁడగానని నీయట్టిద్రోహకర్తుఁడునైత మంగీకరించినందులకు నాకెం తయుం సంతసముగానున్నది.

'మంచిది' అని భానుగుప్తుఁడు రాజకుమారివైపుతిరిగి "పరిస్థితు లివిం ముదుసలియగు నీజనకుని రూపుమాపఁజేయుట నీకు భావ్యమా? సమరవిద్యావిశా రదులగు హూణులతోడికయ్యమున మీతండ్రికి సర్వనాశముగానున్నదని నీకు బాగుగాఁ దెలియునుగదా? కళింగమునందలి నగరరాజములన్నియుం నేల మట్టమైపోవును. హూణునికార్యానలంపుఁబెంపు నీకంతగాఁ దెలియదుకాఁ బోలు" అని నుడివెను.

చారు:—నాకది బాగుగాఁదెలియును. పూర్వము కారవేలుఁడను భూకాంతుఁడు మాకళింగము నేలుచుండెను. అతఁడు మామూలపురుషుఁడు. మగధస్వామి యగుపుష్యమిత్రుఁడు నిజభుజగర్వమున విఱ్ఱవీఁగుచుండఁగా నా కారవేలుఁ డాతనిఁ దనపాదాక్రాంతుఁగాఁ జేసికొనియుండుటయుం నాకుఁ దెలియును. కాన్యకుబ్జమునందలి కడపటివాఁడగుసుశర్మ, నగరరాజమగు పాటలీపుత్రమును ఆంధ్రులకు ధారవోయుటఁగూడ నాకుఁదెలియును. భగ వానుఁడు ధర్మైకపక్షపాతి. అధర్మము కళింగరాజాశ్రితము. భగవానుఁడు కళింగరాజునకు ధర్మయుద్ధమున సాయమొనగించును. ఒకవేళఁ గాలము కలిసి రాదనుకొందము. ధర్మసంరక్షణార్థము, విదేశజాలగుకిరాతులతో నగుపోరాట మునఁ గళింగము నశించిన నశించుఁగాక! విశ్వమునఁగల పర్వతశ్రేణులన్నియుం నాయీస్థూలదేహమును నలిపిన నలుపుఁగాక ! సప్తసముద్రములు నాయీ స్థూలశరీరమును ముంచిన ముంచివేయుఁగాక! అంతనువచ్చినయెడల, నిత్య మగునాయాత్మ స్థూలశరీరబంధములఁ ద్రెంపుకొని, జయాపజయముల కతీ తమై వెలయఁగలదు. నిమిహిరగులుఁ డధమాధముఁడని నాకిప్పుడు తెల్లమైనది. పొమ్ము. పోయి, 'ఆర్యరాజకుమారి నీమొగమైనఁ జూడనొల్లదు' అని వాని కెఱింగింపుము. ఆకిరాతుఁడు కిరాతకాంతలఁ జేపట్టనగుఁగాని, పరజాతిపతి తలఁ గన్నెత్తియైనఁ జూడకుండుఁగాక. సుభాషిణీ! పద.

"అయిన యుద్ధము నిర్ధారణమైనట్లే కదా?" అని భానుగుప్తుఁడు కూర్చుండెను.

"ఔనుగాక. మాకుమారిని విజాతీయుండగు వరునకిచ్చి వివాహ మొనరింపఁజాలము" అని రాణి దాక్షాయణి యనెను.

"ఔనౌను." అని రాజా గుణసాగరుఁడుకూడఁ బలికెను.

"ఔనౌను. అది కలనైన జరుగదు" అని సభాసదులు కళింగు లఱచిరి.

తరువాత సింహళద్వీపాధిపతి కాకవర్ణుఁడు కూర్చుండియుండెను. ఆచెలి యాతనిఁజూపిన వెంటనే మాగధుఁడు "ఓరాజకుమారీ! ఈపురుషోత్తముఁడు సింహళరాజ్యరమావల్లభుఁడు కాకవర్ణుఁడు. పాండ్యచోళరాజ్యలక్ష్మీశుఁడీపుణ్యమూర్తి. రాజరాజు. దానరాధేయుఁడు. బుద్ధమతావలంబుఁడు. బుద్ధమతమునకుఁ బట్టుకొమ్మ. రాజలోకాలంకారుఁడు." అని యాతనిఁ బొగడెను.

'పద' అని చారుమతి సుభాషిణితో ననెను. కాకవర్ణుఁడు గొంతెమకోర్కెలు కూలిపోయెను.

అనంతరము నేపాళాధీశ్వరుఁడు సింహభూపతివంతువచ్చెను. ఆతని మాగధుఁడు లేచి "ఓరాజకుమారీ! ఈమోహనాంగుఁడు నేపాళధరాకాంతుఁడగు సింహభూపతి. సామంతరాజమకుటసంరాజిత పాదరాజీవుఁడు. నేముని యనుమహాత్ముని శిష్యుఁడు. కువలయానందకరుఁడగు మంజుశ్రీసుమేధాపుంజములనీతఁడు కీర్తించుచుండును. ఈవీరశేఖరుఁడు రణకేసరి బిరుదాంకితుఁడు. ఉదారగుణమున గోవున కీడగును. చతురవర్తనమున గోమాయువునకుఁ బాఠములఁ గఱపును. నీతివిస్ఫురణమునందును, సౌజన్యసౌభాగ్యమునందును సింహభూపతి కెనయగు నార్యభూపతులు లేరు." అని ప్రస్తుతించెను. 'పద' అను పద మాతని చెవులఁబడెను. సింహభూపతియు నాతని మాగధుఁడును దమగప్పములన్నియు నిరుపయోగములయ్యె నని గ్రహించిరి.

తరువాత యశోధర్మ నిలిచెను. అతనియెదుట నిలుచుటకుఁ జారుమతి కెందులకో సిగ్గయ్యెను. యశోధర్మ తనవెంట మాగధుఁ గొనిరాలేదు. అతఁడు స్వయముగ "ఓకళింగరాజకుమారీ! ఇచట నిలిచియుండువాఁడు, మాళవ మహాకోసలాధీశుఁ డగుయశోధర్మ. ఆర్యావర్తమునకు ధర్మప్రభువును, సముద్రగుప్తసార్వభౌమాన్వయభూషణుఁడును, లిచ్ఛవీకుమారీగర్భశుక్తిముక్తాఫలమును, నవచింతామణియు, హూణమండూకమహోరగమును అగునరసింహబాలాదిత్యుని ప్రతినిధి యీతఁడు. పరాక్రమోజ్జ్వలమగుగుప్తాన్వయమునందు జన్మించిన యీరాజకుమారుఁడు, నేఁటికాలపురాజుల కలంకారప్రాయుఁడై యున్నాఁడు. ఈతఁడే నీకుఁ దగినస్వామి. నీకుఁ దగినభర్త" అని పలికెను.

అంత కీర్తిలాభపురము మహాసేనుఁడు నిలువఁబడి "ఓయశోధర్మా! నరసింహబాలాదిత్యుఁడు మున్నె పెండ్లాడెనని నీకుఁ దెలియదా?" అని యడిగెను.

ఆమాటలకు యశోధర్మ వెఱఁగందెను. "ఏమీ! పెండ్లాడెనా?" అని యాతఁ డనెను.

సుభాషిణి మున్నగువారుకూడఁ "బెండ్లాడెనా?" అని ప్రశ్నించిరి.

మహా:—అవును. పెండ్లాడినాఁడు. రఘుపతి తనయను విలాసవతిని సరస్వతిని బెండ్లాడినాఁడు. వివాహము నారాజ్యమందే జరిగినది.

యశోధర్మ విస్మయక్రోధాక్రాంతస్వాంతుఁడై "ఏమీ! సార్వభౌమ సముద్రగుప్తవంశజుఁడు సామాన్యవనితను జేపట్టెనా?" అనెను.

మహా:—ఓమాళవమహాకోసలాధిపా! ఓయశోధర్మా! ప్రస్తుత మీ స్వయంవరమహోత్సవమునకుఁ గారణభూతురాలగు రాజకుమారిసంగతి యటుండనిచ్చి సౌందర్యసౌభాగ్యశేముషీవిశేషముల సరస్వతి కెనయగు ప్రభుతనయ పేరొక తెకలదని నీవు తలంచినయెడల, నయ్యది సత్యదూరమనియు, ప్రమాదజనితమనియు నేను జెప్పవలసియున్నది.

"అయిన నన్నిచటికిఁ గొనివచ్చిన నాయుద్దేశము నిష్ఫలమై పోయినది."

"బాలాదిత్యునకు వివాహమైనందున, నీవిపుడు నీకై ప్రయత్నింప వచ్చుఁగదా" అని సుభాషిణి యశోధర్మతోఁ బలికి, చారుమతివైపు చూచి మందహాసమొనరించెను.

"సముద్రగుప్తవంశదీపకునకు నాకు నెక్కడిసాటువ? కాని, రాజకుమారి నాపై ననుగ్రహించుచో, నేను బ్రయత్నించెదను." అని యశోధర్మ పలికెను.

సుభా:—నీకోరికను రాజకుమారి యనుమతించినది. ఈతరుణి మౌనమంగీకారసూచకముగదా!

యశో:—ధన్యుఁడను. ఓరాజకుమారీ! ఈతఁడు మాళవమహాసేనాధిపుఁడగుయశోధర్మ. ఈతఁ డాత్మకులకళంకుఁడు. చాతురీధురీణులును, వయోవృద్ధులునగు నాపూర్వులు సార్వభౌమపదవినంది ప్రజాక్షేమముకొఱకుఁ దమ ప్రజ్ఞను మనసార వినియోగించుచుండిరి. మహాత్ములగు నాపూర్వు లెన్ని దేవాలయములనో ప్రతిష్ఠించిరి. ఎన్ని కాసారములనో నిర్మించిరి. ఎన్ని ఛాయాద్రుమములను నాటించిరి. ఎన్నిగో బాటలని నిర్మించిరి. వారు కకుబంతయశోవిశాలురు. శత్రురాజతమఃపటలమార్తాండులు. వారి చతురంగబలములకు రణరంగవిహారము వెన్నతోఁ బెట్టినవిద్య. వారిపేరు లరులకు బేరులు. గుప్తసార్వభౌములయెడ మాకుఁగలగౌరవాభిమానములఁ జేసి, మేము వారియెడ వినయవర్తనులమై యున్నారము; కాని వారివలని భీతిచేఁగాదు. పాపకారులగు మ్లేచ్ఛులు, దారుణవిక్రములగు గుప్తసార్వభౌములను బరాభూతులం గావించిననాఁటినుండి, మాళవమహాసేనులకుఁ జెడుకాలముపట్టినది. ఎచటఁగాంచినఁ బాడూళ్లు, ఎచటఁజూచినఁ దెగిన చెఱువులు, ఎచటఁగనినఁ బడినకోవెలలు, ఎచటఁబోయినను గడ్డిమొలచినబాటలు, ఈ రీతినంతయు విషమించినది. చండవిక్రములగు మాళవమహాసేనులకుఁ బ్రతినిధినగు నేను, నాసార్వభౌముని నోటమినుండి కాపాడఁజాలకపోయితిని. కడకు స్వరాజ్యమును సైతము వైరిరాజులనుండియుం, దోపిడులనుండియుఁ

గాచుకొన నశక్తుఁడనైతిని. ప్రస్తుతము నాకిపు డొకటిరెండుకోటలుమాత్రము స్వరాజ్యాంతర్భాగమున మిగిలియున్నవి. ఇట్లు శక్తిసంపన్నులగు పూర్వరాజ వంశజుఁ డిపుడు దీనుఁడై కిరాతులమధ్య కాలము గడపుచున్నాఁడు. ఇప్పటికి నైతము నేను స్వేచ్ఛావృత్తినై చరించుచున్నందులకు నామానసము ప్రశాంతమైయున్నది. బూటకపుసిరుల నూఁగులాడుచు నడపీనుఁగులైయుండు కొందఱురాజులరీతి విదేశజనకుఁ దలయొగ్గుటకు నేను కలనైనఁ దలంచుటలేదు గదా యని నామనము మూఱటఁజెందియున్నది. నాచెలువునియెడ, నాస్వామియెడ నేను కృతజ్ఞుఁడనైయున్నాను. నామతమునెడ, నామాతృభూమియెడ నేను కృతజ్ఞుఁడనైయున్నాను. నాపూర్వులసంప్రదాయముల ననుసరించి, యీసద్గుణముల నేను విడకున్నాను. ఓరాజకుమారీ! నీవు పాణిగ్రహణ మొనరించినచో, నీజీవిత మాపదలకు నిలయమై యుండఁగలదు. అప్పుడు నీకు మనశ్శాంతి యుండఁజాలదు. సౌఖ్యమునకు, శాంతికి నీవు సెలవీయవలసి యుండును. నాజీవితము హూణనిధనమునకై వినియోగించుచున్నాను. ప్రాచీనమగు నామాతృభూమిని కిరాతులగు విజాతీయులబారినుండి యుద్ధరించుటయే నాజీవితోద్దేశమని నిర్ధారించుకొనియున్నాను. ఈనానిర్ధారణ మజయ్యమై హిమాలయముభంగి నిశ్చలమైయున్నది. నేను వేఱుమార్గమునఁ బోయియుండిన, భానుగుప్తునిభాతి భాగ్యవంతుఁడనై యుండెడివాఁడను. భానుగుప్తునివలె, నాజీవితమును విక్రయించుకొనియుండెడివాఁడను. ఓరాజకుమారీ! మాతృదేశోద్ధరణార్థమగు నీధర్మయుద్ధమునఁ బాల్గొనువాని కర్ధాంగివగుటకు నీవు తగినదానవని నాకు నమ్మకముకలదు. అట్టినమ్మకముతోడనే, నేను నిన్ను బాలాదిత్యు నుద్వాహమాడ వేఁడుకొంటిని. కాని యది యిపు డసాధ్యమై పోయినది. కాన నిప్పుడు నన్ను బెండ్లాడి యాజన్మాంతము నాసౌఖ్యసంతాపముల సమభాగిని వగుటకు నిన్నుఁ బ్రార్థించుచున్నాను. స్వకీయములని చెప్పఁదగిన నాహృదయమును, నాఖడ్గమును నీకుఁ గానుకగా నర్పించుచున్నాను. దీని నంగీకరింతువా?

చారుమతివదనాంబుజము సంతోషరేఖాసమ్మిళితమగు మందహాసముతోఁ బొల్చెను. ఆసుందరాంగి కుసుమహారమును యశోధర్మ కంఠసీమయందు వైచెను. కళింగు లానందతరంగితాంతరంగులై చప్పట్లుచఱచిరి. భేరీమృదంగవాద్యములు మాఱుమ్రోగెను. రాజగాయకులు మంగళవాద్యములను భూమ్యాకాశములనించిరి. గుణసాగరదాక్షాయణులు వేదిక దిగి, వధూవరులచెంతకు వచ్చిరి. సభ్యులందఱు లేచిరి. అచటిభూకాంతులనందఱును, గుణసాగరదాక్షాయణులు వివాహమహోత్సవమున కాహ్వానించిరి. వారి యాహ్వానమును బెక్కు రంగీకరించిరి. అంత భానుగుప్తుఁడు లేచి "ఓగుణసాగరా! నిన్ను, నీమిత్రులను, నీప్రజలను జూచిన నాకు జాలియగుచున్నది. మీకు మూఁడనున్న కీడుఁ దలఁచుకొనిన, నాకు గగుర్పాటు గలుగుచున్నది. నేఁటిరాజకుమారి తెలివిమాలినవర్తనముచే, హూణునకుఁ దలవంపులు సంఘటిల్లినవి. భీకరులగు తోరమానమిహిరగులురు, ప్రతిక్రియలను బాగుసేయఁగలవారు కారు. కళింగరాజనగరములన్నియుఁ ద్వరలో నేలమట్టములుగానున్నవి. మున్నీటిని దీరముగాఁగల మీరాజ్యమునందు జనాకీర్ణములగు రేవుపట్టణములనేకములున్నవిగదా. ఇప్పుడవన్నియుఁ నిర్జనములై బావురుమనుచుండు కాలము రానున్నది. అశోకునిముట్టడికంటె భయానకమైన దండయాత్ర యీమాఱు చేకూఱనున్నది. అశోకసార్వభౌముఁడు కరుణాసింధు కాన, నాఁడు పశ్చాత్తాపమొందెను. కాని యీపశ్చాత్తాప మీమాఱుండదు. కళింగపట్టణము, అమరావతి, పాడుపడినపట్టణముల పేరులైపోఁగలవు. నేనుజ్జయినికిఁబోయినతోడనే హూణబలగములు బయలుదేఱివచ్చి కళింగులను సాగరమధ్యమునకుఁ జిమ్మివేయఁగలవు. కళింగులకు సాయమొనరించిన ధరణీశులు నాశమొందఁగలరు. ఈవివాహోత్సవములకుఁ బోయినవారికి సైతమట్టిగతి పట్టఁగలదు. వారలను హూణుఁడు తనవైరివర్గములోఁ జేర్చుకొనును. వారలఁ దగురీతి శిక్షించి తృప్తిపొందఁగలఁడు. కావున నోరాజులారా! వెనుకముందు లారసి వర్తింపుఁడు" అని హెచ్చరించెను.

అంతయుం నిశ్శబ్దముగానుండెను. అయిదునిముసము లయ్యెను. అప్పుడు శాస్త్రిస్వామి పద్మాయుధుండు లేచి "ఓగుణసాగరా! నారాజ్యము ప్రాణరాజ్యమునకు దాపునఁగలదు. కాన నేను వారలతోఁ గలహించుట కొఱవితోఁ దలగోఁకికొనిన ట్లగును. అదియటుండ, నాకు స్వరాజ్యమునందుఁ గొరవిపనికలదు. కాన నేను వివాహమహోత్సవములకు రాఁజాలనందులకుఁ గొంతిల్లుచున్నాను" అని చెప్పెను.

"ఓరాజా! అటులే కానిమ్ము" అని గుణసాగరుఁ డుత్తరమొసంగెను.

అంతఁ గాశీనాథుఁడు ఇంద్రద్యుమ్నుఁడు లేచి "ఓగుణసాగరా! నేనుగూడఁ ద్వరగాఁ బోవలయును" అని చెప్పెను.

గుణ:—అట్లే కానిమ్ము.

ఉత్తరహిందూస్థానమునందలి నలుగురైదుగురు ప్రభువు లిట్టికుంటిసమాధానములఁ జెప్పి తప్పించుకొనిరి. ఒక్కొక్కరాజు లేచి వేడుకొనునపుడంత యుం, వ్యాఘ్రరాజు కోపమూర్తి తస్వరమున 'పిఱికిపంద. పిఱికిపంద' అని వారల నవమానపఱచుచుండెను.

అనంతరము మహాసేనుఁడు "ఓగుణసాగరా! ఉత్సవకాలములయందు నే నిచట నేయుండెదను. నేను కేరళమునకుఁబోయినతోడనే, నాచే నైనంత సాయ మొనరింతును" అని చెప్పెను.

గుణ:—కృతజ్ఞుఁడను.

భాను:—(కోపముతో) జాగ్రత్త! నీవు నాశమయ్యెదవు.

మహా:—(నవ్వుచు) నాశమయ్యెదనా! నీహూణులంద ఱొక్క మొగముగావచ్చినను, కేరళాధిపుని ధిక్కరింపనోపరు. పరశురామభూమిని వారు చేరులోపలనే, పరలోకమునకుఁ బ్రయాణమైపోఁగలరు. అదియటుండ, మాసైనికులు హూణుల కేవిధమునఁ దీసిపోవువారు కారు.

మహేంద్రవర్మ:—గుణసాగరా! నేనుగూడ శక్తివంచనలేక సాయ మొనరించెదను.

శాతకర్ణుఁడు:—నేనుగూడ, పవిత్రములగు శ్రాద్ధభూములన్నింటిని, గిరాతుఁడగువిదేశజాతిబారినుండి కాపాడవలయును.

అవంతివర్మ:—గుణసాగరా! నీసహాయులలో నన్నుఁగూడఁ జేర్చుకొనుము.

వ్యాఘ్రుఁడు:—ఇఁక నావాగ్దానము లనవసరములు. నేను గళింగమిత్రుఁడను. ధర్మయుద్ధమైననేమి? అధర్మయుద్ధమైననేమి? ఈవ్యాఘ్రరాజు కళింగులకు దక్షిణహస్తమై యూతప్రాణమై యుండఁగలఁడు.

"సెబాస్. సెబాస్" అని కళింగు లాతనిఁ బ్రస్తుతించిరి.

కుమారపాలుఁడు:—మీకడనుండి పిలుపువచ్చినను రాకమునుపే, శా మరూపాధిపతియగు నీకుమారపాలుఁ డాత్మచతురంగబలములను బ్రహ్మపుత్ర మీఁదుగాఁ బంపుటకు సంసిద్ధుఁడైయున్నాఁడు.

తర్వాత రాజులందఱు లేచిరి. సర్వాలంకారసంశోభితమగునొకనగరునందుఁ బురోహితులు వివాహమహోత్సవముల కనువగుప్రయత్నము లొనరించుచుండిరి. అందఱా సౌధమునకు నడువసాగిరి.

భాను:—జాగ్రత్త! మీచర్యలు పోరుం బురికొల్పుచున్నవి.

"నాకది బాగుగాఁ దెలియును" అని గుణసాగరుఁడు నిర్లక్ష్యముగాఁ బలికి భానుగుప్తుని వీడ్కొలిపెను. భానుగుప్తుఁడు నాఁటిసంఘటనములఁ దలపోసికొనుచు, దురహంకారపూరితులగు నారాజులమదమణఁచు నుపాయములఁ బన్నుచు నడచిపోయెను.

---

# ఇరువదినాల్గవతరంగము.

## కలాంజారుకోట.

అది వసంతకాలము. ఆదినము మనోజ్ఞమైయుండెను. కలాంజారు కోట చుట్టునుండు పైరుపంటలు, చెట్టుచేమలు నేత్రపర్వ మొనరించుచుండెను. నానావిధవర్ణాంకితము లగుపుష్పజాతు లపరిమితములై లోచనగోచరమగుచుండెను. వివిధశకుంతసంతానములు తరుప్రకాండములపైఁ గూర్చుండి, పత్రగుచ్ఛములనుండి తొంగిచూచుచు, గొంతులు బొంగురువోవున ట్లఱచుచుండెను. ఆధ్వానములు, శకుంతసంతానములకుఁ బ్రచండశాత్రవుఁ డగు ప్రావృట్కాలపురుషపరము లగుశ్రాద్ధమంత్రము లాయనమున్ముందు తోఁపంపఁజేయుచున్నటు, కడకు వసంత పురుషసమాహ్వానపరము లగుపద్యములనా నొప్పారుచుండెను. ఆపాటలు, ఆనినాదములు కర్ణపర్వరమ్యములై యుండెను. కొన్నిపతంగములు తమగానమాధుర్యమును శ్రోతలకుఁ బ్రసాదించుటలోఁ దనివిచెందక, అప్పుడప్పుడు విచిత్రవర్ణాంకితము లగుపక్షములు విప్పుకొని యూరుబైటి కరుదెంచుచుండెను. తీఱికలేక పాటుపడుప్రజలకుఁ, జెట్టుచెట్టున కెగురుకీరశ్రేణులు లపూర్వదృశ్యరామణీయకమును బ్రసాదించుచుండెను. సహజభీరువగు కోకిలకలకూజితము లొనరించుచు, ప్రశంసావాక్యనిరీక్షకుఁ డగుగాయకునిభంగి, అప్పుడప్పుడు శ్రోతలకంటఁబడుచుండెను. కొన్నిమయూరములు దిదృక్షుసమ్మోహనముగ, నాట్యమునల్పుచు, కరుణానిధియగు పరాత్పరప్రసాదితములగు మనోహరపింఛముల బ్రదర్శించుచుండెను. కోటకుఁ గ్రిందనుండు నగరత్రయమందుఁ గొన్నిరాయంచలు, హిమాలయమునందలి తమమానససరోవరమునాటయే మఱచి, సహజకేళి మెఱయ నత్యుత్సా

హామున నీడలాడుచుండెను. కొన్ని హరిణములు మానవునిఁగాని, యాతని క్రూరత్వమునుగాని తలపోయక నిశ్చింతతోఁ బర్వతసానువులఁ జరించు చుండెను. ఆవసంతాపన్న దివసమునఁ బ్రకృతి సర్వలక్షణలక్షితయై యొప్పారుచుండెను. పరస్పరవిరుద్ధములును, పరస్పరసంబద్ధములును నగు ప్రేమసమాగములకు వసంతసమయము హిందూదేశమునఁ బ్రసిద్ధికెక్కియున్నది. హైందవార్యు లిప్పుడు, ప్రావృట్కాల మాఘమాసములను క్రమఁదెల్పుకొనుచుండిన రసముల సేవలఁజేసి, వానిఁ దమశైత్యగుణాత్యగ్రయోగార్థము సిద్ధపఱచుకొను చుండిరి. ఈవసంతసమయ మాదులకు మిగుల యోగ్యమైయుండెను. సమరకళాకుశలురగు సైనికులసాయముచేతను, క్రయలబ్ధులగు ప్రజాసైనికుల తోడ్పాటుచేతను, రాజులు దండయాత్రలకుఁ గడంగుచుందురు. ఇప్పటికిఁ బంటకోఁతలు ముగిసి, గడ్డిగింజలు గాదెలఁ జేరియుండును. కాన నుత్సాహహృదయులు, నుద్రేకపూరితులు నగు రైతులుదద దండయాత్రలతోఁ బాల్గొననెంచి, నిరపాయములగు శిబిరరక్షణోద్యోగములఁ బ్రవేశించుచుండిరి.

అల్లనల్లనఁ బిల్లయసుగులువేయుచు వనమారుతము నాసికొనుచుఁబిల్ల వాయువులు త్వగింద్రియములకును, వివిధపుష్పపరిమళములు ఘ్రాణేంద్రియములకును, నానావిధపతంగకలకూజితములు కర్ణేంద్రియములకును, దివ్యప్రకృతిరామణీయకము నయనేంద్రియములకును హాయిఁగొల్పుచుండ, నాఁటిసంజవేళ నాలుగుగంటలప్పుడు కలాంజారుకోటయందలి మనోహరకుసుమోద్యానములో నొకశాద్వలతలముపై మువ్వురు మత్తకాశిను లాసీనలై యుండిరి. ఆరమ్యోద్యానము దుర్గమునందలి యున్నతప్రదేశమునం దుండుటంజేసి, యావనితలు మువ్వురును కోటకావలనుండు విశాలసమప్రదేశమును జూడఁగలిగియుండిరి. వా రొండొరులు సంభాషించుకొను చుండిరి.

"చారుమతీ! ఒకపక్షముదినములక్రిందట మనసైనికు లాదండయాత్రకుఁ బోయినతఱి, వారియుత్సాహమునకు నే నమితాశ్చర్యమొందితిని.

కాని కొన్ని సంశయములుమాత్రము నన్ను వేధించుచుండెను. ఇప్పుడుగూడ వేధించుచున్నవి. కేరళ, వేఁగి, కంచి, సింహళ, కామరూపాధిపులు మనలను మోసగించినయెడలఁ గళింగ, మహాకోసల, గంధ్యానసైనికోత్తములు నిన్నఁ బోయినవారు, బలికిఁ గొనిపోయినగొఱ్ఱెలౌదురుగదా?" అని మహారాణి మహామాయ యనెను.

అందులకుఁ జారుమతి "అమ్మా! ఇట్టిసందియము లేల? మహాసేనుఁడు, అవంతివర్మ, మహేంద్రవర్మ, కాకవర్ణుఁడు, కుమారపాలుఁడు వీరందఱు సత్యసంధులుకదా!" అని పలికెను.

మహా:—అవును. వారు మాటతిరుగువారుకారు. కాని, మన మొకటితలంప, దైవమొకటి తలంచిన? కాకవర్ణునినౌకాబలమును, ఏదైన నొక తుపాను చెదరఁగొట్టిన, మనగతి యేమికావలయు?

చారు:—అప్పటికిమాత్ర మేమి? మహాసేనుఁడు, మహేంద్రవర్మ, అవంతివర్మ, కుమారపాలు రున్నారుగదా!

మహా:—కుమారీ! ఇప్పటికైన సన్నాహముల నాలకింపుము. మహాసేనుఁడు, మహేంద్రవర్మ, అవంతివర్మ తమతమబలఁగములతోఁ గళింగ పట్టణమున కరుదెంచి, అచటికళింగసైన్యమును గలిసికొని, సముద్రతీరము నందేపోయి మగధ చేరవలయును. మనసైన్యములు హూణులఁ దాఁకుపోవల, వీరందఱువచ్చి మనవారలఁ జేరఁగలరా?

చారు:—చేరఁగల రనుకొందును. మనసత్కార్యమునకు దైవము తోడ్పడును.

"హూణబలప్రమాణ మెంతయుండును?" అని చారుమతి మూఁడవ యంగనయగు వసంత నడిగెను.

వసంత:—మిహిరగు లాధిపత్యమున బయలుదేఱిన చమూసమూహమునందు 300,000 భటులున్నారు. దర్పదుర్వారులగు ౪౦,౦౦౦

యాశ్వికులున్నారు. ఇంకను నడఁగొండలవంటిమత్తేభములు హూణసైన్యము నందు లెక్కకు మిక్కిలిగాఁగలవు.

చారు:—మనబలపరిమితి యేమున్నది?

వసంత:—కళింగు లొకలక్ష, మహాకోసలు నిరువది వేలు. గంధ్యాకులు పదివేలు.

చారు:—అయిన, వ్యాఘ్రరాజునుగూడ గణించితివా? లేదా?

వసంత:—అన్నట్లుమఱచితి. ఆకళింగబాంధవుఁడెడ నపరాధమొనరించితిని. ఆతఁడొక్కఁడే అనేకబలములపెట్టు.

చారు:—సుభాషిణీ! నీమాట లెంతయు సత్యము.

అందులకు వసంత మందహాసమొనరించుచు "కళింగపట్టణమున మాత్రము, అందున నొకానొకనిర్దిష్టకార్యసాఫల్యమునకును, నేను సుభాషిణినైయుంటినని జేపిగారు మఱచినట్లున్నారు. నాయిప్పటి నిజమైనపేరు వసంతకదా!" అని నవ్వెను. చారుమతీ మహామాయులుకూడ నాలోల్లసితము మాటలకు నవ్విరి.

చారు:—(ఆశ్చర్యముతో) ఇది నిక్కమా? నిజమా యిది? ఓసుభాషిణీ! నీవెంతటిజిత్తులమారివే?

వసంత:—దయచేసి నన్ను 'వసంతా' అని పిలువుము.

అందులకుఁ జారుమతి "నిన్నుబోలిన మాయలాఁడుల నీజగాన మఱెవ్వరి నెఱుంగను. నీపేరు వసంతయైయుండ సుభాషిణి యని చెప్పికొంటివి. బాలాదిత్యునిదూతికవై నన్నుఁజేరి, విశ్వాసద్రోహమొనరించి, యశోధర్ముపై నావలపు నిలుపఁజేసితివిగదా" అని పకపకనవ్వెను.

వసంత:—కాని యిట్టివిశ్వాసద్రోహ మెంతయుత్సాహమున జరిగిన దనుట మఱచితివా?

"ఆహా! అవును. కాని నాకిపుడు ముఖ్యవ్యక్తియే కావలయును" అని చారుమతి ప్రీడాసంచలితస్వరమునఁ బలికెను.

మహా:—వసంతా! నిన్నట్లు ప్రోత్సాహపఱచిన దెవరు?

"ఎవ్వరో కాదు. చిన్నరాణిగారే" అని వసంత పక్కున నవ్వెను.

చారు:—(ముక్కుమీఁదికోపముతో) ఇది యధిక ప్రసంగము. ఇట్టి మాట లిఁక నేనోరువఁజాల. ఇఁకఁజాలును. అవసరవిషయము లెన్నియోగలవు. కళింగరాజగు రాజనకునకు ౨౫౦,౦౦౦ సైనికబల మున్నదిగదా! అట్టుండ ౧౦౦,౦౦౦ సైన్యముమాత్రమువచ్చినది. కారణ మేమి?

వసంత:—ఏలయందువా? కళింగముపై మహారాష్ట్రులకువేళ హఠాత్తుగఁ బడినచో, దానిరక్షణమునకుఁ గొంతబల ముండవలయుఁగదా! మఱికొంత సైన్యము హైందవనరేంద్రమండలి చమూశ్రేణులవెంట దక్షిణదిశనుండి రావలసియున్నది.

చారు:—వ్యాఘ్రరాజు వెంటఁ బదివేలభటులుమాత్ర మరుదెంచిరి. కారణము?

వసంత:— కారణమా! అబ్జరాజు తనసైనికబృందముల నేటితెచ్చినాఁడు. కొందఱను స్వరాజ్యసంరక్షణార్థము నియోగించినాఁడు. అతఁడు స్వరాజ్యమునలేనితఱి, తనయనుజుఁడు యువరాజుగనుండునట్లేర్పాటు గావించి, పరిపాలనాసౌకర్యము లెన్నియో చేసివచ్చినాఁడు.

మహా:—మహాకోసలమున ౨౦,౦౦౦ భటులుమాత్ర ముండిరి. ఏల?

చారు:—కారణము విదితము. ఇంతకుముందు వారు స్వాతంత్ర్య సంరక్షణార్థము కావించినఘోరయుద్ధము లెటుపోయెను. ఇంతవును మహాకోసలసైనికులు మహారాణతో పానలజ్వాలలకు గుఱియగుచున్నారు.

మహా:—ఒక్కబాలాదిత్యచక్రవర్తిమాత్ర మట్లగుటలేదు.

మహారాణిగారియభిప్రాయమునఁ జారుమతి యేకీభవింపఁజాలకుండియు నామెపైఁ జారుమతికుండు గౌరవభావమునంజేసి యామె యేమియుఁ బలికినదికాదు. కాన నామె పైకిమాత్రము "అహా! అవును" అనెను.

వసంత కోటకావలనుండు మైదానములవంకఁ జూచుచు "అటు చూడుఁడు. అశ్వికుఁ డొకఁడు కదురయమున దుర్గాభిముఖుఁడై యరుదెంచుచున్నాఁడు. అతఁడు మనమిత్రవర్గములోని వాఁడనుటకు సందియములేదు. విలయన; వాతఁడు గుఱ్ఱమును కోటవైపునకు దఱుముచున్నాఁడు." అని చెప్పెను. తోడనే వారు ముగ్గురును వానిసందేశమును సత్వరము వినుతలంపునఁ గోటగవనుకడకుఁ బోయిరి. క్రమార్తుఁడగు నాయాశ్వికుఁడు దుర్గద్వారమును జేరులోపల, వా రచటికిఁ బోయిరి. ఆరాతు కోటవాకిలిసమీపించుటయే తడవుగా "సంగతులేమి?" అని వసంత యడిగెను.

రాతు:—సార్వభౌమబాలాదిత్యుఁడు కేరళసైనికులు ౧౦౦౦మందిని వెంటఁబెట్టుకొని, సింహళభటులు ౪౦౦౦ మందితో నౌకలపైఁ దామ్రలిప్తి కరుదెంచినాఁడు. అచట యశోధర్మమహారాజును, వ్యాఘ్రరాజును సేనాసమేతముగా వారలఁ గలిసికొనిరి.

చారు:—మహారాణి సరస్వతికూడవచ్చినదా?

రాతు:—వచ్చినది. యుద్ధవిరామసమయమువఱ కాదేవి కలాంకారుకోటయందు నిలువనున్నది.

ఆమాటల కాసుదతులు మువ్వు రానందాంతరంగలైరి. "ఎప్పుడు వచ్చును? ఎప్పుడువచ్చును!" అని వారొక్కరొక్కరుఁ బ్రశ్నించిరి.

రాతు:—రేపు.

చారు:—(కోపముతో) ఓరీమందమతీ! అయిన నాసంగతి యేలచెప్పవైతివి? అతిథిసత్కారమున కొనరింపవలసిన సన్నాహములు నీయట్టివారి కేమి తెలియును.

రాతు:—దేవిగారు మన్నింపవలయును. కుమారికి స్వాగతమిచ్చుట కట్టిసన్నాహములుగాని యక్కఱలేదని మహారాణి మహామాయదేవిగారితోడను, సోదరి నాహ్వానించుట కట్టిప్రయత్నములుగాని యనవసరములని తమతోడను, నివేదింప మహారాణి సరస్వతీదేవి నాకు ముదలనిచ్చియున్నారు.

ఇచటి తమయాగమనము హఠాత్తుగా నైనట్లుండవలయునని వారు సెల విచ్చియున్నారు. మఱియు నాదేవిగారు "అశ్వను సరథసంభ్రమాక్రాంత చేతస్కులగు నాతల్లిని నాసహోదరిని నేను జూడవలయును" అని సెల విచ్చినారు. కాని యశోధర్మమహారాజుగారుమాత్రము దేవిగారల కీవృత్తాంతమును నివేదింపుమనిరి.

మహా:—సరస్వతి మహారాణియాగమనము నాకపారమగునానందముఁ గలుగఁజేయుచున్నది.

చారు:—నాకుఁగూడ.

"నాకును నెంతయో సంతసముగానున్నది" అని వసంత చారుమతి వైపుతిరిగి "మహారాణి సరస్వతికూడ మీవలె సాహసురాలని నానమ్మకము. రాజనీతి నెఱయుచున్నను, నాదేవికడఁగూడ నహంకారము మచ్చునకైన నుండదు" అని పలికెను.

చారు:—నేనుకూడ నట్లే యనుకొనుచున్నాను.

మహా:—ఇందు వింతయేమున్నది? ఆనాఁడు పిచ్ఛవీకుమారిసైత మిట్టి సద్గుణములచే శోభిల్లుచుండెను. కాన సరస్వతి దానికి వ్యతిరేకముగనుండఁ గారణములేదు. కుమారీ! రమ్ము. ఒకానొకప్పుడు సముద్రగుప్తసార్వభౌమునకు సైతము తేఱిచూడ నశక్యమైయుండిన కళాంజరదుర్గమును మనచక్రవర్తిని స్వాగతోత్సవములతోడను సర్వవిధముల నలకరింపవలయును.

"అయినఁ బోదము పద" అని చారుమతి వసంతతో ననెను.

వసంత:—ఒక్కింతతడవుండుఁడు. శత్రుసైన్యసన్నాహములగూర్చి, యాతనినుండి యెఱుంగవలయును.

చారు:—అవును. అది ముఖ్యము. ఓయీ! ఇప్పుడు మహారాజుగారి సైన్యము లెక్కడనున్నవి?

"మగధరాజధానియుఁ, బ్రాచీననగరము నగుపాటలీపుత్రమున మన సైన్యములు విడిసియున్నవి. అపట్టణ మిప్పుడు మనయధీనమైయున్నది."

చారు } :—అది మనచేతి కెట్టుచిక్కినది!
మహా }

"మనబలములు మగధయెల్లలనుండినపుడు, మిహిరగులుని సైన్యములు కాశియందుండెను. అప్పుడు యశోధర్మమహారాజు పాటలీపుత్రముపైకి దూఁకవలయునని సిద్ధపడెను. వ్యాఘ్రరాజుకూడ నందుల కంగీకరించెను. మిహిరగులుం డరుదెంచి కమ్ము నుట్టడించునంతలో మనవారు పాటలీపుత్రమును స్వాధీనమొనరించుకొనిరి. పురరక్షణోద్యోగమున ౫౦౦౦ హూణు లుండ. వారిని హైందవులు యమలోకమునకుఁ బంపిరి. దేశద్రోహులఁ గత్తి కొకకండ చేసిరి. మూఁడు దినములు తర్వాత బాలాదిత్యచక్రవర్తి తమలక్ పట్టణమునుండివచ్చెను. అంత నాతనికిఁ బాటలీపుత్రమున, నశోకమహారాజు కొలువుకూటమున నతివైభవముగాఁ బట్టాభిషేకమహోత్సవము జరిగినది. మాగధులహర్షధ్వానములు మిన్నుముట్టినవి."

చారు:—మాగధు లాత్మశక్తివంచన చేయక, హైందవనరేంద్రమండలికి సాహాయ్యమొనరించిరా!

"ఆహా! హైందవనరేంద్రమండలి కోశాగారమునకు మాగధులు ధనరాసులఁ దెచ్చి క్రుమ్మరించిరి. వారు ౧౦౦,౦౦౦ సైనికుల బ్రోగుచేసి తెచ్చిరి. పూర్వమెన్నఁడో మగధరాజ్యమునకుఁ బ్రవాస మరుదెంచి యచటనే నిలిచిపోయిన, అంగవంగదేశీయులు, కమపదాతులు కొర్వ్యాపీగులు కారనుతలంపున, నసంఖ్యాకములగు గజముల నిచ్చిరి. ఇంకేమికావలయును! దాక్షిణాత్యులగు ధరణీకాంతులు రానందున, మిత్రరాజవర్గము జేరుదునా వలదా యని వెనుకముందాడుచుండిన కామరూపాధిపుఁడు కుమారపాలుఁడు కూడ బాలాదిత్యునిఁ జేరి, మగధరాజ్యముపైఁ దనకుఁ గల భక్తిశ్రద్ధలు వెల్లడించినాఁడు. ఈవిధమున ౫౦,౦౦౦ శిక్షితసైనికులచే, మనబలంగములకు బలమెక్కినది."

చారు:—బళిబళి. అయిన మనకిపుడు ౨౭౫,౦౦౦ భటు లున్నారు. వేఁగి, కంచి, కేరళాధీశులసంగతియేమి!

"రాఁగలయాపదలకుఁ బడనుండుకష్టములకు వెఱఁగంది కడకు వారు రెండునాలుకలవారైరని వదంతిగానున్నది. ఇదిగాక వేఁగీ, కాంచీపురాధీశులు బంధువులు. హూణులు పరాజితులైనయెడలఁ గళింగరాజ్యము శక్తిసంపన్నమై తమకుఁ బ్రక్కలోనిబల్లెమగునేమో యని వారు భయపడుచున్నారు. వారినిర్ధారణమున కిదియు నొక కారణము."

చారు:—ఓయభాగ్యభూమీ! భరతవర్షమా! ఈయసూయాగ్ని చల్లారు టెన్నఁడు? ఈయసంగతభయములు, సంశయకలహములు నంతమొందు టెన్నఁడు?

మహా:—కుమారీ! ఇవి యీనాఁడు క్రొత్తలుకావు. పురుషోత్తమ రాజన్యుని కాలమున నలకసుందరుఁ డీదేశముపై దాడివెడలినతఱి, తక్షశిలాధివాసుఁడు ఆంభి, దేశద్రోహియయ్యెను. గ్రీకురాజగు సెల్యూకేశ్వరుఁడు సింధునదిని దాఁటినప్పుడు, అవంతిమాళవాధిపు లాతనికి బాసటలై, చంద్రగుప్త సార్వభౌము నెదురొడ్డించిరి. కాక, యాచ్ఛదండయాత్రాసమయములఁ గూడ నిట్టివి జరిగెను. పుష్యమిత్రశుంగునిపైఁబడుటకు యవనరాజు మిళిందునకుఁ గళింగరాజు సాయమొనరించెను. కట్టకడ, రక్తపిపాసు పగుహూణుం డీదేశమునఁ గాలూనినప్పుడు, రాజనామకులు కొందఱు స్కాందగుప్తప్రతాపాదిత్యుల పతాకమువీడి, క్రూరకిరాతుఁడగు నాతనిఁ జేరిరి. భానుగుప్త బుద్ధగుప్తులే యిందుకు నిదర్శనము. కరుణాత్ములగు గుప్తసార్వభౌము లీపాపాత్ముల నున్నతపదములచే బహూకరించుచుండిరిగదా! కడ కీకప్ప కూఁత పాములువారికి గావించిన ప్రతిక్రియ లెట్టివి? హూణులు 'మీమీ రాజ్యములను మీయధీనమందే యుంచెదము' అని చెప్పినంతనే, వారు హూణుల కమ్ముడుపోయి, ఇన్నాళ్లుగాఁ రక్షించుచుండినస్వామికి, కని పెంచి పోషించుచుండిన దేశమాతకు ద్రోహమొనరించిరి. భరతవర్ష మీపృథ్విపై నిలిచియుండునంతకాల మిట్టిద్రోహకర్మములు, విశ్వాసఘాతుకకృత్యములు మాటిమాటికి జరుగుచుండును. నానాఁటికిఁ గలియుగము ముందుకుసాగు

చున్నది. ఆకాంచెము నీతిక్రమముకూడ వక్రగతిఁ దిరుగుచున్నది. ఇఁక స్వదేశభవిష్యచ్చారిత్రమునం దిట్టిఘోరకృత్యములు, పాపపుఁబనులు పరిపాటికాఁగలవు.

చారు:—అమ్మా! స్వదేశచారిత్రమును, ఇంతవివరముగా నీ కెవరు తెలిపిరి? నేనుకొనినంతకంటె, నీవధికముగాఁ జదివియున్నావుసుమా!

మహా:—స్కందగుప్తు నాస్థానమున సుశర్మ యనుబ్రాహ్మణోత్తముఁడు విద్యావంతుఁ డొకఁ డుండెను. స్కందగుప్తచక్రవర్తి, బుద్ధగుప్త భానుగుప్తవియోగవ్యథాభరమునఁ గ్రుంగియుండ, నావిప్రవరుఁ డిట్టి తార్కాణములచే నాతనిశోకము నపనయించుచు "సార్వభౌమచంద్రా! అనిత్యములును, నిరాధారములు నగుసంకల్పసోపానముల నెక్కి—అందు మన దేశమున—గాలి మేడలఁ గట్టఁ బ్రయత్నింపకుము. చేతనైనంతవఱ కిట్టి జీవితము గడపుము. ఫలాఫలములతోఁ బనిలేని కర్మలఁ గావించుచుండుము. అంత, నిర్వ్యాణసమయ మాసన్నమైనప్పుడు, పాపరేణువుల విదళించుకొని కిరాతజనదండయాత్రల కశక్యమైనభూమిని—మిత్రఘ్నుల కగమ్యమైన భూమిని—చేరి నిశ్చింతతో నుండుము" అని యుపదేశ మొనరించెను. స్కందగుప్తునికన్నీటిబుగ్గ నాఁడే పట్టిపోయెను. ఆమరణాంతము చక్రవర్తి సుశర్మయుపదేశము నాచరణమునం దుంచియుండెను.

"మిహిరగులునిబలగము లిపు డెచట నున్నవి? అని చారుమతి యారాతు నడిగెను.

రాతు:—నేను మనశిబిరమును వదలివచ్చునపు డానిహూదునిరాణువ పాటలీపుత్రమున కిరువదిమైళ్లలో నుండెను. ఇప్పటి కిరువాగులవారికి ఘోర సమర మాసన్నమైయుండును.

చారు:—సంఖ్యాపరిమితియందు మనసైన్యములు బలహీనములు. కాని!

రాణి:—అవును. కళింగమునుండిపోయిన ౧౦,౦౦౦ భటులు సకాలమునకుఁ జేరుదనుక, మనరాణువ బలహీనమైనదని చెప్పవలసియున్నది.

మహా:—అమ్మాయీ! ఇప్పటి కిరువైపులవారును ఘోరాజికిఁ గడంగి యుందురు. మనకు జయమగునట్లు దైవప్రార్థనలు గావింపవలయును. నాయేక సుతుఁడు సకలి, బాలాదిత్యవ్యాఘ్రరాజసమేతుఁడుగా ధర్మసంరక్షణార్థము పోరాడుచున్నాఁడు. ధర్మపరిపోషణమునకు దైవ మనుగ్రహించుఁగాక! ఫలముతో నాకు నిమిత్త మనవసరము. నాకుమారుఁడు విజయుఁడై తిరిగివచ్చినచో నాగర్భమున వాఁ డుదయించినదానికై గర్వింతును. అతఁ డొకవేళ వీరస్వర్గము నొందినయెడల, మఱింత గర్వింతును. స్వదేశ స్వమతసంరక్షణమునకైన, ధర్మయుద్ధమునందు మృత్యు వెంతటిపుణ్యాత్మునకో కదా లభించును! కాని యొక్క విషయమునకుమాత్రము అవమానభరమున నేను తల వ్రేలాడవైచుకోవలసివచ్చును. కాని యాకార్యము జరుగదు. అనఁగా నొకవేళ యశోధర్మ...

ఆమె కంఠస్వరము శోకనిరుద్ధమయ్యెను. ఆమెనేత్రగోళము లశ్రుపూరితములై మిలమిల మెఱయుచుండెను. "ఒకవేళ యశోధర్మ పిఱికిపందవలె రణాంగణమునుండి యోపాటిల్లివచ్చిన" అని మహామాయ చెప్పలేక చెప్పెను. ఆవీరమాత యాపాదమస్తకము గజగజవణఁకుచుండెను.

చారు:—నాపతి యటు లెన్నటికిఁ జేయఁడు.

వసంత—చేయనే చేయఁడు.

మహా:—అవును. అతఁడు కలనైన నటులొనరింపఁడు. కని పెంచి పెద్దచేసిన నాకు వానిస్వభావము బాగుగాఁ దెలియును. కాని గుండులు తేలి బెండులుమునిగిన ట్లాకార్యము చేకూఱినయెడల—అనఁగా యశోధర్మ రణావనికి వెన్నుచూపినయెడల—అదినమే మహామాయ యీపాడుప్రపంచమును వదలి, సుతునిముఖము చూడకయే, ఆశ్రితవత్సలుఁ డగుమహావ్యాపాలుని గర్భమునఁ జొరఁబడును.

చారు:—అమ్మా! అసంభవములను గూర్చినయోచన లెందుకు! ఆలోచనీయాంశము లనేకములున్నవి. అయినఁ గళింగసైన్యము మనవారిని సకాలమునకుఁ గలిసికొనునా! నీయూహయేమి?

మహా:—కళింగులసాయముపై నేనంతగా నాధారపడను. కళింగ రాజ్యముకంటె, కళింగచమూబృందములకంటె, సూర్యకోటితేజోధికుఁ డగు నాపరాత్పరునే నెఱనమ్మియున్నాను. మహత్తుకంటె మహత్తును, అణువు కంటె నణువును, అన్నింటియందుఁ దానును, తనయం దన్నియుఁగల నాపర మేశ్వరునిపాదరాజీవములే గతి యని యున్నాను. సర్వసృష్టికర్తయగు నా మహాత్ముఁడు, ధర్మమున ధర్మ మణఁగఁ ద్రొక్కఁబడుచుండ మిన్నకుండఁడు.

చారు:—అమ్మా! ఈకాలమునఁగూడ నీశ్వరసాహాయ్యముపై నాధా రపడియుండఁదగునని నీవనుకొందువా? యుద్ధభూములందు భగవానుఁ డొకపక్ష పాతియై యుండునా?

మహా:—ఆహా! ఏమి సందేహమా! ఆతఁడు ధర్మపక్షపాతి. మహా భారతయుద్ధమున శ్రీకృష్ణపరబ్రహ్మ కౌరవులతోఁ బోరాడలేదా?

చారు:—అవును. కాని యాదినములు వేఱు. అది ద్వాపరయుగము. అదియుఁగాక, మహాభారతములో నున్నవన్నియు నిజములని మనకేమి ప్రమాణము?

మహా:—(ఆశ్చర్యముతో) కుమారీ! వ్యాసునివంటిమునిచంద్రుఁ డబద్ధ ములువ్రాయునా? ఒకవేళ, సవ్యసాచియగుకిరీటిపైని యనురాగమునం జేసి, శ్రీకృష్ణభగవానుఁడు పాండవపరిపోషకుఁ డయ్యెనందువేమో! శ్రీకృష్ణుఁడే భగవద్గీతలయందు—

శ్లో. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.

అని చేసినవాగ్దానము నించుక సంస్మరింపుము. కాన నామనశ్శుభావున నీశ్వరుఁడు మనకు సాయమొనరింపక విధిలేదు.

దట్టు మాటయిచ్చెను. తమముఖ్యుల నూఱ్పింపునంతవఱకు హూణులు పాటలీపుత్రమునం దడుగిడఁజాలరని, మాగధులందఱు దారుణశపథము లొనరించిరి.

"ఉత్సాహమున నిదికదా!" అని చారుమతి, వసంతమహామాయలతో "ఇఁక మనము లేచిపోయి మహారాణి సరస్వతీదేవికి స్వాగతసన్నాహము లాచరింతము" అని చెప్పెను.

నాఁటిసాయంకాలమును, మఱునాఁటి ప్రాతఃకాలమును కలాంజారు దుర్గమునందు సరస్వతీదేవికొఱకు స్వాగతప్రయత్నములుతప్ప మఱేమియు జరుగకుండెను. అరుణోదయమగుటయేతడవుగాఁ జారుమతీమహామాయావసంతలు మైదానమువంకఁ జూచుచు మహారాణి సరస్వతీదేవి కొఱకు నిరీక్షించుచుండిరి. కాని వారియుత్కంఠయంతయు నిరుపయోగమగుచుండెను. ఆశాభంగము వారిని ముంచివైచుచుండెను. ఇంతలో వృద్ధాప్యుఁడు సరస్వతిపాల కుపనించుకయైనఁ జూపక, పడమటికొండవెనుక నక్కెను. కలాంజారువాసుల హృదయావేగ మతిశయిల్లెను. సరస్వతి జాడలఁదెలియుటకై చారుమతి సేవకులపై సేవకులఁ బంపుచుండెను. కాని యదియుఁ బ్రయోజనము లేకపోయెను. ఇంతలో నాసాంధ్యరాగమును, గన్నుగానని చీఁకటి ముంచివైచెను. అప్పటికిని సరస్వతీదేవి జాడలేదు. ఆమత్తకాశినులు ముగ్గురును కాతరలైరి. మహామాయ చారుమతితో "అమ్మాయీ! సరస్వతీమహారాణి యింతవఱకు రాలేదు. నామనసు కళవళపడుచున్నది. దినములుచూడ మంచివికావుకదా!" అని చెప్పెను.

చారుమతియును భీతచిత్తయై యుండకపోలేదు. కాని యాకాంతామణి తనయత్తగారి నూఱడింపఁదలఁచి "బాలాదిత్యమహారాజు సరస్వతీదేవి నొంటరిగఁ గలాంజారునకుఁ బంపఁడు. అతఁడు విశ్వాసపాత్రులగుభటుల నామె కంగరక్షకులుగాఁ బంపియుండును. ఇఁక భయమునకుఁ గారణ మేమి కలదు? హాయిగాఁబోయి నిద్రపోదము రండు" అనెను.

మహా:—కుమారీ! మహారాణి సరస్వతీదేవి యీదుర్గమునకు సౌఖ్యముగఁ జేరువఱకు నాకు నిద్రపట్టదు. నిద్రపోవునట్లును, నిశ్చింతగానుండునట్లును నటించు టెందులకు? నీవును వసంతయుఁబోయి పండుకొనుఁడు.

చారు:—వలదు వలదు. నీవు మేల్కాంచియుండ, మేము నిద్రించుటయా! వసంతా! ఇష్టమున్న నీవుపోయి పండుకొనుము.

వసంత:—(నిష్ఠురముగా) నేనాపండుకొనుట? ఎప్పటికిఁగాదు.

వారుముగ్గురు కన్నుమూయక దిగులొందుచు నారాత్రియంతయుం సరస్వతీదర్శనోత్కంఠలై కాలము గడపుచుండిరి. వారిమానసములు కలఁతవాఱియుండెను. చింతాభరమున వారంతగాఁ బలుకకుండిరి. రాత్రి రెండు ఘంటలవేళ నంతర్దుర్గద్వారపాలుఁడు సన్నగా నీలవైచెను. తోడనే వసంత వానికడకు బరుగిడి "ఏమిసంగతి?" అని ప్రశ్నించెను.

"ఎవరో నలుగురుమనుజు లంతర్దుర్గాభిముఖులై వచ్చుచున్నట్లు లీలగాఁ గానవచ్చుచున్నది. వారు మనకు మిత్రులైయున్నట్లున్నారు. లేకున్న వారు బహిర్దుర్గము దాఁటఁగలిగియుండరు" అని దౌవారికుఁ డనెను.

"వారు మహారాణి సరస్వతీదేవి పరిజనముకాఁబోలు" అని వసంత సంతోషసంభరితాంతఃకరణమునఁ జారుమతీమహామాయల కావృత్తాంతము నివేదించుటకై పరుగెత్తెను.

కాని యవ్వార్త నాలకించి చారుమతి పెదవివిఱచి "ఇంతకును వారు పాదచారులుగదా! సరస్వతీదేవి శంగరక్షకులు రాతులైయుందురు. కాన నామనుజచతుష్టయ మాదేవిపరివారమైయుండదు" అని తేలవైచెను.

వసంత:—అయిన మానె. వారెవరో చూతము రండు.

చారు:—దాన బెట్టేపేమున్నది! పోదము పద.

అంతట వారుమువ్వు రంతర్దుర్గద్వారమువద్దకుఁ బోయిరి. ఇంతలో నామాగంతుకులు ద్వారమువద్దకుఁ జేరిరి.

"మీరెవరు" అని వసంత ద్వారపాలకునిఁ బ్రశ్నించెను.

ద్వార:—వీరు తమస్వచారిత్రవాదాదికముల మహారాణిమహామాయకుఁగాని వెల్లడింపమనుచున్నారు. వీరిలో ముగ్వురుమాత్రము నూతనాగంతుకులు. నాలవవాఁడు మనభటుఁడే.

మహామాయ దీపముతీసికొని యాముగ్వురిముఖముల కెత్తిచూచెను. వారికన్నులకు గట్టిగా గంతలు కట్టఁబడియుండెను. ఆమె వారినంతఃపురములోనికిఁ గొనిపోయి యచట వారిగంతలువిప్ప నాజ్ఞచేసెను. వారిముఖములఁ బరీక్షించుటకై చారుమతి యొకచేత దీపముపట్టుకొనియుండెను. గంతలూడఁదీయఁబడినవారిలో మొదటియిరువురు స్త్రీపురుషులు. వారు సామాన్యబ్రాహ్మణులవలె నుండిరి. ఆస్త్రీకి ముప్పదియేండ్లుండును. పురుషునకు సుమారేఁబదియేండ్లుండును. మూఁడవవ్యక్తి కంటిగంత విప్పినతోడనే, చారుమతి సంతోషసంభ్రమాక్రాంతచేతస్కయయ్యెను. "దేదీప్యమానసౌందర్యప్రభాభాసురాంగివి—అసమానమహిమాస్పదరూపసంపన్నవు—అమ్మా! నీవెవ్వతెవు? నీయంగుళులు సూచించువిధమున నీవు బ్రాహ్మణివిగావు. బ్రాహ్మణకన్యోచితాలంకారములనుండి, క్షాత్రతేజము ముట్టిపడుచునేయున్నది. అమ్మా! నీవెవ్వతెవో దయచేసి చెప్పుము!" అని చారుమతి ప్రార్థించెను.

అందుల కామూఁడవవ్యక్తి "నేను సరస్వతిని. బాలాదిత్యమహారాజు పట్టమహిషిని" అని బదులిడెను.

తోడనే మహామాయ సంతోషతరంగితాంతరంగయై "ఔనౌను. నే నట్లే తలంచితిని" అని యామెను ప్రేమమీఱఁ గౌఁగిలించుకొని "కుమారీ! నీ వీరీతి మరల వర్తించినయెడల, నేను నీతోఁ దగవులాడుదునుసుమా! విచ్ఛిన్నకుమారీవ్రతవిధులు నిరాడంబరవృత్తితో దుర్గప్రవేశ మొనరించుట తగదు. ఈబ్రాహ్మణులిద్ద ఱెవరు? వీరు నిజముగా బ్రాహ్మణులా?" అని యడిగెను.

ఆస్త్రీవ్యక్తి "దేవీ! మేము బ్రాహ్మణులము. నాపేరు అరుంధతి. ఈతని పేరు జ్ఞానప్రియుఁడు. ఈతఁడు నాజనకుఁడు" అని బదులుచెప్పెను.

సర:—అమ్మా! వీరిని సత్కరింపుఁడు. ఇంతయుదారులును, స్వార్థత్యాగులును, అగు కరుణానిధులను నేనింతకటివఱకుఁ జూచియుండలేదు. వీరు నామానప్రాణములఁగాపాడి, శత్రుహస్తములనుండి తప్పించిరి.

మహామాయాచారుమతు లతులానందమొందిరి. ఆయాపద్బాంధవను అరుంధతిని వారు కౌఁగిలించుకొనిరి. మహామాయ "అరుంధతీ! ఈ వసంతవతి నీవును నేఁటినుండి నాయూఱవప్రాణమవైతివి" అని యాదరించెను.

చారుమతి మందహాసమొనరించుచు "అరుంధతీ! నీవొనరించిన మహోపకారము నాకొకసహోదరిని బ్రసాదించినది." అనిపలికి, సరస్వతిని కౌఁగిలించుకొని "అక్కా! సరస్వతీ! నీకువచ్చినగండములన్నింటిని మాకు వినిపించెదవా?" అని యడిగెను.

సర:—ఆహా! అంతకంటె సంతసమేమున్నది! యుద్ధవిరామమువఱకు నేను కల్యాణపురకోటయందుండుటయే మంచిదని, నాపతి బాలాదిత్యుఁడును యశోధర్ముఁడును నిర్ణయించినారు. నేనుమాత్ర మెప్పుడెప్పుడు నిన్ను 'మహారాణీ, మహామాయను జూతునా' యని [illegible] జేసి దాని కంగీకరించితిని."

మహా:—నీయభిమానము నాకుఁ బ్రమోదముఁగూర్చినది.

సర:—వైరిగజకేసరియు, సర్వకళావిశారదుఁడు నగుభట్టారకు నాయకత్వమున బలశౌర్యశోభితులగు పన్నిద్దఱుభటుల సంగరక్షకులుగా నావెంటఁ బంపిరి. మమ్ముఁ జిక్కించుకొనుటకు హూణు లెంతో ప్రయత్నించుచుండిరి. మేము వారికన్నుల దుమ్ముకొట్టి, నిన్నటి యపరాహ్ణమున నమలాపురికిఁ జేరితిమి. కాని యంతలో నూఱుగురుహూణసైనికులు మమ్ముఁ బసిపట్టి మావెన్నాడిరి. ఆరాణువయందు దేశద్రోహులైయుండుభారతీయులు పెక్కురుండిరి. వారిలో వించుమించుగఁ దొంబదియైదుమంది యౌధేయులుందురు. ఒక్కంతదూరమునుండి వారు మమ్ముఁ గాంచి, వెఱ్ఱికేకలువేయుచు నాపరివారమును, నాశిబికను బట్టుకొనఁ గేకలువైచిరి. నన్ను హూణులకుఁబట్టియిచ్చుటకంటెఁ జచ్చుటయే మేలని, నారక్షకులు తలంచిరి. మాబలముల కొని

మిహిర నిష్కృపుఁడగుసైన్యముతో దలపడినచో మాకుఁ జావు సిద్ధముకాక మఱేమగును? నేను వారినుండి తప్పించుకొనఁగలనా? కాన హూణసైన్యము కన్నులఁబడుటయేతడవుగా, దీర్ఘదర్శి యగుభట్టారకుఁడు ప్రక్కనుండు బ్రాహ్మణగృహమునకు నన్నుఁ బరుగెత్తుమనిచెప్పి, తాను శిబికయందుఁ గూర్చుండెను. నేను చేరినబ్రాహ్మణగృహము జ్ఞానప్రియునది. నీ వెవ్వతెవని యాతఁడు నన్నడిగెను. నేను బాలాదిత్యుని రాణినని చెప్పితిని. అతఁడు "నాకేమియుఁ దోఁచకున్నది. నేను నీకు శరణమిచ్చినయెడలఁ గ్రూరులగుహూణులు నా కన్నులయెదుటనే నాగృహాదికములఁ దగులఁబెట్టకపోరు. వితంతువగు నాతనయనుగూడఁ జెఱచుటకు వెనుదీయరు. అట్లని నీకాశ్రయమియ్యకపోవుట మిగుల ననుచితము. అతిక్రూరము. నేనిపు డేమిచేయుదును! ఎటుచేయుట కేమియుఁ దోఁపకున్నది." అని వెనుకముందునకుఁ ద్రొక్కులాడుచుండెను. అంత నేను వారిసంసారము నవమానవాహినియందుఁ ద్రోసి వినాశసాగరమునఁ జేర్చుటకంటె నచ్చోటువాసి నాకర్మకొలఁదిఁ బోవుట మేలనుకొంటిని. అప్పు డావిప్రకుమారి అరుంధతి "మానధనము నఱచేతఁ బట్టుకొని మనయాశ్రయము నపేక్షించివచ్చిన మానవతీశిరోమణిని మనయింటినుండి వెడల నడిపించుటయా? వెడలనడిపించి వినాశాబ్ధిముంచుటయా? అందునను, గాలగతిం జిక్కి కష్టముల ననుభవించు మనమహారాణిగారికా, యిట్టియన్యాయ మొనరించుట! బాబూ! నేనుగూడ మానవతిని. మానవతి నగునేను, ఈయువతిని రక్షింప నిన్నుఁ బ్రార్థించుచున్నాను. ఆమెం దేరఁదీసి యామె భీతివాపుటకు నీకిష్టములేకున్న, నేనుగూడ నామె ననుసరించి యామెకష్టములఁ బాల్గొనెద. నేను ఇరువదేండ్లనుండి పతివిహీననై యున్నాను. పతిప్రేమస్వరూపము నెఱుంగను. సంతానవాత్సల్యమును జవిచూచియెఱుఁగను. నాకనినాఁడగు నాపతియే గతి యని నమ్మి విరాగినినై నాజీవితము గడపుచున్నదాన. అనుష్ఠానవతినై యూఱటఁ జెందుచున్నదాన. కాన నీపుత్త్రిక, నీయెదుటఁ బ్రాణములతో బ్రదికియుండవలయునందువా—నీతనూజాతపితృగృహమును విడిచి

పోరాదని నీవందువా— ఈమానినీమణి మనయింట నిలుచునట్లు బలిమాలు కొనుము. ధర్మరక్షకునకు ధర్మమే రక్షయగును. ధర్మవిధ్వంసకుని, ధర్మమే ధ్వంస మొనరించును. ఈసుశీల మానసంరక్షణోద్యోగము నేఁడు మనపాలఁ బడినది. మనపాలఁబడిన యీపవిత్రోద్యోగమునకు మనము యోగ్యుల మని పించుకోవలయును. పరోపకారప్రదమై తనరినదియే జీవిత మనిపించుకొనుఁ గాని, అనినట్టి దంతయుఁగాదు." అని జ్ఞానప్రియునిఁ బ్రార్థించెను. అంత నా భూసురోత్తముఁడు నన్ను నిలువఁ బరిపరివిధముల వేఁడుకొనెను. అందులకు నేనంగీకరించి నిలిచితిని. అంతలో నీయరుంధతి నాకు బ్రాహ్మణోచితములగు నుడుపులఁగట్టి బ్రాహ్మణినివోలె నన్నాదరించుచుండెను. ఇట్లుండఁగనే యూ హూణసైనికులు మావారిపైఁబడిరి. పాపము, స్వామిభక్తిభూషితులగు నా యంగరక్షకులను, వారు కాలునిమందిరమునకుఁ బంపివైచిరి. గర్వోన్మత్తులగు హూణు లంతతో నూరకుండరైరి. వారు వైరుల రోయుచు నమలాపురి యంతయుఁ దిరిగిరి. కడకు నన్నుఁ జెఱపట్టుటకై నేనుండుచోటికిని వచ్చిరి. అప్పుడు వారొందినవిస్మయ మేమని వర్ణింతును? భట్టారకుఁ డొక్కఁడు గగనాంతరాళమునుండి మత్తేభములపై కుఱుకు సింహకిశోరముకరణి, వారిపైకి దూఁకెను. ఆవీరశిఖామణి యిప్పుడు రోషరంజితలోచనుండై దుర్నిరీక్ష్యుండై కన్పట్టుచుండెను. నాఁ డాతనియసిపుత్రిక పదునైదుగురు హూణులప్రాణానిల ములఁ గ్రోలినది. కాని హూణు లాతనిపైకి విజృంభించుచునేయుండిరి. ఎంత బలవంతుఁడైన నేమి! ఒక్కఁడు దంతమందితో నెంత సేపని పోరఁగలఁడు? కడ కాతఁడు వీరస్వర్గ మలంకరించెను. ఇఁక నాపట్టణమును గొల్లఁగొట్టుట కెను బదియైదుగురు హూణభటులు మిగిలియుండిరి. వారు మూలమూలలను, ఇం టింటిని నాకొఱకై వెదకిరి. అట్టికిరాతులు నావిడిదికివచ్చిరి. వారు అరుం ధతివృత్తాంతమును, నానిజచారిత్రమును దెలియఁజేయ జ్ఞానప్రియుఁ డాజ్ఞా పించెను. అరుంధతి తనకొమారితయనియు, నేను తనకుఁ జెలియనియు జ్ఞాన

ప్రియుఁడు చెప్పెను. అంతలకు హూణపరివారి నన్నుఁ జూపుచు "ఈ బిత్తరికూడ బ్రాహ్మణియా?" అని ప్రశ్నించెను.

"అయ్యో! దైవమా! మమ్ముల నెంతగాఁ బరిభవించుచున్నారు! నా బ్రాహ్మణత్వము నొకవేళ సంశయించిన సంశయింపుఁడు కాని, నామఱఁదలి కులగోత్రములమాట నెత్తకుఁడు."

"ఈమె యిచట నెంతకాలముగా నున్నది?"

"ఇరువదిదినములుగా."

అంత నాహూణసేనాని యిరుగుపొరుగువారలఁ గొందఱఁ బిలిచి "ఈమె యిచట నెంతకాలముగా నున్నది?" అని ప్రశ్నించెను. ఆపౌరులకు యశోధర్మమహారాజుపై నత్యంతానురాగమున్నది. కాని వారి కప్పు డెటుపోవుటకుఁ దోఁచినది కాదు. వారికి ముందుపోయిన నూయి, వెనుకఁ బోయిన గోయిగానుండెను. సేనానికి నరుంధతియిచ్చిన ప్రత్యుత్తరము వారికిఁ దెలియదు. అంతలో నొకవృద్ధుఁడు తెగించి "ఈకాంత యరుంధతి కాపురాలు. పలుమారీపడఁతి యరుంధతివద్దకువచ్చి, పతివియోగవ్యథాఖిన్నయగు నామె నూఱడించుచుండుట కలదు. అరుంధతి సదాచారవితంతువుల కాదర్శప్రాయురాలు. చంచలానందములకును, అపారదుఃఖములకు నాలవాలమగు నీపాడుప్రపంచమునువీడి యామె భర్త పరలోకమునకుఁ బోయిననాఁటఁగోలె నీసాధ్వి తలవాఁకిటి కడుగిడి యెఱుఁగదు. ఆమెముఖ మెట్టిదో మాకుఁ దెలియదు" అని యుత్తరోత్తరముగఁ బలికెను. ఆమాటల కరుంధతి కనుఁగొలంకులనుండి బాష్పకణములు—ఆపద్బాంధవుఁడగు నా వృద్ధునిపైని వాత్సల్యముచేఁ బుట్టిన యానందబాష్పకణములు—పరలోకనివాసి యగు తనపతిఁ దలంచుకొనుటచేఁ బుట్టిన బాష్పకణములు—జాలువాఱెను. ఈకరుణామయదృశ్యమున నాయోధేయనాయకునిహృదయము నీరయ్యెను. అతఁడు తనయనుచరులఁ జూచి "మనముకూడ నార్యధర్మావలంబులముకదా! ఏకాంతమునందు మానవతులఁ జోలిఁ బోవుట మనకు పాడిగాదు.' దైవకృప

వలన మనహృదయముల నింకను గరుణారస మింకిపోలేదు. నాతల్లికూడ నిద్దేకము నెనిమిదవయేట వితంతువయ్యెను" అని బోధించి, వారలఁ దీసికొని ప్రక్కయింటికి విడకఁబోయెను. నాఁటిరేయి బాగుగాఁ జీఁకటిపడినతర్వాత యశోధర్మమహారాజుసన్నిధినుండి యొకవార్తావహుఁడు నాబసవిడిది కరుదెంచి, నన్నుఁజూడఁగోరెను. అతఁడు మాతైరి యని శంకయించి యరుంధతి దిగులొందెను. తాను మామిత్రుఁడని నమ్మకముకల్గించున ట్లాభటుఁడు మాకుఁ జెప్పెను. దానికి నే నంగీకరించితిని. అంత నాతఁడు నన్నుఁ డాసి యూసంకేతపదత్రయము నా చెవియం దూఁదెను. కాన నాతఁడు నాహితకాంక్షియని నాకు నమ్మకముకలుగ, నావెంట నరుంధతీ జ్ఞానప్రియులు కలాంజారుదుర్గమునకు వచ్చినయెడల, నేనాతనిఁ గలాంజారుదుర్గమున కనుసరించుట కభ్యంతరములేదని చెప్పితిని. ఆయుపకారశీలురుసైతము "ఎట్టికీడులుమూఁడినను సంతసమున ధరించుచు, నీవెంటవచ్చెదము" అనిరి. కలాంజారుదుర్గమునకుఁ బోవు రహస్యమార్గమును నాప్రాణదాతలుకూడఁ జూడరాదని యాభటుఁడు పలికి వారికన్నులకు గంతలుకట్టెను. ఆభటుని సంకుచితాభిప్రాయము నాకు నచ్చలేదు. అరుంధతిజ్ఞానప్రియులకు లేనిసౌఖ్యము నాకేలయని నేను నిశ్చయించుకొని, నాకన్నులకుఁగూడ గంతలుకట్టుమని నేనంటిని. మామువురికన్నులకాతఁడు గంతలఁగట్టెను. అట్లాతఁడు మమ్ము బహిరంతర్దుర్గములు దాటించెను. ఆసాంకేతికపదత్రయము నాభటుఁడు దుర్గద్వారపాలుర చెవుల బడవేయుచుండ, వారు మమ్ము నిశ్శంకతో లోనికి వదలిరి. ఇట్లు మేమిటకు రాఁగలిగితిమి.

అంత మహామాయ సరస్వతిపడినపాటుకు జాలినొందుచు "కుమారీ! నీవు బడలియున్నావు. నులివెచ్చనిపాలఁద్రాగిన నించుక శ్రమతొలఁగును. రమ్ము" అని వారలమువ్వురను, అంతిపురమందలిభోజనశాలకుఁ బిలుచుకొని పోయెను.

---

# ఇరువదియైదవతరంగము.

## ప్రథమవిజయము.

ఇట్లు మూఁడుదినములు గడచెను. అరుంధతీజ్ఞానప్రియులు స్వగ్రామమగు నమలాపురికి మరలఁబోనెంచి, సరస్వతీమహామాయాచారుమతీవసంతలకడ సెలవుగొనిరి. చారుమతీసరస్వతీవసంతలను మహామాయ యావలకుఁ బిలిచి "ఈయరుంధతీజ్ఞానప్రియుల యుపకారమును మనము మఱవనోపము. వీరిఋణమునుండి విముక్తులమగుటకు మనకసాధ్యము. కాని కొంతకుఁ గొంతయైన వారి కుపకృతిఁ గావించుట మనకు విధియైయున్నది. నే నీబీదబాఁపల కైదువందల బంగారునాణెములను బహూకరింప నెంచియున్నాను." అని చెప్పెను.

సర:—కాని మనకానుకలను వారు స్వీకరింతురా యని నా సందేహము.

చారు:—ఆవృద్ధబ్రాహ్మణుఁడు మాత్రము చంక లెగురవేయుచు గ్రహించుననుకొందును. ఉండుకష్టమంతయు నాబాలవితంతువుతో నున్నది.

వసంత:—ఆబాలిక తాను ధనము నంగీకరింపకపోవుటయేగాక, ఆ ముదుకనికూడఁ దీసికొనియ్యదని నాయభిప్రాయము.

చారు:—అటులైన నావృద్ధబ్రాహ్మణు నీవలకుఁ బిలిచి, యాధనము నొసంగుట మంచిది.

మహా:—ఆబాలికను నేనియ్యకొనఁజేయఁగలను.

ఆమె యరుంధతీజ్ఞానప్రియులఁ బిలిచి, యరుంధతితో "అమ్మాయీ! నీవు మమ్మువిడిచిపోవుదువని నాకు దుఃఖముగానున్నది. నీవు యుపకృతిగొన

రించి, మేము నీఋణమునుండి విముక్తులము కాఁగలము? అట్లని మేమూరక యుండుట పాడికాదు. ఇదిగో ఈయేనూఱుహేమనాణెములఁ బరిగ్రహించి వీనిసాయమున సౌఖ్యముగ జీవించుచుండుము" అని బోధించెను.

ఆమాటల కరుంధతివదనము చిన్నవోయెను. ఆమె నయనగోళముల నుండి యశ్రుధార లురులసాగెను. అసాధ్వి శోకాకులితస్వరమున "మహాదేవీ! తుచ్ఛమగువిత్తముపై భ్రాంతిఁగొనియుండు నీచురాలనుగా నన్ను మీరు తలంచుట నాకు మిగుల దుఃఖముగానున్నది. పోయిపోయి ధనమున కఱ్ఱులు సాచుటయా? దాన నగుకార్య మేమున్నది? మహారాణి సరస్వతీదేవివైనా 'ఉడుతభక్తిఁ' బ్రకటించినతఱి యనర్ఘములగు నిట్టిపారితోషికములకు నేనువ్విళ్ళూరుచుండినదానఁగాను. నాసోదరియెడ విధ్యుక్తధర్మమునుమాత్రము నేను నెఱవేర్చితిని. ఇంతియే కాని మఱేమికలదు? ఎంతధన మొసంగినను, ఎన్ని కానుకలిచ్చినను ఆశీర్వదించుచుందునా? మీధనము నపేక్షించుటకు మేము పేదలము కాము. అట్లొకవేళ మేము దరిద్రులమైనను, నాయీసేవకు చిల్లిగవ్వయైన నంగీకరింపను" అని పలికెను.

మహామాయనేత్రము లానందబాష్పజలసంపూరితము లయ్యెను. "అమ్మాయీ! నీభాషణములు నాకు సంతోషము నిచ్చినవి. నీమనసు నొప్పింప నేను గలనైనఁ దలంపలేదు. నేనుగూడ ధనమునకు దాసురాలనుగాను. కాని నీవు ధనవంతురాలవై యుండుట మంచిదని నాయభిప్రాయము. ఓజ్ఞానప్రియా! నామాట నిజము కాదా?" అని మహామాయ యడిగెను.

ఆమాటలకు జ్ఞానప్రియుఁ డుబ్బి తబ్బిబ్బులగుచు "నిజము. తల్లీ! నిజము. నాతనయకు ధనమువిలువ తెలియదు. ఏనూఱుబంగారునాణెములతో నేమిచేయరాదు! జన్మాది నేనంతధనరాశిఁ గాంచియుండలేదు. మహారాణిగారు నేను భావించినంతకంటె నౌదార్యశోభితురాలుసుమా!" అని పలికెను.

మహామాయ యాతనిమాటలకు మోదమంది "అట్లైన నీవిత్తమును గైకొనుము" అని యాధనమునుండుసంచి నాతని కియ్యఁబోయెను. జ్ఞానప్రియుఁ

దమందానందస్వాంతుఁడై చేతులుసాచి యాసంచి నందుకొనఁబోయెను. కాని యంతలో నరుంధతి రోషరంజితలోచనయై "ఓబాబూ! అవిత్తమును బరిగ్రహించితివేని, నీవు నీతనూజుఁ గోల్పోయెదవు వినుము. నీ వీయధర్మవృత్తికి గడంగితివేని నేను నీయింటినివదలి నిన్నుఁ బాసిపోయెదనుసుమా! ఈధనమును గ్రహించి, దానితో నాకు సౌఖ్యములు గూర్పవలయునని నీయభిమతము కాఁబోలు! నిజముగా నంతకంటె దుఃఖప్రదము నాకు వేఱొకటిలేదని యెఱుంగుము. ధనమున కాశపడి నేనిట్టియిడుములను వలచి తెచ్చుకొనిన దానఁగాను. లోకాంతరగతుండగు నాభర్తపైఁగలభక్తిశ్రద్ధలఁబట్టియు, కడకుఁ దోడ్కొని పోవుమనివచ్చిన యీయసూర్యంపశ్యపైఁ గలయనురాగమునం జేసియు, నేనిట్టితెగువఁజేసి యామెం గాపాడితిని" అని నిష్కర్షగాఁ బలికెను.

జ్ఞానప్రియుఁడెత్తినచేతుల నట్లే దించెను. మహామాయ హతాశయై "అరుంధతీ! నీవు తీసికొనకున్న మానె! నీతండ్రికైనఁ దీసికోనిమ్ము. నీయట్టిస్వార్థత్యాగిని నేనిప్పటికిఁ జూచియుండలేదు. నీకై నీవు తీసికొనవు; వేఱొకరి దీసికోనీయవు. ఇదట్టినింక!" అని పలికెను.

అరుం:—దేవీ! మన్నింపవలయు. నానిర్ధారణము స్థిరమైయున్నది. అవిత్తమును గైకొనుటకు నేను నాజనకు నాటంకపఱచుటలేదు. కాని యాధనము నాతఁడు పరిగ్రహించినయెడల నేనాతనివిడిచి బాగుపడియెద నంటిని.

మహా:—కుమారీ! కడకు నాకొఱకైన ధనముతీసికొనవా?

అరుం:—ఎవ్వరికొఱకుఁ దీసికొనఁజాలను. కడకు నాభర్త పరలోకము నుండివచ్చి నాకిట్టియాజ్ఞఁజేసినను, నేనాతనియాజ్ఞను మీఱవలసియుండును.

ఆమాటలకు సరస్వతి సంతోషతరంగితాంతరంగయై యాసాధ్వి నక్కునఁజేర్చుకొని "సోదరీ! ఉత్తమోత్తములగుభాషణములాడు నీయట్టి యమానుషచారిత్రను గాంచిన మనభారతజాతిఁ జూచి నేను గర్వించుచున్న

దానను. నాహృదయఫలకమునఁ బవిత్రమగు నీరూపము నాటుకొనిపోయినది. అమ్మా! ఎప్పుడైన నీవు కష్టములఁ జిక్కుకొనినయెడల నేను బ్రదికియుండి నచో నావద్దకురమ్ము. నీశ్రమ నపనయింపఁగల నెచ్చెలిఁ బడయఁగలవు. ఈ లోపల నిదిగో, నాయనురాగచిహ్నముగా దీనిని నీకడ నుంచుకొనుము" అని యామె తనకంఠహారమునుదీసి యరుంధతి కిచ్చెను. కాని యరుంధతి యామె నాలింగనమొనరించుకొని యారత్నమునుదీసి "నేను విధవను. నా కీరత్నహార ముతోఁ బనియేమున్నది? 'నాది' అని పిలువఁదగిన నాకంఠాభరణము నెన్నఁడో కోల్పోయితిని. ఇఁక నీకృత్రిమహారములఁ గన్నెత్తియైనఁజూతునా? దేవీ! నీముద్దుమోము, నీమొలకనవ్వులే నీయనురాగచిహ్నములుగా నామర ణాంతము నాహృదయతలమున నిలిచియుండును" అని చెప్పెను.

సాధ్వియగు నరుంధతి పరోపకారశీలతకు జారుమతి ప్రమోదసంభరితాత్మయై యామెఁ గౌగిలించుకొని "అరుంధతీ! నీవు రత్నమువంటిదాన వమ్మా! నేనుగూడ నీవలె హేమమును హేయముగాఁ జూచుటెన్నఁడో కదా! నీవు మావద్దఁ గలకాల మేలయుండరాదు? మీరిద్ద ఱమలాపురియందుండి మీ ప్రాణములఁ బిడికిటఁబట్టుకొని క్షణమొకయుగముగాఁ గనుపుటకంటెఁ గలాం జారుకోటకుఁ గాపుర మరుదెంచి సౌఖ్యముగా నేల జీవింపరాదు?" అని సూచించెను.

జా:—ఔను నట్లొనరింపుము. నాకోరిక యదియే.

వసంత:—దాని కంగీకరింపుము. నిన్ను బ్రతిమాలెదను.

అరుం:—అమ్మలారా! నేను వితంతువను. నేను వసించుటకు సర్వాలంకారశోభితములగు నిట్టిప్రాసాదములు కావలయునా? అమలాపురియందు నా జీరకుటీరమున నివసించుచు, నాజనకుని నేను సేవించుచుండుట యుక్తమని నాయభిప్రాయము. ఎన్నఁడైన దేవిగా రమలాపురికి విచ్చేసినచో, నీయరుంధతికిఁ జెప్పిపంపుఁడు.

అరుంధతి మహామాయకుఁ బ్రణమిల్లి, సరస్వతీచారుమతులఁ గౌఁగిలించుకొని, వసంతవద్ద సెలవుఁదీసికొనెను. అనంతర మాతండ్రికూఁతుల కన్నులకు గంతలు కట్టఁబడెను. నమ్మినభటుఁ డొకఁడు వారినిద్దఱఁ గోటదాటించి తీసికొనిపోయెను.

"ఆహా! ఈపవిత్రవితంతు వెంతయాదర్శనీయురాలు!" అని మహామాయ యబ్బురపడెను.

చారు:—బళిబళీ! ఈమెమార్గము మానవతుల కవశ్యానుసరణీయము సుమా!

సర:—ఆహాహా! ఏమి యీమెప్రతిష్ఠ. ఎంతఠీవి. ఎంతస్వాతంత్ర్యము.

వసంత:—ఆహాహా! ఆసాధ్వియనురాగ మెంత నిష్కళంకము! ఎంత యగాధము!

చారు:—అకటా! అట్టి జాతిరత్నము మసిపాతఁగట్టఁబడియున్నది కదా! ముప్పదేండ్లు నిండుగా నున్నవో లేవో, ఇరువదేండ్లనుండి వితంతువై యున్నదఁట!

"సాధ్వులగు నిట్టివితంతువులేకదా స్త్రీలప్రతిష్ఠ నుద్ధరించువారలు" అని మహామాయ మెచ్చుకొనెను.

ఇట్లు రెండుదినములు గడిచెను. సరస్వతి కలాంజారునకు వచ్చినపిదప యశోధర్మవద్దనుండి వార్తలేమియు రాలేదు. దానంజేసి కలాంజారుశూరులు కళవళపడుచుండిరి. ఏవేళ కేదిమూఁడునో యని వారు భీతావహులైయుండిరి. మూఁడవనాఁటియుదయమున బహిర్దుర్గద్వారమువద్ద నేటికో కోలాహలముపుట్టెను. మహామాయ, సరస్వతి, చారుమతి, వసంత లద్దాని నారయ కొంచి సంభ్రమమున నంతిపురినుండి బయటికివచ్చిరి. వారు దుర్గద్వారముఁ జేరులోపల నొకభటుఁ డెగరొఁజుచుఁ బరుగెత్తివచ్చి "జయము. జయము. ఏలినవారు వర్ధిల్లుదురుగాక! ఏలినవారు వర్ధిల్లుదురుగాక! హూణులు హతులైరి. హూణులు హతులైరి." అని శివమెత్తిన ట్లఱచుచుండెను. పురుషులు,

స్త్రీలు, బాలురు, వృద్ధులు గుంపులుగుంపులుగా "జయము. జయము. ఏలినవారు వర్ధిల్లుదురుగాక! ఏలినవారు వర్ధిల్లుదురుగాక! హూణులు హతులైరి! హూణులు హతులైరి!" అని గోలపెట్టుచు నాతని వెంబడించుచుండిరి.

ఆజయజయధ్వానములు మహామాయచెవుల సుధఁ జిలుకరించినట్లుండెను. ఒక్కింతతడ వామె మైమఱచిపోయెను. "యుద్ధ మెచట జరిగినది? హూణు లెందఱు హతులైరి?" అని సరస్వతీచారుమతు లొక్కరొక్కరోఁ బ్రశ్నించిరి.

"పోరు పాటలీపుత్రపరిసరముల జరిగినది. ఇరువాగులవా రతిఘోరముగాఁ బోరిరి. హూణులరాజుయొద్ద పోటరులు ౩౦౦,౦౦౦ యుండిరి. మనపటాలములో ౩౫,౦౦౦ భటులు దుర్గసంరక్షణార్థము వెనుకనిలిచిరి. మిగిలిన ౨౫౦,౦౦౦ సైనికులు హూణులఁదాఁకిరి. ఐదుగంటలకాలము గెలుపోటములు క్రిందుమీఁదు లగుచుండెను. పరిస్థితులు మనకనుకూలముగ లేకుండెను. హూణులు పైఁబడుటయెక్కుడవుగా, సింహళులు కాలికి బుద్ధి చెప్పిరి. కేరళులు నిలిచి పోరిరికాని, కడకుఁ జెల్లాచెదరైపోయిరి. మాగధులు మగఁటిమి నెఱపిరికాని వారు క్రమశిక్షితులుకారు. కామరూపులు శత్రుమధ్యముం జొచ్చిరి. కాళింగులు హూణుల నెదిరించి నిలువఁజాలక వెనుకంజలు వేయసాగిరి. ఇట్లు మనయాశలన్నియు నొక్కమాటుగాఁ గూలిపోవునట్లుండెను. బాలాదిత్యమహారాజు దీనినంతయుఁ జూచి, పాటలీపుత్రమున దుర్గరక్షణమునకై నిలిచియుండు రాణువఁ గొనివచ్చెను. పౌరు లిందుచే భయవిహ్వలులై, ప్రాణములఱచేతులఁబట్టుకొని కాలుసాగినదారిఁబడి పరుగెత్తిరి. ఆ ౩౫,౦౦౦ భటులు వచ్చినతర్వాతనైనఁ బరిస్థితులు మన కనుకూలముగ లేకపోయెను. బాలాదిత్య, యశోధర్మ, వ్యాఘ్రరాజులు ఘోరాఘోరిగఁ బోరుచుండిరి. హైందవచమూసమూహము సక్రమశిక్షితము కాకుండుటంజేసి హూణులధాకకుఁ దాళఁజాలక వీఁగిపోవుచుండెను. కడకు యుద్ధవిద్యావిశారదులగు యశోధర్మసైనికులుసైతము వెనుకకుఁ దగ్గసాగిరి. కాని వ్యాఘ్రరాజభటులు

మాత్రము కాలూఁదినిలిచి, పైఁబైఁబడుహూణులతాఁకుఁడు నోర్చుకొనుచు వారిం జంపి చెండాడుచుండిరి. వ్యాఘ్రరాజపుడుగఱచుచు "వెనుకకడుగిడిన పిఱికిపంద నరకమునకు చేరఁగాఁబోవును. ఓస్వామిభక్తులారా! సైనికులారా! ఓహటించి నడపీనుఁగులై మనియుండుటకంటె, ముందుకుఁబోయి వీరస్వర్గమును జూఱఁగొనుఁడు. కళింగు లోహటించిన నోహటింతురుగాక! కళింగమిత్రుఁడు మాత్రము వారి ననుసరింపఁడు" అని స్వపరివారము నుద్బోధించుచుఁ గరవాలహస్తుఁడై హూణులమధ్యకుఁబోయెను. స్వామిభక్తిపరాయణులగు నాకిరాతబలములు వ్యాఘ్రరాజును వెంబడించుచుండెను. కనివిని యెఱుఁగని యీ తెగువకు హూణులు సైత మాశ్చర్యాన్వితస్వాంతులైరి. అంతఁ గళింగు లుత్సాహోద్రేకులై ముందుకుదూఁకిరి. యశోధర్మమహాకోసలుల నుత్సాహవాక్యములఁ బురికొలుపుచుండెను. బాలాదిత్యునియుద్బోధముల కలరి, మాగధులు 'యశోవా మృత్యుర్వా' అని నడుముకట్టి నిలిచిరి. ఇట్లాభారతనరనాకేసరులు, హూణహరిణములఁ గలగుండుపడఁజేయుచుండిరి. అందఱొక్కమొగమై పోరాడుచుండిరి. ఇప్పుడు హూణబల మొకింత నడలెను. ఆఁగత్తి ముందుపెట్టుటకు వారికి సాధ్యముకాకుండెను. కాని దర్పదుర్వారుఁడగువ్యాఘ్రరాజం తతోఁ దృప్తినందినవాఁడుకాఁడు. అతఁడు విక్రమవిశృంఖలుఁడై ముక్కుకు సూటిగ ముందు మిగిలిపోవుచుండెను. "ఓశబరసైనికులారా! పార్వతీయుల పౌరుషము—కిరాతవీరులమగఁటిమిని—నాగరికులమని విఱ్ఱవీఁగు వీరు నేఁడు కన్నులారఁ గాంతురుగాక! వీరు నేఁటినుండి మనలను నీచదృష్టులఁ జూచుటమాని, గౌరవదృష్టులఁ గాంతురుగాక! ఈపవిత్రోద్యమమున, మనము మననెత్తురు ధారవోసి, సజ్జనులయనురాగమునకుఁ బాత్రులము గావలయును" అని వ్యాఘ్రరాజు తనయనుచరుల నుపదేశించుచుండెను. మిత్రబృందము నుండి చీలిపోయి, శత్రునివహమునఁ జిక్కినప్పుడు కలుగునాపదల లెక్కఁకుఁ గొనక, వ్యాఘ్రరాజానుచరులగుగంద్వానులు సుస్థిరులై నిలిచియుండిరి. తానును, దనభటులగు గంద్వానులును, యుద్ధవిద్యాప్రకటనమున, శత్రుస్తవ

మును బడయవలయునని వ్యాఘ్రరా జభిలషించుచుండెను. అంతయేకాని గెలుపున కాతఁ డంతగాఁ బ్రాకులాడఁదయ్యెను. తాముగూడ వ్యాఘ్రరాజు వెంటబోయినయెడల, సహాయము నిక్కువమని యశోధర్మబాలాదిత్యమహారాజులు గ్రహించిరి. వారు వ్యాఘ్రరాజునుమించిన సమరవిద్యాకోవిదులు కాన, వాతఁడు మృత్యుగుహాంతరాళమునఁ బడిపోవుచున్నాఁ డనుకొనిరి. శత్రుస్తవమును బడయుటకని, అపజయమును వలచుట వారికనిష్టమైయుండెను. కాన వారు వ్యాఘ్రరాజునకు, ముందు మిగిలిపోవలదని చెప్పిపంపిరి. ఆరాత నాయకుఁ డాసందేశము వినఁబెట్టక "వెనుకకువచ్చుటెట్లో నాయకులకుఁ దెలియును. ఓస్వామిభక్తిపరాయణులారా! ఓసైనికోత్తములారా! సాగుఁడు. సాగుఁడు. 'యశోవా, మృత్యుర్వా' అని ముందుకు నడువుఁడు" అని వారల నుద్బోధింపసాగెను. ఒక్కొక్కయడుగున కొక్కొక్కగండ్వానుఁడు నేలకొఱగుచున్నను, మిగిలినవారు నిరుత్సాహమొందక ముందుకుఁ బోవుచుండిరి. వ్యాఘ్రరాజును, గంధ్వాసులును కోపోద్విగ్నమానసులై మైమఱచి యుండిరి. వారిముఖారవిందములు కెంపారుచుండెను. వ్యాఘ్రరాజు రోషకషాయితాక్షుఁడై "ఆఘాతుకుని మిహిరగులుని నఱకవలయును. వాఁడు ద్రోహాత్ముఁడగుభానుగుప్తునిఁ బంపి మహారాణి చారుమతి నగౌరవపఱచినాఁడు. రండు. ఓస్వామిభక్తిపరులారా! రండు. మహారాణి చారుమతికిఁ దలవంపులు గల్గింప సమకట్టిన హూణాధముని కుత్తుక నుత్తరింతము. అఖలుఁడు మిహిరగులుఁ డెక్కడ? ఆపలువ భానుగుప్తుఁ డెక్కడ?" అని రోదోంతరాళము నెవ్వెఱపడఁగ గర్జించుచుండెను.

"అదిగో భానుగుప్తుఁ డచటనున్నాఁడు!" అని యొకయోధుఁ డఱచెను. ఒక్కక్షణములో వ్యాఘ్రరాజు హూణవాహినిఁ జీల్చుకొనిపోయి భానుగుప్తు నెదుటఁబడెను. వ్యాఘ్రరా జిపుడు కాలాంతకునివలెఁ జూపునకుఁ జిక్కుచుండెను. "ఓరీ! నృశంసుఁడా! మారాజకుమారి చారుమతి నవమానపఱచినద్రోహుఁడవు నీవేకదా? ఓరీ! మండూకస్వరభుజంగమా! నీయవినీతికి నీత

లను బలిగానిమ్ము" అని వ్యాఘ్రరాజు భానుగుప్తుని శిరమును మొండెమునుండి ఖడ్గధారచే జిమ్మివైచెను."

సర:—అయిన భానుగుప్తుడంత మొందినాడు. కాదా?

"అవును. ఆబాలికుడు చచ్చినాడు. కాని, అయ్యో! వ్యాఘ్రరాజు కూడ గాలగలినుండి తప్పించుకోలేకపోయెను. అప్పుడు మిహిరగులుడు భానుగుప్తునివద్దనుండెను. వ్యాఘ్రరాజు భానుగుప్తుని తలదఱిగి కత్తిత్రిప్పునంతలో మిహిరగులుడాతని గింగురువోవునట్లొకదెబ్బగొట్టెను. ఆదెబ్బవలన గావలసినపనియయ్యెను. వ్యాఘ్రరాజు సొమ్మసిల్లి క్రిందికొఱగెను. అదియే తడవుగా హూణాధము లావీరోత్తముని గత్తికొకకండగా జేసిరి."

"అయ్యో! ఎంతయవస్థ" అని సరస్వతి వాపోయెను.

"ఆధీరోత్తముడు వీరస్వర్గమందినాడు. రణమరణము వీరులకు వరణీయముగదా" అని చారుమతి పలికెను.

సర:—వ్యాఘ్రరాజుమరణానంతరము, సమర మెట్లుసాగెను?

"అనంతరము హూణులు గంధ్వారదళమును హైందవవాహినినుండి విడదీసి, యొక్కడైన మిగులక నఱకివైచిరి. విజయోన్మాదుడగు మిహిరగులుడు స్వబలములను ముందుకు నడువ నాజ్ఞచేసెను. ఇంతలో కళింగభేరీనినాదములు విననయ్యెను. పదినిముసములలో గుణసాగరుడు ౫౦,౦౦౦ కళింగభటులతో సమరభూమియందు ప్రత్యక్షమైనిలిచెను. హూణులధాక తాళగలేక వెనుకాడుచుండిన హైందవులిపుడు నూతనోత్సాహబంధితులై సింహనాదము లొనరింపసాగిరి. విజయలక్ష్మిని జాఱగొన సమకట్టియుండు హూణులయుత్సాహాగ్ని యాఱిపోయెను. ఇప్పుడు మనబలములు హూణులకంటె నధికతరములయ్యెను. ఒకగంటలో హూణులు పూర్తిగ నోడి దెసల బట్టిరి. మిహిరగులుడు కాలికి బుద్ధిచెప్పెను.

చారు:—అహో! సర్వేశ్వరుడు సంస్తుతిపాత్రుడు. గెలిచినవారు, ఓడినవారు ఇపు డెచటనున్నారు?

"హూణులు వారణాసివైపు కరుగిడుచున్నారు. మనసైన్యములు వారిం దఱుముచున్నది."

మహా:—మంచిది. యశోధర్మ గాయపడినాఁడా?

"దైవకృపవలన లేదు."

పర:—ఇతరనాయకులసంగతిఁ జెప్పవైతివి!

అందులకుఁ జారుమతి మందహాసమొనరించుచు "బాలాదిత్యునిసంగతి యా నీవడుగుట? అవునా?" అని పరస్వతిని మేలమాడెను.

చారు:—సార్వభౌముఁ డెట్లున్నాఁడు.

"క్షేమముగనున్నాఁడు. ఏలినవారికిఁ దీక్షితయనుమాట లేకున్నది. ఆత్మాధీనమైన మగధరాజ్యమును వారిపుడు శాసనబద్ధ మొనరించు ప్రయత్నముల నిమగ్నులైయున్నారు. వారికిపుడు కామరూపకళింగాధిపులవలననించుక సంకట మొదవినది."

చారు:—కళింగులతో వచ్చినయిబ్బందియేమి?

"సముద్రగుప్తు డెన్నఁడో తమకడనుండి గెలిచిన నేలచెఱఁగు నొకదానిని, కళింగు లిప్పుడు కోరుచున్నారు. తమతోడ్పాటున జయమబ్బె నను నెపమిడి రెండునాల్కలమాటగా నెప్పుడో తమ చేతులనుండి జాఱిపోయిన భూమిని మరల పాలించుటతగదని, బాలాదిత్యుఁ డాభూమిని వారికిచ్చుట కంగీకరింపలేదు. ఆభూభాగమును గళింగులనుండి బలాత్కారముగా లాగుకొనిరి కాన, దానిని మరల వారికొసంగుట ధర్మవిహితమని గుణసాగరుని వాదము. కడ కాధరణీకాంతులిద్దఱును యశోధర్మను దమమధ్యస్థునిగా నేర్పఱచుకొని యాతనితీర్పు ననుసరింప నంగీకరించిరి."

పర:—ఆ నేలచెఱఁగుకొఱకు సార్వభౌమున కంతపట్టుదల యెందులకు?

చారు:—ఇం దాతని ప్రతిష్ఠ కలిసియున్నది. అర్థమగుటలేదా?

పర:—అయినఁ గామరూపాధిపుతో విరోధమునకుఁ గారణము?

"అందుల కంగవంగరాజ్యములు కారణము. కుమారపాలుఁ డీరెండు రాజ్యములు తనకుఁ గావలయుననియు, బాలాదిత్యసార్వభౌముఁడు మగధను దీసికొననగుననియు వాదించుచున్నాఁడు. దీనికి సార్వభౌముఁడు సమ్మతింపలేదు. అంతఁ గామరూపాధిపుఁడు కినిసి, స్వబలసహితముగా హైందవనరేంద్రమండలిని వీడి బ్రహ్మపుత్రానదిమీఁదుగాఁబోవుచున్నాఁడు. ఇప్పు డాతఁడు హూణులతో రాయబార మొనరించుచున్నాఁడని వదంతిగానున్నది కాని యావదంతి నిరాధారము."

చారు:—అహాహా! ఏమి యీపాపకలహములు. కడ కివి హైందవోద్యమమున కద్భుతగులుంగాఁబోలు! ఈభారతనరాధినాథులు సంఘీభావసరణిని గఱచుటెన్నఁడోకదా! పరిపంథినృపుచేతి కీలుబొమ్మలు కాకుండు టెన్నఁడోకదా!

మహా:—ఎన్నఁడు లేదు. కలనైన జరుగదు. భరతవర్షమునపై మనియున్నంతకాలము ద్రోహకర్ములు, విరోధభావములు మూర్తిభవించియుండును. ఓ భారతదేశమా! నీ మంచికాల మెన్నఁడో!......వార్త గాఁకేమైనఁగలవా!

"విశేషములు లేవు. అన్నిట్లును బంటి. బాలాదిత్యసార్వభౌముఁడు బౌద్ధమతమును స్వీకరించినాఁడు. ఈసంగతి నంతటఁ జాటించెను."

చారు:—ఏమీ! సార్వభౌముఁడు బౌద్ధుఁడయ్యెను! ఇఁక హైందవోర్వీశులమైత్రిని బోషించువాఁ డెవఁడున్నాఁడు? విజాతీయుఁడగు హూణుని దాకనుండి చాతుర్వర్ణములఁ గాపాడుట కీసమర ముద్దేశింపఁబడినది. భారతనరేంద్రమండలికి సభ్యులందఱు హైందవరాజన్యులే కదా! హిందూమతసిద్ధాంతసముద్ధరణార్థ మీమండలి స్థాపితమైయున్నది. అట్లుండియు బాలాదిత్యసార్వభౌముఁ డిప్పుడు బౌద్ధుఁడయ్యెను. ఇఁక హైందవనరేంద్రమండలి చెదరక నిలుచుటెట్లు?

"ఇది యొక పెద్దసమస్యయైనది. ఇట్టిపాడుపనికిఁ దలపెట్టవలదని యశోధర్మమహారాజా సార్వభౌమున కెంతయుం బోధించెను. కాని సార్వభౌముఁ

బోధనలను వీనులఁజొనుపఁదలఁచెను. అందులకు యశోధర్మ యలిగి బాలాదిత్యునిపట్టాభిషేకమహోత్సవమునకు రానని చెప్పినాఁడు. యశోధర్మ బాలాదిత్యసార్వభౌమునాయకత్వమును నిరసించి, యట్లొనరింపఁ గళింగాధీశుఁ గూడఁ బురికొల్పెను.”

“అకటా! ఈపాడువార్త వినఁజాలను” అని చారుమతి సరస్వతిని సమీపించి “సఖీ! శోకింపకుము. కోపావేశమున నాపతి యిట్లు వర్తించి యుండును. ఇందుల కాతఁడు పదునైదుదినములలోఁ బశ్చాత్తాపమొందక పోఁడు. అప్పు డంతయు సరియగును. ఏదియెట్లున్నను, మనపతులయంతఃకలహములు మనస్నేహలతలకు వేరుపురుఁగులు కాకుండుఁగాక. సఖీ! నిన్నిందులకు వేఁడుకొందును.” అని పలికెను.

సర:—నీవు నాపై ద్వేషభావముతో నుండవని నమ్మెద. మనమేల ప్రాణసఖులమై యుండరాదో నాకుఁ దెలియకున్నది.

చారు:—మనము కష్టసమయముల కభిముఖులమై నడచుచున్నారము. ఆదేలనో, నామనము సిలుగుల సంశయించుచున్నది.

సర:—మూఁడనుండుని షుమలను దొలఁగించి, భగవానుఁ డీభూమికి శుభము లొనఁగుఁగాక!

చారు:—ఆభగవానుఁడే మనభర్తలయంతఃకలహములఁ గూడ నివారించుఁగాక!

మహా:—నాకూర్మిసుతునకు సార్వభౌమునకుఁగల తగవులను దైవము తొలఁగించుఁగాక! చిన్నతనమునుండియుం వారొక్కటిగాఁ బెరిగిరి. సోదరులరీతి మనిరి. అట్టిచిరమిత్రులకు విభేదములంకలిగె ననువార్త నాయందలివిజయోత్సాహమును దున్నుకొనిపోయినది.

చారు:—బాలాదిత్యుఁడు శాద్ధుఁడు కావలసినంత యవసర మేమి వచ్చినది!

మహా:—నిజముగా నేటికి జగడాలమారి పెద్దమ్మ సార్వభౌముని బుద్ధిని పెడతలఁబట్టించి, యీయనర్థముఁ గల్గించినది.

నర:—దేవి! భావికాలగతి నెఱుంగ మానవుఁడు సమర్థుఁడు కాఁడు. కాని, నాప్రాణకాంతుఁడు బౌద్ధుఁడగుట మంచిది కాదని మీ రేటికి తలఁచుచున్నారో తెలియకున్నది.

మహా:—అమ్మాయీ! బౌద్ధమతావలంబన మనుచితమని నీకుఁ దెలియదా? ఆహా! గుప్తాన్వయభూషణుఁడు బౌద్ధుఁడగుటయా?

నర:—అన్నిటికి ముం దంతరాత్మయుండలేదా?

చారు:—అవును. నిజమే. కాని సోదరీ! కొన్ని యెడల గ్రుడ్డితనముగా నంతరాత్మకు లోఁబడుట ఘోరవిపత్తులకు మూలమగుచుండును. సార్వభౌముని బౌద్ధమతావలంబనమే దీనికిఁ బ్రబలతార్కాణమని నాయభిప్రాయము.

మహా:—మనమిఁక విజయోత్సవము లొనరింతము. యశోధర్మ బాలాదిత్యులయంతఃకలహాగ్నికణము రాఁజకుండదని నానమ్మకము. వారిద్దఱను నేను సౌఖ్యపఱచి, శాంతి నెలకొల్పఁగలను. రండు విజయోత్సవము నొనరింతము. రండు.

వారందఱు నంతిపురికి ముందఱనుండు నావరణమునకుఁ బోయిరి. అప్పటికే జను లచట గుమిగూడియుండిరి.

---

# ఇరువదియాఱవతరంగము.

## ధర్మదత్తునియంగడి.

పాటలీపుత్రము మహానగరము. అందలి విపణిశ్రేణి మిగులఁ బ్రసిద్ధ మైనది. కల్పవృక్షకామధేనువులవలెఁ గోరినపదార్థముల నొసంగునట్టి దుకాణములు హిందూదేశమున మఱెక్కడఁగాని మచ్చునకైనఁ గానరావు. కాని నానావిధములగు గుడ్డలంగడులఁబట్టియే, మగధరాజధాని విశ్వవిఖ్యాత మయ్యెనని చెప్పవలయును. అపదృశములగు మౌకమాలులకును, అసమానము లగుశాలువలకును నాకాలమున హిందూదేశము పేరొందియుండెను. పాటలీపుత్రమునఁగల వివిధవర్ణాంకితములగు దుకూలములును, అనర్ఘములగు నంబరములును మఱెచ్చటఁగాని లేవు. ఆనగరమునందలి గుడ్డలంగళ్లన్నింటిలో ధర్మదత్తునియంగడి ప్రాముఖ్యముఁ జెందియుండెను. ఇప్పటికి మూఁడుతరముల నుండి యాయంగడి సాగుచున్నది. చుట్టుపట్ల నెన్నిమార్పులగుచున్నను, అది మాత్రము దినదినాభివృద్ధి నొందుచుండెను. గుప్తరాజులు పోయిరి; హూణులు వచ్చిరి. కాని ధర్మదత్తునిదుకాణమున కీపరివర్తనములవలన మార్పేమియుఁ గలిగినదికాదు. కాని తనదుకాణమును దోఁచక విడిచినందులకై, ధర్మదత్తుఁడు భానుగుప్తునకుఁ బదివేలబంగారునాణెములను లంచముగా నిచ్చెను. ఇట్లు ధర్మదత్తుఁ డీమొత్తమును గోల్పోయెను. నేఁడు ధర్మదత్తునిదుకాణమునం దిప్పుడిప్పుడే బేరసారములు జరుగ నారంభించెను. ఇద్దఱు 'ఖాతాదారు' లప్పుడే వచ్చిరి. వారిలో నొకఁడు ధర్మదత్తునకుఁ జిరపరిచితుఁడు. అతఁడు దుకాణదారుని జూచినతోడనే "ఓహో! ధర్మదత్తా! ఈసంగతి వింటివా? తోరమాన్యుఁడు 'కాలధర్మ' మొందినాఁడు" అని యొలుఁగెత్తిపలికెను.

"ఏమీ! నిజమా?" అని ధర్మరక్షితుఁడును, ఆనందభూపాలుఁడును ఆశ్చర్యమొందిరి.

"అవును. పాటలీపుత్ర పౌరశేఖరుఁడు దోశకుఁడు నా కీసంగతిఁ జెప్పినాఁడు. నిన్న రేయి చాయ. దోశకుఁడు హుటాహుటి నరుదెంచి, బాలాదిత్య మహారాజున కీసంగతిఁ దెలియఁబఱచినాఁడు." అని మొదటివాఁ డనెను.

ధర్మ:—ఆనందా! నాకు మిక్కిలి సంతోషముగా నున్నది. ఇంతకుఁ బూర్వము మనకైన విజయములతర్వాత, నిట్టి శ్రావ్యోదంతము నిప్పటివఱకు మనము విని యుండినవారము కాము.

ఆనం:—అవును. ఆవిజయానంతరము మనము పలువార్తల నెన్నింటినో వినుచుంటిమి. మనసార్వభౌముఁడు యుక్తాయుక్తము లారయక వారణాసికడ హూణులతోఁ నొంటిగాఁ దలపడి పొందినయోటమివలన, పాటలీపుత్రమువద్ద మన మొందినవిజయము శోభింపకపోయినది. మరల మిహిరగులుఁడు హూణసేనాసమేతముగాఁ బాటలీపుత్రమును ముట్టడింప నుండెను. కాని యాదైవ మింతలోఁ దోరమానునిఁ బరలోకమునకుఁ బంపివైచెను. అందుచే నాభైరవాకారుఁడు మిహిరగులుఁడు విధిలేక యుజ్జయినికిఁ దిరిగిపోవలసివచ్చెను. ఇప్పుడు మనమహారాజున కించుక లీలిక చిక్కియున్నది. ఆయోటమివలనఁ గలిగినయిబ్బందులనుండి తప్పించుకొనుటకు మనకించుక వీలు దొరకినది.

ధర్మ:—ఈరాజు లాత్మకార్యసాఫల్యముకొఱకు కెంతనీచపుఁబనుల కైనఁ గడంగుచుందురుగదా! ఎంతచోద్యము! ఇందులకిదియే కారణము. ఒకవైపు మనరాజు హూణులతోఁ గయ్యమొనరించుచుండ, మఱియొకవైపునుండి కుమారపాలుఁడు మగధను ముట్టడించినాఁడు. చూచితివా?

ఆనం:—అయిన నేమి? కుక్కకాటుకుఁ జెప్పుదెబ్బయైనది. అతఁడు 'చెఱపకురా చెడెదవు' అనునీతిని సార్థకపఱచినాఁడు. తగుశిక్ష నందినాఁడు.

వైశాలినగరమునం దాతఁ డొందినయోటమి, ఆతనికి మఱచినను మఱపురాదు.

ధర్మ:—కుమారపాలుఁ డోడుట మిగులఁ జోద్యము కాదా?

ఆనం:—అవును. ఆదులకు వైశ్యశిఖామణి పరమార్థిసాయమే కారణము. ఆతం డిరువదివేల క్రయలబ్ధులగుభటులను బాలాదిత్యున కొసంగినాఁడు.

ధర్మ:—పరమార్థి కిప్పుడు బాలాదిత్యునిపై నంతశ్రద్ధ యేలపుట్టినది! ఈబాలాదిత్యుఁడే పూర్వము దిక్కులేక మగధనుండి పరుగెత్తిపోవునప్పుడు, ఈపరమార్థి 'అయ్యో! పాపము' అని యైనఁ బలికినవాఁడు కాఁడు.

ఆనం:—అవును. ఇప్పటికైన నాతఁడు తనభార్య యగులక్ష్మి, అందఱకంటెఁ గుమారిత పార్వతి లేకుండిన, నీకార్యమునకుఁ దలపెట్టియుండెడివాఁడు కాఁడనుచున్నారు. తనతండ్రి పరమార్థి, సార్వభౌమునకుఁ జేతనైనంతవఱకుఁ దోడ్పడినఁగాని, తానొక్కమెతుకైన ముట్టనని పార్వతి మొండికిఁ బడినదఁట!

ధర్మ:—ఆమెకు బాలాదిత్యునియెడ నంతయభిమానమునకు హేతువేమి?

ఆనం:—బాలాదిత్యునికొఱకుఁ గాదు. పార్వతి యంత మొండికిఁ బడియుండుట మనరాణి సరస్వతీదేవి పార్వతిహృదయమును బూర్తిగా స్వాధీనమొనరించుకొనినది.

ధర్మ:—ఎన్నివంకలుపోయినను, కావడి యిల్లుచేరుటయే ముఖ్యము. కావలసినకార్య మగుచున్నదిగదా! ఇప్పుడు పరమార్థికి రాజకీయములందుండు ప్రోత్సాహము, ఇంతవఱ కేవణిజునకుఁగాని యుండియుండలేదు.

ఆనం:—సార్వభౌముఁడును యశోధర్మయుఁ గలహించుచున్నందులకు నాకుఁ జాల చింతగానున్నది.

ధర్మ:—వారి యంతఃకలహములకు నిజమైన కారణములేమో?

ఆనం:—అందుల కైదుకారణము లున్నవి. మొదటిది; సార్వభౌముని బౌద్ధమతావలంబనము. రెండవది; కళింగమునందలి నేల చీలికవిషయమైనవివాదము. మూఁడవది; బాలాదిత్య సరస్వతులకల్యాణము. నాల్గవది; యశోధర్మ నావేశించియుండు నాశాభూతము. ఐదవకారణ మనాదియైనది. యశోధర్మ కళింగరాజ్యమునకు నుత్తరాధికారి; కళింగరాజులకు మగధాధీశులకుఁ బరంపరాగతవైరము కలదు.

ధర్మ:—అకటా! విదేశీయుఁడగుకిరాతు నెదురొడ్డి నిలుచుట కిట్టి ద్వేషము లాటంకములుగా నుండుట మిగుల సంతాపముగా నున్నది. సార్వభౌముఁడు హూణులపైకి దండెత్తిపోయినపుడు నెచ్చెలియగు యశోధర్మ సైతము తగినసాయ మొనరింపలేదు. కాని 'తాఁజెడినకోతి వన మెల్లఁజెఱిచె' ననుసామెతను సార్థకపఱచక, యశోధర్మ దేశద్రోహమునకుఁ గడంగకుండుట కెంతయు సంతుష్టిపాత్రుఁడు.

ఆనం:—అట్టిసుగుణము లాతనికడఁ గలవని యాతని గర్భశత్రువులు కూడ నంగీకరింపక విధిలేదు. హూణు లాతని కెన్నియో మోసాలఁ జూపిరి. "నీవు నామకార్థము మాకుఁ దోడ్పాటొనరించినఁజాలును నీమహాకోసలము జోలికి రాకుండుటయేకాక, మాళవరాజ్యమంతయుఁగూడ నొసంగుదుము." అని హూణు లాతనికిఁ జెప్పిరి. వేఱొకఁడైనచో నాగడ్డి మేసియుండెడివాఁడు. శ్రీల కిరవును, సౌఖ్యముల కాకరమును నగు మాళవసామ్రాజ్యనగరములు, భానుగుప్తుని యనంతధనరాసులు, యశోధర్ముఁడప్పు వేఱొకని కాళ్ళఁ గొల్చియుండెడివి. ఇంతయేల! గుణసాగరదాక్షాయణులు సైతము, హూణుల కోరిక నంగీకరించునట్లు యశోధర్మకు బోధించిరని వదంతిగా నున్నది. కాని మహాకోసలాధినాథుఁడు వారియుపదేశములఁ జెవులఁబెట్టక "దురాత్ముఁడును, విజాతీయుఁడును, నిషాదుఁడును నగుహూణునిముందఱఁ దలవాంచుటకంటె, మరణమైన మేలు" అని ఖండితముగాఁ బలికినాఁడు. ఈసమంచితాభిప్రాయమున నాతనితల్లి మహామాయయు, రాణి చారుమతియు నేకీభవించిరి.

ధర్మ:—ఆనందా! యశోధర్మ యంగీకరింపకున్నను రాణి చారుమతి, సరస్వతీ మహారాణికి జాడవచ్చినదని మాటగా నున్నది. ఇది యెంతవఱకు నిజము!

ఆనం:—ఈమాటనిజము. ఆరాణి యవంతిపురియం దైదుదినములుండి తరువాత నమశాపురికిఁ బోయినది. చారుమతీసరస్వతులపూర్వానురాగబద్ధులై యున్నారు. వారిపతులయంతఃకలహములు వారియనురాగమునకుఁ గళంక మొనరించుటలేదు. కాశివద్ద జరిగినఘోరయుద్ధమునఁ గాలూఁది నిలువఁ జాలక కాందిశీకులై వచ్చుచుండినమాగధులను హూణులనుండి యశోధర్మ రక్షించుట, చారుమతిమాట బలమున నఁట! మున్ముందు యశోధర్మ 'వేదశాస్త్రవిరోధులగు బౌద్ధులఁగాపాడుటకై, చాతుర్వర్ణములరక్తములఁబాఱించుట నాకు సమ్మతములేదు' అని పలికినాఁడఁట. అంతట నాతనిరాణి చారుమతి "ఆహైందవశాస్త్రములు 'దీనజనరక్షణము ధర్మాత్ములగురాజులకుఁ గర్తవ్యము' అని ఘోషించుచున్నవి. మీరుగూడ హైందవనరేంద్రులేకదా! కావున నార్తరక్షణము మీకుగూడ ననుల్లంఘ్యమై యున్నది. నిరుత్సాహపడియుండు మగధపటాలమునకుఁ దోడ్పాటొనరించుటకు మీరు బాధ్యులై యున్నారు" అని వేఁడుకొనినదఁట! అంత యశోధర్మ తనరాణికోరికను మన్నించి యామె యిష్టానుసారము నడుచుకొనెను. చతురమతియగుచారుమతికి మనమహారాణి సరస్వతిపై నుండునెయ్యము, మగధరాజ్యమును సర్వనాశమునుండియుఁ, సకలావమానములనుండియుఁ దప్పించినది.

ధర్మ:—రాణి చారుమతిని దైవము కాపాడుఁగాక. ఆనందా! పురుషులకంటె స్త్రీల కింగితజ్ఞాన మెక్కువయనియుఁ, వారిహృదయములు నవనీతమృదులములనియుఁ నీకుఁ దెలియునుగదా!

ఆనం:—ఆహా! ఇది లోకవిదితము. దీనికి మఱియొకనిదర్శనము వినుము. కళింగరాజ్యమునందలి యానేల వెఱుగుసువదలునట్లు మహారాణి సరస్వతి బాలాదిత్యసార్వభౌముని సమ్మతింపఁజేసినది. ఇట్లామె కలహాగ్ని నార్పి

వైచినది. మీఁదు మిక్కిలి యాదొరసాని తనభర్తతో "కామరూపదేశమును మీలోకయుదుడైన నాక్రమించుట తగదు. పాపము! ఆకుమారపాలునియవస్థ మిగుల శోచనీయముగా నున్నది. ఇప్పుడు మీ రాతని మన్నించినయెడల, సమయమువచ్చినప్పు డాతఁడు మీకనుకూలించును. అటుగాక యాతనిపైఁ గ్రౌర్యమూని చిక్కులఁబెట్టినయెడలఁ గామరూపమగధరాజ్యము, లనారత వైరానలమునఁ జిక్కి కఁలించుచుండఁగలవు" అని కుమారపాలున కనుకూల ముగ వాదించెను. సార్వభౌముఁ డాకోమల వాదమునకు సంతృప్తుఁడెను. ఆవా దమునందలి నీతికౌశల్యము నాతఁడు గ్రహించి యామె నాదరించెను. కుమారపాలుని మన్నించెను. కుమారపాలుఁడు సంతుష్టుఁడై, సార్వభౌముఁడు తన్నాతీరున నాదరించి బహూకరించుటకు ముదమంది, తన మేన యూపిరి యున్నంతకాలము బాలాదిత్యునెడఁ గృతజ్ఞుఁడై యుద్ధసమయములఁ గావలసి సంతసాయ మొనరించునట్లు ప్రకటించినాఁడు.

ధర్మ:—అది యటుండనిమ్ము. పూర్వము చంద్రగుప్తునికాలమునందు నైతము, బలప్రతాపసౌభాగ్యములకుఁ బేర్గాంచియుండిన లిచ్ఛవు లిప్పుడు శక్తిహీనులైరి. కారణము?

ఆనం:—పూర్వము ప్రసిద్ధుఁడగు నొకజోస్యుఁ డుండెనట. ఆతఁడు లిచ్ఛవీతనూజాతునితో వారియశోరేఖ యొక్కమారుగా మాసిపోవునని చెప్పి నాఁడట.

ధర్మ:—వారిపూరుపప్రతాపాదు లంత యకస్మాత్తుగ నంతర్హితమగు టకు హేతువేమి!

ఆనం:—గృహచ్ఛిద్రములు, సంతతభోగలాలసత్వము, గుప్తాన్వయ ములో డివియ్యము, ఇవియే యాభిజాత్యసంపన్నులగు వైశాలినాయకులవారు పొదికములఁ దొలిచికోయుటకు పేరుపురుఁగులైనవి. ఇట్లే యుండినయెడల వైశాలినగరముకూడఁ బూర్వనగరముల కుద్దియగుట కెంతకాలముపట్టదు.

ధర్మ:—విశ్వజనీనమగు వైశాలిఁబోలిన నగరరాజము రూపుమాసిన దినము, దుర్దినమగుట కేమిసందియము?

ఆనం:—నిజము. కాని దానింబోలిననగరరాజము లెన్నియో నేల మట్టము లైనవిసుమా! ద్వారక, ఇంద్రప్రస్థము, హస్తినాపురము అన్నియుం సుప్రసిద్ధపట్టణములేకదా? వానికీర్తికౌముదు లిప్పుడు మాసిపోయిన వేల? యుధిష్ఠిరు నాస్థానమంటపమున నిప్పుడు దివాంధము కూయుచున్నది. దుర్యోధనునిసింహాపీఠిపై నక్కలఱచుచున్నవి. దివ్యనగరమగుద్వారకయుండినచోట నిప్పుడు సాగరతరంగములు ఘూర్ణిల్లుచున్నవి. ఈపట్టణములు మూఁడింటిగతిం గాంచినపిదపఁగూడ, నేపట్టణముగతి యెట్లున్నదో యెవరు చెప్పగలరు?

ధర్మ:—ఔనౌను! అది నిజము. కాని వైశాలినగరము, హస్తినాపుర ఇంద్రప్రస్థములగతి పట్టదని నానమ్మకము. ఇఁక సమాజపరిస్థితులఁబట్టి చూడఁగా ద్వారక శుద్ధి కాఁజాలదు.

ఆనం:—అంతనమ్మకములో నుండకుము. యుగములు జరుగుకొలఁది యుదధులుకూడఁ గ్రొత్తదారులఁ ద్రొక్కుచుండునను టమఱవకుము.

ధర్మ:—మంచిది. దాని నటుండనిమ్ము. ఉజ్జయినీపౌరు లేమనుకొందురని నీయభిప్రాయము. మిహిరగులుఁడు తన రాజధానిని శ్రీనగరమునకు మార్చనున్నాఁడని వినికిడిగా నున్నది.

ఆనం:—కాని శ్రీనగర మాతనిరాజ్యమునందుండినఁగదా? వజ్రాయుధుఁ డడ్డుతగిలి నిలుచునని నీవనుకొనవా?

ధర్మ:—నిలిచిన నిలువవచ్చును. కాని యసంఖ్యాకులగు హూణుల ముం దాతనియాటలు సాగునా యని నాసందేహము.

ఆనం:—అది నిజము. ఇట్టివిషయములు సాధారణముగ నావీనులఁ బడుచుండును. అట్లుండ నీవదంతి నాకుఁ దెలియనందులకు మిక్కిలి చోద్యముగా నున్నది. రాజధాని యెప్పుడుమారునో?

ధర్మ:—హూణులు బాలాదిత్యయశోధర్మల నణఁచినయనంతరము.

ఆనం:—అయిన సరి. ఇందుకుఁ జాలకాలముపట్టును లెమ్ము.

ధర్మ:—బాలాదిత్యయశోధర్మ లిప్పుడు పరస్పరద్వేషపూరితులై యున్నారుగదా! ఇట్టియెడ వారి నోడించుట మిహిరగులున కమితసులభ మనుకొనవా?

ఆనం:—ఆహా! అతని కదెంతపని! వారు బాలాదిత్యునిగాని, యశోధర్మునిగాని మిగుల చులకనగా నోడింతురనుట కేమాత్రము సందియములేదు. కాని యిల్లలుకంగనే హూణులకుఁ బండుగ కాఁజాలదు. ఆనరాధీశులలో నొక్కనినైనఁ బూర్తిగా నణఁగఁద్రొక్కఁగలరా యనుటయే సందేహము. ఆమహీకాంతు లెన్నటికిఁగాని హూణునకు లొంగరని నాయభిప్రాయము. ఆమరణాంతము వారు హూణునకు బ్రక్కలోనిబల్లెములై యుండుటమాత్రము నిజము. తోరమాణుండున్నన్నో, లంచము లిచ్చియైన ఖౌరసనరేంద్రులను లోఁబఱచుకొని, వివేకచాతురీమహిమలచే వారినిఁ దనయింటికుక్కలుగాఁ జేసికొనుచుండెను. కాని మహిరగులునిపాలనమున దోరమాణునిచిత్రమంతయుఁ దారుమారగును. దురహంకారపూరితుఁడగు నాతనియవగుణములు, విశ్వాసఘాతుకులగు నాతనిసామంతుల జేరఁదీయకపోవు. ఇంకేమి కావలయును? ఆరాక్షసు నాక్రమించియుండు నపరిమితవిషయలోలత్వమును, అపారరక్తపానాపేక్షయుఁ గౌరులను శోకసాగరమునఁ ద్రోయకపోవు.

ధర్మ:—ఆపాపిష్ఠునిపీడ వదలినది; మన మెంతయు ధన్యులము. ఇంతకును మనము పిఱికిపందలము. మూర్ఖులము. పోయినసారి మనరాజు బాలాదిత్యుఁడు హూణులకు భయపడి మగధనుండి పాఱిపోవుచుండ, మనమందఱము నూరక చూచుచుంటిమికదా? మనతూష్ణీంభావమున కామాయావి భానుగుప్తుఁడే కారణము. మనమూరకుండినచో, హూణులు మనజోలికిరాక, మనకు సర్వసౌఖ్యములఁ గల్గింతురనిచెప్పి యాపాతకుఁడు మనలను జేలు

పుచ్చినాఁడు. అనంతర మాగోముఖవ్యాఘ్రమే, నావద్దనుండి పదివేలుబంగారు నాణెములు లాగుకొనినాఁడు.

ఆనం:—అవునవును. ఆసంగతి మాకందఱకుఁ దెలియును. ఇప్పుడు మాగధుల కాసమయముకంటె నెక్కువసాయ మలవడునని నీవనుకొందువా?

ధర్మ:—ఉండుననియే నానమ్మకము. అంతకువచ్చిన నైదువందల క్రయలబ్ధులగుభటులను నేను మహారాజున కందఁజేసెదను.

ఆనం:—బళిబళి! ఇట్టి యుదారభావమునకు నిన్ను నేనభినందించుచున్నాఁడ. ఏలయన, నింతవఱకు మనవైశ్యులు వక్రమార్గమునఁ జనుచున్నారు. తమవాణిజ్యము నిరంతరాయముగ సాగుచుండి, సరకులన్నియుఁ జెక్కుచెదర కుండిన, వారి కదియే పదివేలు. తమవ్యాపారవస్తుప్రచయములకుమాత్ర మభయహస్తమిచ్చిన వారలను; ఎన్నినీతినియమములకైన హస్తోదకములిచ్చి యెందఱిసోదరమానవులనైనఁ దమసౌఖ్యదేవతకు బలియియ్య వైశ్యులు సిద్ధపడుచుందురు.

ధర్మ:—నీమాట నిజము. కాని యొకవిషయముమాత్ర మాలోచింపవైతివి. ఇతరవర్ణములవారందఱును స్వదేశాభిమానమునఁ గ్రిందుమీఁదు లానరించుచుండునట్లును, వైశ్యులుమాత్రము మూఁగనాగేళ్లవలె నుందు నట్లును, నీవు వారిని దూరుచున్నాఁడవు. ఇది నాకంగీకారముగాదు. ప్రభుద్రోహులసంగతి నించుక యూరయుము. గుప్తరాజన్యులకడ వణఁకు ప్రాయము వచ్చువఱకుఁ గొలువుసేయుచుండిన సేవకులలో నూటికిఁ దొంబది తొమ్మండుగురు హూణునిక్రింద నావేతనములకే—కడకు సగముజీతములకుఁ గూడ—బని సేయుట యొప్పుకొనలేదా? ఇఁక దేశమునకుఁ ద్రోవచూపవలసిన బడిపంతుళ్లుసైతము 'ఏనదేమో యైన'దని కన్నులుమూసికొని హూణసేవనమునఁ బొట్టబోసికొనుచున్నారు. అన్నింటికంటె నీచమేమనఁగా, గుప్తరాజప్రతిష్ఠాపితములగు దేవాలయముల కధికారులును, పూజారులును బాలాదిత్యుపరాజయమును వినియు లెక్కసేయక, మీఁదుమిక్కిలి నావిజాతీయుఁడగు

విహారప్రభు నాహ్వానించి యాదరించిరి. పరిస్థితు లిట్లుండ, వణిజులు మాత్రము నింద్యులనిభావించుట నీకు న్యాయమా?

అనం:—ఔనౌను. నీయభిప్రాయము నాకుఁ దెల్లమైనది. నేఁటిదొర కడిలెని. రామరాజ్యము మఱపునకువచ్చునట్లు ఇన్నూఱేండ్లు మనలనుగన్న తండ్రులవోలెఁ బాలించుచుండిన గుప్తరాజ్యాన్వయమునకుఁగాను, మనము చింతాక్రాంతయేని త్యాగమొనరింప సమకట్టితిమా? మనకు దాస్యవృత్తియం దభిమానము లేదు. స్వతంత్రజీవన మొనరింప మనకుఁ బటుత్వము చాలదు. కాని మనయవస్థ యెల్లకాల మిట్లుండినది కాదు. చంద్రగుప్త, అశోకసార్వభౌముల కాలమున మనస్వాతంత్ర్య మసదృశమై, జగద్విఖ్యాతినందియుం డెను. స్వదేశస్వధర్మోద్ధరణార్థము మన మెద్దానిఁ గావింపనైన సన్నద్ధులమై యుంటిమి. ఎంతత్యాగమునకైన వెనుకంజవేయకుంటిమి. కాని యిప్పుడో? వీసమంతసుఖమును విడుచుటకైన మనకు మనస్సొల్లకున్నది. దానంజేసి మన వైరు లిపుడు మనలఁ బూరికిఁగొనుటలేదు. ఇంతయేల? మొన్న కామరూప సైనికులు మనవారలఁ జూచి "చంద్రగుప్త, అశోక, సముద్రగుప్తసార్వభౌము లెన్నఁడో యస్తమించిరి. ఇఁక మీరాడినదియాట, పాడినది పాట యెట్లు కాఁగలదు?" అని యొత్తిపొడుపుమాట లాడిరఁట! అంగవంగీయులలో ద్రోహులు కొందఱు "ఇఁక మమ్ము లోఁబఱచుకొనువారు విక్రమాదిత్యులెవరు?" అని తులువకూఁతలు కూసిరఁట! మన నుప్రమత్తులపై మెలఁగుచుండిన విప్పు, మగధకుఁ జేటుమూఁడుట నిక్కము.

ధర్మ:—ఈయధోగతినుండి మగధను దైవ ముద్ధరించుఁగాక!

అనం:—వింటివా? అశోకుని రాచనగరును బాడువెట్టియున్నారఁట. దానిం గన్నెత్తిచూచుట మానిరి. అధర్వవైద్యాలయముసైతము పూర్వమువోలె వర్ధిల్లుటలేదు. విద్యావైభవములకు వన్నెకెక్కియుండిన పాటలీపుత్రమును, ఇప్పుడు నలందాపట్టణము ముందు మిగిలిపోయినది.

ధర్మ:—ఓహో! అన్నట్లు మాటలసందడిలో మఱచితి. నలందయందు బాలాదిత్యుఁ డొకగోపురమును 300 అడుగులయెత్తున నిర్మింపనున్నాఁడఁట! నిజమేనా?

అనం:—అవును. ఇంతియేకాదు. మనరాణి సరస్వతి స్త్రీవిద్యాభివృద్ధికై 'సరస్వతీవిద్యాలయము'ను విశాలమగుదానిని స్థాపింపనున్నది.

ధర్మ:—స్త్రీవిద్యాభివృద్ధికై యింతకుముం దిట్లు పాటుపడినవారు లేరు. కాని యిప్పుడు నీకీ ప్రత్యేకసంస్థ యెందులకు? పూర్వము సంపన్న గృహస్థులు తమపుత్రికలకు, ప్రత్యేకాధ్యాపకులకడ విద్య నేర్పించుచుండిరి. అప్పటికి యది. కాని నేఁటికాలమున స్త్రీవిద్యనుగుఱించి విచిత్రవిచిత్రములగునవీనభావము లుదయించుచున్నవి కదా!

అనం:—అవునవును. నీపలుకు లెంతయు నిజములు. ఈచోద్యము వింటివా? రాణి చారుమతికూడ నట్టిసంస్థ నొకదాని నదేవిధమునఁ గలాంజారుదుర్గమున నిర్మింపనున్నదఁట! ఉపాధ్యాయినికూడ నామెయేనఁట. అన్నివిషయముల నామెయే బోధించునఁట! ఆమె కంతప్రావీణ్యమున్నదఁట.

ధర్మ:—ఆనందా! ఆమె 'చదువుల సరస్వతి' యనియా నీయభిప్రాయము? అలౌకికమగు నామెసౌందర్యమున కామె విద్యాపాటవము నివాళి యిదుటకైనఁ బోలదని నాయభిప్రాయము.

అనం:—అటులైన, రాణి సరస్వతి మతివిభవమునఁ గొఱఁతపడి యున్నను, దిగంతకీర్తికర్త్రియై యుండవలయును. రూపసౌందర్యముల నారాణు లిద్దఱొకరినిమించి యొకరుందురు. ఇందుల కేమందువు?

ధర్మ:—నాయభిప్రాయ మనుచితమని నేను సమ్మతించితిని. కాని రాణి సరస్వతికి, రాణి చారుమతికి సమానమగువిద్యావైభవము లెందుకులేవు?

అనం:—చారుమతివలె నామె యసూర్యంపశ్యకాదు. రాజకుమారియై పుట్టియుండలేదు. అందుచే నామె చారుమతివలె నొక్కొక్కకళ నొక్కొక్కగురునివద్ద నభ్యసింపలేదు. కాని, ఆమె మనము తలంచునంత

విద్యావిహీనురాలు కాదు. వ్రాతయందును, చదువులయందును నామె నిపుణురాలు. ఆమెకు రామాయణ, మహాభారత, పురాణార్థములు బాగుగాఁ దెలియును. ఇఁక గానవిద్యయం దామె దేవాంగన యనవచ్చును.

ధర్మ:—రాణి చారుమతి కింకను నేమి తెలియును?

ఆనం:—ఆమెకు షట్ఛాస్త్రములయందు దెలియనివిషయములు లేవు. ఆమె తర్కశాస్త్రమునం దందెవేసిన చేయి. పాణినిభాష్యము, పతంజలి సూత్రము లామెకుఁ గంఠస్థములు. ఎట్టిపండితకుంజరుఁడైనను, వ్యాకరణమున నామెను డాయ వెఱచుచుండును. ఇంతయుండియు, నామెకడ గర్వమను నది మచ్చునకైనఁ గానరాదు. విద్యావైభవముల నించుకేని ప్రకటింపక యామె యందఱితోఁ గలిసిమెలసి తిరుగుచుండును.

ధర్మ:—ఆహాహా! రాజకుమారి సుచిత్రములగుగుణములు ముందుపుట్టి, తరువాత నామానిని జన్మించిన ట్లున్నది.

ఆనం:—అవును. అది నిజము. ఈసంగతి వినుము. నీకు మనోజ్ఞమైన విషయము. ఒకపరి, రాణి చారుమతి, రాణి సరస్వతికడకు పాటలీపుత్రమునకు వచ్చియుండెఁగదా! అప్పుడు వారిద్ద ఱొకనాఁడు నగరవీథుల వాహ్యాళి వెడలిరి. వీథులయందు వారిరథము పోవుచుండఁగా నొకచండాలబాలిక వెక్కి వెక్కి యేడ్చుచుండెను. రాజసేవకు లాబాలికను నావల నెట్టివేయఁ బ్రయత్నించుచుండిరి. కాని రాణి సరస్వతి రథమును నిలిపించి, దిగి యాచండాల బాలికను బుజ్జగించెను. జాతివివక్షతఁ బాటింపక తా నావిధమున వర్తించినందులకు రాణి చారుమతి యేమనుకొనునో యని సరస్వతి "నాధర్మవతి నేనుగూడ బౌద్ధమతము నవలంబించితిని. నేను జాతివిభేదములఁ బాటింపను" అనెను. అందులకు రాణి చారుమతికూడ నాకడజాతికూనను ముద్దిడుకొనుచు "సరస్వతీ! శిశువులలాలించుటకు, బౌద్ధమతమును స్వీకరింప నవసరములేదు. స్త్రీజాతియై యుండినఁజాలును" అని చెప్పెను.

ధర్మ:—అది నిజమైనమాట. ఈరాణి చారుమతి చతురమతియుమా!

ఆనం:—అవును. ఇది వినుము. ఆమె పాటలీపుత్రమునకు వచ్చిన మఱునాఁడు మగధరాజపురోహితుఁ డామెను సందర్శించి తానొకవేళ బౌద్ధుఁడైనను, చాతుర్వర్ణ్యవిభాగము ధర్మసమ్మతమనియు, పశువుల బలి యిచ్చుట న్యాయబద్ధమనియుఁ, దనకట్టినమ్మకము లున్నవనియు, తలలఁ బోడు లైనంతమాత్రమునఁ దలఁపులు బోడులు కావనియు మనవిచేసికొనెను. పాప మాపేదబ్రాహ్మణుఁ డిట్టిముఖస్తుతులచే నామె మదికెక్కి యేదియేని కానుకను బరిగ్రహింప నెత్తవేసెను. అందుల కాదొరసాని "ఓహో! అటులగునా? అటు, పరిశుద్ధజీవితావశ్యకములగు బౌద్ధసిద్ధాంతములవీడి, ఇటు లిహపరసాధనభూతములగు నార్యమతసిద్ధాంతములవిడిచి, రెంటికిఁ జెడిన రేవఁడవైతివా?" అని యెత్తిపొడిచెను. ఆపురోహితున కామాటలు తలకొట్టినటు లయ్యెను. ముఖప్రియములుపలికి పసనములఁ బడయనెంచిన యాబాడబుఁ డాశాభంగ మొంది వచ్చినదారింబట్టి పోయెను.

ధర్మ:—ఆనందా! ఒక్కసంగతిఁ జెప్పుము. మనదొరసాని సరస్వతి నిక్కముగ బౌద్ధమతావలంబినియా?

ఆనం:—బౌద్ధమతస్వరూపము నీవె ట్లూహింతువో, దానిపై నా ప్రత్యుత్తర మాధారపడియుండును. బుద్ధుఁ డుపదేశించినయహింసాసూత్రములందును, వర్ణసామరస్యమునందును, ఆమెకు సంపూర్ణమగువిశ్వాస మొదవినది. ఇంతవఱ కామె బౌద్ధమతావలంబిని యనఁదగును. కాని యామెకు బౌద్ధప్రణీతములగు జాతకకథలపైవలెనె మహాభారత, రామాయణ, పౌరాణికకథలపై నాదరాభిమానములుకూడఁ గలవు. తనప్రాణకాంతునివలెఁగాక, యామె యార్యమతసమ్మతము లగుదైవముల నిప్పటికిఁగూడ నారాధించుచుండును. ఏకేశ్వరుఁడే, రామ, కృష్ణ, బుద్ధావతారము లెత్తుచుండునని యామె భావించుచుండును. అన్నింటికంటెఁ జిత్రమేమన, నామెకు బౌద్ధులను మైత్రేయావతారముపైకంటెఁ గల్క్యవతారముపై నెక్కువ నమ్మకమున్నది.

ధర్మ:—అయిన నామె బాలాదిత్యునితో నెట్లు సంసారముచేయఁ గలుగుచున్నది!

ఆనం:—మనరాజు కాఁబట్టినకుం డేటికి మూఁడేళ్లవాఁడు కాఁడు. అతఁడు మతవిభేదములందుఁ జూపుసైరణను, ఇతరులు కలనైనఁ జూపఁజాలరు. కుమారీదేవితరమునుండి వారికుటుంబమున ననుదినము రామాయణకాలక్షేపము జరుగుచున్నది. ఇప్పటికిఁగూడ మనరాజుగారు ముఖ్యముగాఁ దనరాణిని సంతోషపెట్టుటకు రామాయణకథ నాలకించుచుందురు.

ధర్మ:—సరి. ఇఁక మనపనికిఁబోవుదము. అంగడికి బేరగాండ్రు వచ్చుచున్నారు. నీకేమి సరకు కావలెను!

ఆనం:—రెండుశాలువలు, మూఁడుమూరలు కాశీపట్టు, ఒక మొకమాలుతుండు.

ధర్మ:—అయిన నాతో రమ్ము. శాల్వలశాలకుఁ బోదము.

వారిద్దఱును శాలువలుంచుశాలలకుఁ బోయిరి. అచట వివిధవర్ణాంకితములును, అమూల్యములు ననుశాల్వ లపరిమితముగా నుండెను.



# ఇరువదియేడవతరంగము.

## తోరమానునిమరణము.

మార్తాండుఁడు దుర్నిరీక్షుఁడై తీక్ష్ణకిరణముల నంతటఁ బఱపుచుండెను. ఉజ్జయినియందలి హూణనగరద్వారపాలురు స్వేదజలముల స్నానమాడుచుండిరి. వారిహస్తములయందలి విచ్చుకత్తులు నిట్టనిలువుగా నుండుక్రమముఁ దప్పియుండెను. రాజప్రాసాదముబైట జనులు గుంపులుకూడి దేనికొఱకో, మిగులఁ దమకమున నిరీక్షించుచుండిరి. నగరమంతయు హాహాకారములతోఁ బ్రతిధ్వనించుచుండెను. లోపల నొకగదియం దొకపీఁటగు పాడెపై బరుండఁబెట్టఁబడియుండెను. దానిచుట్టును జనులు మూఁగియుండిరి. వారందఱు విలపించుచుండిరి. హంజేష్వయు, వజేష్వయు గుండెపగులునట్లు వాపోవుచుండిరి. తుషేష్వ యొకమూల నొంటరిగ నిలువఁబడియుండెను. ఆమె నేత్రములనుండి బాష్పజలములు జాఱి, చెక్కిళ్లపైఁ గాలువలుకట్టి ప్రవహించుచుండెను. మిహిరగులుఁడుకూడ బావురుమని యేడ్చుచుండెను. అతనికిఁ బెన్నిధానమగు సామానవశ్రేష్ఠుఁ డొక్కఁడుకూడ నాతనికిఁక లేఁడు. ఇట్టి దిక్కుమాలినయవస్థ—ఆత్మబాంధవునిమరణము—మిహిరగులు నట్టికఠోరమానసుఁ గూడ నలచివేయుచుండెను. మిహిరగులుని రాతిగుండె పగిలిపోయెను. అతని సవతితల్లు లాతని కెన్నియోవిధముల సరిపోలుచున్నను, నాతఁడు వారిం జేరక సొంతతల్లి యగుతుషష్వవద్ద నిలువఁబడియుండెను.

వజేష్వ శవముకడకుఁబోయి, దానిని బిగ్గఁ గౌఁగిలించుకొని, లెక్కలేనిమక్కువ పేరులఁ బిలుచుచు "నాప్రాణకాంతుఁ డిఁక లేఁడు. దాసులను విడిచి హూణుఁడు కాలధర్మమొందినాఁడు. హంజేష్వా! రమ్ము. మనపూర్వుల సంప్రదాయముల ననుసరించి, మననాథుంగూడిపోవుదము. రమ్ము." అని

పెద్దగా నేడ్చుచుండెను. మాజేప్పకూడ శవమునుసమీపించి దాని నాలింగన మొనరించుకొని "నాథా! అయ్యో! ప్రాణనాథా! హూణేశరునిభంగి మమ్ము జీవితసమరాంగణమున దించిపోయితివేల? ఇప్పటి కీవిధమున నీవు హూణ మర్యాద నతిక్రమించినవాఁడవు కావు. ఈవజేప్ప మాజేప్పలు నిన్నుఁ బర లోకమునకు వెంబడించిరాఁగలరు. వచ్చి, నీవు వీరి నిటు డించి యొంటిమై పోయినందులకు నిన్ను నిందింతురు. మీవంశస్థుఁడా శూరశూరుఁ డనుమహా రాజు పూర్వము తానస్తమించుటకుముందు తనపత్నులను పరలోకమునకుఁ బంపివైచెనుగదా! నీవుగూడ నావిధమున నేల చేయవైతివి? తుషవ్వా! నీవు నీకుమారుని సాకుచుందుము; మేముపోయి మనభర్తగారిని సేవించుచుందుము." అని యేడువ మొదలిడెను. కాని తుషవ్వ యామాటల కంగీకరింపక "సోదరీ! వలదు. నేనుగూడ మీవలెనే మనభర్తగారి పరలోకమున కనుసరించెదను. ఈ లోకమున నన్నాతఁడు మనసారఁ బ్రేమించుచుండెను. పరలోకమున నేను లేకుండినచో, మనవాథుఁడు దుఃఖించును. అక్కలారా! నేనుగూడ మీ వెంటవచ్చెదను" అని చెప్పెను.

వజేప్ప తుషవ్వను కౌఁగిలించుకొని "అక్కా! నీవు [illegible] కనువగుభావము లన్నింటిని వదలివేసుకొంటిని. కాని నీవు లోలోన హూణ సంప్రదాయముల ననుసరింప నున్నందులకు నాకెంతయుఁ దృప్తిగానున్నది. కాని మనము మూవురము మనపతి ననుసరించినయెడల, మనకుమారుని కిచట దిక్కెవ్వరున్నారు? పసిబిడ్డలతోనుండు హూణపత్నులు, సహగమన మొన రించుట హూణసంప్రదాయమునకు విరుద్ధమని నీకు తెలియునుగదా?

"మిహిరగులుఁడు కన్నులఁ దెఱవనిమూన కాఁడు. ఆత్మయోగక్షేమ ముల నాతఁ డారయఁగలఁడు." అని తుషవ్వ తోరమానునిశవముపైఁబడి, కన్నులనీరుగారఁగా "అయ్యో! మనోనాథా! ఇచట మన మొండొరులము బద్ధానురాగులమై యుంటిమి. అట్లుండియు నీవు నన్ను వెతుకవై పోయితివి. ఇది జరుగఁజాలదు. నీవులేని తుషవ్వ యుండదు. నేను, నాసోదరీమణులు

వశేష్ప హూణేష్పులును నీవెంటఁ బరలోకమునకు రాసంసిద్ధులమై యున్నాము.” అని పరితపించుచుండెను.

ఆముప్వురుదొరసానులొక్కొక్కరుగా మిహిరగులు నాలింగనమొనరించుకొనిరి. ముందు హూణేష్ప యాతని నక్కునఁజేర్చుకొని “కుమారా! నీవు తుషష్పకపుపునఁ బుట్టితివనియే కాని, నన్ను సొంతతల్లిఁగా భావించుచున్నావు. నీవియోగవ్యథ నన్ను వేఁపుచున్నది. మనోజ్ఞమగు నీముఖాంబురుహ సందర్శనభాగ్యము నాకిఁకఁ గలవగుఁగదా! కాని స్వధర్మనిర్వహణమున కెట్టి యడ్డంకు లుండఁజనదు. నాపతి నాకై పరలోకమున నెదురుచూచుచుండును. ఆతనిఁ బెద్దకాల మొంటరిగ నిలుపుట నాకు భావ్యముకాదు. ఆవిధమున నేనాతనియెడ ననాదరణఁజూపినచో, మన పెద్దలగు హూణులు నన్ను నిందింపకపోరు. సెలవు. కుమారా! సెలవు.” అని చెప్పెను.

మిహిరగుళుఁడు బాష్పనిరుద్ధకంఠమున “అమ్మా! సెలవు” అని పలికెను.

అంత పశేష్ప యాతనిఁ గౌఁగిలించుకొని “కుమారా! నీవు ప్రమాదవశమునఁ దుషష్పగర్భమున నుద్భవించితివి కాని, స్వగుణగణముల నాలో నరిపోలుచున్నాఁడవు. హూణసామాన్యగుణములు నీయందు రూపొందియున్నవి. నేను నిన్ను మితిలేనియనురాగమునఁ బ్రేమించుచుంటిని. నీవు నన్ను నీకన్నతల్లికంటె నెక్కుడుగా గారవించుచుంటివి. మన పెద్దల పేరునిలుప నీవు సమర్థుఁడవని నాకుఁ దెలియును. నిజమారయ, నాకు నాపతిపై నుండు ప్రేమకంటె నీపైనివాత్సల్య మధికమైయున్నది. కాని యెన్నియిడుములుమూడినను స్వకులాచారముల వీడరాదు. మన పెద్దలగు హూణులు, పసిఁగందులులేని పడఁతులకు సహగమనమును శాసించియున్నారు. హూణజాత్యభ్యుదయముకొఱకు తత్సంప్రదాయము లవశ్యానుసరణీయములుగదా! కానఁ గుమారా! నాకిఁక సెలవు” అని నుడివెను.

మిహిరగులుఁడు దగ్గుత్తికతో “అమ్మా! సెలవు” అని పలికెను.

అంతఁ దుషష్పుఁడు తన కుమారు నాలింగన మొనరించుకొని "కుమారా! పరలోకము నలంకరించియుండు నాజననిని సేవింప, నిన్ను వీడిపోవుటకు నా కెంతయు సంతాపముగానున్నది. శోకమయమగు నిట్టివియోగసమయము వృథాప్రసంగములకుఁ గాలము కాదు. నిర్దాక్షిణ్యముగాఁ గలయంతరంగమును నీకు వినిపింప నెంచితిని. కుమారా! హూణులకు స్వభావములగు నీక్రూరత్వము, నీబూటకమతము, నీకన్నుగానని కామము నాకు నచ్చకున్నవి. హైందవుల యాశయములు ఉదారసంభరితములు. వారిమతము నిష్కళంకము. వారినీతిక్రమము విశుద్ధము. అట్టివారిపుణ్యభూమికి మనమిప్పుడు వచ్చియున్నారము. నీతండ్రిపలె నీవుకూడ నీపవిత్రభూమి యాచారముల నవలంబించి, నీపాడు గుణముల నేల విడువరాదు! ఇప్పటికైన మించినది లేదు. ఒక హైందవరాకుమారిం జేపట్టుము. ఆమె నేలుకొనుము. ధీమంతులగు భారతసచివోత్తములఁ జేరఁదీసి, వారినిబలమున నీపరిపాలనావిధానమును సాగింపుము. నీవట్లు జేసి నీ వసుదినాభివృద్ధి నందఁగలవు. ప్రజానురాగముఁ బడయఁగలవు. ఇప్పటి నీవర్తనమును ప్రజ లేవగించుకొనుచున్నారు. నీక్రూరకృత్యములకు వారు చెలఁరేఁగి నిన్నీదేశమునుండి తఱిమివేసినఁ దఱుమఁగలరు.

తుజేప్పు:—అక్కటా! ఏమిమాటలివి? పూర్వాచారములవీ? హైందవ సంప్రదాయముల ననుసరింప మనకుమారునకు నీ వెంతగా బోధించుచున్నావు! మనమీదేశము నాక్రమించుట హూణులమై యుండుటం జేసి కాని; హైందవులమై యుండుటవలనఁ గాదు. ఆహాహా! హైందవరాకుమారిం జేపట్టుటయా? తరువాత, హైందవమతవిధులను హైందవనీతినియమము లనుసరించుటయా? ఇంతకంటెఁ దలవిమాలినపని యున్నదా? అవునవును. కైరాతములగు హైందవ భావములతో నిండియుండు తుషష్ప మతియిట్లు పలుకును? ఇవి సముచితభావములైనను, అనుసరణయోగ్యములు కావని నాయభిప్రాయము. మనము హూణులము. హిందువులము కాము. హైందవులభావములు మనపాలిటివాగురులని నాయభిప్రాయము. వాని ననుసరించినచో, మనము వినాశసాగరమునఁ బడుట

నిశ్చయము. మనము కాలక్రమమున హైందవులయం దైక్యమైపోవుదుము. విజ్ఞానవంతులును, చాతురీధురీణులు నగు బ్రాహ్మణులకు మనము బానిసలమై పోవుదుము. వారికి మన మెందును సరిగాము. కుమారా! హూణజాతి నుద్ధరింపుము. నీతల్లిమాటవిని చెడిపోకుము.

తుషష్ప:—పుత్రీ! నాసోదరిపలుకులు నేతిబీరకాయలవంటివి. ఆ మాటల నాదరింపకుము. హైందవులగు క్షత్రియులు ధైర్యసాహసముల హూణుల కిసుమంతయేని తీసిపోవువారు కారు. వారితో వియ్యమొందుట వలన, హూణులశరీరసార్ధ్యము సడలునేమో యని భయపడకుము. దానం జేసి మనకు మనోబలము నతిశయించును. క్షత్రియులశౌర్య మసదృశము. హూణులశౌర్య మప్రతిమానము. ఇట్టిభిన్నజాతు లొకటియైనయెడల, జగజ్జేగీయమానులగు వీరవరేణ్యు లావిర్భవింతురు. నా యీసూచనచే హూణుల కీదేశమునం గలకాలాది నిలువ వీలుకలుగును. నానాటికి హైందవులు వారిని గౌరవించి యాదరింతురు. పజేష్ప యుపదేశము హూణులను దిక్కులేని పక్షులం జేసి వారిని వినాశానలమున కొక్కమాఱుగా మాడ్చివేయంగలదు. హుజేష్పా! ఇందులకు నీవేమందువు?

హుజేష్ప:—సోదరీ! నీయభిప్రాయము నాకు నచ్చినది. నీయోజన చాతురీవిలసితమై యున్నది. అట్టిమార్గమునం జని సుఖింప నేనుగూడ మనకుమారున కుపదేశింతును.

పజేష్ప:—సోదరీ! నీయభిప్రాయము నింతలో మార్చుకొంటివా? నీవు హూణసంప్రదాయములకుం బట్టుకొమ్మవని నేను నమ్మియుంటిని. కాని యిప్పుడు నా కాశాభంగ మొదవినది.

హుజేష్ప:—సోదరీ! తుషష్ప యాలోచనసముచితమై యున్నది. నిలువ నీడలేక, నమ్మ మతములేక, నడువ నీతిక్రమములేక, శౌరనియమావళి లేక, హూణు లిట్లు దేశభ్రష్టులై యుండుటలోం గలమేలు నాకుం గాన్పించుటలేదు. ఆక్సుసుసానుభూము లిచటిమైదానములలో సగమైన సారవంత

ములైనవికావు. భారతీయులు శాస్త్ర, మత, నీతిక్రమములం దెంతయో యభి వృద్ధిగాంచియున్నారు. అహహా! మనసాధుని పరిపాలనావిధానమునందలి చాతురీమహిమ, నాకిట్టి సౌమ్యసమయమునఁ బొడగట్టుచున్నది. ఇంతవఱకు నాభావములు మోటుగానుండినందులకు నాకెంతయుఁ జింతగానున్నది. తుషష్పరైన నాతో నెన్నఁడేని వాదించి, నన్నుఁ దనమతమునకుఁ ద్రిప్పఁ బ్రయత్నించినదికాదు. ఇప్పుడు నాయభిప్రాయము సమంచితమై సుస్థిరమై యున్నది.

వజేష్ప:— పురాణాచారములను, సంప్రదాయముల నెవరు వదలినను, నేనుమాత్రము మీఱిపోనొల్లను. పురాణసంప్రదాయములయెడ ద్రోహ మొనరించుట నాస్వభావమునకు విరుద్ధము. హైందవుల నీతిశాస్త్రతత్త్వములు నాకుఁ దెలియవు. కాని పుట్టిపెరిగినజాతిని, సంస్థను విడిచివేయుటకన్న మిన్నయగు ద్రోహకార్యము వేఱొండుండదని నాయభిప్రాయము. పుత్రీ! నీవు పురాణసంప్రదాయముల నించుకయైన విడనాడకుము. నీకు సాధ్యమైనంత వఱకు వాని నేమఱకుము.

మిహి:— అమ్మా! అట్లే నడుచుకొందును. మీమూలపురుషులుపదేశములను సాధ్యమైనంతవఱ కనుసరించెదను.

ఇట్లు మిహిరగులుఁ డామువ్వురు రాణులను గొంతవఱకుఁ దృప్తిపఱచెను.

వజేష్ప:— మనబలములపరిస్థితు లిపు డెట్లున్నవి? మనదొర పరాజయముకలిగెఁగదా యని వ్యాకులుఁడై యట్లే పరమపదించినాఁడు. ఆసమయమునఁ బరాక్రమోజ్జ్వలుఁడగు మనకుమారుఁడు మిహిరగులుఁడు వారణాసికడ హైందవులకుఁ జక్కనిపాఠముఁ గఱపుచుండెను. అకటకటా! కుమారునివిజయోదంతమును వినుటకైన నీతఁడు జీవములతో నుండకపోయెఁగదా!

తుషష్ప:— మహారాజు పరలోకప్రయాణ మొనరించుటకు, భూమనిమరణమును మిహిరగులుని యసంగతవర్తనములును గారణములై. పరిణ

మించినవి. మహారాజు సహజశూరుఁడు. పరాజయముల నాతం డంతగా లెక్కించువాఁడు కాఁడు. విజయము లపజయములఁ జిమ్మివేయునని యాతం డనుచుండును. కాని కెంపువిషయము లాతనిమదిఁ బీడించుచుండెను. మృత్యువునకు మృత్యువుఁ గల్పింప నిప్పటివఱకు మానవుని కెట్టియుక్తియుఁ దోఁచినది కాదు. భూమతునిమరణము మహారాజుహృదయతలమునందు దారుణ పాషాణబీజముల నాఁటినది. మీఁదు మిక్కిలి మానవప్రకృతిని మార్చుటెట్లో, మహారాజెఱుంగఁడు. యువరాజకుమారుని విపరీతస్వభావమున కాతఁడు లోలోనఁ గుమిలిపోవుచుండెను. దానినిఁ జక్కఁజేయునుపాయ మాతనికి స్ఫురింపకుండెను. మహారాజు మరణశయ్యపై "నాకిదప గాఢాంధకారము నాకగపడుచున్నది. నాతనయుఁడేఁడీ? అతని కీకన్నుగానని చీఁకటిఁ జూపవలయును." అని పలికి పెద్దనిదురవోయెను.

ఆనలుగురు కంటికిఁ గడవెడుగా నేడువసాగిరి. అంత పజేష్వ కన్నులద్దుకొనుచు "అక్కలారా! రండు. మహారాజు సమాధికడకుఁ బోవుదము. స్వకులాచారముల ననుసరించి మనముకూడ భూగర్భమునఁ బండుకొని మట్టిపాలగుదము." అని చెప్పెను.

తుషష్వ:—తనశవమును హైందవసంప్రదాయముల ననుసరించి దహింపవలయునని మహారాజుగా రాదేశించియున్నారు.

పజేష్వ:—ఏమీ! ప్రాణములతో నుండినంతకాలము పఠాణకులధర్మముల నుల్లంఘించుచుండినది చాలక, మరణించికూడ మననాథుఁడు స్వధర్మములఁ దిరస్కరించుచున్నాఁడుగదా!

మిహి:—మహారాజుగారికోరికఁ దలఁచి వ్యాఖ్యానమొనరించుట మన పనికాదు. పెదవికదల్పక యాకోర్కెను సానుకూలమొనరించుట మనకు విధియైయున్నది. పరంపరాగతమగు పఠాణధర్మనైజ మట్టిది.

పజేష్వ:—అయిన నేను వలదనను. ఇఁక మనము బయలుదేఱుదము. మాభర్తశవములో మేముకూడ నగ్ని కాహుతికావలయు ననుకొందును. అవునా?

మిహి:—అవును. నిజముగుహూణాంగనవలె, మీరుకూడ భర్తవెంటఁ బరలోకమునకుఁ బోఁదలఁచినచో, నావిధి నాచరింపవలయును.

వజేష్ప:—కుమారా! నేను నిజముగుహూణాంగననైనదియుఁ, గాని దియుఁ బోలికలనియందు నీవే కనుఁగొందువుగాక!

రాజపురోహితుని యుపదేశానుసారముగా నారాణులు ముగ్గురును పసుపుగుడ్డలఁగట్టుకొని, నుదుటఁ గుంకుమ నలఁదుకొని, పెండ్లికివోలె నలంకరించుకొనిరి. ఈవిధులకు వజేష్ప యానందించి, ఇట్టిశుభకార్యమున కిట్టిసముచితమార్గమును హూణులుసైతము నిర్ణయింపకపోయిరి. అహా! హైందవుల ధీవిశేషము నెంతని పొగడుదును!" అని సన్నుతించెను. అంతట శవోత్సవము బయలుదేరెను. ఆశవమువెనుక రాణులు మువ్వురును విచ్చుకత్తిలో మిహిరగులుఁడును వచ్చుచుండిరి. సైనికులు పదివేలమంది కరవాలధారులై రాజసము రూపొందినట్లు సక్రమముగ సవిలాసముగ నడుచుచుండిరి. హూణులు, హిందువులు గుంపులుకట్టి వచ్చుచుండిరి. అందఱును విచారముద్రితవదనులై నిస్తేజులైయుండిరి. ఆముగ్గురాణులసాహసమునకు నిర్భాగ్యులగు హైందవులు సైతము ముక్కుపై వ్రేలిడికొనిరి.

అయుత్సవ మట్లు పూర్వము గుప్తసార్వభౌము లుపయోగించుచుండిన శ్మశానముఁ జేరెను. చితిం జేర్చుటకై శ్రీగంధపుగట్టెలమోపు లచటఁ గుప్పలుకుప్పలుగాఁ జేర్పఁబడియుండెను. ఆరాణులుమువ్వురు చితిపైఁ బద్మాసనస్థలై వరుసగాఁ గూర్చుండిరి. తోరమానునిశవము వారియొడిలపైఁ బండఁబెట్టఁబడెను. ఇఁక బ్రాహ్మణులు మంత్రము లుచ్చరింప మొదలిడిరి. సహగమనోద్యుక్తలైయుండు నారాణులకుఁ బూజకావింపఁబడెను. వారికి టెంకాయలుకొట్టి, యచట నేనకవేలుగా మూఁగియుండు సువాసినుల కాకొబ్బరి ముక్కలఁ బంచిపెట్టిరి. అంత నారాణులు హైందవ, హూణసువాసినులకుఁ గుంకుమ నొసంగిరి. భేరీనినాదములు దిక్కులు లదరునట్లు మ్రోయసాగెను. ఇప్పుడు మిహిరగులుఁ డాచితికి నిప్పంటించెను. ఆరాణులు మువ్వురును స్వకు

లమునకు సైజమగుధైర్యముతో నట్టె చిత్తరువులువోలె నాసీనులై యుండిరి. ఒక్కదుఃఖారావముగాని, ఒక్కవేదనానిస్వనముగాని వారి పెదవులనుండి వచ్చినదికాదు. అచటనుండు హైందవు లాశ్చర్యచేతస్కులై యుండిరి. ఇట్లు మెల్లమెల్లగా నాశరీరములు నాల్గును బూదిదైపోయెను. జనులందఱు నగరమునకుఁ దిరిగిపోయిరి. హైందవులు తలకొకతీరుగాఁ దలంచుచుండిరి. వారు లిద్దఱీవిధమున భాషించుకొనుచుఁ బోవుచుండిరి.

మొదటివాఁడు:—అహాహా! అదృశ్య మశ్యదృతమై యుండెను. హూణవనిత లంతపతిభక్తిపరాయణులని నేను గలనైనఁ దలంచినవాఁడఁ గాను.

రెండవవాఁడు:—ఈరాణు లిట్లు సాహసించి సహగమన మొనరించుట, పతిభక్తిపరాయణులగుటంజేసికాదు. స్వకులాభిమానమునకును, పూర్వాచారసంప్రదాయములకుఁ గట్టువడి వారు పతివెంటఁ బరలోకమున కేగిరి. అట్లని వారికి సాహసములేదని యెవ్వరును జెప్పఁజాలరు.

మొదటివాఁడు:—మంచిది. అదియటుండనిమ్ము. తోరమానుఁడు కాలధర్మ మొందెనుగదా? ఇఁక ముందుముందు మనదినము లెట్లుండునని నీయూహ?

రెండవవాఁడు:—అది దైవమున కెఱుక. గొఱ్ఱెందినువాఁడు పోయి బఱ్ఱెందినువాఁడు వచ్చుచున్నాఁడు. పరలోకమునకుఁబోయిన పెద్దరాజుపాలనము పాడుగానుండెను. ఇఁక నాతనిస్థానమునకు రానున్నయువరాజు ప్రత్యక్షరాక్షసుఁడు. వీనిపాలనము పదివేలవిధములఁ బాడుగా నుండకపోదు.

మొదటివాఁడు:—ఉజ్జయినీపౌరులము మనమందఱము గుప్తసార్వభౌములయెడఁ జెప్పరానిద్రోహ మొనరించితిమికదా! అట్టియెడ మనకిట్టి శాస్తి కావలసినదే యని నాయభిప్రాయము.

రెండవవాఁడు:—అంతయేకాదు. మనయిడుమ లింతతో నంత మొందఁబోవు. ఇప్పటి కేమైనది? అవగింజలో నర్ధభాగము కాలేదు: ముం

దున్నది ముదుసళ్లపండుగు. చిదుపలు చిదుపలమేఘములతో సుందురాజకీయాంబర మిప్పుడు, కాఱుమబ్బులతోఁ గప్పఁబడియున్నది. కన్నుపొడుచుకొనినను నగపడనిచీఁకటి యెల్లకడల నలముకొనినది. ఏమికానున్నదో యా సర్వేశ్వరునకే తెలియవలయును. జరుగనుండువిషయములు జాడగానైన నీవుఁ బొడఁగట్టుచున్నవా!

"ఆహా! నెత్తురువానలు కురియుచున్నవి" అని మొదటివాఁ డనెను.

---

# ఇరువదియొనిమిదవతరంగము.

## తలఁపనితలంపు.

కలాంబారుకోటయందు బోరన వర్షించుచుండెను. కోఁటయంతయుఁ గులకపఱనేలలైనను, అంతయు నసుసుగానుండెను. ఎల్లకడల జలమయమై యుండెను. పర్వతసానువులనుండి చిన్నచిన్న నీటికాలువలు ప్రవహించుచుండెను. వీథులలో మోకాటిబంటినీరు పాఱుచుండెను. ఆనీటికాలువలలోఁ జిన్నచిన్న కాగితపుఁ బడవలఁ జేసి విడుచుచు నాడుకొను కొందఱుబాలురు తప్ప నాసమయమున జను లెవ్వరు కాని బయటకురాకుండిరి.

రాజనగరు ముందఱను నీరు చిన్నకాలువలై పాఱుచుండెను. ఆవాన నీటియందు పడవలు విడుచుచు నార్గురుబిడ్డ లాడుకొనుచుండిరి.

“చూడు. చూడు. నాపడవ ముందుపోవుచున్నది” అని వారిలో నొకబాలుఁ డుత్సాహమున గంతులిడెను. వానికిఁ బదునాల్గేండ్లుండును. ఈడునకుఁ దగినదేహపుష్టిఁ గలిగియుండెను.

అంత నొకబాలిక “అన్నయ్యా! ఇదిగో, నాపడవను విడువుము. ఇది గడ్డిమొక్కలకుఁ దగులుకొని నిలిచియున్నది” అని యడిగెను. ఆబాల కేడేండ్లుండును.

“నావలనఁగాదు. నేను నాపడవను దఱుమవలయును. లేకున్నఁ జంద్రభానుఁడు నన్నోడించును” అని యాబాలుఁ డనెను. ఆమాటలకు బాలిక పెద్దపెట్టున నేడువసాగెను.

మఱియొకబాలుఁ డామెను బుజ్జగించుచు “ఛీఛీ! నరసింహా! పట్టి గెలుపునకై నీవింత దేవులాడెదవని నాకుఁ దెలియదు. మన నైజగుణము వేరుపురుఁగై, మనబందుగులకు దుఃఖము నాపాదించు గెలుపు మనకెందు

లకు! రా! లలితా! రా! నీపడవను నేను విడిచెదను. నరసింహుఁడు తన పడవను ముందు విడుచుకొననిమ్ము! అందువచ్చుకీర్తి యేమియులేదు" అని చెప్పెను.

నర:—నీవు పందెమునిలిపిన యెడల, నేనుగూడ నాపెదను. నేను లలితకు సాయమొనరించుటకై నాపడవను నిలిపిన యెడల నీవానందమున నన్ను మీరిపోఁజాలుదువేమో యనుకొంటిని. ఇప్పుడు నీవామెకు బాసట కానున్నాఁడవుగాన, నేనిఁక నాపడవను విడుచుట కవసరము లేదు. అందు నాకు వచ్చెడి పేరుకూడ లేదు. నిన్ను నీఁబోఁటివారల నోడించినఁ గదా, మాఁబోఁటివారలకుఁ గీర్తిప్రతిష్ఠలువచ్చును.

నరసింహుఁడు తనపడవను గట్టుకుఁ దీసి, వెనుకకువచ్చి గడ్డిమొక్కలకుఁ దగులుకొనియుండు లలితపడవను విడఁదీసి వదలెను. అందులకు లలిత కిలకిల నవ్వుచుఁ జప్పట్లుచఱచెను. అంతట నరసింహచంద్రభానులు మరలఁ దమపడవలను నీటవిడిచి యాడుకొన మొదలిడిరి. అందఱుకూడ నదేవిధముగా నాడుకొనుచుండిరి. బొటబొట నీరుగాఱుకన్నులతో లలిత నవ్వుచు నరసింహుని లాగి "అన్నయ్యా! అన్నయ్యా! చూడుచూడు. నాపడవకూడఁబోవుచున్నది" అని గంతులిడుచుఁ జప్పట్లుకొట్టుచుండెను.

కోఁటలోపల మహామాయ, యశోధర్మ, చారుమతి, వసుంక్ష, అ పిల్లలఁజూచుచుఁ గూర్చుండియుండిరి. మహామాయ కిప్పుడు డెబ్బదియొనిమిదేండ్లునిండినవి. నేత్రదృష్టి యించుక మసకలెక్కియున్నను, ఆమహారాణి దృఢగాత్రయై మిగుల నోపికతోనుండెను. చారుమతి కిప్పటికి నలువదేండ్లు నిండినవి. కాని యాకోమలి ముప్పదియేండ్లకు మించియుండునని యెవ్వరను కొనరు. ఇప్పటికిఁగూడ నారాణిసౌందర్యరాశి తొలఁకాడుచునేయుండెను. యశోధర్మ కిప్పుడు నలువదియొనిమిదేండ్లు నిండినవి. ఇప్పటికిఁగూడ నాతని యందలిపరాక్రమము ప్రతిభ, ఉత్సాహము వీసమంతయేని కొఱవడినది

కాదు. వసంతకును నిప్పుడు నలువదియైదేండ్లకుఁ బైబడినవి. కాని యాగో పాంగనముఖ మిప్పటికిఁగూడ శైశవలక్షణసమన్వితమై యుండెను.

"ఆకానలచాయఁ జూడుఁడు. ఆవానలోఁ దడియుచు వారు పరుగిడుచున్నారు. వారికి జలుబుపట్టునేమో! అమ్మాయీ! వారిని బయటికేల పోనిచ్చితివి" అని మహామాయ యనెను.

"నేఁబంపలేదు. ఆపిల్లలు వారంతటవారే పోయినారు. అది యటుండ. వానలో నానినంతమాత్రమున వారికేమి మొప్పమివచ్చునో నాకర్థమగుటలేదు. కృత్రిమజీవనమునకు వారలవడియుండవలదా? పైఁబెట్టిన బాకీ, ఇలఁబెట్టిన కాలుక తీసికొనిపోవునని, పుష్పములవలె వారిఁబోషించిన ప్రయోజనములేదు. మున్ముందు వారెన్నియోసిలుగులఁబడి నలఁగవలసియుండును గదా! కష్టములకోర్చునట్లు వారిం బెంచుట మంచిది" అని చారుమతి బదులిడెను.

యశో:—అవును. ముందు నేను వానకుఁబోక నరసింహులుని, చంద్రభానుని, లలితను నింటిలో నాఁపియుంచితిని. దాని కాపసిఁగందులు మోములు చిన్నఁబుచ్చుకొని యాటలకువ్విళ్లూరుచుండిరి. అంత నేను వారి నట్లరికట్టి వారియుత్సాహాగ్ని నార్పుటకంటె, వాననానుటవలన వారికి జలుబు చేసినను మేలే యని భావించితిని. ఆహా! నేను వారిని వదలివేసినప్పుడు దేవిగారు వారియుత్సాహాతిశయమును జూచియుండవలసినది. ఆపావనమగు నుల్లాసము చిందులాడునట్టి ముద్దుమోముల నేనిదివరకుఁ జూడలేదు. అటుఁ జూడుము. ఆటపాటలయందు వారికుండుసంతోషమును జూడుము. ఇంత యేల? ఒకనాఁడు నేను నరసింహులుని వెలికిఁబోనీయక యింటిలో నిలిపియుంచితిని. అప్పుడు వాఁడు నన్నుఁ గాంచి "బాబూ! నీయది పాషాణ హృదయము కాఁబట్టియే, నీవిట్లు నాస్వేచ్ఛావిహారము నరికట్టి నన్ను బంధించియుంచితివి." అని యడిగెను. ఇఁక మీరిపోరాదని తలంచి, వానిని విడిచి

తిని. ఇప్పుడు చూడుము. వాఁడు వానలోఁ దడియుచు గంతులిడుచున్నాఁడు.

"హూణులప్రస్తావము వచ్చినది. అహో! ఆ మోటుమూఁక యార్యావర్తమును శాసింప మొదలిడి యెన్ని వత్సరములు గావచ్చినవి! అకటా! వానిఁ దఱిమివైచుటకు మన మొనరించు ప్రయత్నములన్నియు నిప్పటివఱకు నీటి వ్రాఁతలై పోవుచుండినవి. ఆనాఁడు పాటలీపుత్ర సమర మప్పుడు సందర్భము లన్నియు మన కాశాజనకములై యుండినవి. కాని యాతఁడు నా పుత్త్రుఁడును, బాలాదిత్యునకు నెక్కడనుండియో యీపాడు భేదాభిప్రాయములు వచ్చెను. 'వట్టి యంతఃకలహము లేకదా, రెండుమూఁడు నెలలలో మాయమైపోవా' యని భావించియుంటిని. కాని, అకటా! నా భావములన్నియు బూదియైపోయెను. నా యభిమతములన్నియుఁ గడుకలయ్యెను. వారి విభేదము లొక్కపెట్టునఁ దామరతంపరలయ్యెను. పాటలీపుత్ర సమరమై యిప్పటి కిరువది యొనిమిదేండ్లయినది. కాని భరతవర్షమునకుఁ బోషణకర్తలై యుండవలసిన యీరాజుల యంతఃకలహములు రానురాను పెంపొందెను. శరీరములు రెండైనను జీవము లొక్కటిగనుండవలసిన యశోధర్మ బాలాదిత్యుల వివాదము నిప్పుడు, హూణ హైందవ వివాదమున కెసయగుచున్నదిగదా!" అని మహామాయ శోకనిరుద్ధకంఠమున మఱి మాటాడఁజాలకపోయెను. ఆమె నయనముల నశ్రు లురలుచుండెను.

చారు:—అమ్మా! వగఁగుందకుము. మమ్ములఁగూడఁ బరితాపవహ్నిఁ ద్రోయుటతప్ప దీన నేమైనఁ బ్రయోజనమున్నదా? వారికి భేదాభిప్రాయము లున్నవని వారికే తెలియదు. అట్టి విభేదాభిప్రాయము లతిసామాన్యముగాఁ బెఱిగి పాదుకొనినవి. బాలాదిత్యుఁడు బౌద్ధమతము నవలంబించి, యద్దానిం బ్రకటించుటఁ జేసియే యిట్టి యనర్థములు పుట్టినవి. కావలసిన కార్యములన్నియుఁ దలక్రిందులైనవి. అట్లు కాకున్న నాతఁడు పూర్వసింహాపీఠి నధిష్ఠించి యుండఁడా? ఏమూలనో మగధయం దొకసామాన్యసింహాపీఠి నధిష్ఠింపవలసిన

గ్రహాచార మాతనికిఁబట్టియుండునా? ఇంతకును విధివ్రాఁతలనుల్లంఘ్యములు సుమా!

మహా:—నిజము. ఇంతసేపుగాను దుఃఖము దొంతరదొంతరలుగా ముసిరివచ్చుచున్నది. హూణు నోడించి, యాతనిని మనదేశమునుండి తఱుమ గొట్టుటకై మన మొనరించిన ప్రయత్నములన్నియుఁ బెరిఁగినట్లే పెరిఁగి కడకు విఱిగినవి కదా యని నేను దలంచుకొనినపు డంతయు నాహృదయము వ్రీలు చుండును. కనులఁబడిన కామితతీరమును జేరునంతలో మనరాజకీయనౌక బుడుంగుమని మునిఁగి మనలనందఱ నిరుత్సాహపఱచినది. బాలాదిత్య యశోధర్మల విభేదాభిప్రాయము లంతరించుట కేవియేని సంభవింపదా యని, యేటేట నేను నిరీక్షించుచుంటిని. కాని నానిరీక్షణములన్నియు వృథలగుచుండెను. కడకు నేనొక ప్రబలప్రయత్న మొనరించితిని. కుట్రాపిరితోనుండు భారతమాత నుద్ధరించుటకై వివాదములు వీడుమని పదునైదేండ్ల క్రిందటనే నాపట్టికి బోధించితిని. ఒకప్పుడు నాకుమారుఁడు హూణులనోడించి యుజ్జయినిసింహాసనపై బాలాదిత్యునిఁ గూర్చుండఁజేయుదునని తనకిష్టము లేకున్నను, నాకు వాగ్దాన మొనరించియుండెను. ఆమాటకుఁ గట్టుపడి తనబలఁగములన్నింటిని బాలాదిత్యునివశమున విడుచునట్లు నాతనయుఁ డంగీకరించెను. కాని యట్టి యుదారగుణమును బ్రకటించినందుల కాతఁ డొందిన ప్రతిఫలమేమి? అందులకు బాలాదిత్యచక్రవర్తి "నారాజ్యమగు మగధ నాకుఁ జాలును. నా రాజ్యమును నేను నాకుఁ దృప్తిగాఁ బాలింపఁజాలకున్నాఁడను. ఊరక రాజ్యమును విస్తరింపఁజేయుటవలనఁ బ్రయోజన మగపడదు. హైందవనరేంద్రమండలి ప్రకటించు సహకారమునందు నాకు విశ్వాసము లేదు. మిహిరగులు నోడించుట మాటలతో నగుకార్యము కాదు. నేను నామాగధుల ననవసరముగా నిడుమలపాల్సేయుటకుఁ దగినకారణము నాకగపడదు. విజయము నిక్కమని నాకు నమ్మకము కలిగినఁగాని, నాభటు నొక్కనినైన యశోధర్మ యధీన మొనరింప నియ్యకొనను" అని వ్యతిరేకముగఁ బలికెను. బాలాదిత్యుని ప్రత్యు

త్తరము నాకుమారునియం దుత్సాహాగ్ని నాప్పైరేచి, యాతనిం గ్రోధపరవశుం గా నొనర్చెను.

యశో:—అవును. అట్లేచేసెను. నాకోరికను నేను బాలాదిత్యున కెఱింగించినప్పుడు, అతనికంటె నేనే పరాక్రమోపేతుండనై యుంటిని. అప్పటికి నామాతులుండగు గుణసాగరుండు పరమపదము జేరి యుండుటంజేసి, కళింగరాజ్యముకూడ నాస్వాధీనమై యుండెను. నాటిమాగధసైనికు లక్షలకొలఁదులై యుండుటయేకాక, వారికి యుద్ధసామగ్రి కొఱవడి యుండెను. కాని కళింగమహాకోసలసైన్యము లన్నివిషయముల మగధరాజువల మించియుండెను. అట్లుండియు నేను నామాతృదేవియాదేశము నావలం ద్రోచితిని. హైందవమతాధిక్యముగాని, నావంశప్రతిష్ఠలుగాని, భారతదేశయోగక్షేమములనుం బర్వాతనేయని నిశ్చయించుకొంటిని. బాలాదిత్యుని—నాస్తిసుండగు బాలాదిత్యుని—యొట్టినిబంధనలంగాని విధింపక యాతనిపూర్వులసింహాసనముపై నెక్కింప నొడంబడితిని. కాని, ఆహా! అందులకు నా కాతండొసంగిన ప్రత్యుత్తరమేమి? అప్పుడు బాలాదిత్యునకు నాకును వివాదములుండినమాట నిజము. కాని యంత వఱకు నాకాతండు పంప యని తెలియును. ఆతని ప్రత్యుత్తరమువలంజేసి, చిన్ననాటినుండి యొకకంచమున దిని, యొకమంచమునం బండిన నెచ్చెలిపై నాకట్టి నీచభావ ముదయించినది.

చారు:—దేవా! మీరు పొరంబడుచున్నారు. బాలాదిత్యుండు పిఱికి పందకాండు. అతనివద్ద నింకను బూర్వపు ధైర్యసాహసములున్నవి. కాని పూర్వ మాతండు రాజధర్మములని భావించువిషయముల నిప్పు డట్లు తలంచుట లేదు. హైందవావనీశులు తమకార్యక్రమమున ముఖ్యమనిభావించు రణక్రీడ కాతం డిప్పు డిష్టపడుటలేదు. తప్పని సరియగుసమయము వచ్చినం దప్ప—అందును నాత్మసంరక్షణార్థముమాత్రము—యుద్ధప్రసక్తి తగదని యాతని యభిప్రాయము.

యశో:—అదికదా మఱి పిఱికితనము! జయము నిక్కువముగా దను నెపమిడి సుక్షత్రియుఁడగువాఁ డెవ్వఁడును యుద్ధమునకు వెనుదీయఁడు. అది యట్లుండఁగా, దిగ్విజయార్థమైనబవర మెట్లో, అట్లే స్వరక్షణార్థమైన సమరముకూడ సుక్షత్త్రియోచితకార్యములై యున్నవి. కాసారగనిర్మాణము, విద్యాప్రదానము మొదలైనవి రాజధర్మములైనపగిది, కిరాతుఁడగు విదేశీయునితోఁ బోరాడి మాతృభూమిని దుస్సహనరకవేదనలనుండి యుద్ధరించుటకూడఁ దన ధర్మమని భూమిపాలుఁడు భావింపవలయును. అనవసరముగాఁ దాను మాగధుల రక్తము ధారవోయనని బాలాదిత్యుఁ డుత్తరమిచ్చెఁగదా! స్వధర్మానుష్ఠానపరుఁ డగు ప్రభు వెన్నటికైన నట్లనునా? పౌరులభౌతికాభ్యుదయమును, మానసిక శక్తుల నభివృద్ధిపఱచుట తనధర్మమని గ్రహించినభూపాలుఁడు, వారిపౌరుషములఁ గాపాడుటకూడ తనవిధియని మఱువఁగూడదు. నీవేమనినను, పావము బాలాదిత్యుఁడు బౌద్ధుఁడైనతోడనే భీరువై పోయెను. నేఁటి మగధాధీశుఁడు నాబాల్యమిత్త్రుఁ డనుటకు నాకు సాహసము చాలకున్నది.

చారు:—ఆర్యపుత్రా! మీమాటల కడ్డుచెప్పుటకు నాకుఁ జింతగా నున్నది. బాలాదిత్యుఁడు పిఱికిపందకాఁడని మాఁటికి మమ్మాటికిఁ జెప్పఁగలను. నాఁడు సార్వభౌముఁడు మిన్నొరసి ప్రవహించుగంగానదియందు దూఁకి, మునిఁగిపోనుండిన యామునసిపాయిని గట్టుకుఁదెచ్చినాఁడని వింటిరి కదా? ఇది పిఱికితనమందురా? సాగరఘోషమును జెవుడ్పఱచు గంగాప్రవాహమునం దొక్కపెట్టున దూఁకుటకు భీరువునకుఁ గుండెలుండునా?

యశో.—ప్రేయసీ! బాలాదిత్యుఁడు వ్యక్తిపరముగాఁ బిఱికిపందయని నాయభిప్రాయముకాదు. భీకరుఁడగు భూమకునిఁజంపి, నాకుఁ బ్రాణదానమొనరించిననాఁటివలెనే, నేఁడుకూడ నాతఁడు సాహససంపదయందు ఎవరికైనఁ దీసిపోఁడని నాకుఁ దెలియును. కాని రాజపరముగాఁ జూచినయెడల నాతఁడు భీరువయ్యెనని చాటఁగలను. ఆతఁడు తనప్రజలప్రాణములఁ గాపాడుటకై యూరక దేవులాడుచుండెను. యుద్ధమనిన నాతఁడు సాధారణముగ

సేవించుకొనుచుండెను. ఆనాఁడు మిహిరగులుఁడు మరలఁ బోరునకురమ్మని వీరములుపలుకఁగా నాతఁ డేమనెను! "నీవు నారాజ్యమును ముట్టడించినఁ దప్ప, యుద్ధమొనరింప నాకిష్టములేదు. అప్పటికిఁగూడ నాచే నైనంతవఱకు నారాజ్యమును గాపాడుకొనఁగలను" అని యాతఁడు భీరుజనసమాజమగు నుత్తరమిచ్చెను. పాపము! ఆబాలాదిత్యుఁ డిప్పుడు బౌద్ధభిక్షువుల చేతి కీలుబొమ్మయై యున్నాఁడు. నలంద మొదలగువిశ్వవిద్యాలయముల సందర్శించుట, శాలువలు త్రప్పించుట, మతబోధకులను వివిధదేశములకు మతప్రచారముకొఱ కనుపుట, బీదలకు శరణాలయములు నిర్మించుట మున్నగుధర్మకార్యములయం దాతఁ డిప్పుడు మునిఁగి తేలుచున్నాఁడు. బౌద్ధసన్న్యాసులతోఁ, జైనసాధులతోఁ గలిసిమెలసి వర్తించుచున్నాఁడు. చతురంగబలముల సరిచూచుకొనుట విప్రుల గౌరవించుట యాతనియం దిప్పు డరుదైనవి. ఇఁక యాగములను దనరాజ్యముఁపు టెల్లలయం దొనరింపరాదని యాతఁడు కట్టుదిట్టములు గావించి యున్నాఁడు. పూర్వమువలెఁ బాటలీపుత్రమునందుఁ గుప్తరాజమందిరములలో నిప్పుడు వేదమంత్రములు వినఁబడవు. అశ్వఘోషపుధ్వానము నిప్పుడా స్థలమునకు దూరమైపోయినది. అహోహో! బాలాదిత్యుఁ డింత పాటులుపొత్తై నందుల కేమనుకొనవలయును.

వసంత:—భరతఖండమునుండి హూణులను దఱిమివేయుటకు మీరై మీరేల ప్రబలప్రయత్నము లొనరింపకైతిరి? ఇట్లడిగినందులకు దేవరవారు నన్నుఁ దయఁజూడవలయును.

యశో:—ఇందులకుఁ గారణము ప్రత్యక్షము. మొదటివిషయము: న్యాయముగా బాలాదిత్యునకు రావలసినసింహాసనము నాక్రమించుటకు నా కిష్టములేదు. బాలాదిత్యుఁడు హైందవనరేంద్రమండలిని విడిపోయినందున, నేనే యారాజమండలికి నాయకుఁడనై, యీపవిత్రసమరమున హూణుల నణఁచవచ్చునని యాశనొందితిని. కాని యిట్టిమహాకార్యమునఁ గృతకృత్యుఁడ నగుటకుఁ బెక్కులంతరాయములు నన్నుఁ దఱిమిచూచుచుండెను. ఏల

యున, బాలాదిత్యునకుఁ గలకీర్తిప్రతిష్ఠలు నాకులేవు. సముద్రగుప్త విక్రమాదిత్యవంశజు డగుభూకాంతుని నాయకత్వము నెందఱో రాజు లంగీకరింతురు గాని, మాళవమహాకోసలాధిపుఁడగు నాయాధిపత్యమును వారు సమ్మతింపరు. కుమారీదేవివంశజు నుద్ధరించి పూర్వసింహాసనము కెక్కించుటకనిన, రాజులందఱు నడుముకట్టి నిలుతురు. కాని మహాకోసలాధిపుఁడనగు నాకుఁ బరకీయములగు నుజ్జయినిని, ఉత్తరహిందూస్థానమును జయించుటకై సాయమొనరించువా రుండరు. అన్నింటికంటె ముఖ్యమగువిషయ మొకటికలదు. మహాకోసలకళింగాధినాథుఁడ నగునన్నుఁ జూచి యసూయపడుప్రభువు లెందఱో గలరు. నాపరాక్రమాభ్యున్నతికి వారెన్నఁటికేని సమ్మతింపరు. కాని గుప్తసార్వభౌముని ప్రతినిధినిఁ బ్రతిఘటించినిలుచుటకు వారెవ్వరికిఁగాని ప్రతిభయుండదు. కడపటివిషయము: ప్రస్తుతము హూణరాష్ట్రమునందలి ప్రజలకును, మాళవదేశీయులకును బాలాదిత్యునిపై భక్తి మెండు. ఇఁక నాపై వారికి విశ్వాసము లేదని నేను వేఱుగఁ జెప్పఁబనిలేదు. నేనిప్పుడు మహాకోసలకళింగములకు రాజునైయుండియు నీకారణములం జేసి హూణుల నణఁచివేయు ప్రయత్నము లొనరింప నశక్తుఁడనైయున్నాను. కాని యిప్పుడుమాత్రము గొప్పప్రయత్న మొనరింపవలయును. నానాఁటికి జరాభారము పైకొనుచున్నది; కాన నీమాఱు ప్రయత్నించినఁ గాని, మరలమరల బ్రయత్నించుటకుఁ గావలసినబలము చేకుఱదు. ఈయిరువదియెనిమిదేండ్లుగా మన మీపాడు ప్రతిబంధములవలనఁ బరితపించుచున్నాము. మగధమహాకోసలరాజ్యములు మాత్రము హూణునిదాడినుండి తప్పించుకొనియున్నవి. ఐన నేమి? ఉత్తరహిందూస్థానమంతయు హూణపదతాడనముల నలిగిపోవుచున్నదిగదా! కుట్టూపిరితోనుండు మందభాగ్యులవేదనారావములును, మానధనమునుఁబాసి కుయ్యిడుకన్యామణుల దీనదుఃఖాలాపములును, 'అకటా రాఘవేంద్రా!' అని యల్లాడు దరిద్రులవేఁడికోలులు, ఉజ్జయినీప్రభృతిప్రదేశములందు మిన్ను ముట్టుచున్నవిగదా!

చారు:—ఏకభటుఁడు నిన్న మనకేమి వినిపించెనో యెఱుంగరా? ఉదయానందుఁడు దమనిర్భాగ్యుని మిహిరగులుని పట్టలుపట్టలుగాఁ జీల్చి వేయించెనఁట! కమలాక్షవాసుదేవులు బంధితులగుచుండ నాతఁ డుదాసీనుఁడై యుండుటయే యాకఠోరశిక్షకు నేరమఁట!

వసం:—ఉదయానందుఁడు కాలధర్మమొందెనా? ఆతిండిపోతునకుఁ బరలోకమున నైనఁ గడుపునిండ నేయిదొరకు ననుకొందును.

ఈమాటకు వారు నవ్విరి.

యశో:—మంచిది. ఇదియే, నానిర్ధారణము. నేను వృద్ధుఁడ నగుచున్నాను. వ్రేపుచ్చుటకుఁ గాలవ్యవధి చాలదు. ఈపవిత్రభూమియందు హూణునకు నిలువ నీడలేనట్లు కడసారి ప్రయత్నింపవలయును. ఇందులకుఁ దెగువఁ బూనవలయును. గెలిచితినా సర్వశ్రేయము. ఓడితినా అదియే నాయాత్మసుఖంగాక! సుక్షత్రియునికో నిజాయని వీరస్వర్గమైన నావదఁగాని, పరాధీనుఁడనై కలాంబారుకోటనుఁ బిరిగిరాను. ఈపవిత్రసమరమున శ్రద్ధ వహించుటకై దైవానుగ్రహమున నాకిద్దఱు కుమారు లున్నారు. అమ్మా! నాయుద్యమమునకు నీవేమందువు?

మహా:—పట్టీ! వీరోచితములగు నీమాటలచే నాహృదయమూర్తి సంతోషభరితమై పొంగి పొరలిపోవుచున్నది. అమలాపురి మున్నగుస్వల్పభూభాగములనిమిత్తము హూణునితోఁ జీటికిమాటికి నీవు పోరాడుచు ప్రతిభాసామర్థ్యములను దుర్వినియోగ మొనరించుచుండుటను, నేఁగాంచి పలుమాఱు లోలోనఁ గుమిలిపోవుచున్నదానను. 'పరాక్రమోపేతుఁడగు శత్రువునకుఁ జిక్కనీయక, నాకుండురాజ్యమును నేను రక్షించుకొనినఁజాలును. తనకు మాలినధర్మము, మొదలు చెడ్డ బేరము కలదా' అని తృప్తిపడు రాజకీటకముల వలె నీవాడువేమో యని నేను భయపడుచుంటిని. కాని నేఁటికి నాభయము లన్నియుం నిరాధారములని యెఱుంగుట కెంతయుం సంతసముగానున్నది. ఇట్లుండియుం, నీవు హూణునితోఁ బోరాడి విజయశీలుఁడవు కమ్మని నిన్ను

నేను బుద్ధిగొల్పినదానఁగాను. ఏలయన, సోదరప్రభువు లెవ్వరుగాని నీకు సాయమొనరింపరనియు, నందుచే నీకపజయము నిక్కమనియు నాకుఁ దెలియును. నాయనా! తెలిసి తెలిసి వినాశవారాంనిధియందు నిన్ను నెట్టుటకు నీతల్లినగు నాకెట్లు బుద్ధిపుట్టును? కాని నీవు వీరోచితగుణగణభరితుఁడవని యెఱింగి నేనిప్పుడు ముదమొందుచున్నాను. అవును. యశోధర్మునఁబోలిన కుమారునిం గనినవారలకు మహామాయానంద మపారమై యుండునను టను సందియమేమి? ఇఁక నావీరమాతకుమారుఁడు గెలిచినను, ఓడినను ఒక్కటియే. స్వధర్మపరిరక్షణనిరతుఁడై, వైరి తనకన్న నెన్నియోవిధముల మిన్నయైనను లెక్కసేయక, వానితోఁ బోరాడినవీరుఁడు నాగర్భమున జనించినఁ జాలును. ఆహా! ఏమి నాభాగ్యము! ఏమి నాయదృష్టము. నిండుయౌవనమున నేనొందుచుండిన యుత్సాహము నేనిపు డనుభవించుచున్నాను.

"ప్రేయసీ! ఈవిషయమున నీయభిప్రాయమేమి?" అని యశోధర్మ చారుమతి నడిగెను

చారు:—దేవిగారియభిప్రాయము నాకు సమ్మతమైయున్నది. నిజము చెప్పవలయుననిన, నామాతృభూమి యవస్థను నేను రాత్రింబవళ్లు కుందుచునేయున్నాను. కవీశ్వరుల కాలవాలమును, ప్రఖ్యాత జ్యోతిశ్శాస్త్రజ్ఞులకుఁ బుట్టినిల్లును, మహాజ్ఞానులకు టెంకియు, అసదృశశిల్పికారులకు నివాసమును, అసమానవీరులకు బిడారును నగు మన యీభరతఖండ మిన్నివత్సరములుగాఁ గిరాతుఁడగు విదేశీయుని పాదముల క్రింద నణఁగిమణఁగి యుండుట, భారతీయులమగు మనయందించుకేనియు త్యాగబుద్ధి లేమిం జేసియేకదా! మన కొకపూటభోజనముమాత్ర ముండినఁజాలును. ఎట్టులో యొకట్టుల మనకుఁ గడుపునిండఁగూడును, కంటినిండనిద్రయు లభించుచుండినఁజాలును. రానురాను మనము మామిడిక్రిందిసోమరులమై మనుపీనుఁగులమైతిమి. ఆహా! పూజ్యమగు నీవేదభూమి నానాఁటికి క్షీణించి పోవుచున్నదిగదా! దీని కింక మంచిదినములు లేనట్లున్నవి. ఇట్లనుకొనువారు

దంతయుం నాహృదయము ప్రీతిచెందెను. నాచిత్తము శోకాంధకార బంధుర మగుచుండెను. ఒకనాఁడు మనకుఱ్ఱవాఁడు చంద్రభానుఁడు నన్నుఁ గాంచి "అమ్మా! ఆమ్లేచ్ఛుఁడు మిహిరగులుఁడు, అమలాపురినిఁ బలుమారు ముట్టడించుచుండెఁగదా! మాబాబు కూడ నాని రాజధానియగు నుజ్జయినీ పట్టణము నేల ముట్టడింపఁగూడదు?" అని యడిగెను. అందులకు నేను "నాయనా! ఆమ్లేచ్ఛుఁడు పరాక్రమశాలిసుమా!" అని యంటిని. వాఁడందులకు నిర్లక్ష్యముగా "అయిన నేమి? నేనును, నరసింహుఁడును పెద్దయగు వఱకుండుఁడు. అప్పుడు మే ముజ్జయినికిఁ బోయి, కృష్ణుఁడు కంసునివధించిన విధమున, మిహిరగులునిఁ జంపెదము. మాబాబు, యీమిహిరగులుని వీని రాణువనుఁజూచి భీతిల్లినాఁడుకాఁబోలు! కాని మేముమాత్రము జంకుట లేదు" అని పలికెను. ఆకుఱ్ఱవాని తొక్కుపలుకులు నాకుఁ జాలదినములు వేదనఁ గలిగించుచుండినవి. ఇప్పుడు తమరు పలికిన యాధీరవాక్యములు నాకపారమగుసంతోషము నిచ్చినవి. వీరమాతయగు దేవిగౌరివలె, వీరపత్నినగు నేనిపుడు దివ్యానంద మనుభవించుచున్నదానను. మనోహరా! మీరు నేఁడు తలఁపెట్టినమహాకార్యమున కంతరాయము లుండకపోవును.. సత్యము. మీరు కృతకృత్యులగులోపున లెక్కలేనియాపదలకు లోనుగావలసియుండును. కాని యిట్టిపూజ్యమగుకార్యము సాధింపఁబూను మానవోత్తము లరుదుగా నుందురు. ఇందులకుఁ బర్యవసాన మేమైననగుఁగాక! నేఁటి యీసద్ధారణమున కెన్నటికిఁగాని వగవఁబోను.

యశో:—వసంతా! దీనికి నీవేమందువు?

వసంత:—దేవా! నేను మీకు యోజనఁ జెప్పఁగలంతదాననా! మహారాణులు మహామాయాచారుమతుల సముచితాభిప్రాయములను నేను విని, విభ్రమాశ్చర్యములఁ బొందితిని. నేనుత్తమవీరవంశసంభూతఁగాను. ఈరాణులఁబోలె నాహృదయ ముద్వేగపూరితమగుట లేదు. మీరు నేఁడు సాధింపఁబూనిన కార్యమున కంతరాయము లుండునేమో యనియుం, దుర్భరములగు

కష్టముల నెదుర్కొనవలసియుండుననియు నేను భీతిల్లుచున్నదానను. కాని యీ హైందవధరాధీశులు సందిగ్ధసమయముల మీయెడఁ గృతఘ్నులు కాదురనిమాత్రము నేను నిశ్చయముగా మనవిచేయఁగలను. ఎంతో కాలము మీరు కష్టముల నోర్చుకొని హైందవనరేంద్రమండలిని స్థాపించితిరి కదా! అసూయావిద్రోహము లామండలికి వేరుపురుఁగులై, దాని నొక్కనిమిషములోఁ గూల్చివేయకపోవు. మీరు హూణునితోఁ బోరాడి, వానిని రూపుమాప మనఃస్ఫూర్తిగాఁ దలంచియున్నయెడల, మీకు నేనొకటి యుపదేశింతును. సాధ్యమైనంతవఱకుఁ బరాధీనులరై యుండకుఁడు. ఏలయన, సమయాసమయము లవిచారింపక, వారు మిమ్ము విడనాడఁగలరు. మీరా ఊపలన్నింటిని యుద్ధమున కాయత్తపఱుపుఁడు. మీ ప్రజలనందఱను, వీరావేశపరులఁ గావించి, మీవలెనే వారుకూడ యుద్ధమునకు నడుముకట్టి నిలుచునట్లు చేయుఁడు. పనిపాటలులేక గోళ్లుగిల్లుకొనుచుఁ గూర్చుండియుండు ప్రజలను మీపటాలములోఁ జేర్చుకొనుఁడు. మీదేశమును గాపాడుకొనవలయుననిన, మీసంఘమును నిలుపుకొనవలయుననిన, మీమతమును బోషించుకొనవలయుననిన, మీరు హూణునితోఁ బోరాడక విధిలేదని వారికి బోధింపుఁడు. మీమంత్రులను, మీసైనికులను మీరు నమ్మినట్లే నటించుచు, లోలోన వారిని విశ్వసింపకుండవలయును. మానవుఁడు ధనమునకు దాసుఁడు. ఇట్టిసమయముల వారు ధనమున కమ్ముడువోవుట సర్వసాధారణము. చాతుర్వర్ణ్యములను మీరు మీసైన్యములఁ జేర్చుకొండు. దాన నగు నగౌరవ మేమియులేదు. చాతుర్వర్ణ్యసముద్ధరణమునకుఁగదా మీరిట్లు సమరమునకుఁ గడంగుట! కాన మీకు సాయమొనరించుటకై నాలుఁగుజాతులవారి నేల పిలువరాదు? మీప్రజలకు స్వయంసాహాయ్యసూత్రములఁ గఱపుఁడు. నాయకుఁడులేకున్నను బోరొనరించువిధమును వారికి నేర్పవలయును. కర్ణధారుఁడుపడిపోయినను, నౌక పోవుచునే యుండవలయును. ఇట్టి ప్రజలోత్సాహముండిననే యీమహాకార్యము ఫలోన్ముఖమగును. నామట్టుకు నే

నొప్పటివలెనే, మీ కార్యసానుకూలతకు నాచే నైనంతసాయ మొనరింప నంసిద్ధురాలనై యున్నాను.

యశో:—అయిన మంచిది. ఈవిషయమున మీరందఱ నేకాభిప్రాయులై యున్నారు. కాన రేపటినుండియే నేఁటి యీనిర్ధారణమును గార్య రూపమునఁ బెట్టెదను. అమ్మా! సందేశవాహులను నలుమూలలకుఁ బంపుట యుక్తమని నీవు తలంపవా?

మహా:—అవును. అది మిగుల నవసరము. అప్పు డేధరణీశుఁడైన సైన్యములోడను, ధనములోడను నీకు సాయమొనరింపరాకపోయినను, నీ కాయబారములవలన, నీ యీమహాకార్యము స్వీయపరాక్రమప్రదర్శనము కొఱకును స్వకులౌన్నత్యప్రకటనముకొఱకును గాదనియు, మఱిదుర్భరాపదలఁ బడి మ్రగ్గు మాతృదేశము నుద్ధరించుకొఱకనియు దెల్లడియగును. నీ విట్లొనరించినయెడల, నీ దేశమునంగల యసంఖ్యాకవసుమతీశులలోఁ గొందఱైన నీకు బాసటయై నిలిచిన నిలువవచ్చును.

యశో:—మంచిది. నాపటాలములపై నేను బూర్తిగ నాధారపడి యుండెదను. వసంతయుపదేశానుసారముగా, నాప్రజలకు నీవిషయమును గూర్చి బోధించెదను. కాళింగులకు వారిరాణి చారుమతి బోధించును. మహాకోసలులకు మహామాయయు నేనును ప్రబోధించెదము.

చారు:—కళింగమునందు నేను గృతకృత్యురాలనైనయనంతరము నేను నాచెలి సరస్వతికడకుఁ బోయెదను. పోయి, యీమెపతి మనకుఁ గొంత వఱకైన సాయమొనరించునట్లు చేయవలయునని యామెను బ్రార్థించెదను.

యశో:—వానిసాయము మనకువలదు.

చారు:—అట్లనకుఁడు. వీసమంతసాయమునైన, మీరు నిరసింపరాదు. మీరిప్పట్టున నార్యజాతినాగరకతకుఁ బోషకకర్తలై వ్యవహరించుచున్నారలు గదా! మహాకోసలాధీశునిదురహంకారము, ఆర్యులసదుద్యమమును నాశ మొనరించిన దనునపకీర్తి రాకుండుఁగాక! హైందవరాజ్యరత్నహారమునందు

మగధరాజ్యము, నాయకమణివంటిది. అట్టిరాజ్యమును మనము త్రోసిపుచ్చఁ గూడదు. ఒక్కొక్కరినిడాసి, వారు గావించుసాయ మెంతస్వల్పమైనను దానిఁ గైకొనుట మనకు విధియైయున్నది.

యశో:—నిజమే. కాని యాబాలాదిత్యుఁడిదివఱకే నాకుసాహాయ్య మొనరింపఁ దిరస్కరించియున్నాఁడుగదా! మరల నాతనిఁ బ్రార్థించుట నిరుప యోగముసుమా!

చారు:—ఇంకొకమాఱుకూడఁ దిరస్కరించినఁ దిరస్కరింపనిండు. ఈ పదునైదేండ్లలో నాతనిపైఖరి మాఱినదేమో, యెవరికేమితెలియును? ఎట్లు ఉనసేమి? నన్నుఁ బ్రయత్నింపనిండు. ఆర్యులయభ్యుదయమున కద్భుతగుణ పట్టుల, మీరు మీయభిమానమును దిగమ్రింగుచుండవలయును. స్వకీయాభి ప్రాయములకు, స్వాభిమానమునకు, కారుణ్యమునకు, కయ్యమునకు సిపవిత్రో ద్యమమునఁ జోటుండఁగూడదు.

మహా:—చారుమతియభిప్రాయము నాకుఁ బరమసమ్మతము. బాలా దిత్యుఁడిప్పుడు పూర్వాభిప్రాయమును మార్చుకొనియుండఁడా? ఎట్టులో యొకట్టుల గుప్తవంశజుఁడు కూడ నీయుద్ధమునఁ బాల్గొనినయెడల మాహాణ హైందవసమరమునందు మనకగువిజయము నాకు రెండంతలు సంతసము నీయఁగలదు. మీఁదు మిక్కిలి కామరూపదేశీయు లిపుడు మాగధులయుదు గుల నడుచుచున్నారు. కుమారా! మనపటాలమునఁ జేరుభటుఁ డొక్కొ క్కఁడు, మనవిజయసౌధారోహణమున కొక్కొక్కసోపానమువంటివాఁడని గ్రహింపుము. ఎంతకొద్దిసాయమైనను సరియే; మన మద్దాని దిరస్కరించు స్థితియందులేము. ఉండినను తిరస్కరింపఁగూడదు. రాజులందఱి నడుగుటలో మనకగు నవమాన మేమియులేదు. కడకు శత్రుప్రభువులుసైతము 'హైందవ నరేంద్రమండలి' యందు సభ్యులుగాఁ జేరుటకు పిలుండవలయును. వారికట్టి యర్హత యుండఁజనును. నేఁడు మన మాతృదేశమున కట్టిపట్టువిడువు

లుండక విధిలేకున్నది. ఇట్టిసందిగ్ధసమయములందు మిగుల మెలఁకువతో నడుచుకోవలయును.

యశో:—మఱి నరేంద్రమండలి కధ్యక్షుఁ డెవఁడు?

చారు:—సాహసాంకుఁ డధ్యక్షుఁడైయుండఁజనును. అది యటుండ నీయుద్యమమునకు శంఖుస్థాపనఁ గావించినవారలు మీరేకదా! ఇఁక మీ రధ్యక్షస్థానము నాక్రమించుట కెవ రాటంకపఱతురు? దాని కధికారులు మీరేకదా?

యశో:—ఒకవేళ బాలాదిత్యుఁడు నానాయకత్వమున కధిక్షేపించిన?

చారు:—ఈకార్యమున నాతఁడుకూడ సర్వశక్తుల వినియోగించినఁ దప్ప, నాతనియాక్షేపణలు న్యాయహీనములగును. అతఁడు సాయమొనరించినయెడల, మీతో సమానముగ నరేంద్రమండలికి నాయకుఁడై మీతో సమానముగ సర్వకార్యములకు నుత్తరవాదియై యుండును. మీయాక్షేపణలకుఁ దగినన్ని కారణములు నాకగపడవు.

యశో:—ఏమియులేవు. కాని యాతఁడు శక్తివంచనఁజేయక సాయమొనరించి, సాయమొనరించుటయేగాక స్వయముగ రథాంగణమున కరుదెంచినఁదప్ప, నాతోసమముగ నాయకత్వమును వహించుట కధికారముఁ గలిగియుండఁడు.

చారు:—మంచిది. దాని నట్లుండనిండు. నానాదేశాధీశులకడకుఁ బంపుటకు మీవద్ద నిపుణమతులగు దూతలున్నారా?

యశో:—లేదు. ఒకరిద్దఱుమాత్ర మున్నారు.

"అయిన మంచిది. కళింగమునందుఁ బ్రవీణులగుదూత లున్నారు. వారిలో ముప్పదిమంది నీకార్యమునకై యేర్పరించెదను" అని చారుమతి నవ్వుచు వసంతను "సుభాషిణీ! నీవు పాటలీపుత్రమునకుఁబోయి, నేవచ్చులోపల నీకార్యమునకు సరస్వలివి సిద్ధపఱిచియుంచెదవా!" అని యడిగెను.

వసంత:—చిత్రము.

చారు:—రేపే నేను కళింగమునకు బయలుదేఱెదను. నీవుకూడఁ బాటలీపుత్రమునకుఁ బ్రయాణము కావలయును. మనకుఱ్ఱలలో నొక్కని నా వెంటఁ గొంపోవుదునా?

మహా:—చంద్రభానుం దోడ్కొనిపొమ్ము. నరసింహుఁడిచట వాని బాబుగారి కుపకరించుచుండును. చంద్రభానునిపైఁ గళింగులకు మిక్కిలి మక్కువయని నీవనుచుందువుగదా! ఓహో! వారుగో ముద్దుబిడ్డలు. వానలో దప్పతడిసి తడిముద్దలై వచ్చుచున్నారు.

ఇంతలోఁ జంద్రభానుం డచటికిఁ బరుగెత్తివచ్చి మహామాయ పైకిఁ బ్రాఁకుచు "అవ్వా! నీవనినదేమి?" అని యడిగెను.

మహా:—చంద్రీ! రేపు నీవు మీయమ్మతోఁ గూడఁ గళింగపట్టణమునకుఁ బోవుదువు.

ఆమాటలకుఁ జంద్రభానుఁడు కిలకిలనవ్వుచు "కళింగమునకా! కళింగమునకా! లలితా! లలితా! నేను కళింగమునకు బోయెదను. నరసింహా! నేను రేపు కళింగమునకుఁ బోయెదను" అని చిందులువేయసాగెను.

అందులకు నరసింహుఁడు మహామాయను మురిపెముగాఁ గొట్టుచు "ఓముసలియవ్వా! నాసంగతియేమి? నేనుగూడఁ గళింగమునకుఁబోనా?" అని మకురుచేయసాగెను.

మహా:—నాయనా! మీబాబు మిహిరగులునితో యుద్ధమొనరింప నున్నాఁడు. నీవిచటనేయుండి మీబాబుకు సాయమొనరింపఁ బ్రజల కుపదేశింపవలయును.

నరసింహుఁ డందులకు నవ్వుచు "బళిబళి! అయిన నిక్కడనే యుండెదను. మహాకోసలమందే యుండెదను" అని పలికెను.

చంద్ర:—అవ్వా! నేఁగూడ హూణునితోఁ బోరెదను. నేను కళింగమునకుఁబోయిన, హూణునితోఁ బోరాడుటెట్లు?

వారితొక్కుడుంబలుకులకు మహామాయ మురియుచు "నాయనా! నీవును హూణునితో యుద్ధము చేయుటకే పోవుచున్నావు. దానికి గళింగులఁ బురికొల్పుటకై నీవును మీయమ్మయుఁ బోవుచున్నారు.

చంద్ర:—బళిబళి! అయిన నేఁబోయెదను.

ఇంతసేపుగా లలిత చారుమతియొడిలోఁ గూర్చుండి కన్నీరుమున్నీరుగా వెక్కివెక్కి యేడ్చుచుండెను. చారుమతి యాబాలను బుజ్జగించుచు "లలితా! లలితా! నీకేమి కావలయును?" అని యడిగెను.

లలిత:—నేఁగూడఁ గళింగమునకు వచ్చెదను. నీవు చంద్రభానుని మాత్రము తీసికొనిపోయెదవని, మాయవ్వ చెప్పుచున్నది.

చారు:—అమ్మా! నిన్నుఁగూడఁ బిలుచుకొనిపోయెదను. ఏడువకుము.

చిన్నికనులనుండి బొటబొట నీటిబొట్టులు క్రిందఁబడుచున్నను, ఆ బాలిక పకపకనవ్వుచు యశోధర్మను కౌఁగిలించుకొని "బాబూ! నీతోడను మాయమ్మతోడను నేఁగూడఁ గళింగమునకువచ్చెదను" అనెను.

యశో:—తల్లీ! నేనిక్కడనేయుందును. మీయమ్మయే పోవును.

లలిత:—నేను నీతో నుందును. అమ్మతోఁబోదును. ఇది యెట్లు సాధ్యము! ఓబాబూ! నీవి కొక త్రోవఁజూపవా?

యశో:—రావమ్మా! రా! చెప్పెదనురా!

అని యాతఁడాబాలిక నెత్తుకొని లోనికిఁ బోయెను. అతనివెనుక నందఱు పోయిరి. నరసింహుఁ డవ్వచేతిని, చంద్రభానుఁ డమ్మచేతినిఁబట్టుకొని పోయిరి.

వసంత:—ఈబిడ్డలు వానయందుఁ దడిసి ముద్దలైయున్నారు. వారు కట్టుకొనుటకుఁ బొడిగుడ్డలు తెచ్చెదను.

లలిత:—బాబూ! వసంత యేయూరికిఁబోవును?

యశో:—పాటలీపుత్రమునకు.

లలిత:—అట్లయినఁ బాటలీపుత్రమునకు నేఁగూడఁబోవలయును. ఓ బాబూ! నాకుఁ జెప్పుము. నేను మాయమ్మతోఁ గళింగమునకుఁబోవలయును. వసంతతోఁ బాటలీపుత్రమునకుఁ బోవలయును. నీతోఁ గలాంజారునం దుండ వలయును. దీని కుపాయమేమి?

వసంత ముసిముసినవ్వులు నవ్వుచు "లలితా! నేఁజెప్పెదరమ్ము" అని తప్పతడిసియుండు నాబాలను యశోధర్మవద్దనుండి తీసికొనెను. పిదప వా రందఱు అంతిపురికిఁబోయిరి.

# ఇరువదితొమ్మిదవతరంగము.

## కళింగమగధరాజ్యములు—సమరసన్నాహములు.

అమరావతీనగరవాసులందఱును రాజసౌధము ముంగలనుండు ప్రాంగణమున గుమిగూడియుండిరి. వారియుత్సాహము వర్ణనాతీతమైయుండెను. రాజకుమారి చారుమతి యుపన్యసించుననియు, గానకారులందఱు రావలయుననియు, రాజభటులు నగరమంతయుఁ జాటించిరి. ఉదయమే మునుగంటలకు సభ కూడనుండెను. అంతకుమున్నే పౌరులు తండోపతండములుగా నరుదెంచి కార్యక్రమారంభమున కెదురుచూచుచుఁ గూర్చుండియుండిరి.

"రాణిగారు మనలఁ బిలిపించుటేల! నీకేమైనఁ దెలియునా?" అని యొకపౌరుఁడు వేఱొకని నడిగెను.

"స్వదేశ, స్వమత, స్వధర్మసంరక్షణార్థమై హూణులతోఁ బోరాడుట ముఖ్యమని, రాణిగారు కళింగపట్టణమున జనుల కుపన్యసించినారఁట. మన యశోధర్మమహారాజుగారు, హైందవనరేంద్రమండలి కధినాయకులుగా నున్నారు. పవిత్రతమమగు నీమహాకార్యమునకు విత్తమునిచ్చియు, భటుల నంపియు, సర్వవిధముల సాయమొనరింపవలయునని మనకుఁ బ్రబోధించుటకై మహారాణిగారు సొంతముగా విచ్చేసియున్నారు" అని రెండవపౌరుఁ డనెను.

మొదటివాఁడు:—మహారాణికి మనసాయమేల! ఆమెకనుసన్నల మెలఁగుట కపారమగుచతురంగబలమును నౌకాబలమును గళింగదేశమం దున్నవి కదా! కళింగరాజకోశాగారములం దిసుకపాతరలవలె ధనరాసులున్నవి.

ఆరాణి మంత్రిమండలిని లోఁబఱుచుకొనినఁజాలును. అప్పు డంతయు నామె యధీనమగును.

రెండవవాఁడు:—అవును. అంతలో మనరాణి యూరకుండుటలేదు. ఈస్వాతంత్ర్యసమరమునఁ బాల్గొనఁ, గళింగులను వీరోన్మత్తులఁ గావింపవలయునని యామె పట్టుపట్టియున్నది.

మొదటివాఁడు:—కళింగులకు హూణులతోఁ దలపడవలసినంత యవసర మేమివచ్చినది? దండయాత్రలవలనిభీతి మనదేశమునకులేదు. ఒకవేళ హూణులు మనదేశమును ముట్టడించినయెడల వారిని జీకొనుటకుఁ గావలసినంతవ్యవధి మనకుండును. అంతవఱకు మనము కడుపులోనిచల్ల కదలకయుండవచ్చును. లేనిపోనిప్రసక్తి మన కేల?

మూడవవాఁడు:—హూణులు మనదేశమును రేపే ముట్టడింతు రేమో? ఏదికాని నీ కెట్లు తెలియును?

మొదటివాఁడు:—వారు కళింగమునుజేరుటకుముందు, మహాకోసలమును దాఁటిరావలయును. హూణదండయాత్రకు మనయశోధర్మమహారాజే కారణమని నాయభిప్రాయము. ఆతఁడు రేయింబవళ్లు హూణుల నణఁచివేయుటకై యోజించుచుండును. ఆతఁ డాత్మవంశప్రతిష్ఠను బెంపొందింపఁ బ్రయత్నించుటం జేసియే, యిట్టికష్టములు కలుగుచున్నవి. ఇట్లు కళింగము నానాఁటికి మహాకోసలము చేతి కీలుబొమ్మ యగుచున్నది.

నాల్గవవాఁడు:—మిత్రమా! యశోధర్మ మహాకోసలమునందే హూణుల నడ్డగించుటఁబట్టి, వారు మనకళింగముపైఁబడరని నీయభిప్రాయము కాఁబోలు. ఒకవేళ నాతఁడు పరాభూతుఁడైనచో, మనకళింగమున కెట్టిగతి పట్టునదియు నీకే తెలియును.

మొదటివాఁడు:—అప్పుడు మేము నిద్రాహారములమాని, సర్వబలముల సమకూర్చుకొనమా!

నాల్గవవాఁడు:—(నవ్వుచు) అవునవును. ఇల్లుకాలుచుండ బావి త్రవ్వువానిలో నీవొకఁడవు.

ఐదవవాఁడు:—వద్దువద్దు. మహారాణిగారు విచ్చేసినారు. మహారాణిగారు విచ్చేసినారు.

అందఱు తాళ్వారమువైపు చూచిరి. అచట మహారాణి చారుమతీదేవి నిలిచియుండెను. ఆమె కిరుకెలంకులఁ జంద్రభానుఁడు లలిత నిలిచియుండిరి. మహారాణివదనము గంభీరమై లావణ్యరసమును వెదఁజల్లుచుండెను. పౌరులందఱామెకు విధేయులై యుండిరి. 'జయజయమహారాణీ!' అని జయజయారావములు రోదసీకుహరము నిండెను. చారుమతి వినయోత్తమాంగయై యభిమానపూర్వకముగ వారివందనము లందుకొనెను. అంతట నామె యుపన్యసింప మొదలిడెను. ఆమె కంఠస్వరము మందమైయున్నను, స్ఫుటముగానుండెను. అంతకుముందు శబ్దమొనరించుచుండిన జను లిప్పుడు మాటలుడిగిరి. చారుమతి యుపన్యాసమును, వాక్యమునకు వాక్యమునందుకొని యంతఃపుర వైతాళికుఁడు బిగ్గఱగా నఱచుచుండెను. దూరముననుండు మనుష్యులకొఱ కిట్టి యేర్పాటు కావింపఁబడెను. చారుమతి యీవిధముగ నుపన్యసింపసాగెను.

"నాయనుఁగుబిడ్డలారా! కళింగులారా! రాజభక్తియుతులగు నాకళింగులమధ్యకు నేఁడు మరల రాఁగలిగితినని, నాయానంద మమందమైయున్నది. ('జయజయమహారాణీ' అను హర్షధ్వనులు) నేఁడు మీరు నన్నుఁజూచి యానందించుచుండుటకు నాకుఁగూడ బ్రమోదముగానున్నది. ఒకానొకవిషయమును మనసునందుంచుకొని, నేఁడు మీకడ కరుదెంచితిని. నాకువలెనే నాయభిప్రాయము మీకుఁగూడఁ బరమసమ్మతమైయుండునని నాకుఁ దెలియును. ఈపుణ్యభూమిని పఠాణుని బాఱినుండి విడిపింప నే నుత్సహించుచున్నాను. ఇదియే నానిశ్చితాభిప్రాయము. ('జయజయమహారాణీ' అను హర్షధ్వనులు.) వీరావేశులగు మిమ్ములఁజూచి నాహృదయ ముప్పొంగుచున్నది. కాని మీ రిట్టిసజ్జనులని నాకింతకుముందే తెలియును. నాకళింగులను నాకుఁ దెలియును.

('జయజయమహారాణీ' అను హార్షధ్వనులు) పవిత్రమగు కళింగదేశమునఁ బుట్టిపెరిఁగిన నాకు హూణునివలన నార్యావర్త మొందుకష్టములఁ దలంచు కొనినపు డంతయుం నెత్తు రుడికిపోవుచుండును."

"మానెత్తురుకూడ నుడుకుచున్నది" అని పౌరుఁ డొకఁడనెను.

"అవును. అది సామాన్యమేకదా! అట్లేకదా యుండవలయును! మీరు కళింగులుకదా! మీ రీపుణ్యభూమియందుఁ బుట్టి పెరిఁగినవారుకదా! అట్టియెడ నాకుఁబోలె మీనెత్తురుకూడ నుడుకుచున్నదనుటలో నాశ్చర్య మేమి? మనయార్యావర్తము హూణునిచేతఁ బడునవస్థలఁ దలఁచుకొనునపు డంతయుం బాలుఁడైనను, మీరాజకుమారుఁ డీచంద్రభానునిరక్తము మఱిఁగి పోవుచుండును."

"నానెత్తురు కాఁగుచున్నది. మిహిరగులుని నేనుఁ జంపువఱకది కాఁగుచునేయుండును" అని యాబాలుఁడు చంద్రభానుఁ డఱచెను. ('కళింగుఁడు చంద్రభానుఁడు చిరంజీవియగుఁగాక! మారాజకుమారుఁడు వర్ధిల్లుఁగాక!' అను హార్షధ్వనులు.)

"లలిత నెత్తురుసైత ముడికిపోవుచున్నది. హూణులు పెట్టుహింస లంతనీచములై దుస్సహములై యున్నవి. మనము కళింగులముమాత్ర మార్యోత్తములమనియుం, నార్యమతసీతులకు మనము పోషణకర్తలమనియుం నింత కాలముగా భావించుచున్నాముగదా! కాని యీనలువదివత్సరములుగా మనకు బ్రియమగు నార్యధర్మము మ్లేచ్ఛులకుఁజిక్కి క్షీణించుచుండ నితరుల వలె మనముకూడ, మనలఁ బైకొనివచ్చువినాశము 'నెఱుంగక మత్తులో నున్నాము. విశ్వవిఖ్యాతమగు గుప్తసామ్రాజ్యమును హూణుఁ డాక్రమించిన తఱి, కళింగము కదలక మెదలక మొద్దువలెయుండెను. ఆతట నల్పరాజుల వంతువచ్చెను. హూణవిజయోదంతములును, హైందవపరాజయవృత్తాంత ములును నాభావోద్యానముపాలిటిపరశువులై నాయాశాంకూరముల నను దినముఁ గొట్టివేయుచున్నవి. ఉదయాదిత్యునిఁజూచుటకైన నాకు లజ్జగా

నున్నది. (ఆమెయొట్టయెదుటఁ బొమ్ముపుఁ గొండపైనెక్కుచుండు బాల సూర్యుఁ జూచెను.) ఏలయన, భారతదేశ మొందుదురవస్థల కాతఁడు నన్ను నిందించుచున్నట్లున్నాఁడు. తమసంతతివారమని విఖ్యాతిగురాజులు సంఘీభావబద్ధులై యాత్మవిరోధి నెదిరింప సమకట్టిరో లేదో యని కింపురుషుల యందము సూర్యచంద్రులు మిగుల నాతురముతోఁ జూచుచుందురు. అన్నన్నా! కాని వారి కాశాభంగముగాక మఱేమున్నది! ఆర్యావర్తము యొక్కయు, నార్యధర్మముయొక్కయు విశుద్ధమూర్తులఁ బిలకించి సంతసించుటకుమారుగ నాదేవులు, నిషాదులగువిదేశజుఁ పుజ్జగింవకసమునందు సింహాపీఠిం గూర్చుండి కట్టాకిరిలో నుంచునార్యమాతపై గొందుబాముటఁ గాంచి నిట్టూర్పులుచ్చుచుందురు. ఈవిధమున నికఁ గొంతకాల ముండినచో, సూర్యచంద్రు లిద్దఱును మనదేశమునకు వచ్చుట మాని యొక్కమాఱుగా నీభగతవర్షమును గాఢాంధకారసముద్రమున ముంచివైతురు. కష్టములు కాపురముసేయవని మానవ లెంత యూతలు నెఱిచినను, దేవతలట్లుంచరు. ఇప్పుడు మనము భగవదవతారమునకు నెదురుచూడవలెను. భవిష్యదవతారమునకు నింకను నెంతయో వ్యవధి గలదున్నది. 'కలౌభక్తిః' అన వినలేదా? మానవు డీకలికాలమున భక్తినౌక నెక్కి కష్టసముద్రములను దాఁటవలయును. కృత, త్రేతా, ద్వాపరయుగములందువలె బరమేశ్వరుఁడు శరీరధారియై యిపుడు మనకు సాయమొనరింపరాఁడు. ఆయుగములనాఁటి ప్రజలు నిష్కళంకులు. అవతారపురుషులు తమతోఁ గలిసిమెలిసియున్నను, వారి నాకాలపువారు గౌరవించి పూజించుచుండెడివారు. కాని యీకలియుగమున దైవము మనుష్యావతారమున విచ్చేసినయెడల, ప్రజ లాతని నిరాదరణ మొనరింతురు. అవమానపఱుతురు. కాన మనప్రయత్నములన్నియు నిమిత్తమాత్రములని గ్రహించి, దైవమె యేమగడ యని నమ్మి, మన మాతనిపై నాధారపడియుండవలయును. ఆర్యమాతను సంరక్షించుటకుఁ గాని, ఆర్యధర్మముల నుద్ధరించుటకుఁగాని మనము కళింగుల 'మింతవఱ

కేమియుఁ గావింపమైతిమి. ఎన్నఁడో యొకనాఁడు మనము బాలాదిత్యునకును, మన ప్రభువునకును సాయపడి, పాటలీపుత్రయుద్ధమున హూణుల నోడించితిమి కాఁబోలు! కాని యాతఁడో మనసాహాయ్యము తృణాగ్నివలెఁ దృటిలో మాయమైనది. క్షుద్రములగు నీర్ష్యలు, నీచములగు విరోధములు, వీనిచే నార్యుల బుద్ధిబలము మాసిపోవ, నామహాకార్యము విస్మృతపదము లయ్యెను. ఈ మనపాపకర్మములఁ గాంచి మనశాత్రవుఁడు దుష్టసింహాసనమునుండి పకపకనవ్వుచుఁ బంకఁ దెలుపవై చుచున్నాఁడు. ఆర్యమాత నిరాశతో వగలఁ బొగలుచున్నది. ఆర్యులహీనదశను దేవతలు వెలిఁగొంది ముక్కుపై వ్రేలిడుకొని యున్నారు. ఈమహాకార్యమునకు మహారాజు చాల శ్రద్ధఁబూని యున్నాఁడు. కాని యింతకు నొక్కఁడేమి చేయఁగలఁడు? ఈమారు హూణులనోడింప సర్వవిధములఁ బ్రయత్నించుటకు నిర్ధారించుకొంటిమి. ఇపులకు నలుమూలల దూతలఁబంపితిమి. మీతోఁ గలిసి యోచింపకయే, కళింగసైన్యమును కళింగనావాబలమును, కళింగకోశాగారమును నుపయోగించుకొను విషయము నిర్ణయించి యుండెడివారము. అది మంచిమార్గ మనియు నాకు సూచింపఁబడెను. కాని 'యవ్విధానపించుట రాజభక్తి సమేతులగు కళింగులయెడ మనము ద్రోహము చేసిన ట్లగును; ఆర్యమాత పాదపద్మములకుఁ బ్రాణకుసుమములఁ బూజసల్పుటకు వారికిఁగల యధికారమును మనము నిరాకరించిన ట్లగును.' అని యాసూచనలను నేఁ బెడచెవిఁ బెట్టితిని. ('మహారాణి చిరంజీవి యగుఁగాక' అను హర్షధ్వనులు) ఓకళింగులారా! పూజ్యమగు నీసముద్యమమునకు శక్తివంచన చేయక మీరు సాయ మొనరింప మిమ్ముఁ బ్రబోధించుటకును, కళింగులపైఁ దనకుఁ గలవాత్సల్యము నిశ్చలమైనదని నొక్కిచెప్పుటకును మీమహారాజు యశోధర్మ నన్ను మీకడకుఁ బంపియున్నాఁడు. ('మహారాజు వర్ధిల్లుఁగాక') అను హర్షధ్వనులు.) పవిత్రమగు నీసమరమునకై యాతఁ డెల్లవేళల సన్నాహము లొనరించుచున్నాఁడు. కాన నాగరకతాసముద్ధరణమున కగునీయుద్ధము

కావున మీరుకూడ నడుముకట్టి నిలిచియున్నారనియుం, మీరాజభక్తి నిశ్చలమై, నిష్కళంకమై, నిరుపమానమై యున్నదనియుం మీమహారాజు గారికి విన్నవించుకొను నాకు మీరు సెలవీయవలయునని వేఁడుచున్నాను."

"మీకు మాయనుజ్ఞనిచ్చితిమి. మీకు మాయనుజ్ఞనిచ్చితిమి. మహారాజు చిరంజీవు లగుదురుగాక! మహారాణి చిరంజీవియగుఁగాక! హూణులు నాశమగుఁగాక" అని పౌరు లఱచిరి.

చారు:—నాకళింగు లీయుద్ధమునకుఁ గాను, స్వధర్మము ననుసరింప నున్నారని నేఁ దలఁపవచ్చునా!

"ఆహా! తలంపవచ్చును. తలంపవచ్చును" అని పౌరు లఱచిరి.

చారు:—నాకళింగు లట్టివారని నేనింతకుముందే యనుకొంటిని. ఓపౌరులారా! ఇఁక మీకిప్పటికి సెలవు.

"జయజయమహారాణీ" అని పౌరులు జయజయధ్వానము లొనరించిరి. అంతటఁ జారుమతి, చంద్రభానుఁడు, లలిత యాపౌరప్రముఖులకు వందనము లొనరించి యంతఃపురమునకుఁ బోయిరి. జనులు స్వగృహములకుఁ దిరిగిపోవుచుండిరి.

ఒకఁడు:—మనరాణి మహావక్తగా నున్నది. మనల నెట్లు పురికొల్ప వలసినదియు నామెకు బాగుగాఁ దెలియునుసుమా!

ఇంకొకఁడు:—ఇందాశ్చర్యమేమున్నది? ఆమె పుట్టి పెరిఁగినది కళింగ రాజ్యమునందుఁ గదా! ఆమెకుఁ గళింగులను బాగుగాఁ దెలియును. మీఁదు మిక్కిలి యారాణి విదుషీమణి. ఇంతయేల? ఆవిద్యాసముద్రుఁడు విద్యాసముద్రుఁడే కదా! అంతటి మహాపండితుఁడుసైతము మహారాణి చారుమతియెదుట నిలువనోడినాఁడు.

వేఱొకఁడు:—ఈహూణహైహయయుద్ధము కడ కెట్లు తుదముట్టునో కదా?

మఱియొక్కఁడు:—హూణులకు సంధియేమి? వారిని గళింగులు పాతాళమునకుఁ ద్రొక్కివేయుట సత్యము. ముల్లోకము త్రొక్కిపెట్టున నెత్తి వచ్చినను, నేఁటికళింగులను డీకొని నిలుచుట సందేహము. వారియుత్సాహ మంత యపారమైయున్నది.

ఇంతలో వారు చీలిపోవలసివచ్చుటచే, వేఱువేఱుమార్గములఁబట్టి పోయిరి.

ఇఁక నచట పాటలీపుత్రమున బాలాదిత్యసరస్వతులకు వివాదము కలిగెను. వసంత పాటలీపుత్రమునకుఁబోయి యుజ్జయినీపౌర బాలవృద్ధు లొందు దుర్భరబాధలన్నింటిని సరస్వతికి వివరించెను. సరస్వతిమనస్సు మెత్తపడెను. తనజన్మపట్టణ మొందుచున్నయవస్థ కారాణి చింతింపసాగెను. ఆమెహృదయము కరిగిపోయెను. ఉజ్జయినీపౌరులదుర్దశకుఁ దనహృదయము పగిలి నెత్తురుకారుచున్నదని యామె వసంతతోఁ జెప్పెను. నెత్తురుధారలనుండి యుజ్జయినీపౌరులఁ గాపాడవలయునవిన, ముందుగా మాగధులు తమనెత్తురుఁ బాఱించుట కియ్యకొనవలయునని వసంత చెప్పెను. ఈయభిప్రాయమునందలి సత్యమును సరస్వతి గ్రహించెను. కాన బాలాదిత్యుఁ డీపవిత్రకార్యమును సంపాదించుటకై సమ్మతించునట్లామె సర్వశక్తుల వినియోగింపసాగెను. కాని యిది మాటలచే నగుపని కాదు. బాహుబలప్రదర్శనమున స్వకీర్తిలతను దిగంతములకు వ్యాపింపఁజేయు నుద్దేశమునుండిన బాలాదిత్యుఁ డిప్పుడు వైరాగ్యవృత్తిఁ బూనియుండెను. మాగధులయభివృద్ధికై యాతఁ డిప్పు డెన్నియోవిధములఁ బాటుపడుచుండెను. ఉత్తరహిందూస్థానమున మగధరాజ్యము విద్యకుఁ బెట్టినపేరై యుండెను. భరతవర్షమునందలి రాజ్యములన్నింటిలో మగధరాజ్యము సర్వసంపత్సమృద్ధమై యుండెను. కాని యారాజ్యాధీశుఁ డిప్పుడు మున్నుపోలె యుద్ధప్రసక్తిఁ దవిలియుండుట మానెను. ఆత్మసంరక్షణార్థ మొనరించు యుద్ధముమాత్రము న్యాయబద్ధమని యాతఁడు భావించుచుండెను. దురవస్థలఁ గుందుప్రజలు తమ్ముఁగాపాడ శాత్రవునితో యుద్ధమొనరింపఁ గుయ్యిడిన

చో వారిని రక్షించుటకు మాత్రము పోరాడుటతగుననియు, కేవలమాత్మవంశ కీర్తిప్రతిష్ఠలం బెంపొందించుకొనుటకై యుద్ధమాడుట తగదనియు నాతండు నిర్ధారణమొనరించుకొనియుండెను. ఒకనాడు సరస్వతి, పూర్వము గుప్త రాజులవై యుండిన రాజ్యములన్నింటిని మరల నాక్రమింపవలయునని గురుత నికి సూచించెను. అందులకు నాతండు "ఏరాజ్యములు? సర్వము" అని యడిగెను.

"ఆర్యావర్తమంతయు. ఆసేతుహిమాచలభూభాగము."

"అది మొదట మా పెద్దలు సముద్రగుప్తస్కందగుప్తుల స్వాధీనమున మాత్రముండెను. [illegible] రాష్ట్రములు వేరులో మా [illegible] వెలసెను. ఇక సాహసిపూర్వులకు [illegible] చెప్పవలయునా! కావున న్యాయదృష్టిలో [illegible] పై నంతయు నాకధికారము [illegible]. ఈనాడు నేను పాలించుచుంటిని. మాగధులు [illegible] ప్రార్థించుట చేసియుండరా! [illegible] రాష్ట్ర [illegible] ప్రార్థించియుండినవారు కారు. మీరు [illegible] మాపాలితములు, మాగధుల పాలనమునుండి [illegible] కోరియున్నవారు కారు. ఇట్టియెడ, నాకు సంబంధములేని ప్రజల నెవరినో రక్షించుమిషతో, నేనే లేనిపోనిబాంధవములు కల్పించుకొని, మందభాగ్యులగు నాబిడ్డలను మాగధు లను బలియొసంగు టేటిన్యాయమో నాకర్థమగుటలేదు."

"నిరంకుశుండగు మాళవునిపాలనతో సరిపోల్చిచూచినచో, గుప్త భూపరిపాలనము స్వర్గతుల్యమని చెప్పనగును. పాతకులకు స్వర్గసౌఖ్యము నిచ్చుట రాజధర్మముకదా!"

"అనిష్టులు స్వర్గసౌఖ్యము నెట్లనుభవింతురు?"

ఈసంభాషణము జరిగిననాఁటినుండి, సరస్వతి పలుమారు బాలాదిత్యునితో సీమాంగణి ప్రస్తావించుట మానెను. కాలము గడచుకొలఁది, సరస్వతియు హేమప్రభకుఁగూడఁ దనభర్త యభిప్రాయములం దేకీభవింపసాగెను. ఆమె క్రమక్రమముగ మగధను దనజన్మభూమిగ భావించి, మాగధుల పాలిటి కన్నతల్లియై వారిక్షేమమునకై యహోరాత్రములు పాటుపడుచు హూణదండయాత్రను గుఱించి మఱచిపోయెను. కాని గుర్జరునిపోరు లోనగు కష్టములను వసాతవలన విని నంతనే, హూణాదిదుండగముల కామె నెత్తురు తెర్లసాగెను. హూణుల నణఁచునిమిత్త మొనరింపనున్న యుద్ధ మామె కిప్పుడు హృద్యమయ్యెను. కాని యాత్మాన్వయకీర్తిప్రతిష్ఠల నభివృద్ధిపఱచుటకై యీసమర మొనరింపవలయు ననుమాట నామె మానసమున నేమాత్ర ముదయింపలేదు. పరరాష్ట్రముల నాక్రమింపవలయునను దురాశచే నిప్పు డీసమర మవసరమని యామె తలఁపకుండెను. కాని హూణపరితాడనముల నుగ్గునూచగు నుజ్జయిపోవులను, ఇతరరాష్ట్రీయుల నుద్ధరించుటకు నిప్పు డీరణ మవసరమని యామెకుఁ దోఁచెను.

ఆనిర్ధారణ మిప్పు డామెమనమున రూపొందియుండెను. ఆమె ప్రాణేశ్వరునిఁ జేరి "ప్రియా! చారుమతీయశోధర్ములయొద్దనుండి వసాత యొక్క సందేశముతో నరుదెంచియున్నది. ఆపత్సముద్రమునుండి ప్రజలను గట్టెక్కించుటకై, గుర్జరునినుండి హూణరాక్షసులఁ దఱిమివేయుటకు వారు ప్రబలప్రయత్నము లొనరింపుచున్నారఁట. చారుమతీయశోధర్ము లీమహాకార్యమున మనసాయము నాకాంక్షించుచున్నారఁట" అని చెప్పెను.

బాలా:—నాయభిప్రాయముల నీ వెఱుఁగుదువుకదా! దైవానుగ్రహమున నేనిప్పు డాత్మాన్వయకీర్తిప్రతిష్ఠలను విస్తరింపఁజేసికొను దురాశనుండి తప్పించుకొంటిని.

సర:—నన్నుఁగూడ నట్టిదురాశ లిప్పుడు వదలినవి. దుస్సహబాధ లొందుచుఁ బరితపించుపరరాష్ట్రీయులఁ జూచి నేఁ జింతించుచున్నాను.

బాలా:—యుద్ధసంక్షోభము లేకున్న నేమి? సక్రమసైనికశిక్షణ మల వఱచుకొనుట మిగుల సులభముకదా! సమరేతరవ్యాపారములయందు నా ప్రజలు క్రమశిక్షణ మొందినఁజాలును. ముందు వారు చిత్తము స్వాధీన పఱచుకొనినచో, శరీరాభ్యాసము దానియంతట నదియే యలవడును. ఇంత యేల? నిజము నాకుఁ దెలియును. అంతకు మీరివచ్చినయెడల, మాగధులకు స్వరాజ్యమును రక్షించుకొనుసామర్థ్య మున్నదని నాకుఁ దెలియును.

సర:—స్వరాజ్యేతరరాష్ట్రములఁగూడ సంరక్షించుశక్తి వారి కుండవల యును. 'మాదే యారోగ్యము; మాదే యైశ్వర్యము' అని స్వార్థపరులై మాగధులు తమదృష్టినంతటిని స్వరాజ్యముపైనుంచుట సజ్జనసమ్మతము కానే రదు. ఇంతకు విశాలమగువిశ్వమునందు మగధ యేపాటిది? ఆర్యావర్తమును సంరక్షించుటకై మహాకోసలులకును, కళింగులకు నుండు శ్రద్ధాభక్తులు, మాగ ధులకుమాత్ర ముండవలదా? హిందూదేశ మిట్టిక్లిష్టపరిస్థితులయం దుండు నప్పుడు, మాగధు లిట్టిజోక్యమును గలుగఁజేసికొనకుండుట కరమపాయకర ము కాదా? ఒకవేళ హూణులు జయించిరేని, మనలఁగూడఁ గబళింపక పోరు. అట్లుగాక, హైందవనరేంద్రులు విజయవిరాజితులైనయెడల, దేశ ద్రోహులగుమాగధులపై వారలకుఁగల క్రోధమునఁజేసి మనరాజ్యమునంతటిని నేలమట్టము చేసికొని వదలరు.

బాలా:—నిర్హేతుకములగు నిట్టిదండయాత్రల నరికట్టుట కుపాయము మాగధులకుఁ దెలియును.

సర:—మాగధులసాహసపరాక్రమము లద్వితీయములైనను, విజయో న్మత్తులగు హూణరాక్షసులచేనైన, క్రోధోద్రిక్తమగు హైందవనరేంద్రమండ లిచేనైన నోటమినొందుట నిస్సంశయము. ఇఁక మాగధులు 'తమకుం దేటికి గాళ్లు మూఁడే' యను మొండిపట్టును వీడకపోయినయెడల, వారి కట్టిదుర్గతి పట్టునని నిష్పక్షపాతముగాఁ జెప్పవలసియున్నది. మనోహరా! మహాకోసలు లిప్పుడు మాగధుల కేకవిధముగా సాయమొనరించుచున్నారని మీరు తలం

బాలాదిత్యుఁడు ఆపాలతిచతురభాషణముల కుప్పొంగి యామెను గవుంగిలించుకొని యొకముద్దుపెట్టుకొనెను. "ప్రేయసీ! నీవంటి నారీమణిం జేపట్టినందులకు నేను నేఁడు గర్వించుచున్నాను. నీప్రబోధములు నన్ను లోఁబఱచుకొనినవి. పవిత్రమగు నీమహాకార్యమునఁ బాల్గొని, మందభాగ్యులగు ప్రజల నుద్ధరించునిమిత్తము యుద్ధమునకు సన్నద్ధుడనై యుండవలయునని నేఁడే మాగధులాదఱకు నాయానతిని చాటింపఁజేసెదను." అని బాలాదిత్యుఁడు చెప్పెను.

"నాథా! ధన్యురాలనైతిని. మీయనుగ్రహమున కెంతయుఁ గృతజ్ఞురాలను." అని సరస్వతి మందహాసమొనరించుచు బాలాదిత్యుని ముద్దిడుకొని యాగదివీడిపోయెను.

ఇంతసేపు వసంత వెలుపల వేచియుండెను. ఆమెయుత్తల మధికమైయుండెను. సరస్వతి యంతఃపురమునుండి బయటికివచ్చుటయే తడవుగా, వసంత యామెకెదురుబోయి "సంగతులేమి? మహారాజుగారు సమ్మతించినారా?" అని యడిగెను.

సర:—ఆఁ! సమ్మతించినారు?

వసంత సరస్వతిని మఱిమాట్లాడనిచ్చినది కాదు. ఆమెయానంద మపారమయ్యెను. అంతఃపురప్రాంగణమున నొకవార్తాహరుఁడు సిద్ధముగా నిలిచియుండెను. ఆమె యొక్కగంతులో వానివద్దకుఁబోయి "పొమ్ము! పోయి, యీసమయమునకు సాయమొనరింప బాలాదిత్యసార్వభౌముఁడు సమ్మతించినాఁడని, మనమహారాజుగారికి విన్నవింపుము. ఎక్కడగాని నిలువకుము. అమలాపురిఁజేరువఱకు కళ్లెములు వదలకుము. పొమ్ము" అని యాజ్ఞచేసెను.

తోడనే యావార్తావహుఁడు ఱెక్కలతో నెగిరిపోయిన ట్లతిత్వరగాఁ బోయెను.

---

# ముప్పదియవతరంగము.



## మిహిరగులుని యుద్ధాలోచనసభ.

సాగలపట్టణమునందు నేఁడు చాల గందరగోళముగా నుండెను. రాజాజ్ఞను మాఁదొర్చి హూణముఖ్యులందఱు సచివసేనాసమేతులై రాజధానికి వచ్చియుండిరి. హూణసామంతులు భారతధరాకాంతులును, హూణమిత్రులగు హైందవభూమీశులును సాగలరణమున మిహిరగులునకు సాయమొనరించుతలంపున వచ్చియుండిరి. ఈహైందవోర్వీశులలోఁ గాశ్మీరాధిపుఁడు వజ్రాయుధుఁడును, కాశీరాజగు నింద్రద్యుమ్నుఁడును, సౌరాష్ట్రనాయకుఁడగు రుద్రసింహుఁడును ముఖ్యులనఁ జేర్కొనదగుదురు. చేష్టనుని జనకుఁడగు నాహపాణుఁడిపుడు పరలోకమునకుఁ బోయియుండెను. చేష్టనుఁడు నాతనితనయుఁడు నాహపాణుఁడును దమస్వామికి సాయమొనరింపఁ గోరి నిజబలములతో నరుదెంచియుండిరి.

మిహిరగులుఁ డిపుడు కొలువుండెను. నాఁటిపరిస్థితులఁ జక్కఁగ నాలోచించుటకై హైందవభూకాంతులు, హూణధరాధీశులచటఁ గూడియుండిరి. ఈసభకు చేష్టనుఁడు, నాహపాణుఁడు, వజ్రాయుధుఁడు, ఇంద్రద్యుమ్నుఁడు, రుద్రసింహుఁడు నైదుగురుమాత్ర మాహ్వానింపఁబడిరి. అందఱును రహస్యాలోచనమందిరమునఁ జేరినంతనే మిహిరగులుఁడు వారలఁ గాంచి "ప్రస్తుతము యశోధర్ముఁడు, బాలాదిత్యుఁడును మిన్నుమన్నుఁ గానక గర్వాంధులై వర్తించుచుండుట మీకు విదితమే కదా! వారిదురాగతములను గూర్చి యోజించుటకై, మిమ్ముల నిటకు రావించినాఁడను. ఒకదూత యశో

ధర్మవద్దనుండివచ్చి మిమ్ములసందర్శింప ద్వారముకడ వేఁచియున్నాఁడఁట. వానిని లోనికి రానిత్తమా?" అని యడిగెను.

వజ్రా—దేవరవారిచిత్తము.

దూత లోనికిఁ బిలువఁబడెను. వానికి రమారమి ముప్పదియేండ్లుండును. మహాభుజుఁడగు నారాయణుని వీరరసము రూపుఁగైకొని వచ్చిన క్రియ నుండెను. అతనిపేరు యుద్ధకేసరి. సార్థకనామధేయుఁడు. తాను మహాకోసలమునందలి సుక్షత్రియ వంశసంజాతుఁడని యాతఁడు గర్వించుచుండును. యుద్ధకేసరివంశమువారు, యశోధర్మ మహారాజన్యునివంశమును బదునెనిమిదితరములుగ నిరుపమభక్తితోఁ గొలుచుచుండిరి. యశోధర్మ హూణునితోఁ బోరుచున్నాఁడని యుద్ధకేసరికిఁ దెలియుటతోడనే, యాతఁడా మహారాజువద్దకుఁబోయి "దేవా! మావంశమువారు పదునెనిమిదితరములుగా మీరాజవంశమును, మంచికాలములందును, చెడుకాలములందును సేవించుచున్నారు. కాని యింతకాలముగా మేము మీయభిమానమునకుఁగాని, మీ కొసంగు కానుకలకుఁగాని కనిపెట్టుకొనియుండినవారము కాము. కాని దేవా! నేఁడుమాత్రము మీకృపామృతమును నాపైఁ జిలుక మిమ్ముఁ బ్రార్థించుటకు నామనస్సెంతయు నొచ్చుచున్నది ఇది నావిధియనికూడ నాయభిప్రాయము" అని మనవిచేసెను.

యశోధర్మ యాతనియెడఁ బ్రసన్నుఁడై "యుద్ధకేసరీ! నీయభీష్టమేమి? నాశక్తివంచనలేక నీకోరిక నెఱవేర్చెదను" అని చెప్పెను.

దానికి యుద్ధకేసరి సంప్రీతుఁడై "దేవరవారెల్లప్పు డుదారహృదయులు. హైంధవనరేంద్రమండలి నిశ్చితాభిప్రాయమును మిహిరగులునకు విదితపఱచుటకై, నన్నాతనికడకు దూతగాఁ బంపుటకు దేవరవారనుగ్రహింపవలయును." అని యడిగెను.

యశోధర్మ విభ్రాంతుఁడై "ఇదియేటికోరిక? అకార్య మపాయకరము గదా! క్రూరరాక్షసుఁడగుమిహిరగులుఁడు యుద్ధనియమముల నుల్లంఘించి నిన్ను వధించుటకుఁగూడ వెనుదీయఁడు" అని చెప్పెను.

మిహి:—నేను భారతీయుండఁగాను. కాన మీహాసుధర్మములు నన్ను శాసింపవు. చేష్టనా! ఎఱ్ఱగాఁ గాచినకొఱ్ఱులు, పటకారులు తెప్పింపుము. ఈదురాత్మునకు, హూణుని గౌరవించువిధానమును నేర్పింతము.

యుద్ధకేసరి సటలు వెలికిన కేసరివోలె గాసి గఱచుచు "ఓరీ తాపిమానవాధమా! నేను భయమెట్టిదో యెఱుఁగని ప్రసిద్ధకేసరివంశజుఁడనని నీకుఁ దెలియదా! నానాలుకమాత్రము పెఱుకనేల? నాయంగములనొక్కొక్కటే తెలగివేయుము. నానెత్తుటి నొక్కొక్క బొట్టుగాఁ గార్చివేయుము. నిహూణా నేత్రగోళములనంత్రుల, రాక్షసానందరసముతో నింపవేసికొనుము. అప్పటికిఁ గూడ యుద్ధకేసరి చింతాకంత భయమునైన వెల్లడింపఁడు. ఓరీ మ్లేచ్ఛాధమా! నీవనిన, నాకెంతయో తిరస్కారము. ద్వేషము. కాని నేఁడాతిరస్కారద్వేషములు శతాధిక విజృంభితములై, దుష్కరములై యున్నవిరా! నాజన్మభూమి పాదారవిందములసన్నిధి నీవు నన్ను బందీయొనరింగింపుట కెంతగాను సంతసించుచున్నాను. కాని ద్రోహకర్తలగు నీబ్రాహ్మణులు, క్షాత్రస్వమ్మునిఁజూచి నాసంతాప మపారమై యున్నది" అని పల్కెను. ఆరాజుల మోము లవమానముచేఁ జిన్నవోయెను.

మిహిరగులుం డాతనిపలుకులకు గాలడచినపన్నగమువోలె రోఁజుచు "పలుగాకీ! తులువా! నోరుమూయుము. లేకున్న నా చేతులయందే నీవు చచ్చెదవు" అని గద్దించెను.

కాని యుద్ధకేసరి యాతనిగద్దింపులను వినులఁజొనుపక "ఓరీ! రమ్ము! మగవాఁడవేని రమ్ము! సహజశూరుఁడవేని చెప్పినంత చేయుము" అని గర్జించెను.

మిహిరగులుఁ డాతనితోఁ బోరాడలేచెఁగాని, నాహపాణవజ్రాయుధు లాతనిఁ బట్టుకొనియాపిరి.

వజ్రా:—నీచుఁడగు వీనితో మహనీయులరగు మీరు పెనఁగుట ధర్మము కాదు.

ఆమాటలకు యుద్ధకేసరి కాలాంతకునివలెఁ గనలుచు "ఓరీ! మాతృద్రోహీ! చండాలుఁడా! ఏమికూయుచున్నావురా? నావంశములో దులతూఁగఁగల క్షత్రియకుటుంబము, విశాలమగు నీమహారాష్ట్రావర్తమున నొక్కటియైన. మచ్చునకైనఁగలదా? ఓరీద్రోహీ! కాదు కాదు. క్షమింపుము. నీచాత్ములగు నీబోఁటివారికి, సుక్షత్రియవంశ పవిత్రచారిత్రము లెట్లు తెలియఁగలవు? గంధపొడివాసన గాడిద కేమి తెలియును?" అని వజ్రముఖుని దూషించెను.

చెప్పుచుండెంతలోఁ గాల్చినకడ్డీలు, పటకారులు తీసికొనివచ్చిన తోడనే మిహిరకులుఁడు "ముందు వానికన్నులు పెఱికివేయుము" అని యాజ్ఞచేసెను. చెప్పుచుండఁగనే కాలినకడ్డీల నొక్కుమూకుగా యుద్ధకేసరి కన్నులఁ బొడిచి పైటికిలాగెను. కాని యుద్ధకేసరి యుంచుకయైన బాధనొందక "ఆహా! ఇంతవఱకు నిహాదాధము దగు వైదేశికుని పదతాడనముల క్రింది నలుఁగు నామాతృభూమిని జూడలేక పరితపించుచుంటిని. ఇప్పుడా వేదన నాకుఁ దప్పినదికదా!" అని యూఁచుచు గర్వోత్తుంగుఁడై చూపెను.

"వాని నాలుకఁ గూడఁ బెఱికివేయుము." అని మిహిరకులుఁడు గర్జించెను. ఇదియును నయ్యెను. కాని యప్పటికినైనను యుద్ధకేసరి సుంతయేని వేదన ననుభవించునట్లు లేదు. అవీరుఁడు కుడిచేయి జాఁపుచు దానిని నఱికివేయ హూణభటులకు సన్న చేసెను. అదియు నయ్యెను. అంతట నాధీరుఁడు కుడికాలిఁ జాఁపుచు దానిఁ గోసివేయ వారికి సైగచేసెను. ఇదియును జరిగెను. ఇప్పుడు యుద్ధకేసరి క్రిందికొఱిగెను. అంత నాతఁ డెడమచేత నెడమకాలిఁ జాఁపుచు దానిఁ గోసివేయ సూచించెను. హూణభటు లద్దానిఁ గూడ నఱికివేసిరి. ఇప్పుడు 'యుద్ధకేసరి' యని పిలువఁదగినది యొక్క మొండెముమాత్రము నిలిచియుండెను.

యుద్ధకేసరి యీచిత్రవధను సంతసముతో ననుభవించుటను మిహిరకులుఁడు గమనించెను. అతం డందుచే నిరుత్సాహుఁడై "ఈమూర్ఖుఁడు

శాశించుకయేని సంతోషమునీయలేదు. వీఁడు విలపింపనులేదు, మన్నింపు నన్ను బతిమాలనులేదు. వీనిఁ జంపుటకంటెఁ గూరగాయలఁ దఱుగుటయైనఁ జాలయానందముగా నుండును.” అని చప్పరించెను.

దాని కింద్రద్యుమ్నుఁడు “అయిన దేవరవారియనుజ్ఞయైన వీనిపనిఁ గానిచ్చెదను” అని తనఖడ్గమును యుద్ధకేసరి మొండెమునందు లోతుగా గ్రుచ్చి యాతనిబాధఁ దొలంగించెను.

యుద్ధకేసరి యీపాపులోకమునుండి పరలోకమునకుఁ బోయెను. ఇంద్రద్యుమ్నుఁ డాశవముం జూపుచు “ఇంతటి సుక్షత్రియవీరుని నేఁ జూచి యుండలేదు” అని పలికెను.

చేష్ట:—హూణుఁడు సాహసమునకుఁ బెట్టినపేరుకదా! వాఁడుకూడ నింతసాహసమును జూపనోపఁడు. కాని యీమూఢునకుమాత్రము తగిన శాస్తియైనదిసుమా!

మిహి:—ఈపీనుఁగుఁ దీసివేయుండు. ఇఁక మనము కూడినపనిఁ గావింతమా?

ఆశవము నచటనుండి తొలఁగించిరి. అచటనుండు హైందవార్వీశుల ముప్పురనాఘోరకార్యము నిర్విణ్ణులఁజేసెను. ఆకార్యక్రమమునఁ బాల్గొన వారిచిత్తవృత్తులం తిరుగుఁబా టొనరించుచుండెను. ఎట్టులోయొకట్టుల యోజనలుమాత్రము సాగుచుండెను.

మిహి:—ఇప్పటిపరిస్థితు లివి. హూణద్రోహులతోడియుద్ధము తీరని పనియైనది. సమరము తప్పని సరియై, నానాఁటికి సమీపించుచున్నది. మనశాత్రవు లెంతబలమును బ్రోవుసేయుదురో వారితోఁ దలపడుటకు మన మెంతబలమును సేకరించుకోవలయునో, యీసంగతుల మన మిపుడాలోచింపవలయును. మనము మునుఁగుటయో, తేలుటయో యీసమరము నిర్ధారింపవలయును. ఈదేశము హూణులయధీనమునం దుండుటయో, తప్పిపోవుటయో యీయుద్ధము పరిష్కరింపవలయును.

మిహి:—మొన్న బామియూను దేశమునుండి ౨౫౦,౦౦౦ భటు లరుదెంచిరి. ఉజ్జయినియందును, ఇతరప్రాంతములందును, ౨౦౦,౦౦౦ హూణవీరు లున్నారు. గాంధారేయులగు ౧౫౦,౦౦౦ శబరులు మనకుఁ దోడ్పడి, దోపిడియందుఁ బాల్గొన సంసిద్ధులైయున్నారు. ఘూర్జరులు, యౌధేయులు, లఘ్నక్రయులగు హైందవులు ౧౮౦,౦౦౦ మందియుందురు. ఇవిగాక, ఇంద్రద్యుమ్నవజ్రాయుధులభటులు ౧౫౦, ౦౦౦ మంది యుందురు. మొత్తముమీఁద మనవద్ద ౯౩౦,౦౦౦సైనికు లుందురు. వారిలో ౪౫౦,౦౦౦ మంది హూణులుందురు.

నాహ:—అయిన మనయూథులపాటునకుఁ గారణ మింతయైనఁ గన్పట్టదు. హూణభటుఁ డొక్కఁడు, హూణేతరు లిద్దఱితోఁ బోర సమర్థుఁడు. పర్షియను లీహూణపరాక్రమము నీవఱకే రుచిచూచియున్నారు. వారే యిందులకు సాక్షులు.

చేష్ట:—ఘూర్జరులు, యౌధేయులు హూణధ్వజముక్రిందఁ జేరి నడుముకట్టి నిలిచియున్నారు.

నాహ:—గాంధారేయులగు శబరులుసైత మొక్కయడుగైన వెనుక వేయుటలేదు.

వజ్ర:—కాశ్మీరులుకూడ ధైర్యసాహసములకుఁ బుట్టినిండ్లుసుమా!

మిహి:—అవును. హైందవేతరులకంటె వారు ధీరులు.

వజ్ర:—అయిన మన మిట్లేలచేయరాదు? అపరాజితునకు సౌరాష్ట్రమును మనమే యిచ్చుట కియ్యకొని యాతనిఁ దటస్థునిగా నుంచనగునుగదా? అప్పుడు మనకు హూణవిద్రోహుల నోడించుట మిగుల సులభము. హూణవిద్రోహుల నణఁచినతర్వాత, నపరాజితునకు మన మిచ్చినమాటను ద్రిప్పికొనవచ్చును. అప్పుడు మనతోఁ బోరాడుటయో యూరకుండుటయో వానికే వదలుదము.

శత్రు కార్యరంగమునకు దూరముగ నుండెను. ఇక మూఁడవలాభము. ఆప్రదేశములు హూణావిద్రోహుల కంతపరిచితములైనవి కావు.

చేష్ట:—అవిద్రోహులు మహాకోసలమునకుఁ బడమరగాఁ బోరను గొనుము. అప్పు డెట్లు?

నాహ:—అప్పుడు మనము మహాకోసలమును ముట్టడింపవలయును. కాని సూక్ష్మబుద్ధిశాలియగు యశోధర్మ యీవిధమున దొమ్మరాటలాడడని నా యభిప్రాయము. ఎప్పుడెప్పుడు హూణులఁ దఱిమివేయుదునా యని యువ్విళ్లూరు నాతఁడు కాలవిలంబమునకుఁ దాళియుండునా? లేక తనసైనికుల యుత్సాహాగ్ని జల్లార్పనోపఁగలఁడా? ఇది యసంభవము.

రుద్ర:—అవును. నిజము. నేను యశోధర్మ నెఱుఁగుదును. ఈయుద్ధకేసరికి నాకునికిఁ గొంతాకంతయైన భేదములేదు. తమమరణమునకుఁ గలయవసరముననైనని, యుండవలసి ప్రయోజనమునుగాని యోచింపకయే వీరు మడియుచుందురు.

మిహి:—దాని నటుండనిమ్ము. మన మాలోచింపవలసినసంగతి యిఁక నొకటిమాత్ర మున్నది. హూణరాష్ట్రీయుల లేమైనఁ దిరుగుఁబాటొనరించు సూచనలు పొడఁగట్టుచున్నవా?

రుద్ర:—దేవా! సౌరాష్ట్రవిషయము నేను మాట్లాడఁగలను. ఆజనులు పాఱుఁబోతులు. తిరుగుఁబాటొనరించు మగతనము వారికిలేదు.

మిహి:—యౌధేయులసంగతి!

చేష్ట:—దేవా! వారొకింతుక యత్యప్తితోనున్నారు. కాని వారు మన కెట్టికష్టములఁ గలిగింపనోపరని నామనవి. వారిలోఁ బెక్కుమంది మన రాజువలఁ జేరియున్నారు. ఇఁక వీరు తమమిత్రులు హూణావిద్రోహులతో జేరకుండఁ జూచుకోఁగలరు.

మిహి:—ఉజ్జయినిసంగతి!

చేష్ట:—దేవా! ఉజ్జయినీవారలు చాల నసంతుష్టులైయున్నారు. కాని వారుగూడ నీదేశీయుల కేమిటఁ దీసిపోవువారు కారు. వారిమాటలు కోటదాఁటుచున్నను, కాలుమాత్రము కదపదాఁటదు. మొఱఁగుకుక్కలు కఱచునా! వారు తమస్వేచ్ఛాప్రవృత్తికిఁగాని, మడిమాన్యములకుఁగాని, మాస్తిపాస్తులకుఁగాని యించుకయైన నష్టమువాటిల్లు సూచన లగపడినచో, నాలేఁతసారకాయలఁగూడఁ గోయుట మాని, చెప్పుక్రింది తేళ్లవలె నడఁగియుందురు. సాధారణముగాఁ బ్రజలలోఁ బలుకుబడిగలవారు బ్రాహ్మణులు, వైశ్యులని చెప్పవచ్చును. వీరు రాగిరువ్వఁ గోల్పోవుటకుఁగాని, రొక్కదెబ్బఁ దినుటకుఁగాని పాల్పడరు. మనసైన్యములు పూర్తిగా నోటమిఁ గాంచి శివచ్ఛవములై యుండినఁదప్ప, ఉజ్జయినీనగరమునందుఁగాని మఱియెచ్చోఁగాని తిరుగుఁబాటులుండునని నేను భీతిల్లను.

మిహి:—ఇతరరాష్ట్రములసంగతి యేమి?

చేష్ట:—దేవా! యుద్ధమున మనము పరాజితులమైనఁదప్ప వారు మనల నెదిరింపరు. కులీనులందు గుప్తపక్షావలంబులు పెక్కుడుండుననుటకు సందియములేదుకాని, విజయము తమకు నిజమని నమ్మకముపుట్టువఱకు వారు బయటఁబడరు. దేవా! సుఖాభిలాషను, బంధువాత్సల్యమును నొక్కిపెట్టిన విడనాడి, రణావనికుఱుక వారికి దీమసములేదు.

మిహి:—ఇఁక మనము సభ చాలింపవచ్చు ననుకొందును. అన్నిసంగతులఁ బరిశీలించితిమికదా!

అంత సభ ముగిసెను. ఆయైదుగురును సభామందిరమునువీడి చనిరి. చేష్టననావాపాణులు హూణసైనికశిబిరములకుఁబోయిరి. వజ్రాయుధుఁడు, ఇంద్రద్యుమ్నుఁడు, రుద్రసింహుఁడు కొంతదూర మొకటిగాఁ జనిరి.

“యుద్ధకేసరి వధనుగుఱించి నీయభిప్రాయ మేమి? అది మిగుల జోద్యమైయుండినదికదా? అతఁడు నాకు సనాతనక్షత్రియవీరులను జ్ఞప్తికిఁ దెచ్చినాఁడు.” అని యింద్రద్యుమ్నుఁడనెను.

"ఆతనిమరణము వీరపురుషోచితమగుటకు సందియములేదు" అని రుద్రసింహుండు పలికి, వజ్రాయుధునిముందు మిగుల మెలకువతోఁ బ్రవర్తింపవలయునని యాతనికిమాత్రము తెలియునట్లు సైగచేసెను.

వజ్రా:—ఇంద్రద్యుమ్నా! మనము హూణపక్షావలంబులమై యశోధర్మాదులతోఁ బోరుచున్నందులకు, మనకించుకయైన నాదాయ ముండవలయునని నీవు తలంపవా!

ఇంద్ర:—ఈహూణుండు మనరాజ్యములను మనకుదక్కనిచ్చిన నదియే పదివేలని నేను సంతసించెద.

"హూణవిద్రోహులసన్నాహములగూర్చి నీయభిప్రాయమేమి? వారిని మనము సులభముగా నణఁచివేయలేమా?" అని వజ్రాయుధుఁడు రుద్రసింహు నడిగెను.

రుద్ర:—ఆహా! అందుకు సందియ మేమున్నది.

వజ్రా:—ఈయశోధర్మ యనిన వాఁడు గిట్టదని నీకుఁ దెలియును గదా! వాఁడు చారుమతి నెట్లో చేఁబట్టఁగలిగినాఁడు. నేఁగూడ నారాజకుమారి పాణిగ్రహణమునకుఁ బ్రయత్నించితిని కాని యాగర్వాంధురాలు నన్నుఁ గన్నెత్తియైనఁ జూచినదికాదు. ఈవజ్రాయుధునగౌరవపఱచినందుల కగుఫలము నామె త్వరలో రుచిచూచును. ఆరాకుమారి నాయంతముఁజూచు నంతలో మహాకోసలకళింగరాజ్యములు మాడి మసిబొగ్గులై పోవలయును సుమా!

ఇంద్ర:—ఆమె నన్నుఁగూడఁ దిరస్కరించినది. కాని నీవలె నేను దలఁపను. ఇంతకును స్వయంవరమునఁ బెక్కురు రాజకుమారులు విచ్చేయుదురుకదా! ఎట్టిరాజకుమారియైన వారిలో నొక్కనిమాత్రమే కదా వరియింపఁ గలదు. అందఱిని వరింపనందులకు నామెను మన మెట్లు దూషింతుము! అది యూహ కెట్లు సాధ్యము!

"సరి. ఇఁక నావిడిదికిఁబోవుదను" అని వజ్రాయుధుఁడు "నీవు

రుద్రసింహునియతిథిపై యుండుదునుకొందును" అని యింద్రద్యుమ్ను డడిగెను.

ఇంద్ర:—అవును. ఇఁక నాకు సెలవు.

వజ్ర:—మీకిద్దఱకు వందనములు.

రుద్ర:—వందనములు.

వజ్రయుద్ధుఁడు పోయిన పిదప నింద్రద్యుమ్నుఁడు, "ఈవిధముగా యుద్ధకేసరిఁ బోనదమాతను వధించుట రాక్షసకృత్యమని నీవు భావింపవా?" అని రుద్రసింహు నడిగెను.

రుద్ర:—అవును. నేనట్లే యనుకొంటిని. కాని మన మేమి చేయఁగలము? హూణులకు యుద్ధనియమములు లేవుగదా!

ఇంద్ర:—శాంతికి నియమములుండినఁగదా, యుద్ధమునకు లేకుండుటకు! నీవు హూణప్రేమకు శత్రుఁడవైనట్లు మాట్లాడుచున్నావు సుమా!

రుద్ర:—ఏమిప్రేమయో! నాస్థితి చంచలముగ నున్నది. మాయాపి యగు భానుగుప్తునివంటివాఁడుకూడ, హూణునితోమునకు వినలోఁక నాడింప లేకపోయెను. అతఁడు కాలగతినొందుటయు తడవుగా హూణు లాతని రాజ్యమును స్వాధీనపఱుచుకొని, యాతనిఘనరాజులన్నిటిని గైవసమొనరించుకొనిరి. భానుగుప్తుని పెద్దకుమార్తెను జేష్టునికుమారుఁడగు హూణునకిచ్చి బలవద్వివాహ మొనరించిరి. ఆహా! ఈహూణులఘోరకృత్యము నాకు వెగటుఁగొల్పుచున్నది.

ఇంద్ర:—ఆపెండ్లికి నీవు పోయియుంటివా?

రుద్ర:—లేదు. ఆనాఁటి కేదియో తలనొప్పియనియో జ్వరమనియో మిషచెప్పి, నేను దప్పించుకొంటిని.

ఇంద్ర:—యశోధర్మరాజాడినఁ బరిస్థితు లెట్లు మాఱును?

రుద్ర:—దురదృష్టవంతమగు నీభరతవర్షమునందు మఱికొంతభాగము హూణునికాలఁబడి యల్లాడును.

ఇంద్ర:—భారతభూకాంతులభాగ్య మెట్లున్నదని నీభావము.

రుద్ర:—భారతీయులు పరాజితులగుట నిక్కము. 'మహాగజాశిపలాయంతే మశకానాంతుకాగతిః' అన్నట్లు సక్రమబద్ధమైయుండిన గుప్తసామ్రాజ్యము సైతము హూణనిధాటికిఁ జెదరిపోయెనన, నేఁడు పరస్పరద్వేషలును, ఇతరేతరద్రోహకర్ములునగు సభ్యవినిర్మితమగు హైందవనరేంద్రమండలి గుప్తవిజయులముందు నిలుచుట యెక్కడిమాట? ఈ ప్రయత్నము హాస్యాస్పదము తప్ప మఱివేఱుకాదు. స్కాందగుప్తునియంత్యక్రియలు హూణనిరోధకప్రయత్నములను విఱుగఁద్రోసినవి. ఆనాఁటితో నాశలన్నియు నడుగంటి పోయినవి. హూణరాక్షసులనుండి మనను తప్పించుకొనఁగల మనునాశ మనకిఁక లేదు. అట్టియాశయే యుండినను నేను కూడ హైందవనరేంద్రమండలియందు జేరియుండెడివాఁడను.

ఇంద్ర:—నీతో మనసువిచ్చి చెప్పుచున్నాను. నేనుమాత్రము వారితోఁ జేరదలంచితిని. ఈమిహిరగులునిఘోరకృత్యములు నాకు హేయములై కాన్పించుచున్నవి. యుద్ధకేసరిహత్యతో, నాయభిప్రాయము సుస్థిరమైనది.

రుద్ర:—నీకు సర్వనాశము కాకుండుఁగాక! నీవు తటస్థుఁడవై యుండుట క్షేమమని నాయుపదేశము.

ఇంద్ర:—తాటస్థ్యము నాయంతరాత్మను సంతృప్తిపఱచుట లేదు. మీఁదు మిక్కిలి యీదినములందు యుద్ధకార్యవ్యగ్రునికంటె. తటస్థున కెక్కుడాపదలొదవుట సహజము.

రుద్ర—బాగుగాఁ జెప్పితివి.

అంతట వారిద్దఱు, రుద్రసింహునివిడిదియగు సత్రపుల నగరముఁ బోయిరి.

# ముప్పదియొకటవతరంగము.



## అమలాపురియందలి బహిరంగసభ.

అచట నమలాపురియందు యశోధర్మ సచివసేనాపతులతోడను బ్రజల తోడను సభకూడియుండెను. ఆజనసమూహ మసంఖ్యాకమై యుండెను. అందఱు నుద్రేకపూరితులై కార్యక్రమారంభము నెదురుచూచుచుండిరి. ఆ మహోత్సాహులు తమప్రభువు ప్రాణములతోఁ బోరాడ నొనర్చుసన్నాహము లకు గర్వించి సేనవేలుగా నరుదెంచియుండిరి. యశోధర్మ వారి కీవిధమున నుపన్యసింపసాగెను.

"ఓయార్యులారా! ఇవి భరతవర్షచారిత్రమునందు సందిగ్ధసమయ ములు. మనమతమును, పరిజ్ఞానమును, నాగరకతను రక్షించుకొనుటకుఁగాను, రమారమి నలువదివత్సరములుగా మనలను నేలఁబెట్టి కాలరాచుచుండు నిహాదుఁ దగు విదేశజాతితోఁ బోరాడవలసినదినములు సమీపించుచున్నవి. ఇట్టిసమయము మనజాతి కిదివఱకు సంభవించియుండలేదు. దైవనిర్మితములగు నాలుగువర్ణము లకుఁ జెందియుండుబ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు వీరంద ఱును దమమాతృభూమి విదేశవాహిసింబడి కొట్టుకొనిపోవుచుండ నామె నందుండి తప్పించి గట్టుకెక్కింపఁ దలంపక యూరకచూచుచుండిరి. ఇన్ని యేండ్లుగా నుజ్జయినియందు హూణుఁడు నిక్కుచున్నను, నొక్కహైందవో ద్యోగుఁడైన నాతని నటనుండి గెంటివేయ నుద్యోగించినవాఁడు లేఁడు. ఇప్ప టికిఁగూడ హూణుఁడు గుప్తసింహాసనమున సుఖాసీనుఁడై చతుర్వేదములను షట్ఛాస్త్రములను, చతుర్వర్ణములను గాలదన్నుచున్నాఁడు. కాని యార్యా వర్తముమాత్రము సిగ్గుమాలి మొద్దువలె నున్నది. మీఁదు మిక్కిలి పుండుపై ముల్లుగ్రుచ్చునట్లు బ్రాహ్మణులు తమచాతురీవిభూతితోడను, క్షత్రియులు

తమబాహుబలసంపత్తితోడను, వైశ్యులు తమధనాధికములతోడను, శూద్రులు తమసేవాపరత్వముతోడను నాతనికి బాసటగా నిలిచియున్నారు. ఈనాలుగు జాతుల నొక్కటిగాఁ గలిపి నిస్సారమగుసంకరజాతిగా నొనరింప మిహిరగులుఁడు ప్రయత్నించుచుండ, వాఁడు కృతకృత్యుఁడగుట కానాలుగువర్ణములవారే సాయమొనరించుచున్నారు. ఆర్యజాతుల కుజ్జయినియం దంత్యకాలము దాఁపురించియుండ, సార్వ్యరాజులు వారిరక్షింపఁ జేతకానివారై బిక్కమొగములతో నున్నారు. మనము బుద్ధిహీనులము. కాఁబట్టియే యీనాఁ డుజ్జయినికిఁగల్గినగతి రేపు మనకుఁగూడఁ బట్టునని మనము గ్రహింపఁజాలకున్నాము. హూణుఁడు విజయుఁడగుకొలఁది, బలమున నధికుఁడగుచున్నాఁడు. సారస్వతమునకుఁ బట్టుకొమ్మయగు నుజ్జయినీనగరమున నాగరకత మాసిపోయినయెడల, ననాగరకత తామరతంపరలై మహాకోసలమును ముంచివేయుట సత్యము. మహాకోసలమునే కాదు. సమస్తభారతజాతికిఁ బూజ్యమగు కాశీపట్టణమునుగూడ నాశమొనరించుట నిక్కము. అంతతోఁబోదు! దూరముననుండు మగధ, కళింగ, కామరూపరాజ్యములుకూడ రూపుమాసిపోవుననుటకు సందియము లేదు. కాలక్రమమున గంద్వానము, కంచి, కేరళము, మహారాష్ట్రరాజ్యములుసైతము మూలమట్టుగాఁ గూలిపోవును. కాని యిప్పుడిప్పు డార్యజాతికి మంచిదినములు వచ్చుచున్నట్టున్నవి. ఇప్పుడిప్పుడు హైందవనరేంద్రులు కొందఱు నిద్రమేల్కొని తమపైఁబడనుండు భీకరనిర్ఘాతమునుండి తప్పించుకొనుటకై కనులు నులుపుకొని, యొడలు దులుపుకొని లేచుచున్నారు. పరమపూజ్యమగు సీభరతవర్షము నపవిత్రమొనరించిన యీవిదేశజుఁడను నిషాదాధము నిటనుండి పాఱఁద్రోలుటకై వారిపుడు ప్రబలప్రయత్నములయందప్రమత్తులై యున్నారు. ఇట్టిప్రయత్నము లొనరించుటకు మీరాజే మొదటివాఁడు. మీయు తల్లివలెఁ బ్రేమించు మీరాణి చారుమతి యాతనికీప్రయత్నములలోఁ గుడిభుజమై నిలిచియున్నది. ('మహారాజు చిరంజీవియగుఁగాక!, మహారాణి చిరంజీవియగుఁగాక!' అనుహర్షధ్వనులు.) మీరాణి యా

మగఁటిమిని బీల్చివేయుచున్నది. ఓవిప్రులారా! దురాశాధ్వాంతభూయిష్ఠమగు నిట్టివక్రమార్గములఁబోయిన, నదృష్టభాగ్యుఁడు మీకగపడఁడు. ఎన్నటికిఁగాని మీరు బాగుపడరు. సదాచారసంపన్నులగు బ్రాహ్మణులనిన; నేను వారిఁ బూజింతును. కాని దురాచారులగుబ్రాహ్మణులను మ్లేచ్ఛులకంటె హీనముగాఁ జూతును. ఏలయన; వీరు సన్మార్గము నెఱిఁగియు, దుర్జనులై యున్నారు. మ్లేచ్ఛుఁడో, దుర్మార్గముఁదప్ప మఱిదేని నెఱుఁగఁడుగదా! సనాతనధర్మపరాయణు లెవరైన నిచటనున్నయెడల, నేను వారిఁ బ్రార్థించుటేమన, ముందుకు రండు. వచ్చి, మీపూర్వులగు ద్రోణాచార్య, అశ్వత్థామ, చాణక్యులవలె దివ్యాయుధములఁ గైకొని మీశక్తిచే నీపవిత్రకార్యమునకు మీచేనైనంత సాయ మొనరింపుఁడు. మీకిప్పుడు దివ్యాస్త్రములు లేవని లజ్జనొందకుఁడు. రండు. అందఱు యోధు లుపయోగించునాయుధములను మీరుకూడ ధరించి మీశక్తికొలఁది పోరాడుఁడు. మీరొనరించుసాయ మెంతస్వల్పమైన నేమి? ఇప్పుడదియుఁగూడ మీదేశమునకుఁ గావలసియున్నది.”

“ఓక్షత్రియులారా! మీరు మీసాహసపరాక్రమములను మీమాతృభూమికి శత్రువగువానికి విక్రయించితిరి. కుటుంబకలహములందును, పనికిమాలినకుట్రలయందును మీరు తగుల్కొని మీసాహసము నెదుపలొనరించుకొంటిరి. స్వధర్మనిర్వహణముకంటె, మీరు యుక్తాయుక్తములఁ బరికింపక సాహసములఁ జూపుచుఁ గాలముఁ గడుపుచుంటిరి. నిరంతములగు నికలఁతలను, విద్వేషములను మఱచిపోయి, మాతృదేశసముజ్జీవనముకొఱకు మీరందఱొక్కమొగమై నడుముకట్టి నిలువుఁడు.”

“ఓవైశ్యులారా! మీకుఁగలధనమును మీరు మీవిషయలోలత్వమునందును, వ్యభిచారవ్యవహారములందును దుర్వినియోగపఱచుచున్నారలే కాని, చిల్లిగవ్వయైన బీదసాదుల నుద్ధరించుటకై వ్యయము చేసినవారు కారు. ధనమే ప్రధానమని మీరు తలంచి, యీపాడుధనముకొఱకు మీరెన్నియబద్ధములాడుటకైన వెనుదీయుటలేదు. మానముపోయినను, రాగిరువ్వవచ్చినఁజాలు

నని మీరు భావించుచున్నారు. ఇంతకును ధనపిశాచము మిమ్మిట్టాడించుచున్నది. ఇంకనైన నిట్టినిద్రనుండి మీరు మేల్కొని, మీయస్త్రములచేతను, మీధనాదికములచేతను మీమాతృభూమికి బాసటలై నిలువుఁడు. ఇపుడు మీదేశమునకు రెండును గావలసియున్నవి. మీవాణిజ్యకళాసముజ్జీవనమునకొఱకును, మీయైశ్వర్యసంరక్షణమునకొఱకును మీరు క్షత్రియులపై నాధారపడియుండుటవలనఁ బ్రయోజనములేదు. మీకుఁ దగినయా గ్రంథములను మీరు దాల్చి మీస్వదేశమైత్రిఁ బోషింపుఁడు. ఆవంతవిరమును జూపి యశీపొందలని మీకిపుడువచ్చియుండు పాడుపేరును బాపుకొనుఁడు."

"ఓశూద్రులారా! 'మేము కాయకష్టమొనరించువారము'' అనిమీరు నాకడ గర్వోక్తులాడకుఁడు. మీపడు కష్టములన్నియుం విధిలేక పడుచున్నారలేకాని వేఱుకాదు. మనస్ఫూర్తిగఁ జేయుకార్యముమాత్రము గణనకు వచ్చును. ఓశూద్రులారా! మీమాతృదేశము మహావస్థలంబడి కుములుచుండ మీరు గోళ్లుగిల్లుకొనుచుఁ గూర్చుండి యుంటిరి. ఇంక చే రాజ్యమునందు మీకుఁ గల సక్రమాధికారమును స్వయంకృతాపరాధమున మీరు కోల్పోయితిరి. ఇంతకును నిరంకుశుఁడగురాజు, తక్కినవర్ణములవారికంటె మిమ్ములనే మిక్కిలిగా హింసించును. బ్రాహ్మణుఁ డేగాని యాచావృత్తి ముఖస్తుతులచేతను, పాండిత్యప్రకటనముచేతను నాతనిఁ దనవల వైచుకొనగలఁడు. క్షత్రియుఁ డానిరంకుశప్రభుసైన్యశ్రేణులఁ జేరి తప్పించుకొనును. వైశ్యుఁ డాతనికి సువర్ణపూజచేసి యాతనిమది కెక్కును. కాని మీరుమాత్రము నిస్సహాయులై యా రాక్షసునిహింసలకు గురియగుదురు. ధనమా? మీకులేదు. గ్రంథపరికరములా! మీకెఱుంగరు. చతురవాక్యసరణియా? మీకుఁ దెలియదు. ఇఁక నాతఁడు మిమ్మెట్లు కరుణఁజూచును. అప్పుడు మీబాధలు రెండింతలగును. మూఁడింతలగును. పెదవి తెఱచి మీకష్టములఁ జెప్పుకొనుటకైన మీకు గుండెలుండవు. పనిపాటలమునిఁగి తెలివిలేకుండు సామాన్యజనులదీనాలాపములు, నిరంకుశ రాజసభలయందే కాదు—ఒక్కొక్కప్పుడు రాజద్వారులకొలువులందుఁ గూడ

వినఁబడవు. దుర్భరమగు నిట్టియవస్థనుండి తప్పించుకొనుటకు మీకొక్కటేమార్గ మున్నది. హూణునితోఁ గయ్యమొనరింప సమకట్టియుండు హైందవనరేంద్రమండలిరాణువయందు మీరందఱు వేనకువేలుగాఁ జేరుఁడు. చేరి, మీనెత్తురుటేరులను యుద్ధభూమియందుఁ బ్రవహింపఁజేసి, రాజ్యపాలనావిధానమునందు మీకుఁగలయధికారమును స్థిరపఱచుకొనుఁడు. ("మేము సిద్ధముగా నున్నాము. మేము సిద్ధముగా నున్నాము." అనుధ్వనులు.) అయినఁ బొండు. పల్లెయనక పట్టణమనక, దూరమనక దగ్గఱయనక, మూలమూలలకుఁ బోయి భూమిదున్నుకొని బ్రతుకు మీరైతుసోదరులకు నాయీసందేశమును వినిపింపుఁడు."

అంతట యశోధర్మ అచటికిఁ గొంతదూరమునఁ దొలఁగి నిలిచియుండు ప్రజలఁ గాంచి "ఓపంచములారా! 'మాహింసల కంతములేదు' అని మీరు నాముందు బడాయిలుకొట్టకుఁడు. ఆహింసలను మీరు విధిలేక పడుచున్నారు కాని వేఱుకాదు. మనసారఁబడుబాధలే ప్రశంసనీయములుసుమా! అరమనసుతోఁ బడుబాధలు దేహమును గష్టపెట్టుటయేగాక, ఆత్మకుఁ గళంకముఁ దెచ్చిపెట్టును. ఓశ్వపాకులారా! ఇన్నిశతాబ్దములుగా మీరు కులీనులచే హింసింపఁబడుచుంటిరి. కాని వేదములుగాని, శాస్త్రములుగాని కడజాతివారి నెఱుంగవు. ('మహారాజు చిరంజీవి యగుఁగాక! మహారాజు చిరంజీవి యగుఁగాక' అనుహర్షధ్వనులు.) మీహీనస్థితికిఁ గారణము మీరే యని చెప్పవలసియున్నది. శూద్రులకంటె మీరధమదశయందున్నారు. నిస్సహాయులైయున్నారు. ఏలయన; సొంతమని చెప్పఁదగినది. మీకుఁ జిల్లిగవ్వయైన లేదు. స్వామ్యమైనది సూదిమొనయంత భూమికూడలేదు. మీరు కుక్కలకంటె నీచముగా, గాడిదకంటె హీనముగాఁ జూడఁబడుచున్నారు. అనుదినము మీపై బూఁతులువర్షించి మిమ్ము ముంచివేయుచున్నవి. కాన మీరు బాగుపడఁదలంచితిరేని, మీకొక్కటేమార్గ మున్నది. మీలో మీరే పటాలములుగ నేర్పడి, ముందురానుండుయుద్ధమున హూణునితోఁ దలపడ సన్నద్ధులుకండు. బ్రాహ్మ

ణులు, క్షత్త్రియులు, వైశ్యులు, శూద్రులు, వీరందఱివలె మీరుకూడ మాతృ దేశమునకుఁ బుత్త్రులే కదా!'' అని యుపన్యసించెను.

తరువాత యశోధర్మ జనసమూహమునంతయు నొక్కమారుగా నుద్బోధించుచు ''కీర్తిప్రతిష్ఠలఁ గాంచవలెనని నేనిట్టిసాహసకార్యముల నుద్యోగించినవాఁడఁగాను. నేను కాని, చారుమతి కాని, బాలాదిత్యుఁడు కాని, కుమారపాలుఁడు కాని నూతనరాష్ట్రాధిపత్యమునకై — దాని ధర్మాధికారిని గాదని — యాక్రమింపనొల్లము. బాలాదిత్యమహారాజన్యుని యుదారగుణము వింటిరా? సముద్రగుప్తసార్వభౌముని చే రాజ్యము గోల్పోయి పరాజితుఁడైన ప్రభువంశాంకూర మెవ్వఁడైనఁ, బ్రస్తుతము హూణులయధీనమున నుండు రాష్ట్ర మెద్దానినైనఁ దనది యని, చెప్పవలయునే కాని ఆరాజ్యముగాని ప్రజలు తమ పూర్వరాజవంశజుని యాధిపత్యము నాశింపకుండినయెడలఁ దనకుఁ గలపరిపూర్ణాధికారమును వదలుకొందునని బాలాదిత్యమహారాజు చెప్పియున్నాఁడు. ఇందులకు నేనుగూడ సమ్మతించితిని. దేవరాష్ట్రమహారాష్ట్రస్వామి యగునరు రాజేంద్రుఁడు సౌరాష్ట్రము తనకుఁ గావలయుననెను. అతని కారాష్ట్రముతో నావంతయుని సంబంధము లేమిం జేసి, మే మందుల కంగీకరింపమైతిమి. 'నీకే కాదు. మాకుఁగూడ మేమిట్టి ప్రమాణము నుంచుకొంటి'మని మే మాతనికిఁ దెలియఁజెప్పితిమి. ప్రియతములగు నాప్రజలారా! నేఁటిపరిస్థితులను మీరు తలఁచి చూచినట్లు లేదు. భారతదేశభవిష్యద్దశ యీసమరముపై నాధారపడియున్నది. ఈసనాతనభూమి యనాగరక — సముద్రమున మునుఁగుటకుఁగాని, లేక యొక్కమారుగాఁ దేలి గట్టెక్కి యార్యమతమును, నాగరకతను, పరిజ్ఞానము నుద్ధరించుటకుఁగాని యీయుద్ధమే కారణమై యున్నది. ఇట్టిక్లిష్టపరిస్థితుల మీవర్తనములపై భారతదేశభాగ్య మాధారపడియున్నది. దాక్షిణాత్యులగురాజులు కొంతమంది యేదియో కొంతకుఁగొంత సాయ మొనరించుచున్నారు. కాని మనప్రయత్నము లింకను గొఱవడియున్నవి. ఇప్పటికిఁగూడ మనబలములు హూణరాజుబలములతోఁ దులఁదూఁగఁజాలకున్నవి. కాన నో భార

తీయుదురా! మీరందఱు వేనవేలుగా లక్షలులక్షలుగా సైన్యమునందుఁ జేర వలయునని నాకోరిక. హూణబాధితుల విలాపస్వరములు మీ చెవులఁ జిల్లులు చేయుటలేదా? వితంతువులు, మందభాగ్యులు, మిమ్ముల బతిమాలుటలేదా? విషాదుఁడగు విదేశజానిబారినుండి రక్షింప మీకొఱకై గృహిణు లెదురుచూచుచున్నారు. ఇట్టిపరిదేవనములఁ బెడచెవింబెట్టువాఁడు మీలో నొక్కఁడైనఁ గలఁడా? ఉండఁడని నానమ్మకము. ('ఎవ్వరులేరు, ఎవ్వరులేరు' అను కేకలు.) నామట్టుకు నాకొక్కటేమార్గము మిగిలియున్నది. పవిత్రమగు నీభారతభూమి నుండి హూణులఁదఱిమివేయు ప్రయత్నమున, నాదేహమునందలి రుధిరము కడపటిచుక్కవఱకు నర్పింప సంసిద్ధుఁడనైయున్నాను. ఒకవేళ నాకపజయము కలిగి నేనుమరణించునట్లు తటస్థించినచో, మీరిపుడు నాయెడఁజూపుచుండు భక్తివాత్సల్యములను మీయువరాజకుమారుఁడు నరసింహునెడఁగూడఁ జూప వలయునని చెప్పుచున్నాను. ఇఁక మీకు సెలవు" (మహారాజు చిరంజీవియగుఁ గాక!' అను హర్షధ్వనులు) అని చెప్పెను.

యశోధర్మ కలాంబారుకొఱకుఁ జారుమతిఁ జూచుటకై పోయెను. అతఁ డామెం గాంచినవెంటనే "కళింగపట్టణమునందును, అమరావతియందును బరిస్థితు లెట్లున్నవి?" అని ప్రశ్నించెను.

చారు:—అత్యద్భుతముగానున్నవి. కళింగు లీయుద్ధమును దమస్వకార్యముగా భావించుచున్నారు. సైనికులలో, నావికులలో నుత్సాహము బలిసియున్నది. సామాన్యజనులయుత్సాహము నిరుపమానమైయున్నది. ఒక విశేష మేమనగా; శూద్రులు గుంపులుకట్టి రాణువలోఁ జేరుచున్నారు. వైశ్యులు వారికై వారు, ధనరాసులఁ గుమ్మరించుచున్నారు. ఇపుడు కళింగు లీ కదనమునకు జూపుసమ్మతిలో నర్ధాంశమైన, నింతదనుక మఱియేయుద్ధమునకుఁగాని చూపియుండినవారు కారు. అమలాపురిలోఁ బరిస్థితు లెట్లున్నవి?

యశో:—అత్యాశ్చర్యముగానున్నవి. నేను నామహాకోసలులను నమ్మినందుకు, వారిపు డనువగుతీరున వర్తించుచున్నారు. వారియుత్సాహమును నీవు చూచియుండవలసినది. పాటలీపుత్రమునఁ బరిస్థితు లెట్లున్నవి?

చారు:—ప్రశంసార్హములైయున్నవి. బాలాదిత్యుఁడు ఓకమహా సైన్యముఁ గూర్చుచున్నాఁడు. పరమార్థిపుత్త్రి పార్వతి లక్ష మొహరీ లర్పించినది. ఇదియుఁగాక, భద్రబాహుకుమారుఁడు ఈసత్కార్యమునకై జైనుల యందుఁ బ్రచార మొనరించుచున్నాఁడు. ఆప్రచారమునకు ఫలితముగా నిప్పుడు జైనులందఱు, మగధయుద్ధమునకై ధనాదికములఁ దెచ్చి ప్రత్యర్పించుచున్నారు. ఇదియంతయు వారికి రాణి సరస్వతిపై నుండునను రాగమునకు సాక్ష్యముకదా! ఇట్టిసరస్వతిని జేపట్టవలదని, మీరు బాలాదిత్యున కుపదేశించితిరికదా!

యశో:—ఈరాణి సరస్వతి యింతటి చాతురీధురీణ యని నేనప్పుడు తలఁచియుండలేదు.

చారు:—అపరాజితునిపంగతియేమి?

యశో:—కద కారాజు మనతోఁ జేరఁగూడదని నిశ్చయించుకొని నాఁడు. సౌరాష్ట్రముపగుఱించి మన మొనరించినతీర్పును విని 'హూణులే మనకంటె మంచివా' రనినాఁడఁట!

చారు:—మంచిది. అంతవఱకు నిర్ధారణమైనది ఇఁక మనముమాత్రము హూణులతోఁ బోరాడవలయును. ఈపనికి చాల చిక్కులున్నవి. కాని 'కష్టీ ఫలీ' అనికదా యార్యవాక్యము.

యశో:—కళింగమునుండి యెంతరాజువ రానున్నదో?

చారు:—౨౫౦,౦౦౦ భటులు రాఁగలరు. ౧౦౦,౦౦౦ క్రొత్తగా సైన్యమునఁ జేరినవారుకూడ సిద్ధముగా నున్నారు.

మహా:—సెబాస్. సెబాస్. ఇంత గొప్పపటాలమును గళింగ మియ్యఁ గలదని, నేఁగలనైనఁ దలఁచియుండలేరు.

యశో:—మగధనుండి మన మెంతరాజువను నిరీక్షింపవచ్చును.

చారు:—౧౫౦,౦౦౦ యోధులు రానున్నారు. ఈమహాచమూ సమూహామునకు మహారాజుబాలాదిత్యుఁడును, యువరాజకుమారుఁడు మురారియు నాయకత్వమువహింపనున్నారు.

మహా:—(ఆశ్చర్యముతో) రాజకుమారుఁడు మురారివచ్చుచున్నాఁడా? ఔనా? వానికిప్పు డిరువదేం డ్లుండును. కాదా?

చారు:—అవును. స్వమతోద్ధరణమున కగుయుద్ధమునందుఁ దనపెద్ద కుమారుఁడు నాయకుఁడై యుండవలయునని రాణి సరస్వతి పట్టుపట్టియున్నది.

నర:—అమ్మా! మురారికూడ యుద్ధమునకువచ్చుచున్నాఁడుకదా! నేఁ గూడఁ బోయెదను.

మహా:—నాయనా! నీకిప్పుడు నిండుగాఁ బదునాల్గేండ్లయినలేవు. కాన నీవు పోరాదు.

నర:—(ఉత్సాహముతో) నేఁబోయెదను. నేఁబోయెదను. నన్నడ్డగింపకుఁడు. నీకుఁ దెలియకుండ, నేను బరుగెత్తిపోయెదను. నేను వెనుదీయుచున్నానని మురారికిఁ దెలిసిన, నాతఁ డేమనునో తెలియునా? నేఁ బిఱికిపందనని యాతఁ డనుకొనఁడా?

యశో:—నరసింహా! నేను నిన్నుఁ గలాంజారుదుర్గసంరక్షమునకై నియమింపనున్నాను. నీప్రాణములనైన నిమ్ము కాని; కోటనుమాత్రము హమ్మాణుని స్వాధీన మొనరింపకుము.

ఈతంత్రమున కాయద్భుతుఁడు నరసింహుఁడు బేలుపోయి "బాబూ! ఈకోటలో నొక్కటాలిముక్కనైన హమ్మాణుని కొప్పఁజెప్పుటకంటె, నేను నూఱుమార్లు చావనైనం జచ్చెదను" అని పలికెను.

మహా:—కుమారా! ఆహమ్మాణుఁడు మనయుద్ధకేసరిని జిత్రవధఁ గావించెనఁట! నిజమా?

యశో:—అవును.

చంద్రభానుఁడు:—బాబూ! ఆమిహిరగులుని నీవెందుకుఁ గత్తికొక కండచేయవైతివి? వాఁడు దురాత్ముఁడుగా నున్నాఁడు బాబూ! వానితోఁ బోరాడ నాకుఁగూడఁ గోరికకలుగుచున్నది.

అనుట్టుని ముద్దుమాటలకుఁ జారుమతి యుప్పొంగి మందహాసమొన రించుచు "తండ్రీ! నీవుకూడ నీయన్న నరసింహునితోఁ గలాంజారుకోట యందుండి, హూణుఁడు కోటలోనికిరాకుండఁ జూచుకొనుచుండుము." అని బుజ్జగించెను.

చంద్ర:—వాఁడు కోటలోనికివచ్చినయెడల, యుద్ధకేసరిని వాఁడు వధించినట్లు నేను వానిని వధించెదను.

లలిత:—బాబూ! ఈమిహిరగులుఁ డంతచెడ్డవాఁడా?

యశో:—అవును తల్లీ!

లలిత:—బాబూ! అయిన నీవాతని నేల చంపలేదు? నీకందులకు సంశయమేల?

యశో:—అమ్మాయీ! నేనిఁక నెంతమాత్రము సంశయింపను.

లలిత:—అయినఁ బోయి, యుద్ధకేసరిం జంపిన యాదురాత్ముఁ జంపి వేయుము.

చంద్ర:—బాబూ! మురారిఁ గూడఁ గలాంజారుదుర్గమునకురమ్మని నీవేల పిలువఁగూడదు?

యశో:—(మందహాసముతో) ఛీఛీ! నీకు మురారిసాహాయ్యము కావలయునా?

చంద్ర:—వలదువలదు. మురారిని యుద్ధమునకుఁ బోనిమ్ము! మేము కలాంజారుదుర్గముఁ గాపాడుకొందుము.

మహా:—కుమారా! దాక్షిణాత్యులగురాజు లేమిసాయమొనరించిరి?

యశో:—అంతగా నేమియులేదు. శాకవర్ణుఁడు ౧౦,౦౦౦ సైని కులతో నరుదెంచినాఁడు. మఱికొందఱు తాముఁరాక, తమసైన్యములను మాత్రము పంపిరి.

చారు:—మనసన్నాహములు తుదకెట్లు పరిణమించునని మీయభి ప్రాయము?

యశో:—అత్యద్భుతముగాఁ బరిణమించును. ఎటుఁజూచినను మనకు విజయము నిజమని నాకుఁ దోఁచుచున్నది. కాని భావికాలగర్భమున నేమి దాఁగియున్నదో, యెవరికెఱుక?

మహా:—విజయమో, వీరస్వర్గమో, కదా!

యశో:—అవును. నీమాట నిజము.

చంద్ర:—ఇంత సందేహమేల? విజయమే దాఁగియున్నది. మరణమునుగుఱించి బాధ భావించు టెందులకు?

నర:—నీకేమియుఁ దెలియదు? మృత్యువు నెదుర్కొన సాహసింపని వానిని, విజయలక్ష్మి వరింపదని నీకుఁ దెలియదా? నీకు మరణమనిన భయమైనచో, నేను మురారిని నాకు సాయముగా నుంచుకొందును. నీవువద్దు.

చంద్ర:—ఓహో! నాకాభయము? అవసరమైనచో, నేఁడుకూడ మృత్యువు నెదుర్కొన సిద్ధముగా నున్నానుసుమా! అహోరాత్రముఁ డొనరించు ఘోరకార్యములఁ దలఁచుకొనునపుడంతయు నానెత్తు రుడికిపోవుచుండును అమరావతిలో నానెత్తురు తెర్లినదో లేదో, అమ్మ నడుగుము.

నర:—అమ్మా! వీనినెత్తు రుడికినదా?

చంద్ర:—అమ్మా! ఉడకలేదా?

'అవును. ఉడికినది' అని చారుమతి యమందానందమునఁ బల్కెను.

# ముప్పదిరెండవతరంగము.

వరాహమిహిరుఁడు.

అది చైత్రమాసము. పూర్ణిమాదివసము. రాత్రి పదిగంటలైనది. షోడశకళాసంపూర్ణములగుచంద్రకిరణము లుజ్జయినీనగరమును, గానిశాఖానగరమగు విక్రమపురమును కౌముదీకాంతుల స్నానము చేయించి వెండిపూఁతలు పూయుచుండెను. విశుద్ధనీలాంబరమునందలి వేలకొలఁదినక్షత్రములు భూలోకవిలాసమును నయనానందకరముగఁ బరికించుచుండెనో యన, హైందవముగ్ధాంగనలభంగిఁ దొంగితొంగిచూచుచు, నిరుపమానమగు నవకళాప్రసరణమున, నూతనతేజముఁ గల్గించుచుండెను. ఆకాశచిత్రఫలకమున ముఖ్యప్రతిమయగు నిశాకరుఁడు, శృంగారనాయకునిరీతి ముసిముసినగవుల నక్షత్రకాంతులమధ్య సంచరించుచు, వారిపైఁ బఱపు... నిర్మలకాంతుల క్రిందనుండుభువికిఁ ద్రిప్పి, యాత్మకాంతిపుంజములచే శోభాభాసురములై యుండు భౌతికవస్తుసముదాయములవంకఁ గన్నులు పండువుగాఁ బరికించుచుండెను.

ఉజ్జయినీవీథులయందుఁ గర్పూరముపఱచిన ట్లుండువెన్నెలలోఁ గొందఱుబాలు రాడుకొనుచుండిరి. వారితల్లులు దేశద్రిమ్మరులగు హూణులకు భయపడి బైటికిరానోడి, కిటికీలచెంతఁ జేరి యాబిడ్డలఁబిలిచి "బుజ్జిలారా! ప్రొద్దుపోవుచున్నది. వచ్చి నిద్రపొండు" అని వారిని బ్రతిమాలుచుండిరి. కాని వారియుద్భోధన లాయర్భకులచెవి కెక్కకుండెను. ఆటపాటల వారు మానకుండిరి. "దినదినము పున్నమగానుండదు. ఇందులకు బదులు మేము

పైయమవసనాఁడు పెందలకడనే నిద్రపోదుములెమ్ము" అని యూరకుక్కలను చుండిరి. హూణులువచ్చినదిమొదలు, పౌరకాంతలు పుక్కిటిపురాణములకై వెన్నెలరాత్రులందు వీథివసారాలలోఁ గూర్చుట మాని, పెరఁటివసారాలఁ గూడి కాలముబుచ్చుచుండిరి.

నాఁడు విక్రమపురమునందుఁ జంద్రునకుఁ బాడుగుళ్లు, పాడునగళ్లు, పాడింద్లుతప్ప మఱేమియుఁ గానవచ్చుటలేదు. కాని యీపాడుప్రదేశము మధ్య నొకయున్నతగోపురమమాత్రము, కట్టుకదలక నిలిచియుండెను. గుప్త రాజధానిని హూణులు ముట్టడించినప్పు, డీవిక్రమపురము గుప్తహూణ రణరంగమై చాలపాటు నలఁగెను. హూణులధాటికి యేడునెలలు తాళఁ గలిగెను. కాని పౌరులవి ద్రోహకర్మలకుఁ జిక్కి, కడకది హూణులచేతఁ బడెను. చప్పుడు సేయు హూణులు దేవాలయములను, నగళ్లను నాశమొనరించిరి. అమూల్యములగు శిలావిగ్రహములను ముక్కలుముక్కలు చేసిరి. నిరుపమానములగు చెక్కడపుఁబనులను, చిత్రములను రూపుమాపిరి. శిల్పచాతురీమహిమలఁ జాటువస్తువులఁ ముట్టిచివైచిరి. కనుబంత యశోవిశ్రాంత మగు గుప్తసామ్రాజ్యవైభవములను గన్నులకుఁ గట్టునట్లు ప్రకటించుచుండు నద్భుతకళానిదర్శనము లన్నింటిని, రాక్షసప్రాయులగు నాహూణులు నేల మట్టమొనరించి, అప్రతిమానమును, సనాతనమునగు హిందూదేశచారిత్రోదధి యందలి దివ్యసంఘట్టనమణులను భవిష్యద్భారతసంతానమునకు దక్కనీయక దోఁచుకొనిరి. కాని యీసర్వనాశమునుండి యొకగోపురముమాత్రము తప్పించుకొనెను. పాడుచేసినప్రదేశమునకు మధ్యభాగమున, నొకకట్టడమును నిల్పి యుంచినచోఁ దమపని వన్నెకెక్కగలదని సూచించి యట్లాగోపురమును రక్షింప నాజ్ఞఁజేసిన తోరమానునిచలచిత్తము, నెంతని కొనియాడఁగలము! ఈనిర్ధారణమునకు, వరాహమిహిరునికంటె నెక్కువగ సంతసించినవారు మఱెవ్వరుండరని చెప్పనగును. వరాహమిహిరుఁడు యువకుఁడు. ప్రసిద్ధుఁడగు నక్షత్రశాస్త్రజ్ఞుఁడు. అతఁ డిప్పు డాగోపురాగ్రమున నిలువఁబడి యొకమాఱు

శకాంతుని, మఱియొకమాఱు నక్షత్రములఁ జూచుచుఁ, దనమిత్రుఁడగు దండి యనుకవీశ్వరునితో సంభాషించుచుండెను.

"వరాహమిహిరా! నిన్న శాకుంతలనాటక మెట్లుండినది?" అని దండి యడిగెను.

వరా:—కళానైపుణ్య మించుక కొఱఁతపడియున్నను, నాటకము మాత్ర మద్భుతముగా నుండినది. కాని యీలోపములకు నటకులదూషించి యుపయోగములేదు. ఈకాలమున వారిం బ్రోత్సహించువా రెవ్వరున్నారు? నాట్యకళోపాసకులను గుప్తసార్వభౌము లధికముగాఁ బ్రోత్సాహపఱచుచుం డెడివారు. దానంజేసి నటకులు, నటకురాండ్రు కని విని యెఱుఁగని ప్రావీణ్యము వడసియుండిరి.

దండి:—అవును. నీమాట నిజము. ఆకాలమునందలి నాట్యకళాకౌశలమునుగుఱించి, మాతండ్రిగారు విచిత్రగాథలఁ జెప్పుచుండెడివారు. ఒక నాఁడు ద్రౌపదీవస్త్రాపహరణనాటకమాడిరఁట! కౌరవసభారంగమునందు ద్రౌపది తనమానసంరక్షణమునకై, వినువారిహృదయములు నీరగునట్లు విలపించుచుం డెను. ఆమెపతులు పంచపాండవు, లాపడఁతి పరిదేవనములఁ జెవులం బెట్టరైరి. ఆచారోన్మత్తములగు భీష్మద్రోణులు సామాన్యధర్మమునకుఁ గట్టుపడి కూర్చుండియుండిరి. తోడనే స్కందగుప్తచక్రవర్తి, కన్నులెఱ్ఱచేసి పటపటఁ బండ్లుగీటుచు, నయ్యది నాటకమనుమాటయే మఱచి, చివాలున నొఱ నుండి తరవారిఁదివిచి, దుశ్శాసనపాత్రధారిపైకి దూఁకెను. అంతలో నమాత్యు లాతని కడ్డుతగిలి, నాటకమనియుఁ, నయ్యది నాట్యకళాకౌశల మనియుఁ దమస్వామికి విన్నవించిరి. వెంటనే సార్వభౌముఁడు సంతోషించి, దుశ్శాసనద్రౌపదీపాత్రధారులకుఁ, జెరి యొకరత్నాంగుళీయకమును బహూకరించెనఁట!

వరా:—మనపూర్వులదినము లంతవన్నెఁగాంచియుండెను!

దండి:—ఈకాలమున మననటకుల కమూల్యములగు పారితోషికముల నెవరొసంగుదురు? ఇట్టి పరిస్థితులఁబట్టిచూచినచో నిన్నటినటకులు సమర్థులని చెప్పనొప్పను.

వరా:—అవును. వారు బాగుగనాడిరి. కాళిదాసకవికృతనాటకము లాడుటకుఁ జాల ప్రజ్ఞకావలయును. అట్లుండియుఁ వారు నాటకము రక్తికట్టు నట్లు ప్రదర్శించిరి.

దండి:—నిన్నటిదుష్యంతుఁడు వేఁటయందుఁజూపిన యాతురత చాల నద్భుతమైయుండెను. మృగయాసక్తికి నీవు ప్రతికూలుఁడవైనను, రాజులకుమాత్ర మయ్యది సముచితధర్మమని నీ వంగీకరింపక తప్పదు.

వరా:—రాజులు ధనుర్విద్యాకౌశలులై యుండవలసినదే. కాని సాధు వులగుహారిణములను జంపుట కగువేఁటయనిన నాకు ద్వేషము. సింహవ్యాఘ్ర గుహలయందుఁ జొచ్చి, వానిం జంపుటఁగూడ మిగుల పాపమనియు,నక్రమ మనియుఁగూడ నాయభిప్రాయము. ఇఁక నాక్రూరమృగములు జనావాస ముల కరుదెంచి, మానవులకుఁ బశువులకుఁ బీడఁగలిగించుచున్నయెడల, నప్పుడు వానిని వధించుట రాజసేవకులకును రాజునకును విహితమేగాక విధి యుఁగూడ నైయున్నది. ఒకవేళ సింహవ్యాఘ్రాదిమాంసభక్షకక్రూరమృగ ములు పల్లెలలోనికిఁ బట్టణములలోనికి వచ్చినయెడల వాని నక్రమముగా వధించుటకుఁ దగినకౌశలమును బడయుటకై రాజు లప్పుడప్పు డడవులకుఁ బోయి క్రూరమృగముల వేఁటాడుట యుక్తమనికూడ నేనందును. కేవలము సాధుమృగములను వేఁటాడుట దూష్యము.

దండి:—సింహములు, వ్యాఘ్రములు ప్రతిగ్రామమునకురావు. కాన భూకాంతుఁడు మృగయావినోదమునఁ బ్రవీణుఁడగుటకు సాధుమృగములనే వేఁటాడక విధిలేదు. ఆతనికిఁ బ్రొద్దుపోవుటెట్లు?

వరా:—తనయిచ్చవచ్చిన ట్లాతఁడు రథములందో, గుఱ్ఱములమైననో తిరుగాడుచుండవచ్చును. పల్లెపల్లెకుఁబోయి బీదలకు, రోగులకు, నిర్భాగ్యు

లకు, వితంతువులకు, వృద్ధులకుఁ దనచేనైనంతసాయ మొనరించుచుండనగును. ఈవిధముగా నాతనికిఁ బ్రొద్దుపోకయేమి? పులులు సింహములు గ్రామము లందు లేకున్నమాట; మూఁగలు, కుంటులు, గ్రుడ్డులు, బీదలు, రోగు లెంద ఱో యుందురు.

దండి:—ఈపనులఁగూడ మనరాజు లొనరించుచున్నారుగదా! కాని మృగయావినోదఫలముగ బ్రభువుల కలవడుసాహసపరాక్రమములును,సమయ స్ఫూర్తియు, జీవకారుణ్యమయములగు నీవుచెప్పినకార్యములవలనఁ గలుగవు. రాజగువాఁడు నీవనునట్లు వర్తించుచుండినయెడల, నిముసములో దొరలకో, దొంగలకో యోడి నెత్తిన గుడ్డవేసికొనిపోక మానఁడు. ఈవిషయము నటుం డనిమ్ము. మానవతియగు శకుంతలను దుష్యంతుఁడు భోగామయము నాలోచింపక నిరాకరించుటకంటె క్రూరకార్య మింకొకటిలేదని నీవనుకొనవా? ఆనిరాకర ణము నాకన్నుల కశ్రువులఁదెచ్చినది.

వరా:—అవును. నాకును దీన మానవు లింద్రియదాసులు కారాదని విదితమగుచున్నది. విశుద్ధచారిత్రయగు శకుంతలసైతము తనపెంపుడు తండ్రి యనుమతి నందకపూర్వమే మతవిధుల నుల్లంఘించి కామదాసియై దుష్యం తుని వలచి, పిదప నవమానముపాలై పెక్కుదుఃఖములఁ గుడువవలసివచ్చెఁగదా! కాని ముగ్ధాంగన, యట్టిపరిస్థితుల సాధారణముగ వేఱొకలాగున నడుచుకోఁ జాలదని నాయభిప్రాయము.

దండి:—అవును. అది సత్యము. కాని గాంధర్వవివాహము సర్వజన సమ్మతము కాకున్నను, ధర్మవిహితమైయున్నది. దాని నటుండనిమ్ము. కాళిదాసు శాకుంతలనాటకమునందు భరతవాక్యమున—

శ్లో. ప్రవర్తతాం ప్రకృతిహితాయ పార్థివ
స్సరస్వతీశ్రుతి మహతాం మహీయతామ్,
మమాపి చ క్షపయతు నీలలోహితః
పునర్భవం పరిగతశక్తిరాత్మభూః.

అని ప్రార్థించియున్నాఁడుగదా! ఇది నీకు విచిత్రముగఁ గన్పట్టుటలేదా? చక్రవర్తి యాస్థానవర్తియై సర్వసౌఖ్యముల నుయ్యాలలూఁగు కాళిదాసు వంటికవీంద్రుఁడును నీవిధముగా మరుపుట్టువునుండి తప్పించుకొనఁగోరుట నీకుఁ జోద్యమైయుండలేదా?

వరా:—లేదు. అది నాకు సామాన్యముగఁ దోఁచుచున్నది.

దండి:—ఈకాలమునఁ గవీశ్వరుల కట్టియభిమతము సాధారణమై యుండవచ్చును. మన మిపుడు నివసించుచున్నకాల మెట్టివానికిఁగాని మరుజన్మ మెత్తఁ బురికొల్పదు. కాని విక్రమాదిత్యచక్రవర్తిపాలనము దివ్యముగా నుండెఁగదా! అప్పుడుకూడ నింకొకజన్మమంద గోరిక లేకపోవుట నాకుమాత్రము మిగుల విస్మయముఁ గొలుపుచున్నది.

వరా:—అట్లు కాదు. క్షణికములగు స్వదేశసౌభాగ్యవిద్యుజ్జ్వాలలు విజ్ఞానఘనునిసైతము భ్రమింపఁజేయుచున్నను, ఇహలోకజీవితదుఃఖాంధకారము మాత్రము మానవులకన్నులకు గట్టుచుండును. విక్రమాదిత్యచక్రవర్తి పరిపాలనమున జీవితము సౌఖ్యజనకమై, యానందాలవాలమై యొప్పులఁ గులుకుచుండెను. ఆతనికాలమున ప్రతిష్ఠాపితములై కళకళలాడుముఖములతో నలరారుచిత్తరువులఁబట్టి యావిషయము విదితమగుచున్నది. పాటలు నాటకము లిట్లే కీర్తించుచున్నవి. కాని యిట్టిభౌతికానంద మెంతయైనను, సారూప్యానందముతో సరిపోలునా? కాళిదాసువంటిపురుషోత్తముఁడు, తామరాకును నీరంటనివిధమున, లౌకికానందము ననుభవించుచుండియు, సనాతనఋషీంద్రసంస్తుత్యమును, భవబంధవిచ్ఛేదమును, నిత్యమునగు దివ్యానందమునందఁ గమకించుచుండును.

దండి:—వరాహమిహిరా! నీ వెల్లప్పు డూర్ధ్వలోకములగుఱించి యోచించుచుందువుగానఁ బరలోకసౌఖ్యములఁ బ్రస్తుతించుచుందువు.

వరా:—దండీ! విశుద్ధనీలాంబరమునందలి నిశాకరతారకలను నేను జూచునపుడంతయుఁ 'పుండరీకమండితమగు 'నీలకాసారమున నత్యుత్సాహ

మున నీదులాడు రాజహంసమే రాకాసుధాకరుఁడు' అనునద్భుతమగు నీ యుపమాలంకారము నాకు జ్ఞప్తికివచ్చుచుండును. మీకవీశ్వరులకుఁ బుట్టిని తోడవులగుసూహాబలమును మీకుఁగల భావప్రదర్శనాచమత్కారమును మహైశ్వర్యసంధాయకములై యుండునుసుమా!

దండి:—నాయుపమాలంకారము నీకు హృద్యమైనందులకు నాకు సంతోషముగానున్నది. స్వర్గీయములను భౌతికములతోఁ బోల్చినందులకుఁ దప్పుపట్టెదవేమో యని భీతిల్లితిని.

వరా:—నీవు పోల్చినవిరెండును, సౌందర్యమున సమానములగుటచే నీయుపమాలంకారము సలక్షణముగనున్నది.

దండి:—అన్నట్లు మఱచితి. ఈజలజోపమానమునకుఁ గారణము నీవే యని నీకుఁ దెలియదుకాఁబోలు.

"అదెట్లు?" అని వరాహమిహిరుఁ డాశ్చర్యముతో నడిగెను.

దండి:—నక్షత్రము లుదయించి యస్తమించుచుండుఁగాన, నవి సంచలన మొందుచుండునని నేను భావించితిని. సుప్రసిద్ధనక్షత్రశాస్త్రవేత్తయగు నార్యభట్టు 'నక్షత్రమండలము సుస్థిరమైనది. భూచక్ర మిరుసుపై విరామము లేక తిరుగుచు, మార్తాండనక్షత్రచంద్రమండలముల కుదయాస్తమయములఁ గల్గించుచుండును. అతివేగముగఁ బయనమొనరించు, నౌకయందలి మానవునకుఁ గూలస్థములగు స్థిరపదార్థములు వెనుకకుఁ బరుగిడునట్లు తోఁచువిధమున సూర్యచంద్రనక్షత్రాదు లెంత యచంచలములైయున్నను, బ్రతిక్షణము చలించుచున్నట్లగపడుచుండును.' అని సిద్ధాంతీకరించియుండుటచే, నేనయ్యది విశ్వసించి, తారకలన చంచలములగు తామరపూవులతోఁ బోల్చితిని. కాని వరాహమిహిరా! ఉన్నదున్నట్లు చెప్పుము. సూర్యుఁడు, చుక్కలు నిశ్చంచలములని నిస్సందేహముగా నిర్ధారణ మొనగింపఁబడినదా?

వరా:—లేదు. సూర్యుఁడు నక్షత్రములు నంతకంటెఁ బెద్దవియగు నక్షత్రగోళములఁ జుట్టుచుండవచ్చును. కాని మన కీవిషయమై యేమియుఁ

తెలియదు. నాగురుశేఖరుఁడగు నార్యభట్టు సూర్యాదినక్షత్రములు భూమిని జుట్టి తిరుగుచుండు ననువిచ్చిభ్రమకు లోనైయుండి 'తాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్లు'ని మొండివాద మొనరించెను. కాని యిప్పుడు మన మా సూర్యాదినక్షత్రములే భూమికిఁ బ్రదక్షిణించుటలేదని నిర్ధారణగాఁ జెప్పవచ్చును. ఇదియేకాదు. సూర్యుని భూమిచుట్టి తిరుగుచుండునని నూతన సిద్ధాంతము.

దండి:—మీరు నక్షత్రశాస్త్రజ్ఞులు విచిత్రమానవులుసుమా! భూమి గుండ్రనిదనియు, దానివ్యాసము ౧౫౮౧ యోజనములనియు, పరిధి ౪౯౬౭ యోజనములనియు నార్యభట్టెట్లుకనిపెట్టఁగలిగెనో నాకుఁ జిత్రముగా నున్నది.

వరా:—భూమి మండలాకారముగనున్నదని 'ఐతరేయబ్రాహ్మణము' నందుఁగూడ నిరూపింపఁబడినది. 'భూమండలము' అని దానియందుఁ బ్రయోగమున్నది. సూర్యునకుఁ బొడుపుగ్రుంకులులేవనియు, నిరుసుపైఁదిరుగు భూచక్రమున సూర్యున కెదురైనభాగము పగలని పిలువఁబడునని యా 'బ్రాహ్మణము' ప్రకటించుచున్నది. ఆర్యభట్టు భూపరిమాణమును సొంతముగాఁ గనుఁగొనెను. అట్లే, చంద్రుఁడు, గ్రహములు, ధూమకేతువులు సూర్యునివద్దనుండి తేజమును గ్రహించుననియుఁ, గాన సూర్యున కభిముఖములైయుండు నాగోళార్ధభాగములు, స్వీయపదార్థప్రకృతిఁజేసి వివిధకాంతులతోఁ బ్రకాశించుచుండుననియుఁ గనిపెట్టియున్నాఁడు.

దండి:—సూర్యాదినక్షత్రములుకూడ భూమివలె స్వభావసిద్ధములగు పదార్థములచే రూపొందియున్నవా?

వరా:—అవుఁ! అందులకు సందియములేదు. కాని యాపదార్థములు భేదించియుండవచ్చును.

దండి:—చంద్రబింబము సూర్యునివలనఁ గాంతినందుచుండుఁగదా! అయిన బింబమంతయుఁ బ్రకాశింపక, సగముమాత్రము ప్రకాశించుటకుఁ గారణమేమి?

వరా:—వారు నామాటలు వినుదురా? లోకుల గ్రుడ్డితనము చేవఁ బాఱియున్నది. లోకము తలక్రిందులైనను, వారు పురాణములయందలి నమ్మకము వదలరు. ఇఁక పౌరోహితులు మసిపూసి మారేడుకాయఁ జేయువారు. ఉన్నదున్నట్లు వారు చెప్పరు. అట్లు చెప్పినయెడల వారిపొట్టలు పూడుటకు మార్గమేమున్నది? నీయుపదేశానుసారము నడుచుకొనినచో నేను మూర్ఖుఁడనని లోకులు నన్నుఁ బరిహసింతురు. మేధావులగుపౌరోహితులు నన్ను మతిచెడినవాఁడననియు, నాస్తికుఁడననియు నిందించి, యనవసరముగా జనవిరోధముఁ గల్గింతురు; కాన నేను నాయభిప్రాయములను గ్రంథరూపమున వెలువరించితినేని, శాస్త్రము సత్యబద్ధమని రొటెంగినపౌరోహితులు, నాజోలికి రారు. ఇఁక లోకులసంగతియా? ఆశాస్త్రములను వారుచదువుట దుర్లభము. ఒకవేళ చదివిన, జ్యోతిషసిద్ధాంతములు వారికంతగా నర్థముకావు.

దండి:—మంచిది. దాని నటుండనిమ్ము. అయనసిద్ధాంతము, విషువద్విషయము, ఆరునెలలపాటుండు సమరాత్రిందివసములు, లంకయందలి సూర్యోదయకాలము రోమదేశమునం దపరరాత్రిసమయము మొదలగుసిద్ధాంతము లార్యభట్టువికదా? నీవు వీనిని విశ్వసింతువా?

వరా:—ఆసిద్ధాంతములలో నించుకైనఁ బ్రమాదములేదు. మాయాచార్యుఁడు సత్యసంధుఁడు. తనసిద్ధాంతము లన్నివిధము లసత్యములని తనకుఁ బూర్తిగా నమ్మకముకలుగువఱకు, వాని నాతఁడు ప్రకటించువాఁడుకాఁడు. తనశిష్యులగుమమ్ముల, నాతఁడు తనసిద్ధాంతములను తనకు బోధించునట్లు చేయుచుండును. అట్టిసమయముల నాతఁడు సంశయగ్రస్తునివైఖరిఁబూని, క్లిష్టములగుప్రశ్నలను మమ్ము నడుగుచుండును. మాకై మేముకూడఁ దనసిద్ధాంతములను గనిపెట్టితిమని, విశ్వసించువఱకు నాతఁ డూరుకుండెడివాఁడుకాఁడు. అంతటఁ దనసిద్ధాంతములగూర్చి, లెక్కకుమిక్కిలి యగుప్రశ్నల మాకుఁ దోఁచినవానినన్నింటిఁ దన్నడుగునట్లు చేయును. మాలో నెవ్వఁడైనఁ దన సిద్ధాంతముల నూఁగులాడించినచో, మాగురుసత్తముఁ డాశిష్యుని మెచ్చుకొని

'ఇట్టి నిరాధారములగుసిద్ధాంతములను లోకులకుఁ బ్రకటించి, వారిని మోస మొనరింపకుండ నన్ను మేల్కొల్పినందులకై నీకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడను' అనుచుండును. పరీక్షల వారి తేలియుండు పరిపూర్ణజ్ఞాన మలవడినఁదప్ప, నేఁటిసిద్ధాంతముల గదిలించుటగాని, కల్లలని చాటుటగాని తగదని యాతని మతము.

దండి:—లంక, రోమదేశములందలి సూర్యోదయసమయముల నాతఁ డెట్లు పరీక్షించెను?

వరా:—అంత తేలిక మతేమున్నది! లంకనుండి రోమదేశమునకుఁ దనశిష్యు నొకనిఁబంపి, తాను సిద్ధపఱిచినఘుంటాచక్రముసాయమున సముద్రయానమునఁ బట్టుకాలమును బహుజాగ్రత్తతోఁ గనిపెట్టునట్లు చెప్పెను. వాఁడు రోమదేశముఁ జేరునప్పటికి, ఘుంటాచక్రమునం దుండవలసిన కాలముకంటె నాఱుగంటలు తక్కువైయుండెను. అట్లే మరలఁ దిరిగివచ్చునపుడుకూడ నాతఁ డాఘుంటాచక్రమును మిగుల జాగ్రత్తగాఁ గనిపెట్టియుండెను. అప్పు డుండవలసినకాలముకంటె ఘుంటాచక్రమున నాఱుగంట లెక్కువైయుండెను. ఇట్లు లంకనుండి రోమదేశమునకుఁ బరిభ్రమణములో నాల్గవపాలు పట్టుగాఁ బట్టి, రోమదేశమున సూర్యుఁ డాఱుగంట లాలస్యముగ నుదయించుననుమాట స్థిరపడినది.

దండి:—ఇప్పుడు నాకు నమ్మకము కలిగినది. మీవృత్తికి జాలవఱకు శ్రద్ధాభక్తులును, శోధనాపరిశ్రమలును, నపరిమితధనమును నవసరములం సుమా!

వరా:—ఆకడపటిదిమాత్ర మీదినములలోఁ గావలసినంతగా లభించుటలేదు. కానఁ గొంతవఱకు నాపరిశోధనలు నిరాఘాటముగా సాగుటలేదు. నేఁ జెప్పిన యీపరిశోధనమునకుఁగాను, ఆర్యభట్టు, శిష్యుని సముద్రయాన భోజనాదివసతులకై ౨౦౦౦ పణములను వ్యయము చేయవలసియుండెను. విక్రమాదిత్యచక్రవర్తి యాతనికి దానమిచ్చిన ౧౦,౦౦౦ పణము లప్పటి

కింకను, గొంత నిలువయుండెఁ గాన, నాతని కవ్వి దట్టికత్తి యుండినది. ఇప్పుడు నాకుఁ బ్రతివత్సర మైదువందలపణములుమాత్రము వచ్చుచున్నవి. ఈనక్షత్రశాస్త్రసంస్థ యుజ్జయినియందుఁ బుట్టినదాదిగ, విక్రమాదిత్యసార్వభౌముఁ డద్దాని కనుగ్రహించుచుండిన నీమొత్తమును, నిర్భాగ్యుఁడగు బాలాదిత్యుఁడు తనకష్టనిష్ఠురము లెన్నియున్నను, నిలుపక పెద్దలపేరు నిలుపుచున్నాఁడు.

దండి:—ఆయైదువందలపణములలో నీ వద్దాని నెట్లు నిర్వహించుచున్నావు?

వరా:—నేను జోస్యముచెప్పి యార్జించుధనాదికములఁగూడ నీకార్యమునకై వినియోగించుచున్నాను.

దండి:—వరాహమిహిరా! మనయదృష్టములయందు, గ్రహనక్షత్రములకు జోక్యమున్నదని నీవు నిజముగా నమ్ముదువా? ఒక్కమాట. జోస్యము సముచితమని నీవు విశ్వసింతువా?

వరా:—కారణములేక, యేదియుఁ గలుగదు. మానవజీవితమునందలి ప్రతికార్యమున, కేదియేని యొకకారణ ముండితీరును. మానవునిజన్మకాలమునందలి గోచార, మాతనిజీవితవైఖరిని ధ్రువపఱుచుచుండును. ఆగోచారముఁ బట్టి, మేము దైవజ్ఞులము, మానవునియదృష్టమును నిర్ణయించుచుందుము. గర్భధారణసమయమునందలి గోచారమునుజూచినయెడలఁ, జాల నుపయుక్తముగా నుండును. కాని కోటికొక్కయెడనైన నిది యసాధ్యము. మఱియు జనకుని గర్భధారణసమయమో, లేక జన్మకాలమో, యాతనిసంతతిగుణగణములకును, అదృష్టమునకు నెంతయో సంబంధించియుండును. అట్లే యాతనితండ్రికిఁ దండ్రితండ్రికి సంబంధముండును. కాని రసవాదమువలె జ్యోతిషముకూడ నాచరణలో గణనకురాదు. అట్లని రసవాదమువోలె నయ్యది నిరర్థకవిద్య యనఁ జెల్లదు.

దండి:—అయిన జ్యోతిషఫలము, లసత్యములని తెలిసియు నీవేల యీవృత్తి నవలంబించుచున్నావు? నక్షత్రశాస్త్రమునందు మాత్రము కృషి సల్పుట మంచిదికదా?

వరా:—నక్షత్రశాస్త్రమునందు నాకు మిగుల నాసక్తికూడ నున్నది. కాని యాశాస్త్రమున రాగిరువ్వయైనఁ గనుల కగపడదు. నేఁగావించునక్షత్ర శాస్త్రపరిశోధనల, కయ్యెడి ధనాదికముల నియ్యఁజాలకపోవుట యటుండ, నాజీవనాధారమునకైన నయ్యది యుపకరింపదు. కాని యీజ్యోతిషవ్యాపారమునమాత్రము నాలుగుడబ్బులువచ్చునటుట నీవెఱింగినదేకదా! అసంపాదనమును నక్షత్రశాస్త్రపరిశోధనలకు వ్యయమొనరించుచున్నాను.

దండి:—నీపరిశోధన లిపు డెట్లున్నవి? సికై నీవేమైన సిద్ధాంతీకరించి యున్నావా?

వరా:—లేదు. ఇంకను నేమియులేదు. ఇప్పటిపఱ కార్యభట్టు, పరాశరమునీశ్వరులసిద్ధాంతములను నాపరిశోధనలచే నొంపెట్టుచుంటిని. ఇప్పటి కీపని చాలవఱకైనది. అనన్యవిదితము లగుసిద్ధాంతములను, అనంత, భూభార మెంత! సూర్యచంద్రనక్షత్రాదులు మన కెంతదూరమున నున్నవన విచుంగ బ్రయత్నించుచున్నాను. నాకిపు డిరువదియైదేండ్లువయసు. నేను గాలధర్మ మొందులోపల బ్రపంచజ్ఞానమునకు నాభాగముకూడ జేర్చి. నా పెద్దలకు, గురువులకు, దేశమునకు నేనుంబుఋణము తీర్చుకొనఁగలనని నాయభిప్రాయము.

దండి యాతనిఁ జేరి మందస్వరమున "మాతృభూమిప్రస్తావము వచ్చి నదిగదా! మగధ మహాకోసల కళింగదేశములందలి ప్రబలసమరసన్నాహము లను, యశోధర్మచారుమతుల యుద్రేకోత్సాహసంపూరితములగు నుపన్యాసములను నీవు వినియుందువుగదా! సగలనగరమునందలి మిహిరగులుని సమరాలోచనాసభనుగుఱించియు, యుద్ధకేసరి గీకరచిత్రవధల పాలగుటగుఱించియుఁ గూడ నీవాలకించియేయుందువు. యశోధర్మ రాణువలోఁగాని, బాలాదిత్యుని పటాలములోఁగాని సైనికుఁడవగుటకు నీకుఁ గోర్కెకలదా?" అని యడిగెను.

వరా:—ఆవిషయమై నేను దీర్ఘముగా నాలోచించి, కదకుఁ జేరఁ గూడదని నిశ్చయించుకొంటిని.

దండి:—మనరాజు, మనదేశము, సంకటసమయములనుండునప్డు దిట్టి నిర్ధారణలొనరించుట, వారియెడ ద్రోహ మొనరించుటకదా?

వరా:—కానేరదు. ఈవిషయమై నేను బాలాదిత్యమహారాజులోఁ గూడ సంప్రతించితిని. ఆతఁడు నాకీవిధమున, లేఖామూలమునఁ దెలియ పఱచినాఁడు. "నీవు ప్రాణములఁ బణములుగా నొడ్డి, రణాంగణమునకుఁ జన రాదు. ఏలయన, సామాన్యసైనికుఁ డొకఁడు కాలగతినొందెనేని, వానితో నెల్లవిధముల సములగువారు వేలకొలఁది యాతనిస్థలమునకువత్తురు. కాని శేముషీవిశేషభూషితుఁడవు నీవు. జ్యోతిశ్శాస్త్రమును, నక్షత్రశాస్త్రమును సాంగోపాంగముగా నభ్యసించియున్నాఁడవు. అట్టి మహాపురుషుఁడవగు నీ మరణమున భరతఖండమునకుఁ దీఱనిలోటు వాటిల్లును. నీస్థానమున కరుదెంచు వాఁడు మఱియొకఁడుండడు. పైఁగా నేను యుద్ధరంగమునకుఁ దగనని నాకుఁ దెలియును. నేను భటుఁడనై యశోధర్ముకుఁగాని, బాలాదిత్యునకుఁగాని యంతగా నుపకరింపను. కాని నక్షత్రశాస్త్రవేత్తగను, జ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడు గను నేను నా పరిశోధనలమూలమున మనదేశపుఁ గీర్తిప్రతిష్ఠలఁ బెంపొందించుటయే కాక, హైందవనరేంద్రమండలి కొకించుకబాసటగా నిలిచియుండఁ గలను."

దండి:—ఎట్లు?

వరా:—ఉజ్జయినీపౌరప్రముఖులు నిన్న నాకడకుఁ బ్రశ్నకువచ్చిరి. వారికి నేను 'హైందవులకు విజయమగును' అని జోస్యముచెప్పి, హూణయుద్ధ సన్నాహములపటిమ సడలునిమిత్తము తిరుగుబాటొనరింప నిదియే యదనని వారి కుద్బోధించితిని. ఈసంగతి నీవు వినియేయుందువు.

దండి:—ఒకవేళ హైందవులు పరాజితులైనయెడల నప్పుడుజ్జయినీ పౌరులబాధలు భయంకరములై, దుర్భరములైయుండుఁగదా! విక్రమపురము

వలె నుజ్జయినిసైన్యము నేలమట్టమైపోదా? స్త్రీబాలవృద్ధులందఱు ప్రాణములఁ గోల్పోవుదురుగదా!

వరా:—అట్లే కావచ్చును. హైందవులోడిపోయి, భరతవర్షమంతయు హూణపాదాక్రాంతమైనప్పుఁ డిఁక నుజ్జయినిసైతము నాశమైననేమి? ఆసేతు హిమాచలము సందిగ్ధస్థితియం దలమటించుచుండ, నుజ్జయినికూడఁ దనచే నైనంతసాయ మొనరించుటకు వెనుదీయరాదు.

ఆమాటలకు దండి విభ్రాంతుఁడై వరాహమిహిరుం జూచుచు "నీవు యుద్ధకార్యము నంగీకరింపవని నేఁదలంచెదను" అనెను.

వరా:—అవును. నేనంగీకరింపను. భూములకని, దోపుడులకని, తుచ్ఛలాభాపేక్షచేఁ దలపెట్టుయుద్ధములు నాకిష్టములేదు. నిరంతరములగుగోళములఁ గన్నార్పక యదేపనిగాఁ జూచునలవాటైయుండు నాకు, అణువంత భూగోళమునందలి పరమాణువంతభాగమునకై పోరాడి నెత్తురుటేరులఁ బాఱించుట కరము క్రూరమనియు, బుద్ధిలోపమనియుఁ దోఁచుచుండును. కాని స్వనాగరకతా సముజ్జీవముకొఱకుఁగాని—స్వజాతిప్రాణసముద్ధరణముకొఱకుఁగాని—నడపీనుఁగులై మనియుండుటకంటె మరణ ముచితమని జనులు తలంచినపుడు తెగించి పోరునకుఁ గడంగుట న్యాయమే కాక, వారికి విధికూడనై యున్నది.

దండి.—మంచిమాట. దివ్యానందబంధురమును, ప్రశాంతిమయమును నగు నిట్టివిమలరాకాసమయములఁ దళతళలాడుచుఁ గలగలమని నవ్వుతారకలను, తేజోమయుఁడగు సుధాంశుని, విశుద్ధనీలాకాశమునఁ జూచునపు డొక మహాసమరము చేయఁబడనున్నదని నమ్మువా రెవరు! వరాహమిహిరా! నేను రణరంగమునకుఁ బోఁదలఁచియుంటిని. కాని యిపుడు నీయభిప్రాయముల నాలకించినతర్వాత యుద్ధభూమిప్రస్తావమువదలి కవిత్వము వ్రాసికొనుచుఁ గూర్చుండ నిశ్చయించితిని. యుద్ధభటుఁడనై నేనంత యుపకరింపను. కాని విశ్వవిఖ్యాతమగు మనదేశమునకుఁ దగినకవీశ్వరుఁడఁ గాఁగలను. వీరరసబంధ

లితములగు సమరగీతికల రచియించి, యీసందిగ్ధసమయమునం దుజ్జయినీ పౌరులు హూణులకుఁ దిరుగఁబడునట్లు వారిం బురికొల్పెదను. ప్రొద్దుపోవు చున్నది. ఇక నాకిప్పటికి సెలవు. పోయివచ్చెద. శుభమగుగాక!

వరా:—నాకును సెలవు. క్షేమమగుఁగాక!

దండి మెట్లుదిగి క్రిందికిఁబోయెను.

వరాహమిహిరుఁడు సోపానద్వారముఁ మూసి వెనుక కరుదెంచి, నక్షత్రములచాయఁ గన్నార్పక యట్లే చూచుచు నిలువఁబడియుండెను. అప్పుడొకయంగనామణి యాతని వెనుకవైపునకుం బోవు కవాటమును నిశ్శబ్దముగాఁ దెఱచి యచటి కరుదెంచెను. ఆకాంతకుఁ బదునెనిమిదియేండ్లుండును. ఆ మందయాన వాల్గన్నులబెళుకులు మందహాసరుచులతో సయ్యాటలాడుచుండెను. ఆయోలనాగ చీమచిటుకుమనకుండునట్లు మునివ్రేళ్లపై నడచివచ్చి వరాహమిహిరునిడాసి "మనోహరా! ఇంకను నక్షత్రములఁజూచుచున్నారా?" అని యాతనిఁ గౌఁగిలించుకొనెను.

వరాహమిహిరుఁ డాలేమను ముద్దుపెట్టుకొని "మనోహారిణీ! చంద్రమతీ! ఇట్టి ప్రశాంతసమయముల నేను రాత్రికాలమంతయు నక్షత్రముల నవలోకించుచుండుట నీకీనాఁడు క్రొత్తయా?" అని యడిగెను.

దాని కాచిలుకలకొలికి యించుక సంతాపస్వరమున "అనంగతి నాకు బాగుగాఁ దెలియును. కాని నేను సంవత్సరమంతయు వర్షఋతువైయుండ వలయుననియు, రాత్రులన్నియు మేఘాచ్ఛాదితాంబరములై, యంధకార బంధురములై యుండవలయుననియుఁ గోరుచుండుదు" అని పలికెను.

వరా:—దాన నీకగులాభమేమి?

"అప్పుడు నాప్రియుఁ డెల్లప్పుడు నాతోడనే యుండును. అప్పుడు నక్షత్రములఁజూచుటకు సాధ్యముకాదుకదా!" అని యాకాంత యాతనిఁ బ్రేమమీఱ ముద్దిడుకొనెను.

వరా:—ప్రియా! నక్షత్రములఁజూడ నీకిష్టములేదా?

చంద్ర:—ఇష్టమున్నది. కాని యెల్లకాలము చూచుచుండుట నా కిష్టము లేదు. కొన్ని సమయముల నేఁగూడఁ దూరస్థనై యుండవలయునని యాకాంక్షించుచుందును.

వరా:—కారణము?

"అప్పుడు గంటలకొలఁది మీరు నన్ను ఱెప్పవేట్టక చూచుచుందురు. నేనుగూడ మీచూపులయందు నాచూపుల నైక్యము చేసియుండవచ్చును" అని చంద్రమతి చక్కఁగాఁ దననాథుని నేత్రములఁ జూచుచుఁ బ్రేమామృతమును గురియించుచుండెను.

వరా:—కోమలీ! నీవిలోకనాంశువులు నాకు నక్షత్రములయం దగపడుచున్నవి.

చంద్ర:—(మందహాసముతో) అందుకుబదులు, మీరానక్షత్రకాంతులను నాచూపులయందుఁ జూడవలయునని నాయభిమతము.

వరా:—నేఁడు దండికవీశ్వరుఁ డిచటికి వచ్చియుండెను.

చంద్ర:—అతనిరాకపోకలను నేను జూచితిని. మీసంభాషణముఁ గూడ వింటిని.

వరా:—పొంచుండివింటివా?

చంద్ర:—నన్నుఁగాక మీకుఁగాని, మిమ్ముఁగాక నాకుఁగాని రహస్యము లేమున్నవి? కాన నాలకించితిని. మీరుభయులును శక్తివంచనచేయక యీ సదుద్యమమునకుఁ దోడ్పడఁ దలపెట్టిరని విని చాలసంతసించితిని.

"సరి. ప్రేయసీ! పోయి పండుకొనుము!" అని వరాహమిహిరుఁ డామదిరాక్షిని ముద్దుపెట్టుకొనెను.

చంద్ర:—వలదు. నేనిచటనేయుండెదను. మీరు తారకలఁ గన్నార్పక చూచుచుందురు. నేను మిమ్ముల గన్నార్పక చూచుచుండెదను.

వరా:—మంచులో నీకు జలుబుచేయును.

చంద్ర:—ఇంతకుముం దెన్నిమారులు జలుబుచేసినది? మీతోఁగలిసి యిచటఁ గూర్చుండుట రాత్రి మొదటిదా?

వరా:—ప్రేయసీ! నాన్యాయభాషణము లాలకింపుము.

చంద్ర:—మీన్యాయమునందు నాకు నమ్మకములేదు. కాన మీరు నన్ను నమ్మింపఁజూచుటవలనఁ బ్రయోజనము లేదు. క్రూరరాక్షసాకీర్ణములగు నపరిచితాటవులసైతము సీతామహాదేవి తనపతి ననుగమించియుండ, మీ రిచట మనయింటియందు మీసహాసనసుఖ నాకొసంగ నమ్మతింపకున్నారు గదా!

వరా:—నీవు మొండిదానవు. అయిన నీయిష్టము.

"కరుణాపూరితమగు మీసమ్మతికి నాసహస్రప్రణామములు" అని చంద్రమతి తననాథునిప్రక్కఁ గూర్చుండెను.

వరాహమిహిరుఁడు చంద్రాదినక్షత్రగణముల దదేకధ్యానమునఁ జూచుచుండఁ, జంద్రమతి ఱెప్పవెట్టక తనభర్తం జూచుచుఁ గూర్చుండియుండెను. ఇట్లా ప్రియులిద్దఱు సూర్యోదయమువఱ కాసీనులైయుండిరి.



# ముప్పదిమూఁడవతరంగము.

---

## కారూరుయుద్ధము.

భానుఁ డుదయించెను. కారూరుమైదానమునం దాతనియరుణకాంతులు ప్రసరించి యసంఖ్యాకులై యచటఁ గూడియుండు సైనికులయుష్ణీషములఁ బ్రతిఫలించి నానావిధవర్ణముల నుద్భవిల్లఁ జేయుచుండెను. హూణులు, వారిమిత్రవర్గము తొమ్మిదిలక్షలకు వచ్చియుండిరి. వారిరాణువ యపారమై యుండెను. వారి నెదిరించుటకై హైందవనరేంద్రులు ౬౫౦,౦౦౦ యోధులను జేకరింపఁగలిగిరి.

యశోధర్మ, మగధరాజకుమారుఁడు, మురారి, కుమారపాలుఁడు, శాకవర్ణుఁడు. వీరు హూణప్రతిపక్షులగు భారతనరనాయకులలో నాయకమణులని చెప్పవచ్చును. తలవనితలంపుగ బాలాదిత్యునకు జ్వరమువచ్చుటంజేసి, యాతఁడు స్వయముగ రణాంగణమునకు రా నసమర్థుం డయ్యెను. కాన మగధనుండివచ్చిన ౧౫౦,౦౦౦ సైనికులకు మగధయువరాజగు మురారి నాయకత్వము వహింపవలసినవాఁ డయ్యెను. యశోధర్మ యధీనమున 300,000 కళింగులు, ౧౦౦,౦౦౦ మహాకోసలు లుండిరి. కుమారపాలుఁడు ౫౦,౦౦౦ భటులతోడను, శాకవర్ణుఁడు ౧౦,౦౦౦ యోధులతోడను వచ్చియుండిరి. దాక్షిణాత్యులగురాజులు కొందఱు ౪౦,౦౦౦ సైనికులఁ దమతమదళవాయుల యధీనమునఁ బంపియుండిరి. ఈమహాభారతచమూసమూహము, యశోధర్మ సేనాధిపత్యమునకు నోఁచుకొనెను.

హూణసైన్యమునకు మిహిరగులుఁడు సర్వసేనానియై యుండెను. ఆతని చేతిక్రిందఁ జేష్టనుఁడు, నాహపాణుఁడు, రుద్రసింహుఁడు మున్నగుదళ

వాయములుండిరి. వజ్రాయుధుఁడు, మిహిరగులుని యధినాయకత్వమున, స్వసైన్యములను శాంతముగా నడుపుకొనుట కధికారమొందెను. ఇంద్రద్యుమ్నుఁడు తుదకు హూణులఁ జేరరాదని నిశ్చయించుకొనెను. అట్లని యశోధర్మపక్షము నవలంబించినచో, నొకవేళ మిహిరగులుఁడు గెలిచినఁ దనగతి యేమగునో యనుభయమునఁ గడ కాతఁడు తటస్థుఁడై నిలిచియుండెను.

ఇరువాఁగులవారు నత్యుత్సాహముననుండిరి. హూణులు, తమకు విజయము నిక్కమని భావించి, యీసమరము నొకపిన్నాటగాఁ దలంచుచుండిరి. వారివైరులుకూడఁ దాము గెలుపొందుట సత్యమని యనుకొనుచుండిరి కాని; యీయుద్ధము తమాషాయని తలంపకుండిరి. యశోధర్మరాజువయందలిసైనికులు—హిందువులు, బౌద్ధులు—'యశోవా మృత్యుర్వా' యను దృఢసంకల్పముతో నుండిరి. రణరంగమునుండి విజయసహితముగనో, ప్రాణరహితముగనో పోవలయునని యశోధర్మ శపథమొనరించియుండెను. రాజకుమారుఁడు మురారి విజయలక్ష్మినో, వీరస్వర్గమునో పొందవలయు ననునిర్ధారణతో నరుదెంచియుండెను. అతఁడు, పైనమైనపు డాతనితల్లి సరస్వతి యాతనిఁ జేరందీసి "నాయనా! ఇప్పటికిఁ గని వినని ఘోరయుద్ధమున నీవు పాల్గొనవున్నాఁడవు. ఓమురారీ! కావలయునని నేను నీకు 'మురారి' అనుపేరుపెట్టితిని. 'మురారి' 'మిహిరారి' యివిరెండును నామసారూప్యము నందియున్నవి. మిహిరారికర్థము: మిహిరగులారి; అనఁగా మిహిరగులసంహారి. భగవానుఁడగుమురారివోలె, నీవుకూడ నొకానొక కార్యార్థమై ఈభువి నవతరించినవాఁడవు. ఈ యసురుఁ డామురాసురునికంటె మహాక్రూరుఁడుసుమా! నాపట్టీ! విపత్కరమగు నీఘోరయుద్ధభూమికి నిన్నిట్టిపిన్నవయసునందే పంపుటకు నామనస్సొప్పుకున్నది. కాని స్వధర్మానుష్ఠానమున, నడ్డంకుల లెక్కిడఁగూడదు. నీపెద్దలగు గుప్తసార్వభౌముల కీర్తిప్రతిష్ఠలను నీవు కాపాడుదువని నావిశ్వాసము. వైరికి నీవు వెన్నుచూపకుము. విజయలక్ష్మిఁ జూఱఁగొనుటకై పోరాడుము. ఓటమి మీకుఁ దప్పని సరియైనయెడల మార్తురఁ జించి చెండాడి వానికి విజయానం

దము, స్వబలవినాశమున రూపుమాయున ట్లొనరింపుము. నీతమ్ముఁడు ధర్మగుప్తుఁడును, నీచెల్లెలు నారాయణియు నీవెంటరా నెంచిరి కాని, పసిబిడ్డలగువారిని నేను రానీయనైతిని" అని నుడివెను.

విజయమో, వీరస్వర్గమో రెండింట నొకటిఁ గాంతునని మురారి ప్రతిన యొనరించెను. అంతట సరస్వతి యాతని నక్కునఁ జేర్చుకొని "నాముద్దు కుఱ్ఱా! నీవు ధర్మయుద్ధమునఁ బోరనున్నాఁడవు. ఆర్యావర్తనివాసుల జీవరక్తమును బీల్చి పిప్పిచేయు నీరక్కసుల నుక్కడఁగించు నిమిత్తము కావలసినబలమును, సుకుమారమగు నీకరమునకు సర్వేశ్వరుఁ డనుగ్రహించుఁగాక!" అని దీవించెను.

నాఁటి రణాంగణమునందలి మురారివైఖరి, యాతఁడు తల్లికడఁ జేసిన శపథమును సార్థకపఱచుచుండెను.

పోయినమాఱు తనసైనికులు యుద్ధమధ్యమునఁ బాఱిపోయి, తనకుఁ దెచ్చినయపమానమును బాపుకొను నిమిత్తము, కాకవర్ణుఁ డీమాఱు స్వయముగ వచ్చియుండెను. తనభటులు సైత మంపటివలె విక్రమవిశృంఖలులని మాగధులకుఁ దెలియపఱచుటకై కుమారపాలుఁడు తమకమొందుచుండెను. కంచి, వేఁగి, కేరళసైనికు లాత్మపరాక్రమప్రదర్శనమున వైరిస్తవముఁ బడయఁ గొనుచుండిరి.

నేఁటియుదయమున నాయకులందఱు, తమతమ సేనానివహముల నుపన్యసించుచుండిరి. మిహిరగులుఁడు, చేష్టనుఁడు, నాహపాణుఁడు, వజ్రాయుధుఁడు తమయనుచరుల నుపన్యసించిరి. మిహిరగులుఁడు తనసైనికుల కీవిధమున నుపన్యసించెను. "ఓహూణులారా! మీబాహుబలవిస్ఫూర్తిని మఱియొకమాఱు ప్రకటించుటకుఁ దగినతరుణము, మీకీనాఁ డబ్బియున్నది. ఓటమిపై నోటమినందుచున్నను, ఈహిందువులు మనపై గత్తినెత్తుట కింకను సాహసించుచున్నారు. ఇప్పుడు మిమ్ముల నెదురొడ్డి నిలిచియుండు శత్రువుల సంహరించుట మీవిధియైయున్నది. ఈహైందవు లింక మీపేరువినఁ దల్లడిల్లున ట్లొనరింపుఁ

కార్యము మీభుజములపైనున్నది. ఈభారతీయులు మరల మిమ్ముఁ బ్రతిఘటించి నిలువకుండ వారికిఁ దగురీతి బుద్ధిఁజెప్పుపని మీపైనున్నది. శ్రేయస్సమృద్ధములును, లక్ష్మీనిలయములును నగుమహాకోసలము, మగధ, కళింగము, వేఁగి, కంచి, కేరళము మున్నగుదేశములకు, మనమార్తురక్షుద్రచమూసమూహమను కంచెయొక్కటియే, మీకడ్డుతగిలి నిలిచియున్నది. మీయెదుట నిలిచియుండు పాపిష్ఠులనందఱుఁ జించి చెండాడుఁడు. అప్పుడాసేతుశీతనగము మీకాటపట్టయియుండును. మాళవము మొదలగురాజ్యమునందలి ధనరాసులను మనము కాఁజేసితిమి. ఇఁక నచట చిల్లిగవ్వయైన లేదు. కాన మనకుఁ గ్రొత్తభూములు కావలసియున్నవి. ముఖ్యముగా బామియానుదేశమునుండి వచ్చిన వీరపుంగవులపై నీకంచెం బడఁగొట్టు భారమున్నది. మరల నిప్పుడు పాటలీపుత్రము భాగ్యాభివృద్ధినొంది కళకళలాడుచున్నది. కళింగపట్టణము, అమరావతి, కంచి మొదలగునగరములు మరలఁ దమసంపత్సమృద్ధిచే విశ్వవిఖ్యాతి నందియున్నవి. మీకై వేచియుండు స్వాదుఫలములవలె నవి నిలిచియున్నవి. ఇఁక యుద్ధపర్యవసానముంగూర్చి నా కంతయాతురత లేదు. గుప్తరాజులంతవారలఁ జీకాకుపఱచినసైన్యములకు—పర్షియను లంతవారలను గలగుండువడఁజేసినసైన్యములకు—నంతఃకలహములచేఁ జవికి నామమాత్రము నిలిచియుండు భారతరాజనాయకులఁ జూచి, దిగులొందఁబనిలేదు. కాని నేను నాహూణుల కొకవిషయముమాత్ర మెఱింగింపవలయును. ఇఁక పై నీపీడను వదలించుకోవలయునని మీకుఁ గోరికగానుండినయెడలఁ బ్రత్యర్థులనందఱు సంహరింపుఁడు. ఇంచుకంతయైనఁ బిఱికితనముఁ జూపిన భటుఁడు—హూణుఁడైనను, లబ్ధక్రయుఁడైనను—తోడనే కత్తి కొకకండగాఁ జేయఁబడునని నేను మీకుఁ దెలియఁజేయుట యనవసరమనుకొందును. ఓహూణులారా! నేఁటిసమరమున మీవీరవిహారమును నయనానందకరముగ దిలకించునిమిత్తము, మీపూర్వుల పవిత్రాత్మలు వేచియున్నవి. పెద్దలపేరుఁ జెఱుపఁబుట్టినభ్రష్టులని వారిమది నొప్పింపకుఁడు. ('హూణుఁడు చిరంజీవియగుఁగాక' అనుహర్షధ్వనులు.)

అంతట జేష్టుఁ డీవిధమున నుపన్యసింపసాగెను. "ఓహూణులారా హూణులు, మృత్యువునకు మృత్యువువంటివారని ప్రపంచమునకంతయుఁ దెలియును. 'పిఱికితనము' అనుమాట హూణభాషయందు లేదు. మీయందు నిలిచియుండు సైనికులు ధిరుజనాగ్రేసరులు. వీరమ్మన్యులు. అటులుండియు వారు ఈఁగలవలె బాధించుచుందురు. ఈఁగ బాధించుచుండిన దానిని విడుచువారెవరు? ఆయీఁగలకడ నపారమగుధనరూపమున మధు వమితముగా నున్నది. ఆపురుషాధములబిలుకుమార్చి, వారిభోగభాగ్యములఁ బురుషవరేణ్యులగుమీ రనుభవింపుఁడు. మనము హూణులము. మనము హూణులమై మన వలయును. ఈసమరమున మీరు హూణులని ప్రకటించి, హూణరాజన్యుని కృపానురాగములకుఁ బాత్రులగుఁడు."

పిదప సాహపాణుఁడు మాట్లాడెను. "ఓహూణులారా! మన మీసాడిచట విజయలక్ష్మి పాణిఁ గ్రహించి దోపుడుల ననుభవింపఁగూడియున్నారము. హూణుల కిట్టిచర్య లీనాఁడు క్రొత్తలుగావు. 'కష్టేఫలే' యనుట హూణులు స్వానుభవమునఁ గనుఁగొనిరి. మగధ, కళింగదేశములందుండు హేమరాసు లిపుడు మనకన్నులకుఁ బండువొనరించుచున్నవి ఈయుద్ధమును ద్వరలోఁ దుదముట్టించి, పాటలీపుత్రమునకుఁ బైనమానము రండు."

తరువాత వజ్రాయుధుఁడు తనయోధుల కిట్లుపన్యసించెను. "ఓయోధులారా! మీరిపుడు హూణపక్షచరులై పోరుచున్నారు. మీరు మీమిత్రులకు ధైర్యపరాక్రముల వెనుకఁబడకుఁడు. విజయానంతరము దోఁపిడులయందు మీకుఁగూడ, భాగమువచ్చుటకు సందియములేదు. మాగధులు మనకాశ్మీరమును జయించినవిషయము జ్ఞప్తిపెట్టుకొని, ఇపుడు మీరు మగధను గబళించి కసి తీర్చికొనుఁడు."

ఎదిరిసైన్యమునకు యశోధర్మ, మురారి, కుమారపాలుఁడు, కాకవర్ణుఁడుపన్యసించుచుండిరి. యశోధర్మయుపన్యాసము:—"మహాకోసల, కళింగ, మగధ, కామరూప, సింహళ, వేగి, కంచి, కేరళ వీరసత్తములారా! మహా

భారతయుద్ధానంతరము, నేఁడు మీరు పోరనుండునంతటిఘోరయుద్ధము, మఱి జరిగియుండలేదు. మనస్వాతంత్ర్యసంపాదనాప్రయత్నములను నాశ మొనరింప నెంచి, మనవైరులగుహూణులిచటఁ జేరియున్నారు. ఆరక్కసుల నిరంకుశపరిపాలనాభరమున నలువదిమూఁడేండ్లుగా మనమాతృదేశము పటిమ వదలి కుయ్యిడుచున్నది. నిషాదాధముఁడగు వైదేశికుఁ డుజ్జయినియందుఁ బాలన నల్పుచు, నిన్నిదినములుగా, సర్వసస్యసంపత్సమృద్ధమై మధుక్షీరములఁ బిదుకు నీభరతవర్షమును 'చక్కనిపాడియావును' పీల్చి పిప్పిచేసి, వట్టిపోవునట్లు చేసి, జీవచ్ఛవముగా నొనరించినాఁడు. వానికి లోఁబడియుండు రాష్ట్రములన్నియు బీడులై పోయినవి. దివ్యానందసుందరమై భూలోకవైకుంఠమై యుండిన దివ్యభూమి యిపుడు దుర్భరదుఃఖవివశాత్ములగు మందభాగ్యుల వేదనారావములచే నిండియున్నది. హూణునికోఱలఁ జిక్కి యల్లాడు రాష్ట్రీయు లనుక్షణము, రుధిరాశ్రుకణములు రాల్చుచున్నారు. నిస్సహాయులగు నిర్భాగ్యులు మీసాయమున కంగలార్చుచున్నారు. మీరు సంఖ్యయందు హూణులకంటెఁ దక్కువయనుటకు సందేహములేదు. ౬౫౦,౦౦౦ లకు మీరువచ్చియుండ, ౯౦౦,౦౦౦లకు హూణులు వచ్చియున్నారు. ఇందుకై మీరు నిరుత్సాహ మొందఁ బనిలేదు. దేవతలు ముప్పదిమూఁడుకోట్లుండ, రాక్షసు లఱువదియాఱుకోట్లు కుండలేదా? అట్లుండియు నెల్లప్పుడు దేవతలే విజయులగుచుందురు. ఎందువలన? ఎందువలననఁగా, దేవతలకు దైవబలమున్నది. అట్లే నేఁడు ధర్మము మనపట్లఁ గలదు. మీఁదుమిక్కిలి సురాసురుల సంఖ్యాబలమునందుండు భేదముకంటె, మనము రెండులక్షలసైనికుల నెక్కువగాఁ గలిగియున్నాము. మీరు వెఱపాటుపడకుఁడు. ఆకసమునుండి దేవతలీయుద్ధమును జూచుచుందురు. మనమోడితిమేని, వారు మనలఁ బరిహసింతురు. అప్పుడొక్కసారిగా మనము నరకమునఁ గూలుదుము. మనయోధులయం దెవ్వఁడుగాని జాతిమతభేదములవిడనాడి, నేఁడు సుక్షత్రియశేఖరుఁ డనిపించుకొనుఁగాక."

అంతట మురారి మాగధులతో నీతీరునఁ బ్రసంగించెను. "ప్రియతములగు నావీరులారా! పేదలను, బాధితుల నుద్ధరించునిమిత్తము, మీరు నేఁ

డిచటి కరుదెంచియున్నారు. మీది సైనికవృత్తి కాదు. మీసామాన్యవ్యాపారము యుద్ధముకాదు. అట్లుండియు నవసరమువచ్చినపుడంతయు మీరు నడుముకట్టి ముందుకువచ్చుచున్నారు. వితంతువులదీనాలాపములను, నిర్భాగ్యులపరిదేవనములను, మానవతులవిలాపములను, మీరు రణభేరీధ్వానములుగా భావించుచున్నారు. ఈసమరమున మీరు స్వలాభములకై ప్రాఁకులాడుట లేదు. ఈవిశాలవిశ్వమునందలి పౌరసామాన్యధర్మముల నెఱవేర్చుకొఱకు మాత్రము మీరిట కేతెంచియున్నారు. అధర్మపాలనము, అసత్యకార్యము లెక్కడఁగనఁబడిన నక్కడ నణఁచివేయుటకు మీరు సంసిద్ధులైయున్నారు. దుస్సహవేదనలమ్రగ్గు దిక్కుమాలినవారి గాచునిమిత్తము, ఆమడ నడుగుగా నెంచి మీరు పరుగిడుచున్నారు. స్వధర్మసంరక్షణార్థము పోరొనరించుధీరులు స్వప్రాణములఁ దృణముగాఁ జూతురు. స్వధర్మోద్ధరణమునకైన సమరమునఁ గాంచిన వీరమరణము, విజయముకంటె నెంతయో సంతోషప్రదమైయుండును. ఓశూరులారా! విజయలక్ష్మిపైననో, వీరస్వర్గముపైననో కన్నుంచుఁడు. మీరాజకుమారుఁడు మీవెంట నెల్లకాలముండును."

పిదపఁ గుమారపాలుఁడు తనయనుచరుల కీనాలుఁగుమాటలు చెప్పెను. "ఓశూరపుంగవులారా! మీసహజసాహసపరాక్రమములఁ బ్రకటించుటకు, మీరు వైశాలినగరమున హూణులచేఁ బొందినయోటమికిఁ గసితీర్చుకొనుటకు, మీకిపుడు బంగారువంటిసమయ మబ్బినది. చంపుటయో, చచ్చుటయో తప్ప, ధీరోదాత్తుఁడగుయోధునకు వేఱుమార్గము లేదు. బ్రహ్మపుత్రానది కావలికూలమున మీశత్రులు, విజయులగుమిమ్ముల నాహ్వానించుటకో, విగతజీవములగు మీశరీరముల నందుకొనుటకో వేచియున్నారు."

అనంతరము కాకవర్ణుఁడు తనసైనికుల కిట్లుపన్యసించెను. "ఓవీరవరులారా! 'సింహళులు పిఱికిపందలు' అనుపూర్వు లార్జించినదుర్యశమును బాపుకొనుటకై నేను చాల తమకమొందుచున్నాను. ఇందులకే నేను స్వయముగా వచ్చితిని. సింహళభూములు సారవంతములనియు, సింహళమునఁ బైరుపంటలు

సమృద్ధములనియుం లోకప్రసిద్ధికలదు. కాని సింహళులుమాత్రము సింహళద్వీపమునఁ దప్పపుట్టినారనియుం, సింహళద్వీపవాసుఁడు నీరసుఁడనియుం పేరు రాకుండఁజేసికొనుఁడు. మీరు, అనిరుద్ధపురనిర్మాతలసంతతియనుట మఱువకుఁడు. మీరు మీమాతృదేశపుఁగీర్తిని గాపాడఁగోరితిరేని తెగించిపోరాడుఁడు. మీరుపోయినను, నేనుమాత్రము రణావనివీడిరాను. నేనురాకున్న, మీ రనాథులై యుండఁ జేరవలసియుండును."

ఉపన్యాసములన్నియు నైనతర్వాత, సైనికులందఱు ప్రాతఃకాలభోజనము లొనరించిరి. అనంతరము యశోధర్మపటాలము విజయముకొఱకు కొంత తడవు ప్రార్థనలొనరించెను. ఇదియు నైనపిదప నిరుపక్షులవారును ఘోరయుద్ధమునకుఁ బూనిరి. హూణులయాశ్వికదళము నిరాఘాటముగా విహరించుటకు వీలులేని ప్రదేశము నొకదానిని యశోధర్మ జాగ్రత్తగా నేర్పఱిచెను. ఆస్థలముఁ జేరిన హూణులయాశ్వికదళము, నిర్వక్రపరాక్రమోజ్జ్వలమయ్యును, విజృంభించుట కశక్తమయ్యెను. ఆశ్వికసైన్యముపై నాత్మవిజయమున కాధారపడియుండిన హూణుల కందుచే నాశాభంగము కలిగెను. కాన నాఁటిసమరమునఁ బదాతులుమాత్ర మొండొరులతోఁ బోరాడవలసివచ్చెను.

హూణసురంగబల మిప్పుడు క్రిందికిదిగి, నింగిముట్టనార్చుచు బోర సాగెను. యశోధర్మభటులు స్వరక్షణమొనరించుకొనుచుఁ బ్రతిపక్షుల నంపవానలముంచి, వారల నొప్పించుచుండిరి. హూణులు క్రోధభీషణాకారులై క్రొల్పులులవలె భారతచమూసమూహమునందుఁ బ్రవేశించుచుండిరి. ఇప్పుడిరువాఁగులవారును ఖడ్గాఖడ్గిం బోర మొదలిడిరి. ఒండొరులు బల్లెములఁ గ్రుమ్ముకొనుచుండిరి.

కుమారపాలుఁడు హైందవదళమునకు వలపలివైపుననుండెను. అతని కెదుట వజ్రాయుధుఁ డుండెను. నిమిషములోఁ గామరూపసైనికులు దంబాచారులగు కాశ్మీరులను దెసలఁబట్టించిరి. కుమారపాలునిసైన్యము సదర్పదుర్వా

రులును, వైరిభయంకరులునగు పుళిందులనేకులుండిరి. ప్రాణము లఱచేతఁ బట్టుకొని కాలికి బుద్ధిచెప్పు కాశ్మీరులను వారు విడువక పలువిధములగు చిత్రవధలఁబెట్టి నుఱుమాడుచుండిరి. కాశ్మీరులు కాందిశీకులగుటను మిహిరగులుఁడు కాంచినంతనే, హూణకాల్బలము యశోధర్మసేనాముఖమును ముట్టడించునట్లాజ్ఞ చేసెను. అవియేకదవుగా హూణులు వీరోన్మత్తులై సింహనాదములొనరించుచు హైందవసేనాగ్రభాగమున నిలిచియుండు మహాకోసలులను, కళింగులను, మాగధులను మార్కొనిరి. హైందవులు సహజశూరులవలెఁ గయ్యమొనరించుచుండిరి. కాని హూణులు సంఖ్యయందు వారికతీతులగుటయేకాక, వ్యక్తిసామర్థ్యమునందుగూడ వారిని మించియుండిరి. మీఁదు మిక్కిలి హూణులకు యుద్ధనియమములు లేవు. నడుమునకుఁ గ్రిందిభాగమునఁ గొట్టుట తగదని తలంచునార్యులవలెఁగాక, వారు విచక్షణావిహీనులై సర్వాంగముల డొల్లఁ జేయుచుండిరి. ఇందుచే హూణులు తమయెదురొడ్డినిల్చియుండునార్యులఁ గ్రమక్రమముగా వెనుకకు నెట్టుకొనిపోఁగలుగుచుండిరి. హైందవపటాలము దాపలివైపు సింహళాధిపుఁడు కాకవర్ణునినాయకత్వమున నుండెను. అతనికెదురుగా ఘూర్జరులు, యౌధేయులు, హూణలఘుక్రయులగు భటులుండిరి. రుద్రసింహుఁడుకూడ నచటనే యుండెను. ఈభాగమునఁ గొంతసేపు తుములయుద్ధము జరిగెను. సింహళులు స్వప్రభుసమక్షమునఁ బలాయనసూత్రముఁ బఠించుటకు వెనుకాడుచుండిరి. తమతోనుండు కంచి, కేరళ, గంద్వానవీరులు తమ్ముఁ బాఱిపోతులని హేళనఁగావింతురని వారు జంకుచుండిరి. సహజశూరుఁడగు కాకవర్ణుఁడు ప్రాణముల లెక్కఁగొనక వీరవిహార మొనరించుచుండెను. తమరాజన్యుఁడు ప్రకటించుమహాద్భుతపరాక్రమమునకు సింహళు లాశ్చర్యమొందుచుఁ దాముకూడ స్వామికిఁ దగినసేవకులనిపించుకోఁ బ్రయత్నించుచుండిరి. కాని పాపము వారు సింహవిక్రములగుఘూర్జరులను, యౌధేయులను దాఁకి నిలువనోపకుండిరి. క్రమక్రమముగా వారు వెనుకకొక్కొక్కయడుగు పెట్టుచుండిరి.

హైందవసేనాగ్రభాగమును, దాపలవైపును పటిమసడలుచున్నదని గ్రహించి యశోధర్మ దిగులొందెను. కాశ్మీరులను వెన్నంటితఱుముకొనిపోవు కుమారపాలు నాతఁడు పిలిచి, వాహినీమధ్యభాగమును రెండుమూఁడువేల కామరూపజోదులచే నింపెను. ఇప్పటికిఁగూడ ముందువైపు కూలిపోవుచుండెను. కాన యశోధర్మ మురారిఁ బిలిచి "మురారీ! నేఁడు మనకు దుర్దినముగా నున్నది. ప్రబలప్రయత్న మొకదానిం గావింపుము" అని చెప్పెను. మురారి తనసైనికులకు వైరుల నతితీవ్రముగా మార్కొనఁ బ్రబోధించెను. మాగధులు ముందుకుఁ ద్రోసికొనిపోవుటకుఁ బ్రయత్నించుచుండిరి, కాని హూణులసామర్థ్యాతిశయమునకు వీఁగిపోవుచుండిరి. కళింగులు, మహాకోసలులు తమకంటె సంఖ్యాబలమునందును, వ్యక్తిబలమునందును మిన్నయగుహూణుల నెదుర్కొని వారిని వెనుకకు నెట్టివేయుట కశక్తులైయుండిరి. ఇచట నిట్లుండ, నచట నెడమతట్టు రుద్రసింహుఁడు మెల్లమెల్లగా హైందవసైన్యము వెనుకకు నెట్టుకొనిపోవుచుండెను. ఇంతలోఁ గుమారపాలుఁడు కాకవర్ణునకు బాసటయైవచ్చి, యాభాగమునకుఁ బటుత్వముకలిగించెను. యశోధర్మమురారులం సాహసకార్యము లనేకములు గావించుచుండినను, సేనాగ్రభాగము సడ్లువాఱుచునేయుండెను. కడకు యశోధర్మ తనసైనికులఁ గాంచి "కడపటిమాఱొక్కసారి తెగించిపోరుఁడు. ప్రతియోధుఁడును దైవప్రార్థన మొనరించి యేమైననగుఁగాక యనుధృఢమానసమున ముందుకుదూఁకుఁగాక. నేనుమాత్రము పర్యవసానముల గమనింపక ముందుకుఁబోవ నిర్ధారించుకొంటిని. ఆర్యుఁడగువాఁడెందులకు వెనుకఁబడఁడని నాకు బాగుగాఁ దెలియును" అని ప్రబోధించి ముందుకు దూఁకిపోయెను. మురారికూడ నాతని వెంబడించెను. మాగధులు, కళింగులు, మహాకోసలులు తమనాయకు ననుసరించిరి. "మీగృహములందలి మీపత్నులను, మీసోదరీమణులను మీరు తలంచుకొనుఁడు. అమాయకులగు మీబిడ్డల మదినుంచుకొనుఁడు. నేఁడు మీరోడితిరేని, వారు హూణాగ్నికాహుతియౌదురు. ఓసైనికులారా! కురుక్షేత్రయుద్ధమునఁ బోరాడిన మీ

పూర్వులను మీ రనుకరింపుఁడు" అని యశోధర్మ వారలఁ బురికొల్పుచుండెను. సైనికులందఱ కాయుద్బోధన నచ్చెను. వారియుత్సాహము వెల్లివిరిసెను. వారు భైరవమూర్తులై సింహనాదములొనరించుచు వైరులఁ దాఁకి, వారిధాటి నరికట్టిరి. మిహిరగులుఁడు, నాహపాణుఁడు, చేష్టనుఁడు తమభటుల కెంతయో పురికొల్పిరికాని, యుపయోగములేకపోయెను. మాగధులు, కళింగులు, మహాకోసలులు 'అటో యిటో' అని తెగించి వీరవిహార మొనరించుచుండిరి. "ఓ సైనికులారా! మీరు స్వాతంత్ర్యమునుబడయుట కిదియే కడపటిద్వారము. దానితలుపులమూయుటకు మీరియ్యకొందురా? మీపుత్త్రులు, మీపౌత్త్రులు, మీరు పిఱికిపందలని మిమ్ముల ద్వేషింపకుందురుగాక! అనుపూర్వికముగా మీరు మీపెద్దలనుండి గ్రహించుచుండుస్వాతంత్ర్యనిధిని మీరు కోల్పోవకుందురుగాక! నేఁడు మీరు పురుషులవలెఁ బోరుఁడు. లేకున్న మీరిఁక తలలెత్తుకొని నలుగురిలోఁ దిరుగఁజాలరుసుమా" అని యశోధర్మ వారిహృత్సరోవరముల నుత్సాహరసముచే నింపుచుండెను.

ఇరువాఁగులయందలివధాక్రమము బీభత్సమైయుండెను. వాహినీమధ్యమున సంగ్రామము తుములమైయుండెను. రెండుపక్షములవారును సమానముగఁ బోరుచుండిరి. హూణులు తమకంటె సంఖ్యాతీతులగుటంజేసి వారిసైన్యముకంటె నెక్కువప్రాణనష్టము కలిగినను వారద్దానిఁ బూరించికొనరని యశోధర్మ గ్రహించెను. సమరకాలము పొడవగుకొలఁది దమకు విజయము దూరమగుచుండునని యాతఁడు భీతిల్లుచుండెను. ఇంతలో దాపలివైపునఁగూడఁ దుములయుద్ధము జరుగసాగెను. అచటియుద్ధవీరు లిరువాఁగులవారును నటలువెతికిన సింహములపగిది పోరొనరించుచుండిరి. కుమారపాలుఁడు, కాళవర్ణుఁడు మరలఁ బూర్వస్థానము నాక్రమించి మార్తురపీఁచ మడఁచుచుండిరి. రుద్రసింహుని ప్రబోధములచే ఘూర్జరులును, యాఫేయులును దిట్టముగా నిలిచి హైహందపులఁ గసిమసంగుచుండిరి. పరిస్థితులఁబట్టిచూడ, నాఁటిసమరమున విజయలక్ష్మి తటస్థురాలై యుండునట్లు తోఁచుచుండెను. అట్లైన, యశోధర్మకుఁ ధీఱని

హాని చేయుటకు సంధియములేదు. ఇట్లు యశోధర్మ నిరుత్సాహుండై యుండ, హూణసేనామధ్యభాగమునుండి కొంతసైన్యము చేష్టనునియాధిపత్యమునఁ గదలిపోవుట యాతనికంటఁబడెను. అప్పుడొకవార్తావహుఁడు యశోధర్మకడకుఁ బరుగిడివచ్చి "దేవా! శూద్రులు, పంచములు వేనవేలుగావచ్చి వైరిసైన్యమును వెనుకనట్టు ముట్టడించినారు. వారిని మార్కొనుటకై ౧౦,౦౦౦ హూణులు చేష్టనునాధిపత్యమునఁ బోవుచున్నారు. హూణుల పనిపట్టుట కిదియే సమయము" అని విన్నవించెను. తోడనే యశోధర్మ హూణులఁ దాఁకఁ దనభటుల కాజ్ఞ చేసెను. సహజధైర్యోత్సాహులగుహూణులు పగఱ నెదుర్కొన సంసిద్ధులై యుండిరి. అట్టిసమయమున మిహిరగులునివద్ద కొకవార్తావహుఁ డరుదెంచి "దేవా! ఉజ్జయినిపౌరులు తిరుగఁబడినారు. చాళుక్యవీరుఁడు పులకేశి నిసౌరాష్ట్రమును ముట్టడించినాఁడు. యౌధేయులు ద్రోహులై కత్తులు కటారులుదీసికొని మనపైకి బయలుదేఱినారు. ఉజ్జయినియందలి మీ రాజప్రాసాదము నల్లరిమూఁకలు చుట్టుముట్టినారు. రాజద్రోహులు బొక్కసమును గొల్లఁగొట్టుచున్నారు. యౌధేయులు [illegible] ములతో నుజ్జయినియందలి రాజవిద్రోహులతోఁ గలియుచున్నారు. ఆసమయమునకుఁ జేరునట్లు గొప్పసైన్యము నొకదానిని పులకేశిని వారికి సాయముగాఁ బంపుచున్నాఁడు" అని మనవి చేసెను. మిహిరగులుని చెవుల కీపలుకులు ములుకులయ్యెను. అతఁ డాందోళనపడసాగెను. "ఉజ్జయినిఁ గాపాడుకొనుట ముఖ్యతమము. ఉజ్జయినియే మనమగఁటిమికిఁ బునాది. నామాతృదేశమున కానగరము దాపునఁగలదు. ఆహాహా! ఈసంగతి నాకు రేపు తెలిసియుండఁగూడదా? అంతలో నేనిచటి రాజద్రోహులఁ దునిమి, ఉజ్జయిని కరుదెంచి యచటిద్రోహాత్ముల పనిఁబట్టుటకు వీలుండెడిదికదా! కాని యిదెట్లు సాధ్యము? ఆలస్యమున నమృతముగూడ విషమగుఁగదా!" అని యాతండనుకొని, నాహపాణుఁ బిలిచి, యాతని కీపాడువార్తఁ జెప్పెను. ఒకక్షణమైన నాలసింపక మిహిరగులుఁడే రాజధానికిఁబోవుట యుక్తమని నాహపాణుఁ డాతని కుపదేశించెను. మిహి

రగులని నిష్క్రమణమును, అందులకుఁ గల కారణమును నిమిషములోఁ గార్చి
చ్చువలె నుభయసైన్యములందు వ్యాపించెను. హూణు లించుక నిరుత్సాహ
మొందిరి. హైందవు లుప్పొంగిరి. శ్రమాపరిభిన్నులగు తమ సేనానివహముల
కీసమాచారములు నిజములని చెప్పి, యశోధర్మమురారులు వారిని సంతోషాంబు
ధిం దేల్చుచు, ముందునకుఁబోవ నుద్బోధించుచుండిరి. హైందవసేనాసమూహ
ముత్సాహసంభరితమై యుండెను. భారతవాహినియం దంత నానందవీచిక లంబ
రమునంటుచుండెను. రుద్రసింహుని నాయకత్వమున నుండుయౌధేయులు,
తమ దేశీయులతిరుగుఁబాటు నాలకించి తత్తరమొందుచు, యుద్ధరంగమునుండి
స్వదేశమునకేగఁ దహతహలాడసాగిరి. స్వరాష్ట్రమగు సౌరాష్ట్రమేమగునో
యని రుద్రసింహుండుకూడఁ గళవళపడసాగెను. హూణులయదృష్టభానుం
డస్తాద్రిఁ జేరనున్నాఁడని రుద్రసింహుఁడు భావించెను. ఇఁక హూణసాంగ
త్యము నన్ను దురదృష్టాంధకారమున ముంచివేయునని తలంచి, యాతఁడు
హూణుల వీడిపోవ నిశ్చయించెను. ఇంతకుఁ దేలినఫలిత మేమనఁగా: యౌధే
యులు, ఘూర్జరులు, రుద్రసింహుఁడు; అనఁగా హూణసేనకు దక్షిణభాగ
మంతయుఁ దలవనితలంపుగా రణరంగమునుండి వెడలిపోయిరి. వేలకొలఁదిగా
యౌధేయులు, హూణులబ్ధక్రయులును హైందవసేనయందుఁ జేరిరి. ఇంత
సేపుగా వారితోఁ బోరుచుండిన కుమారపాలకాకవర్ణులాత్మబలములతో సేనా
మధ్యభాగమున కరుదెంచిరి భారతవీరులిప్పు డానందపరవశులై తమ కిఁక
జయము నిక్కమని యుప్పొంగుచుండిరి. "ఓ సైనికులారా! విజయము మన
కన్నులకుఁ గాడఁగట్టుచున్నది. మనయందుబాటులోనున్నది. ముందుకుఁబోయి
దాని నందుకొనుఁడు. నిర్భాగ్యులకును, వితంతువులకును హూణు లొనరించిన
యాపదలకుఁ గసితీర్చుకొనుఁడు" అని యశోధర్మ వారిఁ బురికొల్పుచుండెను.
తోడనే భారతవీరులు మదపుటేనుఁగులభంగి వైరుల డీకొనిరి. నాహాపాణుని
నాయకత్వమున నుండుహూణులు సహజసాహసపరాక్రమములు మెఱయఁ
బ్రాణములఁ దృణప్రాయముగా నెంచి సమరమొనరించుచుండిరి. కాని

యంతయుం బూదిఁబోసినపన్నీరగుచుండెను. కడకు విజయలక్ష్మి యుత్సాహ సంభరితులగు హైందవులను వరించున ట్లుండెను. ఎంత తెగించిపోరుచున్నను, అపజయము తప్పనిసరియగుచున్నదని హూణులకుఁ దోఁచుచుండెను. అటు లయ్యును వారు సంహారరుద్రులభంగి విహరించుచునే యుండిరి. శాకవర్ణుఁడు స్వభటుల వెంటఁగొని తలమిగిలి వైరి సేనానివహములోనికిఁ బోయి ప్రాణములఁ గోల్పోయెను. కాని హూతనిభటు లంతతో నిరుత్సాహపడక, శాకవర్ణుని తమ్ముఁడు మేఘవర్ణుని నాయకత్వమున ముందుమిగిలి పోరుచుండిరి. రాజకుమారుఁడు మురారి సాహపాణునితో బాహాబాహిఁ బెనఁగుచుఁ దీవ్రముగా గాయపడెను. తోడనే యశోధర్మ యానతిచే భటు లాతని వెనుకకుఁ గొనివచ్చిరి. ఇది తగదని యెంతయో దూరము మురారి యడ్డుపడెఁ గాని, యశోధర్మ వానిఁ జెవినిడఁడయ్యెను. కడ కావీరమౌళి మాగధులమ్యనిచి యథారీతిగా వీరవిహార మొనరించునట్లు మాటఁదీసికొని, వెనుకకుఁ గొనిపోఁబడుటకు నియ్యకొనెను. ఇప్పుడు యశోధర్మ మగధసేనానివహమునకుఁగూడ నాయకత్వము వహించెను. హైందవులు ముందువలెనే పోరుచుండిరి. హూణులు తమరాజకుమారుని గాయపఱిచినందులకై మాగధులు క్రోధభీషణాకారులై యెప్పుడెప్పు డరాతివీరుల మక్కడఁగింతుమా యని ముందంజ వేయుచుండిరి. హూణులందుచేఁ జేసేతఁ జేసినపనికిఁ దగినఫలము ననుభవించుచుండిరి. మాగధులు హూణులయుత్తమాంగములఁ దాళఫలములవలెఁ బైకెగురఁగొట్టుచుండిరి. అట్లు మాగధులు వారిని వెనుకకు నెట్టుకొనిపోఁగలుగుచుండిరి. ఇరువాఁగులయందలి వధోద్యోగము బీభత్సముగానుండెను. కాని హూణసేనయందు బీభత్సతరమై యుండెనని చెప్పఁదగును. ఆశూద్రులను, పంచములను సంహరించి చేష్టనుఁడింతలో 300,000 సైనికులతో వచ్చి హూణులకు మరల బాసటయై నిలిచెను. అప్పటికిఁగూడ హూణులు తమ్ముఁబైకొనివచ్చు హైందవవిజయాబ్ధి తరంగములను వెనుకకు నెట్టివేయఁజాలకుండిరి. యశోధర్మయశ్వము లిప్పటికి రెండు నిర్జీవములయ్యెను. కాని యాతఁడు మఱియొకహయము నెక్కి కదన

భూమి నెక్కడఁజూచినఁ దానయై కన్పట్టుచుండెను. ఆమహావీరుని యంగరక్షకులగు మహాశూరు లాతనికిఁ జుట్టుకోటలై, యాతనిం దుదముట్టింప హూణు లొనరించు ప్రయత్నమ్ముల భస్మొనరించుచుండిరి. యశోధర్ము నెదుటఁబడు హూణప్రముఖులందఱు, హైందవప్రచండాఘాతములచే నేలకొఱఁగుచుండిరి. ఇఁక విజయము కలుగునను నాశలు చేష్టనాహూణుల కడుగంటెను. కాని వారు విడువక పోరుచునే యుండిరి. హూణులసాహసము ప్రస్తుతిపాత్రమై యుండెను. యశోధర్మ యక్కజపడుచు "ఏలోకకార్యమునందైన నెడల, వీరు దైవాంశసంభూతులని పొగడ్తనందియుండెడివారు. వీరి సాహసధర్మావలంబులనుగాఁ జేసినచో వీరిని మార్కొడ్డి నిలుచుట యసాధ్యమగును. రణకేసరులగు వీరు సనాతనమతాంతరులైనచో, నాధర్మములరక్షించుటకు వీరు ప్రాణములనైన లెక్కింపరు" అనెను. యుద్ధ మతిఘోరమైయుండెను. ఇట్లు మూఁడుగంటలకాలము సమరము జరిగెను. హూణు లిఁక రణరంగమున నిలువఁజాలక, క్షిప్రానదితీరములకుఁ బాఱిపోయిరి. అచ్చట దానదిగట్టు లొఱసిపాఱుచుండెను. కాన హూణులు వీఁపుల నటువైపునకు ద్రిప్పి, తమపైఁబడు హైందవులఁ బ్రతిఘటించుచుండిరి. వీరోన్మత్తులగు నాహూణులను విజయోత్సాహసంభరితులయ్యును యశోధర్మ సైనికు లాక్రమింప నశక్తులై యుండిరి. కాని యాకదనభూమికిఁ జుట్టుపట్టులనుండు గ్రామీణులు హూణుల తలప్రాణము తోఁకకువచ్చినదని, వారిపీచమడఁచుటకై పాఱలు, గడ్డపాఱలు, నాఁగేళ్లు మున్నగువానితో వచ్చి వారి నెదిరించిరి. ఉజ్జయినీకారూరులకు మధ్యనుండు రాష్ట్రమంతయుఁ దిరుగుఁబాటొనరించినదని వార్తావహులు నాహూణచేష్టనులకు నివేదించిరి. ప్రజాకల్లోలములచేతను, శత్రుదండయాత్రలచేతను గూలిపోనుండు స్వరాజ్యమగు పశ్చిమమాళవమును దక్కించుకొన నెప్పుడెప్పుడు యుద్ధక్షేత్రమునుండి పోవుదునా యని నాహూణుఁడు తామరాకుపైని జలకణమువలెఁ దహతహలాడుచుండెను. చేష్టనుఁడు యుద్ధవిరామమువఱకుఁ గోరసెంచెఁగాని; యంతయు నిరుపయోగమని యాతనికిఁ దెలిసి

పోయెను. అపజయము హూణుల నఱిమి మూచుచుండెను. బెట్వాతీరమునం దలి హూణవధాక్రమము దీనిని సార్థకపఱచుచుండెను. ఉజ్జయినీపశ్చిమ మాళవములఁ గాపాడుకొన నెంచి నాహపాణ చేష్టనులు, ప్రాణభీతిచే దెసలు పట్టిపోవు హూణులఁ గాపాడి తమమానమును గాచివిడువుఁడని యశోధర్మ తో రాయబార మొనరింపసాగిరి.

హూణులను బ్రాణములతోఁ బోనియ్య యశోధర్మ కేమాత్ర మిష్టము లేకుండెను. కాని యాతఁడుకూడ జాలమంది సైనికులఁ గోల్పోయెను. మిగి లినభటులందఱు అలసిసొలసియుండిరి. ఇప్పుడు యశోధర్మ హైందవసేనానివ హమునకు సర్వాధికారియై, సర్వసేనానియై యున్నాఁడు. ఎటువోయి యేటు వచ్చినఁ దనకీసమరమునఁ గలిగినలాభములు వికటించునో యని యాతఁడు వెనుకముందాడుచుండెను. ఇప్పు డాతనికడ యుద్ధపరిశ్రాంతులగు ౩౫౦,౦౦౦ భటులుమాత్ర మున్నారు. నాహపాణ, చేష్టనులవద్ద ౧౮౦,౦౦౦ సైనికు లున్నారు. కాన ద్రాసు తెగునంతవఱకుఁ ద్రెంపరాదనియు, విసిగివేసారి యుండు హూణుల నింకను దాఁకుచుండినయెడల, వారు తమజీవముల గడ్డి పఱకలుగా నెంచి రణావని కర్పింతురనియు యశోధర్మ తెలిసికొనెను. చావు నకుఁ దెగించియుండు హూణునకంటె యుపద్రవకరుఁడు మఱియొకఁడు లేఁడని యాతం డెఱుంగును. హూణపరాభవము నాలకించినతోడనే భారతజాతి యంతయు మత్తువిదల్చుకొని లేచుననియు నాతనికిఁ దెలియును. దీని కించుక వ్యవధి కావలయును. ఆతనికిప్పుడు భయకారణ మేమియు లేదు. పరిస్థితులన్నిం టిని గమనించి తగినవిధమున నడుచుకొనుట కాతని కించుక తెలివికూడ నవ సరమైయుండెను. దీనికిఁ దోడు, వైరిని దఱిమివేయునిమిత్త మాతనికడ బెట్వానదిని దాటుటకుఁ గావలసినపడవలు లేవు. కాన నాతఁడు దూరమాలో చించి హూణులను గొన్నినియమములకు లోఁబడఁజేసి యుజ్జయినికిఁ దిరిగి పోవ నొప్పుకొనుటయే సమంజసమని నిర్ధారణ మొనరించుకొనెను.

ఆసంధినియమములు నిష్పక్షపాతముగఁ బ్రతిహూణున కనువర్తింప వలయుననియుఁ, బ్రతిహూణుఁడును స్వేచ్ఛావృత్తితోఁ బోవలయుననియుఁ

జేష్టనసాహసపాణులు పట్టుపట్టిరి. వారు స్వాధీనమొనరించుకొనిన హైందవ పతాకములను, అయుంధములను, బంధితులను విడిచిపెట్టుట కియ్యకొనిరి. కాని తమ కేతనములను, తమయస్త్రములను దమకియ్యవలయునని వారు గట్టిపట్టు దలతోనుండిరి. హూణపక్షచరులై పోరాడుచుండిన 30,000 హైందవ సైనికులకు హస్తోదకమిచ్చునట్లు, యశోధర్మ హూణుల నియ్యకొనఁజేసెను. వారు నమ్మినబంట్లనియైన సెంచక, హూణు లానిర్భాగ్యుల నొక్కమారుగాఁ ద్రోసిపుచ్చిరి. మిగిలిన ౧౫౦,౦౦౦ హూణులు సక్రమపద్ధతి నట్లొనది నుత్తరించిపోవుటయే తడవుగా, నిచటి భారతసైనికుల నా 30,000 లను నిరాయుధులఁగావించి యొక్కపెట్టున వధించిరి. పొట్టకూటికై హూణపక్షమునఁ బోరాడిన యీ 30,000 హైందవభటుల దుర్మరణమునకై యశోధర్మకుమారపాలురు కంటఁ దడియైనఁబెట్టినవారు కారు. దరిద్రదామోదరులగు నాలబ్ధక్రయుల రక్షింపుఁడని యాధేయు లెంతయు వాదించిరి కాని; యశోధర్మ నిశ్చలుఁడై "ద్రోహులు చావవలయును. దేశద్రోహమునకు మరణదండనమే నిష్కృతి. కొంద తేగాలి కాచాపసెత్తి తప్పించుకొందురు కాని, యెప్పుడో యొకప్పుడు వారి కాగతి తప్పదు" అని పలికెను. ఈసమాధానముల కీక యాధేయులు నోరెత్తలేకపోయిరి. విజయులగు హైందవు లా 30,000 నిర్భాగ్యుల కుత్తుక లుత్తరించునెడఁ దమ్ము మన్నింప వారించుటకైనఁ బ్రార్థించినవారు కారు. ధీరత్వము మెఱయ వారు మృత్యువును కౌఁగిలించుకొనిరి. వారిధీరమునకు యశోధర్మసైత మాశ్చర్యమొంది "ఈద్రోహు లనాయాసమరణమొంది తమకళంకమును బాపుకొనిరి" అనిమాత్ర మనెను.

అలబ్ధక్రయులవధానంతరము, హైందవసేనాబృందమున నెల్లకడలఁ బ్రబలోత్సాహము వ్యాపించెను. హైందవవిజయోదంతమును, హూణపరాభవవృత్తాంతమును, సహస్రభేరీధ్వానములు ప్రపంచమునకంతయుఁ జాటుచుండెను. ఈమహావిజయమునం జేసి యశోధర్మకుమారపాలుల హృదయాంబుధులందలి యానందతరంగము లంబరమునంటుచుండెను. కాని యొకసంగతిమా

త్రము వారియానందమున కద్భుతగులుచుండెను. రాజకుమారుఁడు మురారి యనారోగ్యము వారివంతకుఁ గారణమయ్యెను. గాయమొంది సెజ్జంజేరి యుండు మురారివద్దకు యశోధర్మ పోయి "కుమారా! నీగాయ మెట్లున్నది?" అని ప్రేమ యుట్టిపడున ట్లడిగెను.

"యుద్ధవార్తలేమి?" అని మురారి యడిగెను. "మనకే విజయమైనది" అని యశోధర్మ చెప్పెను.

మురారి యానవాబ్జమానందభాసురమయ్యెను. ఆరాజకుమారుని నయన గోళములు ప్రమోదాశ్రుసంపూరితములయ్యెను.

"ఆహాహా! ఎంత యానందము! దుర్మార్గులగుహూణరాక్షసు లపజయ మొందుటకు-నామాతృభూమి యీదుష్టదానవులబారినుండితప్పించుకొనుటకు-స్వధర్మోద్ధరణమునకైన స్వాతంత్ర్యసమరమునందు నేఁబాల్గొనియుండుటకు-తల్లికడఁజేసిన శపథమును సార్థకపఱిచి పగరకు వెన్నిచ్చిరాకుండుటకు-ఆహా హా! నాయానంద మపారమై యున్నది" అని యారాజకుమారుఁడు పలికెను.

ఆమాటలకు యశోధర్మ సంతసించి "నీగాయ మెట్లున్నది?" అని మరల నడిగి ముందుకువంగి యావ్రణముఁ జూచెను. తోడనే యాతఁడు దిగులుపడి వెంటకకపొంగడి "కుమారా! నీగాయ మింతదారుణమైనదని నేఁ దలంపలేదు. ఆబల్లెము నీకడుపులోనికిఁ జొరఁబడినదిసుమా! నెత్తురు చాలకాఱి నది. నీవు మరల రణ్యానిమనిషివగుటకుఁ జాలకాలమగును" అని పలికెను.

మురారి మందహాసమొనరించుచు "నేను మరల నిరామయుండఁ గానని, యేదియో నాకు నొక్కటి చెప్పుచున్నది" అనెను.

"కుమారా! అట్లనకుము. నీకిపు డిరువదియేండ్లయిన పరిగానిండలేదు. నీవు చిరంజీవివై యుండుము" అని యశోధర్మ యాతనికి ధైర్యముఁ జెప్పెను.

"కాని నేనట్లనుకొనను" అని మురారి హీనస్వరమునఁ బలికెను.

కుమారపాలుఁడా రాజకుమారునిసమీపించి గాయముఁ జూడ వంగెను. మురారి బాధ నోర్వఁజాలక కన్నులుమూసెను. కుమారపాలుఁ డానందస్వాం

తుఁడై "నాకిట్టికుమారరత్న ముదయింపవలయునని నాయభిలాష. అహాహా! ఇట్టిపుత్త్రరత్న ముంబడయుటకు నాదేవి వాసవదత్తకూడ నువ్విళ్లూరుచుండుఁ గదా! వీరమాళియగు నిట్టియోధు నిప్పటికి నేఁగాంచియుండలేదు. ఇఁకగాంచ బోను. కాని, అకటా! నాహృదయము నావరించియుండిన విజయానంద మీదృశ్యవిలోకనమున సగము కలుషమైపోయినది" అని చింతిల్లెను. యశోధర్మ తనదళవాయీలఁ బిలిచి "అతిలేఁతలైనయీయిరువురుశూరుల సంరక్షకులుగా నిచ్చి యీరాజకుమారుని మురారినిఁ గలాంజారుకోటకుఁ జేర్పుఁడు. రాణి చారుమతి యాతనిఁ ద్వరలో నారోగ్యవంతునిగాఁ జేయును. బాలాదిత్యరాజన్యునకు మనవిజయోదంతమును నివేదించుటకును, రాణి సరస్వతికి రాజకుమారుఁడు మురారిదుర్దశ నెఱిఁగించుటకును, శీఘ్రగామియగు వార్తావహు నొకని నిపుడే పాటలీపుత్త్రమునకుఁ బంపుఁడు. రాణి సరస్వతికూడఁ గలాంజారుదుర్గమునకు విచ్చేసి చారుమతికిఁ దోడ్పడుఁగాక! ఆరాణులపరిచర్యలచే మురారి యారోగ్యభాగ్యాభివృద్ధినందఁగలఁడు" అని కట్టడఁ జేసెను.

ఆదళవాయీలు యశోధర్మయానతి నౌదలఁ దాల్చిరి. అంతట యశోధర్మకుమారపాలులు, కాకవర్ణునిశవమును రణరంగమున వెదక మొదలిడిరి. ఆశవము గాయములచే నిండి పీనుఁగుపెంటలయందుఁ బడియుండెను. మేఘవర్ణుఁ డాపీనుఁగుపైఁ బడి మొత్తుకొనుచుండెను. యశోధర్మకుమారపాలు లాతనిఁ గొంతవఱకు నూఱడించిరి. "సోదరా! మీగోత్రోద్భవులగు రాజశేఖరులెందఱో రణరంగవిహార మొనరించి, వీరస్వర్గముఁ జూఱఁగొని విఖ్యాతినందిరి. కాని మీవంశమందుసైతము, నీసోదరుఁడు కాకవర్ణరాజవరేణ్యునివలె మాయనియశము నార్జించినవారులేరు. ఈతం డాత్మనాగరకతాసముద్ధరణమునకొఱకును, స్వాతంత్ర్యసంరక్షణమునకొఱకును బోరాడి, స్వదేశమునకు ౧౮౦౦ మైళ్లదూరమునం దస్తమించినాఁడు. ఈతఁ డీమహాకార్య మొనరించి, తన జీవితసర్వస్వమును సాధుపరిత్రాణమునకొఱకు ధారవోసినాఁడు. ఇట్టి వీరవతంసులప్పుడప్పు డవతరించి, యాపదుదధిమునుఁగనుండు నాగరకతాప్రపంచము

నుద్ధరింప నాత్మప్రాణముల సమర్పించుచుందురు. సింహళుఁడు కాకవర్ణుఁడు లేఁడు కాని, అయ్యఁడు కాకవర్ణుఁడుమాత్ర మార్యజాతిహృదయసీమల నిత్యుఁడై యలంకరించియుండును" అని యశోధర్మ యాతని ననునయించెను.

అంతటఁ గుమారపాలుఁడు మేఘవర్ణునితో "నేను గామరూపదేశము నుండి వచ్చితిని. కాకవర్ణుఁడు ౨౦౦౦ మైళ్లదూరమునుండి వచ్చినాఁడు. కాని వీరలు విదేశములనియు, విజాతీయులనియు విభేదము లెఱుంగరు. కాకవర్ణుఁ డుత్తమక్షత్త్రియమరణ మొందినాఁడు. ఇంతకంటె క్షత్త్రియునకుఁ గామిత మేమికలదు? ఓరాజా! నీసోదరుఁడు ధర్మయుద్ధమున మరణించునోము నోఁచుకొనెను. ఆహాహా! అతనిభాగ్యము నెంతని ప్రస్తుతింతును! ఇప్పు డాతఁడు దేవలోకమున నమరపరివేష్టితుఁడై దివ్యానంద మనుభవించుచున్నాఁడు. కాకవర్ణునకు లభించినవీరస్వర్గ మందఱికబ్బునా? ఇట్టియెడ నీవు మోదమొందవలయుఁ గాని, ఖేద మొందరాదు" అనిచెప్పి, యాతనికి దుఃఖోపశమన మొనరించెను.

మేఘవర్ణుఁ డించుక యూఱడిల్లి "ఓసోదరులారా! నాయగ్రజుని గుఱించి మీరుపలికిన ప్రశంసావాక్యములకు నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. ఆప్రశంసల కాతఁ డర్హుఁ డనికూడ నాకుఁ దెలియును. నేను సంతోషింపవలయుఁ గాని, శోకింపఁ గాదనియుఁ గూడ నాకుఁ దెలియును. కాని నేనుకూడ మానవుఁడ నేకదా! నాసోదరమరణమునకు దుఃఖింపకుండుట నాకు సాధ్యమా? అప్పటికిని నాయగ్రజుఁడు ధర్మరక్షణోద్యోగమున నసువులఁ దొఱఁగెనని యు, మహాత్ముఁడగు బుద్ధభగవానుఁడు పుట్టిపెరిఁగిన పవిత్రప్రదేశముల నుద్ధరించి, వానిని మ్లేచ్ఛుఁడగు విదేశజుఁడు చెఱపకుండఁ గాపాడుటకై చాల శ్రమనొంది ధన్యుఁడయ్యెనని యుఁ దలంచుకొని, పైకొనివచ్చు నాశోకము నణఁచుకొనుచుందును" అని పలికెను.

అంతట దుందుభిధ్వానములు దెసలమార్మ్రోయ నారాజులు మువ్వురుఁ గాకవర్ణునిశవమునకు రణాంగణమందే దహనక్రియ లొనరించిరి.

యుద్ధభూమియందలి యోధులందఱు పరమపదించిన తమప్రభువునొద్దఁ దమకుఁగలభక్తిని వెల్లడించిరి. యశోధర్మాదులు, విగతజీవులగు భారతవీరుల కుచితరీతి దహనక్రియ లానరింప నేర్పాటుచేసి, హూణపక్షచరులశవములఁ గాకులకు గ్రద్దలకు వేసిరి. కదనరంగమంతయుఁ గుంపులుకట్టి యెగురుపక్షు లాపీనుఁగులఁ బీకుకొని తినుచుండెను. క్షతగాత్రులగు సైనికులు వైద్యసహాయమునకై పరిసరగ్రామములకుఁ గొనిపోఁబడిరి. యుద్ధమున గాయములొంది లేవ నశక్తులైయుండు హూణానువర్తులపై యశోధర్మాదు లించుకయైన ననుకంపఁ గొనక, వారట్టియధోగతి కర్హులని యచటనే విడిచిపెట్టిరి. ఈవిధమున నేర్పాటులన్నింటిం గావించి, విజయోత్సాహులగు హైందవాధీశులు ఇంద్రద్యుమ్నుఁడు తమ్ము జేరకుండినందులకై యాతనికిఁ దగురీతి బుద్ధిచెప్ప నెంచి చతురంగబలసమేతముగాఁ గాశీనగరమునకుఁ బోయిరి.

# ముప్పదినాలుగవతరంగము.

## యుద్ధపర్యవసానము.

మహామాయ, చారుమతీ, వసంతలు హైందవవిజయోదంతము నాలకించి యపారానందమునందిరి. కాని క్షతగాత్రుఁడగు మురారిరాక, వారి యానందమున కడ్డుదగిలెను. చారుమతీవసంతలామగధరాజకుమారుని సపర్యలయం దనుక్షణము వర్తించుచుండిరి. వృద్ధరాణి మహామాయసైత మాయస్వస్థుఁడగు రాజకుమారునిశయ్యావద్దఁ గాలముగడపుచుండెను. మహామాయ, చారుమతీ, వసంతలు తన కుపచారములు సలుపుచుండునెడ, నారాజకుమారుఁడు తనకు హాయిగా నున్నదనియు, నేవిధమునఁగాని, లోపము లేకున్నదనియు వారు తలఁచునట్లు వర్తించుచుండెను. చారుమతీవసంతలు తనకుఁ బరిచర్యలొనరించుచుఁ జూపుపుత్త్రానురాగము, మహామాయ తనయెడఁ బ్రకటించుపౌత్త్రప్రీతి, నరసింహచంద్రభానులకుఁ దనపైనుండు సోదరవాత్సల్యము, లలితకుఁ దనయెడనుండుసోదరభావము, అన్నియు మురారి నవ్యక్తానందరసపూరితునిగాఁ జేసెను. కళాంజారుదుర్గమునందలి పవిత్త్రానురాగామృతకాసారమున, నవయౌవనమగు నాతనిడెందము దప్పితీర్చుకొని, వ్రణముచే నాతఁ డొందుదుస్సహవేదన నోకించుక మఱువఁజేయుచుండెను. లలిత కిప్పుడేడేండ్లు. లలితం జూచిన నెల్లవిధములఁ జారుమతిఁ జూచినట్లుండును. లలిత చారుమతి యచ్చుగ్రుద్దినట్లుండును. ఆచిన్నిబాలమైత్త్రి నాతఁ డభిలషించుచుండెను. మాటిమాటికి లలిత మురారికడకుఁబోయి యాతనికిఁ బ్రొద్దుపుచ్చుచుండెను. ఆపసికందుతొక్కుపలుకు లారాజకుమారుని కర్ణముల సుధఁ జిందినట్లుండెను. మిహిరగులుఁ డెట్లుండును? వాని నేల వదలితివి? నిన్నుఁ బొడిచిన.

బల్లె మెక్కడ? నిన్ను గాయపఱచిన సాహసాణుని నీవేల చంపలేదు! మాబాబు సాహసాణునిఁ బట్టుకొని కలాంజారుకోట కెందులకుఁ దీసికొని రాలేదు? ఇట్లు లాబాలిక మురారిఁ బ్రశ్నించుచుండును. విశ్రాంతినందియుండఁ దగిన యారోగికి నిట్టిసంప్రశ్నములచే నుద్రేకముఁ గలిగింపరాదనుతలంపున, చారుమతీమహామాయ లాబాలను బలుమారు మురారికడకుఁ బోకుండఁజేసిరి. కాని మురారి కిది సమ్మతములేకుండెను. లలిత మురారికి సంతోషదాయినియై యుండెను. "ఆబిడ్డ యిష్టపడినపుడంతయు నిచటికి రానిచ్చుచుండుడు. ఆబాలిక లేకున్న నాకుఁ బిచ్చిపట్టినట్లుండును. ఆయిందుబింబానన యీ గదికివచ్చిన, నిచటఁ వెన్నెల కాయుచుండును." అని యాతఁ డనుచుండెను. అందుచేఁ జారుమతీవసంతలు, లలితరాకపోకల కడ్డు చెప్పుట విరమించిరి.

అప్పుడప్పుడు నరసింహుఁడువచ్చి మురారిఁ జూచి పోవుచుండెడి వాఁడు. మురారిఁ జూచిన మొదటినాఁడే నరసింహుఁ డాతనితో "ఆహా! నిన్నుఁజూచిన నామనస్సు నిలుచుటలేదు. ఇప్పటికిఁగూడ నేను గాయపడకున్నానుగదా! మురారీ! ఈమారు నీవు హుసాణునిపైకి దండెత్తిపోవునపుడు నన్నుఁగూడ వెంటఁగొనిపోవలయునుమా! మాబాబుగాని, మాయమ్మగాని, యడ్డుపలికిన, వారిని లెక్క సేయకుము. నేను నీతో నుండియే యుండిన నీ వీగాయ మొందియుండెడివాఁడవు కావు. నేనద్దాని కడ్డుపడియుండెడివాఁడను" అని చెప్పెను. తానీమారు యుద్ధమునకుఁ బోవునపుడు నరసింహుని వెంటఁబెట్టుకొనిపోవునట్లు మురారి యాతనికి మాటయిచ్చెను. నరసింహుని యానందము మేరమీఱిపోయెను. ఆబాలుఁడు చంద్రభానుఁడు మున్నగు మిత్రులకడకుఁ బరుగెత్తి "నేను ద్వరలో మురారివెంట యుద్ధమునకుఁ బోయెదను. ఇఁక నేను మీయందఱివలెఁ జిన్నవాఁడఁగాను" అని యొగిరెను. ఈ మాటల నాలించి చంద్రభానుఁడు కోపపడెను. తోడనే యాబాలుఁడు మురారి కడ కరుదెంచి "అన్నయ్యా! ఈమారు నీవు యుద్ధమునకుఁ బోవునపుడు నరసింహుని వెంటఁబెట్టుకొనిపోయెదవని చెప్పితివఁట! ఇది నిజమా? అయిన

నన్నుఁగూడ నేల తీసికొనిపోవు? నేను బాణములు చాలబాగుగాఁ గొట్టఁగల నని నీకుఁ దెలియునుగదా! నిన్ననే నొకబాణముతో జింక నొకదానిం జంపితిని. అవునుగదా అవ్వా? నాకుఁ గలవిలువిద్యలో నరసింహున కర్ధభాగమైన లేదని నీకుఁ దెలియునుగదా! ఇట్టిగొడ్డ నీవు వానిని దీసికొనిపోవుటవలన లాభమేముండును? నీకుపకరించువాఁడను నేనుగదా! నేను నీవెంట నుండిన యెడల, నాహపాణునిబల్లెము నీపొట్టలోఁ గ్రుచ్చుకొనుటకుబదులు, నాబాణము వానిడొక్కలో నాటుకొని యుండెడిది.'' అని నిష్ఠురములాడెను. చంద్రభానుని వెంటఁబెట్టుకొనక కలనైనఁ దాను యుద్ధభూమికిఁ బోనని మురారి యీబాలునకు నచ్చఁజెప్పెను. అంతటఁ జంద్రభానుఁడు నరసింహుఁడొదిగాఁ గలమిత్రులకడకుఁ బరుగిడి తానీమారు మురారితోఁగూడ దండయాత్రకుఁ బోనున్నానని బడాయికొట్టెను.

తన్నెవ్వరును జూచుటలేదని తలఁచినపుడంతయు, మురారి యాశాపూరితములగు విలోకనముల ద్వారముతట్టు జూచుచుండును. మహామాయ, చారుమతీ, వసంత లీసంగతిఁ గనిపెట్టిరి కాని, యీవీక్షణములందలి గూఢార్థమును, వానికిఁగల కారణమును వారు గ్రహింపజాలకుండిరి. లలితం జూడనుండునభిలాషయే యందులకుఁ గారణమని చారుమతి చెప్పెను. కాని వసంతమాత్ర మందుల కొప్పుకొనక మాతృసందర్శనాపేక్షయే యీవీక్షణముల కర్థమని నిర్ధారించెను. ఒకనాఁడు వసంత తటాలున మురారికడకుఁ బోయి ''నాయనా! మీయమ్మ వచ్చినది'' అని చెప్పెను. తోడనే యా రాజకుమారుని శుష్కవదనము సంతోషభాసురమయ్యెను. ''ఏదీ! మాయమ్మ యేదీ? నాతమ్ముఁడు నాచెల్లెలుకూడ వచ్చిరా? మాబాబా యెట్లున్నాఁడు'' అని మాటమీఁద మాట నడిగెను. వసంత తా నాతనిబేలుపుచ్చుటకుఁ బశ్చాత్తాపమొంది ''నాయనా! వినోదార్థమంటిని. మేము మీయమ్మకుఁ జెప్పిపంపితిమి. అనుదినము మామెకొఱ కెదురుచూచుచున్నాము. ఆమె యింకను రాలేదు'' అని సమాధానపఱచెను.

ఆశాభంగమున మురారి మోముదమ్మి ముకుళించెను. నయనగోళము నుండి క్రిందికురలు బాష్పకణ మొకదాని నాపుకొనుటకై యారాజకుమారుఁడు ముఖము నావలకుఁ ద్రిప్పుకొని ప్రయత్నపూర్వకముగా మందహాస మొనరించెను. కాని వసంత వీనినన్నింటిఁ గనుఁగొనక పోలేదు. ఆమె కారాజకుమారునిపై నుండువాత్సల్యము దొంతరలు దొంతరలుగా దూఁకివచ్చెను. పాలిపోయి కళావిహీనమైయుండు నాతనిచెక్కిళ్ల నామె ముద్దుపెట్టుకొని "నాతండ్రి గదరా! నీకు హాయిగానుండునట్లు నటించి మమ్ము సంతోషపెట్టఁ జూచుచున్నాఁడవు! నిజముగా స్వభావసిద్ధమగు మాతృసంవర్ధనాభిలాష నీ హృదయమున నిండియున్నది. మీబాబుకు జబ్బుగానుండుటచే మీయమ్మ యాతనికిఁ బరిచర్య లొనరించుచున్నది. ఆతనికిఁ గ్రమక్రమముగా నిమ్మళించుచున్నది. మీబాబు కొంచెము తేఱుకొనినతోడనే, మీయమ్మ యిచటికి వచ్చును. ఆమెను జూడనిదే నీవు నిలువలేకుండినయెడల నామెకొఱ కిప్పుడే చెప్పపంపెదను" అని బుజ్జగించెను.

మురారి "వలదు. వలదు. మాబాబుకు దేహము నిమ్మళించువఱకుఁ మాయమ్మకొఱకుఁ జెప్పిపంపకుఁడు" అనెను.

ఆ రాజకుమారుని ప్రార్థనయందిమిడియుండు స్వార్థత్యాగము, అబలయగు వసంతహృదయమును హర్షాంబుధి నోలలాడించెను. ఆతనియుదారభావమును దలంచుకొని యామె యానందాశ్రుపూరితనయన యయ్యెను. ఆమెమేను జలదరించెను. కన్నీటితోనుండు తన్ను మురారి చూడరాదని తలంచి యామె బయటికిఁబోయెను. చారుమతి యీసంగతిని వసంతవలన నాలకించి "ఆహా! ఆరాజకుమారున కీపాడుగాయము కాకుండిన నెంత బాగుండెడిది! మనవిజయానందమున కిది కళంకముఁ గూర్చినది. ఆతఁడు ధీరోదాత్తుఁడు కాఁబట్టి, తన మూలమున నితరులెవ్వరు కాని కష్టమొందకుండునట్లు ప్రయత్నించుచున్నాఁడు. బాలాదిత్యమహారాజు త్వరలో స్వస్థుఁడైన బాగుగనుండును! అప్పుడు సరస్వతికి ధర్మగుప్తనారాయణిలతో నిచ

టికి రా వీలుండదు. ఆమెకడకు నేడే యొకవార్తావహుం బంపెదను” అని పరితాపసూచకస్వరమునఁ బలికెను.

నూతనవిజయోదంతము లనుదినము కలాంజారుదుర్గమునకు వచ్చిచేరుచుండెను. కాశీరాజగు నింద్రద్యుమ్నుఁడు పూర్తిగా నోడింపఁబడెను. దానంజేసి యాతఁడు యశోధర్మపక్షచరుల కీయుద్ధమునఁ గలిగిన నష్టమును గట్టియిచ్చుటయే కాక, యశోధర్మ సార్వభౌమత్వము నంగీకరించి యాతనికి లోఁబడి కప్పమియ్యవలసినవాఁడయ్యెను. హూణులు మిహిరగులునాయకత్వమున నుజ్జయినికిఁ బోవుసరి కచట యౌధేయచాళుక్యులతోడ్పాటునఁ బౌరులల్లకల్లోలము లొనరించుచుండిరి. ఆతిరుగుఁబాటు నణఁచుటకై హూణులు మిగులఁ బ్రయత్నించుచుండిరి. అట్టిసమయమున భారతీయు లుజ్జయినికిఁ బోయిరి. కాలూరుయుద్ధభూమినుండి బయలుదేఱిన ౧౫౦,౦౦౦ హూణసైనికులు, వెక్కువెవఱిక గమ్యస్థానమును జేరలేకపోయిరి. ఉజ్జయినీకారూరులమధ్యమునఁ బ్రజలు కట్టపిడుగున హూణులపైఁబడి వారిం జెండాడి, చూచుచుండఁగనే మాయమగుచుండిరి. పులకేశిని యనుచరులచ్చటచ్చట గుట్టలవెనుకను పుట్టలచాటును డాఁగియుండి వారిని రూపుమాపుచుండిరి ఇట్లు హూణు లుజ్జయినికిఁ జేరునప్పటికి ౬౦,౦౦౦ లకు దిగిరి. ఇఁక నీ ౬౦,౦౦౦ భటులతో నుజ్జయినియందలి కల్లోలముల నణఁచుట యసాధ్యమని నాహూణుఁడు చేష్టుఁనితో నాలోచించి, స్వరాష్ట్రమగు పశ్చిమమాళవమునకు హూణసైన్యనిమిత్త మాబలముల నుపయోగింపఁదలంచెను. పులకేశినిసాయమును, యౌధేయులయండను జూచుకొని చెలరేఁగుచుండు నుజ్జయినీపౌరుల నణఁచుట దుస్సాధ్యమని మిహిరగులుఁడు గ్రహించెను. ఎవరెవరిరాజ్యములను వారివారికయాచితముగా నిత్తుమని, యశోధర్మపులకేశినులు హూణపక్షచరులగు రాజుల కాశలంజూపి, వారిం దమతట్టునకుఁ ద్రిప్పికొనిరి. ఇప్పుడు మిహిరగులుఁడు ఱెక్కలుదీసిన పక్షియయ్యెను. ఉజ్జయిని తనకిఁక దక్కదనియుఁ, దన కాపట్టణమున నిలువ నీడలేదనియు నాతఁడు గ్రహిం

చెను. అంతఁ గాశ్మీరస్వామియగు వజ్రాయుధుఁడు దీనుఁడగు నాతనిపైఁ గరుణించి యాశ్రయమొసంగెను. మిహిరగులుఁడు తనగతికిఁ గుందుచు, స్వామిభక్తిపరులగు కొందఱు హూణులు తన్ననుసరింప శ్రీనగరమునకుఁ బోయెను. అచట నాకృతఘ్నుఁడు వజ్రాయుధుని రహస్యముగా హత్యఁ గావించి, తనప్రాణదాత సింహపీఠి నాసీనుఁడయ్యెను. పామునకుఁ బాలుపోయ విషవృద్ధియగుట యిట్టిదేకదా ?

హిందూదేశమునఁ బశ్చాద్భాగమునందలి కొన్నిరాష్ట్రములను దన బంధువున కొకనికొసంగ, కుమారపాలుఁడు యశోధర్మ నడిగెను. కాని యాతఁడు దద్దాని కియ్యకొనలేదు. అదికారణముగఁ గుమారపాలుఁడు స్వసైన్యసమేతముగా బ్రహ్మపుత్రానదీ పూర్వదిశకుఁ బోయెను. హూణులును, హైందవులును రాజనామకులు కొందఱు పూర్వహూణరాజ్యములను దొరకినంతవఱ కాక్రమించుకొనిరి. వారందఱును యశోధర్మసార్వభౌమత్వమునకు సమ్మతించిరి. బాలాదిత్యుఁడు తనరాజ్యమును విస్తరింప జేయు నుద్దేశము తనకులేదని ప్రకటించియుండుటఁజేసి, యశోధర్మయే సార్వభౌముఁడయ్యెను. చాళుక్యరాజగు పులకేశిని సౌరాష్ట్రమునందు గొంత భాగము నాక్రమించి ఉత్తరార్ధభాగమునుమాత్రము రుద్రసింహునకు వదలిపెట్టెను. రుద్రసింహుఁడు వల్లభీపట్టణమును రాజధానిగ నేలుచుండెను. పులకేశిని సౌరాష్ట్రమునం దర్ధభాగము నాక్రమించుటకై యశోధర్మ యాక్షేపించెను. ఈవివాదమునంజేసి యాహైందవోర్వీశు లిద్దఱకు యుద్ధము జరిగెడిదే కాని, యంతలోఁ బులకేశిని సౌరాష్ట్రములోని యాసగము భాగమును యశోధర్మ సార్వభౌమత్వమునకు లోఁబడి పాలించెదనని చెప్పెను. అదేవిధముగా రుద్రసింహచాహమాణులుకూడ నుత్తరసౌరాష్ట్రమును, పశ్చిమమాళవమును బాలించుట కియ్యకొనిరి. చేష్టనుఁడు కొందఱు హూణులసాయమున యమునానదికిఁ బడమరఁగలభూముల రాజ్యము స్థాపించుకొని, యశోధర్మచక్రవర్తికి సామంతుఁడైయుండెను. చేష్టను నాహ

హూణులు హిందూమతము నవలంబించి, రణవీరసింహుఁడు, ధర్మసింహుఁడని పర్యాయనామములఁ దాల్చిరి. వారు హైందవసంప్రదాయములను సంపూర్ణముగా ననుసరించి, బ్రాహ్మణులను గౌరవభావమునఁ జూచుచు, సంస్కృతభాషను బోషించుచుండిరి. తాము సత్క్షత్రియగోత్రోద్భవులమని వారు ప్రకటించుచుండిరి.

హూణులఁ బిలుకుమార్చి విజయలక్ష్మీ లాలితుఁడైయుండు యశోధర్మను నభినందించి, ఆసేతుహిమాచల మాతని సార్వభౌమత్వము నంగీకరించుటకై, హైందవభూకాంతులంద ఱాతనిసమ్ముఖమునకు రాయబారులఁ బంపిరి. ఈయభినందనములచేతను, విజయపరంపరలచేతను యశోధర్మ కభిమానమతిశయించెను. ఆతఁడు తనరాజ్యభూములగు కలింగమహాకోసలములయందుఁ బలుతావుల నీక్రిందివిధమున శాసనములఁ జెక్కించెను.

> సార్వభౌమేంద్రుఁడ నగుయశోధర్మను, నేను
> హూణులాదిగాఁగల నిషాదబలముల నాక్రమించి, హిమాలయమహేంద్రగిరులకును
> ప్రాక్పశ్చిమసముద్రములకును మధ్యనుండు
> భూమిని, ఏకచ్ఛత్రాధిపత్యముతో నేలితిని.

ఈకార్యము లన్నింటిఁ గావించుకొని యశోధర్మ కలాంజారుదుర్గమునకుఁ దిరిగివచ్చుటకు రెండునెలలకుముందే, మురారి యచటికి వచ్చియుండెను. విజయశీలియైవచ్చిన తమప్రభువరేణ్యుని మహాకోసలు లమితోత్సాహమున సాహ్వానించిరి. దారిపొడుగునను జనులు బారులుతీరి, వానిరాకను జూచుకుతూహలమున నుండిరి. ఆతఁడు కలాంజారు చేరునప్పటికి, మహామాయ, చారుమతి, వసంత, ముగ్గురుకుట్టిలతోఁ, శౌరబృందము తమ్ముఁ జుట్టుకొనియుండఁ దనకై వేచియుండుటఁ గాంచెను. యశోధర్మ ద్వారప్రవేశ మొనరించినతోడనే మహామాయ యాతనిం గవుంగిలించుకొని

“కుమారా! అద్వితీయమగుదృశ్యమును నాకుఁ గన్పఱచి, నీవు నేడు నానేత్రములకుఁ బండువొనరించితివికుమా! స్వాగతము! నాపట్టీ! పవిత్రమగు కలాంజారుదుర్గమున నీకిదే సుస్వాగతము! మహాకోసలరాజవంశమునకు నీవు సమార్జించిన కీర్తిప్రతిష్ఠలఁ గాంచి, పరలోకము నలంకరించియుండు నీపెద్ద లానందబాష్పములు విడుచుచున్నారు. నీవు చిరంజీవివై, సనాతనమగు నీవంశపుఁగీర్తి నింకను బెంపొందింతువుగాక!” అని యాశీర్వదించెను. (‘మహారాజు చిరంజీవియగుఁగాక! యశోధర్మమహారాజు చిరంజీవియగుఁగాక’ అనుహర్షధ్వనులు.) అంతట చారుమతి “ఓప్రాణకాంతా! ఓదేవా! కలాంజారుదుర్గమునకు మీకిదే స్వాగతము! పూజ్యమగు మీజన్మస్థలమునకు-పూజ్యులగు మీపూర్వులు వెలసియుండినస్థలమునకు—మీకిదే స్వాగతము. మీరీదుర్గమును నిర్గమించినపుడు, మహాకోసలమునకుమాత్ర మధినాథులరై యుంటిరి. మరలఁ బ్రవేశించునపుడు సార్వభౌములరై—హిమాలయమునుండి మహేంద్రగిరివఱకును, కళింగమునుండి పశ్చిమోదధివఱకుఁ గలధరణీతలమునకు స్వాములై—యున్నారు. కళింగమహారాణి తనసార్వభౌమునకు భక్తిపూర్వకప్రణామము లర్పించి, హూణదివాంధముల పాలిటి చంద్రభానున కీకలాంజారుదుర్గమునందు సుస్వాగత మొసంగుచున్నది. (‘మహారాజు చిరంజీవి యగుఁగాక’ ‘మహారాణి చిరంజీవియగుఁగాక’ అనుహర్షధ్వనులు.) పిమ్మట వసంత “ఓసార్వభౌమేంద్రా! నాఁడు ధర్మశాలయందు మొదలుపెట్టిననాటకము నేఁడు పరిసమాప్తియైనది. దేశద్రిమ్మరియైయుండిన యశోధర్మ, హిమగిరిమహేంద్రగిరులకును, తూర్పుపడమరసముద్రములకును మధ్యనుండుధరాతలమున కధినాయకుఁడై వెలయునుదినము వచ్చినది. మీజాతియాటపట్టునకు—సనాతనమగు మీరాజవంశముండిన ప్రదేశమునకు మీకిదే సుస్వాగతము.” అని ప్రస్తుతించెను. (‘మహారాజు చిరంజీవియగుఁగాక. వసంత చిరంజీవియగుఁగాక’ అను హర్షధ్వనులు.)

పిదప లలిత తనతండ్రి చేయిఁబట్టుకొని “బాబూ! ఆదుర్మార్గుఁడు నాహూణుఁడు మనమురారిని గాయపఱచినాఁడుకదా! వానిని నీవు

చంపలేదా?" అని యడిగెను. ఆచిన్నిబాలసంప్రశ్నమున కాతనికి లజ్జ హెచ్చెను. ఆతఁడుత్తరమియ్యలేకపోయెను. ఆతఁడు చారుమతితో "రాజకుమారుఁడు మురారి యెట్లున్నది? ఆతఁడు స్వస్థుఁడగుచున్నాఁడని నమ్మెదను" అనెను. భావగర్భితములగు చారుమతి దీనవిలోకనములఁ గాంచి యశోధర్మ చకితుఁడయ్యెను. కాని యాబాలిక లలిత యాతనికిఁ బ్రత్యుత్తరము చెప్పెను. ఆమె తండ్రికడకుఁబోయి "బాబూ! నేఁ జెప్పెదను. మురారికి జబ్బుగానున్నది. పూర్వ మాతఁడు నాతోఁ బలుమారు పలుకుచుండెడివాఁడు. కాని యిప్పుడు పలుకుటలేదు. ఆతఁడు మాటిమాటికిఁ గన్నులు మూసికొనుచుండును. అప్పుడప్పుడు కవాటమువట్టు చూచుచుండును. బాబూ! ఆతఁడు చాల నీరసించియున్నాఁడు. శల్యగతమై పోయినాఁడు. బాబూ! మురారి యట్లగుటకుఁగలకారణము నాకుఁ దెలియుటలేదు. నేను మురారిని పెండ్లిచేసికొనవలయునని వసంత నాతోఁ జెప్పినది. కాని యాతఁ డందులకు సిద్ధముగా నుండు టెప్పుడు?" అని పలికెను. అమాయికురాలగు నాబాలపలుకులందలి యవ్యక్తవిషాదమును గ్రహించి, యశోధర్మ, చారుమతీ, వసంత, మహామాయుల ప్రయత్నముగాఁ గంట నీరిడిరి. పౌరులస్వాగతవచనములకుఁ బ్రతివందనములర్పించి; యశోధర్మ బంధుజాలము బలిసికొలువ నంతఃపురములోనికిఁబోయెను.

తోడనే యశోధర్మ మురారిక్షేమము నారయఁదలఁచి యాతనిసెజ్జ వద్దకుఁబోయెను. చారుమతి యాతని నావలకుఁగొనిపోయి "నాథా! గాయము ప్రాణోపద్రవకరమైయున్నది. ఈసుకుమారుఁ డింక ననేకదినములు...... ......" చారుమతి యింక మాటాడఁజాలకుండెను. ఆమెను శోకము పైకొనెను. కాని యామె యంతలో సమాళించుకొని "రోగిగదిలో భావోద్రేకముఁ జూపకుఁడు." అని యశోధర్మతోఁ జెప్పెను. యశోధర్మ, చారుమతీ, వసంత, మహామాయులు రోగిగదిలోనికిఁ బోయిరి. శల్యావశిష్టుఁడై సెజ్జపై బరుండియుండుమురారిం గాంచినతోడనే యశోధర్మకు దుఃఖము

పెల్లగించుకొనివచ్చెను. ఆతనిగుడ్ల నీరుగ్రమ్మెను. ఆతఁడు కన్నులు తుడుచు కొనెను. మురారి కండ్లుమూసికొనియుండెను. రోగి నిద్రించుచుండనోపునని, యశోధర్మ చారుమతితోఁ జెప్పెను.

చారు:—కాదు. ఈరాజకుమారుఁడు బాధనోర్వఁజాలక కన్నులు మూసికొనియున్నాఁడు. ఈతఁడు మాకుఁ గొంచెమైన వేసటఁగల్గింపఁడు. మాసపర్యలయందుఁ దప్పు పట్టనేపట్టఁడు.

వసంత మెల్లగాఁ బాన్పుసమీపించి "మురారీ! మురారీ!" అని పిలి చెను.

మురారి కండ్లుతెఱచి "మాయమ్మ వచ్చినదా?" అని యామెతో నడి గెను.

వసంత:—లేదు. రేపువచ్చును. యశోధర్మమహారాజు వచ్చినాఁడు.

మురారిమోమున లేనవ్వులోఁచెను. "వచ్చినాఁడా? హూణులను వాశమొనరించి వచ్చినాఁడా? ఉజ్జయిని యారక్కసులబాఱినుండి తప్పించు కొనినదా?" అని యాతఁ డడిగెను.

యశో:—మురారీ! ఉజ్జయిని హూణహింసలనుండి తేఱుకొనినది. అ శూరులు నిన్ను రాజుం గావించిరి; కాని నీయనమ్మతిని నేను వారికెఱింగిం చితిని. వారందులకుఁ జాల చింతించినారు. తమస్వామిభక్తిని నీకుఁ దెలియఁ జేయ వారు నన్ను వేఁడిరి. నిన్ను వారు త్వరలో దర్శింప నువ్విళ్లూరుచున్నారు.

ఆరాజకుమారునివదనము విన్ననయ్యెను. ఆకాభంగమందు ద్యోతక మగుచుండెను. "వారు నన్నెన్నటికిఁ జూడఁజాలరు. హూణులోడింపఁబడిరని వినుట కెంతయుం సంతసముగానున్నది. తనజన్మనగరమగునుజ్జయిని హూణుల బాఱినుండి తప్పించుకొనెనని వినుటకు నాతల్లి ముదమందుచుండును. మా యమ్మ యెక్కడ? ఆమె వచ్చినదా?" అని యారాజపుత్త్రుఁడు మెల్లగాఁ బలికెను.

యశో:—లేదు. ఇంకను రాలేదు. త్వరలో వచ్చును.

ఆరోగి నయనాంబుజములు మరల ముకుళించెను.

"సరస్వతికొఱకై, చెప్పిపంపితివా?" అని యశోధర్మ రహస్యముగాఁ జారుమతి నడిగెను. "పంపితిని. ఆమగధరాణి యీసాయంకాలము వచ్చునేమో యని నిరీక్షించుచున్నాను" అని యామె రహస్యముగాఁ జెప్పెను.

యశో:—బాలాదిత్యున కెట్లున్నది?

చాలకాలముగా యశోధర్మ బాలాదిత్యుని దేహస్థితినిగుఱించి ప్రస్తావించినవాఁడు కాఁడు.

చారు:—ముందటికంటె నాతని కిప్పుడు కొంచెము వాసిగానున్నది. దానంజేసియే, యిప్పు డాతనిని దాములపోషణమునుంచి, యిచటికివచ్చుటకు సరస్వతి కించుక వీలుకలిగినది. నాథా! మీబాల్యమిత్రునితోడి వైరభావమును వీడుట కిదియే మంచిసమయమని మీరనుకొనరా? మీసమాధానమునకుఁ గారణము మురారియగుఁగాక! ఇంతమాత్రము నన్నుఁ గరుణింపుఁడు.

యశో:—కాంతా! నేను నిదియే తలచుచుంటిని. బాలాదిత్యుఁడు స్వస్థుఁడైనపిమ్మట, నేనాతనితో సఖ్యపడెదను.

మహా:—కుమారా! మహాశయసంపన్నమగు నీనిర్ధారణమునకు నాహృదయ మానందమున గంతులిడుచున్నది. బాలాదిత్యుఁడు వక్రమార్గగామియైయుండియు, నీచభావములకుఁగాని, నీచకార్యములకుఁగాని గడఁగియుండినవాఁడు కాఁడు. ఆతనియుద్దేశములు భేదింపవచ్చును. మతము భేదింపవచ్చును. అట్లుండియు నాతనియుదారభావము నేమందును! వ్యక్తిగతాభిప్రాయములకుఁ బ్రాముఖ్యమీయక, యాతఁడు సోదరమానవులను యోగ్యతానుసారముగ నాదరించుచున్నాఁడుకదా! ఈవిషయమున నాతనికిఁ దుల్యులు లేరుసుమా!

యశో:—నీమాట నిజము. నాప్రమాదమును గమనింప నాకింత కాలముపట్టినది.

మహా:—ఇప్పటికైన నీతప్పిదమును నీవు గ్రహించుటకై నాకు సంతోషముగా నున్నది.

అంత వారు వసంత నటసుంద నియమించి యంతిపురికిఁబోయిరి.

నాఁటిసాయంకాలమే, మహారాణి సరస్వతి, నారాయణీధర్మగుప్తులఁ దీసికొని కలాంజారునకువచ్చెను. యశోధర్మ, మహామాయ, చారుమతీ, వసంత లామెను ద్వారముకడఁగలిసికొని చక్కఁగా మురారిగదికిఁబోయిరి.

"నాబిడ్డ యెట్లున్నది?" అని సరస్వతి త్రోవలోఁ జారుమతినడిగెను.

ఒక్కకన్నీటికణములోఁ జారుమతి యుత్తరమునిచ్చెను. దానిభావమును సంపూర్ణముగా సరస్వతి గ్రహించెను.

వారు రోగిగదికిఁ బోయినతోడనే శల్యావశిష్టుఁడగు మురారిని డాసి "నాయనా! మురారీ! నేను వచ్చితిని" అని సరస్వతి హెచ్చరించుకొనెను.

మురారి కన్నులువిచ్చి "అమ్మా! అమ్మా! వచ్చితివా?" అనెను. పాలిపోయి యెముకలుమాత్రము మిగిలియుండిన యాతనివదనమున సంతృప్తియు, సంతోషమును జిందులాడుచుండెను. "అమ్మా! మాబాబు యెట్లున్నది?" అని యాతఁ డడిగెను.

సర:—నాయనా! మీబాబు క్షేమముగనున్నారు.

మురారి:—నారాయణీ ధర్మగుప్తు లెక్కడ?

తోడనే యాబిడ్డలు "ఇక్కడనున్నారము" అని గంతులువైచుచు మురారిచేతులఁ జెరియొకరు పట్టుకొనిరి. మురారి నేత్రగోళములు దివ్యానందభాసురము లయ్యెను. "అమ్మా! నాకు హాయిగానున్నది. నాకిప్పుడు హాయిగా నున్నది. లలిత యేదీ? ఆబాలనుగూడ నారాయణివెంట నాచేతిం బట్టుకొమ్మని చెప్పుఁడు" అని పలికెను. తోడనే లలిత యొకపరుగున వచ్చి "మురారీ! ఇదిగో వచ్చితిని" అని పలికెను.

"అమ్మా! అమ్మా! నాకిప్పుడు మహానందముగా నున్నది. అమ్మా! నానొసటిపై నీచేతిని పెట్టుము" అని మురారి మెల్లగా ననెను.

సరస్వతి యట్లొనరించెను. శోకమయమగు నాదృశ్యమునకుఁ జూపఱహృదయములు నీరయ్యెను. యశోధర్మ—రణరంగమున నద్దులేక శత్రుశిర

ముల బంతులవలె నెగురఁగొట్టు ధీరుఁడుకదా—అతఁడుకూడ బైటికిఁబోయి కసికూనవలె వెక్కివెక్కి యేడువసాగెను.

ఇచట మురారి "మహారాణి చారుమతి యెక్కడ? నే నామెను జూడవలయును. అమ్మా? నీవులేనప్పు డామె నాకుఁ దల్లియైయుండినది. వసంతయేదీ? ఆమెనుగూడఁ జూడవలయును. ఆమె నాపాలిటిదివ్యాంగనయై యుండినది. మాయవ్వ మహామాయనుగూడఁ జూడవలయును. నాతమ్ములు నరసింహ చంద్రభానులేరీ? వారినిగూడఁ జూడవలయును." అని నెమ్మదిగా బలికెను.

అందఱువచ్చి యారాజకుమారు నెదుట నిలిచిరి. అతనివదనాంబుజమునఁ గృతజ్ఞతాపూర్వకమగు లేనవ్వు తొలఁకాడుచుండెను. అతఁ డట్టే వారిని గన్నార్పక చూచుచుండెను. యశోధర్మకూడవచ్చి శయ్యప్రక్క నిలిచెను. వారందఱును దుఃఖభారమునఁ గ్రుంగియుండిరి. పెదవిఁ గదల్చుటకైన వారికిఁ దోఁచకుండెను. కడకా 'గచ్చకాయలకుండ' లలితసైత మొక్కపలుకైనఁ బలికినదికాదు.

ఉన్నట్లుండి మురారి "అమ్మా! నాకు గంగాశోణానదులు పొడఁ గట్టుచున్నవి. ఆహాహా! ఎంతవెలుతురు! ఎంత...వెలు...తురు!......"

మురారినయనములు, మూఁతవడెను. ధర్మగుప్త, నారాయణీ, లలిత చేతుల నాతఁ దదిమెను. ఆరాజకుమారుని ముఖాంబుజము కళావిహీన మయ్యెను. దివ్యానంద మాతనిపెదవులఁ దాండవమాడుచుండెను. అయ్యో! మాకుఁ జేతులాడకున్నవి. మురారి మరణించినాఁడు.

---

# ముప్పదియైదవతరంగము.

## బాలాదిత్యాస్తమయము.

మురారి మరణానంతరము సరస్వతి మగధకు మరలివచ్చెను. ఇప్పుడామె శోకాబ్ధి మునింగియుండెను. పెద్దకుమారుని వియోగము నాయబల సహింపఁజాలకుండెను. స్వదేశోద్ధరణార్థ మామె యట్టిస్వార్థత్యాగమును మనసారఁ గావించెను. మరల నవసరమైనచో నదేవిధముగా నొనరింప నాధీరురాలు సంసిద్ధముగానుండెను. కాని యీత్యాగమును మఱచుట కారాణి యెంతయుఁ బ్రయత్నించుచుండెను. ఇతరు లద్దాని మఱచునట్లు చేయుటకుఁ గూడ నామె ప్రయత్నించుచుండెను. కాని యామె కాపని యసాధ్యమగుచుండెను. ప్రియతమమగు వస్తువును బాఱవిడిచినమానవుఁడు తా నావస్తువును గోల్పోవుటకుఁ జింతపడవలయును. లేకున్న నావస్తు వాతనికిఁ బ్రియతమము గాదని నిస్సందేహముగాఁ దలంపవచ్చును. ఆవస్తువును ధారవోయుటకుఁ గావలసిన మనోదార్ఢ్యము తనకుండుట కాతఁ డెంతగా సంతసించుచున్నను, ఆతని శోకమూలఁ గొదువగనే యుండును. సరస్వతిస్థితియు నట్లే యుండెను. పుత్త్రవియోగము ననుభవించిన తల్లికిఁ దప్ప, పుత్త్రదుఃఖ మిట్టిదని చెప్ప సాధ్యముకాదు. మురారి మరణయాతన చూపఱకుఁ జాల జాలికలిగించెను. సహజరీతి సరస్వతి హృదయముగూడ స్వపుత్త్రమరణాఘాతమునఁ బగిలిపోయెను. తనకూర్మిసుతుని శవమును, తనగారాబుపట్టి దహనక్రియలను గన్నారఁగాంచినచో బాలాదిత్యుఁడు దుర్భరదుఃఖమునఁ గూలిపోవు నను తలంపున రాజకుమారుని శవమునకుఁ గలాంజారుకోటయందే దహనక్రియ లొనరించుట యుక్తమని చారుమతి చేసినసూచనకు సరస్వతి సమ్మతించెను.

ఉత్తరక్రియ లగుటయేతడవుగా, సరస్వతి పాటలీపుత్త్రమునకుఁ బోయెను. మునుపటికంటె నిప్పుడు తనపతి నీరసుఁడైయుండుట నామె గ్రహించెను. ప్రాణకాంతయగు సరస్వతిపరిచర్యలకును, దాదులసపర్యలకు నెంతయుఁ వ్యత్యాసముండెను. ఘోరమగుపుత్త్రమరణవార్త బాలాదిత్యుని చెవులఁబడకుండునట్లు దాదు లెంతయో ప్రయత్నించిరి. కాని యెట్లో యది మహారాజునకుఁ దెలిసెను. ఇన్నియుఁగలిసి యాతనివ్యాధిని దిరుగఁబెట్టెను. జ్వరముతీవ్రత హెచ్చెను. పాపము! గోరుచుట్టుపై రోఁకటిపోటువలె వచ్చిన యీయాతనవిపత్తునకై, సరస్వతి పుత్త్రవియోగశోకమునుగూడ దిగమ్రింగి, రేయింబవళ్లు నిజపతిసేవానిరతయై యుండెను. పతివ్రతయగుసరస్వతి యెన్నిసపర్యలొనరించుచున్నను, స్వామిభక్తిపరులగు రాజవైద్యు లెంత సేవించుచున్నను, ఆతఁడు బూదింబోసిన పన్నీరగుచుండెను. నానాఁటికి బాలాదిత్యుని దేహస్థితి చెడిపోవుచుండెను. కడ కాతఁ డిఁక నెన్నిదినములో జీవింపఁడని తోఁచెను. పుత్త్రవియోగమునఁ బరితపించుటఁ జేసియు, గంటికిఁ గూర్కులేక పతిసేవానిమగ్నయై యుండుటం జేసియు, సరస్వతికిఁగూడ నారోగ్యము చెడెను.

ఒకనాఁడు బాలాదిత్యుఁడు సరస్వతిం బిలిచి, తనచెంగటఁగూర్చుండుమని చెప్పెను. ఆమె యట్లే కూర్చుండెను. అప్పు డాతఁ డామెతో "ప్రేయసీ! నాయంత్యము దాఁపురించుచున్నది. కాన నేను నీతోఁ గొన్నివిషయములను గుఱించి మాట్లాడుట యుచితమైయున్నది." అని చెప్పెను.

దురతిక్రమమగు దుర్దశానుభవమును జెవులార విని, సరస్వతి పసిపాపవలె వెక్కివెక్కి యేడువసాగెను.

బాలా:—ప్రేయసీ! ఏడువకుము. నాయెదను విప్పిచెప్పుటకు నీయేడ్పులు నన్ను నిరుత్సాహపఱచునుసుమా!

సరస్వతి పైఁటకొంగున ఱెప్ప లద్దుకొనుచు "ప్రాణేశ్వరా! మీరు నాకు సెలవీయనుండు సంగతులేమి?" అని బాష్పనిరుద్ధకంఠమునఁ బలికెను.

బాలా.—ప్రేయసీ! నాయంత్యదినము సమీపించుచున్నదని నీకు దెలియుఁగదా! మరల విలపింపఁబోకుము. వాడి వత్తరాయెయుండు నీముఖాంబుజమును జూచి నేను భరింపఁజాలకున్నాను. బుద్ధభగవానుఁ డెట్లనాయాసమరణమొందినది నీవెఱుంగవా? ఆమహాత్మునిశిష్యవర్గము గురునిర్యాణము నెంత నిర్విచారముగఁ జూచినదియుఁ దెలియదా? మనము పెక్కుసార్లు భగవద్గీతను జదువుచుందుముగదా! 'మృత్యు వనివార్యమైనది. పండితు లద్దానికై వగవరు. జరాభారమును నిశ్చింతతో ననుభవించుకైవడి, మరణమునుగూడ సంతసమున నెదుర్కొనుము' అనికదా యందుఁ జెప్పఁబడియున్నది! ఐహికసంతాపములకును, ఆశాభంగములకును రోసి బలరాముఁ డెట్లు పరలోకము నలంకరించినదియుం నీకు విదితమేకదా! ఇఁక నిర్వక్రపరాక్రమోజ్జ్వలుఁడగు భీష్మాచార్యుం జూడుము! నిర్వ్యాకులమానసమున నామహాత్ముఁడు నిర్యాణము నెదురుచూచుచు నంపశయ్యపైఁ బవళించియుండలేదా! జననమును మరణము వెన్నంటివచ్చుట ప్రకృతిసిద్ధము. కాన నోప్రేయసీ! అనుల్లంఘ్యములగు భగవత్సంకల్పములకు వగచుట నిష్ఫలమని తెలియుము.

సర:—నాకు సాధ్యమైనంతవఱకు నాదుఃఖము నణఁచుకొనుచునే యున్నాను. నాథా! మీరు నాకు సెలవీయనెంచిన ముఖ్యవిషయములేమి?

బాలా:—ప్రాణనాయకీ! నీవు నామరణానంతరము సహగమన మొనరింపరాదు. ఇదియే నా మొదటికోరిక.

సర:—కాని మీకోరికఁదీర్చుట నావలనఁగానిపని. మన పెద్దలసంప్రదాయము లావిధమునఁ గలవు. మిమ్ములఁబాసి నేమనఁజాల. దేవా! సుక్షత్రియవీరాంగనలయాచారముల ననుసరించుటకు నాకడ్డుతగులకుఁడు. హూణుఁడగు తోరమానునిరాణులుసైతము సహగమన మొనరించిరిగదా!

అని సరస్వతి భర్తపాదములను గట్టిగాఁబట్టుకొని సహగమన మొనరింప వలదనునాజ్ఞ చేయకుఁడని వేడుకొనసాగెను.

బాలా:—ప్రేయసీ! సరస్వతీ! సహగమన మార్యసంప్రదాయము కాదు. ఆర్యాంగనలందఱు భర్తలవెంట దివికేగినయెడల, వితంతుహితచర్యలకుఁ వా

వెక్కడిది? అట్లుండియు, శాస్త్రములన్నియు విధవాధర్మములను వాకొనుచున్నవి. అదియుంగాక, మనధర్మశాస్త్రకర్తలు, పతివెంట సతి సహగమనమొనరింపవలయునని యెచటఁజెప్పియున్నారు? చెప్పియేయుండిన, వృద్ధురాలగు తల్లిని బోషించుట పుత్త్రునకు విధియని యేల విధించియున్నారు? పుత్త్రుని తల్లి రక్షించుటకై వదలి, భర్త దివికేగనని దీనియర్థముకదా?

సర:—నాథా! మీశాస్త్రవివరణము సముచితమై యుండవచ్చును. కాని యార్యాంగనామణులు నిజపతులతోఁ బరలోకమునకుఁ గూడఁబోయిరని మీరు మఱచితిరికాఁబోలు! ఇందులకు సావిత్రీదేవి యొకసాక్ష్యము కదా!

బాలా:—కాని సావిత్రి యెచట సహగమన మొనరించినది? ఆమె యమునిఁ దిరస్కరించిన వనితాశిరోమణికదా! పతిప్రాణములఁ గొనివచ్చుటకై యామానవతి పితృపతివెంటఁ బరలోకమునకుఁగూడఁబోయినది. అదియుంగాక సత్యవంతుఁడు యౌవనమునందే కాలగతినొందుటంజేసి, పాపరహితుఁడైయుండెను. కాని వృద్ధుఁడనగు నావిషయమై నీవొనరించుప్రార్థనలను యముఁడు చెవులఁజొప్పింపఁడు.

సర:—ప్రాణేశ్వరా! ఎవరెట్లువోయిన నాకేల? నాపతిననుసరింపవలయుననియే నాయిాప్సితము. అందులకు నాకధికారమున్నది.

బాలా:—కాదుకాదు. ప్రేయసీ! నీవు పొరపడుచున్నావు. స్త్రీపురుషుల కెవ్వరికిఁగాని యాత్మహత్య యొనరించుకొనుట కధికారములేదు. ఆత్మహత్య మహాపాతకమని సర్వమతము లుద్ఘోషించుచున్నవి. అదియుఁగాక మానసంరక్షణార్థము విధిలేక వచ్చినందప్పు, ఆత్మహత్య లొనరించుకొను స్త్రీపురుషులు పిఱికిపందలని చెప్పనొప్పును.

సర:—నాథా! అయిన నాగతియేమికావలయును? మీరేమని తలంచుచున్నారు? ఏదియేని యొకటి ఖండితముగా సెలవిండు.

బాలా:—ఈలోకమందుండి నారాయణీధర్మగుప్తులగంటిని జెప్పవోలె రక్షించుచు, మనబిడ్డలగు మాగధులయోగక్షేమముల నారయుచుండుము.

నీకుఁగూడ మరణకాల మాసన్నమైనప్పుడు, సంతోషసంతాపములకే మాత్రము లోఁబడక నీపాదధూళిని విదిలించుకొని పరలోకమునకరుగుము.

సర:—ప్రాణేశ్వరా! అయిన సంతానవిహీనలగుపత్నులుమాత్రము సహగమనమున కధికారులని మీరందురు. అవునా?

బాలా:—కడకు వారికిఁగూడ నందుల కధికారము లేదు. వారు ధర్మనిష్ఠం దవిలి, దైవభక్తిపరులై, లోకోపకారనిరతులై యిచటఁ దమజీవితములఁ గడపుచుండినచోఁ, బరలోకమునందలి తమపతుల యాత్మల కెంతయు సంతస పెట్టినవారగుదురు. భర్తకు భార్య యర్ధాంగి కావున, నామె యొనరించు సత్కార్యఫలములన్నియు నాతని యాత్మ నుద్ధరించుచుండును. అట్లే భర్త యొనరించు సత్కార్యఫలములుకూడ భార్యకుఁ జెందుచుండును. వెనుకముందు లారయక గ్రుడ్డినమ్మకముతో మనసార సహగమన మొనరించు సతీమతల్లులు సాహసికలని చెప్పనొప్పును. ఏలయన, తమకు విధియనితోఁచిన కార్యమును వారఱగొఱలు లేక కావించుచున్నారుగదా! ఇట్టి తెలివిమాలినపనులంబట్టియే, వేదనాభరితమగు నీప్రపంచమునకు సేవలొనరించి లోకోపకారిణులై తనరారువనితారత్నములు కఱవగుచున్నారు. ఇహమునుండి పరమునకుఁ బోవు సమయమాసన్నమగుఁదనుక, వారీలోకమునందేయుండి ప్రజలకుఁ గాలు నొచ్చినఁ దమకుఁ గన్నునొచ్చినట్లు భావించుచు, వారిని గన్నబిడ్డలరీతి గాపాడుచుఁ దమజీవితమును సద్వినియోగ మొనరించుచుండినచోఁ, బతితో సహగమన మొనరించినప్పటికంటె వారెన్నిమడుఁగులో సాహసికలని చెప్పవచ్చును. వారికి బిడ్డలులేకున్నంతమాత్రమున నేమి? అనాథశిశువులను, నిర్భాగ్యులను తనబిడ్డలని భావించి వారిఁగంటిని ఱెప్పవోలెఁ గాపాడుచుండినఁ జాలును. వారిమృతభర్తలకుఁగాని, భగవంతునకుఁగాని యంతకంటె సంతోషదాయకము వేఱుండదు. ఇఁక సంతానముండియు సహగమన మొనరించు మానవతులసంగతియా? వారికృత్యములు పాపపూరితములనియు, వారిత్యాగము కళంకభరితమనియు నాయభిప్రాయము. నీయది కానివస్తువును నీవు దానమీయఁగూడ

డు. అట్లే నీపసికూనలపై యుండుమాతృప్రేమను నీవు దోఁచుకోఁదగదు. నీ సంతానమును నీవు సక్రమముగ సాకి సంతరించినప్పుడే, పతి కుచితమగు స్వార్థత్యాగ మొనరించితివని నీవు గర్వింపవచ్చును. ధర్మగుప్తున కిప్పుడు పదునైదేండ్లు. నారాయణికిఁ బదేండ్లు. వారు ఱెక్కలురానిపక్షులుకదా! అట్టిపసికూనలవదలి నావెంట నీవు పరలోకమునకువచ్చుట వారికి హానికరము సుమా! అదియుఁగాక, వారిని దిక్కులేనిపక్షులఁగావించి నీవు నాతోవచ్చిన యెడల, నీముఖముఁజూచుటకైన నామనసొప్పదు. ఏలయన. బిడ్డలకు ద్రోహ మొనరించుక్రూరులను మానవంతుఁడగుప్రభు వాదరింపఁడు. భూకాంతుఁ డర్భకులపాలిరక్షకుఁడుకదా! అట్టియెడ నర్భకులకు ద్రోహమొనరించిన క్రూరాత్ములకు భూమీశుఁడు తోడ్పడునా? ఆక్రూరాత్ములఁ జేరఁదీయునా? ఈనియమము లందఱకుఁ జెల్లును.

పర:—నాథా! నేనిప్పుడు మీయభిప్రాయముల నేకీభవించితిని. సహగమన మొనరించునూహ లన్నింటి వదలితిని.

బాలా:—అయిన నీనిర్ధారణము నాకు సంతసము నించినది.

పర:—కాని ప్రాణేశ్వరా! విధవాహితచర్యను నాకెఱిఁగింపుఁడు.

బాలా:—నాను సరియనితోఁచినదానిం జెప్పెదను. మనుధర్మశాస్త్ర మునం దీవిధమునఁ జెప్పఁబడియున్నది. 'ఆదర్శనీయయగు వితంతువు ఫలాహారముమాత్రము పుచ్చుకోవలయును. నిష్కళంకమగు ధౌతాంబరమును ధరింపవలయును. తెల్లమల్లెపూవులను దలయందు ముడువవలయును. భర్తయే దైవమని భావించుచు, సంతతము లోకసేవాతత్పరయై, భర్తృమోక్షప్రాప్తికొఱకు దనజీవితసర్వస్వమును ధారవోయుచుండవలయును. చెడ్డపనులను, చెడ్డతలఁపులను, చెడ్డమాటల నామె వదలవలయును. ఆమె బుద్ధభగవానుఁడు నిర్ణయించినయష్టాంగయోగము నవలంబింపవలయును. ఆపదలయం దామె యందఱకుఁ దల్లియై యుండవలయును. నిర్భాగ్యుల నుద్ధరింప నడుకట్టియుండవలయును.” ఈవిధమున నామె సత్కార్యము లొనరించుచు, మృత్యుదేవత

తన్నుఁ బరలోకమునకుఁ గొనిపోయి తనపతిం జేర్చునంతవఱకుఁ గాలము గడపుచుండనగును.

సర:—ఏతంతువుల కిట్టిచర్యలు నిర్ణీతములై యున్నవని నాకింతవఱకు దెలియదు. ఆహా! ఇట్టి సద్విషయములను స్త్రీలకేల నేర్పరాదు?

బాలా:—ప్రేయసీ! మనపూర్వులొనరించిన ప్రమాద మిదియేకదా!

సర:—నాథా! మీరేమైన నాహారముతీసికొనరా? మీరు పథ్యముతీసి కొని చాలకాలమైనదికదా!

బాలా:—సరస్వతీ! నాకాఁకలిలేదు.

సర:—ఏమైనఁ గొంచెము తినుఁడు. చూడుఁడు; మీరెంతగా కృశించితిరో! ఈపాడుజ్వరము మీసొత్తురుకండలను గఱఁగించివైచినది. ఆహాహా! నాథా! మీరెంతమార్పుఁజెందితిరి! మీరొండొదను నమలివేయున దేది? మిమ్ములఁ బీల్చి పిప్పిచేయునదేది? మురారిమరణమేకదా?

పాపము; సరస్వతి పెద్దపెట్టున నేడువసాగెను.

బాలా:—సరస్వతీ! వలదు. ఏడువకుము. దైవము నాజీవములఁగొని మురారిని రక్షించియుండఁగూడదా యని నేఁదలఁచుచుందును. ఇంతయే కాని, నేను మురారిఁ దలంచుకొని కృశించుటలేదు. అంతర్గతరూక్షనాసార మును బీల్చివేయుచున్నది. నేను స్వస్థుఁడనాదు ననునాశలేదు. లేనేలేదు.

సర:—నాథా! అట్లనకుఁడు. నేను దుఃఖమునఁ జచ్చెదను.

బాలా:—జరుగనున్నదానిని దాఁచుటవలనఁ బ్రయోజనమేమి? ప్రేయసీ! దుఃఖింపకుము. ఇఁక నేనొకవారముపైన జీవింపను. పరలోకప్ర యాణమునకు నేను సిద్ధపడవలయును. ఇంకను గొన్నివిషయములు మిగిలియు న్నవి. నీకన్నిటిని తుడుచుకొనుము.

సరస్వతి కన్నీ రద్దుకొనెను. కాని మరల నయనగోళముల నంతలోఁ గ్రొత్తనీరూరెను. సరస్వతి యెంతప్రయత్నించిన నేమిప్రయోజనము? బాష్ప జలముల నాఁపుకొనుట కామెకు సాధ్యముగాకుండెను.

బాలా:—సరస్వతీ! నేను నాశ్రజలకుఁ జెప్పరానిహానిఁ గావించితి. నిరాధారులగువితంతువులను, నిర్భాగ్యులగుశిశువులను నేను శక్తివంచనలేక యుద్ధరింపనైతిని. సరస్వతీ! నీవిఁక వారికి సాయమొనరింపవలయునని నా యభిలాష. గౌరవజీవనమున నుదరపోషణ మొనరించుకొనుశక్తి ప్రతివితంతు వున కుండుఁగాక! ఏశిశువుగాని యాఁకట మాడకుండుఁగాక! వితంతువు లందఱిని నీతోఁబుట్టువులుగాఁ జూచుకొనుము. అనాథశిశువులందఱను, నీ ధర్మగుప్తనారాయణలున్నారుగదా, వారివలెఁ జూచుకొనుము. నాకోర్కెఁ గొనసాగించునట్లు మాటయిమ్ము.

సర:—మీయాజ్ఞను పాలిందాల్చెదను.

బాలా:—ఇఁక నిర్భాగ్యులగు చండాలురున్నారు. నిష్కరుణా త్మకమగుసంఘము బహిష్కరించిన మందభాగ్యులు వీరు. అవినీతికరమును, అస్వాభావికమునగు నీసంస్థ, వేదవిహితమును శాస్త్రసమ్మతము నైనది కాదు. వేదములు, శాస్త్రము లీసంస్థ నెఱుంగవు. అయిదవవర్ణ మనునది లేదని మనువు నెలవిచ్చియున్నాఁడు. శ్రీరామచంద్రునిపడవను గుహుఁడను అంత్యజుఁడు గంగానదిపై నడపెను. బ్రహ్మక్షత్రియవైశ్యు లందఁజాలనిమోక్షమును శబరి యనునిషాదవనిత కామహాత్ముఁడు ప్రసాదించెను. మహాదేవుఁడగుశివుఁడు బోయవేషము ధరించినాఁడు. కడకు బుద్ధభగవానుఁ డీనడుమనే బ్రాహ్మణుఁ డగుమహాప్రజాపతిని, మాలయగునుపాలిని సమానముగ నాదరించి, వానిపైఁ గరుణారసబిందువులఁ జిలుకరించినాఁడు. ఇంతయేల? మనకుఁ బ్రత్యక్ష ప్రమాణమున్నదికదా! ఉజ్జయినీపౌరు లెవ్వరుకాని మాకానాఁడు శరణ మియ్యనితరుణమున, చండాలిని యగుమాధవి స్వప్రాణములఁ దృణప్రాయ ములుగా నెంచి, నాకును యశోధర్మకును నాశ్రయమొసంగి మమ్ములరక్షింప లేదా? ఇన్నిసద్గుణములుండియు, వారిని భారతీయులు కుక్కలకంటె నీచ ముగఁ, బందులకంటె హీనముగాఁ జూచుచున్నారుకదా! ఈపాపిష్ఠుల నుద్ధ రింప నేను కొంతవఱకుఁ బాటుపడియున్నాను. కాన నీవు వారికొఱకై యిం

కను క్రమించి, వారిని మంచిస్థితికిఁ గొనిరావలయునని నాకోరిక. దైవము పక్షపాతమెఱుఁగదు. అతనికి జాతివివక్షత లేదు. ఇహలోకమునందు సోదర మానవులను వేఱుచేసి కడజాతివారని విభజించుమానవులు, పరలోకమున దైవముచేఁ జండాలురుగాఁ జూడఁబడుదురు.

సర:—ఈప్రపంచముల నుద్ధరింప నేను సాధ్యమైనంతవఱకుఁ బ్రయత్నించెదను.

బాలా:—ఆయిన మంచిది. ఇప్పుడు నామనస్సు కుదుటఁబడినది. నన్నించుక కన్నుమూయనిమ్ము. నిద్రవచ్చుచున్నది.

సరస్వతి యాతని విడిచిపోనుంచునంతలో నాగదిలోనికి నారాయణీ ధర్మగుప్తు లరుదెంచిరి. నారాయణి నేరుగాఁ దండ్రికడకేగి "బాబా! నీసంగతియేమో నాకుఁ దెలియుటలేదు. నీవు సరిగా నాహారముఁ గొనుటఁ గూడ మానితివి. మాయమ్మ నీయెదుట లేనపుడంతయుం నామె కంటికి కడ వెఁడుగా నేడ్చుచుండును. మాయమ్మను సంతోషపెట్టుటకైన నీవింత యొంగిలి చేయఁగూఁడదా? బాబూ! ఇదిగో, తినుము. నీకొఱకై యీ మిఠాయిఁ దెచ్చితిని" అని యాబాలకోమల కరములు చాచి కొంత మిఠాయి నాతని కందిచ్చెను. ఆచిన్నిపాపను సంతోషపెట్టుటకు బాలాదిత్యుఁ డొకముక్కఁ దినఁ బ్రయత్నించెఁగాని, యాతని కది సాధ్యము కాకపోయెను. ఎట్టులో యొకట్టుల కన్నుమూసికొని యాతం డొకముక్కం దినెను.

నారా:—బాబూ! నీవు చాల జబ్బుగానున్నావు. నేను మురారిని గలాంజారునందుఁ జూచినపు డాతం డెట్టుండెనో నీవిపు డట్లున్నావు. మురారి స్వర్గమునందున్నాఁడని మాయమ్మ నాతోఁ జెప్పుచుండును. బాబూ! స్వర్గ మెక్కడనున్నది? ఇప్పుడే చెప్పుము.

సర:—అమ్మా! నారాయణీ! మీబాబు దస్సియున్నాఁడు. ఆయన నిద్రింపవలయును. ఆయన నీకు రేపు బదులుచెప్పును రమ్ము.

బాలాదిత్యుని మొగమున శోకమేఘావృతమగు మందహాసచంద్రికలు పొడఁగట్టెను. "నీమాట నిజము. పరలోక మెట్లుండునదియుం నప్పటి కింక చుక నే నెఱుంగుదు నేమో!" అని యాతఁడు పలికి, నారాయణిని దగ్గఱకుఁ దీసి కౌఁగిలించుకొని, చెక్కులనొక్కి ముద్దిడుకొనెను.

నారా:—బాబూ! నీ పెదవులు వేఁడిగా నున్నవేల? అమ్మా! బాబు పెదవు లెంత వెచ్చగా నున్నవో చూడుము!

బాలాదిత్యునకుఁ దీవ్రజ్వరము తగిలియున్నదని సరస్వతికిఁ దెలియును. అందుచే నామె యూరకుండెను. ఇంతసేపుగా ధర్మగుప్తుఁ డూరక నిలిచి యంతయుఁ జూచుచుండెను. అబాలుఁ డొక్కపలుకైనఁ బలికినవాఁడు కాఁడు. కాని యాతనివదనాంబుజము మాత్రము విన్నమైయుండెను. బాలాదిత్యుఁడు వానిని దనశయ్యవద్దకుఁ జేర సైగఁజేసి "పట్టీ! నేను మిమ్ముఁ ద్వరలో విడిచిపోనున్నాను. మీయమ్మ మిమ్ముల గారాబమునఁ బెంచఁగలదు. ఆమె గీచినగీటును మీరు దాటకుఁడు. ఆమె మనసును నొప్పింపకుఁడు. ఆమెను సేవించుచుండుఁడు.

ధర్మ:—అట్లే నడచుకొనియెద.

నారా:—బాబూ! నీ వెక్కడికిఁబోదువు?

బాలా:—త్వరలో నెఱుంగుదువమ్మా! ఇఁక నన్ను వీడుఁడు.

అందఱును రోగిగది విడిచిపోయిరి. బాలాదిత్యునకు నిద్రవచ్చెను. తిరిగి సరస్వతి గదిలోనికివచ్చి కూర్చుండెను. ఆమెనయనములఁ బాష్పవారిధారలు కట్టుచుండెను. ఆమె యప్పుడప్పుడు రోగి నాడిఁ బరీక్షించుచుండెను. జ్వరము తీవ్రతరమగుట నామె గ్రహించెను. రోగియొడలు భగ్గుమనుచుండెను. అచటనుండు దాసీజనులందఱు విచారాక్రాంతలై చేతులు పిసుకుకొనుచుండిరి. యథారీతి నేఁడుకూడ రాజవైద్యుఁడు వేళకు సరిగా వచ్చి రోగిని బరీక్షించెను. అతఁడు తలఁచినంతకంటె జ్వరము తీవ్రతరమై

యుండెను. "రోగి యుద్రేకములో నుండెగాఁబోలు! దేవరవా రాహార మేమైన రుచిచూచిరా?" అని రాజవైద్యుఁ డడిగెను.

సర:—లేదు. ఆఁకలి లేదనుచున్నారు.

వైద్యుఁడు:—అలాగా?

సర:—నీవిచట రోగివద్దనే యుండవలయును.

వైద్యుఁడు:—దాని కభ్యంతరములేదు కాని నాయునికివలన ప్రయోజనమాత్ర ముండదు. రోగి జీవించునను ఆశలేదు.

సరస్వతిగుండెయందు బండపడినట్లయ్యెను. ఆసాధ్వి చక్షువుల బాష్పజలములూరి కాలువలై స్రవించుచుండెను. ఆపాదమస్తక మామె గడగడ వడఁకుచుండెను రాజవైద్యుని నిశ్చితాభిప్రాయ మాయువిదను శోకసంద్రమున ముంచెను. వైద్యుఁ డామె దుఃఖముఁ గాంచి "మహారాణీ! మీమానసమును జిన్నపుచ్చుచున్నానని నాకుఁ జింతగా నున్నది. కాని రాజుగారి కంత్యక్షణము సమాపించియున్నదని, ఉన్నమాట యున్నట్లు చెప్పనిచో, నేను మీయెడల ద్రోహమొనరించిన ట్లగును. మహారాజుగారి కీరాత్రి గడచుటకూడ సందేహమని నాయభిప్రాయము" అని చెప్పెను.

సర:—అంత దుస్థితికి వచ్చినదా?

వైద్యుఁడు:—అవును తల్లీ! అవును.

వైద్యునియభిప్రాయము పాటలీపుత్రమునందంతయు వ్యాపించెను. పౌరు లెక్కడిపనుల నక్కడఁ గట్టిపెట్టిరి. మహారాజుగారి యస్వస్థతను గుఱించి యేవేళ కేది వినుదుమో యనుతమకమున వారు గుమికూడుచుండిరి. నాఁటి యపరాహ్ణమునఁ బార్వతి వచ్చి, రోగిగదియందుండు సరస్వతిం గలిసికొనెను. సాయంకాలము చీఁకటిపడినతర్వాత, బాలాదిత్యునకు జన్ని కలిగెను. అతఁ డేమేమియో పలవరింప మొదలిడెను. పలుమా రాతఁడు "మురారీ! మురారీ! సరస్వతీ! నారాయణీ! యశోధర్మా! ధర్మగుప్తా! మాధవీ" అని యఱచుచుండెను. సరస్వతి "యశోధర్మగారి కిప్పుడే చెప్పిపంపుదునా!"

అని వైద్యు నడిగెను; కాని యాతఁ డందులకు 'వ్యవధిలేదు' అనెను. పార్వతి రోగి శయ్యాప్రక్కకుఁబోయి నిలువఁబడెను. బాలాదిత్యుఁడు కన్నులు దెఱచెను. కాని యాచూపులయం దాతఁ డామెను గుర్తించిన సూచనలు లేవు. సరస్వతి యాతనినుదుట చేయియుంచెను. అది భగ్గుచుండెను. జాడ్యము మన శక్తికి మించిపోయినదని వైద్యుఁడనెను.

ఆరోగిచేఁ గొన్నికషాయములఁ ద్రాగింపఁ బార్వతీసరస్వతులు ప్రయత్నించిరి కాని, వారి కది సాధ్యము కాకపోయెను. రాత్రి చాల ప్రొద్దుపోయెను. "ఇంతకును బుద్ధభగవానుఁడు సత్యమును సెలవిచ్చినాఁడు" అని బాలాదిత్యుఁడు ప్రజ్ఞతోఁ బలికి కన్నుమూసెను. సరస్వతీపార్వతు లాతని హెచ్చరించుకొనిరి. కాని యాతఁడు పలుకలేదు. ఆమాట లనినతర్వాత నాతఁడు పెదవియైనఁ దెఱచినవాఁడు కాఁడు. శ్రమాపరిభిన్నమగు నాజీవుఁ డర్ధరాత్రిసమయమున మట్టికుండను వదలిపోయెను.

అచట గుంపులుగట్టియుండు పౌరులందఱు స్వప్రభుమరణమునకు శోకసాగరనిమగ్నులైరి. పెన్నిధిం గోల్పోయిన పేదచందమున వారు వగచుచుండిరి. తమ్ముఁ గన్నబిడ్డలవలెఁ గాపాడుచుండిన తమరా జిప్పుడు లేఁడు గదా యని వారిలోఁ జాలమంది వెక్కి వెక్కి యేడ్చుచుండిరి.

మొదటివాఁడు:—అశోకమహారా జొక్కఁడె తప్ప, నీతనిఁబోలిన మహారా జిప్పటికిఁ బుట్టియుండలేదు. పుట్టబోఁడు.

రెండవవాఁడు:—అవునవును. ఆతఁడు తన ప్రజలపాలిటి తండ్రియై యుండెను.

మూఁడవవాఁడు:—వితంతురక్షకుఁడును, దీనచింతామణియునగు నిట్టి రాజచంద్రుఁ డిప్పటికి మగధరాజ్యమునం దుండినవాఁడు కాఁడు.

నాల్గవవాఁడు:—పేదల నాతఁడు తనపుత్త్రులవలెఁ బ్రేమించుచుండెను.

ఐదవవాఁడు:—మనరా జస్తమించెఁగదా! ఇఁక మనగతియేమి కానున్నదో?

మొదటివాఁడు:—యువరాజగు ధర్మగుప్తునకుఁ బట్టాభిషేక మొనరించి, యాతనికి యుక్తవయస్సువచ్చువఱకు మహారాణి సరస్వతి పరిపాలనాచక్రమును ద్రిప్పుచుండునని వదంతిగా నున్నది.

ఐదవవాఁడు:—అయిన మహారాణి సరస్వతి సహగమన మొనరింపదా?

మొదటివాఁడు:—ఒనరింపదు. ఆమె సహగమన మొనరింపకుండునట్లును, జీవితశేషమంతయుఁ దనబిడ్డలగు మనలఁ గాపాడుటయందుఁ గడపునట్లును, బాలాదిత్యుఁ డామెవలన వాగ్దానము తీసికొనెను.

ఐదవవాఁడు:—దైవము వందనీయుఁడుగదా! మహారాణి సరస్వతి మనకుఁ దల్లివంటిది. ఇఁక మనము భయపడఁ బనిలేదు.

మొదటివాఁడు:—నీమాట నిజము.

---

# ముప్పదియాఱవతరంగము.

---

## యశోధర్మ-చారుమతి-పూరీజగన్నాథము.

ఇప్పుడు చారుమతీయశోధర్ములు పూరీపట్టణమునందలి రాజమందిరములో నుపవసించుచుండిరి. జగన్నాథస్వామి సందర్శనార్థమునకును, దేవాలయ పరిపాలనావిధానమునందుఁ గొన్ని ముఖ్యముగుమార్పులఁ గావించుటకును వారానగరమునకుఁ బోయిరి. యశోధర్మ రాజ్యమునందలి దేవాలయములన్నింటిలో నయ్యది మిగులఁ బ్రసిద్ధికెక్కియుండెను. ఆసేతుహిమాచలముకూడ నయ్యది విఖ్యాతివందియుండెను. మహామహిమోపేతమగునట్టి దేవాలయమునం దానుపూర్వికముగ నర్చకుఁడు మంగలివాఁడైయున్నాఁడుగదా యని యశోధర్మ కటకటఁబడుచుండెను. నీచకులజుఁడగు నాపితుం దొలఁగించి, వానిస్థానమున బ్రాహ్మణపూజారిని నియమింపనగునని యాతఁడు చారుమతితో నెన్నియోమారు లనియుండెను. ఇట్టిమార్పు లోకవేళ ధర్మవిహితములైనను, నీతిమతము లడుఁగంటుచున్నవని తోఁచినఁదప్ప, జగన్నాథముఁబోలిన ప్రాచీన దేవాలయములందలి యానుపూర్వికాచారములఁ జెవరఁగొట్టుట యుక్తము గాదని చారుమతి యభ్యంతరపెట్టుచుండెను.

ఆమాటలకు యశోధర్మ "చారుమతీ! ఈమార్పు నీతిమతసముద్ధరణముకొఱ కవసరమని నీవు తలంపవా? వేదశాస్త్రములవాసనయైన నెఱుంగని మంగలివాఁ డెక్కడ? దేవునిఁ బూజించుటెక్కడ?" అని యడిగెను.

చారు:—బ్రాహ్మణులగుపూజారులుమాత్రము సకలవేదశాస్త్రముల నెఱింగినట్టా రేమి? ఏవో నోటికివచ్చినమంత్రములఁ జిలుకపలుకులవలెఁ

బలుకుచుఁ గీలుబొమ్మలవలెఁ బూజాదికృత్యములను మాత్రము వారొనరించు చుందురు. జ్ఞానమునకుఁ దోడుభక్తియుండుట ముఖ్యము. ఆబ్రాహ్మణుఁడు మహాప్రజాపతి పండితునికంటె, మంగలివాఁడగు నానందుఁ డెక్కుడుభక్తి శ్రద్ధలతో నుండినకారణమునఁగదా బుద్ధభగవానుఁ డాతనిఁ బ్రేమించుచుండి నాఁడు.

యశో:—ఔనౌను. ఆనందునిబోఁటిసాత్త్వికులు దేవాలయమందుఁ జేరి, మంగలివానిఁ బూరిజగన్నాథములోనికిఁ బ్రవేశపెట్టినారు. ఇందాశ్చర్య మేమున్నది.

చారు:—అట్లనకుఁడు. ఏన్నియోకకములుగా మంగలివాఁడు పూరి యందుఁ బూజారిగా నున్నాఁడు. ఇతరదేవాలయములయందు బ్రాహ్మణుల కర్తృకత్వమునకు హెచ్చుండునట్లు, మంగలుల కచటఁ గలదు. మంగలికి జగ న్నాథమునందట్లు ప్రవేశమబ్బెనో యాకథ మీకుఁ దెలియునా? మీరు కళింగమున జన్మించియుండమిం జేసి, బహుశః యాకథ మీకుఁ దెలిసియుండ దనుకొనియెద.

యశో:—ఆకథ యేమి?

చారు:—అయినఁ జిత్తగింపుఁడు. ఆలయప్రాంగణమునం దొకనాఁడు జగన్నాథస్వామిరథోత్సవము జరుగుచుండెను. నాలుగువర్ణములవారును, అచట గుమిగూడి యుత్సవము నవలోకించుచుండిరి. కులీనుఁడని గర్వించు బ్రాహ్మణుఁడగు పూజారికిసమీపమున శ్వపాకుఁడగుకుష్ఠురోగి యొకఁడు పండు కొనియుండెను. వాఁడు మూఁడుకాళ్లముసలి. అతనికా లొకటి మోఁకాలి వఱకు మొండెముగానుండెను. వాఁడు చూచుటకు మిగుల నసహ్యముగా నుండెను. వాఁ డాయర్చకుని జూచి దీనస్వరమున "స్వామీ! నాకన్నితీర్థ మిండు. నాప్రాణములు పోవుచున్నవి" అని వేఁడుకొనుచుండెను.

దాని కాబ్రాహ్మణుఁడు ముఖమంతయు గన్నులుచేసికొని "ఓరీ నీచుఁడా! నీకుఁ దీర్థము కావలయునఁటరా? ఓరీ! అధమాధముఁడా! నిన్నుఁ

దాఁకిన నాకు మైలతగులునని వెనుదీయుచున్నాఁడఁగాని; లేకున్న నిన్ను నాలుగుతన్నులు తన్నియుండెడివాఁడను. తొలఁగుము. నీముఖముఁ జూడ మాకు సిగ్గగుచున్నది. తొలఁగుము.” అని యామాలవానిని నోటికొలఁదిఁ దిట్టుచుఁ గేకరించి వానిపై నుమిసెను. అచటనుండు నాలుగువర్ణములవారావిప్రుని మెచ్చుకొని చప్పట్లుకొట్టిరి.

అంత వారిలో నొకమంగలివాఁడు కొంచెము ధైర్యముఁ దెచ్చుకొని “అయ్యలారా! వాఁడుకూడ నొకమానవుఁడే కదా! ప్రాణములరక్షింపు వాఁడు ప్రార్థించుచున్నాఁడు. వానికోరికను నిరాకరించుట పాడిగాదు” అని చెప్పి, తెగువఁజేసుకొని, పూజారికడఁబెట్టియుండుపాత్రముఁగొని, సాగిలఁబడియుండు శ్వపాకున కొసంగెను. విదృత్తువు లీసాహసకార్యముం జూచి యట్టే కొయ్యబాఱి నిలిచిరి. వారియం దలజడికలిగెను. అంద ఱొక్కపెట్టున “మంగలివాఁడు తీర్థము మైలపఱచినాఁడు” అని కాఱులఱచుచు నాయకార్యమొనరించిన మానవాధమునిఁ బుటము వేయ సమకట్టిరి. ఆకుష్ఠురోగి యంతలో లేచి నిలిచెను. చూచుచుండఁగనే వాఁడు మాయమయ్యెను. అచ్చోట జగన్నాథస్వామి ప్రత్యక్షమై నిలిచియుండెను. ఆపరాత్పరుఁడు మేఘగంభీరభాషణము నాడుచుండెను. “భావికాలమున జగన్నాథదేవాలయమునందలి పుణ్యతీర్థమును మంగలివాఁడు తాఁకుచుండుఁగాక! ఈయధికారము వాని కాచంద్రార్కము నిలిచియుండుఁగాక! మంగలియైనను, అతఁడు పరమార్థజ్ఞానమును, భక్తితత్త్వమును ప్రదర్శించి నాకుఁ బ్రియుఁడయ్యెను. బ్రాహ్మణునందును శ్వపాకునందును నన్నాతఁడు చూడఁజాలెను. ఇఁక నీతఁడు సర్వసముఁడై వర్తించుఁగాక! ఈతఁడు నాయర్చకుఁడై యుండఁదగియున్నాఁడుసుమా! ఈతఁడును, ఈతనిసంతతివారు నిఁకపై నాయర్చకులై యుందురుగాక! బ్రాహ్మణుఁడుగాని, మఱియేయగ్రకులజుఁడుగాని యాతండొసఁగు తీర్థముఁ గొన రోఁతపడకుండుఁగాక! ఈతని దూషించినచో, నన్ను దూషించినవారగుదురుసుమా!” అని సెలవిచ్చి యావిశ్వనాథుఁ డంతలో నంతర్ధాన

మఱచ్యాను. నాఁటినుండి నాపితులు జగన్నాథమునం దర్చకముఖ్యులై యున్నారు. బ్రాహ్మణుఁడుగాని, మఱియేకులీనుఁడుగాని, మంగలులకర్చకత్వమునకుఁ గల యోగ్యత నాక్షేపించినవారు కారు.

యశో:—చారుమతీ! జగన్నాథమునందు మంగలివాఁ డర్చకముఖ్యుఁడై యున్నాఁడను కారణమున, శ్వపాకుఁడు నిరాఘాటముగా దేవాలయమునఁ బ్రవేశింపనగునని నీవనుచున్నావా?

చారు:—అట్లనను. ఇప్పుడు పెద్దసంకటమువచ్చినది. ఈక్షౌరికప్రధానార్చకు లిపుడు తమమూలపురుషుని యుద్యోగతత్త్వమును మఱచిరి. మఱచి యామూఢు లిపు డితరదేవాలయములందలి బ్రాహ్మణపూజారుల నాదర్శముగాఁ గొని వర్తించుచున్నారు. లోభగుణమునందును, నాస్తిక్యమునందును మాత్రము వారు బ్రాహ్మణపూజారుల నతిక్రమించుచున్నారుగాని జ్ఞానవైభవమున వారికాలిగోఁటికైన సరిపోలకున్నారు. వీరిమూలపురుషుఁ డర్చకప్రధానియైనతర్వాత జగన్నాథుఁ డాతనికి దర్శన మీయనొల్లకుండెనని, నేఁడు వీరిమొగమైనఁ జూడకున్నాఁడనుటలో నాశ్చర్యమేమున్నది?

యశో:—ఆహాహా! అనుపూర్వీకులగు నీయర్చకులు మనమతమునకుఁ జీడపురుగులై యున్నారుగదా! పూజ్యమగు ప్రధానార్చకత్వమునకు యోగ్యతముఁడును విరాగభావసంపన్నుఁడునగు మానవోత్తము నేల నియమింపరాదు? ఇట్లొనరించినయెడల, దోషభూయిష్ఠములును, అనాచారబంధురములునై యుండు మనదేవాలయములన్నియు సంస్కారణములకుఁ గేంద్రస్థానములై, యాదర్శప్రాయములై వన్నెకెక్కఁగదా!

చారు:—(నవ్వుచు) ప్రాణేశ్వరా! మీరు పరమనిష్ఠాగరిష్ఠులగు సనాతనహైందవులరని నేను తలంచితిని. దేవాలయములన్న, మీకంత నీచభావ ముదయించుటకుఁ గారణమేమి?

యశో:—అవును. నీమాట నిజము. నేను సనాతనహైందవుఁడననుట నిజము. దానంజేసియే, దేవాలయములపై ననురాగము నాకు పోదు! వాని

యందు నేఁడు ప్రబలియుండు దురాచారములను నేనుదూషించుటకుఁగూడఁ గారణ మదియేసుమా! దీనిజనరక్షణార్థము దేవాలయముల కిచ్చినధాన్యాదికములతో నెందఱు బీదసాదులు బ్రతుకుచున్నారు? దేవునివైయుండుపదార్థములే దేవాలయములందు దొంగలపాలగుటలేదు? ఏదేవాలయార్చకుఁడు విరాగి యని పేర్గాంచియున్నాఁడు? ప్రాణనాయకీ! వినుము. ఆర్యావర్తమునకుఁ గీర్తికాముదులఁ బ్రసాదించిన ప్రాచీనమునీశ్వరులందఱెవ్వరు? వారందఱు దేవాలయార్చకులా? కారు. కాని దేవాలయములఁబడి మూలుఁగుచుండు నపారధనరాసు లామునీశ్వరులసైతము నీతిహీనులఁ జేయుఁగాఁబోలు!

చారు:—ఋషులైనవారు మనదేవాలయములకు రానేరారు. ఆత్మహృదయములయందును, ప్రపంచమునందలి ప్రతివస్తువునందును వారు దైవమును జూచుచుందురు. వారికి విగ్రహారాధన మనవసరము. పరిశుద్ధాత్ముఁడర్చకత్వమున కియ్యకొనఁడు. వాని కావృత్తి గిట్టదు.

యశో:—ప్రేయసీ! అట్లుకాదు. ఇట్టిమహాత్ములలోఁ గొందఱైన నర్చకత్వమున కంగీకరించినఁదప్పు, మనదేవాలయములందు సంస్కరణములఁ గావించుట యసాధ్యమని నీవు తలంపవా? మనప్రాచీను లెంతయనురాగముననో, యెంతకష్టించియో యెంతధనమునో వెచ్చించి దేవాలయరాజములఁ బ్రతిష్ఠించి మనకొసఁగియుండ, మనము వానివిషయమై చింతాకంతయేని శ్రద్ధ వహించి వానిని సక్రమముగఁ బాలించుట కిసుమంతయైనఁ బ్రయత్నించుట లేదుకదా! ఈవిషయము ననుఁగొనుకొలఁది, నాకు విషాదము కలుగుచుండును. అధోగతిఁబడి మ్రగ్గుచుండు నీపరమపవిత్రాగారములఁ గాంచి, నాయందలి హైందవవ్యక్తిత్వము తిరుగుబాటొనరించుచున్నది సుమా! మనదేవాలయములందు మూలముట్టుగా సంస్కరణము లొనరింప నేను భావించుచున్నాను. ముఖ్యముగాఁ బ్రధానార్చకపదవులు యోగ్యుల కబ్బునట్లొనరింపవలయును.

చారు:—అట్లు వారి కిచ్చువారెవరు?

యశో:—దేవాలయధర్మకర్తలగు నారాష్ట్రాధిపతులు.

చారు:—మన్నింపుఁడు. మీయభిప్రాయము సమంజసముకాదు. ఏలయన, రాష్ట్రాధీశుఁడు దుర్మార్గుఁడైనచోఁ బ్రధానార్చకునిగా దుర్మార్గు నొకని నియమించి, వానిలోఁబాటు దేవాలయమును దోఁచుకొనుచుండును. ఉజ్జయినియందలి విష్ణుదేవాలయమునఁ బ్రధానార్చకునిగా, మిహిరగులుఁ డెట్టి దుర్మార్గశిఖామణిని నియమించెనో చూడుఁడు! కావునఁ బ్రధానార్చకున కా దేశాధిపునితో నెట్టిసంబంధముగాని యుండఁదగదు.

యశో:—ఎట్లులైననేమి! జగన్నాథమునందలి మంగలపూజారులఁ దొలఁగించి, వారిస్థానమున యోగ్యులగుబ్రాహ్మణపూజారుల నియమింపవలయునని నాయభిప్రాయము!

చారు:—మీరట్లు నియమించినయోగ్యులగు బ్రాహ్మణపూజారులుసైతము కొందుకరములలో, మంగలపూజారులైనట్లు నీచదశకు రాఁగలరు. అనుపూర్వకముగ వచ్చుచున్నాఁడను కారణమునం జేసి, యీమంగలిపూజారియైన గౌరవింపఁబడుచున్నాఁడు. కాని యీబ్రాహ్మణపూజారి నట్లు గౌరవించువా రెవరు?

యశో:—ప్రేయసీ! అటు చూడుము. బయట ఝంఝూనిల మెట్లు వీచుచున్నదో చూడుము.

చారు:—అవును. ఇంతకు నిది వడగాలి కొట్టుకాలముగదా! కాని యీసమయమున నిట్టిఝంఝావాతముకలుగుట మిగుల విచిత్రముగానున్నది. ఎచ్చటనో యేదియో కీడు మూడనున్నదని నామది శంకించుచున్నది

యశో:—అటుచూడుము. ఆపెనుగాలిలో నొకవార్తావహుఁడు చిక్కుకొనియున్నాఁడు. అతఁ డందుండి తప్పించుకొనఁ దయుకులాడుచున్నాఁడు.

చారుమతి కిటికీవద్దకుఁ బోయి యాతనిం జూచెను.

చారు:—ఆవార్తావహుఁడు పాటలీపుత్రమునుండి వచ్చుచున్నాఁడు. అతఁడు పాటలీపురజగన్నాథమార్గమున నడచుచున్నాఁడు. గుప్తరాజచిహ్న

మును ధరించియున్నాఁడు. అతం డెట్టివార్తలఁ గొనివచ్చుచున్నాఁడో యని నాకుఁ గళవళమగుచున్నది.

యశో:—బాలాదిత్యున కిపు డెట్లున్నది?

చారు:—ఈనదుమ వినుటలో నాతఁడు స్వస్థతఁ గాంచుచున్నట్లు వింటిని. మురారి యంత్యక్రియలైనతర్వాత, సరస్వతి కలాంబారునుండిపోవు నప్పుడీవార్తఁ జెప్పినది. కాని యామెపోయి చాలకాలమైనది. ఇటీవలిసంగతి తెలియదు.

యశో:—ఇప్పు డాతఁడు స్వస్థుఁడైయుండునని నాయభిప్రాయము. మనకు జగన్నాథమునందుఁ బనియైనపిమ్మట, నీతోఁగూడఁ బాటలీపుత్రము నకుఁ బోనెంచియున్నాను. రాణి సరస్వతిఁ జూడ నీకుఁ గోర్కులు క్రేళ్లు వాఱుచున్నవని నిస్సంశయముగాఁ జెప్పఁగలను. బాలాదిత్యునితో సఖ్యపడు టకై నాకుఁగూడఁ జాల నాతురతగా నున్నది. ఆతఁడు స్వస్థుఁడగుటకు నే నాతని నభినందించి, మాపూర్వస్నేహమును మరల నెఱపుకొనవలయును.

చారు:—ప్రాణేశ్వరా! మీపలుకులు నాచెవుల సుధజిలికినట్లున్నవి. దురదృష్టదినములయందుసైతము బద్ధానురాగులరైయుండిన బాలాదిత్యుఁడును మీరును, కడకు మంచిదినములయం దన్యోన్యనిందాపరాయణులరైయుండున ట్లొనరించిన విధిచెయిదములు విపరీతములుగదా యని యెన్నియోమారులు నేను భావించుచుంటిని. ఆధునికభూకాంతులయందు మీరిద్ద ఱసమానౌదార్య సంశోభితులరుగదా! అట్టిభూమీశు లొండొరులతోఁ గలహింపకుండిన బాగుండెడిది! నిరుపయోగములగు నిట్టికయ్యములను వారిప్పుడు పాఱఁ ద్రోలనెంచుచున్నారని వినుటకు నాకమందానంద మొదవుచున్నది. నామట్టుకు నేను, సరస్వతిని యామె చిన్నిబిడ్డలను జూడ నువ్విళ్లూరుచున్నాను. మన బిడ్డలఁగూడ వెంటఁబెట్టుకొని పోనెంచియున్నాను. మనలలిత, నారా యణితో నామకరణాంతస్నేహ మొనరింప బాసచేసియున్నదని మఱచితిరి కాఁబోలు! నరసింహచంద్రభానులుకూడ, ధర్మగుప్తునితో నట్లే సఖ్యమొన రింప శపథము లొనరించియున్నారు.

యశో:—ఈసంగతి నాకుఁ బ్రమోదము నించినది. పెద్దలకంటెఁ బిన్నలైన సాధురీతివర్తింతురుగాక! ఈవాగ్దానముల నాధారమొనరించుకొని యొకానొకదినమున నీరెండురాజాన్వయములు వియ్యమొనరింపనున్నవి కాఁబోలు! మంచిది. ఆవార్తావహుఁ డల్లే నగరుచెంగటి కరుదెంచినాఁడు. వాఁడు తెచ్చినవార్త యేమియో విచారింతము రమ్ము.

ఇంతలో దౌవారికుఁ డొకఁ డావార్తావహుని రాజసమక్షమునకుఁ దెచ్చి నిలువఁబెట్టెను. వాఁ డారాజదంపతులకు వందనమాచరించెను. వాని కనులనుండి యశ్రుజలము సంతతధారలుగాఁ బ్రవహించుచుండెను. ఎట్టకేల కాతఁడు గద్గదికతో "దేవరవారికిఁ గర్ణకఠోరమగు దుఃఖవార్తఁ దెచ్చితిని. బాలాదిత్యమహారాజ స్తమించినాఁడు" అని విన్నవించెను.

యశోధర్మ కొయ్యబాఱిపోయెను. "అస్తమించినాఁడా?" అని యాతఁ డట్లే ఱాతిబొమ్మవలె నిలిచెను. చారుమతి "అస్తమించినాఁడా"? అని వికారముగా నఱచి చిత్రమువోలె నిలిచియుండెను. యశోధర్మ పసిబిడ్డవలె నేడువసాగెను. చారుమతియును విలపించుచుండెను. ఆరాజదంపతు లారీతి శోకసాగరమున మునుకలు వేయుచుండిరి.

"దేవా! మామహారాజుగారు ప్రాణములువిడుచుచు మిమ్ములఁ దలఁచుకొనెను. 'ఓమహాకోసలాధిపా! ఓయశోధర్మా' అని యాతఁడు కలవరించుచుండెను" అని యావార్తావహుఁడు విన్నవించెను.

ఈ వృత్తాంతము, యశోధర్మ శోకానలజ్వాలల కాహుతి యయ్యెను. ఆవార్తావహున కచట నిలుచుట కష్టముగానుండెను. "ఇఁక నాకు సెలవీయవలయును" అని వాఁ డనెను.

చారు:—ఉండుము. మహారాణి సరస్వతి సహగమన మొనరించినదా?

పాపము! చారుమతి, యాతురత రూపుఁ గైకొనినదోయనఁ, బ్రత్యుత్తరముకొఱకు నిరీక్షించుచుఁ గన్నార్పక నిలిచియుండెను.

"దైవకృపవలన నయ్యది జరుగదయ్యెను. తనతో సహగమన మొనరించు తలంపుమాని, ఇహలోకమున నిలిచి బిడ్డలను, ప్రజలను రక్షించుచుండుమనట్లామెచే, బాలాదిత్యుఁ డతికష్టముపై మాటఁదీసికొనఁగలిగినాఁడు."

చారు:—దైవకృప యపారముగదా! నీవిఁకఁ బోనగును.

వార్తావహుఁ డారాజదంపతులకడ సెలవుఁగొని వెడలిపోయెను.

యశో:—చారుమతీ! నాయట్టిపాతకుఁ డీభువిపైనుండఁడు. నేను నీచాత్ముఁడనై నాప్రాణమిత్రుని విడనాడితిని. అకటా! ప్రాణావసానసమయమున సైతము నన్నుఁ దలంచుకొనుచుండిన నాప్రాణస్నేహితునియెడ నేను కృతఘ్నుఁడనై చరించితిఁగదా! అణువప్రాణముగా నన్నుఁ జూచుచుండిన సజ్జనుని నేను గౌరవింపనైతిని. తిన్నయింటికి వాసము లెన్నఁ బాల్పడితిఁగదా! అతనిపరిశుద్ధాత్మ యీామృణ్మయగేహమును బాసిపోనుండునప్పుడైన నాతనిమరణశయ్యను నేను డాయనైతిని. అతఁడు నన్ను భూమకుని ఖడ్గధారనుండి రక్షించి నాకుఁ బ్రాణదాన మొనరించెఁగదా! అట్టి నాప్రాణదాతను నేను గౌరవింపనైతిని. ఆయుదారసంపన్నుఁడు సార్వభౌమత్వము నొల్లకున్నను, నేనుమాత్రము నీచాత్ముఁడనై యాకరుణానిధిపంపిన సైన్యములతోడ్పాటున నాతని పెద్దలభూముల నాక్రమించితిని. అహాహా! నేనెంత నీచమతిని. నేను మానహీనుఁడనై 'సార్వభౌమేంద్రుఁడనగు యశోధర్మను, నేను హూణులాదిగాఁగల నిషాదబలముల నాక్రమించి, హిమాలయమహేంద్రగిరులకును, ప్రాక్పశ్చిమసముద్రములకును మధ్యనుండుభూమిని, ఏకచ్ఛత్రాధిపత్యముతో నేలితిని' అని శాసనములఁ జెక్కించి ప్రకటింపఁజేసితిని. ఈక్షణమే శాభటులు పోయి యాయబద్ధపువ్రాఁతలను దుడిచివైతురుగాక! ఆశిలాస్తంభములను నేలమట్టము గావింతురుగాక! వానిని నేలమట్టమొనరించి వానికిబదులు 'హిమాలయమహేంద్రగిరులకును ప్రాక్పశ్చిమసముద్రములకును మధ్యనుండు భరతవర్షమున, మహీపాలాధిపుఁడగు యశోధర్మఁబోలినదంబాచారి, అసత్యవాది, కృతఘ్నాధముఁడు లేఁడు' అని శాసన

ములఁ జెక్కించి ప్రతిష్ఠింతురుగాక ! అహహా ! నాపెద్దలకు నే నెంతగాఁ దలవంపులు దెచ్చితిని !

పాపము! యశోధర్మ దుస్సహదుఃఖమున హృదయము ప్రీలునట్లు విలపింపసాగెను.

చారుమతి యాతని నాలింగన మొనరించుకొని "నాథా ! మీరట్టివకుఁడు. మీరు డాంబాచారులు కారు. అసత్యవాదులుం గారు. కృతఘ్నాధములు కారు. మీరు బాలాదిత్యునియెడ నించుక యన్యాయ మొనరించినమాట నిజమే కాని, నీచకార్య మేమియుం గావించినవారు కారు. స్వదేశసముద్ధరణముకొఱకును, భరతవర్ష సముజ్జీవనముకొఱకును మీరు పాటుపడుచుంటిరి. అందులకై మీజీవితసౌఖ్యమును ధారవోయుచుంటిరి. క్రూరకిరాతుఁడగు విజాతీయు నుజ్జయినినుండి పాఱఁద్రోలి, మాతృభూమి నాతనిబారినుండి తప్పించ బాలాదిత్యుఁడు మీకు సాయ మొనరింపమిం జేసియే, యా పాటి యన్యాయమైన మీ రాతని కొనరింపవలసివచ్చెను. కాని మీరు బాలాదిత్యునిఁ దప్పు తలఁచినమాట నిజము. అతఁడు మీకు సాయపడకుండుటకుఁ గలకారణమును మీరొఱసి చూచినవారు కారు. కాని యీపొరపాటులు మానవులకు సహజములు. మీచర్యలందు నీచత్వము గాని, కృతఘ్నత గాని కానవచ్చుటలేదు. మానవులు కోపోద్రేకపూరితులై యున్నప్పుడు, ఎదుటివారిని నిదానముగా, సరళముగా నర్థ మొనరించుకొనుట మిగుల నసాధ్యము. అట్టి సమయములయందే మానవుఁడు పొరపడుచుండును. కావున నయ్యది యక్రమము కానేరదు. హూణుని జయించుటకై మీరు బాలాదిత్యునిసాయ మపేక్షించితిరే కాని, స్వలాభపరాయణులరై స్వరాజ్యము నభివృద్ధిపఱచుకో నెంచి పరరాజ్యముల నాక్రమించుటకై సాయ మొనరింపుమని మీ రాతని వేఁడుకొనినవారు కారు. మీరు బాలాదిత్యుని పూర్వుల రాజ్యము నాక్రమించినవారు కారు. మీరు స్వాధీన మొనరించుకొనినరాజ్యము నంతటిని బాలాదిత్యుఁ డాకాంక్షించియుండలేదు. ఆరాజ్యభూముల మీరు నిరంకుశపాలన మొనరింపఁ దల

పెట్టినవారు కారు. ఇంతకును బాలాదిత్యుఁడు వదలుకొనిన రాజ్యములపై మీకు సముచితాధికారమున్నదికదా! మీరు హూణుల మట్టుపెట్టితిరి. మీరును గుప్తరాజవంశసంజాతయగు మహారాణి మహామాయగర్భమున నుద్భవమొందితిరి. కడకు బాలాదిత్యుఁడు సైతము మీరు నీచులనియుఁ, నధమాధములనియుఁ, గృతఘ్నులనియుఁ దలంచినవాఁడు కాఁడు. అట్లు తలంచియే యుండిన మరణశయ్యపై నాతఁడు మీకొఱకై కలవరించియుండెడి వాఁడు కాఁడు. ప్రాణకాంతా! ఊఱడిల్లుఁడు. నాథా! మీరు బాలాదిత్యునెడఁ గావించిన తప్పులు దిద్దుకొను ప్రయత్నమున, మీయాత్మకు శాంతిఁగలుగఁజేసికొనకుఁడు. మనము పాటలీపుత్రమునకుఁ బోయి హతభాగినియగు సరస్వతిని బిడ్డల నూఱడింపవలసియున్నది. అనాథయగు సరస్వతికి నామె కూనలకును మనచేనైనంత సాయమొనరించుటకు బాలాదిత్యుని మరణమే ప్రోత్సాహకారణమైయుండుఁగాక. కాన మనము బాలాదిత్యునిపై నింతపఱకుఁ జూపిన నిరాదరణమునకుఁ దగురీతిగా వారి నిపు డాదరింపఁజనును. రండు. రోదనమొనరింపకుఁడు. విలపించు మిమ్ములఁ జూచిన నాకు గుండె పగులునట్లున్నది.” అని యాతని నూఱడించెను.

“చారుమతీ! బైటవీచుతుపానుకంటె నాచిత్తమునందు ఘోరతరమగు తుపాను కొట్టుచున్నది. నాతల తగులఁబడుచున్నది. నామానసము వ్యాకులమై యున్నది. నాకుఁ బిచ్చిపట్టినటులున్నది. నాప్రతిభను నిర్మూలమొనరించు యీవేదనాక్రకచమును దొలఁగించుకొనుటెట్లు? నేను క్రోధభీషణమగు సాగరముచెంతకుఁబోయి యొకింతతడ వచటఁ గూర్చుండవలయును.”

చారు:—ఈ పెనుగాలిలోనా?

యశో:—అవును. ఈపెనుగాలిలోనే సాగరఘోషమును నేను చెవులార వినవలయును.

ప్రకృతిచికిత్సలయందుఁ జారుమతికిఁ గట్టినమ్మకము గలదు. అతం డట్లొనరించుట యుక్తమని యామె తలంచెను. కానఁ జారుమతీయశో

ధర్మలు, పరిచారకుల నెవ్వరిని వెంటఁగొనక, యొంటరిగా సముద్ర తీరమునకుఁ బోయిరి. శోకాతిశయమునః విన్నఁబోయినవదనారవిందములతో నొంటరిగా సాగరతీరమునకుఁబోవు తమరాజదంపతులఁ గాంచి రాజభటు లశ్రుపూరిత నేత్రులై యట్లే నిలిచియుండిరి. యశోధర్మ సముద్రతీరమున నొకయిసుక తిన్నెపై జలాభిముఖుఁడై కూర్చుండెను. చారుమతియుఁ నాతని వెంగటఁ గూర్చుండెను. కొండలపాటికరళ్లు విరామములేక దొర్లుచుండెను. ఆరాజ దంపతులపై నీటితుంపురులు పడుచున్నను, వానిని లెక్కసేయక యట్లే కూర్చుండియుండిరి. చెవులఁ జిల్లులుచేయు నాభీకరతరంగములభీషణనినాద ముల నాలకించుచు, యశోధర్మ విపరీతసంతోషము ననుభవించుచుండెను. అతం డొకమారు "చారుమతీ! చారుమతీ! సముద్రము పొంగుచున్నది. సముద్రము పొంగుచున్నది" అని పలికెను.

చారు:—అవును. నాథా! అవును. మన మింకఁ గొంచెముపైకి జరిగి కూర్చుందమా?

యశో:—వలదు వలదు. ఇక్కడనే కూర్చుందము. నన్ను, నిన్ను, కళింగమును, మహాకోసలమును, ఈవీచికలు సాగరమధ్యమున కూడ్చుకొని పోయి సర్వనాశ మొనరించుఁగాక! ఓహో! చారుమతీ! చారుమతీ! అటు చూడుము. అటుచూడుము. ఆతరంగము నన్నుఁ బిలుచుచున్నది. అదిగో, ఆతరంగము నన్నుఁ బిలుచుచున్నది. ఆతరంగము...............

యశోధర్మ నేత్రగోళములు తళతళ మెఱయుచు మిఱుమిట్లు గొలుపుచుండెను. ఱెప్పలార్పక యాతఁ డట్లే చూచుచుండెను. చారుమతి తననాథుని వికారాకారముఁ గాంచి భయభ్రాంతయయ్యెను. తీవ్రదుఃఖమునఁ దనపతికిఁ జిత్తచాంచల్య మొదవుచున్నదని యామెకు భీతికలిగెను. ఆమె కేమి చేయుటకుం దోఁచినదికాదు. బాలాదిత్యాస్తమయముచేతను, సరస్వతి యనాథయై పోవుటచేతను, చారుమతి శోకపరవశయైయుండెను. వ్యాకులమానసుఁ డగు తనపతి నామె చూచి, యాతనికి మతిపోవుటకుముందే తగినచికిత్సఁ

గావించుట మేలని తలంచెను. సహజచాతురీధురీణయగు నామె మానసాకాశమున నొకయాలోచనావిద్యుద్దామము తళక్కుని మెఱసెను. ఆమె యశోధర్ముని బిగ్గగాఁ గౌఁగిలించుకొని "ప్రాణనాథా! ఇంచుక శాంతింపుఁడు" అని పలికెను.

కాని యశోధర్మ వేయితేళ్లు కుట్టినవానివలె బాధపడుచుండెను. అతని మూఱాట మతీతమై యుండెను. "నన్ను వదలుము. చారుమతీ! నన్ను వదలుము. ఆహాహా! నేను నీచాతినీచుఁడను. నాకు నూఱటనిచ్చునదేదియుం లేదు. ఏదియుం నూఱట నియ్యఁజాలదు. నీవు నాకు బోధించునదేమి! ఏమి చేయుమనుచున్నావు? నన్ను వదలుము. నేను సముద్రమునకుఁ గొట్టుకొని పోవలయునని యున్నాను. కొట్టుకొనిపోయి, నా ప్రతిభావముల నింకింపఁజేయు నీఘోరదుఃఖానలము నార్పివేయవలయును. అవీచికలపై నిలిచి బాలాదిత్యుఁడు నన్నుఁ బిలుచుచున్నాఁడు. ఆహాహా! చూడుము. చూడుము. అతఁడు పిలుచుచున్నాఁడు. నన్నాతఁడు పిలుచుచున్నాఁడు. నన్ను వదలుము. నేఁబోవలయును. నేఁబోవలయును. ఓబాలాదిత్యా! ఓమురారీ! నేను వచ్చుచున్నాను. ఇదే వచ్చుచున్నాను" అని యాతఁడసంగతముగాఁ బలవించుచుండెను. ఆమెపట్టును విడిపించుకొని యాతఁడు దారుణసాగరమునందు దూఁకఁ బ్రయత్నించుచుండెను. కాని చారుమతి యాతని గట్టిగాఁబట్టుకొని "ఓయశోధర్మమహారాజా! మీరు చేయనుండు కార్యమేమో మీకుఁ దెలియునా? సుక్షత్త్రియశేఖరులరని విఖ్యాతినందియుండుమీరు, అవక్రపరాక్రమధురంధరులరని ప్రసిద్ధికెక్కియుండుమీరు, విధ్యుక్తధర్మము నెఱవేర్ప సమర్థులరై, పిఱికిపందలవలె నాత్మహత్యఁ గావించుకొనఁ గమకించుచున్నారలా?" అని సౌమ్యముగాఁ బ్రశ్నించెను.

యశోధర్మ యించుక ప్రజ్ఞవహించి "ఏమి! నేను పాఱఁబోవువనియు, స్వధర్మదూరుఁడననియు నిందింప సమకట్టినవా రెవరు!" అని యడిగెను.

"నేను. మీప్రాణేశ్వరిని. మీయర్ధాంగిని. యశోధర్మమహారాజన్యుని పట్టమహిషిని. యశోధర్మమహారాజన్యుని కీర్తిలతకాలంబనమగు నేను. చారుమతిని."

యశోధర్మ యామె తీవ్రవాక్యములకుఁ గ్రుద్ధుఁడై "ఎంత ధీమసము! నేను పిఱికిపందననియు, నీతిబాహ్యుఁడననియు నీవు నిందించుచున్నదానవా?" అని యడిగెను.

చారుమతి సమయస్ఫూర్తిని విడువక "అయిన వినుఁడు. నాయూహ నిరాధారము కాదు. కన్నులఁదెఱువని ముగ్గురుకుఱ్ఱలను నాగొంతునకుఁగట్టి నన్ను విధవనొనరించి, హూణులు మున్నగు వైరివ్రాతము పాల్వేసిపోవుట పిఱికితనమందురా, కాదా? స్వధర్మపరిత్యాగ మందురా, కాదా? బాలాదిత్యుఁడు పరలోకమున కేగుచు మీపోషణమున వదలిపెట్టినయాతనిరాణి సరస్వతిని, నిర్భాగ్యులగు నిద్దఱుబిడ్డలను శత్రుల కొప్పగించుట పిఱికితనము కాదా? స్వధర్మమునకు హస్తోదకము లిడుటకాదా? ఆర్యావర్తమునఁ గలంకారప్రాయమగు కాశ్మీరసాహభూములను, నిషాదాధముఁడగు విదేశజుఁడు ద్రోహకర్మమున నాక్రమించి కులుకుచుండ, మీరూరక చూచుచుండుట పిఱికితనము కాదా? స్వధర్మముఁ బరిత్యాగము నొనరించుటకాదా?" అని నిర్భయముగాఁ బలికెను.

యశోధర్మ యిపుడు కుదుటఁబడెను. ఆతని కించుక చిత్తశాంతి యొదవెను. ఒకటిరెండునిమిషములనే పాతఁ దట్టే నిలిచియుండి "చారుమతీ! నీమాట లెంతయు సత్యములు. నేను ప్రమాదపడితిని. సత్యము తెలియంగక, నేనిపుడు స్వధర్మము నుజ్జగింపనుంటిని. చారుమతీ! క్రూరుఁడగుమిహిరగులుఁడు కాశ్మీరమున నున్నంతదాఁక—నరసింహచంద్రభానులకు ఱెక్కలు వచ్చునంతదాఁక—సరస్వతియు నామెబిడ్డ లిద్దఱును వైరుల నెదిరించి నిలువ శక్తులగునంతదాఁక—బాలాదిత్యమహారాజుల వెంటఁబడి నాకై నేను బరలోకమునకుఁబోవుటకు నాకధికారము లేదు. చారుమతీ! రమ్ము! నగరికిఁ బోవుదము

రమ్మా! మైమఱచియుండు నేను పొరపాటుపడకుండునట్లు చేసి, నన్ను రక్షించి తివి." అని సంభావించెను.

చారుమతి యెలనవ్వుతో నాతని గాఢముగఁ బరిరంభించి రసము లొలుక ముద్దిడుకొని "ప్రాణేశ్వరా! నేను మిమ్ములను నాపరుషభాషణములచే నొప్పించియుండిన, నను మన్నింపుఁడు. మిమ్ము వెతలఁబెట్ట నేను గలనైన నెంచియుండినదానఁగాను" అనెను.

యశో:—కాంతా! నిను మన్నింప నేను యోగ్యుఁడనా? నేను నీకు వృథాప్రయాసఁ గల్గించితిని. కాన నీవే నన్ను మన్నింపవలయును.

అచట సాగరుఁడు గంభీరఘోషమొనరించుచుఁ బర్వతోపమాన ములగు తరంగముల దొర్లించుచుండ, నిచట సీపతీపత్ను లొండొరుల బిగ్గఁ గౌఁగిలించుకొని తియ్యనిముద్దు లిడుకొనుచుండిరి. అంత వారు ప్రశాంతా త్ములై రాజసౌధమునకుఁ బోయిరి.

చారు:—ప్రాణేశ్వరా! సరస్వతీధర్మగుప్తులను శత్రులబారినుండి సం రక్షింపుఁడు. బుద్ధుని, బౌద్ధమతమును దూషించుచు మానుఁడు. పంచముల నుద్ధరింప నమకట్టుఁడు. ఈమూఁడుకార్యములు గావించినచో, మీరు బాలా దిత్యునియాత్మకు శాంతిఁ జేకూర్చినవా రగుదురు.

యశో:—అట్లే చేసెదను. మఱియొకటికూడఁ జేసెదను. బాలా దిత్యుఁడు కులవిభాగముల నమ్మినవాఁడు కాఁడు. నేనింతకుముందు భావించి నట్లు, జగన్నాథమునందలి మంగలిపూజారిని దొలఁగింపక, యాతనిజ్ఞాప కార్థము నిలిపియుంచెదను.

చారు:—ఇప్పటి కెప్పుడో చేసియుండవలసినపని నొకదానిని నేనిపు డొనరించెద. ఇప్పుడు నాగర్భమునందుండుశిశువు యాడుది యైనచో 'మాధవి' అని పేరు పెట్టెదను.

యశో:—అయిన మనము పాటలీపుత్రమున కెపుడు పోవుదము!

చారు:—రేపే పైనకూదము. ఆహాహా! సరస్వతిని, ఆమెబిడ్డలను ఎప్పుడెప్పుడు చూతునా యని యుంత్తలమెుందుచున్నాను.

చారుమతీయశోధర్మ లప్రయత్నముగాఁ గన్నీరువిడచిరి.

యశో:—బాలాదిత్యుఁడు కాలధర్మమెుందెనని విన్నచో, పాపము మాయమ్మకు గుండె పగులును.

చారు:—ఆమె నేఁడిచట లేకుండుట మంచిదైనది. నే నీదినము చూచినదృశ్యము నామె చూచియే యుండిన, నామె యిప్పటికి బాలాదిత్య మురారులఁ గలిసికొనియుండెడిది.

యశో:—మత్సరదుఃఖపరవశుఁడనై యుండిన నేనేమి కావించితినో, నాకే తెలియదు. నీవు నన్ను మన్నింపవలయును.

చారు:—మన్నించుటకు మీరొనరించిన నేరమేమి? మహామహిమో పేతమగు మీయౌదార్యమును గన్నులారఁ గాంచి నేఁడు నేను ధన్యురాల నైతిని. యావజ్జీవము నేనద్దానిని మఱువఁజాల. మనమిఁక జగన్నాథ స్వామి దేవాలయములోనికిఁ బోయి, కష్టములనుండి కాపాడ నాదేవదేవుని వేఁడుకొందము.

యశో:—అవును. ప్రార్థనలవలనఁ గలుగు చిత్తశాంతి మనకిపుడు కావలసియున్నది. దుఃఖధ్వాంతబంధురములైయుండు మన హృదయకుహర ములు జగన్నాథస్వామికృపాకటాక్షవీక్షణములచేఁ దేజోవంతములగుఁగాక! అజ్ఞానాంధకారునిఁ బూర్వము పీడించుచుండిన జననమరణరహస్యము తెలియఁగ నాకుఁగూడ నిపు డాశపుట్టుచున్నది. నాకిపు డాతనిసమస్యయు, దానిపరిష్కారణమునకుఁ గలకష్టనిష్ఠురములును బాగుగాఁ గన్పట్టుచున్నవి.

మఱునాఁడు తమపాటలీపుత్రప్రయాణమునకు వలయునన్నాహముల నొనరింప సేవకుల కాజ్ఞఁజేసి, ఖిన్నులగుభార్యాభర్త లిద్దఱును జగన్నాథ స్వామితో వెలకుఁ బోయిరి. వారు దేవాలయప్రాంగణమును డాయునప్పటికి, నరసింహచంద్రభానులలితల వెంటఁబెట్టుకొని వసంత వారికెదురుగా వచ్చెను

లలిత యశోధర్మవద్దకు వచ్చి "బాబూ! నీవుకూడ దేవళమునకు వచ్చి నావా? వసంతా! నీవు నరసింహాచంద్రభానులఁ దీసికొని యింటికిఁ బొమ్ము. బాబు అమ్మలతో నేను వచ్చెదను." అనెను.

చంద్ర:—అమ్మా! నేనుగూడ నీతో వచ్చెదను. వసంతా! నీవు నరసింహానిఁ దీసికొనిపొమ్ము.

నర:—కాదుకాదు. నేనును మరల దేవునిఁ జూడవలయును. మరల మనమందఱము లోనికిఁ బోవుదము.

చారు:—జగన్నాథస్వామివారిసంకల్పములు మనల నాడించుచున్నవి. కలకాల మవి యట్లే యుండుఁగాక. జగన్నాథస్వామివారి ప్రబోధమును—ఈదేవాలయము నలంకరించియుండు భగవంతుని ప్రబోధమును—సర్వవ్యాపియు, సర్వేశ్వరుఁడును, సర్వహృదయాంతర్యామియు నగుభగవానుని ప్రబోధమును—జగమంతయు ననుసరించుచుండుఁగాక.

సంపూర్ణము.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచే
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1933.

# వచనగ్రంథములు.



| | | | |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | అ. |
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీశతఘంటము వేంకటరంగశాస్త్రికృతము | ... | 6 | 8 |
| డిటో 3 వాల్యములు | ... | 7 | 0 |
| ఆంధ్రవచనభారతము, ఆదిసభాపర్వములు | ... | 2 | 8 |
| డిటో ఆరణ్యపర్వము | ... | 2 | 8 |
| డిటో విరాటోద్యోగపర్వములు | ... | 2 | 8 |
| డిటో భీష్మద్రోణపర్వములు | ... | 4 | 0 |
| డిటో కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీపర్వములు (అచ్చగుచున్నది.) | | | |
| డిటో శాంతిపర్వము | ... | 4 | 0 |
| ఆంధ్రవచనరామాయణము, 7 కాండలు, రెండుసంపుటములు | | 12 | 0 |
| ఆంధ్రకవిజీవితములు శ్రీగురుజాడ, శ్రీరామమూర్తిగారిది | ... | 3 | 8 |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 1 | 8 |
| అయిదుగురుదొంగలకథ | ... | 0 | 6 |
| అరేబియన్ నైట్సుకథలు | ... | 1 | 4 |
| ఈసబునీతికథలు, ప్రథమభాగము | ... | 0 | 6 |
| డిటో ద్వితీయభాగము | ... | 0 | 8 |
| ఋషులచరిత్ర, రాచకొండ అన్నయ్యశాస్త్రిగారు | ... | 0 | 8 |
| గైక్వారుగారి ఉపన్యాసములు | ... | 0 | 2 |
| చార్ దర్వేషుకథలు | ... | 0 | 8 |
| తాతాచార్యులకథలు | ... | 0 | 6 |
| త్రిలిఙ్గకథలు | ... | 0 | 8 |
| తెనాలి రామలింగనికథలు | ... | 0 | 4 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| దక్కనుపూర్వకథలు ... | 1 | 8 |
| దశకుమారచరిత్రము, ఎనమచింతల సంజీవరాయశాస్త్రి ... | 1 | 8 |
| దేశింగురాజుకథ (జంగముకథ) ... | 0 | 6 |
| ద్వాదశోపనిషత్తులు, సంస్కృతమునకు సరియైన తెనుఁగువచనము | 3 | 0 |
| నలచరిత్ర, చిన్నసైజు, పటములతో ... | 0 | 6 |
| సంస్కృతనాటకకథలు, శ్రీ సీతారామశాస్త్రి ... | 1 | 4 |
| నవనాథభక్తులచరిత్ర, శ్రీ బచ్చు రామన్న ... | 2 | 0 |
| నలుగురుమంత్రులకథ ... | 0 | 4 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిది ... | 0 | 6 |
| పరిష్యావినోదకథలు ... | 0 | 12 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి ... | 0 | 6 |
| పరమానందశిష్యులకథ ... | 0 | 3 |
| పతివ్రతలచరిత్ర, మంగిపూడి వేంకటశర్మ ... | 1 | 8 |
| పురాణగాథలు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి ... | 0 | 10 |
| ప్రహ్లాదచరిత్ర, చిన్నసైజు, పటములతో ... | 0 | 4 |
| ప్రాచీనదేశచరిత్రలు (Ancient History) ... | 1 | 12 |
| బేతాళునికథలు ... | 0 | 8 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము ... | 0 | 12 |
| డిటో ద్వితీయభాగము ... | 0 | 8 |
| భోజునికథలు ... | 0 | 8 |
| భోజకాళిదాసకథలు, ప్రథమభాగము ... | 0 | 12 |
| భోజకాళిదాసకథలు, ద్వితీయభాగము ... | 0 | 12 |
| మర్యాదరామన్నకథలు ... | 0 | 2 |
| మహాభక్తవిజయము, చిత్రపటములతో సహా ... | 6 | 0 |
| మదనకామరాజుకథ ... | 0 | 14 |
| యజుర్వేదకథాసంగ్రహము ... | 0 | 8 |
| రఘువంశకథ ... | 0 | 8 |
| రాజశేఖరచరిత్రము, వీరేశలింగముగారిది ... | 1 | 0 |

